## నివేదిక.

సీ. "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడు చుండ,—

గీ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీన మై
పరఁగుచుండఁ జేసె భారతంబు."

—నన్నపార్యుఁడు

## ఉపక్రమణము.

ఇట్టి సుప్రశస్తగ్రంథమును తెలుఁగుదల్లినోరఁ బలికించిన నన్నయ తిక్కనాదులు కృతార్థులు. వారికొలువువలనఁ దఱుగని గరఁగని పెన్నిధానము చేకూరినది. భరతవర్షమున ఏభాషయందును భారతము పద్యరచితము మూలానుసృతము లే దని యెఱిఁగితిని. తమిళమున నిపు డిపుడే పద్యభారతము వెలువడుచున్న దని తెలిసితిని. భారతకవిత్రయము కొన్నిపట్టుల మూలము నతిక్రమించి యలవోక వోయె నని కొందఱందురు. కాని రసలుబ్ధు లావాదము నాదరింపరు. మూలము ననుకరించితి మని వస్తువును నిస్సారముగఁ జేయుట కన్న మూలము నతిక్రమించినను వస్తుహాని ఘటింపక రసపోషణైకపరాయణు లగుట లెస్సగదా?

పదంపడి అర్ధశతాబ్దికిఁ బూర్వమువఱకును భారత మతి మాత్రము నాదృతిం గాంచుచుండినది. భారతము జదువనేర్చిన వానిని బుద్ధిమంతులలో గణించుచుండిరి. భారతమునందలి భాషాసంప్రదాయమును వాక్యరచనాకౌశలమును వస్తుగుణమును గ్రహించుటయు పాండిత్య మనఁబడుచుండెడిది. భారతవ్యాప్తి క్రమానుగతముగఁ దఱిగినది. తెలుఁగుదేశమున ఈనాఁడు భారతమును సాకల్యముగ సనిమర్శముగఁ జదివినవా రొకనూఱుమందియేని యుందు రనరాదు.

ప్రకృతము ప్రచారమున నున్న భారతాదికృతులు- పరిష్కృత-ములును—పఠితృసామాన్యమునకుఁ జదువరామి పెద్ద లెఱుఁగకుండరు. తిక్కనకృతియందలి వాక్యరచన, నేఁటి కృతకభాషాకింకరులకుఁ గ్రొత్త. నాఁటిది అచ్చము తేటతెలుఁగునుడి. నేఁటిది గ్రాంథికము పేరి సంకర భాష. సమస్తలౌకికాలౌకికపదార్థములం బ్రసాదింపఁ దగు రోహణాద్రినాఁ బొల్చు భారతము నిరాదృత మగుట, అథవా ఉపేక్షాభాజన మగుట శోచనీయము. ఇంచుక భాషాపరిచితియు అభినివేశమును గల వారి కెల్లఁ దంగెటిజున్ను కాఁ దగిన భారతము సద్వినియోగపఱుచుట కను వగు మార్గ మొకఁడు నాకుఁ దోఁచినది. సారస్వతసంప్రదాయజ్ఞులకు సహృదయులకు నాతలం పెఱిఁగించితిని; అప్పటికి నా చేసిన పరిష్కరణక్రమము నావిష్కరించితిని; ఆ కటాక్షించినవారి సాధువాదము న న్నత్యంతము బ్రోత్సహించినది; అమోఘాశీర్వాద మయినది.

### అవలంబితక్రమము.

వాక్యవిరామాదికాంకము ( , : ; . - — " " గుఱుతు) ల జొన్పితిని. ఆవశ్యకముగఁ దోఁచినచోటుల శబ్దములకు వాక్యములకును అర్థములు తాత్పర్యములుం దెలిపితిని. శాస్త్రీయములకు వివరణము లిచ్చితిని. ప్రాచీనముద్రితప్రతులను అర్వాచీనప్రతులతోఁ బోల్చితిని. శతాబ్దికిఁ బూర్వపుదాళపత్త్రప్రతులను అనువుపడిన వానిని

నాల్గింటినిఁ జదివితిని. ఇంతకు ౬ పర్వములు: ఆది సభా విరాట ఉద్యోగ శాంతి ఆనుశాసనికములను యథామతిఁ బరిష్కరించితిని; మచ్చునకు శాంతిం బ్రకటించితిని; ముద్రితాముద్రితములనుండి పాఠాంతరములను గొన్నింటిని సేకరింపఁ జాలితిని; వానిఁ బట్టికయందు జేర్చితిని. "ఆమ్నాయకళానిధి" నామకమును శాంతిపర్వమును బరికించితిని. అందు వాక్యార్థనిర్ణయకౌశలము కొఱవడుట అనర్థముల పాలయిన చోటులు బెక్కులు. కాని అదియు నాకింత తోడ్పడిన దని యొప్పికొనక తప్పదు.

## ప్రసంగములు.

౧౯౩౦ సెప్టెంబరు నెలలో పెద్దాపురము (తూర్పుగోదావరి)న "ఆంధ్రసాహిత్యపరిష" ద్వార్షికసభాసమ్ముఖమ్మునను, ౧౯౩౧ జూన్ జులై ఆగష్టు నెలలలో అనంతపురము కళాశాలయందును, గుత్తి పురమునను, కడపనగరమునను, తన్మండలస్థము లగు రాచవీడు (రాయ చోటి) ప్రొద్దుటూరు జమ్మలమడుగు పురములందును—పరిష్కృతిం గూర్చి ప్రసంగించితిని; ఉదారచరితు లభిమానించిరి.

## కృతజ్ఞత

ఈ నావరువ్రడమునకు వలయు గ్రంథసామగ్రినిఁ దడవు సేయక ప్రీతితో నా కందించిన రాజమహేంద్రవర"గౌతమీగ్రంథాలయ" పాలకవర్గమును, తత్పురస్థ "వీరేశలింగగ్రంథాలయ"కార్యదర్శిని మన్నింతును.

ఏత దుద్యోగమును మదీయమును విని యాహ్వానించి కొలు విచ్చి పరిష్కృతివిధానముం బరామర్శించి యాదరించిన పీఠికాపురాధీశ్వరుని శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటసూర్యరాయమహీపతినిఁ గొండాడుదును.

కవులు పండితులు రసజ్ఞులు: బ్రి. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారాయఁడు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, బుద్ధిరాజు వీరభద్రరాయఁడు, చిలుకూరు నారాయణరాయఁడు (ప్రొఫెసర్, అనంతపురము కళాశాల) నాదెసఁ గురిపించిన వాత్సల్యపూర్వకమంగళాశాసనములఁ దల ధరింతును.

శ్రీయుతులు: నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుఁడు (వకీలు), మామిలా కందుకూరు అంబికానాథవరప్రసాదరాయఁడు, హేజీబు రామరావు,—ఏలూరు; సి. పి. రామచంద్రరావు (వకీలు), కె. గుండు రావు,(వకీలు), వి. పిచ్చయ్య (వకీలు) ప్రభృతులు—కడప; కళ్ళె లక్ష్మీనారాయణరావు, నిట్టూరు లక్ష్మీనారాయణరావు (వకీలు), ఓ. ఐ. శౌరిరెడ్డి (వకీలు), జి. లక్ష్మణరెడ్డి (వకీలు & జి బో. ప్రెసిడెంటు) ప్రభృతులు—గుత్తి; సి. ఎల్. నరసింహారెడ్డి (వకీలు & కడప డి. బో ప్రెసిడెంటు), జి. సుబ్బారెడ్డి (దివాన్, బొబ్బిలి సంస్థానము), రావి చినవేంకటప్ప) రావివేంకటాంపాలెము - తాడిపత్రి,) మొదలుగఁ గలవారు,-నాజతనము నెడఁజూపిన సంతసము స్మరింతును.

దైవముదిన్నె రామిరెడ్డి, పెదమరివీటి శంకరరెడ్డి, ఉప్పులూరు శివరామయ్య (వకీలు), కొత్త అచ్చయ్యసెట్టి (వకీలు), కె. కేసర్ సింగ్, డాక్టరు ఐ. భీమరావు, గుంతా సుబ్బన్నసెట్టి, ఇల్లూరు సుబ్బన్న సెట్టి ప్రభృతులు-(కర్నూలు) - కన్పఱిచిన స్నేహము గణింతును.

శ్రీ వేమూరు విశ్వనాథశర్మ (ప్రొఫెసర్, ట్రెయినింగ్ కాలేజి, రాజమహేంద్రివరము), నాళము కృష్ణరాయకవి (రాజమహేంద్రవరము), డాక్టరు భోగయ్యశర్మ, మాజేటి రామచంద్రరావు, భావరాజు వేంకటసుబ్బరాయప్రధాని, బుద్ధిరాజు రాజభూషణరావు (అడ్వొకేట్), మోతే నారాయణరావు జమీందారు, ఏలూరు;—

శ్రీసిద్ధవరము వేంకటసుబ్బయ్య (వకీలు - గుత్తి), సిద్ధవరము గణేశము (ఓవర్సీయర్ - రాయచోటి-కడప.) దుర్భాక రాజశేఖర కవి (తాలూకాబోర్డు వైస్ ప్రెసిడెంటు), కొప్పురపు సుబ్బయ్యశ్రేష్ఠి (వైస్‌చేర్మన్ మ్యునిసిపాలిటి-వైశ్యకులధర్మప్రవక్త),—ప్రోద్ధుటూరు;—ఎల్లవేళల నెఱపిన ప్రణయపురస్సర మగు సహృదయత్వము సంభావింతును.

నా యీ యలంతి యూడిగమును బ్రద్యోతమాన మొనర్ప బద్ధ కంకణుఁడైన మిత్త్రుని శ్రీ ఈదర వెంకయ్యపంతుల (ఏలూరు రామా అండుకో ప్రొప్రయిటరు)ను బ్రశంసింతును.

శ్రీ ఈదర కృష్ణమూర్తి (పట్టాభిరామముద్రణాలయము మేనేజరు), కస్తూరి మాణిక్యరావు, చక్కిలం వేంకటసుబ్బయ్య (కంపెనీప్రతినిధులు), పిడియాల గంగరాజు (ఫోర్మన్), నండూరు శోభనాద్రిఆచార్యుఁడు (ముద్రణాలయోద్యోగి)—చూపెట్టిన భక్తి శ్రద్ధలను గ్రహింతును; ఆశీర్వదింతును.

## ప్రతిజ్ఞ.

వేంగీచాళుక్యప్రభుని యాదరము గన్న "ఆంధ్రభారతము" విధివశమున ఆవేంగిసీమయందే పరిష్కృతిం బొందఁగాంచుటయ విశేషము. తెలుఁగు దోబుట్టువులు సరసాగ్రేసరులు నన్ను అల్పునిఁ దేల్చి దరిఁ ద్రొక్కింతురుగాక. విరివియైన నా తెలుఁగుగడ్డ నా యీ కొలువు నెట్లు మన్నించునో వార్చియుందును.

---

తెలుఁగు ఛానిస,
మున్నంగి . . . . . . శర్మ.

ఏలూరు
౨౨-౧౨-౧౯౩౧.
ప్రజోత్పత్తి సం. మార్గశీర్ష శుక్ల ౧౩ జయవారము.

# ఆ శీ ర్వా ద ము .

ఆంధ్రమహాభారతమును గూర్చి నా చేయు పరిష్కరణక్రమము నాలకించి న న్నాదరించి యాశీఃపురస్సరముగ నొసఁగిన పెద్దల యభిప్రాయము:

**University College of Arts,**
**Vizagapatam, 2—12—31.**

బ్రహ్మశ్రీ మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు పరిశోధించి ప్రకటించిన యాంధ్రమహాభారతమందలి శాంతిపర్వములోని విశేషములు నేటి వారి యుపన్యాసములవలనను ముద్రిత గ్రంథములవలనను గూడఁ దెలిసికొని యానందించితిమి. ఈవిధముగాఁ బ్రాచీనతాళపత్ర గ్రంథముల సాహాయ్యమున నాంధ్రమహాభారత మంతయుఁ బ్రకటింపఁ బడుట యాంధ్రలోకమునకు మహోపకారక మగును. ఈశ్వరానుగ్రహమున నట్లు పరిశోధింపఁబడిన గ్రంథము బ్రకటింపఁబడుటకు శ్రీ శర్మగారి యత్నము కొనసాగుఁగాక యని కోరుచున్నాము.

మామిడిపూడి వేంకటరంగయ్య,
(ఆంధ్ర యూనివర్సిటి హిస్టరీ ప్రొఫెసర్).

పింగళి లక్ష్మీకాంతం,
(ఆంధ్ర యూనివర్సిటి తెలుఁగు ప్రొఫెసర్).

మల్లాది సూర్యనారాయణశాస్త్రి,
(ఆంధ్ర యూనివర్సిటి పండితులు).

---

# తొలిమాట.

సంస్కృతమున భారతము పంచమవేదము. తెనుఁగుననో అదే వేదము. అంతేకాదు. అదే తొలిధర్మశాస్త్రము; తొలినీతిశాస్త్రము; తొలివేదాంతశాస్త్రము;తొలిమహాకావ్యము; తొలిసర్వలక్ష్యసంగ్రహము; తొలియితిహాసము; తొలిబహుపురాణసముచ్చయము. మరియు అది తమ విశిష్టప్రజ్ఞా 'యక్స్' కిరణసాహాయ్యమున వివిధాంతఃకరణ వ్యాపారము లెల్ల గ్రహించి, వ్యాస నన్నయభట్టాదులు ప్రదర్శించు సినీమాపటము. పార్సీవారికి జెందవెస్తాయును, బౌద్ధులకు త్రిపిటకమును, క్రైస్తవులకు బైబిలును, మహమ్మదీయులకు ఖురానును ఎట్టివో అట్టిది తెనుఁగువారికి మహాభారతము. వేయి ఏల?— అది జ్ఞానవిజ్ఞానసర్వస్వము.

తెనుఁగుభారతమునకు విషయమును బట్టియేకాక, భాషను బట్టియుఁ బ్రాశస్త్యము చేకూరినది. కవిత్రయమువారు తెనుఁగు సొగసుందెమ్మెరలను తమ తెలివిజంత్రపుబలిమిచే చేర్చిరి; కరఁగించిరి; పోఁతపోసిరి; వింతవింత రూపులు సంతరించిరి; వలయురసములు కూర్చి, వానికి ఉసుఱుపోసిరి; అమర్చిరి, కనుగ్రుడ్డియు - వినుచెవ్వుడును కాని తెనుంగుగమికి కనువిందును-వీనులవిందునుగాక, డెందపువిందును సమకూర్పఁ జాలరి.

పైభాషలోని గ్రంథములను తమభాషలోనికి తెచ్చుకొనఁ దలంచునెడ ఎవరుగాని మక్కీకి మక్కీదారి త్రొక్కుటకంటె విషయము ముఖ్యముగా కైకొని, దానిని రసాత్మకముగ క్రొత్తగా వ్రాయునటుల వ్రాయుతెఱంగే మిక్కిలి మంచిది. అది ఎఱింగియే రసజ్ఞుఁడగు నన్నయభట్టు తా నట్టులే తెనుఁగు భారతము వ్రాయఁ దొడంగె.

తిక్కన సోమయాజియు-ఎఱ్ఱాప్రెగడయు ఆ తెఱుంగే తాము పాటిం చిరి. తెనుఁగువారికి అక్షరరూపమున నొప్పువిన్నాణపుంబెన్నిధిని చేకూర్చినపున్నెము కట్టుకొనిరి.

తెనుఁగుభారతపుంబ్రాశస్త్యము అన్నిచందములను మిన్న కావుననే తెనుఁగువారు దానిని ఎంతయు మన్నించుచు, దానిప్రతులు భక్తిశ్రద్ధలతో అచ్చువచ్చువఱకును పెక్కుశతాబ్దులు వ్రాసికొనుచు దానికొలువుగొలిచి, దానిరూపు నిలిపినారు. కాని వ్రాఁతలో పలువుర చేతులలో పడుటచేత దానిరూపు కొంతమాఱె. దానికిదోడు అచ్చులో పరిష్కర్తల మను కొనినవారు తమయిచ్చవచ్చినటుల విచ్చలవిడిగా దిద్ది, దానిరూపు మఱికొంత మార్చిరి. తెనుగునకు ముప్పుదెచ్చిరి. అది కనుంగొని మాతృభాషాభిమానులుకొందఱు పలుప్రతులుచూచి పాఠభేదములు తెలుపుచు, భారతము ప్రచురించిరి. కాని అట్టిప్రతుల యందును తమకు నచ్చని పాఠములను పరిష్కర్తలు వదలివైచిన ట్లనుమానింపఁ దగియున్నది. ఎటులయిననేమి ? — కవిత్రయమువారు కూర్చినరూపుననే భారత మిప్పటికిని నిలిచియున్నదని సంపూర్ణముగా సంతోషించుభాగ్యము మనకు లేదు. ఉన్నరూపుననైనను అందలివిష యము గ్రహింపవలయునుగదా! అందుకొఱకు అచ్చులో పదముల నడుమను ఎడము లుంచి, పరిష్కర్తలు కొందఱు చదువుకొనువారికి కొంతవఱకు తోడ్పడ యత్నించిరి. పరీక్షలకు చదువ నిర్ణయించిన భాగములకు అర్థములు కొందఱుపండితులు వ్రాసిరి. కాని మొత్తము మీఁద భారతమంతయు సందేహములులేకుండ చదువుకొని, ఆనందించు టకు తగిన తెఱుఁగున దానిని ముద్రించుట మాత్ర మిప్పటికి జరుగలేదు.

నామిత్రులు కీ॥ శే॥ విన్నకోట అప్పలనరసింహాగుప్తగారు ౧౯౧౩ సంవత్సరమున ఆదిపంచకము పాఠాంతరములతో అచ్చొత్తిం

చిన పిదప, ఒక్కొకపర్వము ఆంధ్రగుర్తులతోడను పాఠభేదము లతోడను, వలయుచోట్ల టిప్పణవివరములతోడను ప్రచురించుచో చదువుకొనువారికి సదుపాయముగా ఉండు నని నేను తలంచితిని. గ్రంథ మంతయు రెండుసారులు చదివితిని. ఒకప్రతినిబట్టి నన్నయనుడు లన్నియు — సంస్కృతసమములలో సాధారములుతప్ప అకారాదిగా కూర్చితిని. తిక్కన నుడులపని మొదలిడితిని.

ఇంతలో బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు తమమిత్రు లొకరు భారతకృషిచేయుచున్నట్లును, దానినిగూర్చి నాసలహా కావలసియున్నట్లును తెలిపిరి. ఆయనమిత్రులు తమకువలెనే నాకును చిరపరిచితు లగు బ్రహ్మశ్రీ మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారే అని నేను రాజమహేంద్రవరమునకు చనినపుడు తెలిసినది. ఆయనయు ఏలూరినుండి అక్కడకు వచ్చిరి. మేము ముగ్గురమును తెనుఁగు భారతము చదువుకొనువారికి అర్థమగువిధమున ప్రచురించుటనుగూర్చి ముచ్చటించుకొంటిమి. అప్పటికే అచ్చుపడుచుండిన శాంతిపర్వము వలెనే తక్కినపర్వములును అచ్చొత్తించుటకు ప్రయత్నింపఁదగు ననుకొంటిమి. శర్మగార్లిరువురును నన్ను శాంతిపర్వమునకు పీఠిక వ్రాయఁ గోరిరి. నే నింతకుముం దట్టి ప్రయత్నముచేయఁ దలంచిన వాఁడ నగుటచే వారుకోరిన ట్లొనర్ప వినయపూర్వకముగా ఇయ్య కొంటిని. ఇఁక ముందు చేయవలయు కృషినిగూర్చి, దేశాటనము చేయుచు, మంచితాటాకు ప్రతులు సంపాదింప ప్రయత్నింపవలయు ననియు సంస్కృతమూలమునుబట్టి సరిచూచియు, కలాశాలలలోని పండితులను, ఇతరపండితులను సందర్శించియు సందేహములు తీర్చు కొనఁదగుననియు, నా కప్పటికి తోఁచినసలహా లిచ్చితిని. పరిష్కర్త మున్నంగి శర్మగారిప్పటికే కొంతవఱకు దేశాటనముచేసిరి. 'ప్రయి' మొదలగు కొన్నిమాండలికపదములను కనిపట్టిరి కొన్ని పాఠాంతరములు సేకరించిరి. తమకు లభించిన ప్రతులను గూర్చియు, తమవాడిన విరా

మపుగు ర్తులనుగూర్చియు, ఇప్పటికిచేసిన తమపనిని గూర్చియు ఆయన నిజనివేదికయందు తెలిపికొనెను.

శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు పీఠికలో భారతప్రాశస్త్యమును గూర్చియు, ఆంధ్రీకరణమునందలి విశేషములను గూర్చియు, వ్రాత ప్రతులనుగూర్చియు, అచ్చుప్రతులను గూర్చియు, తిక్కనభారత విశేషములను గూర్చియు భావగ్రహణమునకు వలయు పాఠసౌలభ్యము కలిగించు ప్రయత్నమును గూర్చియు, జాతీయములను గూర్చియు, మాండలికములనుగూర్చియు ముచ్చటింపఁదగునని చక్కఁగా సూచించినారు. కాని సర్వాంకషముగుపీఠిక వ్రాయ యత్నించుటకు తగినంత వేళ కావలయును; దానికంటె ముఖ్యముగా సమర్థతకావలయును. అవి రెండును ఇపుడు నాకు లేవు. అదియునుగాక గ్రంథమంతటితో సంబంధించినపీఠిక ఆదిపర్వము మొదటను, తిక్కనవిశేషములను తెలుపునది విరాటపర్వము మొదటను ఉండఁదగునని నాతలంపు. అందులకు పరిష్కర్తయు అంగీకరించెను. కాన, ఇప్పటికి సంగ్రహముగా భారతప్రాశస్త్యమును గూర్చియు, పరిష్కరణమును గూర్చియు మాత్రము వ్రాయ నిశ్చయించుకొంటిని. మొదటిదానినిగూర్చి తొలుతనే కొంత వ్రాసితిని. కావున ఇఁక రెండవదానినిగూర్చి కొంత తెలిపెద.

గ్రంథపరిష్కరణ మనఁగా సాధారణముగా పరిష్కర్తలకు వీలగునంతవఱకు వానియందు పొరపాట్లు లేకుండఁ జేయుటయేకదా! అయినను అచ్చువచ్చినప్పటినుండియు పొత్తము కనువిందుగాను- విషయము చదువుకొనుటకు సులువుగాను ఉండునట్లు చూచుటయును పరిష్కరణమునందు చేరియున్న దనవచ్చును. విషయములోని పొరపాట్లు రెండు తెఱంగులు: ౧- గ్రంథకర్తలు అసమర్థు లగుటచే వచ్చునవి; ౨- అసమర్థులగు వ్రాయసకాండ్రో- సమర్థుల మనుకొను పరిష్కర్తలో చేయునవి. వ్రాయసకాండ్ర పొరపాట్లు దిద్దుట పరిష్కర్తలపనియే

కాన అందు వారికి సర్వస్వాతంత్ర్యము కలదు. కర్తలు కోరుచో వారి పొరపాట్లును దిద్దుట తగును. కాని నిరాధారముగా మూలమునకు విరుద్ధము లగుదిద్దుపాట్లు చేయుటకు ఎట్టిసమర్థులగు పరిష్కర్తలకే నియు స్వాతంత్ర్యము రవంతయులేదు. అయినను కొందఱు అట్టి స్వాతంత్ర్యము వహించినట్లు తేటపడుచున్నది. ఇది చేయగూడనిపని. ఇట్టిపరిష్కరణమును మరల పరిష్కరింపవలసియుండును. కాని సమర్థులగు పరిష్కర్తలును తమపరిష్కరణము కడుంగడుమెలంకువతో చేయవలసియుండును. అయినను పద్యగద్యములలోనిభావము సరిగా తెలియుటకు తోడుపడుమార్పులు తమ వని తేటపఱుచుచు చేయుటకు పరిష్కర్తలు స్వాతంత్ర్యము కైకొనవచ్చును. అటులయ్యు ఎందేని స్వాతంత్ర్యము పరిమితమేకాని అపరిమితముకా దని విజ్ఞు లెఱుంగుదురు. అందుచే పరిష్కర్తలపని కష్టసాధ్యమే. కాన పరిష్కృతములయినగ్రంథములలో ఏలోపములును లే వని ఎవరుగాని చెప్పుట సాహసమే అగును. అయిన దెలిసినవారు కొలఁది కొఱంతలను లెక్కింపరు.

అచ్చు వచ్చినప్పటినుండియు గ్రంథపరిష్కరణము హెచ్చుగా కనఁబడుచున్నను, నిజ మరయుచో గ్రంథములపుట్టుకతోడనే పరిష్కరణమును పుట్టిన దనవచ్చును. సమర్థు లగుకర్తలును తమగ్రంథములం బలుసార్లు చూచుకొని, మార్చుకొని, దిద్దుకొని, లోపములు లే వని నిశ్చయించుకొనినపిదపనే వానిని వెల్లడింతురు. ఇది పరిష్కరణముకాదా? అవును. కాని పైవారిపరిష్కరణమునే సాధారణముగా పరిష్కరణ మని వాడుచున్నారము; కాన కా దనియు అనవచ్చును. దీనిమాట అటుండనిండు. గ్రంథకర్తలు తోడివారికి తమగ్రంథములు చదివివినిపించి, వారిసూచించుమార్పులు తమకు నచ్చునెడల చేయుచుందురు. ఇది పరిష్కరణముకాదా? తొలిదానివలె దీనిని అంతసులువుగా త్రోసిపుచ్చుటకు వీలులేకున్నను, దీనినిసైతము సాధారణముగా

పరిష్కరణముగా కైకొనుటలేదు. నారాయభట్టు తనకు తోడై భారతరచనము నిర్వహించె నని నన్నయభట్టుచెప్పుట ఇట్టిపరిష్కరణమునసే కాఁ దగు. ఇఁక పరిష్కర్తలపేరు తెలిపి గ్రంథములు పరిష్కరించునపుడే అదిపరిష్కరణముగా లెక్కకు వచ్చుచున్నది.

తెనుఁగుభారతము పలువురపరిష్కరణములకులోనై, పలు ప్రతులుగా అచ్చుపడినది. పాఠభేదములుమొదటివానియందు లేకున్నను తరువాతివానియందుగలవు. అంతేకాదు. తరువాతిప్రతులు మొదటి వానికంటె కంటికి ఇంపుగా ఉన్నవి; చదువుకొనుటకు కొంతవఱకు సులువుగా ఉన్నవి. కాని అవియును సరిగా బోధపడనిస్థితిలోనే ఉండుటచే మరల భారతమును పరిష్కరింపవలసియేవచ్చినది. అందుచేతనే అట్టి పరిష్కరణ మొనర్పఁబూనుకొనిన శ్రీ మున్నంగి ... శర్మగారు— "సమస్తలౌకికాలౌకికపదార్థములం బ్రసాదింపఁదగు రోహణాద్రినాఁ బొల్చు భారతము నిరాదృత మగుట, అథవా ఉపేక్షాభాజన మగుట శోచనీయము. ఇంచుక భాషాపరిచితియు అభినివేశమునుగలవారి కెల్లఁ దంగెటిజున్నుకాఁదగినభారతము సద్వినియోగపఱుచుట కను వగు మార్గ మొకఁడు నాఁకు దోఁచినది." అని చెప్పవలసివచ్చినది. అయిన ఆయనకు తోఁచినమార్గ మేదో, అది సరిఅయినదోకాదో, కననగు.

ఏగ్రంథముగాని సరిగా బోధపడమికి అడ్డువచ్చు కారణము లేవో, వానిని తొలఁగించుటకు సాధనము లేవో చూచినయెడల శర్మ గారికి తోఁచినమార్గము తెనుఁగుభారతమును తంగెటిజున్నుగా చేయుటకు తగినదో కాదో మనకు తేటతెల్ల మగును. అర్థ మగునట్లు చదువుకొనుటకు వీలుగా నుండుతెఱఁగున ఎడములును, ఆఁపుగుర్తులును లేమియును, అర్థకాఠిన్యమును, శైలికాఠిన్యమును, శాస్త్రీయ పదములు వాడుటయు గొప్పగ్రంథములు సరిగా బోధపడక పోవుటకు కారణములు. వీనిబాధ తొలఁగించుటకు ఎడములును-ఆఁపు

గుర్తులును వాడుటయును, కఠినపదములకు అర్థమును- కఠినవాక్యములకు తాత్పర్యమును- శాస్త్రీయపదములకు వివరణములును తెలుపుటయును సాధనములు. శర్మగారు వీనిసాయమును తా మెట్లు పొందిరో చూడుఁడు:—

(౧) ఇంతకుముందు మూలమునలేని ఆఁపుగుర్తులను ఇంగ్లీషు గ్రంథములలోవలె ఆఁపవలసిన చోట్లు సరిగా తెలియునట్లు వలయు నని తమకు తోఁచినయెడల చేర్చినారు. ఇంగ్లీషుచదువుకొనినవారు తమ వ్రాయుతెనుఁగు పొత్తములలో కొంతకాలమునుండి ఇంగ్లీషుగ్రంథములలోవలె విరామపుగుర్తులను వాడుచునేయున్నారు. కాన ఇది కేవలము క్రొత్తస్వాతంత్ర్యముకాదు. ఇది భారతపరిష్కరణమున వినియోగించుట ఎంతయు శ్లాఘనీయము.

(౨) సంధిచే కలసి, ఒకే లంకెగా ఉన్నవచనవాక్యములు సహజములుగా ఉండునెడల అర్థ మగుటకు సులువుగా ఉండు నని వానిని విడఁదీసి, ఆఁపుగుర్తు లుంచినారు; కొన్నియెడల వాక్యమధ్యమునను విసంధి చేసినారు. విసంధిచేయుట పరిష్కరణమున క్రొత్తస్వాతంత్ర్యమే. కాని ఇది వాంఛితము కా దనరాదు. అయినను పరిష్కర్త దీనిని కొంతవఱకే వినియోగించినాఁడు— అనఁగా వచనములలోనేకాని పద్యములలో విసంధిచేయఁడయ్యెను. పండితాభిప్రాయ మెట్లుండునో కనుంగొనఁ దలఁపుకాఁబోలును! చేయుపరిష్కరణమునకు బాధ్యత వహించునపుడు వచనమున వినియోగించిన స్వాతంత్ర్యము పద్యమున వినియోగించుట దోషము కానేరదుకదా? అర్థసౌలభ్యము భావప్రకటనమునకు ఆవశ్యకము. భావప్రకటనము రసోత్పత్తికి సాధనము; రసోత్పత్తి కోరి దృశ్యకావ్యములందువలె శ్రావ్యకావ్యములందును పద్యములు చదువునపుడు విసంధిచేయుట శిష్టాచార మగుట పండితులకు విదితమే. కాన దీనినిగూర్చి పరిష్కర్తయు విమర్శకులును

ఆలోచింతురుగాక! నిజమునకు అర్థసౌలభ్యసదుపాయము వచనము నందుకంటె పద్యముననే హెచ్చుగా ఆవశ్యకముకదా?

(3) కఠినపదములకు అర్థములును,

(4) కఠినవాక్యములకు తాత్పర్యములును,

(5) శాస్త్రీయపదములకు వివరణములును-వ్రాసినారు.

ఇట్లు తెనుఁగుభారతమును తమకు వీలగు సంతవఱకు చదువు కొన్నవారికెల్ల సులువుగా బోధపడునట్లు చేయుటకు శర్మగారు యత్నించినారు. ఇందుచే ఆయనకు తోఁచినమార్గము తగినదే అని చెప్పనగును. సత్సంకల్పముతో ఎంతోశ్రమపడి, ఇప్పటికి ౬ పర్వములు తమపద్ధతి ననుసరించి పరిష్కరించిరి. మొదట శాంతిపర్వము ప్రకటించిరి. ఇందులకు తెనుఁగు చదువరులెల్ల పరిష్కర్త యెడల మిక్కిలి కృతజ్ఞులై యుండఁ దగు. అచ్చుపడిన శాంతిపర్వమును కొనియు, అచ్చుపడ నున్న తక్కిన పర్వములు కొనుట కియ్యకొనియు వారు తమకృతజ్ఞతను చూపుదురుగాక! భారతబోధామృతమును క్రోలి, బ్రహ్మానంద మందెదరుగాక! జ్ఞానదానము చేయించిన పుణ్యము కట్టుకొందురుగాక!

శర్మగారు శక్తివంచనములేక పరిష్కృతి చేసినారు. అయినను ఏలోపమును ఉండ దని చెప్ప సాహసింపరాదు. ఒక ప్రతి చూచి మఱొకటివ్రాయునపుడు పొరపాట్లు వచ్చును; అచ్చు కూర్చు నెడ పొరపాట్లు వచ్చును; దిద్దునెడ పొరపాట్లు వచ్చును; ఎడము లుంచుటలో పొరపాట్లు వచ్చును. ఇట్లు పెక్కు తెఱంగుల పొరపాట్లు రావచ్చును. కాన పండితులు తమకావశ్యక మని తోఁచినపట్టుల చేయఁ దగు నని తోఁచినపరిష్కరణమును సూచించి, రెండవకూర్పున పొరపాట్లులేకుండఁ జేయుటకు పరిష్కర్తకు తోడ్పడుదురు గాక! పరిష్కర్త చేయ మొదలిడినపని కష్టసాధ్యమేకాక, ధనసాధ్యము. కావున భాషాభిమానులగు

సంస్థానాధీశ్వరులును - ధనికులును పోషకులై, ఆయనప్రయత్నము సఫలము చేయించి; అందువలన తాము జ్ఞానమును - పుణ్యమును గడించు కొందురుగాక!

పరిష్కరణమునుగూర్చి నాకు తోఁచినసలహాలు కొన్ని ఇంతకుముందే తెలిపియుంటిని. ఇపుడు తోఁచినవి మఱికొన్ని తెలిపెద. అచ్చుపడినభారతప్రతు లన్నియును సేకరించుటకు ప్రయత్నించి వాని సాయముతోడను, సంస్కృతభారతమూలమేకాక దానివ్యాఖ్యానమును సందేహాస్పదము లగుచోట్ల చూచుచు దానిసాయముతోడను పరిష్కరణ మొనరింపఁదగు. పాఠాంతరములెల్ల తెలుఁప దగు. మఱియు ఛందోవ్యాకరణాలంకారవిశేషములను వలయునెడల తెలుపుటకూడ యత్నింపఁ దగు. చెప్పుట సులభముకాని చేయుట కష్ట మని తెలిసియు నే నిట్టి సలహాలిచ్చినందులకు పరిష్కర్త మన్నించుగాక! నాది సదభిప్రాయ మని ఆయన యెఱుంగుననునిబ్బరమే న న్నిటులచెప్పించెను. ఇంతేకాదు. తనవినయమును, మాతృభాషాభిమానమును చూపుటకు 'తెలుఁగుబాసిస'బిరుదు ఆయన తాల్చి - తెనుఁగుపలుకువెలఁదినికొలువ బూనుటయు ఆయనను మఱింత శ్రమంపడఁదగు నని తెలుపుటకు ఎంతయు నన్ను పురికొల్పినది. అదియునుగాక నేను ఆయనకు హితుఁడను. అట్టిచో హితము చెప్పుటకు నే నేల జంకవలె? నేను తగిలింప నెంచుశ్రమము తాత్కాలికము; అందువలన ఆయనకు వచ్చుకీర్తి అన్ననో శాశ్వతము కావున పరిష్కర్త తా నెన్నిపాట్లయినను పడి, తన చేయఁబూను కొనిన పరిష్కరణము సకలవిధముల సర్వాంకషముగా నొనర్పవలయునని మరలమరల నూఁదుదును. ఆయనకు ఆయురారోగ్యములును- సాహాయ్యసంపత్తియు సరిగా సమకూర్చి, తలఁచినపని త్వరలో సఫలముచేయ సర్వేశ్వరుని సర్వదా ప్రార్థింతును.

ది ౩—౧—౧౯౩౨ }
విశాఖపట్టణము. } —మారేపల్లి రామచంద్రశాస్త్రి.

## పరిష్కరణక్రమసూచిక.

మచ్చులు గొన్ని:—

ప్రసన్నతకు: శాంతి—ఆ ౧-ప ౭, ౬౨, ౯౩.

అన్వయకాఠిన్యమునకు: ఆ ౪-ప ౪౯, ౫౦, ౫౧; ఆ ౬-ప ౨౦౦.

మఱుఁగులకు: ఆ ౪-ప ౨౦౩, ౨౨౨.

తెలుఁగుగలుపులకు: ఆ ౧-ప ౭౧; ౩-౩౦౭

పరిష్కరణావశ్యకమునకు: ఆ ౧-ప ౬, ౫౮, ౯౩, ౧౦౧, ౨౦౬.

# విషయానుక్రమణిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

తృతీయాశ్వాసము.

చతుర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.

## షష్ఠాశ్వాసము.

శ్రీ

హరిహరనాథాయనమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము.



ప్రథమాశ్వాసము.

సంక్రమణనిపుణవి
లాసకటాక్షా, నివృత్తి లంపటచిత్తో
ల్లాసనదక్షా, వేద
వ్యాసవచోవిభవలక్ష్య, హరిహరనాథా. ౧

### మహర్షులు పాండవులం జూడ వచ్చుట.

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: అట్లు సకలబంధు మిత్త్రజనంబులకు నుదకకర్మం బాచరించి, పాండవులు గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకయి యొక్కసమస్థలంబునం బట కుటీరసంవిధానంబు సేయించి, ధృతరాష్ట్ర విదుర సర్వభరత భార్యాసమేతంబుగా నచ్చట మాసమాత్రంబు నిలిచిరి. అట్టియెడం, గృష్ణ ద్వైపాయన నారద దేవల దేవస్థాణు కణ్వులు మొదలుగాఁ గల మునీంద్రు లనేకులు శిష్యవర్గసహితంబుగా ధర్మనందను సందర్శనంబునకుం జనుదెంచిన, అజ్జననాథుండు ప్రత్యుత్థాన ప్రణామపాద్యాసనాకలనంబులను దత్కాలోచితార్చనంబులను అమ్మహాత్ములం బ్రీతులం గావించి కృష్ణనిజానుజయుక్తంబుగా

వారల నుపాసించియుండ, వారలు బహువిధంబులగు ప్రియవచ
నంబుల నక్కురువంశసత్తము సంభావింప, నారదుం డమ్మహనీయ
ద్విజులం గలయం గనుంగొని, యుక్కుంతీయాగ్రజుతోడం దాను
కుశలప్రశ్నంబులగు మాట లాడం గలవాఁ డగుటం వారి కెఱింగించి,
యమ్మహీపతియాననం బాలోకించి,— ౭

ఉ. గోవిందుం డనిశంబు శోభన మొదం గోరంగఁ, బార్థుండు ద
ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీయస్ఫూర్తిసంశోభిగాం
డీవోల్లాసవిభాసి యై సమరపాండిత్యంబు వాటింప, సం
భావింపన్ జగ మెల్ల రాజ్య మిటు లొప్పం గొంటె రాజోత్తమా!

చ. భువనభయంకరంబు లగు పోరులఁ దమ్ములతోడ గూడ నీ
వు వెడలఁబాటు లెన్న; యలవుం జలమున్ వెలయించుచోట ధ
ర్మువునకొకింతయుం దొలఁగఁద్రొక్కమి యెంతయుమేలు; దీనఁ,గౌ
రవకులముఖ్య, [1]యుమ్మలికఁ గ్రాసితె? చిత్తము ప్రీతిఁ బొందెనే?

వ. అనినవిని యజ్జనవిభుం డమ్మునివిభున కి ట్లనియె: ౮

సీ. కృష్ణుండు మామీఁదఁ గృప సేయుటయు, బ్రాహ్మ
ణానుగ్రహంబున, ననిలపుత్త్ర-
పార్థులపటుబాహుబలమున, మేదిని
యంతయుఁ జేకుఱునట్టి దయ్యె;
నైనను, నతిఘోర మగు నఖిలజ్ఞాతి
వధ మొనరించుటవలన, నధిక
గుణుని సౌభద్రునిఁ, గులభూషణంబుఁ బాం
చాలి తనూజపంచకముఁ గోలు
పోకఁ జేసియు, గెల్పు గెల్పుగ మదీయ
బుద్ధి కైకొన దయ్యెడు; సిద్ధముఖ్య,
యదియుఁగాక వే ఱొక్కండు మదిఁ గలంచు
చున్న యది;— దాని నేర్పడ విన్నవింతు. ౯

1. ఉమ్మలిక=శోకమును, గ్రాసితె = కసిక్రిక్కి వేసి(ఉమిసి)తివిగదా!

చ. ఘనభుజవిక్రమోన్నతుఁడు, కౌరవకోటికిఁ బట్టుగొమ్మ, మ
మ్మనిమొనఁ దూలపుచ్చినమహాత్ముఁడు కర్ణుఁడు, గొంతితొల్తచూ
లని యుదకప్రదానసమయంబున నాయమచేత విం టి,—నా
తని కుదకంబు లిచ్చుటకుఁ దా మముఁ బంచుట గోరి చెప్పినన్. ౭

వ. అప్పుడు దొడఁగి యంతరంగంబు నిప్పులం బొరఁటిన ట్లయ్యెడి. అక్కుంతీమహాదేవి దాను దివాకరువరంబున నప్పురుషవరుం బడసి పాఱవైచుటయుం, బిదప నతండు ధార్తరాష్ట్రులపాల దొరయై యుండ మాకును వారికిం గలహంబు పుట్టిన, నది మాన్పించుటకై యక్కొడుకుకడకుం జని యేకాంతంబునం బుట్టువు దెలుపుటయు లోనయిన తద్విషయవార్త లనుదినంబునుం జెప్పుచుండు. ౮

సీ. ఆయమ తనపుత్త్రుఁ డవుట యెఱింగించి
'తమ్ములలోనికి రమ్ము నీవు'
నావుడు, నాతండు: 'నాకు గృతఘ్నత
వాటిల్లదే కురుపతిఁ దొఱంగి
వచ్చిన! నది గాక వాసవితోడి క
య్యంబున కితఁ డోడె ననరె! యతఁడు
బెరయ నొండెను, నను బెరసి యొండెను, నేవు;-
రింతియకాని నీ వెపుడు నీకుఁ

ఆ. దనయు లార్వు రనకు' మనియె; నద్దేవి: 'త
క్కనుజు లెల్లవారి కభయ మొసఁగు'
మనిన, 'నట్ల కాక' యని మమ్ము నలువురఁ
బట్టెఁ గాని తెగఁడ ప్రాణములకు. ౯

---

1=వెరసి అని వ్యావహారికము.

తా. అతఁడు (అర్జునుఁడు) కలిసినఁగాని నన్నుఁ గలిసికొనినఁగాని నీ కైదుగురు కొడుకులు. అంతియకాని ఎపుడును గొడుకు లార్వు రనకుము.

ఆ. తొల్లి తాన దాఁచె దల్లి, పదంపడి
యతఁడు సెప్పవలవ దనఁగ దాఁచె;
నిట్లు గాఁగ నెఱుఁగ మేవురమును నతం
డిట్టిఁ డగుట — దాన నింత పుట్టె! ౧౦

క. ఆతఁడు, దుర్యోధనునకుఁ
బ్రీతిగ జూదంబునాఁడు - పెక్కాడెను ధ
ర్మేతరములు; వానికి మ
చ్చేతోగతికోపభరము చెందక యుండున్! ౧౧

ఆ. అతనిమేను కుంతి యట్టులకై వడి
యరయ నేను జూచి, యాత్మ 'నెద్ది
కారణంబొ యిట్లు గా!' ననుచుండుదు;-
నేమి సేయువాఁడ నింకఁ జెపుమ! ౧౨

క. కౌరవులు సేయు నవమతి
కారణముగఁ గోప మెత్తుఁ, గర్ణునివదనాం
భోరుహముం గనుఁగొన శమ
మారుణ నావశము గాక యంతన బుద్ధిన్. ౧౩

ఉ. గాండివి నొవ్వఁ బల్కి— 'తిటు గర్ణునిఁ జంపక వచ్చితేనిఁ ద
మ్ముండవు గావు నాకు' నని మూర్ఖత, సోదరఘాతి నైన క
ష్టుండ! మనంబునం బెఱుగు శోకము నెట్లు సహింతుఁ! దప్పె! నా
తండ్రును నేము నైన విబుధప్రకరంబును మాకు నడ్డమే? ౧౪

వ. అని పలికి, 'మునీంద్రా, యమ్మార్తాండనందను రథచక్రంబు
భూమిం గ్రుంగుటకుం గారణం బెద్ది?-దాని, నవ్వీరుండు పరశు
రామునిచేత శప్తుండయిన తెఱంగును నెఱింగింపవలయు. భువనం
బుల వర్తనంబులు నీకుం దేటపడనియవి లేవు గావున నిన్నడిగెద'
నని ప్రార్థించుటయు, 'అవ్విధం బంతయు వివరించెద విను' మని
యమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె: ౧౫

—♦ నారదుఁడు ధర్మరాజునకుఁ గర్ణునిచరితంబు చెప్పుట ♦—

సీ. మునిదత్త మగుమంత్రమున గొంతి, కన్నియ
నాఁడు, వేడుక దినవాథుఁ దనకుఁ
బ్రత్యక్షముగఁ జేసి పడయుటఁ బాసిగ్గు
పెంపున సుతు వెలయింప దయ్యెఁ;
గన్యాత్వవికలతగాకుండ నా సూర్యు
వరము గల్గుటఁజేసి వంశవర్య
మై పొల్చె; దేవరహస్య మిత్తెఱఁ; గిట్లు
పాఱ వైవఁగఁబడ్డ పట్టి సూతుఁ
తే. డెత్తికొనిపోయె; సూతజుం డితఁ డనంగఁ
బెరిఁగి, కర్ణుఁడు: నీ సేతల్, భీములావు,
నరునివిలుబల్మి, యతనికి హరికిఁ గలుగు
చెలిమి గని తద్దవగఁ బొందుఁ జిత్త మెరియ. ౧౬

క. నకుల-సహదేవ నయశా
స్త్రకళావేదిత్వమునకు, జను లనురాగా
ధికులై మిమ్ముం గొనియా
డుకు, నాతఁడు మనసు గీడ్పడం జింతిల్లున్. ౧౭

వ. అది తదీయస్వభావంబు; అట్లుంగాక దైవఘటనంబు నట్టిద. అమ్మాత్సర్యంబున న క్కర్ణుండు మీయెడ నీసు గలవాఁ డయి దుర్యోధనుం గూడికొనియె. పదంపడి ధనంజయుధనుర్విద్యాతిశయం బుపలక్షించి కుంభసంభవుపాలికిం జని, యేకాంతంబునం దనకు బ్రహ్మాస్త్రంబు సాంగోపాంగంబుగా నుపదేశింపవలయు నని యడిగి, 'యేను సమరంబున సవ్యసాచికి సమానుండ నగుటఁ గోరి వచ్చితి; నీవు సర్వశిష్యసమాదరుండవు; భవత్ప్రసాదంబునం గృతాస్త్రుండ నయి వెలయవలదే!' అనవుడు, నద్దినవాథనందనునకు నగ్గురుం డి ట్లనియె: ౧౮

తే. వ్రతసమన్వితభూసురవర్యుఁ డొండె,
నిరుపమానతపఃపుణ్యనృపతి యొండె
గాని, యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుఁ
బాత్రములు గారు; నీకు [1]ఈఁ బాడిగాదు. ౧౯

వ. అనుటయు 'సట్లు కాక' యని నిజమందిరంబునకుం జని, మఱునాఁడు గదలి మహేంద్రమహీధరంబున కరిగి, పరశురామునిం గాంచి వినయంబునం బ్రణమిల్లి: 'యేను బ్రాహ్మణుండ; భృగువంశ జాతుండ; అస్త్రవిద్యాపేక్ష ని న్నాశ్రయింప వచ్చితి' ననిన, న మ్మునివరుండు ప్రీతుం డై కర్ణుం బరిగ్రహించి పరిశ్రమంబు సేయించుచుండె. అట్టియెడ నాశ్రమపరిసరంబున నొక్కచోఁ దనయంతన లాఘవాభ్యాసంబు సేయుచుండ, నొక్కమహాద్విజుని హోమధేనువత్సం బడ్డంబు వాఱి బాణగోచరం బై మృతిం బొందినం గని, యవ్విప్రుండు గోపంబున శాపం బిచ్చిన దానం దేరు ధరణిం గ్రుంగె. జామదగ్న్యుండు శపించిన తెఱంగును జెప్పెద- అవ్వీరుం డతనికి భక్తుం డై పరిశ్రమం బాచరింప నతండు బ్రహ్మాస్త్రంబు లోనుగా ననేకాస్త్రంబు లొసంగె. పదంపడి యొక్కనాఁడు— ౨౦

తే. కర్ణు నుత్సంగమున మస్తకంబుఁ జేర్చి
గురుఁడు నిద్రింప, వికృతాతిఘోరరూప
[2]మళక మనియెడునొకకీట మద్దినేంద్ర
తనయు క్రిందొడ దొలిచె సత్వరముగాఁగ. ౨౧

వ. అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యంబునం గీటకృత్యంబున కోర్చి, యచలుం డై యుండె. నెత్తు రొండొండ పరఁగి పరశురాముశరీరంబు సోఁకిన, నమ్మహాత్ముండు మేల్కని, 'రక్తం బెక్కడి' దని యడిగినఁ, దొడయెత్తి కీటంబుం జూపి

1. ఈఁ బాడిగాదు = ఇచ్చుట ధర్మముగాదు. 2. అళకము = తేలుజాతిలోనిపురుగు.

'ఇది దొలుచుచుండ మీ నిదుర సెడుటకుం జాలక కదల
కుండితి' ననియె. అమ్ముని గనుంగొనిన నక్కీటంబు— ౨౨

క. మృతిఁ బొంది రాక్షసుం డై
[1]ఖతలంబుననుండి పలుకుఁ: 'గరుణాకర, నీ
కతమున దారుణశాప
ప్రతిహతి వాటిల్లె; నిపుడు ప్రకృతి వడసితిన్. ౨౩

వ. 'గ్రస్తుం డను పేరం బరఁగు నొక్కరక్కసుండ. భృగుపత్ని నపహ
రించి తదీయ శాపంబునం గీటంబ నై యుండి భవదీయవిలోకనా
మృతసేకంబున సుఖి నైతి' నని చెప్పి నమస్కరించి నిజేచ్ఛం
జనియె. రాముండు రాధేయుధైర్యంబు మనంబున నిరూపించి
యతనితోడ— ౨౪

క. 'ఈతాల్మి లేదు బ్రాహ్మణ
జాతికి; నీ వెవ్వఁడవు నిజం?' బనవుడు, 'నే
సూతజుఁడ' ననియె వెఱచుచు
నాతం; డామునివరేణ్యుఁ డతికుపితుం డై— ౨౫

వ. 'నీవు బ్రాహ్మణుండ నని కపటంబున మత్పరిగ్రహంబు వడసితి;
తత్ఫలం బనుభవింపు' మని యస్త్రవిభవంబు వికలంబుగా శపి
యించె. కర్ణుండునుం జేయునది లేక వగచుచు వచ్చి దుర్యోధనుం
గాంచి,— ౨౬

ఆ. 'అధిప, పరశురాము నాశ్రయించితిఁ; గృతా
స్త్రుండ నైతి. నన్ను భండనమున
మార్కొనంగ లేరు మగ లిజ్జగంబున.'
ననుడు, నతఁడు ప్రముదితాత్ముఁ డయ్యె. ౨౭

వ. ఇవి మీ యన్న వోయినపోకులు. ఇట్లు దుర్యోధనునకు నను౦ గై
యుండం గళింగపతి యగు చిత్రాంగదుండు శుభాంగి యను నిజ
పుత్త్రికి స్వయంవర మహోత్సవంబు సేయించువాఁ డై చాటించిన,

1=ఆకాశతలమునుండి.

శిశుపాలుండును నీలుండును జరాసంధుండును రుక్మియు లోనుగా రాజు లనేకులు తదీయ రాజధాని యగు రాజపురంబునకుం జనిరి. దుర్యోధనుండును [1]దోహలంబున సముచితచతురంగబలసమేతుండును గల్పితరథారూఢుండును గర్ణసహాయుండును నై యరిగె. అట్లు గూడిన భూపతులకుం దగు సంవిధానంబు లాచరించి, ౨౮

సీ. కాళింగుఁ డాత్మీయ కన్యాస్వయంవర
కార్యంబు నడప, నక్కన్య సఖులు,
దాదులు పేర్వేర ధరణీపతులఁ జూపి
చెప్పంగఁ, జూచుచుఁ జేతఁ బుష్ప
మాలిక యొప్పఁ దన్మధ్యవీధికి నల్ల
నడచుచోఁ గురుపతిఁ గడచి పోవ;
నతఁ డల్గి యచ్చపలాక్షిఁ బోనీక కాఁగి
పట్టి, రథంబుపైఁ బెట్టఁ బనిచి
ఆ. యేఁగుచున్న — రాజు లెల్ల సంక్షోభించి
కూడుకొని యుదగ్రఘోరభంగిఁ
దాఁకి; రవ్విభుండుఁ దలఁకక బలశౌర్య
ములు పొగడ్త కెక్కఁ బోరె నధిప.

వ. అట్టియెడ— ౩౦

శా. భల్లంబుల్ పరఁగించి యుగ్రముగ భూపాలోత్తమాంగంబులన్
ద్రొల్లం జేయుచుఁ, జిత్రలాఘవము నాటోపంబు దర్పంబు రా
జిల్లం గుంభిఘటా రథవ్రజ హయశ్రేణీ పదాతిప్రతా
నోల్లాసంబుల రూపు మాపుచు నవార్యుం డయ్యెఁ గర్ణుం డనిన్.

వ. ఇవ్విధంబున విక్రమించు నవ్వీరవర్యుని శౌర్యబాహువీర్యంబులకు భయంబుఁగొని హతశేషు లయినభూపతులు వఱచినం, బ్రీతుం డగుచు నక్కురుకుమారుండు గన్యారత్నంబుఁ గొని కరినగరంబున కరుగుదెంచె. అప్పుడు మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కమలబంధుపుత్త్రు [2]నెక్కటిపోరికిం బిలిచినం బోయి,— ౩౨

1. ఉత్సాహమున. 2. ఎక్కటి పోరికిన్ = ఒక్కొక్కఁడే చేయు యుద్ధమునకు.

సీ. ఎక్కు టెక్కుటిపోరి యొద్ధదివ్యాస్త్రసం
చయవంతుఁ డగు జరాసంధు బాణ
ధనురాదివివిధసాధనములు దనచేతఁ,
దనయస్త్రశస్త్రసంతాన మెల్ల
నాతనిచే మడియంగ, రథంబులు
డిగ్గి పెంపారెడు [1]నగ్గలికల
నాతండుఁ దాను—బాహాసంగరమునకుఁ
జొచ్చి పెనంగఁగ నొచ్చి, యతని

ఆ. యంగసంధి వికల మగుటయుఁ, బోరు సా
లించి, యతఁడు గారవించి తనకు
మహితవిభవ మైనమాలినీనగర [2]మీ
సధిక తేజ మొసఁగ నరుగుదెంచె. 33

వ. ఈరెం [3]డవదానంబులు నీవును గొంత యెఱుఁగుదు. ఇట్లు ప్రసిద్ధ బలపరాక్రముం డైన కర్ణు నుదీర్ణత్వంబు సెఱుచుటకు నై కవచ కుండలంబులు భిక్షించి పుచ్చుకొని నాకలోకపతి నీకు హితం బాచరించె. దానం జేసి ధనంజయుం డతనిం దెగటార్పం జాలె నని చెప్పి వెండియు, 3౪

చ. వినుము, నరేంద్ర, విప్రుఁ డలిగెన్, జమదగ్నిసుతుండు శాప మి
చ్చె, నమరభర్త వంచనము సేసె, వరంబని కోరి కుంతి మా
న్చె నలుక, భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ, గలంచె మద్రరా
జనుచిత మాడి, శౌరి విధి యయ్యె,-నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్. 3౫

వ. అట్లుం గాక— 3౬

---

1. = రూ. అగ్గలికము = పూనిక; ఉత్సాహము; అధిక్యము; శౌర్యము.
2. = ఈయఁగా.
3. - అవదానంబులు = శ్లాఘచిన పనులు; సత్కృత్యములు.

క. [1]హర [2]సురపతి [3]యమ [4]వరుణులుఁ,
[5]గురు [6]కృపులును దివ్యబాణకోటు లొసఁగుటఁ,
నరుశక్తి, – కర్ణతేజ
స్ఫురణము నార్పంగఁ జాలెఁ జువ్వె నృపాలా. ౩౭

వ. అనిన విని శోకవ్యాకులుం డై యన్నరపతి గన్నీ రొలుక నిట్టూర్పు నిగిడించినం దత్సమీపంబున నున్న కుంతి కనుంగొని యడ లుడుపుట కై యతనితో ని ట్లనియె: ౩౮

చ. "జననముదొట్టి యేఁ దెలుప, 'సత్యము సుమ్ము రకుంతిభాషణం' బని తనుజత్వజాతకృప నంబుజమిత్త్రుఁడు వల్కెఁ; నేమిటఁ గొనకొననేరఁ డయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి! యట్టిక ర్ణునకయి నీకు నేఁటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్త్రకా?" ౩౯

వ. అనుటయు, నవ్వచనంబులు దనకు నసహ్యంబు లైనం గటకటంబడి యద్దేవి నాలోకించి, 'భవదీయమంత్రకార్యగోపనంబునం గాదె యింత పుట్టె!' నని పలికి యంత నిలువక– ౪౦

–ధర్మరాజు స్త్రీలకు రహస్యరక్షణంబు లేకుండ శపియించుట.–

తే. 'అంగనాజనమ్ములకు రహస్యరక్ష
ణంబునందలిశక్తి మనంబులందుఁ
గలుగ కుండెడు మెల్లలోకముల' నని శ
పించె నా ధర్మదేవతాప్రియసుతుండు. ౪౧

వ. ఇట్లు మహాతేజోధనుం డగు నజ్జననాథుం డట్లు శపియించి, కుంతి చేసిన కర్ణగోపనంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడిన కార్యంబులదెస నిగుడం, దనకతంబున మృతిఁబొందిన యుభయ

1. శంకరుఁడు. 2. ఇంద్రుఁడు, 3. యముఁడు, 4. వరుణుఁడు; 5. ద్రోణుఁడు; 6. కృపుఁడు.

పక్షబంధు-మిత్త్రకోటులం దలంచి [1]యుమ్మలించి, విశేషించి కర్ణు
చాపునకుఁ [2]దూర వగచి, విహ్వలించి, వివ్వచ్చునాననం బాలో
కించి యి ట్లనియె: ౪౨

క. 'మన కేటిరాజ్య? మొం డొక
జనపదమున కేఁగి భైక్షచర్యావిధి జీ
వనము నడపికొని యుండుద;
మనఘా, య ట్లయిన సుఖుల మవుదుము సుమ్మీ!' ౪౩

వ. అని వెండియు ౪౪

సీ. జ్ఞాతుల నందఱఁ జంపితి; మదియాత్మ
వధమకాదే! రాజవర్తనంబుఁ
గాల్పు; మహింస, నిక్కము, దాల్మి, మత్సర
వర్జన- మివి వనవాస జనుల
కాగమవిహితంబులఁట! యింత యొప్పునే!
వనమున వసియింప వలయు వింటె!
యసుఖదం బైన[3]రాజ్యామిషంబునకుఁ గు
క్కలభంగిఁ దమలోనఁ గాటులాడి

తే. కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు
బ్రదుకు వచ్చెనె యను వగ పొలువడఁగఁ,
బ్రమద మొసఁగదు త్రైలోక్య రాజ్య మైనఁ;
గాన నే నొల్ల మహి మీర కైకొనుండు. ౪౫

మ. ధృతరాష్ట్రుండు తనూజుకీడు సమబుద్ధిం జూడ, కన్నీచుఁడే
గతిఁ జన్నం జన నిచ్చెఁగాని మగుడం గాఁ [4]దివ్వఁడయ్యెన్! నిరా
కృతశీలుం డగు నా సుయోధనుఁడు సంక్షీణంబు సేసెం గులం!
బతనిం జంపఁగఁ గోప మాఱె; మదిశోకాక్రాంతమయ్యెం దుదిన్!

---

1.=శోకించి. 2.=మిక్కిలి. 3.=రాజ్య + ఆమిషము=రాజ్యలాభము. ఆమిష
ము=మాంసము; లాభము; లంచము; భోగింపఁ దగినవస్తువు.

4.=రూఢిపఱుపఁడు, తిగియఁడు=వా అల్పుఁడు-తివియుట=మఱల్చుట.

వ. "ఆ దుర్జనుండు కర్జం బెఱుంగక దుర్మానంబు వాటించిన
తొలంగ నైతి. రాజ్యపరిగ్రహపరత్వంబు మచ్చిత్తంబునం
జేసి కిల్బిషం బత్యంతంబు నాచరింపవలసె. పరిగ్రహాది
పరిగ్రహత్యాగంబునంగాని పోదు. 'పరిగ్రహత్యాగశీలుండు
మరణదుఃఖంబుల [1]బొరయం' డని శ్రుతులు సెప్పెడు.
సకలధర్మంబులు ననుష్ఠింప శక్యం బగునే? అపరిగ్రహంబు
టన శుద్ధుండ నయ్యెద. మీరు భూమిపాలనపరిగ్రహతత్పరత
వర్ణాశ్రమరక్షణంబు సేయుండు. ఏను గాననంబునకుం జని
సకాశంబున సుఖినై యుండెద." అనిన, విని, యింద్రాంశ
తత్త్వకలితతేజోధనుం డగు నద్ధనంజయుండు, దన [2]యూష్మ
బున నవ్వాక్యంబులు దుస్సహంబు లైనం బదరి దరస్మిత
దద్వికారంబుఁ గప్పి యప్పుడమిఱేని కి ట్లనియె:

—అర్జునుఁడు ధర్మజున కుచితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట

క. ఓహో యిట్టివి గలవే!
బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి, తుదిన్
మాహాత్మ్యం బెడలఁగ భి
క్షాహారత నొందఁ దలఁప నగునె నరేంద్రా?

సీ. ధర్మపథంబున ధరణి సేకుఱినఁ బా
లింపక సత్త్వంబు పెంపు మాలి
విడుచుట యొప్పునే! విను, మిట్టులైన ము
న్నేల భూపాలుర నెల్లఁ జంపి?
తడలి రాజ్యము దక్కి యడవికిఁ జనిన బే
లందురు గాక మే లండ్రె జనులు!
కిల్బిషశంకఁ గల్గిన నశ్వమేధాది
పుణ్యకర్మంబులఁ బోవె? వాశి

1.—పొరయఁడు—పొందఁడు. పొరయుట=పొందుట.
2 =మనస్తాపమున—ఊష్మలత=రోషమున—ఆవేగమున.

ఆ. ధర్మ మొదలఁ గృపణకర్మంబుఁ గోరి; త
ర్థంబు సువ్వె సకలధర్మకారి!
'యొడమి లేనివాఁడ నడపీను' గను నహుఁ
షోక్తి వినమె?-దాని నూఁదవలదె? ౪౯

క. సరిగా నెన్నుదు రార్యులు-
దరిద్రునిం బతితునిం గృతఘ్నుని జడునిన్;
దొరకొను ధర్మముఁ గామముఁ
బరమగతియు నర్థమునన పౌరవముఖ్యా. ౫౦

క. కలిమియ చుట్టలఁ జేర్చుఁ;
గలిమియ చెలులను ఘటించుఁ; గలిమియ శౌర్యో
జ్జ్వలుఁ డనిపించుం; గలిమియ
పలువురు సద్బుద్ధి యనఁగ బరఁగం జేయున్. ౫౧

క. ఏవాని బంధు మిత్త్రులు,
జీవధనంబులును దప్పిఁ జెందును,— కృశునిం
గా వాని నెన్నఁగాఁ దగుఁ;
[1]గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా! ౫౨

వ. కావున నర్థోపార్జనంబును బంధు-మిత్త్రపరితోషణంబును భూ
పతులకుం బరమపురుషార్థంబు; అదియునుగాక- ౫౩

తే. జ్ఞాతి నాశనమునఁ గాదె సకలదేవ
తలు ప్రవర్ధన మొందుట! ధనము, లడిచి
పొడిచి [2]యొప్పనివారిచేఁ బుచ్చికొనక
యడఁగియుండఁగఁ జేరునే యంద్రు బుధులు. ౫౪

వ. వేదంబులు నిట్లు సెప్పు: పృథివి బలువునం గైకొని పార్థివు లర్థంబులుపార్జించి పర్జన్యాదు లగు నాదిత్యుల నధ్వరక్రియాజాతంబునం బ్రీతులం జేసి యుత్తమలోకంబులు వడయుదురు. ఇత్తెరువు వట్టి

1. = కేవలము శరీరము చిక్కిపోయినవాడు కృశుఁడా? 2. = అహితులచే

దిలీప నృగ నహుషాంబరీష మాంధాతలు నడచుట వినమే?
తత్పదవి నీ కొదవి యున్నయది. తదీయప్రకారంబున బహుళ
దక్షిణావిధానంబుగాఁ బ్రభూతం బైనయజ్ఞంబు సేయవైతేనిఁజూవె
నకిల్బిషుండ వగుట! యశ్వమేధంబు సేసినరాజులెల్ల నవభృథం
బునం బరిపూతాత్ము లగుదురు-అని పలికిన నయ్యజాతశత్రుండు-

క. వెడవెడ యప్పలుకులు చెవి
నిడి కొండొకసేపు చింత యెసకంబున పా
ల్పడి యూర కుండి, చిత్తం
బడలునఁ జిక్కువడ నిట్టు లను నర్జునుతోన్: ౫౬

క. సేమపుఁబెరు వొక్కటి గల;
దే మెచ్చితి దాని; నడుగు మెయ్యది యని; సు
త్రామసుత, యడుగ కున్నను
నేమి? వినుము, చెప్పెదను మునీంద్రుల కెక్కన్. ౫౭

సీ. సారహీనము లగు సంసారసుఖములు
విడిచి యేకాకి నై యడవి కేఁగి,
తాపసవాక్యామృతములు వీనులఁ గ్రోలి
[1]చెలిమి-వేర్పా టనుచిరమరలకుఁ
జొరక, నిందాస్తుతుల్ సరిగాఁ గొనుచుఁ, గత్తి
నొకఁడు వేసినను, వే ఱొక్కరుండు
చందనం బలఁదిన డెంద మయ్యిరువుర
యెడ సమంబుగ,-మూఁగ జడుఁ డనంగ

తే. మెలఁగి, తగువేళఁ బర్ణశాలలకు నరిగి,
యెత్తగా భిక్ష యెవ్వార లెట్టు లేమి
యిడినఁ గైకొని, నాలుగే నెడల మాత్రఁ
గన్నదానఁ దృప్తుండ నై యున్న మేలు. ౫౮

---

1. = స్నేహము వైరము అను భేదములకు,

క. అట్టు గాక కర్మగతిలొం
పటుఁడ నగుదు నేని నల్పఫలభాగితమై
నట నిట దిరుగుచు మోక్షుని
కటవృత్తికి బాహిరుండ గానె కుమారా! ౫౯

వ. కావున నాకు దొరకొన్న విమలప్రజ్ఞామృతం బనుభవింపక
తక్కుదునే! ఇది శాశ్వతపదప్రదంబు—అనిన విని, యనిలతనయుం
డతని కిట్లనియె: ౬౦

క. శ్రుతివిహితకర్మజాత
స్థితి యోగ్యుఁడ వైన నీకుఁ, జేయఁగ వశమే
యతిలోకజ్ఞానసమ
న్వితయతిజనకృత్య!—మటు వివేకింపు మదిన్. ౬౧

చ. అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు ని
ప్పుడు; మును నిస్పృహుండ వయిపోవఁగఁ గన్నఁ, గులంబువారు ని
ప్పుడమినృపాలురన్ బ్రదికిపోదురు నెమ్మది; నట్టులైన నే
ముడుగుదు మస్త్రజీవనసముద్ధతిఁ; జొత్తుము భైక్ష్యవృత్తికిన్. ౬౨

క. వాఁడి యగునలుక లోకము
పోఁడిమి సెడఁ గయ్య మట్లు వోడిచి, వనటమై
నేఁ 'డింక నడవికిం జను
వాఁడంగా' ననినఁ బుడమివారలు నగరే! ౬౩

సీ. పనివడి త్రవ్వి కూపమునందు నుదకంబు
పానంబు సేయనివానిభంగి,
యున్నత తరు వెక్కి జున్ను సేకుఱఁ గొని
తేనియ యానని వానిభంగి,
యాఁకొని యొడఁగూర్చి యన్నంబు [1]దళియకు
వచ్చిన గుడువని వానిభంగి,

1. రూ. తళిగ=భోజనపాత్రము—తెల్ల—దేశ్యము.

తమకించి యొకభంగిఁ దనవశంబుగఁ జేసి
మానినిఁ గవయనివానిభంగిఁ—

ఆ. గాదె, కురువరేణ్య, ఘనశక్తి శౌర్యసం
పన్నులైన పగఱ భండనమున
[1]నోర్చి పూజ్యరాజ్య మొల్లక యడవికి
నేఁగ!— టీవ యెఱుఁగు దిత్తెఱఁగు! ౬౪

క. నీ వడవి కరుగ నోడఁబడి,
నీవెనుకన వచ్చునపుడు నిందింతురు మ:
'మ్మీ వెఱ్ఱు లితని మాన్పం
గావలఁతులు గార' యని జగజ్జను లధిపా. ౬౫

క. భోగములఁ బాపి నిందా
భాగులఁగాఁ జేసి, యడవి పాల్పఱచెదవే
నీగారవంపుఁ దమ్ముల
సాగరవృతధరణిఁగలుగు జనములు వగవన్! ౬౬

వ. అని వెండియు, ౬౭

క. కేవలనిష్కర్మత పెరా
త్మావహ మగునేని, గిరులు నవనీజములున్,
భూవర, ముక్తిం బడయం
గావలవదె!-యడవి మునికిఁ గైవల్యద మే! ౬౮

క. [2]ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్
వలయుం; దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశమమ్ము దానై కలుగున్. ౬౯

వ. కావునఁ గర్మహీనత్వం బపవర్గకరంబుగాదు— అనవుడు, అర్జునుండు ధర్మనందను నుద్దేశించి, 'దేవా, యొక్కయితిహాసంబు గల దవ ధరింపు' మని యిట్లనియె: ౭౦

1. గెలిచి. 2. చూ. భీష్మ: అ ౧ వ ౭౦.

సీ. కొందఱు బ్రాహ్మణుల్ [1]గొండుక లాత్మకు
లోచితాచారంబు లుడిగి, కాన
లకుఁజన్న, వఱ్ఱి వారికిఁ గృపఁజేసి, [2]ప
త త్త్రిరూపమునఁ దత్పార్శ్వమునకు
నరిగి, 'మీ కైకొన్న తెరు వొప్పు' దనువుడు,
విని వా 'రఖిలమార్గ వేది, యద్భు
తాస్పద మీపక్షి' యని దాని కభిముఖు
లై 'సత్పథం బెద్ది, యనఘ, చెపుమ'

తే. యనిన, '[3]నలుగాలివాన గోవును, నశేష
శబ్దముల మంత్రమును, లోహ జాతిఁ గాంచ
నమును, మనుజుల విప్రుండు—సమధికత్వ
భాజనము లంద్రు వేదప్రపంచవిదులు. ౭౧

వ. ఇట్లుత్తముం డైనవిప్రుం డుత్తమమంత్రోపాశ్రితంబు లగువిహిత
కర్మంబులు నడపుట, రత్నకాంచనసాంగతంబును [illegible]
బై యుండు. [4]ఆలస్య
విడుచుట పాతకంబు. అజ్ఞాను లగునర్థహీనులు [illegible]
కంబులేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు. గృహస్థధర్మ
వర్తించి యతిథి దేవ పితృ సంతృప్తి సేయుచు శిష్టాన్నభోజనులు
లగు పుణ్యులకుం బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె! బ్రహ్మా
ర్పితంబయిన సత్కర్మకలాపంబు మహానందంబుఁ జేయు'-ననుటయు,

క. విని వారు దెలిసి, మరలం
జనిరి గృహస్థత్వధర్మసదనుష్ఠానం
బునకు; నటు లగుట, నేలుము
జనవల్లభ, పుడమి; నడపు జన్నము లెలమిన్- ౭౩

1. = కుఱ్ఱలు. 2. = పక్షిరూపమున. 3.=నాలుగు కాళ్ళుగలవానియందు-చతు
ష్పాత్తులయందు—చూ. అశ్వ ౬ ౪; ప ౧౮౧. 4. = అలసత్వమున; సోమరితనమున.

వ. అని చెప్పె. అప్పుడు నకులుం డన్నరనాథున కిట్లనియె: ౨౪

— నకులుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట. —

సీ. దేవతల్ వేదవిధిప్రవర్తకులు; బ్రా
హ్మణులును వారలయట్ల శ్రుతుల
కింకరులై కాదె కిల్బిషంబులఁ బాసి
వారిచందమున శాశ్వతవిభూతి
నొందుట! యజ్ఞాదు లుడుగుట సంపరి
త్యాగమే,—పాడిమై నర్థముల ను
పార్జించి దేవతాబ్రాహ్మణపూజగా
నిడుచుఁ దత్ఫలకోటి విడుపు గాక!
ఆ. క్రోధ శోక హర్ష కోటుల గృహములో
విడిచి, యోగ మూఁది, వృక్షమూల
వాసనిరతి నుండు వాఁ డొక సంపరి
త్యాగి;—నృపుల కది సమర్థ మగునె! ౨౫
క. తక్కిన మూఁ డాశ్రమములు
నొక్క దెస, గృహస్థధర్మ మొక దెస, —తులయం
దెక్కింప, వానితో న
య్యొక్కటి సరిదూఁగె నందు, రుర్వీశ, బుధుల్. ౨౬
వ. కావున గృహస్థధర్మంబె యాచరణీయంబు; అట్లుం గాక- ౨౭
క. జతనంబున నర్థము సం
చితముగఁ గావించి క్రతువిశేషంబుల దే
వతలం దృప్తులఁ జేయుమి
యతికిల్బిషకారియందు రాగమ వేదుల్. ౨౮

తమోమయం బయిన విశ్వముఁ దా వెలిఁగించు నీశ్వరుం
డన న తఁడయ్యెడుఁ వర్ణతతి, నాశ్రమకోటిని వాఁడు గాదె చే

నె? నిఖిలకర్మయోగ సవిశేషత గల్గుటయుం దదీయక
ల్పనము; తదాజ్ఞకుం దొలఁగఁ బాడియె శోకము గారణంబుగన్!

వ. హింసం దోషంబుగలుగు ననుశంకకుం బనిలేదు. అవధరింపుడు-

క. పరుల వధింపక యెవ్వఁడు
ధరయేలెం జెపుమ పూర్వధరణీశులలోఁ!
బొరయరు పాపము, సుగతిక
యరిగిరి వా; రీవు నట్లయగు టొప్పు నృపా. ౮౧

క. రక్షప్రజ గోరు నిజయో
గక్షేమార్థముగ; జన సుఖస్థితి నడప౯
దక్షుఁ డగురాజు నడప కు
పేక్షించినఁ బాప మొందదే కురుముఖ్యా! ౮౨

తే. గోవులను ఘోటకంబులఁ గుంజరముల
దాసులను బ్రీతిని; మెల్ల ధాన్యములను
గ్రామముల మందిరముల [1]నిష్కముల వేడ్క
నొసఁగు–తత్తత్సు పాత్రత్వయుక్త విధుల. ౮౩

వ. 'వీని నిన్నింటి రిత్తవో విడిచి, పోయెద' ననుట నీయట్టి మహాను
భావునకుం దగునే!' యని పలికినం, దదనంతరంబ సహదేవుం
డమ్మహీపతి కిట్లనియె: ౮౪

సీ. వెలివెలి వస్తువుల్ విడిచెఁ బో నరుఁడు గ
ర్మిష్ఠతం గాదె శరీరయాత్ర
నడపువాఁ! డది మోక్షణంబు గా నేరదు;
శారీరసౌఖ్యసంసక్తి వదలి,
బాహ్యపదార్థముల్ పాటించి, నిజవంశ
ధర్మములు వదలక తగఁ జరింపు,
మమత బంధంబు, నిర్మమత మోక్షంబును
జేయు; నింత యెఱింగి చేసి, రథిప,—

1.=మాడలను (బంగరు నాణెముల.)

తే. రాజ్య మెలమి మన్నాఁడు; లరణ్యమునకు
నరిగి నీ వందు వలయుద్రివ్యములమీఁదఁ
జేయవలదె మమత్వంబు! వేయు నేల
యదియు సంసారచక్రవాహకముగాదె! ౧౫

తే. నీవ చుట్టంబుఁ బక్కంబు నీవ చెలియు
నీవ తల్లియుఁ దండ్రియు నీవ గురువు
నీవ దైవతమవు గాన, నావిషాద
భాషణంబులు సైరింపు భరతముఖ్య. ౧౬

క. తథ్యము లైనను, దలఁప న
తథ్యము లైనను, సభక్తితాత్పర్యము లై
తథ్యంబుఁ బొరయ కుండఁగఁ
బథ్యంబుగఁ గొనుము నాదుపలుకులు కరుణన్- ౧౭

వ. అనియె. ఇట్లు దమ్ము లందఱును బోధించుపలుకులు విని ధర్మనంద
నుం డూరకయుండె. ఆతనియెడ సవిశేషబహుమానయు, నతని
చేత సంతతోపలాలితయు, ధర్మాధర్మనిదర్శనశీలయు నగు
పాంచాలి, భద్రగజప్రతిమాను లైన యప్పవమానతనయ ధనంజయ
నకుల సహదేవుల మధ్యంబున యూథపతివోలె నున్న యన్నరేంద్రు
నల్లన చేరి, 'యేనును నా యెఱింగినంత సెప్పెద' నని యనుజ్ఞఁగొని
యవ్విభువదనంబున నిజవిశాలలోచనరోచులు పరఁగ వినయం
బానసంబున నతిశయిల్ల,- ౧౮

—◆ ద్రౌపది ధర్మరాజునకు హితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట ◆—

సీ. "శోకాగ్ని దనికిన సొగయునీతమ్ములు
నుపపన్న వాక్యామృతోపయుక్తిఁ
దేర్పుము; గానలం ద్రిమ్మరునాఁడు, వీ
రాయాసములఁ బడు టవధరించి,

'[1]సమయకాలమునన్నఁ జని సుయోధనుఁ జంపి
భోగంబులను బహుత్యాగములను
యాగంబులను సద్విహారముల్ సలుపుద'
మని యూరడింపవే! యరిగణంబుఁ

తే. దుంచి, రాజ్యంబు చేకొంటి;-'తొలఁగి పోదుఁ
గాక' యని యుప్పు డుడికింప నీకుఁ దగునె!
ధర్మమును సత్యమును మచితంబు నిన్నుఁ
గడవ నెఱిఁగెడువారలు గలరె యధిప! ౮౯

వ. అని మఱియు నాడి మఱియును, ౯౦

క. పేదమన సగుట ధర్మవు
గాదు నరేంద్రునకు; జగము గావం బ్రోవం
గాదె నృపు లోకపాలాం
శోధితుఁ గాఁ జేసెఁ బద్మయోని చతురతన్! ౯౧

క. నరరూపంబునఁ బరఁగెడు
పరదేవత గాక నృపుఁడు బాలుఁ డయిన న
ప్పురుషు నెడ నేమి వో మ్మని
తిరిగినదుర్మతులఁ బొందదే కీ డధిపా? ౯౨

ఉ. నేరక చేర నొక్కనిన నీఱుగఁ జేయుఁ గృశానుఁ; డిద్ధధా
తీరమణాగ్ని గాల్చు నతితీవ్రత వంశము నెల్ల; నిట్లుగాఁ
గౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దు
ర్వారభవత్ప్రకోపశిఖఁ గ్రాఁగె; మదిన్ వగ పేల దీనికిన్? ౯౩

సీ. నృపునందు విధి దండ నీతి ప్రణిసించెఁ
గావున, నపగాధగతి మొఱంగి
దండించునృపతికి రెండులోకంబులుఁ
జేకుఱు; దోషంబు సేయ, నుదుట



1. ప్రతిజ్ఞఁగొన్న గడవు చనఁగా...

న చొప్పెత్తి వెడలంగ నడుచు విప్రునినైన
భూవరుం; డిది మెచ్చు దేవకోటి;
సభ కేకవస్త్ర రజస్వల యనక నకఁ
దల వట్టి యీడ్చినతప్పుం, దనదు

తే. తొడలు సూపినతప్పును, దుష్టకష్ట
తరవచనములఁ బలికినతప్పు, ననుజు
నందు దుర్యోధనునియందు ననుఁగునందుఁ
గాంచి దండించి;—తిట్టిది కల్మషంబె!

క. [1]గరదుని, గృహదాహకు, మం
త్రరహస్యవిభేది, వధవిధాయిఁ, బరసతీ
హరు, బంధుఘాతిఁ, బరధన
హరణపరునిఁ జంపి పుణ్యుఁ డగు నృపుఁ డనఘా.

క. దండార్హు లైనవారల
దండింపకయున్నఁ జువ్వె ధాత్రీవిభు, నా
ఖండలసన్నిభు డైనఁ, బ్ర
చండపుఁ గిల్బిషము వొందు జగతీనాథా!

క. పేదలకును, సాదులకును,
వేదములకుఁ, దాపసులకు వేయేల!—సమ
స్తాదిత్యులకును దండమ
కాదె బ్రదుకుఁ జేయు రాజు గావింపంగన్!

వ. కావున,

1. విషము బెట్టువాని, కొంప లంటించువాని, రాజకార్యాలోచనసాదిరహస్యములను వెల్లడించువాని, చంపించువాని, ఒరుని ఇల్లాలిని హరించువాని, బంధువు హింసించువాని, పరులధనము నపహరించుటయే వ్యాపారముగాఁ గలవానిఁ – చ రాజు పుణ్యుఁ డగును.

ఆ. ఉచితదండవృత్తి నుర్వీప్రజాభిర
　క్షణము నోపి చేతఁ గాక, రాజ
　వంశజునకు ధర్మవా భూసురార్హంబు
　లైన శమదమాదు లాత్మ నిపుట! ౯౯

వ. అని యంత నిలువక చనవు మెఱసి మేలంపుఁజందంబున— ౧౦౦

ఉ. వైదికధర్మచారిజనవత్సల, నీమదిఁ బట్టుకొన్నయు
　న్మాదము, హీనమానవుమనంబునఁ బుట్టిన వెట్టివోలె, న
　న్యాదులఁ దీర్చు టొప్పుదు; నిజానుజవర్గముమీఁదఁ గల్గున
　త్యాదరసాంద్రసారకరుణామృత మానఁగ నిమ్ము నెమ్మదిన్. ౧౦౧

వ. అని పలికి యి ట్లనియె: ౧౦౨

క. నా యట్లు వడినయంగన
　లే రెుడలం గలరె! యిట్టి యేనును ధర్మా
　పాయము నీ కగు నను వెఱఁ
　బాయన గృహధర్మవృత్తిఁ బౌరవముఖ్యా. ౧౦౩

వ. అని వెండియు, ౧౦౪

క. కౌరవులు దమదురితమునఁ
　దా రెరిసిరి; కల్మషంబు దానఁ గలదె? భూ
　భారము వహింపు, బహుయ
　జ్ఞారంభణ మాచరింపు మఖిలహితముగన్. ౧౦౫

క. సురగురుఁడును శుక్రుండును
　బరిపాటిగ దండనీతిఁ బలికిరి; దానం
　బరిణతుఁడవు నీ; వనుజులు
　పరికరముగ నడపు, ధర్మభూసుర, దానిన్. ౧౦౬

వ. అనినం బాంచాలితో మఱుమాట లాడక యున్న యన్నరేంద్రు
　నకు నింద్రనందనుం డి ట్లనియె: ౧౦౭

సీ. దక్షుఁడై భూపతి దండనీతి నయింప
కున్న, సన్న్యాసులు [1]నుత్పథప్ర
వర్తను లగుదురు, వావిరి నన్యోన్య
ధన ధాన్య పశు భూమి దారహరణ
మాచరింతురు జను; లప్పాప మవ్విభు
నొందు; దండము హింసయుఁగాఁ దలంప
వలదు; దుర్వృత్తుల వధియించు రుద్రుని
గోవిందు వాసవు గుహునిఁ జూడు;
తే. మామహాత్ములు దక్క నున్మార్గచరుల
దండితులఁ జేతఁ వినమె! యధర్మ మడఁగు
ధర్మ మెసఁగు దండమున నర్థంబుఁ గామ
మును నదూష్యంబు లై సిద్ధి బొందు నధిప. ౧౦౭

వ. దండంబున సకలజనశ్రీరక్షణంబు సేయం బూనినభూనాథునక యేల!— యోగ్యహింసకుం దొలంగ నెట్టివారికి వశంబు గాదు. అవధరింపుము: ౧౦౮

ఉ. కాయలఁ బండ్ల నీళులను గల్గవె సూక్ష్మపుజంతువుల్? – మునుల్
సేయరె హింస వాని! నుపజీవితఁ ద్రవ్వరె గందమూలముల్!
[2]నీయెడఁ జూడు! ప్రాణములు నిల్వఁగ నేర వహింస నేరికిన్;
వేయును నేల!— భక్ష్యముగ [3]వేధ విధింపఁడె ప్రాణిఁ బ్రాణికిన్?
క. విను, పశుహింసాకృతయా
గనిరూఢుని ధర్మపరునిఁగా వేదంబుల్
గొనియాడెడు సముచితహిం
సన మరయ నహింస గాన జగతీనాథా. ౧౧౧
క. అరివీరుల ఘోరం బగు
దురమున వధియించు టేల దోసం బయ్యెన్?

1.=తప్పుత్రోవ నడతురు. 2.=నీమనస్సును 3.=బ్రహ్మ.

ధరణీశ, పాండుపాలిత
ధరావలయ మాసపడుటఁ దగదే నీకున్? ౧౧౨

క. ఇల నీ వైకొన్న తెఱఁగు
దలఁపఁగ ధర్మంబొ కాదొ దైవం బెఱుఁగున్;
వలవనిచింత యుడిగి ధృతి
దలకొని పాలింపు యజ్ఞదక్షుఁడ వగుచున్. ౧౧౩

క. అని పలుకు పార్థుపలుకులు
విని, పలుకక యున్న మనుజవిభు దెసఁ గోపిం
చిన తనమది వెడఁ గుడుపుచు
ననిలసుతుం డిట్టు లనియె న్నాతనితోడన్: ౧౧౪

ఉ. నీవు సమస్తధర్మపరినిశ్చయవేదివి; నీచరిత్ర మే
మే, వసుధేశ, వంక యని మెచ్చక చక్కఁగఁ జేయువారమే?
ఈ వచనప్రపంచమున కింకఁ జొరం జొర నంచు నుండియున్
వావిరిఁ జెప్పఁగా వలసె వాలినదుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్. ౧౧౫

వ. అవధరింపుము- ౧౧౬

క. ఒకఁగూడిన సామ్రాజ్యము
నడలున దిగఁద్రావి చనిన నఖిలజనులు నిన్
'గడుఁ బేదమనసువాఁ' డని
సెడ నాడుదు రనిన, మము 'నిసీ!' యను టరుదే! ౧౧౭

ఛ. కపటద్యూతమునం బరాభవముఱాఁగా, సూనృతం బూఁది, భూ
మిప, మమ్ముం జులుకంగఁ జేసి, నినుఁ బేర్మిం బాపికొంచున్ దురం
తపుదుఃఖంబుల కోర్చి పోఁడు; తది, యుద్ధక్రీడ నప్పాప క
ర్మపుజాతిం దెగటారఁ జేయఁగఁ, బ్రకీర్త్యం బయ్యె లోకంబులన్.

వ. దుర్జయు లగువిరోధుల నిర్జించి యుపార్జించిన పృథివీప్రముఖపదా
ర్థంబులు నిరర్థకంబులు సేసి వనంబునకుం జనుచులుకఁదనం బేమిటం
బాపికొనువాఁడవు? అట్లుం గాక, ౧౧౯

సీ. ఆ సభలోఁ బడినట్టి [1]బన్నంబును,
నడవులఁ దిరిగెడునపుడు దుష్ట
దైత్యులచేత సైంధవునిచే [2]నోఁఋపులఁ
బడ్డవిషాదంబుఁ, బరమదైన్య
మునకోర్చి కొలిచె మాత్స్యునిపాల నున్నదుః
ఖంబును, ద్రోహులఁ [3]గనుపుగొట్టి
వెలువరించెద నని తలఁచి, కృష్ణుని నిశ్చ
యం బూఁది, ధర్మంబ యగుటఁ దెలిసి,

తే. రణ మొనర్చితి. నిను ధార్తరాష్ట్రు లొండె,
నీవు వారలనొండెను జావఁ జూడ
వలయు టప్పు డెఱుంగవే వసుమతీశ?
యిప్పు డడలుట నింద్యంబ యింత నిజము. ౧౨౦

క. పను లేమి సేయఁగా దు
ర్జనులం జెఱుచుచును సాధుజనుల మనుచుచున్,
జననాథ, మహాయజ్ఞము
లొనర్చుచును వెలయు కురుకులోత్తంస మవై. ౧౨౧

వ. అనిన విని ధర్మతనయుం డిట్లనియె: ౧౨౨

చ. మదమును రాగమున్ భయము మానము లోనగుకిల్బిషంబులన్
హృదయముఁ జొన్పి భూజనుల నేలుట మే లని పల్కెఁ; దార్తికా
స్పద మని రాజ్య లోభిమముపై తగు; లిమ్మహి యెల్ల నేలినం
దుది నరకం బొకండ; నృపతుల్ సుఖులే! యుపశాంతి యెప్పుడే!

తే. కామభోగముల్ మేలనఁ గాదు; వాని
విడిచి మూఢుము పొందెడు విపులసుఖము;
కాయ లాకులు నీళ్లును గాలి యనుభ
వించి యున్న మునీంద్రులు వెఱ్ఱివారె! ౧౨౩

1. అవమానము, ఆపద. 2.=చిక్కుల 3.=భంగపఱిచి.

క. దుర్మతు లామిషగత మగు
కర్మము వాటించి బంధకలితు లగుదు; ర
[1]యూర్మి గడచి సువిచారులు
నిర్మమతను ము_క్తి వడయ నేర్తురు వత్సా. ౧౨౫

వ. జనకుని వచనంబులు వినమే వాని నేనుం జెప్పెద నాకర్ణింపుము—

ఆ. 'ఒకటిదెసను దృష్టి యొలయదు గావున
నేమి యర్థములును లేమి లేదు;
కాలఁ జొచ్చె మిథిల;—గాలదు నాకు నం
దొక్కఁ డైన; నింత నిక్కువంబు.' ౧౨౭

క. అని పలుకుజనకుఁ దెగడిరె
జను! లుల్లము శాంతిఁ బొంది, సంసారం బా
ల్లనివాఁడు నింద కర్హుం
డని పలుకుట నీక యొప్పు నధికవిచారా. ౧౨౮

తే. వినుము, ప్రజ్ఞాధిరూఢుఁ డై వనటఁ దక్కి,
సంసృతిక్లేశపరుల,— భూస్థలిఁ జరించు
వారి నచలంబుపై నున్నవాఁడు సూచు
నట్లు,—చూచుటసూవె నే ర్పమలహృదయ! ౧౨౯

—♦ జనకున కతనిసతితో నైన సంవాదం బర్జునుఁడు ధర్మజునికిఁ జెప్పుట ♦—

వ. అనిపలికి మఱి పలుకకున్న యప్పుడమి తేనికిం గవ్వడి యి ట్లనియె:

క. జననాథ, నీదు సెప్పిన
జనకనృపాలునకు, నతివిశదమానస యా
తనిభార్యకు నీక్రియ న
య్యెను సంవాదంబు; దాని నేర్పడ వినుమా. ౧౩౧

వ. అమ్మహీపతి పూజ్యరాజ్యంబు విడిచి భిక్షావృత్తికి వెడలఁ జూచినం
దదీయభార్య యతని కి ట్లనియె: ౧౩౨

---

1=అల; కెరటము; తరంగము.

సీ. పుడమి యేలుట డిగ్గవిడిచి భిక్షార్థివై
పోయిన, నతిథిసంపూజనంబు,
దేవతర్పణ పితృదేవతర్పణములుఁ
గలుగునే? కాషాయములు ధరించి
[1]ముండుఁడైనతఁ డన్నమునకు గృహంబుల
కరుగక యున్నె? గృహస్థుఁ డెల్ల
వారికి నన్నంబు గారుణ్యమునఁ బెట్టు;
నన్నదానము సేఁత యధికధర్మ

ఆ. మనుట వినమె! పెట్టునతనిఁ, జే యొడ్డెడు
వానిఁ దలఁప, నందు వరుఁడు పెట్టు
వాఁడ యగుట నిక్కువం; బింత సూడక
యిట్లు దీనవృత్తి కేఁగఁ దలఁతె? ౧౩౩

క. [2]త్రైవిద్యు లగుమహాత్ములు
నీవలనన బ్రతుకఁ దలఁప, నిష్క్రియతమెయిన్
నీ విందఱఁ జెఱిచెద; విది,
దేవా, ధర్మంబు గాదు; దీని నుడుగవే! ౧౩౪

తే. అధిప, మీతల్లియుల్లంబు [3]నడలువెల్లి
ముంచి, సతి శోకసంతాపమూర్తిఁ జేసి
వంశవిహితధర్మంబుల వదలి, వెడలి
పోయి యేగతిఁ బొందెదవో యెఱుంగ. ౧౩౫

క. చలిపందిరి చందంబున,
ఫలభరితం బైన తరువుభంగిఁ, [4]బ్రజలడ
ప్పులు దీర్ప నమరి యుండెడు
నలఘుచరిత్రునకు లఘుత యగునే కోరన్! ౧౩౬

వ. ఇది ధర్మవిరోధంబు. దీన మోక్షంబు గలుగు ననుట నాకుం జూడ

---

1=బోడితలవాఁడై. 2=తా. వేదత్రయం దెలిసిన వారగు మహాత్ములు నీవలనన బ్రదుకఁ దలఁపఁగా నీవు కర్మములను జేయని వాఁడవై యిందఱను జెఱిచెదవు. 3=దుఃఖసముద్రమున. 4=ప్రజల పరితాపములు. దప్పి-రూ. దప్పి=నీరువట్టు:పరితాపము.

సందియంబు లన్ని చెప్పె. అనవుడు, న య్యజాతశత్రుండు పురు
హూతపుత్త్రున కి ట్లనియె: ౧౩౭

మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ వినుతించున్, నిష్క్రియత్వంబు స
ద్గతిఁ గావించుట యూఁది చెప్పు; నిటుచిత్తప్రక్రియన్ రెండుఁ జో
దితముల్; వానిని [1]వింటి మన్న కలుచన్ దీపించునే తత్త్వసం
గతబోధంబు! సుకర్మతం గలుగు నాకం బాత్తవీరవ్రతా. ౧౩౮

తే. తత్త్వబోధంబు గలుగు నతండు నన్నుఁ
దెగడ నేరఁడు; నీవు 'భ్రాతృత్వసాహ్య
దమునఁ గర్మంబు విడుచుటే ధర్మ' వనిన
పలుకు ప్రియము జగన్న్యాయపథము గనుట. ౧౩౯

సీ. [2]వడముడియును, నీవు: వాయు-వాసవుల శ
క్తులు ధరియించిన దుర్జయులరు;
హరికరుణాతిశయమునఁ, దత్తేజంబు
మీయందుఁ దగ సంక్రమించియుండు;
మీరు సంగరశాస్త్రసారపారగులరు
గాక, తత్త్వజ్ఞానఘనమతులరె!
[3]యనఁటికంబమునట్ల యనిరి నిస్సారత
సంసార మనఁగ నిస్సంప్రబుద్ధు;

తే. లది ప్రసిద్ధము; విను, తృష్ణ యడఁచి, కర్మ
వృత్తి విడిచి, నిరాలంబచిత్తుఁ డైన
యాతఁడో సుఖి, దోషదుఃఖాకరంబు
లగుధనంబులు గోరెడు నతఁడో, చెపుమ! ౧౪౦

---

1=వింటిమి అనినమాత్రమున తత్త్వముంగూర్చిన జ్ఞానము ప్రకాశించునా?
2=భీముఁడును, (అర్జునుఁడవు) నీవును వాయువుయొక్కయు ఇంద్రునియొక్కయు శక్తులను ధరించినవారు; గెలువరానివారు. 3.=సంసార మనఁగ అరఁటికంబమువలె నిస్సారత అనిరి ఆత్మజ్ఞానమున మేల్కొన్నవారు.

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రముల యర్థము లారఁగఁ గ్రోలి, తత్త్వసం
వేదసుధారసంబునఁ జవిం జిరసౌఖ్యముఁ బొంద నేర, కి
మ్మేదిని నెందునుం దిరిగి, మే లని కర్మము చెల్లఁ జెప్పుచుం,
గా దని శాంతియొప్పునిదిగాఁ జెడనాడుదు రల్పబోధనుల్. ౧౮౧

క. విమలజ్ఞానులు: శమమును
దమమును ద్యాగంబు శాశ్వతప్రచురానం
దమునకు మూలము లందురు; ని
జముగాఁ గైకొందు రవి ప్రసన్నవివేకుల్. ౧౮౨

వ. అనిన విని దేవస్థానుం డమ్మానవపతి కి ట్లనియె: ౧౮౩

—♦ దేవస్థానుం డనుముని ధర్మజునకు హితోపదేశంబు సేయుట. ♦—

సీ. ధనము లుత్కృష్టంబు లనుధనంజయుమాట
పాటిగాఁ గొనుము; సోపానభంగి
నున్నది మార్గంబు యోగసమారోహ
ణమునకు; దానన నడచి కాక
వడి నుల్కి పడ నీకు వచ్చునే! ధనసంగ్ర
హంబు భోగార్థకృతంబు దుష్ట
మగుటయుఁ గలదు; యజ్ఞార్థకృతం బైన
నదియ నిచ్చెన బ్రహ్మ పదము నొంద;
తే. యజ్ఞపరిశిష్టధనభోగ మాత్మకలక
యుడుపు; నమ్మెయి శమదమయుక్తిగలుగు;
శమము దమమును దత్త్వవిజ్ఞానదములు;
గాన దక్షిణాధికయజ్ఞకర్త వగుము. ౧౮౪

చ. హరుఁడును సర్వమేధ మనుయాగమునం బ్రచురప్రకాశతం
బొరయఁగ వేడ్కఁ జేసె; విధి పూర్వదిగీశముఖామరుల్ మహా
ధ్వరములఁ గాదె పేర్కొనుట! ధాత్రి సధర్మత నేలి, యజ్ఞత
త్పరత వెలుంగరే నృపులు, పార్థివముఖ్య, మరుత్తముఖ్యులున్!

వ. వినుము, దివస్పతి యడుగ బృహస్పతి సన్మార్గనిర్దేశకుం డై చెప్పిన మార్గంబు: ౧౪౬

ఉ. 'కామముఁ గ్రోధముం మనసుగాడఁగఁ బారుటమాన్చి, యింద్రియ
స్తోమవిమార్గవర్తనము ద్రుంచుచు, నెవ్వగ లేక, రక్షణం
బేమఱ, కెవ్వరిం జెనకి యించుక నొంపక, లోక మేలఁగా
నా మహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు వాసవా.

వ. అనియె. మఱియు నాకర్ణింపుము- ౧౪౭

ఉ. [1]కర్మము మేలు నా, విగతకర్మము మేలన రెండు నొప్పునే!
కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁ [2]జేత స
ద్ధర్మము [3]గా కనంగ వివిధం బగు ధర్మపథంబులోన మేల్,
ధార్మికవర్య, యేర్పఱుపఁ దా వసమే వగ బుద్ధి గుందఁగన్? ౧౪౯

ఉ. కావున, సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక, ద్రోహ మెయ్యెడ
న్నావిరిఁ జేయ కేలు భువనంబు భవత్కులధర్మరక్షి వై;
భూవరు లిట్లు సేసి, తుదిఁ బుత్త్రుల గద్దియలందు నిల్పి కా
దే వనవాసు లైరి దృఢదీప్తనిరంజనబోధసంపదన్! ౧౫౦

వ. అనిన విని నిర్విణ్ణమానసుం డై యున్న యన్నకు నర్జునుం డి ట్లనియె: ౧౫౧

సీ. క్షత్త్రియధర్మనిష్ఠాపరత్వంబున
సమరంబు సేసితి; శస్త్రనిహతిఁ
బూతాత్ములై రిపుల్ వోయిరి సద్గతి;
కమ్మంబు రాచకర్మ మ్మొనర్చు
విప్రున కైనను సుప్రశస్తం బది
కాదె? యెంత యగుటు;- బాలురకును దెల్ల
మైనను ని ట్లుండు నార్యోక్తి; నృపనీతి
దురితంబు సేయునే! యొరుఁడు వెట్టఁ

1=కర్మము మేలు అనన్. 2=చేయుట. 3—గాక అనంగ=అగు ననఁగా.

ఆ. గుడువ నృపతి మాత్రికునకును గా దన్నఁ,
గౌరవాన్వయాగ్రగణ్యుఁ డైన
నీకుఁ దగునె? విడువు శోకంబు; వజ్రస
న్నిభముగాదె నృపుల నెమ్మనంబు! ౧౫౨

వ. అట్లుంగాక— ౧౫౩

ఉ. వైరివధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరాని దై
వైరులకున్ భవత్సమరవాంఛన సద్గతి కేఁగఁ బాలి దై
చేరె విధాతృ సంఘటనఁ; జింతకుఁ గారణ మేమి? ధర్మవి
స్తారవిధుండ వీ, వకట ధైర్యసముగ్రుఁడ వై వెలుంగవే! ౧౫౪

వ. రాజధర్మోపాత్తం బై భవదాయత్తం బైనపూజ్యసామ్రాజ్యంబు
బరిపాలించుచుఁ బుణ్యక్రియానుష్ఠాన పరుండ వగుము—అని పలికిన
మఱుమాట వలుక కున్న యన్న రేంద్రునకు మునీంద్రవర్యుం
డగు పారాశర్యుం డి ట్లనియె: ౧౫౫

సీ. అర్జును పలుకు సత్యంబు సమీచీన;
మార్యజనంబు గృహస్థధర్మ
ముత్తమం బని చెప్పు; నుర్వీశ, పశుపక్షు
లాదిగా జీవుల కాశ్రయంబు;
నృపులకు నది దక్కఁ దపమును దమమును
బ్రహ్మచర్యమును ధర్మములు గా;
ధనములఁ దనియుట, [1]యని కోహటించుట,
ప్రజల రక్షింపమి,—రాజకోటి

ఆ. కరయఁ బాతకంబు లంద్రు; నీ వక్కట!
వేదచోదనాప్రవీణ మయిన
మనసు నేల యి ట్లమార్గవృత్తికిఁ జొర
నిచ్చె! దోపి ధరణి యేలు మనఘ. ౧౫౬

---

1=అనికి=యుద్ధమునకు, ఓహటించుట=తొలఁగుట.

క. నీ వార్యబోధితుఁడవు
గావే! వర్ణాశ్రమ ప్రకారములు వినం
గావలయునె! ధర్మంబులు
భూవరునకు దండనీతిఁ బోలంగలవే!

వ. సుద్యుమ్నుం డనుధరణీశుండు దండనీతినకాదె యపవర్గంబువడసె! అనుటయు, నజాతశత్రుం డాసుద్యుమ్ను వృత్తాంతంబు వినవలతు నాన తి మ్మనిన నమ్మహీపతి కమ్మునిపతి యి ట్లనియె: ౧౭౮

—♦ పారాశర్యుండు సుద్యుమ్ను చరితంబు ధర్మజునకుఁ జెప్పుట ♦—

క. విను, శంఖుండును లిఖితుం
డన నిరువురు విప్రవర్యు: లన్నయుఁ దమ్ముం
డును గలరు బాహుదాతీ
ర నివాసులు, ధర్మతత్పరమనోవృత్తుల్. ౧౭౯

సీ. వారియాశ్రమముల భూరిపుష్పఫలాభి
వృద్ధి నొప్పారెడు వివిధభూరు
హంబులు గల; వొకయపుడు శంఖుండు గృ
హమ్మున లేకుండ ననుజుఁ డచటి
కరిగి, యం దొకమ్రాన నారఁబండినపండ్లు
గని, వేడ్కమైఁ గోసికొని తినంగ,
న య్యన్న యే తెంచి, 'యనుజ, యీఫలము లె
క్కడియవి చెప్పు' నావుడును, [1]వార్చి
తే. ప్రణతుఁ డై, 'యిచ్చటివి' యని పలికె లిఖితుఁ;
డాతఁ: 'డనుమతి లేక కోయంగఁ దగునె!
ముచ్చిమియ కాదె యిది! పాప మచ్చుపడియె;
నృపతిచే దండితుండ వై నీఁగికొనుము— ౧౮౦

1. ప్రతీక్షించి.

వ. 'రయంబున రాజసన్నిధికిం జని భవత్కర్మం బుపన్యసించి దండిం చుట వేఁడుము' అని పలికినం దెలిసి, 'యట్లగాక' యని లిఖితుండు సుద్యుమ్నుఁ గానం బోయి, నగరివాకిట నిలిచినం, బ్రతిహారు లమ్మహాత్ము నరుగుదెంచుట యమ్మహీపతి కెఱింగించిన, నతండు, సంభ్రమంబున సామాత్యుం డై యాసంశ్రిత వ్రతుం డున్న యెడకుం జని, వినయంబు సేసి 'మీర లిచ్చటికి వేంచేసిన ప్రయోజనం బేమి యానతిండు; మీ చెప్పినట్ల చేసెద'-నని విన్నవించిన నా విప్రవర్యుం డాతని కి ట్లనియె: ౧౬౧

ఆ. "'చెప్పినట్లు యేను జేసెద' నని యొడం
బడినవాఁడ; వింకఁ బలుకు దిరుగఁ
గామి మఱవకుండఁగా నీకు వలయుఁ జు
మ్మయ్య దండధారకాగ్రగణ్య!" ౧౬౨

వ. అని యూఁది పలికి 'మద్గురునియనుమతి లేక తదీయతరుఫలంబులు గోసికొని యుపయోగించితి; అది ప్రముచ్చిమి; ప్రముచ్చుల దండించు తెఱంగున దండించి నన్ను గతకల్మషుం జేయుము; రాజదండితు నకు యమదండంబు లే దని పెద్దలు సెప్పుదురు. నిన్నును దండ ధారణావైకల్యకిల్బిషంబు వొరయ కుండ వలయు' నని తేటపడ నాడిన, నమ్మాటలకు మనంబున విషాదంబు నొంది, యమ్మేదినీ వరుండు భూసురవరుం బ్రార్థించి,— ౧౬౩

ఆ. 'అనఘచరిత, యిట్లు నను నియోగించుట
యుడుగు' మని యమాత్యయుతము గాఁగ
భక్తి మెఱసి యెన్నిభంగులఁ జెప్పిన
నియ్యకొనక యున్న నెట్ట కేని— ౧౬౪

—♦ లిఖితుండు సుద్యుమ్నునిచేత నిష్కృతికరుం డగుట. ♦—

వ. నిశ్చయించి సముచితదండనీతివ్రతశీలుం డగు నన్నరపాలుం డమ్మ హాద్విజున్నిం గరద్వయుగచ్ఛేదనంబున దండితుం జేసిన, నతం డతని

దీవించి మగిడి చని, శంఖునిం గని నికృత్తంబు లైనహస్తంబులు
సూపి, 'సమ్యగనుభూతదండితుండ నైతి' ననిన, నాతండు ప్రీతుండై-

తే. ధర్మమార్గ ముల్లంఘింప దగదుగాన,
వలసె [1]నిష్కృతి; కుల మెల్ల వెలసె నీక
తమున; సుర ముని పితృతర్పణములు సేయు
మరిగి బాహుదాపుణ్యతో యముల ననఘ. ౧౬౬

వ. వినుము, ౧౬౭

తే. కల్లు ద్రావుట, గురుపత్నిఁ గవయుటయును,
విప్రుఁ జంపుట, బ్రహ్మస్వవిషయ మైన
ప్రుచ్చిలుటయును, నివి గలకూ్రరజనులఁ
బ్రీతిఁ బొందుటయును - మహాపాతకములు. ౧౬౮

వ. ఇమ్మహాపాతకంబు లేనింటిలోన నెద్ది సేసిన సేజాతివాఁడును దండ
నీయుండ. విశేషించి తస్కరుండు శారీరదండయోగ్యుండు. రాజ
దండితులు సుకృతవంతులభంగిఁ బుణ్యలోకప్రాప్తు లగుదురు.
నీ విమ్మహారాజుచేత దండింపబడుటం బుణ్యాత్ముండవును వంశో
ద్ధరణసమర్థుండవు నైతివి; సంతోషింపుము పొమ్ము;- అనినం
బోయి లిఖితుండు— ౧౬౯

తే. బాహుదానదియం దవగాహనంబు
సేయఁ బ్రభవించె నాతని చేతు; లపుడు
విస్మయం బంది యతఁడు వేవేగ వచ్చె
నన్నపాలికి మగుడఁ బ్రహర్ష మెసఁగ. ౧౭౦

వ. వచ్చి యరుణకమలంబులం దెగడుతనకరంబులం జూపిన, నతండు
'దీనికి నచ్చెరువడ నేల? ఇది మదీయతపోవిభవంబున దైవకృతం
బైనవిశేషంబు. నీవు శుచి వగుట దైవంబున కెక్కె. సుద్యుమ్నుం
డును నీపుణ్యానుష్ఠానంబున నిజపితృవర్గసహితంబుగా నిర్మలాత్ముం
డయ్యె' ననియె. అట్లగుటం జేసి- ౧౭౧

1. – ప్రాయశ్చిత్తముచేత.

చ. జననుత, నీవునుం దగఁ బ్రజాపరిరక్షణ మాచరింపు; నీ
యనుజుని మాట వేదవచనార్థనిరూఢము; రాజనీతి దం
డనమునఁ గాని యొండున నొడంబడ దెన్నఁడు నార్యకోటియుం
దును; వగదక్కు; మేలుమిలఁ దుష్టిగఁ; జేయును మేటిజన్నముల్.

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె:

సీ. అడవుల మీరున్నయపుడు నీతమ్ములు
వివిధమనోరథావేశకలిత
హృదయులై యుండుదు; రదయత వీరి ను
పేక్షింప కిలయేలి, యెల్లభోగ
ములకును భాజనంబులఁగా నొనర్పుము;
తురగమేధాదిక్రతుప్రయుక్తిఁ
బరఁగుము; వీరలు బహుయజ్ఞములు సేయు
వా; రటమీఁద నిర్ద్వంద్వవృత్తి

తే. వెడలెదవు గాక! విను, మేము వెట్టివార
మే! మహీశ్వర, నీమది మేలుగంటి
[1]మతిథి సుర పితృవిషయము నప్పు*త్రిక్కు
గలిగియుండంగ, నదినీకుఁ గాదు; గాని,— ౧౭౪

ఆ. న్యాయశాస్త్రవేది వై యింగితాకార
చేష్ట లెఱిఁగి, జనుల శిష్ట-దుష్ట
తావిశేష మరసి, దండనీతి యొనర్పు
పతికి నెల్లమేలుఁ బడయవచ్చు. ౧౭౫

క. [2]అరి యాటవపాలు గొనుచుఁ
గరుణగలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా

1. తా. అతిథులయెడ, దేవతలయెడ, పితరులయెడఁ తీర్పవలయు ఋణము మిగిలియుండఁగా. * 'త్రిక్కు' 'చిక్కు' అని యొకపాఠము. 2.=కప్పము.

చరణంబునఁ బాలించుట
పరమపదముఁ జేర్చు, విడుచు భయసంశయముల్. ౧౭౬

ఆ. ఇవ్విధంబుగాక, క్రొవ్వి కామక్రోధ
కలితచిత్తవృత్తిఁ దొలఁగ నడచు
పతికి నగుఁ జతుర్థభాగంబు ప్రజసేయు
పాపములఁ గులప్రదీపచరిత. ౧౭౭

చ. క్రమమున నైన, శాత్రవుల [1]గ్రమ్మన నైనను [2]జావఁజేఁత ధ
ర్మము; విను, పాపకర్ము లగురాజులతోఁ దగ [3]సంధిసేఁత దో
షము; విభుఁ డుర్వి యమ్మకొని సంగరముం దొలఁగింపఁ గూడునే!
[4]సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండుధర్మముల్! ౧౭౮

వ. కావున, ౧౭౯

క. 'పో రుడుగను సమకూరద
కౌరవపతి యపుడు సంధిగావింపక; హిం
సారుచి నైతి' ననుట యవి
చారత నృపవంశకలితజని యగునీకున్. ౧౮౦

శా. భూవిస్తారము నాక్రమించి, ప్రజలం బ్రోవంగ, దండింపనుం,
గావన్ నేర్చి, మఖక్రియల్ నడపి, సంగ్రామాగ్ని రాజ్యాహుతుల్
గా వైరిక్షతజంబు వ్రేల్చి, తనుషంగ క్షేపకుం డై హయ
గ్రీవుం డుత్తమసిద్ధిఁ బొందె; రణముల్ గీడే నృపశ్రేణికిన్! ౧౮౧

వ. సంగరంబునం జంపుటయును, జచ్చుటయును, బ్రజాపరిపాలనంబును,
దగిన తెఱంగున దండించుటయును, నుత్తమక్షత్త్రధర్మంబులు.
కావున హింసాశంక విడిచి [5]యాన్వీక్షకీ త్రయీ వార్తా దండ

---

1=కలియుటచే నైనను. 2=చావఁజేయుట-చంపుట. 3=సంధిచేయుట, 4=యుద్ధముచేసి జయించిన భూమిని భరింపఁగలుగుటకు ఇతర ధర్మములు పోలునా!

5=ఆన్వీక్షకీ-(ఇందు విజ్ఞానము తెలుపఁబడును.), త్రయి - (ఇందు ధర్మాధర్మములు తెలుపఁబడును.) వార్త-(ఇందు అర్థానర్థములు తెలుపఁబడును.), దండనీతి - (ఇందు నయానయములు తెలుపఁబడును.)

నీతులను, రాజవిద్యలయందును బ్రవీణు లగు సహాయులతోడం
గూడి సర్వవ్యవహారంబులు నిర్వహింప నిర్యాణం బనతిదూరం
బగు; కలంక దక్కుము- అనిపలికె. సకలలోకగ్రాహ్యవచనుం డగు
నమ్మహాముని ఇట్లు సెప్పం దెలివొందకయున్న ధర్మనందనుం
గనుంగొని పురందరనందనుం డుల్లంబునం గోపంబు గదుర మొ
గంబునం దోఁప నీకయుండె. అప్పాండవాగ్రజుం డత్తపోధనవర్యు
వదనంబునం జూడ్కి నిలిపి [1]నిభృతంబుగా ని ట్లనియె: ౧౮౨

క. పతులు మృతు లైనఁ బొగిలెడు
సతులవిలాపములు శోకసంతాపం బు
త్థితముగఁ జేయఁగ, నే వసు
మతి [2]యేలినకలుచఁ గలఁక మాను నె బుద్ధిన్? ౧౮౩

అనుటయు నమ్మునివరుం డతని కి ట్లనియె:

సీ. దుఃఖంబుఁ బొ మ్మని త్రోవ, సుఖంబు ర
మ్మని తెచ్చికొన వశమయ్య! వానిఁ
దొలుబామునందలి దుష్కృతంబును సుకృ
తంబు హేతువులుగఁ దగిలి చేయు
బురుషుని కాలంబు; దిరములు గా వవి,
పొరిఁ బొరి వచ్చుచుఁ బోవుచుండు;
నర్థముల్ దుర్బుద్ధులైనను సిద్ధించు
నగుకాలమున; నార్య లయ్యుఁ గాని

ఆ. కాల మవి ఘటింపఁగానేర; రనిల వ
స్థాత పేందురుచులు— నధిప, కాల
కల్పితములు; మంత్ర శిల్పౌషధంబులు
మేలుసేఁత కాలకీలితంబు. ౧౮౪

1.—తీర్పఁబడినట్లుగా 2.—ఏలినమాత్రమున నే.

క. కమలంబులుఁ దోఁవలు వికా
సముఁ బొందుట, లతలుఁ దరులు సకుసుమఫలభా
వముఁ బొందుట, పక్షులును మృ
గములును మదకలము లగుట కాలకలితముల్. ౧౮౬

వ. మఱియు జనన-మరణంబులును, హాని-వృద్ధులును లోనుగా సకలం
బును గాలాధీనంబ కావున, నీకు శోకింపం బనిలేదు. తొల్లి సేన
జిత్తను మానవపతి శోకార్తుం డై యుండి తనలోనన తెలిసి సజ్జన
సన్నిధి నుపన్యసించిన వాక్యంబు లాకర్ణింపుము: ౧౮౭

—♦ పారాశర్యుఁడు ధర్మజునకు సేనజిత్తువాక్యంబు లుపన్యసించుట. ♦—

సీ. తారు గొందఱకు బాధకు లయి నడచుట,
పరులచే బాధలఁ బడుట గలుగు;—
నివి కాలభావ్యంబు; లెఱుక గల్గిన—నొరుఁ
బఱిచితి, నొరునిచేఁ బడితి ననుచుఁ
బురుషుండు ప్రియ-శోకములఁ బొందఁ; డర్థదా
రాపత్య బాంధవహాని కాత్మఁ
గుందంగ నడలుట మందబుద్ధిత్వంబు;
వగఁ గీడు మానునే? వలవ దడల—

తే. శోక-భయకారణంబులు లోకమున న
నేకములు: దానఁ దలఁపూపు శోకములకు
భయములకు బుద్ధి [1]నెడ యీఁడు పండితుండు;
మూఢుఁ డవి [2]తోఁప నేరండు మునుఁగు వగల. ౧౮౮

క. వినుఁడీ, సుఖమును, దుఃఖము
ననిత్యములుగాన, వానియాగమకాలం
బున ముదమును, శోకము [3]మొగ
కొనమియ చు [4]మ్మొఱవు శాంతిగోరుజనులకున్. ౧౮౯

1=తావు. 2=తొలఁగింపు. 3=అభిముఖముగా నుండుటయు. 4. ఉఱవు ఉచితము.

తే. మూఢతమబుద్ధు లగువారుఁ, బ్రౌఢతమవి
వేకులును సుఖు; లట్టులుగాక కొంత
ప్రజ్ఞ గలవార లై యప్రతిభు లైన
జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు.— ౧౯౦

వ. అనియె ఆసేనజితుం డుదాత్తవివేకనిరూఢుండు. అతని వచనం
బులు విద్వదాదరణీయంబులు. ఇందలి యర్థంబు నీచిత్తంబున నలవ
రింపుము; వగ యుజ్జగింపుము.-అని వెండియు,—

తే. వర్ణముల నాశ్రమంబుల వలను మెఱసి,
యరసి చక్కని తెరువున నరుగఁజేసి,
ధరణి పాలింపు; సముచిత దండధరణ
మాచరింపుము; నీ కిది యర్హవృత్తి. ౧౯౨

క. దివికిం జనినను నెవ్వని
వివిధగుణము లఖిలజనులు వినుతింతురు,— వాఁ,
డవనీశ్వర, సత్పురుషుం
డవు నని కయికొందురు బుద్ధి నార్యజనంబుల్. ౧౯౩

వ. కావున సకలజనప్రియహితం బగు పృథ్వీపరిరక్షణంబు నీకుం గుల
ధర్మం బై, కర్తవ్యం బగుట [1]యుఱవుగాదె- అనిన యమ్మునీంద్రు
నకు న మ్మనుజేంద్రుం డి ట్లనియె: ౧౯౪

తే. మఱువ వచ్చునె నా కభిమన్యు, ద్రౌప
దేయులను, గర్ణ! మత్స్యభూనాయకుండు,
ద్రుపదనృపతియు, ధృష్టకేతుండు మాన
సమునఁ బాయుదురే! యెట్లు శాంతి గలుగు! ౧౯౫

సీ. తొడలపై నర్మిలి నిడికొని నన్నుఁ బ
లాలించు చుండు బాల్యమున; నట్టి

1. ఉఱవు=ఉచితము; ఒప్పిదము.

భీష్మునిఁ జంపితి! బీభత్సుభల్లముల్
దనువు సెక్కంగ నాతఁడు శిఖండిఁ
జూచుచు నుండుటఁ జూచితి నది యుల్ల
మలమటఁ బెట్టెడి! నట్లు గాక,
యాభంగి నున్నప్పు డాతఁ డాదుగ్ధపదజు
నేయమిఁ దలఁచిన నెరియు మనసు!

తే. పరశు రాముని నోర్చిన [1]బల్లిదుండు,
కాశిరాజకన్యకలకుఁగాఁ బుడమి
నరపతుల నెల్ల గెలిచిన [2]బిరుదు, [3]గలన
[4]నాఁటడియ పడు టూహింప సడలు గదుసు. ౧౯౬

ఆ. అల్పకాలభోగ్య మైనరాజ్యమునకుఁ
గా ననల్పకీర్తిఘనుని, [5]జరఠ
సింహకల్పు, వంశశేఖరజన్ముఁ దుగ్రిం
చితి మనంబు వగలఁ జివుక కన్నె! ౧౯౭

మ. జనసంపూజ్యపదారవిందుఁ డగు నాచార్యుండు శోకించి, నం
దనుచో ప్పారయ వేఁడి, పెద్దయు ననుం దా నమ్మి యర్థింపఁ, జా
వనివానిం గరిచావు బుద్ధి నిడి 'యశ్వత్థామ సచ్చె న్నిజం'
బని యే బొంకితి; మేదినీభరణ మర్హంబే గురుద్రోహికిన్! ౧౯౮

ఆ. రాజ్యలాభలోభరతుఁడ నై, కడుఁ బాప
మైన బొంకుమాటలాడి గురునిఁ
గూల్ప నేర్చినట్టి క్రూరాత్ముఁ డెగతిఁ
బోవువాఁడు సెపుము బుధవరేణ్య! ౧౯౯

క. భ్రాత మహాత్ముఁడు గర్ణుం
డాతనిఁ జంపించి యేలు నవనీరాజ్యం

1. - మిక్కిలి బలవంతుఁడు 2. = శూరుఁడు. 3= యుద్ధమున. 4. ఆఁడఁడియ = వ్యర్థమగు నింద. 5. = ముదిమిసింహము వంటివాఁడను.

ఖాతురత సేయుఁ గాక, సు
ఖాతిశయము మతికి నొసఁగునయ్య మునీంద్రా! ౨౦౦

చ. కడిఁదిమగండు కుంభజుఁడు గావఁగ, [1]నొట్టినమంటవోలె నుం
డెడిమొనఁ జూచి చూచి యిది డెప్పర మన్వగ లేక, పంచితిం
గొడుకుఁ జొరంగ; నత్తెఱఁగుక్రూరత సైఁప సుభద్రయట్లుఁ, గ
వ్వడిక్రియ నేర్తురే యొరులు! – వల్లభుఁ డే లగు నట్టిఁ డుర్వికిన్?

చ. [2]అడలడిఁ బొందఁగాఁ దగనియట్టిది ద్రోవది, మేరుకల్పులం
గొడుకుల నేవురన్ జముఁడు గొన్న నలందురఁ జూడ నేర్తునే!
పుడమి గిరీంద్ర పంచకము పొల్సినఁ బా డఱినట్టు లున్న య
ప్పడఁతుక యెట్టులోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁగన్!

క. ప్రాయోపవేశమున ని
ర్కాయంబు దొఱంగుతలఁపు గదిరెడి; సంతా
పాయత్తచిత్తు, నకట క
టా! యని పోనిండు, నను దృఢవ్రతయుక్తిన్. ౨౦౩

వ. అని పలికి బంధుమరణశోకవ్యాకులుం డయియున్న యన్నరనాథ వరేణ్యుతో నమ్మునినాథవరేణ్యుం డి ట్లనియె: ౨౦౪

ఆ. ఇ ట్లనంగఁ దగునె! యిమ్మెయి నడల నీ
యట్టిధైర్యఘనున కగునె! యనఘ,
బుద్ధి సెప్ప వలసెఁ బునరుక్తభావలఁ
జెవులు మదియుఁ గూడఁ జేర్చి వినుము– ౨౦౫

1. ఒట్టిన= ప్రజ్వలించిన.

2. అడలు + అడిన్ = శోకాధిక్యమున, పొందఁగాఁ దగనట్టి ద్రౌపది, తన కొడుకుల నైదుగురను మేరుపర్వతసమానులను యముఁడు గొనిపోవఁగా –ఆకొడుకులు చావఁగా–దుఃఖింపఁ బాడ నేర్తునా! ఐదుగురు కొడుకులుఁ కొండగట్లవలెఁ గూలిపోవఁగా పాడుపడినట్లున్న ఆ ద్రౌపది గృహభారము నెమ్మదిగ నెట్లు నిర్వహింపనోర్చును!

తే. *పొదలుఁ దఱుఁగుటకై, పొడ వొదవు బడుట
కై, కడుంజేరుఁ బాయుటకై, జనించుఁ
బొలియుటకునై, సుఖంబులఁ బొందు దుఃఖ
మొందుటకునై-పదార్థము లెందు నధిప. ౨౦౭

ఉ. మిత్రుల చెయ్దులన్ సుఖము మేకొను నంటయుఁ, జెందు దుఃఖముల్
శత్రులచెయ్ది నంటయును, సన్మతి దా ధనమూల మంటయున్,
గోత్రవరేణ్య, భోగములకున్ ధనముల్ గరణంబు లంటయున్
జిత్రచరిత్రుఁడైనవిధిచేష్ట దొఱంగిన నీటిద్రా వలగున్. ౨౦౮

వ. కావున నెవ్వగ నొందం బనిలేదు.

ఆ. ధాత నిన్ను నేమిధర్మంబు నడపుట
కై సృజించె దానినాచరించి
యుండు, నీవు నీక యొడయుండవే [1]ధాత్రి
నోదితప్రవర్తనుఁడవు గాక! ౨౦౯

వ. అని పలికి యప్పారాశర్యుండు వెండియు నిట్లను: విదేహరా జగు
జనకుండు వివేకపరిపాకంబు నొందక, ము న్నొక్కసమయంబున
బంధువియోగంబు వాటిల్ల విషాదంబు నొంది, గృహంబు దొఱంగి
వెడలువాఁ డయ్యె; నట్టి యెడ నతనిపాలికి నశ్మకుం డనువిప్ర
వర్యుండు వచ్చిన, నవ్వసుమతీపతి సముచితప్రకారంబునం బూజి
తుం జేసి- ౨౧౦

—♦ జనకున కశ్మకుండు చెప్పిననీతి వ్యాసుఁడు ధర్మజునకుఁ జెప్పుట ♦—

తే. అర్థములు బంధువులుఁ గల్గినపుడు, తద్వి
యోగ మైనట్టియెడను, మర్త్యునకు నెద్ది
తలఁపుమై నున్న మదవిషాదంబు లడర
కుండఁ జెప్పవె యది కృపాయుక్తి ననఘ. ౨౧౧

---

*- చూ. అశ్వ : ఆ ౨; ప ౧౬౫ 1. =బ్రహ్మదేవుని (వి)నోదగతి వర్తింప వలయు వాఁడవుగాని నీవు నీకే ప్రభుఁడవా !

వ. అని యడిగిన నాతం డిట్లనియె: ౨౧౨

సీ. దుఃఖంబు సుఖమును దోడివ సంసార
మునకుఁ; దద్వశగతిఁ బోవునరుని
యాత్మ నంబుదము గా డ్పపహరించిన విధం
బున నవి సెఱుచు నేపున; సుఖైక
భాగియు దుఃఖైకభాగియు లేమి లో
కంబునం దెలియంగఁగనుట మంచు
వానికిం; విను, జర రా ఢీక త్రోవంగఁ,
జావక యుండ వశంబె జలధి

తే. వలయవేష్టితక్షితి నేలువాని కైన ?
నధిప, యొద్ది వాటిల్లిన, ననుభవించు
నపుడు 'ప్రాప్తవ్య' మిది యని యంతరంగ
విభ్రమము లేక యునికి వివేకసరణి. ౨౧౩

క. నరవర, సరసాన్నంబులుఁ,
బరిమళసద్వస్తువులును, [1]బరమశయనవి
ష్టరములుఁ గాలాధీనత నరుఁ
బొందుం, బాయు – వాని నమ్మమియ [2]యుక్తము. ౨౧౪

చ. వల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి, మం
దుల నొడఁగూర్ప నేర్చి, తనుదోషము లారయుబుద్ధి గల్గి, యా
ర్తులకుఁ జికిత్స సేసెదరు; రోగము వాయుమి లేదె? వారు రో
గు లగుట గాన మెట్లు? ప్రతికూలవిధిన్ నరు నేర్పు ద్రోచునే.?

సీ. సద్వంశజన్మంబు సౌందర్యమును బలం
బును సుభగతయును భోగములును
భవితవ్యతానురూపంబులు; పేద లై
పెంచుట కలయంగఁ బెల్లు పుట్టు

1. = ఉత్కృష్టమగు శయ్యయును, ఆసనమును. 2. = ఉచితము.

దురు ప్రజ; లెంతయు సిరి గలవారు గొ
రంగఁ బుట్టరు; దరిద్రపుజనంబు
లాఁకటం దిని తాలు నఱిగించుకొందురు ;
భోజ్యసంపన్నులు భోజనంబుఁ
తే. బూర్ణముగఁ జేయఁజాలరు ; భూపవర్య,
వెలఁది జూదంబు పానంబు వేఁట యతి ని
షిద్ధములుగానఁ దగ వని చెప్ప వినుచు
వలనుగలవార చెడుదురు వానివలన. ౨౧౬

వ. అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్టప్రాప్తులకుం గారణంబులు గనికొనలేవు. బాంధవలాభంబును దద్వియోగంబును వఱదం గాష్ఠంబులు సంగతంబులై పడంపడి పాసినచందంబు. ౨౧౭

తే. మాతృ పితృ దార పుత్త్రిక భ్రాతృ శతస
హస్రకంబులు సంసృతి ననుభవింపఁ
బడియె; నందులో నెవ్వరి కడలువాఁడు
నరుఁ? డనిత్యతయూహించు టరయ నుఱవు. ౨౧౮

క. జనన జరా మరణ గ్రా
హ నిబిడకాలాబ్ధిమగ్న మని జగము నెఱిం
గినవాఁడు, ధర్మవర్తన
మునసుండుం జింతదక్కి భూపవరేణ్యా. ౨౧౯

క. [1]తనయొడ లెర యనినను, మను
జునకును బంధుతతిసతమొ? శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె
మ్మన మధికము నొచ్చుఁగాక మహితవివేకా ? ౨౨౦

ఉ. కావున నెవ్వగల్ విడువు; గైకొను మాత్మకులార్హకర్మసం
సేవనతత్పరత్వము; విశిష్టజనంబుల సంగతిఁ భవ

1. తనశరీరము బలియిత్తు ననినను.

ద్భావము కల్మషంబు దెగఁబోచి శుచిత్వముఁబొందు లోకసం
భావితకీర్తి వయ్యెదు, నృపాలక, నాపలు కూఁదు పాటిగాన్. ౨౨౧

వ. అనుటయుం దెలిసి, జనకుం డమ్మునిఁ [1]నామంత్రితుం జేసి నిజకర్మ
తంత్రనిర్వహణంబునకై గృహంబున నిలిచె. నీవు నట్ల యమ్మలికం
బుజ్జగింపుము; ఉత్తమక్షాత్త్రసరణిసాధితంబైన భూవలయంబుఁ బాలిం
పుము; తక్కటి వలంపులు, దక్కుము – అని పలికిన విని, పలుకకున్న
యగ్రజుంజూచి సవ్యసాచి జనార్దనునితో ని ట్లనియె: ౨౨౨

క. బహుబంధు మరణశోక
ప్రహతవివేక మయి ధర్మరాజునకు మనో
మహిమ వికల మయ్యెం, బర
మహితవచోవృత్తిఁ దేర్పు మహితవిచారా. ౨౨౩

వ. అనిన నచ్యుతుండు పాండవాగ్రజుఁ జేరంజని, యభివందనం బాచ
రించి, యతనికరంబు వట్టికొని, వదనంబు విరిదమ్మిచందంబునొంద
మధురాక్షరవిన్యాసంబుగా ని ట్లనియె: ౨౨౪

మ. పురుషవ్యాఘ్ర, మనంబు గుంద వగలం బొందంగ నీ కేల ? సం
గరకేలిన్ భవదీయబంధు లతిలోకంబైన పెం పొప్పఁ బో
యిరి నాకంబున; కట్లు గాక, కల గాదే రాజవృత్తంబు బా
నరయన్? రాజుల యేల?– యే జనులు నిత్యాయుష్యులే చెప్పుమా? ౨౨౫

వ. అని పలికి వెండియు–

తే. తొల్లి సృంజయుఁ డనుమహీవల్లభుండు
పుత్త్రశోకాతురత్వంబుఁ బొంది యున్న
నుపశమంబుగఁ బ్రాక్తనన్నృపుల చెప్పి
తెలిపె నిమ్మౌని యంతకు బలిమికలిమి. ౨౨౬

వ. అని యొఱింగించు నారదుం జూచి, 'ఇమ్మహాత్మ్యుం, డట్లు మరుత్త
త్తసుహోత్రాదు లగురాజుల పరమోత్కృష్టకర్మంబులును, నట్టి

---

1. ఆమంత్రితుంజేసి=పో సంపి; వీడ్కొలిపి.

వారికిం గాలవశత్వంబునం బొందకుండ రామియుం దెలియ నుపన్య
సించినవాక్యంబులు, అభిమన్యు మరణశోకవ్యాకులుండ వగునీకుం
దాపోపశమంబుగాఁ గృపాతిశయంబునం బరిపాటి వీరలు సెప్పిరి'
అని పారాశర్యమునీశ్వరు నిర్దేశించి, 'వీరివచనంబుల యేనునుం
జెప్పెద నాకర్ణింపు' మని యి ట్లనియె: ౨౨౬

—♦ ధర్మరాజునకుఁ గృష్ణుఁడు షోడశరాజులచరిత్రంబులు సెప్పుట ♦—

సీ. సంవర్తుఁ డనుమహాసంయమి, దేవతా
గురుతోడియీాసున, నరుగుదెంచి
పూని యుపద్రష్టయై నడపంగ, హి
మాచలపాదంబు నందు శక్ర
వరుణప్రభృతులైన సురలు మహామునీం
ద్రులును సహాయులై మెలఁగుచుండ,
శాలాప్రముఖభవ్య సాధనమ్ములు గన
కమయంబులుగ, వస్త్ర కాంచ నాజ్య
ఆ. దధి పయః ఫలాది తర్పణద్రవ్యస
మృద్ధి సకలజనులు మెచ్చఁ, బెక్కు
లధ్వరములు సేసె;—నట్టిమరుత్తుండు
నిత్యపదవి నుండ నేర్చె నయ్య! ౨౨౭

సీ. సన్మార్గమున రాజ్యసంపదనొంది, భూ
సురపూజ లొనరించి, సువ్రతముల
బృందారకులఁ బ్రీతిఁ బొందింపఁ, దన కర్థి
బర్జన్యుఁ డేఁటేఁటఁ బసిఁడివాన
కనకమయములైన కర్కట ఝష నక్ర
కూర్మచయముతోడ గురియుచుండ,
నయ్యర్థమెల్ల ధనార్థుల కిచ్చుచుఁ
[1]గురుజాంగలంబునఁ బరమనిష్ఠ

1.—కురుదేశమందలి మెఱకపాలమున.

ఆ. నశ్వమేధముఖము లైనరాజార్హ య
జ్ఞములు పెక్కుసేసి, సకలజనులు
పొగడునట్టి పాటినెగడె సుహోత్రుఁ;-డ
వ్విభుఁడు దెగియె ననుట వినమె యధిప! ౨౩౦

సీ. కాంచనాలంకార కాంతంబులై రూఢి
కెక్కిన గజములు పెక్కువేలు,
జవసత్త్వరూపాదిసకల గుణములఁ బెం
పెసఁగిన హయము లనేకలక్ష,
లమలినస్వర్ణమయములగు కొమ్ములుం
గొమరారుపశువులు గోట్లు, [1]లూర్జి
తాంగకవిలస దజావికంబులు గణ
నాతీతములు, గన్య లప్రమేయ,

ఆ. లఖిలరత్నవిరచి తాభరణంబు ల
నల్పములు- మహీసురావళులకు
నిచ్చి, చేసె గ్రతువు లెన్నియేనియు నంగుఁ;-
డతఁడు నన్యలోక గతుఁడుగాఁడె! ౨౩౧

సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దన
రథము చరింప, నరాతు లనఁగ
వినియు నెఱుంగక, విభవ మార్జించుచోఁ
బ్రజల నొప్పింపని పరమపుణ్య
కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన
కక్షయధనము ఫాలాక్షుఁ డొసఁగ,
నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్టజ
నాకీర్ణములుగఁ బెక్కు చరించెఁ

1. = బాటి బిఱ్ఱుపట్టిన మేఁకపోతులు లెక్కకు మిగిలినవియు.

ఆ. [1]దారకములు [2]వృష్టి ధారలు లెక్కింప
వచ్చుఁ గాని యతని యిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు సన్నుతిపాత్ర; మా
శిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు? ౨౩౨

సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి
పంపున నరిగిన పెంపుకలిమి,
సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొన
ర్చినమర్త్యలోక పావనవిభూతి,
త్రైలోక్యకంటకు దశముఖు బంధుయు
క్తంబుగాఁ జంపిన [3]కలితనమ్ము,
బాలురమరణంబు వాటిల్లకుండంగఁ
జేసినయత్యంత చిత్రమహిమ-

ఆ. గలిగి యశ్వమేధములు మున్నుగా ననే
కాధ్వరము లొనర్చి, యఖిలజనులఁ
దల్లివోలె నరసి, దశరథరాముండు
గాలవశత నొందెఁగాదె యధిప! ౨౩౩

సీ. పూర్వవంశ్యులఁ గావఁబూని వియద్గంగ
నవని భాగీరథి యనఁగఁ బఱపి,
శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి
యప్రతిహతముగ నశ్వమేధ
యాగంబు లొనరించునప్పుడు, వేయువే
లరదంబులందుఁ గన్యల నలంకృ
తలఁ జేసి యునిచి, రథంబు రథంబున
కేన్గులు నూఱు నూఱుజేసి, యేనుఁ

తే. గేనుఁగునకు హయములు వేయేసి పాటి,
హయము హయమున కట్ల గోచయ మమర్చి,

1. నక్షత్రములు, 2. వానచాళ్ళు. 3. సామర్థ్యము.

భూరిభూరియుతంబుగ భూసురులకు
నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె! ౨౩౪

సీ. అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగుగం
ధర్వులు హృద్యవాదన మొనర్ప,
నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు
నై వినోదింపంగ నమరగణము,
బహువిధాలంకారభంగుల విన్నాణ
ములు సూప దివ్యమునులు నుతింప,
మనుజలోకంబెల్లఁ గన కొన్న వస్త్ర భూ
షణదానములఁ దృప్తి సనఁగ, నశ్వ

ఆ. మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని,
శతతమాధ్వరమున నతఁడు హయము
నాసపడిన నిచ్చె, - నా దిలీపునిఁ జూపు
మా ధరిత్రి నిపుడు మనుజనాథ! ౨౩౫

సీ. జనన మాదిగఁ బాకశాసనుకరమునఁ
బ్రభవించు నేయిను బాలుఁ ద్రావి,
ద్వాదశదినము లాతఁడు గారవింపఁగ
వర్ధిల్లి, పండ్రెండు వత్సరముల
ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి,
యర్కునియుదయంబు నస్తమయము
నగుపట్లు పొలిమేరలైన మహాక్షేత్ర
మంతయు నొక్కండ యనుభవించె,

ఆ. సన్నపర్వతముల నాజ్యనదుల విప్ర
భోజనము లొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ;-
డింద నిలిచెనే నరేంద్రముఖ్య! ౨౩౬

సీ. అనిమిషాసురయుద్ధమున నసురావలి
సమయించి, వర్ణాశ్రమముల నేర్ప
రించి భూమి యలంకరించి, యగ్నిష్టోమ
హయమేధ వాజపే యాతిరాత్ర
పౌండరీకము లనఁ బరఁగినయధ్వరం
బు లనేకములు సేసి, భూసురులకు
నఖిలభూములఁ గల యర్థంబు లెల్లను
దన కని యేమియు నునుప కిచ్చె.

ఆ. శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లి తనయందు
ధర్మతత్త్వ మూర్జితముగ నియమ
నిష్ఠుఁడై యయాతి నెగడె;—శాశ్వతుఁ డయ్యె
నే, నృపాల, యమ్మహీశ్వరుండు! ౨౩౭

సీ. ఓర్వక పెక్కండ్రు దుర్వీశు లొక్కటఁ
బైనెత్తి వచ్చిన భండనమున
వారిహేతిచ్ఛత్త్రవాహన ధ్వజములు
నఱకిన, నడునడ నడఁకి వార
లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాఁచి,
యేచి యీపెన్నేల యెల్లఁ దాన
కొని, యధ్వరములు పెక్కొనరించి, వేడుకఁ
బాయసంబులు నపూపములు మోద

ఆ. కములు లోనుగాఁగఁ గలవంటకముల ను
ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి,
దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన
యంబరీషుఁ డేమియయ్యెఁ జెపుమ!

సీ. లక్షభార్యల నుపలాలించి, యొక్కొక్క
చెలఁదికి వేవురు వేవు రాత్మ

జలుగాఁగఁ బదికోటు లలఘుమూర్తులఁగాంచె;
వారును దోర్బలోజ్జ్వలులు నార్య
చరితులు నై పేర్చి, తురగమేధంబు లం
దఱు బహుదక్షిణోదాత్తభంగిఁ
జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ,
దానును విశ్రుతాధ్వరము లొప్పఁ,
తే. బెంపుసొంపును సువ్రతసంపదయును,
నిర్మలశ్రద్ధయును గర్మనిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె;-నతఁడు
పడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు! ౨౩౯

సీ. అధికతపంబున నగ్ని నారాధించి,
ప్రత్యక్ష మగుటయు, బ్రహ్మచర్య
వృత్తంబు దమమును వేదవిత్త్వము నహిం
సయుఁ బాత్రదానంబు శమము వరము
గాఁ గోరికొని, వేదికాస్థలి మణికన
కాత్మక యై ముప్పదాఱుయోజ
నముల దైర్ఘ్యము నంత కమరువిస్తారంబుఁ
గలుగంగ నొనరించి క్రతువు సేసి,
తే. విప్రవితతికి దాని నతిప్రియమున
నిచ్చెఁ దనపేర గయ నుతికెక్క, వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁడై నెగడె గయుఁడు;-
భూవరోత్తమ, యతఁ డెందుఁబోయెఁ జెపుమ! ౨౪౦

సీ. ఇరువదివేవురు పరిణతపాచకు
లభ్యాగతులకును నతిథులకును
బాటించి క్రొత్తగాఁ బవలును రేయును
వలయునన్నము లిడ వెలసి, పశువు

లర్థి నుత్తమగతికై తార చనుదేర
　　　　[1]విశసించు, చమరులు వేడ్కతోడఁ
బొడసూపి కడుపారగుడువ హావిర్భాగ
　　　　ములు వెట్టు;- చివ్విధంబున మహోద్భ

తే. తముగ నొనరించె సత్రియాగము; తదుత్స
వంబు గొనియాడ వచ్చినవార లెల్లఁ
బ్రచురపుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ;-
డవ్విభునకును వలసె లోకాంతరంబు. ౨౮౧

సీ. శరభ సింహోత్యుగ్రసత్త్వచయంబుల
　　　　[2]నేడికలె ట్లట్ల యెక్కి యాడి,
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున
　　　　దమియింపఁగా, సర్వదమననామ
మిడిరె నమ్మౌని; పదంపడి మహారాజ్యప
　　　　దస్థుఁడై కాళిందితటమునందు
భాగీరథీతీర భాగంబునను, సర
　　　　స్వతిసమీపమునను వాజిమేధ

తే. రాజసూయాది వివిధాధ్వరము లొనర్చి,
కనకనిర్మిత కరి తురంగమ రథంబు
లసదృశప్రీతి విప్రుల కొసఁగె భరతుఁ;-
డన్నరేంద్ర చంద్రుండును జన్నవాఁడ. ౨౮౨

సీ. మిట్టుఁ బల్లంబునై మెలఁగంగఁ దనరథ
　　　　ప్రముఖవాహనములఁ బఱప ననువు
గా నున్న మేదినిఁగని, సమస్థలియుఁగ
　　　　వెరవున నొనరించి, విశ్రుతముగఁ
దనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి, గోరూప
　　　　మైనయివ్వసుమతి, [3]సమరనగముఁ

1. = విశసించుచు = చంపుచు. 2.= పొటేళ్ళ నెట్లోఅట్లు. 3= కల్పవృక్షము.

[1]బనిచి, యోషధులును బహురత్నములుఁ బిది
కించి జనంబుఁ బోషించెఁ బృథుఁడు;

తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల?
సకలధాత్రి బ్రాహ్మణులకు సత్కరించె;-
నమ్మహానుభావునకును నతులయశమ
కాక, సుస్థిర మయ్యెనే కాయ మనఘ! ౨౪౩

సీ. బ్రహ్మవిద్వేషంబుఁ బరికించి కోపించి
యవిజేయుఁ డైన సహస్రబాహుఁ
బరిమార్చి, నృపతులఁ [2]దర మిడి తునుమాడె
నిరువదియొక్కమా; ఱెల్లచోట
నందఱ యేలెడు నన్నిభూములుఁ దాన
యేలె ధర్మోజ్జ్వల పాలనమున;
రాజ్యయోగ్యములు ధరాసురార్హంబులు
నగునధ్వరములు పెక్కాచరించెఁ;

ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యనుపేరఁ
జనఁగఁ జేసె నుర్వి;- జామదగ్న్యు
వినమె! యామహాత్ముఁడును ససంతోషవి
భ్రాంతి గలిగెనేని బ్రదుక లేఁడు. ౨౪౪

వ. అని చెప్పినయప్పుండరీకాక్షునితోఁ బాండవాగ్రజుండు, 'సృంజయ
సుతుండైన సువర్ణష్ఠీవిజన్మంబును, వాఁడు మృత్యుం బొయినవిధం
బును, వినినది యయినను సువ్యక్తంబుగా విన వలతుం జెప్పవే'
యనిన, నతం డతని కి ట్లనుః "నీకు నాఁడు కృష్ణద్వైపాయనుం
డక్కుమారువృత్తాంతంబు నారదునధీనం బగుటంజేసి, తద్వ్యా
పారంబు సెప్పెఁ; బర్వతునిం జెప్పఁడు గాని పర్వతుండును
సహకారి- యత్తెఱం గాకర్ణింపుము:- ౨౪౫

1. = ఆజ్ఞాపించి. 2 = ఘతుసబెట్టి.

—♦శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బర్వత నారదులవృత్తాంతంబు సెప్పుట.♦—

సీ. "అధిప, నారదుచెలియలికొడుకు పర్వ
తుం; డిద్దఱును మహీమండలమునఁ
ద్రిమ్మరువేడుక దివినుండి యొక్కటఁ
జనుదెంచి, తమలోన [1]సమయ మధిక
నిష్ఠమైఁ జేసిరి: 'నిజచిత్తవృత్తు లొం
డొరులకు దాఁపక యుండువార;
మటు గాక దాఁప శాపార్హత వాటిల్లఁ
గలయది' యని. యిట్లు గలయఁబలికి

తే. యుచితవర్తనమున నుండి, యొక్కనాఁడు,
సృంజయునిఁగాంచి యతఁడు విశిష్టభక్తి
నర్చనము చేసినను 'భవదాలయమున,
ననఘ, వసియింతుమే కొన్ని దినము?' లనిరి" ౨౮౬

వ. అని పలికిన, నా పృథ్వీపతి ప్రియం బంది, సుకుమారి యనుపేరం బరఁగిన నిజనందన రావించి, 'ఇక్కన్నియ మీకుం బరిచర్య సేయ సమాధానంబున నుండుం' డని, యన్నెలంతతో 'నీవు దేవోపచారంబుల వీరి నారాధింపు' మని నియోగించి, వలయువస్తువులు సమగ్రంబులుగా సమకట్టినం బ్రీతులై యమ్మునులు సుఖం బున్న సమయంబున— ౨౮౭

సీ. అల్లఁదనంబున యసువు పైకొనఁ జూచు
నడపు కాంతికి వింత తొడవు గాఁగ,
వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు
దేరనివళులలో నారునిగుడ,
నిట్టలు దోఁచుచు నెలవులకలమేర
లెల్లను [2]బిగియెక్కి యేర్పడంగఁ,

---

[1] = శపథము; అన. 2. పా. బిగి.

దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్క
 [1]తారకంబులఁ గల్కి తనముదొడరఁ
ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
 జవ్వనంబుచెన్ను నివ్వటిల్లు
 చునికిఁ దెలుప, సృంజయునిపుత్త్రి మెలఁగువి
 ధంబు నారదునకుఁ [2]దగులొనర్చె. ౨౮౮
క. నారదుఁడు మదనబాణా
 సారము దనుఁబొదువ ధైర్యసారమెడలి, దు
 ర్వార మనోవ్యథ వంతం
 గూరి, క్రమంబునఁ గృశాంగకుం డయ్యె నృపా. ౨౮౯
వ. అట్లు కామబారిం బడి నలంగియుఁ దనతో నుగ్గడింప సిగ్గువడి. ౨౯౦
చ. వెనుఁబడుచిత్తవృత్తియును వెల్వెలఁబాఱెడునాననంబు నై
 యనిశముఁ గుందుమామఁ గని, యల్లుఁ 'డితం డిటు లేల వంతఁబొం
 దెనొ!' యనుచింత నొంది, తన దివ్యమతిం బరికించి కాంచి, 'కూ
 డున [3]సమయంబుదప్పఁగఁ గడుం గుటిలాత్ముఁడ వైతి నాయెడన్!
ఆ. 'రాచకూఁతుమీఁద రాగంబు పుట్టుట
 నాకుఁ జెప్పవైతి, నీకు శాప
 మిత్తు; నమ్మృగాక్షి నీవు వరింపక
 నిలువలేవు మరుఁడు బలియుఁ డగుట. ౨౯౨
వ. 'పాణిగ్రహణానంతరంబ వానరవదనుండ వగు' మనవుడు, నార
 దుండు, 'నీకు నాకలోకంబునకుం జనుట లేకుండెడు' మని ప్రతి
 శాపం బిచ్చినం బర్వతుం డచ్చోటు వాసిపోయి, భూజనంబులు
 పూజింపఁ బ్రవర్తిల్లుచుండె. ౨౯౩
శా. శాపప్రాప్తికి నోర్చి, తా నడిగి యాచంద్రాస్య నన్నారదుం,
 డాపృథ్వీపతి యీఁ, బ్రియంబున వివాహంబయ్యె; నమ్మాత్రలో,
 భూపా, యమ్ముని వానరాననతమైఁ బొల్పేద, నక్కాంత త
 ద్రూపప్రాప్తి విరక్తగాక తగఁ బ్రీతుం జేయుచుండెం బతిన్. ౨౯౪

1. = కనీనిక; నల్లగుడ్డు. 2. = వలపుగొలిపె. 3. = శపథము.

వ. ఇట్లు పతివ్రతయై సుకుమారి, నారదు నారాధించుచుండె.
పదంపడి యొక్కనాఁ డేమేనియుం బనికి వనంబునకు నారదుండు
వోయినయెడం, బర్వతుండు [1]డబ్బాటుగాంచి నమస్కరించి 'నా
కిచ్చినశాపంబు మరల్పవే' యనుటయు, నారదుండు 'నీవుగావె
మున్ను శపియించినవాఁడవు? ముందరమరల్పం దగు' ననిపలికిన,
నతం 'డట్లకాక' యనియె. ఇవ్విధంబున నోడంబడి యిరువురు
నొండొరువుల శాపంబులు మరల్చిరి. అయ్యల్లుండును మామ
తోడన వచ్చి మందిరప్రవేశంబు సేయు సమయంబున
నా రాజనందన నిజపురుషుంజూచి, పరపురుషుండ కాఁదలంచి
మఱి చూడక మాఱుమొగంబు వెట్టికొని పోవుటయు- ౨౫౫

ఆ. నగుచుఁ బర్వతుండు, 'నాతి, నీపతియగు
విశ్వసింపు' మని సవిస్తరముగ
శాపములును మోక్షసంవిధానములును
చెప్పి తీర్చె దాని చిత్తవృత్తి. ౨౫౬

వ. ఇట్లు నారదుండును, బర్వతుండును బరస్పర ప్రియకారులైరి. కౌర
వోత్తమా, నీ యడిగిన సువర్ణష్ఠీవి వృత్తాంతంబు నిమ్మునివరుండు
దేటపడం జెప్పెడు నని సృంజయపుత్ర కథనంబు నారదు
కృత్యంబుగాఁ బలుకుచు నతనిం జూపిన, నాతండు 'ఇప్పుడు శౌరి
చెప్పినంతయు నిట్టిద; అక్కుమారు తెఱంగుఁ జెప్పెద నాకర్ణింపు'
మని యప్పాండవాగ్రజున కభిముఖుండై యిట్లనియె: ౨౫౭

సీ. అవ్విధంబున నేను నల్లుండు సంప్రీతి
సృంజయుపాల వసింపఁ, గొన్ని
సంవత్సరంబులు సనినఁ, దదాశ్రిత
బ్రాహ్మణోత్తముల సంప్రార్థనంబు
గలుగంగ, మాకును గమనేచ్ఛ పుట్టంగ,
నారాజునకు నుపకార మొకటి

1. = దబ్బున; హఠాత్తుగ.

సేయఁ దలంచి, యే మాయనసన్నిధి
కరిగి 'కోరుము వర మంటి' మనిన,

ఆ. నతఁడు 'మీరు ప్రీతు లయినకంటెను నొండు
గలవె వరము?' లనిన గారవించి,
'యనిమిషులను మిగులు తనయునిఁ బడయంగ
వలచియుండు ; దట్టి వానిఁగనుము- ౨౫౮

వ. అంటిమి. అట్టియెడ, నింద్రతేజోరక్షణాయత్తచిత్తుం డగునప్పర్వతుం డప్పుడమితేనితో, వినుము, అక్కుమారుండు దీర్ఘాయురుపేతుండు గాకుండు'ననియె. దానికి నమ్మానవపతి యుమ్మలించి యమ్మహాత్ము నాననంబునం జూడ్కి నిలిపి, 'యిట్లేల ? యుష్మదనుగ్రహం బనూనంబు గా వలవదే?' యని ప్రార్థించిన, నమ్మాట కమ్ముని మఱుమాట వలుక కున్న, నే నన్నరనాథుపైఁ గలుగు కరుణావిశేషంబున- ౨౫౯

తే. 'వలదు శంకింప; నిందుప్రివలనఁ బుట్టు
[1]నెడరు వొందక యుండంగఁ గొడుకు నోపి
నంత గావుము గావంగనైన ; చావు
నపుడు నన్నుఁ దలంపు; మే నది మరల్తు. ౨౬౦

వ. అక్కుమారుండు, నిజనిష్ఠీవనాదులు సువర్ణమయంబు లగుటం జేసి, సువర్ణష్ఠీవి యనం బరఁగుఁ; బ్రమోదంబునం బొందుము- ౨౬౧

క. అని యూఱడిల్లఁ బలికిన
విని యాతఁడు సంతసంబు వెల్లిం దేలెం ;
జని యే మీప్సితవర్తన
మున నుండితి; మవ్విభుండు పుత్త్రునిఁ గాంచెన్. ౨౬౨

వ. వాఁడును మలమూత్ర లాలాశ్రుస్వేదంబులు గనకమయంబు లయి తోరుఁగం బెరుఁగుచుండె. ఆ సమయంబున వేచి వెంగలు లగు ముచ్చు లబ్బాలుంబట్టి, [2] నోరం జీర దుఱిగి, యడవికిం గొని

1. = ఆపద. 2. = నోటిలో బట్టదఱిగి.

పోయి [1]యొడలు జల్లించి పసిండి గానక, [2]పీనుంగు వైచి పోయిరి. సృంజయుండును, దనకొడుకు నింద్రుం డపహరించెనను తలంపున శోకార్తినొంది పలవించుచు, నన్నుం దలంచినం బోయి, నీకుం బుండరీకాక్షుం డిప్పుడు సెప్పిన యాదిరాజవిషయంబు లగు శోకోపశమన వచనంబులు సెప్పి, [3]యంకిలి దేర్చి యావిచారు లగుతస్కరులా శిశువుం జంపుట యెఱింగించి, ౨౬౩

క. ముచ్చులమూఢత్వమునం
జచ్చి నరకవాసమునకుఁ జనినతనయు నేఁ
దెచ్చి మగుడంగ వే నీ
కిచ్చెద వగ పుడుగు మింక నేనియు నధిపా. ౨౬౪

వ. అని చెప్పి యేనును, ౨౬౫

—♦ ముచ్చులచేఁ జచ్చిన సువర్ణష్ఠీవి నారదువలనఁ బునర్జీవితుఁ డగుట. ♦—

క. భావమున నమ్మొయికిఁ దగు
దీవన యిచ్చుటయు, నరుగు దెంచె సువర్ణ
ష్ఠీవి గడు నద్భుతమ్ముగ;
నా విభుఁడుఁ బ్రమోదసంభృతాత్ముం డయ్యెన్. ౨౬౬

తే. అతని వీడ్కొని సంప్రీతి నరుగుచుండి
'యింద్రుచేతఁగా దిది; విను, మిక్కుమారుఁ
జంప నింద్రుండు నేచు; రక్షణము మఱవ
వలదు నీ' వని చెప్పితి వసుమతీశ.

వ. ఏను బోయిన కొండొక కాలంబునకు నాఖండలుం డక్కుమారుండు దన్ను మిగులు నని శంకించి చంపింపం దలంచి, నన్నుం బర్వతునిం దలంచి [4]పుయిలోడి బృహస్పతితో విచారించిన, నతం డతని భయం బుడిపె. అతండును దివ్యం బగుట సబుద్ధికంబైన వజ్రంబు

1. = శరీరమును గలయశోధించి. 2. = చంపి పీనుఁగు నటవైచి పోయిరి.
3. = కలఁత. ఉడిపి. 4. = సంకోచించి,

నాలోకించి, 'నీవు శార్దూలరూపంబున సృంజయసుతుండగు సువర్ణ ష్ఠీవిం జంపు' మనుటయు, నప్పని పూని యది సనుసమయంబున-

సీ. సృంజయుం డుజ్జ్వలశ్రీసముల్లాసప్రీ
హర్ష మొప్పంగఁ బ్రియాంగనలును
దానుఁ గుమారయుక్తముగ భాగీరథీ
తీరకాంతార ప్రదేశనిత్య
[1]వసనేచ్ఛ మెయి నుండి, కుసుమాపచయముఖ
బహువిధకేళితత్పరత నొంది
యొండుదలంపు లేకుండ, నద్దంభోళి
వంచన నయ్యెడఁ బొంచి నిలిచి,

తే. తెలిపిగాంచి శార్దూలమై యుఱికి [2]వార
ణేంద్రసమయాను నమ్మానవేంద్రతనయు
[3]వ్రచ్చి యంతర్హితంబయ్యెఁ, జచ్చెవాఁడు;
దాది యాక్రోశమున యార్తనాదమెసఁగ- ౨౬౯

క. విని, సృంజయుండును, బ్రియా
జనములు వేపాఱుదెంచి, చచ్చినబాలుం
గని, బహులశోకపూరం
బునఁ మునిగిరి [4]విప్రలాపములు పెల్లెసఁగన్. ౨౭౦

ఆ. అట్టియవసరమున నమ్మహీపతి నన్నుఁ,
దలఁచె; నప్పు డేను, బలవిరోధి
మది విరోధ ముడిపి, [5]మసలక వచ్చి,
యబ్బాలుప్రాణ మెత్తి ప్రమద మెసఁగ- ౨౭౧

వ. ఉచితసల్లాపంబుల నించుకసేపు నిలిచి, యన్నరపతి యనుమతి సేయ నరిగితి. సువర్ణష్ఠీవియుం దండ్రికి సంతసం బెసంగు తెఱంగునం బ్రవర్తిల్లి, యతని పిమ్మటం బృథ్వీభారంబు పూని, శిష్టానుగ్రహం

1=వసింపవలయునను కోరికతో 2=గజశ్రేష్ఠమునకు సాటియగు నడకగలవానిని ఆరాజు కొడుకును 3.=చీల్చి; ఛేదించి 4.=మిక్కుటముగు ఫలవరింతలు 5.=జాగుసేయక

బులు నడపుచు, జన్నంబులు సేయుచు శతాధికసహస్రవర్షంబులు రాజ్యంబు సేసె అని చెప్పి నారదుండు వెండియు— ౨౭౩

చ. హరియుఁ బరాశరాత్మజుఁడు, నాదరణాతిశయంబునన్ సవి
స్తరత నుపన్యసించిన వచఃప్రకరంబు మహార్థగాథ; మి
మ్మరమహాతోపదేశములు [1]పాటిగఁ బట్టి, వసుంధరా [2]ధురా
ధరణ మొనర్పు; మయ్యెడు నుదాత్తయశంబును ధర్మవృద్ధియున్.

వ. అనిన, నజాతశత్రుం డూరకున్నఁ బరాశరపుత్త్రుండు పరమకరుణా విధేయచిత్తుండై యతని నుద్దేశించి, ౨౭౪

సీ. 'క్షత్త్రియులకుఁ బ్రజాసంరక్షఁ గడచిన
ధర్మంబు గలుగునే! దానివలన
వేదసంచోదిత విప్రకర్మంబులు
లెస్స లయ్యెడు; నవి లేక యున్నఁ
జెడిమెడు; లెస్సైననఁ, జెడినను, రాజున
కగుఁ బుణ్యపాపంబు లగ్గలములు;
గాన జనాభిరక్షణ మొనరింపుము'
నావుడు, నన్నర నాథుఁ, 'డిట్లు

తే. మీరు సెప్పంగ [3]సురియాట మేలె? రాజ్య
కాంక్షమిగిలి, యేఁ జంపంగఁ గానియట్టి
వారిఁ బలువురఁ జంపిన క్రూరతావి
శేష మాత్మ దహించుటఁ జేసి కాక! ౨౭౫

వ. అనిన విని యమ్మునిపతి యమ్మహీపతి కిట్లనియె: ౨౭౬

చ. మనుజులు సేయు నెవ్వారు? సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు;
న్విను, కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మొం
దునో కో [4]కుఠారమున్! జనులు దోసముఁబొందరు; కర్త యీశ్వరుం
డనియెడి నిశ్చయంబు దృఢమై మది నిల్చినఁ జాలు భూవరా. ౨౭౭

1=పరిమాణముగ గ్రహించి 2.=భారము. 3.=సురియాట= ఊఁగులాడుట; సందేహించుట. 4.=గొడ్డటిన్.

వ. కర్మఫలం బీశ్వరునియందియ ; తదర్పణబుద్ధిసహితంబుగాఁ [1]ప్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు. ౨౭౮

తే. ఒప్పకున్నను నాత్మకులోక్తకర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ ; బరకర్మ మొప్పినేని
నార్యజనములు గిల్బిష మండ్రు దానిఁ ;
గాన నడపుము నిజవంశకర్మ మధిప. ౨౭౯

క. అరివధము పాప మని మది
మెర మెర గలిగినను దగిన మెయిఁ జేయుము, భూ
వర, ప్రాయశ్చిత్తము ; [2]గృహాధుర
యుడుగుట మేలె? కీడుతోఁ [3]జా నగునే ? ౨౮౦

వ. అనుటయుఁ, గాంతేయాగ్రజుండు సాత్యవతేయునాననం బాలోకించి, "పుత్త్రులుం బౌత్త్రులు నన్నలుం దమ్ములు జనకులుం దాతలు మామలు గురువులు సంబంధులు సఖులు నల్లురు బావలు మఱందులు, మఱియుఁ బవిత్త్రు లగుధాత్రీపతులు నాచేత మడసిరి. తదీయ స్త్రీజనంబులు పతి సుత సోదర పితృ మరణశోకసంతాపాతిశయంబునం బలవించి పలవించి ప్రాణంబులు విడుతురు. గావున దాని సూక్ష్మంబుగా విచారించిన వనితా వధ పాతకంబునుం బాటిల్లు ; 'ఎయ్యది కడగా నిష్కల్మషుండ నగుదు ?' అను వెగడున మునింగిన మనంబు మహీంభరణంబున కెట్లు సొచ్చు? ఉగ్రంబైన తపంబునం దనువు దొఱంగుట దక్క నొండు విధంబు నాకుం జూడ లేకున్నయది" యనిన [illegible] యమ్మునీశ్వరుండు నిజబుద్ధినిపుణంబు నిరూపించి యా[illegible] కట్లనియె : ౨౮౧

సీ. విడువు మమ్ములికంబు ; వినుము, నీ చెప్పిన
యందఱు, భూముల కాసపడియుఁ,

1. ఎఱుకగలవారు; ప్రజ్ఞానిధులు. 2. =గృహాభరము-(ధుర =సం. వి ఆ స్త్రీ). 3. చావ వచ్చునా?

బెంపును దేశంబుఁ బేరును గోరియు
నీసున సమరంబు సేసి చచ్చి ;
రాపని కిల్బిషం బగునె నీ ? కట్లును
గాక, వారల నెట్టి కర్మగతులు
మృతులఁ గావించెనో మతి నెఱుంగుదె ? వాని
నెఱుఁగుఁ గాలుఁడు ; చావ నేరి కెద్ది

తే. తటి [1]యుతం డప్డు దెగటార్చు; దాని నీవు
సేసినాఁడవుగా మదిఁ జింత సొనిపి
యుడుకు టాకవెట్టి, దీని పైనొల్ల గృహము
విడుతుఁ గా' కను టిది పెద్దవెట్టి యధిప. ౫౨

క. నేర్పరి పెక్కు విధంబుల
నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడు చందం
బేర్పడఁ [2]గాన్పుము కాలన
మర్పితకార్యకరులైన మానవుల దేసన్. ౫౩

వ. నీకుం బాపంబునకుం బనిలేదు ; పని గాకుండుం గాక. ౫౪

క. ఇచ్చఁ గృపకల్మి యొప్పదె!
చచ్చిన నరపతులయేలు జనపదములు నీ
విచ్చెదవుగాక మనమునఁ
బొచ్చెములేక తగ వారి పుత్త్రుల కధిపా. ౫౫

ఆ. కొడుకు లేనిచోటఁ గూఁతుఁ బ్రతిష్ఠింపు ;
దానఁజేసి వారి తల్లు లధిక
హర్ష మొందుదురు ; ప్రియంబును నీకగుఁ ;
బుణ్యమును యశంబుఁ బొందు నిన్ను. ౫౬

మ. అనుమానింపకు, తోడఁబుట్టువులు గారా!-తున్మి తూఁటాడె నెం
దును గ్రొన్నెత్తురు లేఱు లైపఱవ నింద్రుం డుగ్రగతిన్ దైత్యులన్;

---

1. = యముఁడు. 2. = చూడుము.

మును లవ్వీరు భజింపరే! క్రతువు లామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరె! యూర్ధ్వలోకమది గాదో! యేలఁడో నాకమున్!

శా. నీవున్ ధర్మవిరోధు లైన జనతానింద్యాత్ములం బుణ్యమా
ర్గావష్టంభము దేజరిల్ల నృపవంశాచార మొప్పారఁ దో
డై వీరానుజు లుల్లసిల్లఁగ మహోగ్రాజిం దెగం జూచి తా
దేవాధీశుఁడ పోలె; శిష్టపరిషత్సేవ్యుండ వై తాపనిన్. ౨౮౮

ఆ. వలయు నేని, నధిప, వాసవుచాడ్పునఁ
గ్రతుపరుండ వగుము; రాజధర్మ
కలిత మైన పుడమిఁ గైకొమ్ము; తొలి దొలి
యశ్వమేధ యాగ మాచరింపు. ౨౮౯

వ. అనిన విని [1]యంకిలి దేఱిన డెందంబుతో ధర్మనందనుండు 'ఎట్టి
కర్మంబులు పాపంబులు? ఏపాపంబున కెద్ది ప్రాయశ్చిత్తంబు?
మునీంద్రా, యెఱింగింపవే' యనుటయు, నతనికి నమ్మహాత్మం
డిట్లనియె: ౨౯౦

—♦ కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు ధర్మాధర్మంబు లెఱింగించుట. ♦—

ఆ. ఆగమోక్తకర్మ మాచరింపమియును, ని
షిద్ధ మైనదానిఁ జేయుటయును,
ప్రాజ్ఞజనులు, ధరణిపాలవరేణ్య, చె
ప్పుదురు పాపములుగ బోధ్యతతికి. ౨౯౧

వ. ఇది కల్మషసామాన్యనిర్దేశంబు. విశేషంబు వినుము— ౨౯౨

సీ. ఆదిత్యు నుదయాస్తమయకాలముల నిద్రఁ
బొందుటయును, ఛాత్ర భావంబుఁ జెంది
కరుగు దెంచినఁ బూజ యాచరింపమియును,
బరదారగమనంబు, గురుల కెదురు
సేఁతయు, గ్రామంబు సెఱుచుటయును, వేద
విక్రయంబును, రసవిక్రయంబు,

1. =కలఁకఁదేఱిన మనస్సుతో.

భృత్యుఁ బ్రోవమియు, నసత్యప్రచారంబు,
గహనదాహము, నన్యకర్మకృతియు,
తే. దనదుకర్మంబు విడుచుటయును, వృథా ప
శుప్రహరణంబు, మేదినీసురులకలిమిఁ
గొనుటయును, శరణార్థిఁ జేకొనమి, విప్ర
వధయుఁ – బాపంబు లందురు బుధజనములు. ౨౯౩

వ. పాపంబులుం బోలె నుండియు దూష్యంబులు గానివానిం జెప్పెద నాకర్ణింపుము : ౨౯౪

క. దురమునఁ గైదువుఁ గొని తనుఁ
బొరిగొన నేతెంచునట్టిపురుషుని, వేదాం
తరహస్యవేది నయినను,
బొరిగొనినను గిల్బిషంబు వొందదు వత్సా. ౨౯౫

క. 'ధరణీసురవిత్తము నప
హరింపఁగాఁ గని వధించునతఁడు దురితముం
బొరయఁడొకయించుకయు' నని
నరేంద్ర, చెప్పుదురు ధర్మనానార్థవిదుల్. ౨౯౬

క. జీవితసంశయవేళను,
భూవర, యొండన్నపానములు దొరకమిఁ గల్
ద్రావినఁ, గల్లగు టెఱుఁగక
ద్రావిన నద్దురిత మధికధర్మమునఁ జెడున్. ౨౯౭

క. గురుసంరక్షణమునకును
బరమాపద యైనయెడను, బ్రాహ్మణధనముల్
విరహితములు గాఁ, బెఱచోఁ
జొరఁగా నగుమ్రుచ్చిమికి వసుమతీనాథా. ౨౯౮

తే. ప్రాణహాని దప్పించుచోఁ, బరిణయంబు
నందు, గురుజనకార్యార్థ మయ్యు, సంగ
నాజనముతోడి సంభాషణమున, సర్వ
ధనముఁ జెడియెడు నెడ, బొంకఁ జను నృపాలా. ౨౯౯

క. కలలోనఁ జరమధాతు
స్ఖలనము గలిగినను బ్రహ్మచర్యము సెడ; దు
జ్జ్వలవహ్ని నేయి వేల్చినఁ
దొలఁగుం గిల్బిషము దురితదూర చరిత్రా. 300

ఆ. 'అన్న పతితుఁ డైన, నటుగాక సన్న్యాసి
యయ్యెనేని, దమ్ముఁ, [1]డాతఁ డుండ
దారసంగ్రహంబు దాఁ జేసి పాపంబుఁ
బొరయఁ' డంద్రు బుధులు కురువరేణ్య. 301

తే. అడవి గోవుల కై కాల్చు, టధ్వరమునఁ
బశువుఁ జంపుటయును, దానపాత్రభూతుఁ
డగు టెఱుంగక యిచ్చుట, దగనిబంటుఁ
బ్రోవకుండుట- గీడులుగావు వత్స. 302

వ. తపంబుల దానంబుల మఱియునుం దగిన పుణ్యకర్మంబులనుం బాపంబులు పరిక్షీణంబు లగునను నివి సామాన్య వచనంబులు. ప్రాయశ్చిత్తవిశేషంబు లెఱింగించెద : 303

—◆ వ్యాసుఁడు ధర్మజునకుఁ బ్రాయశ్చిత్తవిశేషంబు లెఱిఁగించుట. ◆—

సీ. వినుము, కర్మము దెల్పుచునుగ పాలంబుఁ
నెత్తి నభైక్షాన్న మేకకాల
మశనంబు గొనుచు, [2]ఖట్వాంగచిహ్నము,
బ్రహ్మచర్యంబునై, యధశ్శయనమాచ
రించుచు - నిట్లు పండ్రెండువర్షంబులు
వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య

1. = ఆ అన్న బ్రదికి యుండఁగా. 2. = మనిసికపాలము చివరనుగల దండము చేఁబూని

కిల్బిషంబు దొలంగుఁ; [1]గృచ్ఛ్రముల్ నడపిన
నాఱువత్సరముల నడఁగు; మూఁడు

తే. హోయనంబులు నడపఁ జాంద్రాయణములఁ
బోవు; నిష్ఠానిరతి మాసభోజియైన
నబ్దమునఁ బాయు; నటుగాక యశ్వమేధ
యాజి యగునేని వలదు భిక్షాదు లధిప. ౩౦౪

క. అవనీశ, యశ్వమేధము
నవభృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం
డవుఁ బాపుఁడైనఁ; దత్క
ర్త విశేషము లోకపూజితంబగు టరుదే? ౩౦౫

తే. [2]పుష్టగోలక్ష యొండెఁ, గాంభోజవాజి
శతక మొండెను, భూసురతతికి నొసఁగఁ
బాయు; బ్రాహ్మణార్థాహవప్రాణహాని
యైన నొండెను జెడు బ్రహ్మహత్యకీడు. ౩౦౬

సీ. [3]కల్లు ద్రావినపాతకం బది యగ్నివ
ర్ణము గాఁగఁ గాఁచి పానంబు సేయఁ,

1. = సాంతపనవ్రతములు : మూఁడుదినములు పగళ్ళను, మూఁడు దినములు రాత్రులు భోజనము చేసి, మూఁడుదినములు కోరకయే అప్పటప్పటికి లభించిన పదార్థములను భుజించి, పిమ్మట మూఁడుదినములు శుష్కోపవాసముండుట. (పంచగవ్యమును కుశోదకమును పుచ్చుకొని ఒకరాత్రి యుపవసించుట – అనియు గొందఱ మతము.) 2. = తా. ఒకలక్ష పుష్టిగల ఆవులనుగాని, నూఱు కాంభోజ జాతి గుఱ్ఱములను గాని బ్రాహ్మణుల కిచ్చుచో బ్రాహ్మణుని రక్షించుటకై యుద్ధమునఁ జేసిన ప్రాణహానివలన నేని బ్రహ్మహత్యవలని పాపము నశించును. 3. = తా. కల్లుద్రావినపాతకము దొలగించుకొనుటకుఁ బ్రాయశ్చిత్త విధులు: కల్లును అగ్నివలెఁ గాఁచి త్రాఁగినను, కన్నులుమూసికొని పరువెత్తినను, కేదారక్షేత్రమునుండి హిమాచలము నెక్కిపోయినను, కల్లుద్రావిన పాతకము బాయును. మఱియు, బృహస్పతి సవనము – బృహస్పతి పేరి యజ్ఞము జేసినను, ఎక్కువగా భూదానము జేసినను ఆ కీడుపోవును. గురుభార్యా సంగమము సేసినవాఁడు అగ్గిలో నెఱ్ఱఁగా గాఁచిన ఆఁడురూపుగల ఇనుప బొమ్మను కౌఁగిలించుకొనియు, తన శిశ్నమును గోసి చేతిలో నుంచుకొని ఆకాశము జూచుచు నడచియును, చచ్చియేనియు ఆపాతకము బాపికొనును.

గను మూసి యుఱుకంగ, ననలంబుఁ జొర,
మహాప్రస్థాన మాచరింపంగఁ బాయు;
నట్లును గాక, బృహస్పతిసవన మ
న్కృతు వొనరించిన, నతివిశిష్ట
భూమిదానమునను బోవు నక్కృ; ద్గురు
తల్పగుం డనలప్రతప్త మైన
ఆ. యాయసాంగనాంగ మాలింగనము సేసి
మైనఁ, గోసి కరమునందు మేహ
నము ధరించి యంబరముఁ జూచు చరిగి యే
నియును, జచ్చి యఘము నిస్తరించు. 302

క. గురుతల్పగుండు, రణమున
గురునకు నై చచ్చియేని, గురువర. ధరణీ
సురులకు సర్వధనము భ
క్తిరతి నొసఁగి యేనిఁ బాతకిత్వముఁ దొఱఁగున్. 303

క. ధరణీసురుస్వర్ణము నప
హరించినతఁ డంతకనక మట్టిద వినియో
త్తరుఁ డై మగుడఁగ నిచ్చినఁ
బరిహృతమగుఁ గల్మషంబు పౌరవముఖ్యా. 304

క. అనృతోపచారకలనం
బునఁ బుట్టినపాతకంబు వోవుం, దానె
వ్వని నపచరించెఁ దగ నా
తనిఁ బ్రీతుం జేయ ధర్మతత్త్వప్రవణా. 305

క. గురువునకు మాఱు వల్కుటఁ
బొరసినకల్మషము వాసిపోవు నతనికిం
బరితోషముగా వినయము
వెరవున నుపహార మిచ్చి వినతుండయినన్. 306

క. పరదారగమనదోషము
పరిహృతమగు నొక్కయేఁడు పరమనియతుఁడై
చరియించినఁ [1]కృచ్ఛ్రింబులు,
గురుకులజలనిధిశశాంక, గుణమణిసికరా. ౩౧౨

ఆ. వావి గానియట్టివనితఁ బొందినపాప
మాఱునెలలఁ బాయు నార్ద్రవస్త్ర
ధరణ భస్మశయనపరతఁ బాటించుచు
నియతి నుండె నేని నృపవరేణ్యా. ౩౧౩

క. పరపురుషసంగమంబునఁ
బరిహృతమై యున్నయట్టిభామిని శుద్ధిం
బొరయు రజస్వల యై, కం
చరయఁ భస్మమున శుద్ధమైన విధమునన్. ౩౧౪

ఆ. నఱకఁ-దగనిమ్రాను నఱికిన, దిర్యగ్వ
ధంబుఁ జేసినను నఘంబుఁ బాచి
కొనునరుండు మూఁడు దినములు [2]దనచేఁత
పలుకుచును సమీరభక్షుఁడయిన. ౩౧౫

న. అని చెప్పి వెండియు, ౩౧౬

క. మితభోజి యై [3]వివిక్త
క్షితి సావిత్రీజపంబు సేయుట,యర్హా
స్థితియు, [4]నిశాసీనత్వము
మతి నేమఱ కట్టు లైన మాను నఘంబుల్. ౩౧౭

తే. పుణ్యకర్మముల్ సేయుచు భూసురులకు
వివిధధనములు ప్రీతితో వినయ మొప్ప

---

1. = సాంతపనవ్రతములు-చూడు ఆ౧, ప ౩౦౫. 2. = తన చేసినకృత్యమును చెప్పికొనుచు గాలి నాహారించు చుండెనయెడల. 3. = ఏకాంతప్రదేశమున. 4. = రాత్రులు కూర్చుండియే గడపుట.

నొసఁగుచుండెడువారు [1]పూర్వోపచితము
లైనకిల్బిషములఁ బాతు రవనినాథ. ౩౧౮

క. విను మాస్తికతా శ్రద్ధా
వినయంబులు గలుగువారు వీనికి నెల్లన్,
జననాథ, యర్హు;లవి లే
నినరులు పాపములఁ దొలఁగ నేర్తురె యెట్లున్? ౩౧౯

వ. ఆస్తికతాశ్రద్ధావినయంబులు నీకు సహజంబులు గావె! కావున ప్రాయశ్చిత్తంబు లల్పంబు లైనను బాపంబులం బాపనోపు. పాపంబో యని శంకించు కర్మంబును భారతయోధవధంబ కాదె! అది యాత్మరక్షణంబునకై చేయుటం జేసియు, నుత్తమక్షత్త్రి ధర్మం బగుట నిరూపింపం బాపత్వంబుం బొరయకున్నయది; యట్లుఁ గాక భవదంతఃకరణంబున జనియించిన కరుణయుం, బశ్చాత్తాపంబును నిన్నుం బరిశుద్ధునిం జేసె. నీవు ప్రాణబాధకంబు లగు తపశ్చరణంబులకుం జొరం జూడకుము. కురుకులచూడామణిత్వంబునకు మూలం బయినమహీపాలనం బాచరింపుము. అనిన, నబ్బాదరాయణుతో నమ్మేదినీరమణుం 'డపేయంబులు నభోజ్యంబులు నెయ్యవి? అపాత్రభూతపురుషు లెట్టివారు? మహాపురుషా, యెఱింగింపవె' యని యడిగిన నతం డిట్లనియె: ౩౨౦

క. తురగియు నుష్ట్రియు ఖరియును
గురిసినదుగ్ధములు నింద్యకోటిగణితముల్.
ధరణీసురాదిజను [2]ల ప్పౌరువునఁ
బోయిన నఘంబుఁ బొందుదు రధిపా. ౩౨౧

సీ. మానుషీక్షీరంబు, నీనినపదినాళ్ళ
లోనిధేనువుల పాలును నపేయ
ములు. ప్రేతవిషయాన్నమును, సూతకాన్నంబుఁ,
[3]దలవరియన్నంబుఁ, గులటయన్న

1 = ఇదివఱలోఁ జేసినవి. 2. రూ. పొరుగు=పొంత. 3 రూ. తలారి = దొంగతనము జరుగకుండ కావలిగాయు దొరతనపుబంటు.

మును, ¹వనితోపజీవనశీలునన్నంబు,
²నాడెడు పాడెడు నట్టివాని
యన్నంబు, జూదరి యన్నంబు, ³సూనరి
యన్నంబు, బహి వెట్టి నతనియన్న

ఆ. మును, నిజాగ్రజునకు మును పెండ్లియాడిన
పురుషునన్నమును నభోజ్య మండ్రు ;
⁴వందియన్న మట్లు నిందాస్పదంబు; ⁵ప
ర్యుషితశుష్కములను నుడుగ వలయు. ౩౨౨

క. విను, సురతోఁ గూడఁగఁ
దెచ్చినయట్టిది యెద్దియును భుజింప రభోజ్య
త్వనిరూపణనిపుణత గల
మనుజోత్తము లఖిలలోకమాన్యచరిత్రా. ౩౨౩

క. పులగముఁ, బాయస, మట్లుఁ
⁶బలలము నర్చనకుఁ గాక పక్వము లయినం
గలుగు నభోజ్యత్వము;
విచ్చలవిడి వంటకము సేసి చనదు భుజింపన్. ౩౨౪

వ. అని వెండియు - ౩౨౫

తే. అతిథి పితృదేవతా పూజ లాచరించి
కాని గృహమేధులకు భోజ్య మైనఁ గుడువఁ
దగదు; యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ
నార్యజనములు సెప్పుదు రధిపవర్య. ౩౨౬

క. ఆలును బిడ్డలు బంధులు
నై లీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త
ల్లోలత్వరహితచిత్తత
మేలుగ నలవఱుప వలయు మీఁదెఱిఁగి నృపా. ౩౨౭

---

1. = పడుపువృత్తిచేఁ బ్రదుకువాడు ; కుంటెనకాఁడు 2. = ఆటపాటలచే బ్రదుకువాఁడు 3 = చంపువాఁడు; పూవులమ్మువాఁడు 4. = స్తుతిచే బ్రదుకువాఁడు. 5. చాలకాలము నిలువయుండి ఎండిన వస్తువులను 6. = మాంసము.

—♦ కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు నపాత్రపురుషుల నెఱింగించుట. ♦—

వ. అనియిట్లు చెప్పి యపాత్రభూతపురుషుల నాకర్ణింపుమని పలికె-

సీ. పాడియు నాడియు బ్రిదుకువారల,
బరిహాసకు, దుర్జను, సంగహీను,
మత్తుని, ముచ్చు, నున్మత్తు, నపుంసకుఁ,
జెనటి, మాటలఁ దేల్చు మనుజుఁ, గులము
చాలమి, వేదంబు చదువమి, నిజవృత్తి
హాని, దుర్వృత్తి గలట్టివాని-
దానపాత్రంబులు గా నియ్యకొనరు పె
ద్దలు. దీనుఁడును విపద్బాధితుండు

తే. నీగి కర్హులు. దయ పేర్మి నిచ్చుచోట
నైన నవగుణ మెక్కుడై కానఁబడిన
నిందితాత్ముల కిచ్చుట నిష్ఫలంబు;
పాత్రనిశ్చయ మిట్టిది పౌరవేంద్ర. ౩౨౯

క. శిల చేవమ్రాను దెప్పగ
జలనిధిఁగడవ దొరకొనిన చాడ్పుగఁ బాత్రం
బులు గానియెడల దానం
బులఁ బాపము నిస్తరింపఁబుద్ధిఁ దలఁచినన్. ౩౩౦

ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ
శ్ఛధికనిందఁ బొరయు నట్లు దుష్ట
మై యపాత్రవిషయ మగునీగి వృథపోవు;
నిచ్చుచోటఁ బాత్రి మెఱుఁగవలయు. ౩౩౧

తే. షండునకు బిడ్డ నిచ్చిన చంద మొందు;
బూదిలో నేయి వేల్చుటఁ బోలు,[1] నోటి
కడవ నీళ్ళు లు వెట్టిన కరణి యగు న
పాత్రజనులకుఁ బెట్టుట - పౌరవేంద్ర ౩౩౨

1. = భిన్నకడవలో నీళ్లు వెట్టిన విధమున.

క. దానవిధి యరయ [1]నసమీ
చీనం బగునేనిఁ గీడు సేయుం; గురుధా
త్రీనాథ, మఱియుఁ బాత్రం
బైనను గొన్నతని కిచ్చునతనికి మేలౌ. 333

క. కావున విను, పాత్రము మే
లై విహితాచరణసౌమ్య మగుదానము, ధా
త్రీవర, దాతృదాతలఁ
దా వెలయించు భువనద్వితయరంజకతన్. 334

వ. అని చెప్పి, యేను నీకు బుద్ధులు సెప్పంజొచ్చి సంక్షేపరూపంబునం గీడుమే లెఱింగించితి. ఇప్పలుకులు పాటిగాఁ గొని విహితానుష్ఠాన పరుండ వగు మనుటయు, నమ్మనుజపతి యమ్మునిపతితో, 'మహాత్మా, భవదనుగ్రహీతంబు లైన యివ్వాక్యంబులు కర్ణంబు నావహించె; ఎప్పాట ధర్మం బగుమార్గం బవలంబించి రాజ్యతంత్రంబు నడపి యశుభంబునం దొడరక జయింతు నట్టి తెఱంగు గలుగం గృప సేసి, రాజధర్మంబులుం, దక్కనుం గలుగువర్ణాశ్రమ ధర్మంబులు, నాపద్ధర్మంబులును లోనుగా నెఱుంగం దగుధర్మంబు లెల్ల నెఱింగింపవే. నాకు రాజ్యంబును ధర్మచర్యయును బరస్పర విరుద్ధంబు లయిన ట్లున్నవి గావున నివ్విధంబున విన్నవింప వలసె' నని చెప్పుటయు, నత్తాపసోత్తముండు, ప్రీతచిత్తుండై, యతండు విన, నారదుతోడ 'నీభూపతి భీష్ముపాలికిం బోవలయు. అయ్యార్య వర్యుచేత సకల ధర్మంబులు వినువాఁ డగుట యర్హ ప్రకారంబు' అనవుడు, నారదుం 'డిది లెస్స'యని పలికిన, నప్పరాశరపుత్త్రుం డయ్యజాతశత్రుున కిట్లనియె: 335

ఆ. కురుపితామహుండు గురుబుద్ధి
నిందాదులకును మాననీయుఁ, డకుటిలాత్మ

1. = తిగనిది.

కుండు, పరశురాము కోదండవిద్యాది
సుగుణములకు నెల్లఁ జొచ్చినిల్లు. ౩౩౬

క. [1]సురతటినీపుణ్యతమో
దరమున జన్మించినాఁ డుదాత్తపవిత్రత
త్పరుఁ; డతని కెల్లధర్మముఁ
[2]గరస్థలామలకసన్నికాశం బధిపా. ౩౩౭

క. చ్యవనుఁడు, మార్కండేయుం
డు, వసిష్ఠుఁడు లోనుగాఁ బలుప్రాజ్ఞులు గా
రవమున వినిపింపఁగఁ దెలి
యు వినియె ధర్మప్రపంచ మతఁ డఖిలంబున్. ౩౩౮

తే. శాంతమానసుఁడైన యాశాంతనవుఁడు
విస్మయావహచరితుండు, వినుము, వలసి
నపుడు విడుచుటకై ప్రాణ మాఁగినాఁడు
గాదె ? యొరు లంతవా రెందుఁ గలరె నరులు? ౩౩౯

చ అతనికి నీపయిం గరుణ [3]యగ్గల ; మ ట్లగుటం, గురుత్వమా
పతివర, ప్రేమ్మి నీ వతనిపాలికి; నాతఁడు నిన్ను నంప్రబో
ధితుఁడుగఁ జేయు, ధర్మములు దేటపడంగ నుపన్యసించు, మా
మత మిది- దీనఁ గీర్తియు సమంచితధర్మముఁ బెంపు నొందెదుఁ.

వ. అయ్యుత్తమోత్తమునకు నూర్ధ్వలోకగమనంబునకు సమయం
బాసన్నం బగుచు వచ్చెం; దడయ కట్లు సేయుము అనిన విని
యవ్వసుమతీపతి, 'మునీంద్రా, బహుబంధువధపాతకం బాచరించి
యమ్మానసీయాత్ము నెదిరి కెట్లు వోదు ? అట్లుంగాక యకృత్రిమ
సమరశీలి యగునగ్గుణశాలిం గృత్రిమసమరంబునంగూల్చి క్రమ్మఱ
నమ్మహాత్ము మొగంబు సూచి నాకు ధర్మంబు లుపదేశింపవేయని
యడుగనేర్తునే!' యనుటయు, నజ్జననాథునకు జనార్దనుం డిట్లనియె:

1.=గంగాదేవియొక్క పుణ్యగర్భమునఁ బుట్టినవాఁడు. 2=అఱచేతిలోని ఉసిరికవలె. 3.=అధికము.

తే. ఇంతనిర్బంధ మేటికి ? నిమ్మునీంద్రు
పనుపు సేయుదుగాక యిప్పాట ; నెల్ల
పెనుపులకుఁ బాత్రమయ్యెదు; వనటతోడ
నెద్దియుననేల? పురమున కేఁగు మిపుడు. ౩౮౩

వ. మరల గాంగేయుకడకు వత్తు వది మేలు లె మ్మని పలికి వెండియు,

తే. తమ్ములును, విప్రవరులును, ధరణిఁ గల్గు
బహువిధంబుల ప్రజలును, బార్థివేంద్ర,
చాతకప్రకరములు పర్జన్యుఁ గోరు
నట్లు నినుఁ గోరు టతికృప నాదరించి– ౩౮౪

వ. ఈ సర్వజనంబుల మనోరథంబులు సేయు మని ప్రార్థించె. ఇవ్వి ధంబునం గృష్ణ కృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను విష్ణులు లోనుగాఁ బెక్కండ్రు పెక్కు దెఱంగులఁ జెప్పిన వాక్యంబులఁ జిత్తంబు కలంక దేఱి కౌంతేయాగ్రజుండు రాజ్యభారనిర్వహణోత్సాహం బంకురింప, శిశిరాగమసనుయకమలంబు ననుకరించు నాననంబుతో నప్పారాశర్యప్రముఖమునివరులకుం బ్రదక్షిణంబును బ్రణామంబును నాచరించి, వారలవలన వసుమతీవహనానుజ్ఞయు వివిధాశీర్వాదంబులుం బడసి వెలింగె; వారును నిజస్థానంబులకుం జనిరి. తదనంతరంబ– ౩౮౫

సీ. దేవ భూదేవ పూజావిశేషము లాచ
రించి యక్కురుకుల శ్రేష్ఠుఁ, డుర్వి
నెడ నెడ బ్రుంగుడువడి యున్న రాజులు
సనుదెంచి కను నవసరము వేచి
యునికి కృష్ణునిచేత విని, [1]పూసి [2]తొడి [3]కట్టి
కొలు విచ్చి, మణిహేమ కుంజరాశ్వ
కాంతాదు లగుతగు కానిక ల్గైకొని
యానృపాలురకుఁ బ్రియం బొనర్చి,

1. గంధము పూసి 2. ఆభరణముఁ దొడిగి. 3. దుకూలములఁ గట్టి.

తే. యమ్ముకుందుండు, వారును, దమ్ముగమియుఁ,
దక్కఁ గలబంధు మిత్రులు, ధౌమ్యముఖ్య
సూరిజనములు బలయుంగఁ, దారకముల
మధ్యమునఁ బొల్చు చంద్రుని మాడ్కిఁ బొలిచె. ౩౮౬

వ. మఱునాఁడు [1]కల్యంబునం గాలోచితకృత్యంబు లాచరించి, ధవళానులేపనమాల్యవస్త్రాభరణంబుల నలంకృతుండై- ౩౮౭

క. నవమగు రథమున షోడశ
ధవళహారులఁ బూన్పఁ బనిచి ధరణీపుఁడు విధుం
డవిరళసుధారథం బె
క్కువిధముదోఁపంగ నెక్కెఁ గురువంశనిధీ. ౩౮౮

శా. సారథ్యంబు వహింప భీముఁడు, సితచ్ఛత్త్రంబు గాండీవి సె
ల్వారం బట్టఁగఁ, జామరల్ గవ లిడన్, హారిప్రభం బయ్యె; న
త్తేరం దేవురు నగ్నిపంచకము వేదిం బొల్చున ట్లొప్పి; రం
భోరాశిధ్వనివోలెఁ దూర్యనికరంబుల్ మ్రోసె నొక్కుమ్మడిన్. ౩౮౯

— ధర్మరాజు సపరివారంబుగా నగరంబు ప్రవేశించుట. —

వ. ఇట్లు నితాంతకాంతిప్రకారుండై పాండవాగ్రజుండు, పాండురాజాగ్రజు నతనిదేవిం బ్రభూతాందోళికారూఢులం జేసి పురస్కరించుకొని, శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లనువాహంబులఁ బూన్చినరథంబున సాత్యకి సహితుండయి వెలుంగు వెన్నునిం బిఱిందిదెసం బెట్టికొని, యతనికెలన మనోజవంబులగు హయంబులం బూన్చిన [2]ఱువదాతస్యందనంబున యుయుత్సుం డరుగుదేర, నుచితవాహనారూఢుండై విదురుండు కుంతీప్రముఖకురుస్త్రీజనంబుల నందలంబుల నిడికొని వెనుక నడవ, నరేంద్రులు నానాముఖంబులం దమతమ సేనలతోడం గూడఁ గొలిచి చనుదెంచుచుండం జనునప్పుడు— ౩౯౦

1. వేకువను. 2. = తెల్లని తేరునందు.

క. ద్విరదంబుల నరదంబులఁ
దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబుల [1]సీ
విరులన్ గొడుగులఁ బడగలఁ
బరిస్ఫురిత మయ్యె నతనిపయనంబు గడున్. ౩౫౧

వ. మఱియును, ౩౫౨

క. వందిజనులుఁ బాఠకులుం
గ్రందుకొనం బొగడఁ జదువఁగా, మాగధు లా
నందముగఁ బాడ నుచితపు
మందత్వము గమనమునకు మహిమయొనర్పన్. ౩౫౩

వ. అన్నరనాథుండు నడచి నాగనగరంబు ప్రవేశించె. అంతకు మున్న యందలిజనంబులు, [2]గలువడఁగలను దోరణంబులను, క్రముక కదళీస్తంభ పూర్ణకుంభస్థాపనంబులను, గస్తూరి కలయంపులను, గర్పూరపుముగ్గులను, బుష్పోపహారంబులను, ప్రాలంబమాలికలను నొప్పుమిగుల నప్పురం బలంకరించి, యాబాలవృద్ధంబుగాఁ బరమాంబరానులేపన మాల్య భూషణంబులం బొలిచి, బహుల ప్రమదంబున సముదంబు లగుసంచారంబులం జారుత్వవిశేషంబుల వహించిరి. అక్కురురాజోత్తముండు రాజమార్గంబు దఱిసి చనుసమయంబున - ౩౫౪

తే. హర్మ్యములనుండి పణ్యపుణ్యాంగనాని
కరము లక్షతయుతమౌక్తికముల సేస
లలుకఁ, గల్పలతానిచయములు పుష్ప
వృష్టి వెల్లుగఁ గురిసినవిధము దోఁచె. ౩౫౫

వ. అట్టియెడఁ జూడం బఱతెంచిన పౌరజానపదజనంబులు - ౩౫౬

సీ. 'దిగ్విజయంబునం దేజస్వియయ్యె న
జాతశత్రుం డనఁ జను నితండె;
'రాజసూయమహాధ్వరము సేసి విప్రులఁ
గనకరత్నాదులఁ దనిపె నితఁడె;

---

1. = పా. సీగిరుల్ = వింజామరలు. 2. పా. కలువడములను = ఉత్సవాదులలో ధ్వజస్తంభమునకు వ్రేలగట్టెడు బంగారు కుంచపుదండలను

'నిత్యవ్రతంబుగా సత్యంబు పాలించు
నిష్ఠ యస్ఖలితగా నెఱపె నితఁడె ;
'ధర్మైకనిరతుఁ డీతం డొక్కరుఁడచుమ్ము
యని పల్కుటకుఁ బాత్ర మయ్యె నితఁడె ;
తే. 'బలముఁ దగవును ధర్మంబు వెలయఁ బగఱ
ననవశేషంబుగాఁ దెగటార్చె నితఁడె;'
యనఁగ మఱియును వివిధకీర్తనల హర్ష
వచనముల నుల్లసిల్లురవంబు మిగిలె. 3౫౭

క. లావులు వెరవులుఁ దాల్మలుఁ జేవలు
నస్ఖలితములుగఁ జెల్లుపనులు నా
నావిధములఁ బేర్కొనుచుం
బావని నరుఁ గవల బొగడు పటురవ మెసఁగెన్. 3౫౮

క. 'వ్రతచర్యయు భాగ్యంబును
ధృతియు మతియు నరయ ద్రౌపదికి నెనయగు భూ
పతివల్లభాజనము లీ
క్షితిఁ గలరే?' యనురవంబు సెలఁగెం గలయన్. 3౫౯

వ. ఇట్లు పెల్లయిన మ్రోఁతను దరంగితంబు లైననెరవుల పెంపునఁ బురంబు చంద్రోదయఘూర్ణమానం బైనమహార్ణవంబు ననుకరించె. ఆధర్మరాజు రాజమందిరద్వారంబు సేరం జనియె. అప్పుడు బహువిధంబులగు శోభనద్రవ్యంబులు గరంబులం గొని భవ్యభూసురులును బుణ్యాంగనలును నెదుర్కొన, వాని నెల్లం గైకొనుచుం బ్రవేశించి, యతం డేనుంగుమొగసాల నరదంబుడిగ్గి, ధౌమ్యధృతరాష్ట్రపురస్సరంబుగా నభ్యంతరనివాసంబు సొచ్చి, గృహదేవతలం బూజించి మగుడ బహిరంగభూమికి వచ్చి, నగరదేవతాపూజలు సేయింపం దగువారలం బనిచి, బ్రాహ్మణసంఘంబులం [1]గానిపించుకొని కనకంబులును గోవులు మొదలైన వివిధ

1. = దర్శించి.

వస్తువులు నొసంగె. అప్పుడాశీర్వాదనాదంబులను, శంఖభేరీప్రముఖ మంగళతూర్యరవంబులను రోదసి పిక్కటిల్లె. తదనంతరంబ నిశ్శబ్దంబై యున్న సకలజనంబులును సజ్జనపాలునాననం బాలోకించు చుండిరి. అట్టియెడ దుర్యోధనసఖుండైన చార్వాకుం డనునొక్క రక్కసుండు విప్రాకారంబుఁ గైకొని త్రిదండివేషం బలవడ నయ్యవనీదేవతాకోటిలో నిల్చి యున్నరనాథు కిట్లనియె: ౩౬౦

—◆చార్వాకుం డను రాక్షసుఁడు బ్రాహ్మణని గ్రహంబునఁ జచ్చుట.◆—

చ. వినుము, నరేంద్ర, సర్వ మగువిప్రజనంబును గూడి నన్నుఁ బం
చినవిధ: 'మీఁత డేటిపతి? సేసినపాపము పెద్ద. చంపుచో
జనకుఁడు భ్రాత పుత్త్రుఁ డనుశంక యొకించుక లేదు; సద్గురుం
డనియెడికొంత బుద్ధి నిసుమంతయుఁ బుట్టదు; వీనిఁ గాల్పనే?'౩౬౧

వ. అను మని రని పలికి వెండియు, ౩౬౨

ఆ. 'ఇట్లు శిష్టజనము లేవగింపఁగఁ జేయు
రాజ్య మేల? బంధు రాజి నెల్లఁ
బొలియ జేసి యెట్టి భోగంబు లనుభవిం
చెదవు? కల్మషంబు చిక్కె నీకు.' ౩౬౩

వ. అనిన విని యవ్విప్రు లత్యంతవ్యథితాంతఃకరణులగుచు నొండొరుల మొగంబులు సూచి, 'యిట్లు వుట్టం బని యేమి?' అను వచనంబులతోఁ దిరుగుడువడిరి.ధర్మనందనుండు లజ్జావనతవదనుండై యూరకుండి వారలవలను గనుంగొని కేలు మొగిచి ఫాలభాగంబునఁ గదియించి యిట్లనియె: ౩౬౪

తే. 'మ్రొక్కి వేఁడెద ననుమీరు ధిక్కరింప
కాదరింపుఁడు; మునిసమూహానుమతుఁడ
నై వినిశ్చయపరికలితాంతరంగ
వర్తనముతోడ నిచటికి వచ్చినాఁడ.' ౩౬౫

వ. అనవుడు, భయసంభ్రమభరితు లగుచు నాభూసురులు, 'దేవా, యీవాక్యంబులు మావలనం బుట్టినవి గావు. ఇది యేమియో

కాని నీ వుత్తమక్షత్త్రధర్మంబున సముపార్జించినయుజ్జ్వలశ్రీ సుస్థిరతం బొందెదు' మని యతనికి నాశ్వాసంబొనర్చి యమ్మాయాభిక్షువు నాలోకించి, పరమబోధంబున నప్పురుషాధము నెఱింగి, యమ్మహీపతితో, 'వీఁడు దుర్యోధనసఖుండగు రాక్షసుండు; సన్న్యాసి వేషంబున నేతెంచి యాతనికి హితం బాచరించువాఁడై యీ దుర్వచనంబు లాడె. ఈకుక్క మొఱఁగినయంతన పాలమున్నీరుం బోని నీకుం గలంగ నేల? ధర్మాత్ము లగుతమ్ములు పనుపు సేయం బూజ్యంబగు సామ్రాజ్యంబు వహింపు' మని యాదరించి,

క. ఆరాక్షసుఁ గనుఁగొని కో
పారంజితనేత్రు లగుచు నవ్విప్రులు హుం
కారముఖరు లగుటయు నతి
ఘోరాకృతితోడ వాఁడు గూలెం బుడమిన్. ౩౬౭

తే. బ్రహ్మతేజోనిహతి నిట్లుపడి మహాశ
ని ప్రహతిపాతితోర్వీజ నిభత నొంది
యున్నయద్దానవునిఁ జూచి యన్నరేంద్రుఁ
డెలమిసొంపు వహించెఁ దమ్ములును దాను. ౩౬౮

వ. ఇట్లు ప్రీతుండై యజాతశత్రుం డవ్విప్రసమూహంబునకు సవిశేషార్చనం బొనర్చి వీడుకొలిపె. అప్పు డచ్యుతుండు బ్రాహ్మణస్తుతి సేసి యజ్జనపతితో నిట్లను: కృతయుగంబునం జార్వాకుం డనుదైత్యుండు తపం బొనరించి పద్మభవుండు ప్రత్యక్షుం బయిన, నఖిల భూతంబులవలనను నభయంబు వేఁడిన, నద్దేవుండు 'భూదేవతల కనిష్టంబులైనపనులు సేయకుండువాఁడవు; చేసితేని నదియ నీకుఁ దుది' యని పలికి యవ్వరం బొసంగె: అట్లు లబ్ధవరుండై వాఁడు గర్వించి గీర్వాణుల బాధింపందొడఁగిన, వారు విరించిం గాంచి యారక్కసుండు సేయుబాధలు సెప్పిన, నమ్మహాత్ముం డేను మున్న యెఱింగి యొనర్చినవాఁడ; దుర్యోధనుం డను రాజునకు నెచ్చెలి యై యచ్చపలుండు తత్కార్యం బాచరింపుచు జనించి మహీసురులకు మనోవ్యథాకరం బగుకర్మంబు సేయు, నప్పుడు కారణంబుగా వారల

కోపంబునం గూలం గలవాఁ' డని పలికె. అద్దానవుండు నేఁ డిట వచ్చి తనదుర్వినయంబున బ్రహ్మదండనిహతుం డై పడి యున్న వాఁ'' డని చెప్పి యప్పీనుంగు వెడల వైపించి యాభూపాలు నుద్దేశించి వెండియు - ౩౧౯

ఆ. మాఱుకొన్నవారి సీఱు సేయుము; ప్రజ
నరసి మనుపు; ధరణిసురులఁ బ్రోవు;
మఖిలబంధుజనుల నాశ్రితులను సుఖ
వృత్తిననుపు పెంపు వెలయ నధిప. ౩౨౦

వ. రాజ్యాభిషేకశోభనం బనుభవింపుము అని పలికి, [1]యాభిషేచనికద్రవ్యానయన సంభారంబులు సమకట్టించుటకుం దగువారిం బనిచి, బయలి పెద్దకూటంబున నమ్మహీపతికి మహోన్నత హేమమయ సింహాసనంబు వెట్టించి, వలయువారల కెల్ల సముచితసమంచిత పీఠంబులు పచరింపఁ గవ్వడి నియోగించిన, నప్పాండవాగ్రజుం డుల్లంబుకలంక యెల్ల డిగ్గఁద్రావి యిచ్చం దెలి వొంది చెలువొందునిజపీఠంబునఁ [2]బూర్వాభిముఖుండై కూర్చుండె. అతని కట్టెదురం గనత్కాంచనాసనంబున సాత్యకిసమేతంబుగా శౌరియు, [3]వలపటను [4]దాపటను మణిపీఠంబుల [5]వడిముడియుఁ [6]గవ్వడియు, వెనుకం గనకాయతకుథాసనంబులం [7]గవల నిరుపక్కంబుల నునిచికొని, కుంతీమహాదేవియు దామోదరుదక్షిణదిక్కున, నర్చిస్సముజ్జ్వలం బగునాసనంబున ధృతరాష్ట్రుండును, దదీయప్రాక్ప్రదేశంబునం బ్రిస్ఫురితపీఠంబుల విదురుండును ధౌమ్యుండును, ధృతరాష్ట్రునిపిఱుంద నర్హపీఠంబుల గాంధారీ యుయుత్సు సంజయులునుం గూర్చుండిరి. ఆసమయంబున నంబుజాక్షుండు కృపావిశేషంబునఁ గృపాచార్యుం దగు తెఱంగున నయ్యజాతశత్రుిం గానిపించి

1. అభిషేచనమున కగు ద్రవ్యములను, (ఆనయనంబునకున్ =) తెచ్చుటకు. 2. =తూర్పుదిక్కు ముఖముగా 3. కుడివైపున. 4. ఎడమప్రక్కను. 5. =భీముఁడు (శత్రువులఁ దపింపఁజేయువాఁడు). 6. =అర్జునుఁడు (కవ + వడి - ఇరుచేతుల వడిగలవాఁడు). 7. =యమళులను (నకుల సహదేవులను).

యోగ్యాసనంబున ధౌమ్యుసమీపంబున నతని నునిచె. అంత నప్పుడమితేఁడు సితకుసుమ మాక్షత కాంచన రజత రత్నగర్భా స్పర్శనం బాచరించె. తదనంతరంబ- ౩౭౧

సీ. విద్వత్సమూహంబు, వివిధ దేశాధీశ
సంఘంబుఁ, గార్యవిచారపరులు,
సర్త్విజనాదికృత్యంబులవారలు,
బహుపరిచర్యలఁ బరగుజనులు,
వైశ్యప్రముఖ పౌరవర్గంబులును, ముఖ్య
పాలికాది జానపదావలులును,
వైణిక గాయక [1]వాంశికాదివినోద
కరులును, వారసుందరులు- లోను

ఆ. గాఁగఁ దగినవారు గాంచి యవ్విభుని స
త్కారములఁ బ్రమోదితంబు లగుచు
భావములు దలిర్ప సేవించియుండ న
క్కొలువుసాలనొప్పెఁ గురువరేణ్య. ౩౭౨

—♦ ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము. ♦—

వ. అంత, అభిషేచనికద్రవ్యసంచయంబు సన్నిహితంబగుటయు, మాధవానుమతుండై ధౌమ్యుఁడు [2]ప్రాగుదీచీప్లవంబైన వేదికాతలం బలంకరించి, యందు [3]జాతరూప నవరత్నఖచితంబును దృఢపాదంబు నగు భద్రపీఠంబు ప్రతిష్ఠించి, శార్దూలచర్మాస్తరణశోభితంబు సేసి యర్చించి, కాంచనభాజనజుష్టం బగునుత్కృష్టఘన శంఖంబు [4]సమంచితస్థండిలంబుననిలిపి పూజించి, దానను దాని చుట్టునుం [5]బార్థివంబులు, [6]హైమంబులు రాజతంబులు రత్న

1. = వేణునాదాదులచే వినోదము గల్పువారును. 2. = తూర్పు-ఉత్తరమునకు వాటముగా వేయఁబడిన తిన్నె. 3. = బంగారము. 4. పూజ్యమైన (స్థండిలంబున-) వ్రతమూనినవాని శయనమునకుఁగా దర్భాదులచే సంస్కరింపఁబడిన భూమిని; గోమయాదులచే శుద్ధిచేసిన నేలమీఁద అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరింపఁబడిన భూమి (అని కొందఱు.) 5. మట్టివి 6 బంగారములు. 7. వెండి.

మయంబులు, నగుకుంభంబులొనర్చి [1]వాననుగాంగంబు లగుజలం
బులు నినిచి, యన్నింటికి రత్నమంగళతరుత్వక్పల్లవ కుసుమంబులను
బంచగవ్యంబులను సమంత్రికముగా సంస్కారంబు నిర్వర్తించి—

సీ. వీర్యవంతము లగు వివిధమంత్రంబుల
తోఁగూడ సద్విజస్తోమపరివృ
తునిఁ జేసికొని రాజుఁదోడ్కొని యేఁగి, యా
వినుతపీఠంబున నునిచి, శోభ
నాలంకరణమున నభిరామ మైనపాం
చాలిఁ దద్వామపార్శ్వమున సహాస
మాసీనఁ గావించి, యగ్నిముఖము సేసి
కొని హోమతంత్రివర్తన మొనర్చి

తే. నంత నూర్జితశుభవేళ యగుడు, శంఖ
చక్రధరుఁ డాసమర్చితశంఖ మెత్తి
'పృథివి కధిపతి వగు' మని ప్రీతి నా పృ
థాసుతాగ్రజు నభిషిక్తుఁ జేసె నధిప. ౩౨౪

వ. అప్పుడు చిత్తంబు త్తమప్రకారంబై యాంబికేయుండు, ప్రసన్నవద
నుండగుచుం, బ్రతిష్ఠితంబు లయినకలశంబులలో నుజ్జ్వలం బగు
నొక్కటి ధౌమ్యుం [2]డంది యీ నెత్తి యాభూపోత్తము నభిషే
కించె. మఱియుం బ్రభూతాత్ములగు రాజులును బ్రకృతులలోనం
దగువారును దదభిషేకశోభనం బాచరించిరి. శం [3]ఖానక దుందుభి
ప్రభృతి మంగళతూర్యంబులు గంభీరనాదంబులం జెలంగె. ఇవ్వి
ధంబున సుహృజ్జనహృదయంబు లానందింప ధర్మనందనుండు
సామ్రాజ్యపదస్థుండై [4]భూసుర దీ నానాథప్రముఖపాత్రంబులకు
వివిధబహుధనంబు లొసంగె. అట్టియెడ, విద్యావిశిష్టబ్రాహ్మణాది
పురుషసత్తము లక్కురుసత్తమున కభిముఖులై, 'దేవా, దైవమా
నుషంబులకలిమి నతిమానుషం బగు నీవిజయంబును, వసుధాధిపత్య

1. వా నియందు గంగాజలములనించి. 2. అంది ఈఁ అందితీయుఁగా రి.తే ప్పె
... 4. భూసుర ధీశ ఆనాథప్రముఖ......

సంప్రాప్తియు నింత యొప్పునే!' యనిన విని, వారలతో
నవ్వసుంధరావల్లభుండు— ౩౨౫

సీ. 'కలిగ లే కుండె, ని ట్లలఘుగుణంబులు
వాక్రుచ్చి మీయంత వార లిట్లు
గొనియాడఁ బాండునందనులు ధన్యాత్ముల'
యని పల్కి యంబికాతనయుఁ జూచి,
'తండ్రియు గురువును దైవతం బీతఁడ
మాకు; మీ రెల్ల నీ మనుజవిభుని
పనుపు సేయుటయు, నీతనికిఁ బ్రియంబు గా
వించుటయును, మమ్ము వేనవేల

తే. విధులఁ బ్రీతులఁ జేత; యుర్వీజనములుఁ
బౌరులును, మీరలును దొంటి భంగిఁ దప్ప
కిమ్మహారాజునెడ వినయమ్ముతోడ
నడచుచుంటయ యెంతయు నాకుఁ బ్రియము ౩౨౬

క. 'జ్ఞాతివధ మిట్లు సేసియు
నీతనిఁ గొల్చుటకుఁ గాఁగ నీగృహధర్మో
పేతత్వముఁ బొరసితి; భూ
భూతికి మనకు విభుఁ డీప్రభువ మఱవకుఁడీ.' ౩౨౭

వ. అని చెప్పి నిజేచ్ఛ వర్తించి సుఖుం బుండువారుగా వినయంబుతో ధృతరాష్ట్ర గాంధారుల నగరిలోని కనిచి, పౌరులను జానపదులను బోవంబనిచి, సగౌరవంబుగాఁ గృపాచార్యు నిజనివాసంబున కరుగ వీడ్కొలిపి, యువరాజపదంబున భీమసేను నిలిపి, కర్తవ్యవిచారం బునకుం, దదీయనిశ్చయంబునకును, సంధివిగ్రహాదిషాడ్గుణ్య చింత నంబునకును విదురునిం బ్రియవచన పూర్వకంబుగా నియోగించి, వలయుపనులు వెనుకముందఱరసి యెఱింగించుటకు నాయవ్యయంబు లెఱింగించుటకును సంజయుం బొనిపి, సేనలకొలంచులు గనుంగొను టకు భృత్యులకు జీవితంబులు వెట్టుటకుఁ గర్మకలాపంబులు సేయిం చుటకు నకులు నాజ్ఞాపించి, దర్పితుల మర్దించుటకుఁ బరచక్రంబు

లాక్రమించుటకు నర్జును నిర్దేశించి, బ్రాహ్మణకార్యంబులకు శ్రౌతస్మార్తకృత్యసమనుష్ఠానంబునకు ధౌమ్యుం జాలించి, సహదేవుం జూచి, 'నీవు మదీయగోపనపరుండవై సర్వావస్థల యందును మత్సమీపంబున నిల్చునది' యని పలికి, మఱియుం గరణీయంబు లగునధికారంబుల నెల్లను [1]గల్పించి [2]వారలమీఁదన పెట్టి, యుయుత్సుం గనుంగొని విదుర సంజయుల నాలోకించి, 'మీర లనుదినంబును నవధానంబు గలిగి రాచవారియోగక్షేమంబు లేనె ట్లట్ల నిర్వహింప వలయు. పురజనంబుల భోజనంబుల కర్జంబులు రాచవారి కెఱింగించి, పంచినట్లు నడపం గలవార' లని యప్పగించి, యభ్యంతరమందిరంబునకు విజయంచేయు మని కుంతీదేవినిం బాంచాలీసహితంబుగాఁబుచ్చి— ౩౭౮

తే. ప్రేమసంప్రీతివినయమిశ్రితవిలోక
నంబు గృష్ణునిముఖకమలంబునందు
మాసరం బగువికసనమధువునకు మ
ధువ్రతం బయి నిగుడ నా సువ్రతుండు— ౩౭౯

వ. అమ్మహాత్ముని సాత్యకిసహితంబుగా వీడుఁబట్టున కనుప ననుజన్ముల ననిచి, యుచితవర్తనంబున నుండి పదంపడి భండనంబునం జచ్చిన వారిం జిత్తంబున నిరూపించి, తొడంగి— ౩౮౦

తే. బ్రాహ్మణానుజ్ఞతోఁ గూడ బంధుజనుల
కందఱకు వేఱువేఱ మహావిభూతి
వెలయ నంచితశ్రాద్ధక్రియలు సభక్తి
కముగ రత్నహేమాదిదానములు మెఱయ. ౩౮౧

వ. అనుష్ఠించి ద్రోణాచార్య ద్రుపద తద్బంధు విరాట తదీయజ్ఞాతులకును, ప్రత్యేకంబ కర్ణాభిమన్యుప్రభృతుల కె ట్లట్ల సర్వదక్షిణసామగ్రి వెలయం బరలోకక్రియలు నిర్వర్తింపం జేసి, దుర్యోధనాదులకు నంతకంటె విభవం బెసంగ ధృతరాష్ట్రుం డౌర్ధ్వదైహిక

1 పా. దలపించి; ఘటించి; గలాపించి, 2. "వీరలు వీర లని వారివారిమీదన- వారలమీదన- పెట్టియుండక యుయుత్సునింగనుంగొని 'నీవును నిర్వహింపు' మని పనిచి"

విధు లాచరించునట్లుగా నొనర్చి, తా నెఱింగినవారల కెల్ల లగ్న సేయుటకుఁ దగుబంధులు లేనివసుంధరాధిపుల నెల్ల నుద్దేశించి యంచితదానంబులతోఁ జేయ ధౌమ్యుంబనిచె. మఱియును, ౩౮౨

క. చలిపందిరులును సత్త్రం
బులుఁ బెట్టించెను; దటాకములు దేవగృహ
మ్ములుఁ గల్పించెను; బంధుజ
నులకు సుగతి యగుటకై వినుతభంగిన్నృపా. ౩౮౩

క. లోకమునఁ గలుగుభూసుర
లోకమునకు నెల్ల గోవులుం బసిఁడియు నా
నాకల్పంబులు, బంధులకై
కోటివిధముల నిచ్చె నతులితభక్తిన్. ౩౮౪

వ. ఇట్లు సకలబాంధవసుహృజ్జనంబులకుం బారలౌకికక్రియలు సేసి, [1]యనృణత్వంబున వెలింగి జగంబులచేతం బొగడు వడసి, కృతకృత్యతం బొందె. ఇవ్విధంబునం బ్రాప్తసామ్రాజ్యుం డయిన పాండవాగ్రజుం డొక్కసముచితావసరంబున గోవిందున కభిముఖుం డయి వినయంబునం గేలు మోగిచి – ౩౮౫

—♦ధర్మజుఁడు శ్రీకృష్ణు నుచితవచనంబుల స్తుతియించుట♦—

తే. అమలభవదీయసుప్రసాదమునఁ జేసి
పితృపితామహక్రమయోగ్యపీఠమైన
వినుతసామ్రాజ్యమున కేను విభుఁడనైతి కృ
తార్థతానందపూర్ణుండనైతిఁ గృష్ణ. ౩౮౬

వ. అని మఱియును; ౩౮౭

క. బావలు మఱఁదులు ననుచును
నీవు కృపాతిశయము మెసఁగ నెపుడు నిమ్ము
ల్గావను బ్రోవను దలఁచి,ర
మావర. కలిసికొని తిరిగి మన్నించుటలన్. ౩౮౮

---

[1] అనృణత్వము–అఋణత్వము–ఋణము కానిది.

వ. తేఁకువ లేక మెలంగితిమి గాక భవదీయమహానుభావం బున్నరూ
పెఱుంగను, దగం గొనియాడను నే మెంతటివార మని పలికి
వెండియు- ౩౮౯

క. ఆదిమపురుషుడ వగుటను
వేదంబులు సెప్పు; నవియు వెఱచుఁ బలుకఁగా
నీదృక్ప్రకారుఁ డని, దా
మోదర, నీ పెం పెఱుంగ నొరుల కలవియే. ౩౯౦

క. దురితములఁ జెఱుప, శుభములఁ
బెరిఁగింపం జాలునట్టి పేళ్లులు నీవం,
బురుషోత్తమ, కడుఁ జె; క్కవి
పరమార్థద్యోతకములు భావింపంగన్. ౩౯౧

తే. ప్రియతు లగుసద్ద్విజులు వాని బరమభక్తి
యుక్తి నెపుడుఁ బఠించుచు, భుక్తిముక్తి
దాయి వగునిన్ను సతతంబుఁ దలఁచుచును, న
మస్కృతులు సేసి య్యావయమహిమఁగంద్రు. ౩౯౨

వ. అని, విష్ణు విశ్వాత్మజిష్ణు శర్వహంస దామోదర శంభుప్రముఖంబు
లగు ప్రభూతనామంబులం బ్రస్తుతించినఁ బ్రీతుండై పుష్కరాక్షుండు
పుష్కలంబైన వాగ్విశేషంబుల నాధర్మనందను నభినందించె.
తదనంతరంబ కొల్చియున్నజనంబుల నిజనివాసంబులకుం బోవం
బనిచి, యుక్కురుసత్తముండు దమ్ముల నాలోకించి - ౩౯౩

మ. అటవీదేశములందు గాఢబహులాయాసంబులం గంధి, దు
ర్ఘటమత్స్యోశ్వరుసేవఁ గుంది, బహుసంగ్రామంబులన్ విద్విష
త్పటునానాస్త్రమహాగ్రశస్త్రచయనిర్భగ్నాంగతం బొంది, యు
త్కటదుఃఖంబుల మీఱ లొందితి రభేద్యస్థైర్యులై నాకుఁగాన్.

వ. 'నన్నుం గృతకృత్యుఁ జేసితిరి. కృష్ణప్రసాదలబ్ధం బయిన యీ
జయశోభనంబు నిజేచ్ఛాకల్పితసుఖావాప్తి నను భవింతము

నాత్మప్రియప్రకారంబుల వర్తించుచు, నవధానంబుతో రాజ్యాంగ
సప్తకం బరయుఁ' డని చెప్పి యాంబికేయు ననుజ్ఞతోడ- ౩౯౫

సీ. బహురత్నమయఘనప్రాసాదమండప
దాసదాసీజనోద్భాసితంబుఁ,
దత్తుల్య వైభవతదధికధనధాన్య
ముఖవస్తుసంచయసుఖకరంబుఁ,
గిన్నరవల్లభగృహసమానత్వమ
హావిభూతి స్ఫురణాంచితంబు,
సర్వసంపత్స్ఫూర్తి చారువామాక్షీ ప్ర
చారసంశోభిత స్థలచయంబు,
తే. నైనవాని- రారాజుని ల్లనిలజునకు,
దుస్ససేనుమందిరము పార్థునకు, వరుస
తోడ దుర్మర్షణునియును దుర్ముఖునియు,
నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె నృపతి. ౩౯౬

వ. మఱియు విదుర యుయుత్సు సంజయ ధౌమ్యులవదనంబు లాలో
కించి, మీమీని కేతనంబులు మీరలు గైకొనుండని నియోగించి,
పెద్దనగరిలోన ధృతరాష్ట్రుండు మున్ను పన్నుగా వసియించు
హర్మ్యంబున నజ్జనపతి నునిచె. ఇవ్విధంబున గృహంబులు విభజించి
యిచ్చి, కృష్ణసాత్యకుల సవ్యసాచిసదనంబున నిల్చునట్లుగా నిర్దే
శించి యందఱం బోవం బనిచి, యభ్యంతరమందిరమున కరిగె.
ఆభీమసేనాదు లమ్మహనీయనివాసంబులు సేకొని యందుఁ
బ్రభూతాన్నపానాద్యనుభవంబుల సుఖించియుండ, నవ్విభుండు
నిజేచ్ఛ విహరించె. అని యిట్లు ధర్మపుత్త్రచరిత్రంబు సెప్పిన విని,
యబ్బంగిం బ్రాప్తసామ్రాజ్యుండై పాండవాగ్రజుండు పదంపడి
యెత్తెఱంగున వర్తించె? సకలజగద్గురుండగు కృష్ణుండు మఱి
యెట్లుండె?- నెఱింగింపు మనుటయు.- ౩౯౭

శా. భక్తాంభోరుహబాలసూర్య, దనుజప్రధ్వంసనాచార్య, సు
వ్యక్తావ్యక్తనిజప్రకార, సదయవ్యాపార, దాంతిక్షమా
సక్తస్వీకృతనిత్య, వేదపరిషత్సంస్తుత్య, మాయా విని
ర్ముక్తద్యోతన, తార్క్ష్యశాక్వరమహామూర్తిస్ఫురత్కేతనా. ౩౯౮

క. భవదుఃఖభరనిరాస [1]ప్రవీణనానాభిధాన, పారాశర్య
స్తవనీయగుణ[2]నిధాన,[3] సమవబోధనిరంతరావిదాత్మాధీనా. ౩౯౯

మాలిని. ప్రకృతిపురుషయోగీ, భక్తతాత్పర్యరాగీ,
సకృపహృదయపద్మా, శాంతచిత్తైకసద్మా,
వికృతిరహితమూర్తీ, విశ్వభూతప్రవర్తీ,
సుకృతఫలమయాత్మా, సుస్థిరానందవర్త్మా. ౪౦౦

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతం బయిన శ్రీ మహాభారతంబున
శాంతిపర్వంబునందు

ప్రథమాశ్వాసము.

---

1. పా. ప్రవణప్రగుణాభిధాన. 2. విధాన. 3. సమవబోధ. నిరంతరాచ్యుతాత్మధీనా.



హరిహరనాథాయనమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## శాంతిపర్వము.

### ద్వితీయాశ్వాసము.



శ్రీ శుచితాధ్ధృతికరణక
లా, శౌండకటాక్షలీల, లౌల్యరహితలో
లా, శక్తిత్రయసమయు
క్తాశోభితరూపహేల, హరిహరనాథా. ౧

—♦ ధర్మనందనుని ప్రవర్తనము. ♦—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: అట్లు సమధిగతసామ్రాజ్యుండై ధర్మనందనుండు తేజోవిశేషంబున మహోజ్జ్వలత్వంబు నొంది, మహీసురుల నాశ్రితజనంబుల నర్థులం గృతార్థులం గావించి, ధృతరాష్ట్ర గాంధారీ విదురులకు రాజ్యంబు సమర్పించి, 'మీర లింతటికి నొడయులరు. ఏను మీ పనిచినపని సేసి, పెట్టినయట్లు గుడిచి యుండం గలవాఁడ' నని పలికి, నిత్యంబును వారల యనుమతి గొని భవ్యమార్గంబునం బ్రజలం బాలించుచు, వారికిం బూర్వప్రకారంబుకంటె నతిశయిల్ల నెల్లవర్తనంబులు సంప్రీతిం జెల్లించుచు, విపత్తులైనసతుల నుమ్మలికంబు వొరయకుండం గరుణ నరయుచుఁ, గృప ధౌమ్య యుయుత్సు సంజయులకుం గౌరవామాత్యులకు మన్ననలు సలుపుచుఁ, గుంతీదేవికి శుశ్రూష యాచరిం

చుచుఁ, బాంచాలికి సౌమనస్యం బాపాదించుచు, ధౌమ్యునకు సగౌరవంబుగా సకల సంపదలు నొసంగి, తన్ముఖంబున దేవపితృపూజనంబులు, నతిథితర్పణంబులు, వైదేశికవిప్రార్చనంబులు, దీనానాథపోషణంబులుం బరమసంతోషంబుతో నడపుచుం గృష్ణు నారాధించుచు, సమస్తపౌరజన జానపదకోటులమనంబులం బ్రమోదంబు పరిపూర్ణం బగునట్లుగా నవ్విధంబునఁ బ్రవర్తిల్లుచుండి, యొక్కనాఁడు రేపకడ కృష్ణునియున్న మందిరంబునకుం బోయి, ౨

—◆ ధ్యానాసక్తుఁడైన శ్రీకృష్ణునిం గని ధర్మజుఁడు సంభాషించుట ◆—

సీ. మణిహేమపర్యంకమహితోపవేశుని
సురుచిరాభరణవిస్ఫురితగాత్రుఁ,
గౌస్తుభరత్నవికాసివక్షస్స్థలుఁ,
బీతకౌశేయసంవీతమూర్తి,
మేరుతటీగతమేఘసంకాశు, న
క్షత్త్రగణావృతగగనసదృశు,
నూతనోదితరవిద్యోతితోదయగిరి
నిభు, రుక్మబద్ధేంద్రనీలతుల్యు,
ఆ. నమ్మురారిఁ గని కృతాంజలియై భక్తిఁ
జిత్తవృత్తి గరము జొత్తిలంగ
నంత కంత కాననాంబుజ మలరంగ
నిట్టు లనియెఁ దియ్య మెసక మెసఁగ: ౩
తే. 'కడపితే రాత్రి సులభసౌఖ్యంబుగా ? మ
నంబు గాఢప్రసన్నమే ? యంబుజాక్ష,
దైవియగునీదుబుద్ధికతమునఁ గాదె
ధర్మగతిఁ బ్రాభవంబుఁ బొందఁగఁగంటి ! ౪

వ. త్రిభువనవ్యాప్తవిక్రముఁడవగు నీకటాక్షంబునకలిమిం గాదే జగత్త్రియీసంభావనీయుండనై వెలింగితి ! అనుచుం జేరంబోయి,

క. తన యుచితాలాపములకు,
మనుజేశ్వర, మాధవుండు మఱుమాట యొకం

డును బలుకక భవ్యధ్యా
ననిరూఢతనున్నయపుడు నరపతి యతనిన్ -

వ. నిరూపించి యిట్లనియె: ౭

సీ. '[1]పంచాత్మకంబైన పవనంబు హితనిగ్ర
హమైనది ; భవదింద్రియములు మనమున
నం దాఁగఁబడ్డవి; యవియును నదియును
బుద్ధియం దొదిఁగింపి శుద్ధమైన
నాలవ తెరువున లోలతారహితముల్
గాఁగ, నిన్నియును సంకలితములుగ
నంచితక్షేత్రజ్ఞునందుఁ గూర్చినవాఁడ;
వీపరమధ్యాన మేమికతన

తే. 'నాలసెనొకో ! లోకములకు నోం దొక్కవింత
లేక నెమ్మదియున్నది యే! కరంబు
విస్మయముఁ బొందె నామది; వినఁగ నర్హ
మేని వినిపింపవే నాకు ని[2]త్తెఱంగు.' ౮

వ. అని యిట్లు ధర్మనందనుండు కనిద్రాత్మనిశ్చలదీపప్రకారంబున నున్న
యప్పరమపురుషుం బ్రార్థించి ప్రణతుండై యున్న, ౯

తే. 'క్షరము నక్షరమును నీవ, కర్తయును వి
కర్తయును నీవ, యాద్యంతగతులు నీవ;
యొక్కఁడై వెలిఁగెడు పురుషోత్తమాభి
ధానవాచ్య, వినమ్రవాత్సల్యకల్య, ౧౦

---

1. తా. పంచభూతములకు ఆత్మయైన వాయువు నిగ్రహింపఁబడినది. నీ ఇంద్రియములు మనస్సునందు ఆఁపి పెట్టఁబడినవి. అవియును = ఆ యింద్రియములును, అదియును = ఆ మనస్సును - బుద్ధియం దణఁగిన్ని, శుద్ధమైన నాల్గవ తెరువున (= ప్రత్యాహార మార్గమున = విషయముల కలనుండి ఇంద్రియములను మరలించుటలోనన్న), చాపల్యము లేకుండునవిగాఁ గూడిన వీనిని (= క్షేత్రజ్ఞునందు =) జీవునియందుఁ గూర్చినవాఁడవు. నీ ఈ పరమధ్యానము ఏకారణమునఁ గలిగినదో ! ఎట్టి వింతయును లేక లోకములను నెమ్మది యున్నదిగదా ! నామనస్సు ఎక్కుడు ఆశ్చర్యము నొందినది. ఈ రహస్యము నాకు వినఁ దగినదగునేని వినిపింపవయ్యా. 2. = గాలియు చలనమును లేని దీపమువలె,

వ. 'ప్రసన్నుండ వగుము; నాడెందంబు సందియంబు వాయం జేయవే' యని విన్నవించినం బాంచజన్యధరుండు బుద్ధియు మనంబు నింద్రియంబులును గోచరత్వసంప్రాప్తంబులు గావించి, కొంచెపు నగవున నెమ్మొగం బొప్ప నప్పుడమితేని నాలోకించి యిట్లనియె.

సీ. గంగ యెవ్వనిఁ దనగర్భంబునం దతి
 శ్లాఘాసమేత యై సంభరించె,
భార్గవుం డెవ్వనిఁ బరమశిష్యుఁడుగాఁగఁ
 బడసి గురుత్వ మెక్కుడుగ నెగడెఁ,
నా రాముఁ డెవ్వనితో రాసి యిరువది
 మూఁడుదినములకు వాఁడి దొఱఁగెఁ,
గాశీశకన్యలు గారణంబుగఁ బోరి
 యెవ్వని కోడి రనేకనృపులు,
తే. వేదములు నాలుగును ధనుర్వేదమును మ
 హాశాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె,-
యట్టిభీష్ముండు న న్నిష్టుఁ డాత్మఁ దలఁచు
చునికిఁ దద్గత మయ్యె నా మనము నధిప. ౧౨

క. అనలము శమించుచాడ్పున
ననఘ, యతండు పరమోన్మహాత్ముండై తా
ననుఁ దలఁచె నింద్రియంబులు
మనమునఁ దగ నిగ్రహించి మహితయశోధన్. ౧౩

క. [1]శరతల్పగతుండతఁ డే
శరణంబుగ నాశ్రయించి సద్భావవ్యా
ప్తిరతుం డగుటను, విను, త
త్పరత నతనియందు నాదుభావం బెలసెన్. ౧౪

వ. ఇది మదీయధ్యానంబు తెఱంగు; ఆమహాత్ముండు వసిష్ఠశిష్యుండు భూతభవిష్యద్వర్తమానవేది; సర్వవిద్యాధారభూతుండు; ఆతం

1 తా. అంపసెజ్జమీఁద నున్నయతఁడు (భీష్ముఁడు) ఏ (నేనే) శరణంబు...

డస్తమించిన ధాత్రి [1]యస్తమితసుధాగభస్తి యగురాత్రియుంబోలె నగు; సకలజ్ఞానంబులు ననాశ్రయంబులై పోనుంగుపడుం గావున నీ వతనిపాలికిం బోయి, నీ యడుగందలంచిన యఖిలధర్మంబులు నడిగి చెప్పించుకొని నిశ్శేషనిరస్తసంశయుండవు గావలయు నని యాన తిచ్చిన, నమ్మానవపతి గద్గదకంఠుం డగుచు నావైకుంఠున కిట్లనియె: ౧౫

ఉ. శంతనుసూనుగౌరవము సర్వము మున్నును వింటి విప్రుల
త్యంతము వేడ్కఁ జెప్ప; నతఁడట్టిఁడ - యాతని నీవుమున్నుగా
నెంతయు భక్తిఁ గాంచుటకు నే మదిఁ గోరెద; నమ్మహాత్ముఁడున్
సంతస మందు నీ దయిన సన్నిధిఁ గాంచిన భక్తవత్సలా. ౧౬

వ. ఉత్తరాయణంబు వేచికొనియున్న యన్నరోత్తముండు బ్రహ్మమయనిధి యయిన నీసందర్శనంబు గోరు; నామీఁది యనుగ్రహంబునను నతనియెడం గలుగు పరిగ్రహంబునను, దేవా, నీవిట్లు సేయవలయు ననుటయు, నద్దేవకీనందనుండు సమీపగతుం డగుసాత్యకిం గనుంగొని, రథంబుసమకట్టు మని దారుకునకుం జెప్పుము. భీమార్జుననకుల సహదేవులను, కృప యుయుత్సు సంజయులను రావింపుము' అనిన నతం డట్లచేసె. దారుకుండునుం దే రాయితంబు గావించె. ౧౭

క. అది రత్నరుచులపెల్లున
నుదితార్కునిఁ బోలి వెలుఁగుచుండెను [2]జవసం
పదుదీర్ణసత్త్వసారా
స్పదసుగ్రీవాదిరథ్యసంశోభితమై. ౧౮

వ. ఆసమయంబున నక్కడం బారాశర్య నారద దేవల దేవస్థాణు వాత్స్య దేవరాత ప్రభృతిపరమమునీంద్ర పరివేష్టనంబు గలిగి గాంగేయుండు గ్రహగణపరివృతుండైన చంద్రుండునుంబోలెఁ దల్పీభూతశాతశరశతంబులచేత శోభిల్లి సందర్శనీయ గభస్తివితానుం

1. =శీతభానుఁడు (=చంద్రుఁడు) అస్తమించిన రాత్రివలె నగును. 2.–జవసంపత్ + ఉదీర్ణ.....= వడిలావును, గొప్పబలువు జేవయుఁగల సుగ్రీవము మొదలగు అశ్వములతో శోభిలినదై–సుగ్రీవము అనునది కృష్ణుని రథాశ్వములలో నొకటి.

డగు నస్తమయసమయభానుం [1]గేలిసేయుచుం గృష్ణుం జిత్తంబున నిరతిశయనిష్ఠ నిలిపికొనియుండి చేతులుమొగిడ్చి సుస్పష్టస్వరంబున ని ట్లని స్తుతియించె: ౧౯

—♦ భీష్ముఁడు శ్రీకృష్ణుని భక్తియుక్తుం డై స్తుతియించుట. ♦—

సీ. శుచియును హంసుండు శుచిషత్తుఁ బరముండుఁ
బరమేష్ఠియును నగుభవ్యుఁ గొలుతు;
మునులును సురలు నెవ్వనియున్నరూ పెఱుం
గరు సర్వవిదుని నప్పురుషుఁ గొలుతు;
శ్రుతులు సెప్పఁగ మహామతులు దుఃఖౌషధం
బుగ నెఱిఁగెడుపుణ్యమూర్తిఁ గొలుతు;
లోకంబు లెల్లఁ గల్గుట నిల్చు టాడఁగుట
తనయంద యగుమహాత్తరునిఁ గొలుతుఁ

తే. [2]బక్షి, రత్నచయంబుఁ, బుష్పవ్రజంబు-
బంజరము త్రాడు నార యుపాశ్రయముగ
నుండుచాడ్పున విశ్వంబు నుండుటకు సు
ఖాస్పదం బగుపుండరీకాక్షుఁ గొలుతు. ౨౦

ఆ. హరి సహస్రశీర్షుఁ బరము సహస్రాక్షు
వేదమయు సహస్రపాదు, నలఁతు
లైనవారికంటె నలఁతి, పెద్దలకును
జాలఁబెద్దయగు దయాళుఁ గొలుతు. ౨౧

క. అమృతమయు, బుగ్యజుస్సా
మముల యుపనిషద్వచస్సమాజములకు వా
చ్య మయినపురుషోత్తము, ని
క్కము రూ పగువాని, భక్తిగమ్యుఁ దలంతున్. ౨౨

---

1. గేలి (తద్భవము) = పరిహాసము. 2. క్రమము గ్రహింపఁదగును-పక్షికిఁ బంజము, రత్నచయమునకుఁ ద్రాడు, పుష్పమునకు నార ఉపాశ్రయముగ = ప్రాపుగ.

ఆ. అరణి నగ్ని వొడముకరణి, దేవకియందు
విప్రకర్మయజ్ఞవేదగుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవనం
దను భజింతు నేకతానురూఢి. ౨౩

తే. ఒకఁడు పండ్రెండుమూర్తులై యుండునట్లు
గా హిరణ్యవర్ణం బగుగర్భ మదితి
దాల్చె నెవ్వానిఁ గనియె, దైత్యఘ్ను నట్టి
దేవు సూర్యాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు. ౨౪

క. సురపితృకోట్లం బూర్వా
పరపక్షదినముల నమృతపానప్రీతిం
బొరయం జేయుచు వెలిఁగెడు
హరి సోమాత్మకునిఁ గొల్తు నాత్మేశ్వరునిన్. ౨౫

తే. విశ్వసృజు లనుమునులచే, వితత మగు స
హస్రవత్సరకలితమహాధ్వరమునఁ
గశ్యపబ్రహ్మయెవ్వానిఁ గనియెఁ గనక
వక్షుఁ దార్క్ష్యాత్ముఁ దలఁతు నప్పద్మనాభు. ౨౬

క. సువ్యక్తక్షేత్రంబున
నవ్యక్తాకృతినిరూఢి నాసీనుండై
భవ్యత నుండెడుక్షేత్రా
త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. ౨౭

క. ప్రకృతివికృతు లనుషోడశ
వికారముల [1]బెరసి ప్రకృతి వికృతిత్వము లొం
దకయుండఁ గాంతు రెవ్వని
సకలమునులుఁ, దలఁతు నట్టి సాంఖ్యాత్ము హరిన్. ౨౮

క. అంతశ్చర మారుతములు
శాంతములుగఁ జేసి, [2]యచలసత్వము శేముషిన్

1. కలసి, 2. అన + చలసత్వము - చలసత్వములేమి = చలనములేకుండుట.

దాంతియుఁ గలజనములు గను
నంతర్హితుఁ గొలుతు జలశయను యోగాత్మున్ ౨౯

క. ఉపరమముం బ్రాపించిన
యపుణ్య పుణ్యములు గలుగు నతిశాంతులు భ
వ్యపుగతిఁ బొందెడు నానం
దపురూపుని విష్ణుఁ దలఁచెదను మోక్షాత్మున్. ౩౦

తే. [1]చరణ నాభి శీర్షంబులు ధరయు నంత
రిక్షమును దివమును; జగచ్చక్షు రగ్ని
దిశలు- దృ ఙ్ముఖ శ్రోత్రముల్ దీప్తులెవ్వ
హాంగునకు నట్టిహరిని లోకాత్ముఁ దలఁతు. ౩౧

క. భూతముల మ్రింగి, లోక
వ్రాతము జలమయముఁ జేసి వశ్యాత్మత ని
ద్రాతిశయంబున బాలుం
డై తేలెడువానిఁ దలఁతు హరి మాయాత్మున్. ౩౨

తే. అంబుదంబులు కేశంబులందు, నదులు
సర్వతనుసంధులందును, జలధు లుదర
దేశమునయందు నున్నట్టి దేవదేవుఁ
గొలుతుఁ దోయాత్ము దేవకీకొడుకుఁ గృష్ణు. ౩౩

తే. వదన బాహూరు పదము లెవ్వాని విప్ర
రాజ వైశ్య శూద్రులకు సంప్రభవదేశ
ములుగ వెలుఁగొందు, నమ్మహామూర్తి విభవ
దీప్తు వర్ణాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు. ౩౪

క. [2]మాస ర్త్వయ నాబ్దమయో
ద్భాసితరూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం

1. క్రమము-చరణము భూమి; నాభి అంతరిక్షము; శీర్షము స్వర్గము; సూర్య చంద్రులు కనులు, అగ్ని ముఖము దిక్కులు శ్రవణములు (చెవులు). 2. మాస ఋతు అయన అబ్దమయ ఉద్భాసిత రూపుఁడు.

చేసి పొలుపారుశౌరి ను
పాసింతును యోగిభోగ్యబలు గాలాత్మున్. ౩౭

క. ముని దివిజాదికలోకము
లనంతుఁ డన జగతి కెల్ల నాధారం బై
పెను పొందెడు శేషాత్ముని
వినుతింతుఁ గా విష్ణుభక్తి విభవవిధాయిన్. ౩౮

క. [1]ఆదిత్య మరు ద్వసు రు
ద్రాదిదివిజగణము లెల్ల నవయవరూపో
త్పాదకలితు లెవ్వానికి
నాదేవుని సంస్తుతింతు హరి దేవాత్మున్. ౩౯

క. సర్వమునందును దానుగ,
సర్వముఁ దనయందు నుండు, సంచారంబుగ
సర్వమునకుఁ దనవలనన-
సర్వాత్మకు నట్టి వృష్ణిసత్తముఁ దలఁతున్. ౩౫

క. మీనయి తా నతలగతం
బై ననిగమచయముఁ దెచ్చి యజునకు నొసఁగం
గా నేర్చినసుమనస్స
మ్మానితవిగ్రహు భజింతు మత్స్యాత్ము హరిన్. ౩౬

క. అమృతమథనమున మంథన
గము లీలోద్ధరణకేలిఁ గైకొని సురసం
ఘమునకుఁ బ్రియ మొనరించిన
యమేయుఁ గూర్మాత్ము నంబుజాక్షుం గొలుతున్. ౪౦

క. వారాహరూపమునఁ బెం
పారినతనదంష్ట్రి నొకట [2]నవని సగిరికాం

1. ఆదిత్య మరుత్, వసు రుద్ర ఆది దివిజగణములు = సూర్యుఁడు, వేల్పులు, అష్ట (౮) వసువులు, ఏకాదశ (౧౧)రుద్రులు మొదలగు దేవతలు. 2. పర్వతారణ్య సహితముగా భూమినెత్తిన......

తారంబుగ నెత్తినయా
శౌరిం [1]క్రోడాత్ముఁ దలఁతు సమ్యగ్భక్తిన్. ౪౧

ఆ. [2]నారసింహవపు రుదారభావము నొంది
ఘను హిరణ్యకశిపు ఖరనఖముల
వ్రచ్చి దీప్తమూర్తి వఱలు నృసింహాత్ము
నాత్మభవుని భక్తి నాశ్రయింతు. ౪౨

క. వామన రూపంబున ను
ద్దామబలుఁ బలి నడంచి త్రైలోక్యాతి
కామితఁ బేర్చిన యద్భుత
ధాముం భార్గంతాత్ముఁ దలఁతు దామోదరునిన్ ౪౩

ఆ. పరశురాముఁ డనఁగ భవ్యుండు జమదగ్ని
కుద్భవించి యిరువ దొక్కమాఱు
మనుజపతుల నెల్ల దునిమినక్రోధాత్ము
నధిక భక్తి శార్ఙ్గి నాశ్రయింతు. ౪౪

క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ
పుత్త్రుఁ శ్రీరాముఁ డనఁగఁ బొలిచిన దేవున్
శత్రుభయదు రావణు నొక
మాత్రం దునుమాడినట్టి మధుసూదనునిన్. 45

క. హల ముసల ధరునిఁ గరుణా
నిలయుహృదయు రాము రౌహిణేయు సితాంగున్
జలదనిభాంబరుని శుచిం
దలఁతును గోవిందు శౌర్యధను భోగాత్మున్. ౪౬

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి, దు
ర్మద దైత్యావలిఁ గూల్చి, ఫాల్గునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మద మారంగ నొనర్చి, దేవముని సమ్మానోద్ధృతిన్ భూభరం
బు దొలంగించిన చక్రి నంబురుహనాభుం గొల్తుఁ గృష్ణాత్మునిన్.

1. = వరాహాముగ కాత్మయైనవానిని. 2 = నరమృగ శరీరము.

క. కలికాల చలితధర్మము
నిలుపం గలయట్టి విష్ణునిం గల్యాత్ముం
దలఁతుఁ దురగవాహను మ్లే
చ్ఛుల నెల్లం గీటడంచు శుభచారిత్రున్. ౪౮

ఆ. క్షరము లైనభూత సంఘంబులం దెల్ల
నక్షరస్వరూపుఁ డై వెలుంగు
సకలబుద్ధివృత్తి సాక్షి సాక్ష్యాత్మ న
స్పందబోధఘను ముకుందుఁ దలఁతు. ౪౯

సీ. పరమేశ పుణ్య సుబ్రహ్మణ్య భక్తవ
త్సల మహాదేవ విశ్వప్రకాశ
కరణ హృషీకేశ వరద నారాయణ,
రాజీవనయన హిరణ్యనాభ
యఖిలలోకనమస్కృతాంఘ్రిసరోరుహ
యజ్ఞాంగ యచ్యుత యమృతరూప
నీకు మ్రొక్కెదఁ గరుణింపవే! యతసీకు
సుమవర్ణపీతాంబరము ధరించి

ఆ. యున్ననిన్ను నెవ్వ రుల్లంబునందుఁ ద
లంతు రట్టివారలకు భయంబు
గలుగ దెందు నేమికార్యంబులం దెప్డు
వినుతమంగళాయతనమ వగుట. ౫౦

క. మంగళము విష్ణుదేవుఁడు
మంగళ మెమ్మెఁ దలంప మధురిపుఁ డుద్య
న్మంగళ మంభోజాక్షుఁడు
మంగళ మఖిలము విహంగమధ్వజుఁ డరయన్. ౫౧

క. నారాయణపరములు నిజ
మారయ, బ్రహ్మంబుఁ, బరము, నంచితసత్త్వో

దారతపంబులుఁ గావున
నారాయణపరత వీని నాల్గిటి నిచ్చున్. ౫౨

తే. విష్ణుమయ మగ్ని, హవియును విష్ణుమయము
విష్ణుమయము సర్వంబును, విశదబుద్ధి
ని ట్లగుటఁ గందుఁ గావున నించుకేనిఁ
గల్మషము నాకు లే దున్కి గానవచ్చు. ౫౩

క. శరణాగతుండ భక్తుఁడఁ
బరమపదవి గోరెదను శుభంబుగ నన్నుం
బరికించి యేది మేల
య్యారవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా! ౫౪

తే. తపమునకు విద్యకును జన్మస్థాన మైన
జననరహితుని యజ్ఞాత్ము శౌరి వాఙ్మ
యాధ్వరార్చితుఁ జేసితి; నాజనార్ద
నుండు మద్భజనమునఁ బ్రీతుండు గాత. ౫౫

క. అని యి ట్లతులస్తోత్రం
బున హరిఁ బూజించి గంగపుత్త్రుఁడు మదిలో
న 'నమః కృష్ణాయ' యనుచు
వినతశిరస్కుఁడయి మ్రొక్కె విశ్రుతభక్తిన్. ౫౬

వ. అని పలికె నని చెప్పి వైశంపాయనుం డి ట్లనియె: ౫౭

క. స్తవరాజం బనఁగ ముని
స్తవనీయం బైన యీ [1]వృషాకపిభవ్య
స్తవనామ్నాతార్ణవము సం
స్తవనంబున నిచ్చు సుగతి జగతీనాథా. ౫౮

క. విను, జనమేజయభూవర,
యనుత్తమం బయినయిమ్మహాస్తవము పఠిం

1. వృషాకపి = విష్ణువు, (శివుఁడు, అగ్ని).

చిన వినినను వ్రాసిన శ్రీ
యును నాయువుఁ బెంపుఁ బేరు నొసఁగు జనులకున్. ౫౯

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు ని ట్లనియె: ౬౦

తే. అట్లు హరిఁ బ్రస్తుతించి శాంతాత్మవృత్తి
నూరకున్న శాంతనవుని, భూరితేజు
నమ్ముకుందునిఁ గీర్తించి రచటనున్న
పరమమునులు గద్గదికతోఁ గురువరేణ్య. ౬౧

వ. అంత నిక్కడ– ౬౨

ఉ. ఆ [1]దివిజాపగాతనయుఁ డంచితభక్తికిఁ బ్రీతిఁ బొంది దా
మోదరుఁ డప్పు డన్నరవరోత్తము చిత్తమునందు సర్వలో
కాద్భుతదివ్యబోధమహిమాతిశయం బుదయింపఁ జేయుచుం,
దా దయతోడ సెజ్జ డిగి ధర్మజు మోమునఁ జూడ్కి పర్వఁగన్.

వ. 'భీష్మపాలికిం బోదము రా' మ్మని పలికి, కృతపరికరబద్ధుండై వెడలి రథం బెక్కి, సాత్యకిం దనపిఱుందివలనం బెట్టికొనియె. ధర్మనందన ధనంజయు లొక్క తేరును, మారుతి నకుల సహదేవు లొక్క యరదంబును, కృప యుయుత్సు సంజయు లొక్క స్యందనంబును నెక్కి, తదీయంబు లగు [2]నేమినినాదంబులు దిక్కులం బిక్కటిల్ల నుచిత పరివార పరివృతులై నడచిరి. అట్లరిగి [3]యస్థికేశబహుళంబును, బహుద్విప కుంభఖండ నరకపాల పాళీనిబిడం (పా... కుంభతురగాంగరథావయవ నవరత్న కనకమయభూషణగణఖండం)బును, నై [4]ప్రేతపత్యనుభూతోజ్ఝితం బైన యాపానభూభాగంబు ననుకరించు కురుక్షేత్రంబు దఱియుసమయంబున నయ్యంబుజాక్షుండు పాండవాగ్రజుతోడ– ౬౪

1.=స్వర్గంగాపుత్త్రుఁడు =భీష్ముఁడు. 2.=బండి కంటి కడకమ్మి యొక్క ధ్వనులు–తేరినడకచేఁ గలిగిన పెద్ద చప్పుడులు. 3 = ఎముకలచేతను వెండ్రుకలచేతను తఱచైనదియును, పెక్కులు ఏనుగుల కుంభస్థలముల తునుకలచేతను, నరుల కపాల రాసులచేతను నిండినదియు నై– 4. = శ్మశాననాథుఁడు త్రొక్కి త్రొక్కిన కల్లువెంట.

తే. దూరమున నైదుమడువులు దోఁచుచున్న
యవి, నరేశ్వర, మును వీనియందుఁగాదె
పరశురాముండు సేసెఁ దర్పణము నృపుల
రక్తమున భూరితరపితృభక్తి వెలయ. ౬౫

మ. 'క్షితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగా [1]నేకవిం
శతివారంబులు ద్రుంచి యాతఁడుదుదిన్ శాంతత్వముం బొందె సు
వ్రతుఁడై' నావుడు, నమ్మహీశుఁ 'డతఁ డీక్రౌర్యంబు సేయంగ నే
ల తొడంగెన్? నృపు లెట్లు గల్గి రిలయెల్లం గైకొనం గ్రమ్మఱన్?' ౬౬

వ. అనుటయు, నచ్యుతుండు, 'నప్పరశురాముజన్మ ప్రపంచంబును దదీయక్రోధకారణంబును, నృపలోకమారణంబును, భూపాలవంశ పునస్సంభవ ప్రకారంబును, మునులవలన వినినచొప్పునం జెప్పెద' నని యజ్ఞనపతి కిట్లనియె: ౬౭

— శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బరశురాముని చరిత్రంబు చెప్పుట. —

సీ. కలఁడు జహ్నుం డనఁగాఁ దొల్లి యొకమహీ
పతి; యజహ్నుండు దత్సుతుఁడు; వాని
కుదయించెఁ బల్లవుం; డుర్వీశ, యాతని
కొడుకు తపోనిష్ఠఁ గుశికుఁ డింద్రు
మెచ్చించి జగములమేటి నాఁ దగుపుత్త్రు
వేఁడిన, దాన నవ్విభున కుద్భ
వమ్మయి కౌశికుఁ డిమ్మహి గాధినా
మమ్మునఁ బరఁగె; నమ్మనుజవిభుఁడు

తే. సత్యవతి యనుతనకన్య సంప్రమోద
మున ఋచీకున కిచ్చె; నమ్ముని సుకర్మ
నిరతి సంతానవాంఛమైఁ [2]జరుయుగంబుఁ
దనకు మామకునై కల్పితముగఁ జేసె. ౬౮

1. = [illegible] 2. = [illegible] రెండు.

వ. ఆభృగునందనుం డచ్చెరువులు నిజభార్య ముందట నిడి 'క్షత్త్రియా జేయుండును క్షత్త్రియ సూదనుండును నగుక్షత్త్రియోత్తముం డిచ్చెరువున జన్మించు, దీని మీతల్లికి నిమ్ము. తపోధృతిశమంబుల నుత్కృష్టుం డగుద్విజశ్రేష్ఠుండు దీనివలనం బుట్టు, నిది నీ వుపయోగింపుము.' అని వాని నేర్పరించి 'భవజ్జననీజనకు లిప్పుడ వచ్చెదరు' అని చెప్పి నదీస్నానార్థి యయి యరిగె. తదనంతరంబ తదాశ్రమంబునకుం దీర్థయాత్రాపరు, డయి గాధి, గృహిణీసహితంబుగాఁ జనుదెంచిన, సత్యవతియును నిజభర్త గావించిన చరుద్వయంబు మాతకుం జూపి, తత్ప్రభావ భేదం బుపన్యసించినం బ్రీతయై యద్దేవి, పరమపావనస్నానం బాచరించి, చరు వుపయోగించునప్పు డజ్ఞానంబునం దనచరువు కూఁతున కిచ్చి, కూఁతుచరువుదా నుపయోగించె. అయ్యువతియుం దలఁపులేమి నాలేమ యిచ్చిన భంగిన కుడిచె. అంత భార్గవుండు వచ్చి పత్నిం జూచి, దివ్యబోధంబున నెఱింగి, 'క్షత్త్రియాంతకరం బగు గర్భంబు ధరియించినదాన' వనవుడు, న త్తరుణియుఁ దత్పాదంబులకుం బ్రణతయై, 'మీ రిట్లాటన తీఁ దగునె?' అని వడవడ వడంకుచుఁ గేలుమొగిచి నిలిచిన, న త్తపోధనుం డత్తెఱవతో 'న త్తెఱంగు నాతలంపున వచ్చినది గాదు; భవన్మాతృబుద్ధిహానిం జేసి చరువ్యత్యాసంబున నయ్యె. నీకుఁ గ్రూరకర్ముండును మహాబలుండును నగుపుత్త్రుం డుద్భవించు. ఆయనకు బ్రహ్మభూతుండును దపోధనుండును నగువాఁ డుదయించు. నేను దపంబున విశ్వబ్రహ్మంబు నచ్చెరువున నావహించినవాఁడ' నని పలుకుటయు— ౬౯

క. అమ్ముగ్ధ యతని కిట్లను:
'నిమ్మూఁడుజగములు మీర లితరంబులుగాఁ
గ్రమ్మనఁ జేయఁగఁ జాలుదు;
రెమ్మెయి నైనఁ గృప సేయరే నామీఁదన్!' ౭౦

వ. 'క్రూరుం డగు కొడుకుం గనుట కోర్వ' ననుటయు, ననుగ్రహాతిశయంబున నమ్మహాముని 'యవ్విశేషంబు నాపుత్త్రునకు లేకుండెడుఁ;

బొత్తుగ్రినియుం దావహిల్లెడు; నీ కెట్లు ప్రియుం బట్లు కాఁ గలయది' అనియె. అట్ల యత్తన్వి, తపోనిరతుండును దాంతుండును శాంతుండును నైన జమదగ్నిం గనియె. బ్రహ్మర్షి సదృశుం డగు విశ్వామిత్రుని గాధిపత్ని గాంచె. ౭౧

క. జమదగ్ని, సర్వవిద్యా
సమేతుఁడు నుదారగుణుఁడుఁ జాపాగమవే
దిమతియు నగురామునిఁ గాం
చె మహీపతిహననశీలు శిఖినిభమూర్తిన్. ౭౨

వ. అక్కాలంబునందు హైహయవంశవరుండు- ౭౩

ఉ. దుర్జయవిక్రమోజ్జ్వలుఁడు దోషవివర్జితబుద్ధి కార్తవీ
ర్యార్జునుఁ, డేఁడుదీవులు నయాన్వితశూరత నేలుచుండు, ధ
ర్మార్జనలోలబుద్ధియు మహాస్త్రబలంబు సహస్రబాహుతా
స్ఫూర్జనముం వెలుంగఁగ నృపుల్ దనయాజ్ఞఁ దలం వహింపగన్.

క. ఆరాజు నగ్నిదేవుఁడు
గారవమున నడుగ, నతఁడు గడుబెంపున నా
హారముగ నిచ్చె గిరి నగ
రారణ్య గ్రామ [1]ఖర్వటాదు లతనికిన్. ౭౫

వ. ఇచ్చిన నగ్నిదేవుం డాహారంబుగాఁ గొనుతరువాత మిత్రావరుణ నందను నాశ్రమకాననం బతండు లేనిసమయంబున సమసిన నమ్మహాత్ముం డెఱింగి వచ్చి యాసర్వభక్షకునకు రక్షణం బాచరించుచు వర్తించు కార్తవీర్యునిం గని కనలి, 'నీవు మదీయ తపోవనంబు పరిహరింపక గహనసామాన్యబుద్ధిం గాల్చితి; నీ బాహువులు రాముండు నఱకువాఁడు' అని శాపం బిచ్చె. సహస్రబాహుండును దానికి విషాదంబునొంది యధికతాత్పర్యంబుతో ధర్మకార్యంబుల నడపుచుండె. ౭౬

[1]. = కొండక్రిందిపల్లెలు మొదలగువానిని.

క. శాపము గారణముగ నా
భూపతి కవినీతు లైనపుత్త్రులు సబలా
టోపాత్ములు పలువురు సిం
హాపములు జనించి ధాత్రి నుద్భటవృత్తిన్- ౨౭

వ. ఎందునుం జరియించువారు. ఒక్క నాఁడు జమదగ్ని యాశ్రమంబునకుం బోయి, యతండును జామదగ్న్యుండును నయ్యెడ లేకుండ హోమధేనువును వత్సంబునుం దమమందిరంబునకుం గొనివచ్చిరి. ఇట్లు దెచ్చుట సహస్రబాహుం డెఱుంగఁడు. ౨౮

క. అట రాముఁ డెఱిఁగి పరమో
ద్భట మగుకోపమునఁ జాప పరశుముఖమహో
త్కటశస్త్రాస్త్రంబులతోఁ
బటుగతి వచ్చెను సహస్రబాహునిమీఁదన్. ౨౯

— పరశురాముఁడు కార్తవీర్యార్జునునిఁ జంపుట —

ఆ. వచ్చి, ముట్టి కయ్య మిచ్చిన, నవ్విభు
నొంచి బాహువనముఁ జంచదుగ్ర
పరశుఘోరధారపాల్ సేసి పోయి ని
జేచ్ఛ నుండె మేదినీశవర్య. ౩౦

చ. అతఁడు సమిత్కుశాభిహరణార్థము గానకు నేఁగి యుండఁగా,
నతికుపితాత్ము లై కడఁగి యర్జునసూనులు వోయి ముట్టి, త
త్పితృశిరమున్ వెసం దునిమి ప్రీతిమెయిం జనుదెంచి; రమ్మహా
ద్ధతుఁ డట వచ్చి వారిచరితం బెఱిఁగెం దమతల్లి సెప్పఁగన్. ౩౧

వ. అ ట్లెఱింగి— ౩౨

శా. రాముం డుద్ధతరోషపావకశిఖాప్రస్ఫీతుఁ డై తున్నుదున్
భూమీశాలిఁ గుఠారధార, [1]నని విస్ఫూర్జద్బలిన్ హైహయ
స్తోమం బాదిగఁ జొచ్చి రాజకులముం దున్మాడి, చేసెన్ సము
ద్దామక్రీడను రౌద్ర మొప్ప [2]నిల రక్తస్యందసంసిక్తఁగన్. ౩౩

1.= యుద్ధమున. 2 -ఇలన్ =భూమి, రక్తధారలచేఁ దప్పడిసినదిగ.

వ. ఇట్లు సేసి, పరమకృపావిష్టహృదయుండై తపోవనంబునకుం జనియె. పదంపడి, బహువత్సరంబులు సనినపిమ్మట విశ్వామిత్త్రపౌత్త్రుండైన పరావసు వనురాజు దుర్వినీతుండై గర్వోద్రేకంబునం బరశురాము నధిక్షేపించి, 'రాజులకు వెఱచి డాఁగియున్నవాఁడ' వని విశిష్ట జనసన్నిధిం బలికి, బాల వృద్ధభావంబున నుపేక్షితులై యతనిచేత మున్ను చావక యున్నప్రతర్దనాదుల నుగ్గడించి - ౮౪

ఆ. 'నృపులు గారె వారు? నీవు మిథ్యాప్రతి
జ్ఞాభిమాని' వనుడు, నతఁడు మగుడ
రోష మెత్తి కడఁగి క్రూరత నాబాల
వృద్ధముగ నరేంద్రవితతి నఱకె. ౮౫

వ. గర్భంబుల నున్నయర్భకులను, మఱియు వివిధప్రకారంబులఁ బోరం దప్పి పోయి పుడమి యేలురాజులం గాలాంతరంబుల వెదకి వెదకి వధియించె. ఇట్లిరువదియొక్కమాఱు[1]నేల నిఃక్షత్త్రంబుఁ గావించి యశ్వమేధయాగంబు సేసి, దక్షిణాగా నీక్షితి యంతయుఁ గశ్యపున కిచ్చె. పదంపడి యమ్ముని యాజామదగ్న్యుతో నిట్లనియె: ౮౬

తే. 'అశ్వమేధయాగంబున నవని యెల్ల
నాకు దక్షిణాగా నిచ్చినాఁడ; వింక
నాధిపత్యంబు నీకు లే; దరుగు దక్షి
ణాబ్ధిపారదేశమునకు ననఘచరిత.' ౮౭

వ. అని పలికి యెందేని నేమేనియుం దెఱంగున శేషించినరాజ పింఛంబునకు నిశ్శేషత్వంబు వాటిల్లకుండం బరిహరించుబుద్ధిం బలికిన, నప్పురుషసింహుండు 'నట్లకాక' యని పోవ, నతనివలని వెఱపున నవ్వలనిసముద్రుండు [2]శూర్పాకారప్రదేశంబు బెరయుం గొంతదేశంబతనికి విహారస్థానంబు గావించె. ఇవ్విధంబునం గశ్యప మునీంద్రుండు పరిగ్రహించి, భూమి భూసురప్రకరంబుల కిచ్చి, తపోవనంబున కరిగె. భూమియు నతనిపేరఁ 'గాశ్యపి' యన నెగడె.

1.= భూమి-క్షత్త్రియశూన్యము చేసి. 2 = చేటపోలికగల ప్రదేశంబుగలియట్లు.

కొం డొకకాలంబునకు వైశ్యశూద్రప్రముఖులు దర్పితులై
పరికారంబుల విప్రదార ధన ధాన్యాదు లపహరింపం దొడంగిరి.

సీ. పదపడి విప్రులు పథము దప్పి, వధంబు
మద్యపానంబు, సన్మార్గవర్తు
లైనసాధులధన మపహరించుటయును
మొదలు గాఁగ నకృత్యములకుఁ జొచ్చి;
రధ్వరాదికసత్క్రియల్ పరివర్తింపక
[1]తెక్కలి బంది యేదిక్కులందుఁ
దఱచయ్యె; నిమ్మెయి ధర్మంబు సెడి యధ
ర్మంబు వర్తించి యరాజకత్వ

ఆ. దోషజాత మైనదురితబాహుళ్యంబు
గుతిలపెట్ట, భూమియతలమునకుఁ
బోవ నెఱఁగి, కశ్యపుఁడు, నిజోరువు నెఱి
గుచ్చి దాపు గాఁగ నిచ్చి యెత్తె.

వ. అది కారణంబుగా ధరణి 'యుర్వి' యనం బ్రసిద్ధి వహించె
అయ్యుద్ధరణసమయంబునం గాశ్యపి, గశ్యపుని వేఁడుకొ
యుత్తమక్షత్త్రియులు దండనీతిప్రయోగంబునం జేసి ధర్మంబు
రక్షించి తన్ను సురక్షితం జేయువారు గా వరంబు వడయుటకై
యమ్మహామునితో ని ట్లనియె: ౯.

—♦ భూదేవి కశ్యపునితోఁ బరశురామునిచే జావని రాజులఁ జెప్పుట. ♦—

క. 'నాయం దచట నచట రా
మాయతబాహావిభూతి [2]కగపడనిఘనుల్
ధీయుక్తులు గల; [3]రన్నర
నాయకులను, వినుము, పనుపు నను రక్షింపన్. ౯౧

వ. అని పలికి యద్దేవి తనసురక్షితత్వంబున హైహయులు గొందఱు
చావునకుందప్పుటయుఁ, బౌరవాన్వయపరిభవుం డగువిదూరథ

1. = దొంగతనములు బంగిపోటులు. 2. = అగపడని = (అగ్గ + పడని = ) కనఁబడని, గోచరముకాని, దొరకని. 3. = అరాజులను నను రక్షింప నియోగింపుము

సుతుండుఃఋతుపర్వతంబున[1]ఋక్షంబులచేత రక్షితుం డగుటయు, సౌదాసవంశజనితుం డొక్కరుండు పరాశరసంయమివరునధ్వర కాలంబునం జేరినఁ గారుణ్యాతిశయంబున నమ్మహాత్ముండు వాని శూద్రప్రవర్తనంబున సర్వకర్మంబులుఁ జేయించుకొని రక్షింప, సర్వకర్ముం డనం బరఁగుటయు, శిబిమనుమఁడు గోపతి యనుఁవాడు వనంబున గోవులు రక్షించిన బ్రదికి యునికియుం, బ్రతర్దనపుత్త్రుండు వత్సాభిధానుండు వత్సంబులు గోష్ఠంబున రక్షణాబాచరింప సంచరించుటయు, దివిరథతనయుం డగుదధివాహానుకొడు కంగుం డనువాఁడు గంగాకూలంబున గౌతమమునీంద్రునిరక్షం జేసి నిర్భయుండై వర్తిల్లుటయు, బృహద్రథకులజాతుండు భూరి నామధేయుండు గృధ్రకూటశైలంబున [2]గోలాంగూలంబులు రక్షించుటవలనఁ గలిగి యుండుటయు, మరుత్తసంతానసంభవులు చతుర్వర్ష వయస్కులగువారు ముప్వురు సముద్రుండు రక్షకుండై పినుపందత్తీరంబునం బెరుఁగుటయుం జెప్పి, 'వా రుత్తమక్షత్త్రియులు వారలు సమ్యక్పరిపాలనంబున నన్నరయువారు గా ననుగ్రహించిన నచలిత నై యుండెద. ౯౨

క. 'వారలపెద్దలు నాకై
ఘోరఁ బరశురాముచేతఁ బొలిసిరి; నాకున్
వారి నధిపతులఁ జేయుట
గోరం దగుఁ గాన నిట్లు గోరితి ననఘా.' ౯౩

తే. అనిన విని వారి రావించి, యమ్మునీంద్రుఁ
డందరనుజూచి, యాధిపత్యమున కిమ్మ
హాభుజులు దగువా రని, యవనిఁ దగిన
యట్లు విభజించి యభిషేక మాచరించె. ౯౪

క. అన్నృపులవంశముల నా
నానృపతులు పుట్టి; రిట్లు, నరవర, నృపసం

---

1. = ఎలుఁగుబంటు (నక్షత్రము) 2 = కోఁతి, కొండముచ్చు.

తానములు పెక్కు గలిగి మ
హీనాథత్వమున బ్రాలె నెందును గలయున్. ౯౫

క. అప్పరుసునఁ బెరిగినన్నృపు
లిప్పుడు భారతరణోపహృతు లై పలువుర్
గుప్పలు గొనఁ బడి; రనికిం
దప్పినవాఁ డొకఁ డొకండ ధర నంతంతన్. ౯౬

వ. నీ వడిగినపూర్వవృత్తాంతంబు చిత్తాయత్తంబుగా నెఱింగించితి అనవుడు, ధర్మనందనుండు, గోవిందునితోడఁ 'బరశురాము డింతటివాఁ డగునే! కోపంబును విశ్రమాటోపంబును జిత్రంబుగ ధాత్రి నిఃక్షత్త్రంబు సేసె!' నని పలికి వెండియు, ౯౭

తే. 'ధరణియును, ఋక్షములు, బరాశరుఁడు, గోస
మూహములు, వత్సములు, గౌతముండుఁ, గవులుఁ,
దోయధియు నింతపుణ్యంబు సేయునే! జ
నంబుభాగ్యంబు నభివర్ణనమున కెక్కె'. ౯౮

వ. అని యిట్లు సల్లాపంబులు సేయుచు మాధవధర్మజు లరిగి యోఘవతీతీరంబున శరతల్పగతుండై గాంగేయుం డున్నెడకు అనతిదూరంబున రథావతరణంబు సేసిన, భీమసేనప్రముఖులుఁ గృపాదులు నరదంబులుడిగ్గిరి. ఇట్లందఱు నంతరంగంబు లేకాగ్రంబులు సేసికొని చేరం జని, సాత్యవతేయ ప్రభృతిమునీంద్రులకుం బ్రణమిల్లి మఱి భీష్ముం గాంచిరి. అట్లు సముచితప్రకారంబునంగని యతనిం బరివేష్టించి యాసీనులైరి. అప్పు డచ్యుతుం డమ్మహాత్ము నాలోకించి యుమ్మలించుచు నతనితోడ- ౯౯

సీ. నీకు మున్నొకలె నవ్యాకుల మైయున్న
యదియె చిత్తంబు? దేహంబుపీడ
ఘనము మనఃపీడ కంటె నరదురు బుధు;
లోకముల్పెక్కు యొడలిలో నున్న నలఁత

-సేయు నెన్నోయి; బహుసాయకకీలిత
మైనయంగంబునో వ్వడుగ నేల?
యిట్టు లుండియు నించుకేనియు దుఃఖంబుఁ
బొరయమి పితృవరస్ఫూర్తిఁగాదె?

ఆ దేవతలకు నైన నీ వుపదేశింతు
కలిమిలేములకు వికార మొంద
కుండ; బోధవృద్ధు లోరులు నిన్ దేర్పంగ
వలవ కునికి నిజ మవార్య తేజ. ౧౦౦

క. భూతంబులసంసరణము
భూతభవద్భావికార్యములుఁ, గర్మసము
ద్ద్యోతనభంగియు నీయెఱ
చేతివి గావె కురువంశశేఖరజన్మా. ౧౦౧

వ. అని వెండియు - ౧౦౨

ఉ. రాజవె ! రాగహీనుఁ డవె ! రాజితసుందరమూర్తి యట్టె ! వి
భ్రాజితసంపదున్నతివిభాసితవర్తనుఁ డట్టె ! కామినీ
రాజిమనోజ్ఞభంగిచతురత్వధనుం డవె ! బ్రహ్మచర్యదీ
క్షాజితమన్మథుండు నవె ! జన్మము లిట్టివి యెందుఁ గల్గునే ! ౧౦౩

క. సురలును నసురులు యక్షులు
నురగులు గంధర్వులును మహోద్ధతిఁ బైఁబై
నురవడి వచ్చిన, నొకఁడవ
పరాజితులఁ జేయు దుగ్రబాహాస్ఫురణన్. ౧౦౪

చ. దమమును సత్యముం దపము దానము, వేదములందుఁ, జాపవే
దమునను గల్గునైపుణియు, ధర్మవిధిజ్ఞతయుం, విరోధిభూ
రమణ విమర్దనక్రమవిరాజితశౌర్యము నీకుఁబోలె నై
జము లగువాఁడు వే ఱొకఁడు, శంతనునందన, పుట్టఁ డెన్నఁడున్.

క. వే యేల!-సంభవించునె
సాయకతల్పమున నుండి 'చావఁగ నొల్లన్;

నాయిచ్చఁ గాక' యనునరుఁ
డేయుగమునఁ జూడ వినఁగ నెచ్చట నైనన్? ౧౦౭

తే. వసువులందును బెద్దవు; వాసవాది
సురుల మిగులుదు గుణముల; ధరణిసురులు
సెప్ప మీదు నీమహిమ; నాచిత్తమునను
గందు, ననుపమ తేజ, గంగాతనూజ. ౧౦౭

వ. అని పలికి పాండవాగ్రజుం జూపి — ౧౦౮

—♦ కృష్ణుఁడు ధర్మజునకు ధర్మము లుపదేశింప భీష్ము నియమించుట ♦—

ఉ. నీవు తపోవిశేషమహనీయతఁ జేసి, జగంబు లన్నియున్
భావమునం గనుంగొన, నృపాలమహోత్తర, చాలు; దీతఁ డ
త్యావిలచిత్తుఁ డయ్యె సుహృదాప్తమృతిన్; మరటిల్లు నెవ్వగం
బోవఁగఁ ద్రోవు నీ దయిన పుణ్యతమస్ఫుటవాక్యపద్ధతిన్. ౧౦౯

వ. నాలుగువర్ణంబులకును, నాలుగాశ్రమంబులకు నిట్టిట్టివి యర్థంబు
లని, నాలుగు వేదంబులం జెప్పినధర్మంబులు నీకు విదితంబులు.
ప్రవృత్తి నివృత్తులును, సాంఖ్యయోగంబులును, బురాణేతి
హాసంబులు, ధర్మశాస్త్రంబులు నవగతంబులు. సర్వసంశయచ్ఛేదన
దక్షుండవు. నీవీక్షితిపతి నాదరింపుము. శోకమోహాగ్రస్తం బగు
జనంబు విస్తరింపం జేయుట గదా మిముబోఁటులబుద్ధివిస్తారంబునకు
ఫలంబు. అనిన విని మొగం బించుక యెత్తి కృతాంజలి యై
గాంగేయుండు గోవిందున కిట్లనియె: ౧౧౦

క. కర్తయును భర్తయును సం
హర్తయు జగములకు నీవ; యాశ్రితజనఘో
రార్తినిరాసనిపుణసం
కీర్తనయోగీశ్వరేశ కృష్ణవరేణ్యా. ౧౧౧

వ. అని మఱియు ననేకప్రకారములం బ్రశంసించి 'నాకు మే లెయ్యది
దానిని నీదివ్యచిత్తంబునం దలంపు' మనవుడు నద్దేవుం డిట్లనియె:

తే. అచలభక్తి నిత్యంబు నాయందు నీకుఁ
గలిమిఁజేసి, నీయంతరంగమున నాదు
దివ్యరూపంబు నెలయించితిం ; బ్రమోద
భాజనం బైతి - భీష్మ తపస్స్వరూప. ౧౧౩

వ. మేలు వేఱ తలంప నేల యని వెండియు, ౧౧౪

క. భక్తియు నార్జవమును సం
యుక్తములై యున్నయట్టి యుల్లంబున నా
సక్తి నిలుతు ; నిం దొకఁడు వి
యుక్తం బైనను వసింప నుర్వీనాథా. ౧౧౫

తే. అనఘ, యినుఁ డింక నేఁబది యాఱుదివస
ములకుఁ దా నుత్తరాయణమునఁ జరింపఁ
దొడఁగు ; నీ వప్డు దేహంబు విడిచి యేఁగు
ద పునరావృత్తిపదమున కభినుతముగ. ౧౧౬

వ. వీరె వసువులు విమానంబులతో నంతరిక్షంబున నంతర్హితు లై నీరాక ప్రతీక్షించి యున్నవారు. అది యట్లుండె - నీవు సన్న నీలోకంబున నెఱుక పొనుంగుపడుం గావున వీ రెల్ల సకలధర్మ వివేకలబ్ధికి నయి యరుగుదెంచి పరివేష్టించి యున్నవారని తత్కాల సమాగతయోగ్యజనంబులం జూపి, ధర్మపుత్త్రు నుపలక్షించి శోకోప హతబహుశ్రుతుం డగునితండు దెలి వొందునట్లుగా ధర్మార్థసమాధి యుక్తంబు లగునుక్తివిశేషంబుల ననుగ్రహింప వలయు ననుటయు, నద్దేవకీనందనునకు దేవవ్రతుం డిట్లనియె : ౧౧౭

క.' శివ నారాయణ యచ్యుత
భవదీయము లైనమధుర భాషణములు నా
చెవు లానిన నమృతరస
ప్లవనంబునఁబోలెఁ బ్రమద భరితుఁడ నైతిన్. ౧౧౮

తే.' వాగ్విభుఁడ వైననీవచో వైభవంబు
లో సమస్తంబు నుండుట, లోకనాథ,

నీదుసన్నిధిఁ బలుకంగ నేర రాదు
పద్మభవునకు ; నే నెట్లు పలుకువాఁడ ? ౧౧౯

వ. 'విషానలసదృశంబు లగుశరంబులు సేయువేదనం జేసి, యంగంబులు, నంతరంగంబు నవశంబులై యున్నయవి. ప్రతిసంభాషణక్షమ లేదు. దౌర్బల్యంబున నెలుంగును నాలుకయుం బ్రస్ఫుటవర్తనంబులు గావు. ఏ నెవ్విధంబున భాషింప నుత్సహింతు ? ప్రతిభాషాశక్తి లేమి సహించి నాదెసం బ్రసన్నుండ వగుము. ధర్మపుత్త్రున కెయ్యది హితం బది నీవ చెప్పుము. నీ వుండ నేను జెప్పుట, గురుం డుండ శిష్యుండు సెప్పిన విధంబు గాదె !' అనిన విని భక్తార్తిహరుం డైనహరి యతనితో ని ట్లనియె : ౧౨౦

క. కురువంశధురంధరుఁ డగు
పరమార్థజ్ఞునకు వినయఫణితిం దగుని
ర్భరశరవేదన సెప్పితి ;
వరములు మూఁ డిత్తుఁ గొనుము వసుధాధీశా. ౧౨౧

క. శరములవలనను మూర్ఛం
బొరయక, యొక్కింతడప్పిఁ బొరయక, నొప్పిం
బొరయక యవిద్ధగాత్రుని
కరణి సుఖాత్ముఁడవు గమ్ము కౌరవనాథా. ౧౨౨

ఆ. అనఘ, [1]నీరువట్టు నాఁకలియును నెప్డుఁ
బొరయ కుండునట్టి భూరిశక్తి
నీకుఁ గలుగ నేను నెమ్మనంబునఁ దలం
చితిఁ దదీయపీడఁ జెంద కుండు. ౧౨౩

క. విను, సకలభూతములవ
ర్తనములు గనునపుడు, బుద్ధి [2]దవులఁబడక, యొం
దును బరఁగి దివ్యబోధం
బున నలవడునట్టి పెంపుఁ బొందు మనింద్యా. ౧౨౪

1. దప్పి. 2. = చిక్కువడక.

వ. మత్ప్రసాదంబున నీదృశప్రభావనిరూఢుండ వయి నెగడుము అని పల్కుటయుం, బారాశర్యాది పరమార్యు లప్పద్మనాభుం బ్రశంసించిరి. దివంబున దేవదుందుభులు మొరసె. మురారి భీష్మ ధర్మజులమీఁదం గుసుమవర్షంబు గురిసె. అప్సరోగణగానంబు వీతెంచె. అచ్చటియందఱు నాశ్చర్యప్రమోదభరితహృదయు లైరి. తదనంతరంబ యంబుజాప్తుం డపరగిరిశిఖరం బలంకరించె. అప్పు డమ్మును లచ్యుత గాంగేయ కౌంతేయాగ్రజుల [1]నామంత్రితులం జేసి గమనోన్ముఖు లగుటయు, నమ్మాధవ యుధిష్ఠిరులును, సాత్యకియును, భీమార్జున [2]యమళులును, కృప యుయుత్సు సంజయులును వారలకుం బ్రణమిల్లిరి. వారలును 'రేపు వచ్చెద'మని నిజస్థానంబులకుం జనిరి. కృష్ణాదులును దేవవ్రతున కభిముఖులగుచు నట్ల పలికి [3]వలగొని యరిగి యరదంబు లెక్కిరి. వారిపిఱుంద మున్ను వచ్చిన వారణ రథ తురగ పదాతులు బలసికొల్చి పోవం బురంబునకు వారు వోవుసమయంబున- ౧౨౫

చ. దినమున నెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ బీల్వ [4]వం
దినసకలౌషధిప్రవితతిం దెలి వొందఁగఁ జేయునేర్పు గ
ల్గినతనరశ్మిజాలమున లీలఁ జకోరములన్ [5]మదింపఁ జే
యు నుదయ మై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్పు సేయుచున్.

వ. ఇట్లుదయించిన సుధామరీచి లోచనప్రీతి యాచరింపం బెంపు సుభగంబుగా శౌరిప్రముఖులు పురప్రవేశంబు సేసి, నిజనివాసంబుల నుచితవర్తనంబున నారాత్రి గడపిరి. ప్రభాతం బగుటయు - ౧౨౬

తే. మంజుపాఠకరవమును మధురమాగ
ధస్వనంబును వినుచు, మాధవుఁడు మేలు

---

1 = ఆమంత్రితులంజేసి = వీడ్కొని - ఆమంత్రణము = సాగనంపుట; పిలుచుట.
2. = కవలు (నకులసహదేవులు.) 3. = ప్రదక్షిణము సేసి. 4 = సంతోషించిన.
5. = సంతసింప.

కాంచి, తత్కాలసముచితకర్మజాత
మాచరించి, భూసురులకు నర్చ లిచ్చి - ౧౨౮

వ. మంగళపరికారంబున నలంకరించి, నిజాకృతి [1]యాదర్శంబునందు దర్శించి, యప్పుడు సన్నిహితుం డైనసాత్యకివదనం బవలోకించి, భీష్మపాలికిం బోవుటకుం బాండవాగ్రజుం డాయితం బగుట యెఱింగి, 'మనవెలువడు చునికి యెఱింగింపు' మని పనిచె. అంతకు మున్న యక్కురుపుంగవుండుఁ బుణ్యాసంకీర్తనాశీర్వాదంబులను, భద్రగాననాదంబులను వీనులు వికసిల్ల మేలుకాంచి, సమయకృత్యంబు లనుష్ఠించియుండ, నాకృష్ణానుజుం డతనిం గని, గాంగేయుకడ కరుగుటకై రథంబు సన్నద్ధంబు సేయించి, 'నీరజనాభుఁడు నీరాక [2]వార్చియున్నవాఁ' డని చెప్పుటయు, నమ్మనుజపతి పార్శ్వగతుం డగుపార్థుం గనుంగొని 'మనయరదంబు సంఘటింపుము; నేఁడు మొదలుగా నయ్యెడకు సైనికుల రానీకుము; అంతఃపరివారంబు వచ్చు టుడుపుము; శాంతనవుండు సందడిం బడ నర్హుండు గాఁడు. విశేషించి పరమగుహ్యార్థంబులగువాక్యంబులు మనకు ననుగ్రహింపంగలవాఁడు గావున, నిస్సమ్మర్దంబుగా నుపాసింప వలయు' నని పలికి, యొక్కింత విచారించి తగురాజులం గొందఱం బేరుకొని 'ధృతరాష్ట్రవిభుండును వారును వచ్చువారు ; వారిం బిలువం బంపు' మనవుడుఁ, బిలిపించి యతండు- ౧౨౯

— ధర్మరాజు కృష్ణాదులతోడ భీష్మపాలికిం బోవుట. —

క. అరదము వన్నిన, నాభూ
వరుఁ, డతఁడును దాను నెక్కి, వడముడి వేఱొ
క్కరథమునఁ బిన్నతమ్ముల
నిరువురఁ గలపికొని యెలమి నేతేరంగన్. ౧౩౦

క. వినుమయ్య, మహాభూతము [3]లే
నును సమధికరూపమున వినుతభంగిఁ దగం

---

1. = అద్దమున 2. = నిరీక్షించి. 3. = ఐదును - పంచమహాభూతములును: పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము.

జను తెలుఁగు దోఁప, నెలమిం
జనియెను వసుదేవసుతునిసదనంబునకున్. ౧౩౧

వ. రథగమన[1]రవంబునం గృప యుయుత్సు సంజయులుం గూడికొనిరి; అంత— ౧౩౨

క. దారుకుఁడు పన్ని తెచ్చిన
తేరను వెల్వడియె వాసుదేవుండును; న
త్తేరులు నాలుగు [2]నేమిక
లారవ మెసఁగంగ బెరసి యరిగె నరేంద్రా. ౧౩౩

క. జనమేజయనృప, యంతకు
మును నారదముఖ్యులైనమునివర్యులు శాం
తనవునిపాలికి వచ్చిరి
వనజభవునికడకు సురలు వచ్చువిధమునన్. ౧౩౪

వ. అట్లు సంయమివరపరిషత్పరివృతుండై యున్నయద్దేవవ్రతునికడ సేర నరిగి, శౌరిప్రముఖులు రథంబులు డిగ్గి, ౧౩౫

ఆ. తత్సమీపమునకు ధర్మనందనపుర
స్సరత నరిగి, తొలుతసకలమునులఁ
బ్రణతి [3]దెలచి, కదిసి బలసి యుపాసించి
రన్నదీతనూజు నధికభక్తి. ౧౩౬

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె: ౧౩౭

మ. శరతల్పంబునఁ బొల్చుభీష్మకడకున్ సంప్రీతి నక్కౌరవే
శ్వరుఁడుం, దమ్ములుఁ, గృష్ణుఁడుం జని, మునివ్రాతంబుతోఁగూడ న
వ్వరమోదాత్తునిచుట్టు నున్నయెడ, నెబ్భంగిం బ్రవర్తించె వి
స్తరమాధుర్యమనోజ్ఞసత్కథలు విస్పష్టంబుగాఁ జెప్పవే? ౧౩౮

వ. అని యడిగిన నమ్మహీవిభునకు వైశంపాయనుం డిట్లనియె: మున్ను ధర్మపుత్త్రుండు రావించిన ధృతరాష్ట్రుండును రాజులు నతనిపజ్జ

1. = ప్రా. రయంబునం. 2. = బండికంటిఁడ కమ్మి యొక్క అవ్యక్తమధుర ధ్వని. 3 = మ్రొక్కి; ప్రార్థించి.

నరిగి, వారును గాంగేయు నుచితప్రకారంబునం గాంచి కొల్చి
యుండిరి. అట్టియెడ నారదుండు ధర్మపుత్త్రాదుల నమ్మేదినీపతులం
గలయం గనుంగొని, ౧౩౯

క. 'శంతనునందనుఁ డపరది
గంతప్రాప్తరవియట్టిఁ డయ్యె; నితఁడు లో
కాంతరగతుఁ డగుటకు ము
న్నంతఃకరణముల సంశయము వాయంగన్ - ౧౪౦

వ. 'సకలధర్మప్రకారంబులు నడిగి తెలిసికొం' డనినఁ బ్రశ్నపాటవంబు
లేమి నందఱు నొండొరువుల మొగంబులు సూచుచుండఁ, బాండ
వాగ్రజుండు పుండరీకాక్షున కిట్లనియె : ౧౪౧

తే. నీవు దక్కంగ మందాకినీతనూజు
తోడిసల్లాపములకు [1]నుక్తులు, ముకుంద,
కలరె యెందును! ధర్మవేదులకు నెల్ల
గురుఁడ; వీవ సంభాషణపరుఁడ వగుము. ౧౪౨

వ. అనుటయు నచ్యుతుండు భీష్మున కత్యాసన్నుండై శారీర మానస
కుశలప్రశ్నంబుఁ జేసిన, నతండు- ౧౪౩

ఉ. 'దేవ, భవత్ప్రసాదమునఁ దీఱె శరీరమునొప్పి దప్పి; మ
ద్భావము నింద్రియంబులును బాటవసంపద నొందె; వేదవి
ద్యావిభవంబు నాకుఁ బరతత్త్వపరిస్ఫుటబోధయుక్తమై
భావిత మయ్యె నాత్మఁ; బరిపక్వదయాకరచిత్త మాధవా. ౧౪౪

వ. 'దేవర దివ్యచిత్తంబున నన్నుం దలంచినదానం జేసి [2]బృంహితుండ
నయ్యును [3]గొండకప్రాయంబువాఁడునుం బోలె నయితిఁ;
జెప్పవలయువాని నెల్లం జెప్పెద. పాండవశుభకరం బైనదాని
నీ వేల చెప్పవు? నీతలం పేమి సెప్పవే' యనినఁ, గృష్ణుండు
గాంగేయున కిట్లనియె: ౧౪౫

1. = చెప్పఁదగినవారు-వా. శక్తులు. 2. = వృద్ధుఁడ నయ్యు.
3. = కుఱ్ఱ గాఁడువలె నైతిని.

తే. అనఘ, శ్రేయస్సునకు యశంబునకు నేను
మూలకందంబ; విను, చంద్రముండు శీత
కిరణుఁ డనుమాట విస్మయకరమె చెప్పుమ?
యశ ముపార్జింపఁ గ్రొత్తపెం పగునె నాకు? ౧౪౬

క. పరమ మగుయశము నీకును
ధరణిం గలిగింపఁ బూని తాత్పర్యమునం,
బురుషవర, నాదుబుద్ధి
స్ఫురణము నీమనమునందుఁ జొనిపితి నెనయన్. ౧౪౭

తే. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు
కీర్తి యందాఁక నక్షయస్ఫూర్తిఁ దాల్చి
నడవఁగలయది; నీవు సెప్పెడిసువాక్య
ములును వేదతుల్యంబులై వెలయుచుండు. ౧౪౮

క. ధర్మజునకు నీచెప్పెడు
ధర్మస్థితివాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెడు
ధార్మికులకు నుభయజగదుదాత్తత గలుగున్. ౧౪౯

వ. కావున నిట్లు సేసితి. భవదీయధర్మవేదిత్వంబును సవిశేష ప్రకారంబుగా నీమనుమలు ధర్మజ భీమార్జున నకుల సహదేవులు భద్రభాజనంబులుగా, నీయున్నమహీపతులు విని కృతార్థజన్ములుగా నఖిలధర్మప్రకారబోధకంబు లగువాక్యంబులు సెప్పు మనుటయు, శాంతనవుం 'డట్ల చేసెద' నని పలికి, యాదరభరితుం డయి యి ట్లనియె: ౧౫౦

సీ. ఎవ్వఁడు పుట్టిన నెల్ల మునీంద్రులు
నత్యంతసంప్రమోదాత్ములైరి,
పరమధార్మికులైన భరతులయందును
నెవ్వరు నెవ్వని నెనయ లేరు,

సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు
నలవడి యెవ్వనియందు వెలయుఁ,
బాత్రదానాధ్వరబంధురక్షాదిధ
ర్మంబు లెవ్వనికిఁ బ్రియంబు లెప్పుడుఁ,
తే. గామమున నైన, విపులార్థకారణమున
నైన, భయమున నైనను, నపథవర్త
నంబునకుఁ జొరఁ డెవ్వాఁడు, నన్ను నేమి
యడుగఁదలఁచె నాధర్మజుం డడుగుఁగాక.
వ. అనుటయు నతనితో నచ్యుతుండు—
చ. గురులను బంధుమిత్త్రులను గ్రూరశరంబులఁ గూల్చె నుగ్రతన్
నరుల ననేకకోటుల రణంబునఁ దాఁ దెగటార్చెఁ; గాన ని
ష్కరుపతి నీసమక్షమునకుం గదియం [1]బుయిలో డెడుం 'గృపా
విరహితకార్యకర్మరుఁడు వీఁ' డని యాతుదా యతలంపునన్.
వ. అనిన విని వాసుదేవునకు దేవవ్రతుం డి ట్లనియె:
సీ. విప్రులకధ్యయనప్రదానాధ్వరా
ద్యము లగుకర్మము లట్లు రాజు
లకు సంగరము; తండ్రులను బుత్త్రిపౌత్త్రుల
గురుల నైనను బాపపరులఁ బోరఁ
జంపుట ధర్మంబు; సమయంబు విడిచి లో
భంబున నన్యాయపథమునందు
వర్తించువారి నెవ్వరి నాహవంబునఁ
బొరివుచ్చఁ గలిగినఁ బుణ్యకృతియు;
ఆ. యట్లుఁ గాక శోణితాంబుపూరముఁ, గేశ
శైవలంబుఁ గాఁగ- సమరభూమి
నక్కజపు నదీచయంబు బొనర్చిన రాజు
ధర్మవిదుఁ డనంగఁ దగు ముకుంద.

---

1. జంకుచున్నాఁడు. 2 = ప్రతిజ్ఞ ; శపథము.

—♦ భీష్ముఁడు ధర్మరాజును సప్రేమంబుగా గారవించుట. ♦—

చ. అన విని, ధర్మసూనుఁడు కృతాంజలి యై తగ భీష్ముఁ డాయ స
ల్లన చని, కేలఁ బాదకమలంబు లమర్చి శిరంబు సోఁక వం
దన మొనరించినం, బిలిచి తా నభినందితుఁ జేసి, మస్తకం
బునఁ గడునర్మిలిం దనదు మోమిడిమూర్కొనిసాదరంబుగన్. ౧౫౬

వ. భీష్ముం డాభీమాగ్రజు గూర్చుండం బనిచి, 'శంకింపక నన్నేమి యైన నడుగు' మనిన నమ్మహీపతి, మాధవునకుం బ్రణమిల్లి, పారాశర్యప్రభృతి మునివర్యులకు నభివాదనం బాచరించి, సర్వకౌరవులయనుమతి వడసి, యప్పితామహున కభిముఖుండై నమస్కరించి యిట్లనియె : ౧౫౭

చ. [1]అరయఁగ రాజధర్మము సమాశ్రయ మై నడపుం ద్రివర్గముల్;
గురుతర మోక్షధర్మమునకుం దలఁపం దనప్రాప యౌఁత ; భూ
వర, విను, ఘోటకంబునకు వాగెయు, దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్. ౧౫౮

క. వ్యాకులతఁ బొంది [2]రూపఱు
లోకస్థితి, తొంటిరాజలోకముచే నం
గీకృత మగుధర్మ మనం
గీకృత మగునేని, వీతకిల్బిషచరితా. ౧౫౯

క. తరణి వొడిచి తమము సెఱుచు
కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్
ధరణిపతి ధర్మ మాత్మ
స్ఫురణంబునఁ జెఱుచు విమల బోధనచరితా. ౧౬౦

ఆ. అనఘ, నీదుబుద్ధి యతిలోక మగుటయుఁ
దెలిసికొనఁగ నాకు వలయునట్టి

---

1.=తా. విచారింపఁగా, రాజధర్మము తా నండయై మూఁడువర్గముల (ధర్మార్థకామముల, సత్త్వరజస్తమములు, క్షయస్థాన వృద్ధుల) ను నడపును ; అలఘుతర మోక్షమునకును ఆ తన (రాజధర్మముయొక్క) యందయే ఆలంబము ; అశ్వమునకుఁ గళ్లెపుదార్లును, ఏనుఁగునకు అంకుశమునువలె, జగములకు అన్నివిధముల తాను (రాజధర్మము) నివారకము. 2. = రూపుచెడును; మాయును.

ధర్మకోటి నీవ తగఁ జెప్ప వినవల
యుటయుఁ జెప్పె నంబుజోదరుండు. ౧౬

ఆ. ధర్మవిదులు రాజు ధర్మస్వరూపుఁ గాఁ
జెప్ప విందుఁ; దద్విశేషవృత్తి
భరముగాఁ దలంతు; నరవర, చెప్పవే
మున్ను రాజధర్మముల తెఱంగు. ౧౬

చ. అనుటయు, నాపగేయుఁడు, మహత్త్వసమంచిత మైనధర్మము
న్వినుతవిధాతృభావమహనీయునిఁ గృష్ణుని, వేదమూర్తి నాఁ
జనుధరణీసురావలిఁ బ్రసక్తిఁ దలంచి నమస్కరించి, యు
జ్జనపతివక్త్రి మాదరరసప్లుతదృష్టిని జూచి యిట్లనున్: ౧౬

క. నృపధర్మము లన్నియు నీ
కుపదేశించెద వినంశయోక్తుల; మఱియుఁ
విపులఫలవంత మగుధ
ర్మపథంబును [1]నడిగినెడఁ గరము వివరింతున్. ౧౬

వ. అవహితమతివై యాకర్ణింపుము : ౧౬

ఆ మేలు దనకుఁ గోరు మేదినీశుఁడు,
మున్ను దేవతలకు భూమిదేవతలకుఁ
బూజ యాచరించు [2]నోజ యత్నముఁ జేయు
వలయు ;—రెండుఁ గార్య ఫలకరములు. ౧౬

మ. విను ముద్యోగము రెంటియందుఁ [3]బర;ముర్వీనాథ, యుద్యోగ
తునకుఁ దైవము దోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱుఁ ; మానుష
మున కొక్కొక్కెడ సిద్ధి దప్పిన వగల్ వొందంగ రా దీక, ద
ప్పని దైవోపహతంబుఁగా గనుట భూపాలార్హవృత్తం బగున్, ౧౬

క. దాంతియు విజితాత్మత్వము
శాంతియు శీలంబు గలుగుజగతీశుఁడ శ్రీ

1. = అడిగినయెడ. 2. = క్రియమున. 3. = శ్రేష్ఠము.

మంతుండు యశస్వియు నై
యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా. ౧౬౮

తే. [1]ప్రకృతు లేడింటి నెఱి నడపంగవలయు;
దాని కార్జవసత్యముల్ దావలములు,
దండనీతివిధాన మంతటికి రక్ష;
యర్థ్యమగు మెల్పుతోఁ జేయ నది వెలుంగు. ౧౬౯

వ. అదియును బుద్ధిమంతులు బ్రాహ్మణులవలనం బ్రయోగింపరు. అయ్యర్థంబునకు మనువాక్యంబులు గల వాకర్ణింపుము: ౧౭౦

ఆ. [2]ఇనుము ఱాత, నీర ననలంబు, విప్రుల
వలన రాజు-లుద్భవంబుఁ బొందు
టిది నిజంబు. తత్సమిద్ధతేజము లెందుఁ
జెల్లుఁ; బుట్టినెడలఁ జేటు నొందు. ౧౭౧

క. [3]శిలద్రెంపబోయి యినుమును,
జలములు గొని కాల్పఁ గడఁగి చని యనలంబుం,
బొలియును; రాజును విప్రుల
కలిగి చెఱుపఁ బోయి తాన యనయంబుఁజెడుఁగా. ౧౭౨

శా. ఈ వాక్యంబులు రెండుఁ జిత్తమున నీ వెల్లప్పుడుం నిల్పి, భూ
దేవ శ్రేణియెడం గృపాన్వితుఁడ వై దీప్తార్థదండంబు స
ద్భావం బొప్పఁగ నొందెడుం నడపు; [4]శాంతక్ష్మాసురోదార జి
హ్వావిక్రాంతము బ్రహ్మ;మట్లగుట దైవంబండ్రు విప్రుల్ బుధుల్. ౧౭౩

---

1. = సప్త ప్రకృతులు:- ౧. స్వామి, ౨. అమాత్యుఁడు, ౩. సుహృత్తు, ౪. కోశము, ౫ (ఖజానా) రాష్ట్రము; ౬. దుర్గము (కోట,) ౭. బలము (సేన). 2.= తా. ఇనుము ఱాతియందును, నీటియందు అగ్నియు, విప్రులవలన రాజులును పుట్టుట నిజము. వానియొక్క (ఇనుము, అగ్ని, విప్రులయొక్క) పరిశుద్ధ తేజములు అంతటను ప్రకాశించును. పుట్టినచోట అవి చేటొందును. 3. = పై విషయమునకు వివరణము:- ఱాతినిఁ బగులగొట్టఁ బోయి ఇనుము, నీటినిఁ గాల్పఁబోయి అగ్నియు, విప్రుల కలిగి చెఱుపఁబోయి తాన (ఆరాజే) అత్యంతము చెడును 4. = శాంతులగు భూసురుల ఉదార జిహ్వ (నాలుక) బ్రహ్మమునకు విశ్రాంతి స్థానము.

వ. విప్రుని దండించు నెడలునుం గలవు; శుక్రుండును జెప్పినవాఁడు; వినుము— ౧౮౪

—♦ భీష్ముఁడు ధర్మజునకు విప్రులలో దండార్హుల నిరూపించుట. ♦—

క. శాంతుఁడు గాకని నాయుధ
వంతుండై కవియువిప్రు, వసుధేశుఁడు, వే
దాంతి నయిన హింసించుట
యెంతయు ధర్మంబు శ్రుతులు ని ట్లని చెప్పన్. ౧౮౫

క. గురుతల్పగు, భ్రూణహంతకు,
న రేంద్రవిద్వేషి, బ్రాహ్మణఘ్నుని [1]బెలుచన్
ధరణి వెడల నడువవలయు;
[2]శరీరనిగ్రహము సేయఁ జన దెయ్యెడలన్. ౧౮౬

వ. దుర్గంబు లనేకవిధంబులు గలవు. వానియందు నరదుర్గంబు వరిష్ఠంబు. గావున వర్ణంబులు నాలిగింటిమీఁదను మేదినీశ్వరుండు దయ గలుగ వలయు. కేవల క్షమావంతుం డగుటకు సాదు లేనుంగుచందం బై యుండు. ఇవ్విషయంబున బృహస్పతి వచనంబులు గలవు; తదీయార్థంబులు వివరించెద : ౧౮౭

సీ. మేదినీపతి యతిమృదు వైన,
[3]మావంతుఁ డేనుంగు నె ట్లట్ల యెక్కియాడుఁ
జూచుఁ దేఁకువ సెడి నీచపుఁబ్రజ; క్రూరుఁ
డగు నేని లోకంబు బెగడు గుడుచుఁ ;
గాన వసంతంబు భానునిచాడ్పునఁ
దగిమొదుపాటితో ధరణిప్రజల
నుచితవర్తనముల నొందించునది యిది
రాజధర్మములకు రాజు సుమ్ము!

ఆ. కౌరవేంద్ర, యదియుఁ గాక,
దండముపరీక్షాశిశుద్ధిపూర్వకముగ వలయుఁ.

1. = ఆగ్రహముతో. 2. = పట్టి బంధీచేయుట. 3. = మావటివాఁడు.

దనతలంపు వెంటఁ దమకించి ప్రజకు [1]నొ
వ్వఁగఁ జరించుటయును దగదు పతికి. ౧౭౮

క. విను, గర్భిణి ప్రజ బ్రదుకున
కనుగూపము లైనయట్టి యాహారంబుల్
గొనుగతిఁ, బతి ధరణీప్రజ
మనికికిఁ దగఁ నడచునది [2]తమకి గా కెపుడున్. ౧౭౯

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం [3]బ్రహ్లాదముం బొందుభూ
వరునాజ్ఞం జనః రీగి మెచ్చరు; పనిః వంచింతు; రెగ్గాడఁ జొ
త్తురు; కౌతూహలవేషభాషణములం దుల్యత్వముం బొంది [4]యే
తురు; వా రెల్లపదంబు వేఁడుదురు; సింతుర్ భూమి [5]మాటొడ్డులన్.

వ. కావున భృత్యులయెడ నత్యంతహర్షంబునం దేలి తేకుఁవ సెడఁ
జరింపవలదు. సప్తాంగంబులయెడ విరోధం బాచరించువాని నెవ్వని
నైనను విడువ వలయు అని చెప్పి, వెండియు- ౧౮౧

క. [6]అవలేపంబునఁ గర్త
వ్యవివేకము లేక వలసినట్టుల యెవ్వం
డవినీతి సేయు, ధరణీ
ధవుఁడు విడువవలయుఁ దన కతఁడు గురుఁడైనన్. ౧౮౨

వ. అని మరుత్తుం డనుమహారాజునకు బృహస్పతి యొడంబడం బలికె. అట్లగుట, గురుండు మిత్త్రుండు పుత్త్రుం డని మన్నింపవలదు. తప్పు గలిగిన ధరణీపతులకు దండింపవలయు. సగరుండు దనకొడుకు నసమంజసునిం బౌరబాలబాధకుండు గాఁ దెలిసియు, నుద్దాలకముని నిజతనయు శ్వేతకేతుని విప్రులయెడ మిథ్యోపచారకుం డని యెఱింగియుఁ, బరిత్యజించి రన వినమె? ఇట్టిచరితంబుల రాజు ప్రజారంజకుండు గావలయు. నిక్కంబును [7]జక్కటియునుం గలిగి

1. = నొప్పి గలుగునట్లు 2. = తొందరపడువాఁడు. 3. = సంతోషము. 4. = అతిశయింతురు; విజృంభింతురు, 5. = ఎదురెత్తులతో. 6. = గర్వమున, 7. = ఆర్జవము; స్థానము; కార్యము.

జనుల చిత్తంబులు నొప్పింపక, పెట్టవలయు నట్టివి పెట్టుచు, సైరణ గలిగి వర్తిల్లుభూవల్లభుం డభివృద్ధి యతిశయిల్లు.

క. తనకీడు వైదికపు వ
ర్తనములఁ గొని యడఁప వలయు ; దానిం గడవన్
జనపతికి మేలు గలదే?
వినుము, చతుర్వర్గపరత విహిత మతనికిన్.

ఆ. సకలవర్ణధర్మసంకరరక్షయు,
సంధివిగ్రహాది షడ్గుణములు -
నలయ కరయుటయును, నర్థసమ్యగుపార్జ
నమును నృపతి యెపుడు నడపవలయు.

క. పొసరిచి యాడెడుమాటలఁ
గొనఁ దలఁపక, దుర్వినీతకోటిధనంబుల్
[1]దన కెక్కినట్టితప్పులఁ
గొని సుజనుల కీగి నృపతిగుణ మండ్రు బుధుల్.

క. కడు నమ్మి యునికియును, నె
క్కుడునమ్మమియును, సుశీలక్షుశలత గా; దె
వ్వొడ నైనను, బుద్ధి సొనిపి
తడవి కనికొనంగ వలయుఁ దగవుఁ దగమియున్.

క. ధన మపహరించుటయు తన
కనిశముఁ బనిగాఁగ బ్రదుకు నతిలుబ్ధునకున్,
విను, శత్రులచే నోటకు
మును దనప్రజచేన చేటు మూఁడు నరేంద్రా.

ఆ. ధర్మరతులు నర్థనిర్మాణచతురులు
లౌల్యరహితులును నలంఘితాజ్ఞ

1స = తన కిష్టమైన తప్పుతో(ప్పు)వలచేఁ (దుర్వినీతులధనములు) గొని సుజను (కీగి) కిచ్చుట ...

లును సునీతినిపుణులును గులజులు నగు
పరిజనములఁ బెనుపు పతికి హితము. ౧౮౯

చ. కపటము లేక, వైభవము గప్పక, యొండొరుమీఁద రాజుపై
నపరిమితప్రియం బెసఁగ, నల్గక యుండు ముదంబు బొంది యే
నృపువిషయంబునం బ్రజ వినిర్మలవృత్తతఁ బుత్రుభంగి, నా
నృపు నృపుఁడంద్రు గా కితరునిం దగువా రెద నియ్యకొందురే?

క. 'ధన దారాదికముల నె
వ్వనికిని రక్షించికొనఁగ వశమే రక్షా
ఘనుఁ డగుపతి గల్గినఁ గా;'
కనఁడే శుక్రుండు సుమతు లభినందింపన్. ౧౯౧

క. 'అనధీయానుం డితఁ డనఁ
జనుబుత్విజునట్ల చూవె సంరక్షాక
ల్పనహీనుఁ డైననృపుఁ'–డని
మనువు పలికెఁ గాదె బుద్ధిమంతులు మెచ్చన్. ౧౯౨

వ. మఱియు బృహస్పతి మహేంద్ర భరద్వాజప్రముఖు లగు రాజ
ధర్మానుశాసకులు 'రాజత్వమూలకారణంబు ప్రజాసంరక్షయ'
యనిరి. గావున నెత్తెఱంగున నైనను లోకరక్షణంబు రాజున
కవశ్యకర్తవ్యంబు. ౧౯౩

తే. సంతతోత్సాహవంతుఁ డై శత్రుకోటి
నార్జవంబున నైన ననార్జవమున
నైనఁ జెఱుపన వలయు; నత్యల్పుఁ డైనఁ
బగతుఁ డగ్ని విషంబులపగిది నొంచు. ౧౯౪

క. విను, నృప, రాజ్యామిషముం
గొనఁ బలువురచేతఁ [1]బ్రాణిగొడ్డం బై యు
న్నను ధీరుఁ డేమఱమి [2]నది
దనకును దక్కించుకొను బుధస్తుత్యముగన్. ౧౯౫

---

1.= ప్రాణిహింసకము. 2.= అరాజ్యామిషము.

వ. అని చెప్పి, భీష్ముం 'డేను రాజధర్మప్రకారంబు సంక్షేపరూపంబున నెఱింగించితి. నీకు సందేహంబు గలయట్టిది యెయ్యది యడుగుము' అనిన, ధర్మనందనుం డమ్మహాత్మునితో '[1]నరుణగభస్తి యస్తగిరి సేరెడు; నేటికిం [2]బనివినియెద; రేపు వచ్చి యడిగెద'. ననుచుం, దత్పాదంబులకుం బ్రణతుండై వీడ్కొనియె. పద్మనాభ ప్రముఖులును వీడ్కొనిరి. వార లందఱును మునులకు నభివాదనంబు లాచరించిరి. మునులు నిజస్థానంబుల కరుగం దారును దృషద్వతి యనుమహానదిం గృతసంధ్యావందనులై చని, కరిపురప్రవేశంబు సేసి, సుఖవృత్తి నారాత్రి గడపి, కల్యంబునం గాలోచితకృత్యంబు లాచరించి భీష్ముపాలికిం బోయి, యంతకు మున్న వచ్చియున్న మునిలోకంబునకు నమస్కరించి, సవినయంబును సకుశలప్రశ్నంబునుం గా నగ్గాంగేయునిం గదిసి బలసి కూర్చుండిరి. ఆ సమయంబునఁ బాండవాగ్రజుండు ప్రాంజలి యై యతని కిట్లనియె: ౧౯౬

సీ. రాజనామమునకు భాజనం బై మహో
ద్భుతచరిత్రుం డగుపురుషుఁ డొకఁడు
గలిమికి మూలంబు; ఘనవిశేషము గల్గ
నోపుఁ! గౌరవకులదీపజనక,
యది యెఱింగింపవే!- యవయవంబులుఁ, బ్రాణ
మానసంబులు జన్మమరణములు, శ
రీరయాత్రలు నెల్లవారికి నెట్లట్ల
కాని విభేదంబు గాన; యిట్టి

ఆ. రా జొకండు, శూర తేజస్విబుద్ధిమ
జ్జనుల నెట్లు దనవశంబు సేయ-
నిలుపఁ-జెఱుప-నెల్ల యిలయున్న నేల-దై
వనిభుఁ డగుచుఁ బ్రొక్కఁ గొనఁగఁ జాలె? ౧౯౭

1. = అరుణాలంశుఁడు-వృద్ధసూర్యుఁడు. 2.=ఆజ్ఞావశవర్తినయ్యెద-పోయెద

—♦ భీష్ముండు ధర్మజునకు దండనీతిజన్మప్రకారం బెఱింగించుట ♦—

వ. అదియును వినవలతు నని యడిగిన, నమ్మనుజపతి కమ్మహాత్ముం
డి ట్లనియె: ౧౯౮

క. విను, తొల్లి కృతయుగంబున
మనుజులయెడ దండనీతిమంతుం డై రా
జన నొకఁడు గలిగి యరయుట,
మనుజేశ్వర, లేదు. [1]ధర్మమతి మండ్రు తగన్. ౧౯౯

క. ఒండొరులకు రక్షకు లై
యుండుదు; ర ట్లుండ దైన్య మొదవిన లోభం
బొండొండ పెరిఁగి ధర్మము
ఖండిత మై [2]మొదలుకొని రకార్యంబులకున్. ౨౦౦

క. క్రమమునఁ గామము రాగము
దమమనముల నొదవఁగా మదం బెక్కిన వి
భ్రమ మొందుచు విచ్చలవిడి
విమార్గచరితముల వేదవిధ్వంసకు లై - ౨౦౧

క. మనుజులు ధర్మముఁ బాడవడఁ
చిన, వేదముఁ గర్మములును జెడుటకు భయ మం
దిన యింద్రాదులు, గమలా
సనుఁ గానఁగ మునులుఁ దారుఁ జనిరి నరేంద్రా. ౨౦౨

వ. చని, యద్దేవునిం గని, 'మనుజలోకంబున వేదంబులు ధర్మంబులుం
బాడవడంగిన నధ్వరరాహిత్యంబున నేమును దుర్బలుల మై భయం
బంది వచ్చితిమి రక్షింపు' మని యవ్విబుధులు విన్నవించిన,
విరించి, 'దానికిం బ్రతివిధానంబు సేసెద. మీరు వెలువ వల' దని
పలికి, స్వామ్యమాత్యరాష్ట్రదుర్గకోశసుహృద్బలంబులు, నాన్వీక్షు
కీత్రయీవార్తాదండనీతులును, నరిమిత్త్రోదాసీనాదికద్వాదశరాజ
మండలంబును, సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్ర

1.=ధర్మబుద్ధితో మనుదురు (వర్తిల్లుదురు.) 2.=(చెడుపనులకు) ఆరంభించిరి.

యంబులును-మొదలుగా వలయు. వానికిం బ్రబోధకంబు లగు నానావయవంబులుం గలిగి, ధర్మార్థకామమోక్షంబులకు సాధకంబు లయి యుండునట్లుగా, నూఱువే లధ్యాయంబుల నఖిలలోకహితం బగునీతిశాస్త్రంబు రచియించి, యిది లోకచరిత్రనిర్మలీకరణంబు నకుం గారణం బగు' నని యనుగ్రహించె. ఆలోకపితామహు లలాటంబున [1]ననాదినిధనుండును విశ్వజగత్కర్తయు సర్వభూతాత్ముండును సనాతనుండును నగువిరూపాక్షుండు విశాలాక్షుం డనునామంబున నావిర్భవించి, యాగ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు సాల వని యుమ్మలించి, యమ్మహానీయతంత్రంబు సంక్షేపరూపంబునం బదివే లధ్యాయంబుల వైశాలాక్షం' బన నిర్మించె. ౨౦౩

ఆ. హరునివలనఁ బడసి యాశాస్త్ర మమరేంద్రుఁ
డయిదువేలు సేసె. నమరగురుఁడు
దేటపడ నొనర్చెఁ ద్రిసహస్రకాధ్యాయ
రూపసమ్మితముగ భూపవర్య. ౨౦౪

వ. దాని శుక్రుండు సహస్రాధ్యాయపరిమితంబుఁ గావించె. మఱియు మనుష్యులశక్తి యెఱింగి మునులు క్రమంబున సంక్షిప్త రూపంబులుగా గ్రంథంబులు గావించిరి. ఇది నీతిశాస్త్ర ప్రవర్తన ప్రకారంబు. అట్లు సుర లమ్మేలు వడసి విశ్వలోకేశ్వరుండగు విష్ణుపాలికిం జని తగం గని, కార్యంబు విన్నవించి, నీతిశాస్త్ర సముద్భవం బెఱింగించి, 'దీని నధిగమింపను దదీయాచారంబు నడపను శక్తుం డగువాని నొక్కరుని నిర్దేశింప వలయు' నని యభ్యర్థించిన, నద్దేవుండు, నిజతేజోమయుండుగా నొక్క మానసపుత్త్రు నిర్మించి, విరజుం డనుపేరిడియె. అతండు భూమికిం బ్రభువుగా నొల్లకుండె. తత్సుతుండు కర్దముండు ననపేక్షితరాజ్యుం డై తపంబున కరిగె. తదీయపుత్త్రుం డనంగుండు దండనీతి నయించి భూప్రజలం బాలించె. అతనికొడుకు నీతి యనువాఁ డమ్మహా

1 ను = చావులేనివాఁడు.

రాజ్యంబున కభిషిక్తుండై యింద్రియవశత్వంబునొంది మృత్యుపుత్త్రి సునీథ యనుకామినిం గమనీయాకార నతిమనోహరగుణవిభాసినిం బరిణయం బై సదానియందు వేనుండు గలిగి, మాతామహదోషంబునం జేసి రాగద్వేషంబులం బ్రజకు విరుద్ధుం డయ్యె. అట్లగుటయు, మహామునులుగూడి యేతెంచి మంత్రపూతంబు లగుకుశసంచయంబుల నతనిం బ్రశమితుం జేసి తద్దక్షిణోరుతలంబు మథించిన— ౨౦౪

క. విను, కాలినకొఱవి తెఱం
గున నల్లఁదనంబు మిగులుకుఱుచయొడలు నె
త్తురుఁగన్నులు నై యశుచి
త్వనిరూఢుం డొకఁడు పుట్టె ధర్మతనూజా. ౨౦౫

—♦ వైన్యుం డనురాజుచరిత్రంబు భీష్ముఁడు ధర్మజునకుం జెప్పుట ♦—

వ. వానింజూచి యాఋషులు నిషీద యని పలికి వర్జించుటం జేసి, తత్సంతానజాతులు నిషాదులనం బరఁగి వింధ్యాదిగిరివనప్రదేశంబులఁ గ్రూరత్వంబున వర్తిల్లిరి. అమ్మునులు మఱియు నారాజు దక్షిణబాహువు మథించిన నుజ్జ్వలత్కవచశరశరాసనభాసమానుండును వేదవేదాంగధనుర్వేదపారగుండును నగుపరమాకారవంతుం డుదయించె. సకలదండనీతియు నప్పురుషు నాశ్రయించె. అతం డమ్మహాత్ముల కభిముఖుండునుం బ్రాంజలియు నై వినయంబున—

తే. వినుఁడు ధర్మార్థతత్త్వప్రవీణ యగుచు
సూక్ష్మదర్శిని యైనది, సుకృతులార,
నాదుబుద్ధి. మీ కెప్పని నడప వలయు
దీనఁ గొని నన్నుఁ బనుపరే దాని కనిన — ౨౦౬

వ. వారునుం దత్సమయసమాగతులయినవిబుధులును నవ్వైన్యాభిధాను నభినందించి, ౨౦౭

"సీ. మానలోభములఁ గామక్రోధములఁ బాసి
సర్వజంతువులకు సముఁడ వగుచు,

నియతధర్మము నీవు నిశ్శంక నడపుము,
ప్రియము నప్రియము నుపేక్షc గూర్చు;-
'దండనీత్యాశ్రయధర్మంబు నాపని
దీనిc జేయుదు సావధానవృత్తి;
రక్షింతు శ్రుతుల ; వర్ణముల సంకరములు
సోర నీ ; నదండ్యులు ధరణిదివిజు;
తే. లరయువాcడ నే భూప్రజ' నని ప్రతిజ్ఞ
యనుమహాన్నతపద మెక్కు;'' మనుడు, నాతc
'డవనిసురులు సహాయత్వ మాచరించి
రేని న ట్లగుc గా' కని యెం గుమార. ౨౧౦

వ. అనిన విని, వారలు ప్రీతచిత్తులై యతనికి మహీసురులు సహాయత్వం బాచరించువారుగా ననుమతి సేసిరి. అయ్యవసరంబున, వాత్సల్యంబున సకలదివ్యపరివృతులై వచ్చి విష్ణువిధాతలు, నమ్మునీశ్వరులును నక్కుమారు నఖిలధరణీసామ్రాజ్యాభిషేకంబు నిర్వర్తించిరి. అవ్విభునకు శుక్రుండు పురోహితుండును, వాలఖిల్యులయందు సారస్వత్యగణం బమాత్యులును, గర్గుండు [1]సాంవత్సరికుండు నై నడచిరి. మున్ను మహి విషమ యగుటయు, నమ్మనుజపతి సమమూర్తిగావించుటయు వింటిము. కరచరణాద్యవయవంబులతో నవనియు సాగరంబులును మహాగిరులును నగ్గురుప్రభావుని భజియించె. ౨౧౧

క. సురపతి విభవము, మేరువు
హిరణ్యమును, గిన్నరేశుc [2]డీడితసంప
ద్భరితయు, నొసcగిరి- రథ కరి
తురగ భటావళులు [3]దలcపుతో నొడcగూడెన్. ౨౧౨

1. జ్యోతిష్కుcడు. 2. ఈ సంస్తుతిమైనగొప్పసంపద, 3. ఈ సంకల్ప

వ. ఇట్లు మహనీయ ప్రభుత్వపదస్థుండై యమ్మహాత్ముండు శాస్త్రోక్త మార్గంబున దండనీతిపరిపాలనంబు ధర్మతాత్పర్యసమీచీనంబుగా నాచరించె. ౨౧౩

క. ఉరగాదుల వలనిభయముఁ
బొరయక, యొండొరులతోడ బొసఁగి, [1]రుజలుఁ జి
త్తరుజలు లేక [2]యతనితఱి
ధరణీప్రజ సస్యసంపదయుఁ గల్గి మనున్. ౨౧౪

తే. బ్రాహ్మణక్షతత్రాణతత్పరతఁ జేసి
క్షత్రియాభిధానంబు, రంజనము నెల్ల
ప్రజకుఁ జేయుటకతమున రాజనామ
మును బ్రవర్తిల్లె నాన్నృపాలునకు నధిప. ౨౧౫

వ. తత్సంతతిజాతులెల్లను [3]దత్కల్పులై రాజత్వంబు వహించి దండనీతి పాలించిరి. రా జని యొకండు గలిగిన తెఱంగును, రాజ్యస్థాపనంబున రాజు మిగిలి వర్తిపం దక్కినజనంబులకు రాకుండుటయు విష్ణువిహితంబులు. విష్ణుండు రాజుల నిజతేజోంశంబులం బ్రవేశించి యుండు. అట్లగుటంజేసి దైవనిభుండగుచు రా జెల్లవారిచేతను మ్రొక్కుం గొనం జాలు ; తద్రక్షణంబును నాచరించు. ఒక్కనివశంబున లోకం బంతయు వర్తిల్లుటకు దేవసంబంధకలితం బయినగుణంబు వెలిగా నొండు కారణంబు గలదే ? ఆకర్ణింపుము: ౨౧౬

మ. హరిఫాలంబునఁ బుట్టి ధర్మమున కార్తై, యర్థ మన్పుత్రికిఁ
సిరి గాంచెన్; దగ వారు మువ్వురును సుస్థేమోన్నతిన్ సంశ్రయిం
తురు భూపాలకు; నాతఁ డన్యజనతాతుల్యోద్భవుం డెట్లు ని
ర్జరలోకార్హసమగ్రపుణ్యవితతిప్రాప్తుండు గా కారయన్ ? ౨౧౭

వ. దివంబుననుండి దండనీతి నయించుటకు వచ్చి వాసుదేవమహత్త్వ భావితుండైన మహానుభావుండుగావున వర్ణంబులు, నాశ్రమంబులుం

---

1. = రోగములు, మనోరోగములు, 2 = అతని రాజ్యకాలమున. 3. = అతనివంటి వా రేయై.

దదాచారప్రవర్తనంబులైన వేదపురాణేతిహాసంబులును రాజున కధీనంబులు. తదీయమాహాత్మ్యంబున నతని యందు సౌందర్య శౌర్యచాతుర్యాదిగుణంబులు గలుగ జనంబులు దలంతురు; తదాజ్ఞకు లోనై వర్తింతురు. ఇది రాజులు దేవసములైన తెఱంగు. మఱియు నడుగ వలయువాని నడుగుము. అనిన, నయ్యాపగానందనునకుం బ్రణమిల్లి యుప్పాండునందనుం డి ట్లనియె: ౨౧౮

తే. అనఘ, నాలుగువర్ణము, లాశ్రమములు
నెన్ని గల వెవ్విధంబుల నన్నిటికిని
వర్తనమ్ములు వేర్వేఱ వానిఁ దెలుపు
విశ్వరాజధర్మములను విస్తరింపు. ౨౧౯

—♦ భీష్ముఁడు ధర్మజునకు వర్ణాశ్రమధర్మంబు లెఱింగించుట. ♦—

వ. అని యడిగిన నాదేవవ్రతుం డన్నరదేవోత్తమున కి ట్లనియె. ౨౨౦

క. కోపంబు లేమి, సత్యాలాపము,
నిజదారపరవిలాసము, శుచితా
గోపన, మద్రోహం, బవనీపాలక,
సర్వవర్ణనియతగుణంబుల్. ౨౨౧

ఆ. బ్రాహ్మణునకు దమము పరమధర్మం ; బవ
శ్యంబుఁ గృత్య మధ్యయనము ; దాన
సర్వకర్మములును శాసితంబులు ; వాని
నడప వలయు నిష్ఠ యెడప కతఁడు. ౨౨౨

ఉ. కానిపథంబునం జనక, కారుణికత్వము గల్గి శాంతిమైఁ
దా నడవంగ, విప్రునకు దార్తధనం బొడఁగూడె నేని సం
తానముఁ గూర్ప, నర్హులకు ధర్మనిరూఢతఁ బంచి పెట్ట, దు
ష్టుఁ డై పరఁగఁ బ్రాహ్మఁడు— కౌరవవంశదీపకా. ౨౨౩

దానకర్మమును, నధ్యయనంబును, దస్యుహింసయుం
గ మొందఁ బరిపాలన సేఁతయు, సంగరంబున

న్విజితవిభీతిమై నరవణించుటయుఁ నృపధర్మముల్. కురు
వ్రజతిలకాయమాన, సమరంబు సుధర్మువు వీనిలోపలన్. ౨౨౪

తే. అధ్యయన దాన యజ్ఞంబు, లధిప, వైశ్య
నకును గృత్యముల్; శుద్ధార్జనమున ధనము
సంచితవ్యంబు పసుల రక్షించువాఁ డ
తండు; వానికి నిది మహాధర్మ మనఘ. ౨౨౫

క. ఈమూఁడువర్ణములకును
దా మంచిగఁ బనులు సేఁత ధర్మువు, కురుధా
త్రీమహీశ్వర, శూద్రున;
కామెయి జీవనము వాని కజుఁడు విధించెన్. ౨౨౬

క. ధనధాన్యంబులు గూర్చుట
జనపతి యనుమతము లేక చన దతనికి దా
ననిరూఢి; శ్రద్ధ గలిగినఁ
జను, నది సుపవిత్ర యగుట జగతీనాథా. ౨౨౭

తే. అధిప, [1]త్రైవర్ణికులకును యజ్ఞవిధుల
శ్రద్ధ గలిమికి మిగుల ధర్మంబు లేదు;
యజ్ఞమునకంటె నధిక మైనదియుఁ గలదె?
యజ్ఞకర్తయచూవె సర్వాధికుండు. ౨౨౮

వ. ఆశ్రమధర్మంబు లాకర్ణింపుము: ౨౨౯

మ. గురుశుశ్రూషయు, నాగమాధ్యయనముఁ, [2]గోష్ఠీనిరాసంబుఁ, [3]ద
త్పరతన్, [4]మేన్దొడయంగఁదాఁజొరమియున్, [5]భైక్షాశనత్వంబు, [6]ష
డ్వరకర్మంబులయందు-రాగభరగాఢద్వేషముల్ లేక యె
వ్వరితోడం బగగాక యున్కియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్.

---

1. = మూఁడువర్ణముల వారికిని యజ్ఞవిధులయెడ శ్రద్ధ (కలిమికి) ఉండుటకు మించు ధర్మములేదు. 2. = సల్లాపనిరసనము. 3 = నిమగ్నతను 4. శరీరము గడిగికొనఁ దాను బూనకుండుటయు, 5. = బిచ్చపుగూడును. 6. = శ్రేష్ఠములగు ఆఱుకర్మములు: (షట్కర్మములు: యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహములు) యందు.

మ. నిజదారైకపరత్వమును, గరుణయున్, నిక్కంబునుం, దాల్మియున్,
సుజనాసంగము, దేవ పిత్రతిథిసంశుద్ధార్చనల్, [1]హవ్యభు
గ్భజనంబున్, సకలాశ్రమస్థులను శక్యప్రక్రియం [2]బ్రోవుఁ- బం
కజగర్భుండు గృహస్థధర్మములు గాఁ గల్పించె నుర్వీశ్వరా. ౨౩౧

శా. తానున్ భార్యయు నేఁగుఁ బేరడవికిం, దా నొక్కఁడైనం జనున్,
మానాహంకృతు లూడ్చు, నింద్రియములన్మర్దించు, నచ్చో జడల్
పూనుం, దాపసశాస్త్రముల్ సదువుఁ, జల్పున్ గోష్ఠి తద్జ్ఞాళితో
వానప్రస్థవిధా పవిత్రుఁడు ప్రజావాత్సల్య [3]నిఘ్నాత్మతన్. ౨౩౨

శా. ఎచ్చోనైనను నిల్చు, నాఁకటికి నేమేనిం గొనున్, రాత్రియై
నచ్చో నెమ్మి శయించు, నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ, దా
నిచ్చం గోరఁ డొకండు, నింద్రియజయం బేపారుభోగంబులన్,
మెచ్చున్, [4]మ్రొక్కను నొల్లకుండు-యతి, పేర్మిన్ [5]నిర్మముండై నృపా.

క. ఈనాలు గాశ్రమములకుఁ
బూని చొరం దగినవాఁడు భూదేవుఁడు; రా
జైనను, వీనను, వైశ్యుం
డేనియు వర్తించు శుద్ధహృదయతకల్మిన్. ౨౩౪

తే. సుమతిఁ ద్రైవర్ణికులకు శుశ్రూష సేసి
యాప్తసంతానుఁ డయ్యు నిలాధినాథు
ననుమతంబున శూద్రున కాశ్రమాంత
రంబుదగుఁ; గాదు యతిగాఁగ రాజముఖ్య. ౨౩౫

క. నిజధర్మవర్తి యగు స
ద్ద్విజుఁడును బాత్రింబు దానవిధి మఖముల; క
ట్లు, జనేశ్వర, నృపముఖులకు
నిజవిత్తము లీయ మాననీయత గలుగున్. ౨౩౬

---

1. = హవ్యము = యజ్ఞప్రసాదము; భుక్ = తినువారిని - దేవతలను, - భజన = సేవించుటయు. 2. - ప్రోవు = పోషించుట. 3. = బిడ్డలయెడ వాత్సల్యము చేడిగిన మనస్సు కలవాఁడై. 4. = (ఒరుల) మ్రొక్కులు (నమస్కారములు) కోరఁడు. 5. = మమత్వము వదలినవాఁడు-తన్ను మఱచినవాఁడు.

తే. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశుఁ
డుక్తపథమున నడపించి యుభయ లోక
సిద్ధి గనఁ; దప్పఁ ద్రొక్కిని శిష్టజనులు
గల నరేంద్రున కిం దుండు దలఁప సరియె? ౨౩౭

వ. అదియునుం గాక— ౨౩౮

సీ. ఏనుంగు [1]హాజ్జలో నెల్లసత్త్వంబుల
హాజ్జలు నడఁగినయట్లపోలె
రాజితక్షత్త్రధర్మమునకు లోనయి
సర్వధర్మంబులుఁ జను; మఖములు
వేదంబులును శుభ వృత్తంబులును దండ
నీతి మాసినఁ జెడు; భూతలంబు
సంస్కారరహితమై చాల హీనతఁ బొందు
నట్లైనఁ బ్రజకుఁ జే టావహిల్లు;
తే. రాజు లరసిన నెమ్మది బ్రదుకుఁ గాన
రాజు సర్వోత్తముఁడు ధర్మరాజియందు;
రాజధర్మంబ యెక్కుడు; రా జనంగ
ధర్మదేవత యన వేఱె ధర్మతనయ? ౨౩౯

వ. ఆకర్ణింపుము: ౨౪౦

తే. తొల్లి మాంధాతృఁ డనుమహీవల్లభుండు
విష్ణుసందర్శనము సేయ వేఁడి, యొకమ
హాధ్వరము నిష్ఠమైఁ జేయ, నమరవిభుఁడు
సన్నిహితుఁడయ్యెఁ బ్రీతి నజ్జనవిభునకు. ౨౪౧

వ. అట్లింద్రుండు ప్రత్యక్షుం బగుటయు— ౨౪౨

క. అన్నరపాలుఁడు దానుఁ
జన్నమునకు వచ్చినట్టిజగతీశులు భ

---

1. రూ. అజ్జ = అడుగు; పాదము.

త్తికి న్నముగ్రులై రి—దేహములు
న్నెలయు, ముదము మనములుం గలయంగన్. ౨౮౩

వ. అట్లు దండప్రణామంబులు సేసి లేచి చేతులు మొగిచి నిలిచిన
సురేంద్రుఁ డన్నరేంద్రునితో నిట్లనియె: ౨౮౪

ఆ. విష్ణుఁ జూడ నీవు వేడుక పడితి; నా
కైన నజున కైన నరిది విష్ణు
దర్శనంబు; నీదు తలఁ పెద్ది యెఱింగింపు?—
మది యొనర్చెదను మహానుభావ. ౨౮౫

క. అనవుడు, 'సాంసారికవ
ర్తన ముడుపుము, భైక్షచరణతత్పరత మనం
బున దృఢముగ నొందింపుము,
ననుఁ జరితార్థునిఁగఁ జేయు' నావుడు నగుచున్. ౨౮౬

మ. ధరణీశా, నృపధర్మ ముత్తమము సద్ధర్మంబులం దెల్ల; నే
తెరువున్ రా జరయంగఁ గాదె తగ సిద్ధిం బొందుఁ?గామంబుఁ గ్రో
ధరయంబున్ మగిడించి దండము సమవ్యాప్తిఁ జెల్లించుచున్
ధరఁ బాలించినరాజు వొందుగతిఁ బొందన్ శక్యమే యేరికిన్? ౨౮౭

వ. అని పలికి పురందరుం డందఱు రాజులం గలయం గనుంగొని—

తే. లోకపాలాత్ములరు మీరు మీకు భైక్ష
చరణ మర్హమే? ప్రజఁబ్రోవు సమరముక్త
దేహు లగుటయు నమ్మోలు దెచ్చు; సంశ
యంబు వలవదు మీపద మధికతరము. ౨౮౮

వ. అని చెప్పి దేవేంద్రుండు దివంబునకుం జనియె: ౨౯౦

చ. అది యొకఁ డేల—వేదములయందుఁ, బురాణములం బ్రసిద్ధకో
విదులు బహుప్రదేశముల వేమఱుఁ గాంచి, 'మనుష్యు లెల్ల భూ
మిదయితుకంటెఁ దక్కు—వ; యమేయసుధర్మము లేదు గావు; ని
ర్మదకృతదండనీతి' కనరా మన మెల్ల వినంగ నెప్పుడున్? ౨౯౧

ఉ. కావునఁ గామరోషములఁ గ్రాఁచుచు, నాశ్రమకోటిఁ గాచుచున్
భూవలయప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యము సేఁత మేలు; భి
క్షావిధి లోను గాఁ గలుగు సారపుధర్మములన్ ఘటించు మేల్
వారిరి సప్రయత్నమున వానికి వచ్చు, నృపాల, యెమ్మెయిన్. ౨౪౨

చ. అతిథుల దీనకోటుల ధనార్థిత లేనియతివ్రజంబు స
మ్మతిఁ బరికింపు; హర్షమదమానవిషాదములం జొరంగ నీ
క తొలఁగఁ ద్రోవు; 'నాయొడలు గావక భూప్రజఁ గాతు' నన్విని
శ్చితదృఢబుద్ధి గల్గు; మిది సేయు సమస్తసుధర్మసిద్ధులన్. ౨౪౩

వ. అనిన విని యజాతశత్రుండు, 'మహాపురుషా, వర్ణాశ్రమవిధంబులుం దద్రక్షణంబు చెప్పను, దాన వచ్చు పెంపును నెఱింగించితివి. రాష్ట్రజనంబు లెయ్యది యాచరించి సుఖు లగుదు రెఱింగింపవే' యని యడిగిన నమ్మహీకాంతునకు శాంతనవుం డిట్లనియె : ౨౪౪

—♦ రాష్ట్రజనుల కర్తవ్యధర్మంబులు భీష్ముఁడు ధర్మజునకుఁ దెలుపుట ♦—

సీ. రాజు నుత్తమగుణభ్రాజిష్ణు నభిషిక్తుఁ
గావించుకొని, యెల్లకార్యములును
దన్ముఖంబునఁ జెల్లఁ దద్దయు సుఖముండఁ
బడయుదు; రొకఁడు భూపాలనంబు
సేఁత లేకున్న దుశ్చేష్టితులై జను
లన్యోన్యదారధనాపహరణ
మాచరింతురు; [1]మీలయట్లుల బలవంతు
లల్పులఁ దమకు నాహారములుగఁ

తే. గొంద్రు; భూపతి లేకున్న [2]మందెజనము?
లధిప, కృషి సేయుటయును, [3]బేహార మాడు
టయును, గోరక్షగావించుటయును మొదలు
గాఁగ బ్రదికెడు తెరువులు గాసిగావె! ౨౪౫

వ. వినుము— ౨౪౬

---

1. = చేపలనువలె. 2. = మనుజులా? 3 = బేరమాడుటయును.

సీ. జను లొక్కతఱిఁ దొల్లి [1]సమయంబు దమలోనఁ
జేసి, క్రూరతయు, బ్రముచ్చిమియు నంకు
సైఁపక, యట్టిదుర్జను నందఱును గూడి
శాసించువారుగాఁ జాలి, తమకు
నధిపతియుఁగ నొరు నానపడకయుండి,
నడవడి బహుకారణములఁ జిక్కు
వడిన, విషణ్ణులై బ్రహ్మ గానఁగఁ బోయి,
'మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు
తే. వలయు రూపింపు; మాతనిఁ గొలిచి బ్రదుకు
వార' మనుటయు, నజుఁడును వారివలని
కరుణ [2]మనువు నిరూపించె; నరు లసత్య
చరితు లని పాలనమునకుఁ జొరఁడ యతఁడు. ౨౫౭
వ. చొరకున్న నజ్జనంబు లమ్మహాత్మునితో 'నీకుం బుయిలోడ నేల?
ప్రజలచేతఁ, బశువులయందును, బసిండిని నేఁబది యగునంశంబును,
ధాన్యంబున దశమభాగంబును భండారంబుగాఁ బుచ్చికొని,
శస్త్రోపజీవుల నెల్ల నీవారిం జేసికొని బలవంతుండ వై దుష్టనిగ్రహ
శిష్టప్రతిపాలనం బాచరింపుము. మే మందఱము ననుసరించి నీపనుపు
సేయంగలవారము. అధర్మవర్తనులు నీచేతం జెడువారు. ధర్మ
వర్తనలు సేసిన ధర్మంబున నాలవపాలు నిన్నుం జేరం గలయది
గా నోడంబడితిమి. ఇంద్రుండు దేవతల రక్షించుమాడ్కి మమ్ము
రక్షించుకొని సుఖం బుండుము' అనుటయు- ౨౫౮
క. అతఁ డొడఁబడి యుత్తాలఁగున
నతిబలవంతుఁ డయి నీతి నంచిత మగు ను
ద్ధతవిక్రమమునఁ దగ నీ
క్షితిఁ బాలించె; సుఖులై రశేషజనములున్. ౨౫౯
చ. కావున, మేలు సేయదె జగజ్జనకోటికి రాజునాజ్ఞమైఁ
బోవుట? యాతనిం దగినపూజలఁ దృప్తునిఁ జేత దేవసం

1. శపథము. 2. మనువును జూపె.

భావనఁ గొ; ల్వతం డొకటఁ బాడి దొలంగిన సైఁచు టిట్లు సం
భావితుఁ జేయుఁగా, నతనిపం పొనరింతురు మ్రొక్కి శత్రులున్.

క. తనవారు పెద్ద సేయని
మనుజేశు నరాతిజనులు మదిని స్వరక్షగాఁ
గొన; రది భూప్రజ కొప్పదు.
విను, కావునఁ, బతికిఁ బ్రజలు వెఱచుట్ల యొప్పున్. ౨౬౧

తే. వాహ నాసన శయ్యా నివాసములును,
భోజ్య గంధ మా ల్యాంబర భూషణములు,
గుప్తియును నరపతికి నెక్కుడుగ వలయు
ననుతలంపుతో మనుట భూజనులగుణము. ౨౬౨

చ. అతఁడును మందహాససహితాలపనంబును, సత్యభాషణ
వ్రతమును, సంవిభాగనిరవద్యతయుక్, సమభావముం, గృత
జ్ఞతయు, జితేంద్రియత్వముఁ, బ్రసాదఫలంబును గల్గి, భూమికిం
బితృసముఁ డై విరోధిజనభీషణసారత నొప్పఁ బెంపగున్. ౨౬౩

వ. అనుటయుం, గాంగేయాగ్రజుండు, 'మనుష్యుల కెల్ల రా జధిపతి
యును దైవంబునుం గా విప్రులు సెప్పిరి. అట్లగుట యేమిటనో యని
యుండుదు; నది మీ వలనం బ్రస్ఫుటంబు గా వింటి' నని పలికిన
గాంగేయుండు 'ఇంకనుం జెప్పెద. తొల్లి వసుమనుం డనుమాన
వేంద్రుఁడు, నీవపోలె వితర్కించి బృహస్పతి నడిగిన, నతం డతనికిఁ
జెప్పినభంగి యాకర్ణింపు' మని యి ట్లనియె: ౨౬౪

—♦ బృహస్పతి వసుమనుం డను రాజునకుం జెప్పిన రాజధర్మప్రకారము. ♦—

తే. లోకములు లోకధర్మంబులును, నృపాల,
రాజమూలముల్; రాజవిరహిత మైన
పుడమి జనులకు నింకిన మడువులోని
జలచరంబులు పడుపాటు సంభవిల్లు. ౨౬౫

క. [1]తరణి శశాంకుల తేజ
స్స్ఫురణము లే కున్నయట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు,
నరపాలక, విహితపాలనము లే కున్నన్.

క. తనధన మిది యని యూఱడి
మనఁ, బరిణయ మాది యైనమహితోత్సవముల్
గొనియాడ నెవ్వరికి వ
చ్చునె జనపాలుండు లేనిచో నిర్భయతన్.

తే. విభుఁడు లేకున్న జనములు సభయహృదయు
లగుచు హాహా నినాదంబు లడరఁ దల్ల
డిల్లుదురు; [2]రాజు లేమియు నెల్లవారు
లేమి, కల్మియు కల్మి, దుర్లేపరహిత.

క. యాగములును భోగములును
ద్యాగములును బహువిధముల ధర్మములు, మహా
భాగా, నరపతిరక్షా
యోగంబునఁ జెల్లుఁ బ్రజకు నుల్లాసముగన్.

క. ఒకరునికి నలిగి యాతని
సకలహిరణ్యంబు రత్నసంచయమును బు
చ్చుకొనుం, దనవలచినవా
నికి నిచ్చు- ధనేశుఁ డింద్రుఁ డు నృపు నట్టితఱిన్?

తే. చారచక్షుఁ డై కను నెల్లజగము నపుడు
సూర్యుఁ డింద్రుఁ డు నరేంద్రుఁ డు; నకార్యకరులఁ
దునుము నయ్యెడ జముఁడు నాఁ జను; నతండు
దేవతాత్మకుఁ డగుట సందియము నె యధిప.

క. విను, నృప, సమాశ్రిత్తు విరా
ట్టనియెడుశబ్దములఁ బొగడు నాగమములు నె

1. = సూర్యచంద్రుల. 2. = రాజులేకపోవుట ఎల్లవారికిని లేనివారే. కల్మియు కల్మి = ఆతఁ డుండుటయే అందఱ ఉన్నట్లే.

ట్టిన భూపాలకు ననిన, న
తని( దగ నర్పింప కుండ దగునె యొరులకున్? ౨౭౨

క. నియతిమెయి నెవ్వ( డింద్రియ
జయమును భక్తియును జిత్తసారము దృఢసం
శ్రయతయు( గలిగి గొలుచు నృపు
నయసంపన్ను(డుగ( జేయు నధిపతి యతనిన్. ౨౭౩

క. రాజునకు( బ్రజ శరీరము;
రాజు ప్రజకు నాత్మ; గాన రాజుం బ్రజయున్,
రాజోత్తమ, యన్యోన్యవి
రాజితులై యుండ వలయు రక్షార్చనలన్. ౨౭౪

వ. అని యిట్లు బృహస్పతి యుపదేశించినం గౌసల్యపతి యగు నవ్వసుమనుండు ప్రయత్నంబునం బ్రజాపాలనం బాచరించె నని చెప్పుటయు, ధర్మనందనుండు 'రాజుజనపదపరిపాలనంబును శత్రువధంబును మొదలైనకృత్యంబులు నడపుతెఱం గెఱింగింపవే' యనుటయు, భీష్ముం డి ట్లనియె:- ౨౭౫

క. తనుఁ దాన తొలుత గెలువఁగ
మనుజపతికి వలయుఁ; బిదప మార్తుర గెలువఁగ
మనమునఁ దలంచునది; మును
దను గెలువనిపతికి గెలువఁ దరమే పగఱన్. ౨౭౬

ఆ. వినుము తన్ను గెలుచు టన వే ఱొకం డె?- పం
చేంద్రియములఁ దూలనీక కొలఁది
నాఁగుటయు. జితేంద్రియత్వంబు గలరాజు
రిపులఁ జెఱుపఁ జాలు నృపవరేణ్యా. ౨౭౭

క. ఆరామాదికనిజనం
చారస్థలములకు, దేశసంధులకుఁ, బురీ
ద్వారములకు, నగరికిని ధ
రారమణుఁ డొనర్ప వలయు రక్షలు నియతిన్. ౨౭౮

తే. అరులకడ, నిజభూమియం, దనుజ తనుజ
బాంధ వామాత్య మిత్త్రిలపాల, వేష
ధరుల వేగులఁగా బెట్ట ధరణిపునకు
వలయు నొండొరు నెఱుఁగని వారిఁగాఁగ.

క. తను హీనుం డని యెఱుఁగక
మును ప్రబలునితోడ శీఘ్రమున సంధానం
బొనరింప వలయు; నతనికి
ధనం బొసఁగి యైన బతికిఁ దగు నిలఁ గావన్.

క. మత్తుఁ బ్రమత్తుని విషయా
యత్తుని దుర్బలునిఁ జూచి యట్టిపగతుపై
నెత్తునది; శిఖివిషాదుల
నుత్తలపెట్టునది యతని యుర్వి గడెంకన్.

ఆ. కయ్యమునకు వలదు కాల్ద్రివ్వ నధిప, సా
మమున భేదమునను మార్తు మనము
మెత్తఁ జేసి చెఱుచు మెయివడిఁ దప్పించు
కొను తెఱం గెఱింగికొనుట మేలు.

చ. జనకుఁడుఁబోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్టభాగముం
గొనునది వారిచేత [1]నరిఁ; గోటివిధంబుల నాప్తదక్షులం
గని, [2]వనగోకులాకరనగ ప్రముఖార్థకరంబు లారయం
బనుచుచు, నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడి యున్నఁ బెంపగున్.

సీ. కోట యేపుఱ కెడ్డు బాటించి, గడ్డియు
[3]ఖాణంబుఁ [4]గొల్చును [5]గట్టియలును
[6]నేయు నూనియయును నాయుధమ్ములు నౌష
ధములు నాభీలయంత్రములుఁ గూప

---

1. = కప్పము. 2. = వనములను, గోకులము (ఆవులమంద) లను, నగము (కొండ) లను, మొదలగు ధనకరములను. 3. = గడ్డి మొదలగువానికి వలయు ఉలవలు లోనగు భక్ష్యము (ఖానా) 4. = ధాన్యము. 5. = కట్టెలు. 6. = నేయియు.

ములు లోనుగా నందు వలయు వాని సమగ్ర
ములుగ సంపాదించి, భూరిధైర్య
శౌర్యాదిగుణముల నడి సన్నయామాత్యయో
ధులఁ బెల్లమర్చుట యులఘునీతి ;
ఆ. పగతుఁ డలిగి నడచు పథమునఁ దృణకాష్ఠ
ములును ధాన్య తోయములును లేక
యుండఁజేసి, మిత్త్రిమండలేశుల నెత్తి
యరుగు దేరఁ బనుచునది విభుండు. ౨౮౪

వ. మఱియు రాజునకు రక్షింపవలయునది ☞ [1]స్వామ్యమాత్య జనపద కోశ సైన్య మిత్త్రి దుర్గంబు లను రాజ్యాంగసప్తకంబు; కన్నిడి యరయవలయునది ☞ [2]సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబు లను షాడ్గుణ్యంబు; నడపవలయునది ☞ ధర్మార్థకామంబు లనువర్గత్రితయంబు ; పాటింపవలయునది

---

1.—(స్వామి అమాత్య కోశ సైన్య మిత్త్రి దుర్గంబులు=) స్వామి=ఒడయఁడు (రాజు). అమాత్య=మంత్రి, కోశము=ధనాగారము (బొక్కసము), జనపదము=దేశము (గ్రామము), సైన్యము=దండు, మిత్రులు, దర్గము=కోట-ఇవి రాజ్యమునందలి ౭ అంగములు.

2.—(సంధివిగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయంబులు=) సంధి=శత్రువుతోడిపొందు—(ఇదిమూఁడు విధములు: కోశప్రధానహేతుకము, దండప్రధాన హేతుకము, భూమిప్రధాన హేతుకము). విగ్రహము=కలహము, యానము=దాడి వెడలుట, ఆసనము= బలాద్యపేక్షచే దండెత్తక ఆఁగుట-[ఇది ఐదువిధములు: ౧ సంధాయాసనము-(సంధాయయానము)=పరునిఁ దనకు వశపఱుచుకొని దుర్గాములను గ్రహింపవలయునని వెడలిపోవుట; ౨ ప్రసంగాసనము. (ప్రసంగయానము) = ఒక దిక్కునకు కదలిపోయి పొసఁగుదుపడినచో మఱియొకదిక్కునకును బోవుట; విగృహ్యాసనము—(విగృహ్యయానము) = పగతుని సంహరింపవలయుననియే వెడలిపోవుట; ౪. సంభూయాసనము - (సంభూయయానము) = శత్రువును గెలువ శక్యము కానిచో పరిరాజులను గూర్చికొని కదలిపోవుట; ౫. ఉపేక్ష్యాసనము - (ఉపేక్ష్యయానము)= తానే శత్రువులను జయింతు ననునిశ్చయము దేశకాలాదులను గణింపక కదలిపోవుట.] యానమునకును ఆసనమునకును పై యర్థములు సామాన్యములుగ గ్రహించునది

ద్వైధీభావము=(ఇది మూఁడువిధములు : బలవంతులగు నిద్దఱు శత్రువుల నడుమ నుండెడువాఁడు వారిరువురతో ప్రత్యేకము నీవాఁడ నని నమ్మఁ బలుకుట, అందొకనితో సంధిచేసికొనుట, మఱియొకనితోఁ బోరుట.)

☞ మంత్రప్రభుత్వోత్సాహంబు లనుశక్తిత్రయంబు; నిజవశవర్తిం జేయవలయునది ☞ సత్త్వ రజస్తమంబులను గుణత్రికంబు. విశేషించి ధర్మసేవ సంతతంబు నాచరింపవలయునది. ప్రమాదంబున నర్థకామంబులు హీనంబులైనను ధర్మనిష్ఠం జేసి ధరణీపరిపాలనంబు సుస్థిరం బై చెల్లు. ఆంగిరస భార్గవాదు లగు పెద్ద లిట్లని చెప్పిరి. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు లన బుద్ధీంద్రియంబులును, వాక్పాణి పాద పాయూపస్థంబు లనుకర్మేంద్రియంబులును, మనంబునుం గూడ నేకాదశసంఖ్యం బైన యింద్రియజాతంబు జయించి, కామజంబు లగునక్ష మృగయా స్త్రీ పానార్థదూషణంబులును, క్రోధజంబు లగు వాక్పారుష్య దండపారుష్యంబులునునైన సప్తవ్యసనంబులం దగులక యజ్ఞాధ్యయన దానతత్పరుం డగుచు దుర్మంత్రిలకుటిలవాక్యంబులకు లోను గాక, నయవిక్రమకర్మజ్ఞులైనయమాత్యులతో దైవమానుషచింతనంబు సేయుచు దేవబ్రాహ్మణప్రణామతర్పణరక్షణంబులం జేసి, యశుభనిరాసనంబును శుభాధానంబును నొనర్చుచుం, బ్రజలం బాలించుభూపతి యుభయలోకసిద్ధులం బొందు. ౨౮౫

తే. అనిన విని, ప్రీతి ధర్మనందనుఁడు 'రాజు
దండనీతియు ననఁగ నుదాత్తయుక్త
వస్తువులు రెండు - నార్యప్రశస్తకార్య
సిద్ధి గావించుతరములు సెప్పు మనఘ.' ౨౮౬

వ. అని యడిగిన నప్పుడమితేనికి సరిత్సూనుం డిట్లనియె. ౨౮౭

క. భూరమణుఁడు గాలమునకుఁ
గారణ మెట్లన్న, ధర్మగతి పూర్ణత నొ
ప్పారంగ దండనీతిస
మారంభము నడపుఁ గృతయుగాగతి నధిపా. ౨౮౮

వ. అంతు- ౨౮౯

క. ధర్మంబు పెరుఁగు, వైదిక
కర్మఫలము లెసఁగు, ఋతునికాయము ప్రజకుక్

శర్మం బొసర్చు, నాయువు
పేర్మిఁ బొరయు, [1]దనక [2]పెద్ద పృథివి ఫలించున్. ౨౯౦

తే. రాజు మూఁడుభాగములధర్మంబు నడపుఁ
ద్రేత; నమ్మెయి నది ప్రజా ప్రీతిసలుపు.
ద్వాపరంబున నర్ధంబ యోపి చెల్లఁ
జేయు ; నక్కాల మహిమ్మాత్రఁ జెందు మేలు. ౨౯౧

క. నరపతి ధర్మోపేక్షా
పరుఁ డగుఁ గలియుగమునందుఁ; బాయును ధర్మ
స్ఫురణ; మధర్మం బెందును
బరఁగును; వర్ణాశ్రమముల పథములు దప్పున్. ౨౯౨

వ. కాలపరిభావం బిట్టిద; యైనను, ౨౯౩

ఆ. విభునిసకలధర్మవృత్తినత్తఱి కృత
యుగముఁ బోలు; ధర్మయుక్తిమాత్ర
లర్ధము, విభుల కెట్టు లయ్యె, [3]నయ్యైతఱులు
లవులయుగములట్ల యగు నృపాల. ౨౯౪

వ. అనుటయు, 'నెట్టివాఁ డైన విభుని శుభంబులు వొందు' ననుటయు
ధర్మనందనునకు మందాకినీనందనుం డి ట్లనియె : ౨౯౫

మ. అరయుం దప్పు, కృతం బెఱుంగు, మదలోభావేశముల్ తే, వను
ష్కరుఁ, డాత్మస్తుతి లేదు, సేయు నియతిం గార్యంబు, లీగుల్ ఘన
స్థిరముల్, శూరుఁడు, గర్వి గాఁ, డశఠుఁ, డస్త్రీలోలుఁ, డక్రోధనుం
[4]డరి నొవ్వం గొనఁ డన్యాగ ద్దఁ గనుఁ డా జత్యంతదీప్తుం డగున్.

వ. అని చెప్పి వెండియు— ౨౯౬

ఆ. సాంగ వేద వేదియగుపురోహితుఁ డెప్డు
నగర మెలఁగవలయుఁ; దగవుఁ గృపయుఁ
జక్కటియును గలుగు సచివు నప్పనములు
చరులు నరయఁ బనుచునది విభుండు. ౨౯౭

---

1.=దన్నక (యే), 2 =వృద్ధి గా (అధికము గా) 3 తఱులు (తఱికి బహువచనము) = సమయములు, 4. = కప్పము; పన్ను; శిస్తు.

క. పరుసఁదనముమెయి [1]నరి గొనఁ
జొరఁ దగ; దది పొదుఁగు గోయుచొ ప్పగు; విను, పా
ల్గురియించుకొనఁ దలంచిన
నరయ వల దె గోవుఁ? బ్రజయు నట్టిద యధిపా. ౨౯౯

ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు
గోయునట్లు రాజు గొనఁగ వలయు
నప్పనములు; నఱకి యంగారములు సేయు
భంగి నైన భూమి పాడు గాదె? ౩౦౦

క. దయఁ బ్రజ రక్షించుటకు నె
నయె తపములు నధ్వరములు? నరవర, దానన్
జయమును లక్ష్మియునుం గీ
ర్తియు సుగతియుఁ గలుగు వసుమతీనాథునకున్. ౩౦౧

—♦ వాయుదేవుఁడు పురూరవునకుఁ జెప్పినరాజధర్మప్రకారము. ♦—

వ. విశేషించి పురోహితుల బాటింప వలయు. వినుము, తొల్లి నైలుం డగుపురూరవుండు, 'వసుధ విప్రక్షత్రియులం దెవ్వానిధనం బై యుండు?'-నని వాయుదేవు నడిగిన, నమ్మహాత్ముండు, చతుర్ముఖుని ముఖ బాహూరు పాదంబులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకుఁ బ్రభవస్థానంబులగుట సెప్పి, యి ట్లుత్కృష్టప్రభవుండై సర్వవర్ణంబులకు నీశ్వరుం డగుబ్రాహ్మణుం డీపృథ్వీధనధాన్యాది సమస్తవస్తువులునుం దా ననుభవింపను, నొడ్లకు నొసంగను నుక్తుం డగుట, దండనీతిధారణంబునకు క్షత్రియుం జొనిపె. బ్రాహ్మణశాంతిపరత్వంబున క్షత్రియాధిపత్యప్రాప్తి, పతిలేమి నంగన [2]దేవరునిం బ్రతిగ్రహించిన ట్లున్నది; ఇది భూమి తెఱంగు. ఇట్లగుట జేసి నిజధర్మశక్తిపూర్ణుండును విద్వాంసుండును శాంతుండునునగు పురోహితునకు సర్వసంపదలును సమర్పించి, జనపతి శుశ్రూషాపరుండును నహంకారరహితుండును నై దండనీతి నయించి యుభయలోకంబులనుం బెంపు వహించు. ౩౦౨

1. =కప్పము; పన్ను; శిస్తు. 2.= మగనితోఁ బుట్టిన వానిని.

క. రసగంధాద్యనుభవములు
పొసఁగవు భీత మగుచిత్తమున; భయము౦ బా
ప సమర్థుఁడు గావున నృపుఁ
డసమానప్రభుతఁ బొందె నవనీనాథా. 303

క. అని వాయుదేవుఁ డి ట్ల
జ్జనపతి బోధించె ననుడు, శాంతనవున క
మ్మనుజపతి యిట్టు లను: 'నే
పనులఁ బురోహితుఁడు మాన్యభావము నొందున్?'

వ. అనిన, నాధర్మతనయుతో నద్దేవవ్రతుండు, 'పురోహిత విషయంబులుగా శుక్రుండు సెప్పినవాక్యంబులు గల వుపన్యసించెద నాకర్ణింపు' మని యి ట్లనియె: 304

తే. అమర గరుడ గంధర్వ విద్యాధరాది
దివ్యులకు నధ్వరంబులఁ దృప్తి సేసి
పరమశుభములఁ బొందు భూవరుఁడు; దాని
కెల్లమూలంబు దగుపురోహితునిబుద్ధి. 305

క. రక్షః పిశాచ [1]గుహ్యక
యక్షాదులు బాధ పెట్టు నవనీనాథుఁ
దక్షపురోహితమంత్రసు
రక్షాసంస్కారవిధివిరహితుం డైనన్. 306

క. వివిధోత్పాతంబులకుఁ
నవశులలోఁ దోఁచుకీడునకుఁ దోడ్తో శాం
తివిధానంబున నిరసన
మవును బురోహితునిచేత ననవద్యముగన్. 307

వ. ఈవాక్యంబులం దాత్పర్యంబు గలుగుము. బృహస్పతియును, 'శాంతికంబును బౌష్టికంబును శత్రునాశంబును మంత్రాధ్య పురోహితసాధ్యంబులు'- అనియెం గావున నీవును సంభావిత పురోహితుండ వగుము. 308

1. = సిద్ధులు.

క. పరిశుద్ధి లేనికుత్సిత
పురోహితులు నీచదశలఁ బొందుదురు, మహీ
వర, యల్పమె శుద్ధుం డై
పురోహి తత్వంబు సేఁత భూపతినగరన్. ౩౧౦

క. ఆరోగ్యము గలయుత్తముఁ
బౌరోహిత్యంబు నడపఁ బనుచునది ధరి
త్రీరమణుఁ - [1]డతఁడు [2]దాను స
మారంభము లెల్ల నేకమతిఁ గను ట్రొప్పన్. ౩౧౧

క. బ్రహ్మక్షత్త్రియము లొంది [3]యు
జిహ్మము లై కృత్యములు విశిష్టత నడపక
బ్రహ్మాదులు హర్షింతురు,
బ్రాహ్మణముఖవర్ణసమితి ప్రముదముఁ బొందున్. ౩౧౨

వ. ఈయర్థంబునందు ఐలకశ్యపసంవాదం బనునితిహాసంబు గలదు· వినుము, ఐలుండు గశ్యపుని బ్రహ్మక్షత్త్రప్రకారం బడిగిన నమ్మనుజ పతికి నమ్మునీంద్రుం డి ట్లనియె: ౩౧౩

ఆ. క్షత్త్రమునకుఁ బుట్టగాఁ బట్టు బ్రహ్మంబు;
బ్రాహ్మణునకు యోని రాజు; గాన
నుభయవర్ధనంబు నొండొంటి విడువమి
వెలుఁగు; రెండు మాయు విడిచె నేని. ౩౧౪

క. తమలోనఁ బొందుగల క్షి
ప్రమహీశులఁ బ్రజయుఁ బొదువుఁ; బ్రజచే మాన్య
త్వము వడయఁగ· నేరరు భే
దము గలిగిన; నలఁతు రొలసి దస్యులు ప్రజలన్. ౩౧౫

తే. అట్టిదశఁ బుట్టు రుద్రునియులుక, దాన
సకలమునకు వినాశంబు సంభవిల్లుఁ

1. = పురోహితుఁడును, 2. = ధాత్రీరమణుఁడు (రాజు) ను. 3. = అదక్షితము లుగా - కుటిలత తేకుండఁగా చేయవలసిన పనులు.

గాన నెల్లవిధంబులఁగలసి యుండ
వలయు నృపుఁడు [1]బురోధయు వసుమతీశ. ౩౧౭

క. వినుము, విశేషించి జనన
జనితోన్నతి విప్రుఁ, డతని జనపతి, వినయం
బున నడపవలయు; దానను
మనుగడ యిరువురకుఁ, బ్రజకు మహనీయ మగున్. ౩౧౮

—♦ కుబేరునకుఁ ముచుకుందునకు గలిగి సంవాదము ♦—

వ. అని చెప్పి పురోహితునివిశేషంబు ముచుకుందుం డనురాజునకు వైశ్రవణునకుం గ్గలిగినసంవాదంబునం బ్రకటం బయ్యె; నత్తెఱం గెఱింగించెద: ౩౧౯

మ. విను మారాజు సమస్తదిగ్విజయముల్ విస్ఫూర్తిమైఁ జేసి తాఁ దనలావారయుబుద్ధి వైశ్రవణుమీఁదం బోవ, నాతండు దైత్యనికాయంబులఁ బంచినం, దెరువునం దత్సైన్యముల్ రాజుమూఁక నతిక్షుభ్యము గాఁగఁ జేయుటయు, స్రుక్కం బడ్డచిత్తంబుతోన్—

క. నృపతి పురోహితు దూఱినఁ,
దపముల మంత్రముల దేవతాపూజల, వీ
ర్యపటుత్వ మతనిసేనకు
నపరిమితము సేసె నమ్మహాత్ముం డధిపా. ౩౨౦

ఆ. బ్రహ్మశక్తిఁ బేర్చి రాజు సైన్యము దైత్య
సేన బడలువడఁగఁ జేయ, నాతఁ
డతిరయమున ముట్టె [2]నలకఁ; గుబేరుండు
ననికి వెడలె నిజబలాన్వితముగ. ౩౨౧

వ. వెడలి సమరంబు సేయుసమయంబునం గిన్నరేశ్వరుం డన్నరేశ్వరు నాలోకించి— ౩౨౨

శా. 'దక్షుం డై తెటు బ్రహ్మశక్తిన భవద్బాహావిలాసం [3]బమి
త్త్రక్షోభం బొనరించెనే!' యనుడు, నాతం, 'డిట్లు నీవంటి బ్ర

1. =పురోహితుండును. 2. =అలకాపురమును. 3. =పగవారిని గలఁతిపెట్టెనా!

హ్మక్షత్త్రింబుల కేకయోనిజననం బవ్వేధ గల్పించె; యో
గక్షేమాకలనంబు సంగతము లై కావింపఁ బంపండొకో!' ౩_౧౩

వ. అనుటయు ధనదుండు సాంత్వనస్వరంబున- ౩_౧౪

ఉ. 'నాకును నీకు నేటికి రణం బొనరింపఁగ; నేను బంప నీ
వేకముఖంబుగా ధరణి యేలుము' నావుడు, నవ్వి యవ్విభుం,
'డీ కుపతిత్వ మొల్ల; నొరు నీగి మహా త్త్వకరంబె! విద్విష
ద్భీకరమద్భుజార్జితము పెం పొనరంగ భుజింతు దిక్పతీ.' ౩_౧౫

వ. అనిన విని పౌలస్త్యుండు, 'నీ వధికుండవు; అట్లు సేయు' మని గారవించిన, ముచుకుందుండు ముదితుం డై చని సకలోర్వియును నిర్వక్రవిక్రమంబున నేలె నని చెప్పిన విని, యజాతశత్రుండు, 'రాజధర్మంబులయం దైశ్వర్యప్రీతి పుణ్యలోకంబులు నిరతిశయంబుగాఁ జేయం జాలునది యెయ్యది' యని యడిగిన- ౩_౧౬

ఆ. అతని కిట్టు లనియె నమరతరంగిణీ
'సూనుఁ డధికభీతు లై ససజ్జ
నులకు నభయ మొసఁగి యలఘుసౌఖ్యాత్ములఁ
జేత యెంతయును విశిష్ట మధిప' ౩_౧౭

వ. అని వెండియు, ౩_౧౮

క. 'విను, పర్జన్యుఁడు భూతము
లను, బండినమ్రాను పక్షులను, బ్రోచువిధం
బున నీవు బంధువుల స
జ్జనయుతముగఁ బ్రోవు మది ప్రశ స్తం బనఘా.' ౩_౧౯

వ. అనిన విని ధర్మనందనుండు, 'విప్రప్రభృతులకు నిజధర్మవర్తనంబుల జీవనంబులు నడవక తక్కిన నెట్లు?' అని యడిగినఁ బితామహుం డతనితో, 'నాపద దనికిన నితర జాతివృత్తంబు గర్హితంబు గాదు ; అట్లయినను నాయుధోపజీవనాదిక్షత్త్రధర్మంబులం జేసి బ్రాహ్మణ్యంబు [1]వట్రుపడి బ్రాహ్మణులు క్షత్త్రియు లగుదురు. వాణిజ్య ప్రముఖవైశ్యక్రియ లాచరించి వైశ్యసము లగుదురు.

1. కొఱఁతపడి.

నిత్యానుష్ఠానంబులు లోను గాఁ గలయవి డిగవిడిచి ధనలోభ తాత్పర్యంబున శూద్రప్రాయులై చరించి శూద్రసము లగుదురు. తక్కిన జాతులవా రందఱుఁ దమతమతారతమ్యంబులతో నిట్ల నిజజాతివిహీను లగుదురు. అట్టివారు జాత్యుక్తమకృత్యంబులకుఁ బాత్రంబులుగారు.భూకాంతుం డింతయు నెఱింగి యర్థ్మప్రకారంబులం బ్రజ నడపి రక్షించినం బ్రజాకృతం బగుధర్మంబునందుఁ జతుర్థాంశంబునకు నుక్తుం డగు. ప్రజలఁ బాతకంబులం బొరయ కుండ నరయం జాలక దండ్యదండనరహితుం డైనమహీవిభుని వారలచేసినపాతకంబుల నాలవపాలు వొందు. కొందఱు బుధు లంతయుం బొందు నని చెప్పుదురు' అనుటయు, నమ్మనుజనాథుండు—

ఆ. 'వినుము, వివిధసుఖము లనుభవింపఁగ, రాజ్య
విభవయుక్తిఁ దిరుగ వేడ్క లేదు
నాకు; ధర్మరక్షణమునిమిఁదిభరముఁ, ద
ల్లోపభయము మనములోనఁ బెద్ద. 33౧

వ. 'కావున, 33౨

చ. 'అనఘ, యనేకదోష మగునట్టిమహీవహనంబు నొల్ల; దం
డనపరుషత్వ మేటికి? దృఢప్రశమంబున నేను గానకుం
జనియెద' నన్న, భీష్ముఁ "డిది [1]జాడ్యము గాక నృపాలధర్మ మే?
మనుజవ రేణ్య, నీమనము మార్దవ మగ్గల; మిట్టు లొప్పనే! 333

వ. "ని న్నొత్తి చెప్పుటకుఁ బాండు విచిత్రవీర్య శంతను లున్నవారే?
నాబుద్ధి వినుము, 33౪

ఆ. "ఈఁగకాలియంతయేనియు వీసర
పోవకుండ ధర్మమునన నడచి
రయ్య దొంటిరాజు? [2]లక్రోధకామపరి
యుక్తదండధరణ మొప్పఁ గాక. 33౫

క. "దా నాధ్యయున యజనముల
తో నుర్వీజనులఁ గావఁ దొడఁగుట పతికిం

1. =జడత్వము=జడ్డుతనము. 2 =క్రోధము, కామము లేని దండధరణ మొప్పఁ గాక.

[1]దా నజకల్పితధర్మము;
దీనివిడుపు నరకమునకుఁ దెరు వగు నధిపా. ౩౩౭

క. "కావున, వర్ణాశ్రమముల
నేవిధమున నైన నడపు లేడలక యుండం
గావంగ నోపునృపతికి
[2]లే వలజ ల్లుభయలోకలీలలయందున్. ౩౩౮

వ. "ఇట్లగుటం దెలుపునది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము:

—♦ కేకయరాజరాక్షససంవాదప్రకారము ♦—

క. "పరమనియతిమైఁ గేకయ
నరపతి యధ్యయనవిధి యొనర్పఁగ నటవీ
పరిసరమున కేఁగినయెడ,
ధరణీశ్వర, పట్టె నొక్క దానవుఁ డతనిన్. ౩౩౯

వ. "పట్టినఁ బ్రబలుం డగు నద్దనుజునిం ద్రోచిపోవం జాలక యమ్మహీపాలుండు వానికి ట్లనియె: ౩౪౦

సీ. 'మ్రుచ్చిమియును బంకు నెచ్చోట నైన నా
భూమిలోపల లేదు; భూమిసురులు
వేదాధ్యయనయజ్ఞవిధిదానతత్పరుల్;
రాజులు బ్రాహ్మణారాధనంబు,
జన్నముల్ సేఁతయు, సమరానివర్తన
వ్రతమును గలరు; గోరక్షణాది
వార్తావినీతులై వైశ్యులు నడపుదు;
రమ్మూఁడుజాతుల కధికభక్తి
తే. తోడ శుశ్రూష సేసి శూద్రులు చరింతు;
రేమిరంధ్రంబు గాంచి నీవిట్లు వెరవు

1. = అది బ్రహ్మచేతకల్పింపఁబడిన ధర్మము; దీనిని (ఈ బ్రహ్మకల్పిత ధర్మమును) విడుచుట నరకమునకు మార్గము సుమీ! 2. = లేవు అలజడులు ఉభయలోక లీలలయందున్ = (ఐహికాముష్మికములగు) రెండులోకములందలి క్రీడలలో ఆపదలులేవు.

మాలి పట్టి తద్యుద్ధతలీల నన్నుఁ?
దలఁప నిది నీకుఁ బథ్యమే దానవేంద్ర?' ౩౪౧

చ. "అనుటయు, నమ్మహాదనుజుఁ డాతని కిట్లను: 'నట్టివానిఁ గా
నిచుఁ గని, వర్ణరక్షణము నిర్మలచిత్తతఁ జేయురాజు కీ
డునఁ బడ కున్కి దెల్పఁగఁ గడుం బ్రియుఁడై చను దెంచితిన్; మహీ
జనపరిరక్ష యస్ఖలితసామ్యత నిట్ల యొనర్చు భూవరా.' ౩౪౨

వ. "అని పలికి సఖ్యంబు చేసి చనియె" అని చెప్పినం గాంగేయాగ్రజుండు సంతోషించి, 'జీవనాభావం బైనచో క్షత్రియకర్మానుష్ఠానంబునకు నశక్తుం డగువిప్రుం డెట్లు బ్రదుకువాఁ' డని యడిగిన భీష్ముం డిట్లనియె: ౩౪౩

చ. 'మనఁజను, నుప్పునువ్వులును మాంసము గోవృషంబుఁ గూడుఁ గ
ల్లును ఘృత తైల [1]మాక్షికములున్ ధృతకేసర మైనజంతువుల్,
ధన మధికంబుగాఁ బడయు దానికి నేనియు విక్రయింపఁ గా
దనుమతి యూఁది వైశ్యకృతి నైనను విప్రున కాపదాగతిన్.' ౩౪౪

వ. అనిన విని, ధర్మతనయుండు 'యజ్ఞంబు లెట్లయిన సమీచీనంబు లగు?' నని యడిగిన అనిమిషనదీనందనుం డతని కిట్లనియె: ౩౪౫

ఆ. 'శ్రద్ధ వలయు, మిథ్య చనదు, వేదంబుల
బరిభవింపఁ దగదు భవ్యయజ్ఞ
కర్త కెపుడు; నదియుఁ గాక [2]దక్షిణలు మం
త్రార్థపోషకంబు లందు రధిప. ౩౪౬

క. 'ఈగతి నొటింగి చేసిన
యాగము సోమాప్తుఁ జేయు నప్పురుషునిఁ; ద
ద్యోగ మొనర్చు మహాసుఖ
యోగము సోమాధిరాజ్యయుక్తము శ్రుతులన్. ౩౪౭

ఆ. 'అధ్వరంబుకంటె నధికంబు దపము; ద
పం బనంగ [3]మేని ప్రన్నఁదనము

1. =తేనె. 2 =యజ్ఞాదికర్మములందు ఋత్విజుల కిచ్చుధనములు మంత్రార్థములను పోషించున వగును 3. =శరీరలావణ్యము.

నివురఁజేత గా- దహింసయు సత్యవా
క్యంబు దమము దయయుఁ గాని యరయ.' ౩౮౮

వ. అనిన— ౩౮౯

చ. ప్రియమున ధర్మనందనుఁడు భీష్మునితో "నృపుఁ డెట్టిభంగివా
నియెడఁ గరంబు నమ్మఁ దగు? నిక్కపుమిత్త్రుఁడు లేనిభర్తకున్
నయ్యగతి సెల్ల నేర' దనినన్ విని యిట్లను నాతఁ: 'డేకబు
ద్ధియుతుఁడ వై వినన్ వలయుఁ దెల్లముగా నెఱిఁగింతు భూవరా.

క. 'నమ్మమి మృత్యువు, పెద్దయు
నమ్ముట యుపమృత్యు-వగుట, నరపతి మిత్రున్
నమ్మి పనులు గొనునది; ని
త్యమ్మును సూక్ష్మమతిఁ దాను నరయఁగవలయున్. ౩౯౦

తే. 'తనకు మే లొనరించు నాతండు మిత్త్రుఁ;
డతఁడు నడవంగ నెల్ల కార్యములు శుభము
నొందు; నేమిట నేమఱ కునికితోడ
నృపుఁడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుపవలయు ౩౯౧

ఉ. 'మన్ననకున్ మదింప, కవమానము వచ్చిన సుక్క కొక్కభం
గి న్నెఱిఁ గార్యముల్ విగతకిల్బిషుఁడై తగఁ జేయునట్టిమి
త్త్రి న్నరనాయకుండు దన రూపు గ నగ్గల మైనశ్రీయు న
త్యున్నతియున్ ఘటించి మహిమోజ్జ్వలుఁ జేతసుఖావహంబగున్.

క. 'విను మట్టిమంత్రి గామం
బునఁ గ్రోధంబునను లోభమున భయమునఁ గా
ర్యనిరూపణంబు వదలక
వినీతుఁ డై నడచు టధికవిభవముఁ జేయున్.' ౩౯౨

వ. అని చెప్పి వెండియు, ౩౯౩

క. అన్నలుఁ దమ్ములుఁ గలుగుట
యున్నతిఁ జేయు నృపు; నెంత [1]యొుఱపిల్లయినన్
మన్ననయు [2]నీగియును సం
పన్నంబులు గాఁగ వారిఁ బాటించు [3]టురున్. ౩౫౬
వ. అది యెట్లం టేని, ౩౫౭
క. బలఁగము గలభూపాలుఁడు
[4]గెలనిమహీశ్వరులబుద్ధికిని [5]వ్రేఁగగుచున్
బలియుఁ డగు; లేనివానిం
జులుకంగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. ౩౫౮
క. ఎక్కువతక్కువమాటలు,
నుక్కివములు, బంది, గీడు లొందించుటలుం,
బెక్కు దనయన్నదమ్ముల
దిక్కున- నన్నియును సైఁపఁ దేజము సేయున్. ౩౫౯
క. లోపల రాఁజుచుఁ బొగయుచుఁ
బాపంబులు దలఁతు; రోపిబలిమియు వెఱపుం
జూపక తక్కరు కెలనికి
నేపాటను; వారి నడపు లెంతయు నొప్పన్. ౩౬౦
తే. చాలుదురు వారు నృపతికి మేలు సేయఁ,
గీడొనర్పంగఁ; గావునఁ గిల్బిషములఁ
బొరయకుండంగ వారల నరసికొనుచుఁ
బొదివి నడపుట కార్యంబు భూవిభునకు. ౩౬౧
వ. అనుటయు, ధర్మజుండు, 'ధనార్జనం బేమిటం బ్రస్ఫుటం బై నడచు'
నని యడిగిన నతనికి భీష్ముం డి ట్లనియె: ౩౬౨

—♦ కాలకవృక్షీయక్షేమదర్శిసంవాద ప్రకారము. ♦—

క. [6]ఆయతికాఁడు వలయు నర
నాయకునకు; వాని కెల్లనరులుం జేటుం

1. = ఆరోగ్యులయినను. 2. = ఈగియు=దానమును. 3. = ఒప్పును 4. = కార్యవ్యాపారములందలి. 5. = భారమగుచు. 6 = ధనము నార్జించువాఁడు; ప్రభావముగల వాఁడు,

జేయఁ దలంతురు; దా [1]నవ
ధానయుతుఁ డై కావ వలయు ధరణీపుఁ డతనిన్. ౩౬౩

వ. ఈయర్థంబున నితిహాసంబు గల దాకర్ణింపుము: కాలకవృక్షీయ నామధేయుం డగునొక్కముని, క్షేమదర్శి యనియెడు కోసల భూవిభునిభూమికిం బంజరసంబుఁ జేసికొని యొక్కకాకంబుఁ దెచ్చి, 'యిప్పక్షి [2]త్రైకాల్యవేది' యని యెల్లజనంబులకుం జెప్పుచుం దిరిగి, క్రమంబున రాజుం గని యతని కక్కాకంబుఁ జూపి, 'నీయం దర్థార్జనాదినృపకార్యంబులవలన నేమఱుట గలదు. దానం బుట్టిన [3]నేగియెల్ల నిప్పులుఁగు సెప్పి [4]నీకుం దప్పినద్రుచ్చులం బట్టింపఁ జాలు' ననుపలుకు వలికి, యమ్మహీవరునాదరంబు వడసి వీడుఁబట్టున కరిగిన, ౩౬౪

క. ఆరాత్రి యవ్విభునియధి
కారులు సంపి రొకభంగిఁ గాకము; మఱునాఁ
డారాజున కవ్విప్రుఁడు
గోరి రహస్యంబుఁ జేసికొని యెఱిఁగించెన్. ౩౬౫

వ. అట్లు [5]నియోగులకపటోపాయంబునం గాకి మృతంబగుట సాభిజ్ఞానంబుగా నెఱింగించి, తనపేరు సెప్పి, 'యేను మీతండ్రిసఖుండ; అతనిపిమ్మట నిచ్చట నిలువ నొల్లక వనంబున కరిగి తపంబు సేయుచుండి, నీమీఁదియధికస్నేహంబునంజేసి, నీ దగు యోగ క్షేమంబు లరయ వేఁడి వచ్చి, యీరాష్ట్రంబునం బురంబునను వర్తించుచు భవదీయరాజ్యలక్ష్మి మధురభంగి యయ్యును సధము లగు నా నియుక్తుల వలనం, జోరజనసంవృతం బైన కావేరియుం బోలె నుపయోగ్య గా కునికి యెఱింగి, నీ కెఱింగించుట కై మిథ్యాభివర్ణితం బైనకాకంబు నెపం బిడి చొచ్చితి. దుర్మతు లైన ద్రోహులు దానిం జంపుటకతంబున లోనం గీడు గలుగుట నీకుం

1. = అవధానముకలవాఁడు = మెలఁకువకలవాఁడు. 2. = మూఁడు (భూత భవిష్యద్వర్తమాన) కాలముల నెఱింగినది. 3. = నష్టి; ఆపద; కీడు. 4. = నీకు ప్రతికూలురైన దొంగలనుపట్టి యీయఁగలదు. 5. = నియోగించిన (=పనుపుపెట్టిన; ఆజ్ఞాపించిన) వారి.

గొంత గాన నయ్యె. కను గలిగి యరసిన నింకనుం దేటపడియెడు. నా యాప్తియును గార్యవివేకంబుకలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపుము. ఇప్పుడు నన్నాదరింపక విడిచినవాఁడవగుము. వంచకులైన యధికారపురుషులకు నేర్పుమైఁ గ్రమంబునఁ బరస్పరవిరోధంబుఁ గలిగించి, సంప్రీతి సెఱిచి, నీవలసినట్లొకనొకని దండింపు' మని వారలం బేరు గ్రుచ్చి యుపదేశించిన-

క. ఆరాజు నట్ల చేసి, మ
హారాజ్యస్థితికి నెల్ల నవ్విప్రు మహా
దారగుణు మంత్రిఁ గాఁ గొని
సారధనప్రీతిసుఖయశంబులు వడసెన్. ౩౬౭

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు, 'మంత్రి యెట్టివాఁడు గావలయు
నెఱింగింపు' మనుటయు గాంగేయుం డతని కిట్లనియె: ౩౬౮

సీ. జ్ఞానపరుఁడుఁ, బౌరజానపదాప్తుండుఁ,
గార్యజ్ఞుఁడును, ధైర్యశౌర్యఘనుఁడు,
నక్రూరుఁడును, విశుద్ధాత్ముండుఁ,
బతియెడ భక్త్యనురాగసంభ్రమము లెసఁగ
సమసుఖదుఃఖుఁ డై చెమరు నెత్తురుగాఁగఁ
దలఁచుచు, నరయక తప్పుమీఁదఁ
బెట్టిన, నలుకమైఁ దిట్టినఁ గలఁక దా
నొందక, తేర్చుచోఁ బొందు సెడక

తే. మెలఁగువాఁడును, నిజరంధ్రములకు మాటు
సేయఁ, బరరంధ్రములు గని చిక్కువఱుపఁ
జాలునిపుణుండు నైనవిశాలబుద్ధి
గావలయు మంత్రిముఖ్యుండు కౌరవేంద్ర. ౩౬౯

వ. అని చెప్పి, ౩౭౦

క. మృదుమధురవాక్యముల నిం
పొదవెడు చిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స

మ్మోదము సచివులకుఁ బ్రజలకు
నోదవింపఁగ వలయు; నది మహోన్నతిఁ జేయున్.

తే. ఈఁగియును బ్రియవచనసంయోగమునన
కాని జనులకు సంతోషకారి గాదు;
పుచ్చికొనునప్డు పల్కులపొందుకలిమి
యెదిరిమదిఁ గందనీ దింత యెఱుఁగు మధిప.

వ. అనుటయు, ధర్మతనయుండు 'జనంబులవివాదం బుడుపునః
పుడమిఱేఁడు దూఱునుం బాపంబును బొరయకుండు
దెలుపవే' యనిన దేవవ్రతుం డిట్లనియె:

సీ. వ్యవహారశుద్ధి సర్వప్రజాప్రియకారి;
యదియ భూపతికి ధర్మాతిశయముఁ
గీర్తియుఁ జేయు. నక్షీణసత్యులు ధర్మ
పరులును నైనభూసురులు, నీవుఁ,
[1]త్రాసులుంబోనిచిత్తంబులతోడుతఁ
బ్రజవివాదము, లెడఁ బక్షముడిగి
విని, ధనవాంఛమై ధనికులదెస వ్రాలి
తీర్పక, ధర్మంబు తెరువు దప్ప

ఆ. కుండఁ, బాడిఁ దీర్చి, దండింపఁ దగునెడ
ననుగుణంపుదండ మాచరింపు;
[2]మొఱఁగఁ బలికితేని నుండదు ప్రజ డేగఁ
గనినపులుఁగుపిండు గరణిఁ జెదరు.

వ. దండించుట దానును—

క. నఱకుట, యర్థముఁ గొనుటయుఁ,
జెఱ నునుచుట, కట్టి యడిచి చేడ్పాటొందం

1 = త్రాసువంటి మనస్సుతో ప్రజల వివాదములు, (ఎడఁ=)హృదయమున పక్షపాతములేక విని తన ఇష్టము వచ్చినట్లు ధనికుల పక్షమున మొగ్గి పరిష్కరింపక ధర్మము నిర్ణయించి.. 2. మొఱఁగ బలికితేని...=పక్షపాతము వహించి పలికినచో డేగను జూచిన పక్షుల గుంపు వలె ప్రజ చెదరును.

బఱచుట, మొదలుగఁ గలపలు
దెఱఁగులఁ దగవుమెయి నడచు ధీరవిచారా. ౩౭౬

వ. అని చెప్పి భీష్ముండు వెండియు ని ట్లనియె: ౩౭౭

క. తనకడకు వచ్చి మొగ మో
డనివాఁ డగుదూత పల్కుటకుఁ గోపింపం
జనదు జననాథునకు; దూ
తునిఁ జంపిన నరక మగుట ధ్రువ మని రార్యుల్. ౩౭౮

తే. కులముశీలంబు, హితవాక్యములును,
నేర్పుఁ, గార్యవాదిత్వసద్వచోగౌరవంబుఁ,
దలఁపుగలుగుట, దక్షత, యలఘుగుణము
లందుఁ దూతకు ని య్యెడు నార్యజనులు. ౩౭౯

క. మొన దీర్చువెరవు, యంత్రము
లనేకము లొనర్చునేర్పు, నాయుధముల వి
న్ననువును, బోటులకర్జం
బునుఁ సేనాపతికి నైజములు గావలయున్. ౩౮౦

క. తనయుల నైనను నమ్మిన
జనపతి సిరి గోలుపోవుఁ; జతురతమై న
మ్మినవాఁడపోలె నమ్మక
యునికి సకలజనులయెడల నుర వై యుండున్. ౩౮౧

తే. అనిన విని పాండవాగ్రజుం 'డనఘ, పురము
భంగియెట్లైనమేలు సెప్పంగవలయు'
ననుడు, నమ్మహీవిభునకు ననిమిషాప
గాతనూభవుఁ డి ట్లనుఁ బ్రీతితోడ: ౩౮౨

సీ. పరవు లోఁతును గలపరిఖతోఁ బొడవును
ఘనమును నగుకోట గలిగి, తగిన
వాకిళ్లు బలుపుఁగావలి నొప్ప, రమ్యగృ
హవ్రాతములు గొమరారువీథు,

లందంబు లగుమేటియంగళ్ళ నెల్లవ
స్తువులును శోభిల్ల సుజనబహుళ
మై, ధాన్యములును, ఘృతాదిరసద్రవ్య
ములును, నానాయంత్రములును, బహువి

ఆ. ధాయుధములు, బిరుదు లగుయోధులును, బండి
తులు, విలాసినులును, దూతముఖ్య
పరిజనములు—నెఱయఁ బరమోత్సవంబులు
మెఱయఁ బురము చెలువు మిగుల వలయు. ౩

ఆ. అట్టిపురవరంబునందు రత్నస్వర్ణ
ముఖము లగుపదార్థములకు బంధు
తతికిఁ బతి సురక్షితస్థితి సేయునాఁ,
డధిప, వినుము, భూమి యరయు తెఱఁగు: ౩౮

వ. అని పలికి మఱియు— ౩౮

క. స్థలముఖ్యము లయ్యేడుపే
ర్కొలయూళ్ళల నెల్ల వెరవు గలిగినవిశ్వా
సులఁ బ్రభుత యిచ్చి భూపతి
నిలుపవలయు వర్ణరక్షణీయత వెలయన్. ౩౮

క. చోరులచేఁ జెడ కుండం,
గ్రూరులచేఁ జావ కుండఁ, గువలయజనులన్
జారులచేఁ బడ కుండ ధ
రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. ౩౮

క. అవు బేహారముఁ గృషియు
న్నవరణలును పసులసొంపునన; య ట్లగుటన్
భువిఁ బసులు గలుగుకాఁపుల
నవనీశుఁడు గన్న ప్రజలయ ట్లరయఁ దగున్. ౩౮౮

క. [1]అరి మిగులఁ గొనుట గ్రోవులఁ
బొరిమాలం బిదికినట్లు; భూవర, కదుపుఁ
వెరవునఁ బెనిచినయట్లగు
నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. ౩౮౯

—♦ బండారంబు వృద్ధిసేయు తెఱఁగు భీష్ముఁడు ధర్మజునకుం జెప్పుట. ♦—

వ. అనిన విని, పాండవాగ్రజుండు 'బండారంబు గలిగించు వెరవెట్టిది
తెలుపు' మని యడిగిన నాపగాతనయుం డతని కిట్లనియె: ౩౯౦

క. విను, కర్షకులును వణిజులు,
ననఘా, గోరక్షకులు, ధరాధీశునకుఁ
ధన మొడఁగూడెడుచోటుల
కనేకవిధములకు నెల్ల నాద్యస్థలముల్. ౩౯౧

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తితలము
లయినవాని కించుకయును హాని గాక
యుండఁ, దనకును బండార మొదవఁ దగును
పార్జనము సేయ వలయు భూపాలకుండు. ౩౯౨

క. పులి గూనలఁ దినుచందము
గలిగిన నంతటన నిలుచుఁ గాక ధనంబుల్
గలుగునె మీఁదం? గావున
జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. ౩౯౩

క. అరయుటఁ బ్రజ వర్ధింపఁగ
సరి యేఁటఁ గ్రమప్రవృద్ధ మానట్టులుగా
నరపతికిఁ గొనగ వచ్చు
న్వెరవులఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. ౩౯౪

క. దమియింపఁ దగినవారల
సమయమున దమించి, వారిసంపదలు మహీ
రమణుండు దనదుబండా
రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. ౩౯౫

---

1. = కప్పము.

క. ఆపనికిఁ గీడు [1]రోయుచు
భూపాలుఁడు ధనము గలుగుపురుషులసిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు; ద
యాపరుఁడై పెంపవలయు నఖిలజనములన్. ౩౯౬

క. ప్రభువుల నుపచారంబుల
విభుఁ డనురాగిల్లఁ జేసి [2]వెదగొనఁ గాఁపుల్
సభయులు గాకుండ ధనం
బుభయజగత్సిద్ధి [3]పొంచు నుర్వీనాథా. ౩౯౭

క. ఆయతి కిమ్మై యిఁ గలుగు ను
పాయంబులు ధర్మమార్గఫలితంబులు గాఁ
జేయుటయ మేలు నృపతికి;
మాయాకృతినిపుణుఁ డగుట మతి గాదు సుమీ. ౩౯౮

క. ధనము సవరించినఁ బ్రయో
జన మేమి యపాత్రములకుఁ జల్లి చెఱుచునే
ని? నరేంద్రముఖ్య, [4]వ్యయములు,
విను, రక్షయు సిరికిఁ బాత్రవిషయము లైనన్. ౩౯౯

వ. ఈభంగి నైనం గోశమిత్త్రరాష్ట్రబలంబులు వృద్ధిఁ బొందు నీ విట్టి తెఱంగువాఁడవై ప్రజల రక్షింపుము. రణంబుల కలయక విరోధుల వధింపుము. మఖంబులొనరింపుము. దరిద్రులై నధరణీసురాదిసాధుల నరసి కుటుంబరక్షణంబు సేయుము. మాంధాతృనకు నాంగిరసుం డగుచుతథ్యుండు సెప్పినహితవాక్యంబులనుపన్యసించెదనాకర్ణింపుము

—♦ మాంధాతృన కుతథ్యుఁడు సెప్పినహితవాక్యముల ప్రకారము ♦—

తే. భూతవృద్ధులు ధనలాభములును గలుగు
ధర్మమునను; . రా జనువాఁడు ధర్మరక్ష
కై జనించెను గావున నతఁ డరోష
కాముఁడై ధర్మనిరతుండుగాఁగ వలయు. ౪౦౧

---

1. = వెదకుచు. 2. భయము. 3. = కొఱకు; కోసరు. 4. తా. సత్పాత్రముల యందు వినియోగమయ్యెనేని సంపదకు రక్షణయే.

క. విను, ధర్మమునకు బ్రాహ్మణ
జనము జననదేశ మగుట, జనపతి భక్తిం
గొనియాడి యసూయావ
ర్జనుఁడై తగు విప్రకోటి సంభావింపన్. ౪౦౨

చ. అనిమిషులుఁ బిభీతు లగునట్టిపదంబునఁ జేర్చి, ముక్తి విరో
చనతనయుండు భూమిసురజాతిసువృత్తి కసూయ చేసి నె
ట్టన సిరిఁ బాయఁడే? బలి దృఢం బగుభక్తివిశేష మూఁదఁ గా,
న్ననఘు, యతండు దాఁ బిదప నవ్యయసౌఖ్యవిభూతి నొందఁడే?
ఆ. ధర్మమునకు సిరికిఁ దగ జనించినయది
దర్ప; మనిమిషులు నుదాత్తమునులు
నైన నగ్గుణమున నూనినఁ జెడుదురు
దాని గెలువ వలయు ధరణిపునకు. ౪౦౪

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగఁ ద
ద్ధరకుఁ వర్షము లేక యుండుఁ, బ్రజకుఁ దైన్యంబు వాటిల్లుఁ, [1]బె
క్కురుజల్ పైకొను, నెందునుం గలయ నుక్కుం దేజముం దక్కు,ను
ద్ధురసైన్యంబుల శత్రు లొత్తుదురు, బంధుశ్రేణికిం జే టగున్. ౪౦౫
క. కానిచెయిదములు సేయక
నూనపుధర్మమున నడచునుర్వీశుఁడు, సం
తానము బంధులుఁ బ్రజయును
దానును సేనలును శుభము దలకొనఁ బేర్చున్. ౪౦౬

వ. అని యిట్లు సెప్పినవాక్యంబులం దెలివొంది ధర్మతత్పరుండై
మాంధాతృండు మహావిభూతిం బొంది నెగడె;నీవును నట్ల నెగడుము-
అనిన, ధర్మతనయుండు, 'ధర్మంబున నెగడ దొరకొనుట యెట్టి
భంగింగలుగు'నని యడుగుటయు, నతనితోన కురుపితామహుండు
'దొల్లి కోసల్యుం డగువసుమనుం డనురాజు వామదేవమహాముని
నిట్లు యడిగిన, నతం డతనికి నుపదేశించిన తెఱం గెఱింగించెద విను'
మని యిట్లనియె: ౪౦౭

1. = అనేకరోగములు.

—♦ వసుమనుం డను రాజునకు వామదేవుండు సెప్పినధర్మప్రకారము.

ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ
సిద్ధి; దాన సకలసిద్ధులును బ్ర
శస్తభంగిఁ జేరు; శాశ్వతకీర్తియు
సంభవించుఁ; గలుగు సద్గతియును. ౪౦౮

క. ధనమునకై ధర్మముదెస
ననాదరము సేసెనేని నానృపతికి న
ద్ధనమును జెడు; దుర్యశముం
బనుగొనుఁ; దుది దుర్గతియును బాటిలు ననఘా. ౪౦౯

క. లాభంబు ధర్మముఖ్యము
గా భరపడి మార్గశుద్ధి గనుఁగొని కైకో
ల్దా భూవరునకు నిహపర
శోభనములు సేత చెప్పు, శ్రుతివాక్యంబుల్. ౪౧౦

క. ధర్మప్రవృత్తి యయ్యును
ధర్మము నా కింతకంటెఁ దత్తద్విధులం
బేర్మిం బొరయఁ దలయు నను
ధార్మికతాతృష్ణ నత్యుదాత్తుఁడు పొందున్. ౪౧౧

వ. అని తన వచనంబులం దెలివొందిన వసుమనుం డను రాజుతో
వామదేవుండు రాజ్యతంత్రంబునకెల్ల నాధారభూతంబు లగుసామ
భేద దాన దండంబులఁ బ్రయోగించు తెఱం గెఱింగించెద నాకర్ణింపు
మని యిట్లనియె: ౪౧౨

క. మూలబలము సంతుష్టం
బై లాలిత మగుచు నున్నయప్పు [1]డసదుఁజో
టాలోకించి నడవ, భూ
పాలకునకు దండ మతిశుభం బొనరించున్. ౪౧౩

1. = అసదుచోటు ఆలోకించి = అల్పము (నికృష్టము) అగుచోటు చూచి.

చ. సమరము సాహసం బధికసంపద లమ్మెయిఁ దెచ్చికోలు ప
థ్యమె? రిపు లేల కల్గుదు రహంకృతి పెంపును నుత్కటంపుఁగో
పము మగిడింపఁ జాలునరపాలున? క ట్లగుటన్ హితంబు సా
మము దనయంతవాఁ డయిన మానవనాథు నెడన్ మహీశ్వరా.

క. తనభటులు గలఁగినప్పుడు,
ధన మిచ్చి విరోధి నల్పతరునైనను శాం
తునిఁ జేయవలయు; దానము
నన యధికునిఁ దేర్చు టురవు నరపతి కెపుడున్. ౧౭౫

తే. ఆయుపాయముల్ మూఁటికి ననువు గాని
యట్టిపగతునియెడ భేద మాచరింప
వలయు రంధ్రముల్ దగవేచు వలనుగలిగి
తత్పరతఁ జేయఁజాలుసాధకులఁ బనిచి. ౧౭౬

వ. శుక్రమతంబునం బంచమోపాయం బైనయుపేక్ష వర్తిల్లు దానిం
బ్రయోగించుభంగియుం జెప్పెద. ౧౭౭

మ. కలహంబుల్ దమలోనఁ జేసిన నుపేక్షానైపుణం బొప్ప, శ
త్రులఁ జూడం దగు [1]భూతదానవులపోరుం జూచిన; ట్లిమ్మెయి
[2]న్మ్రులు ముంటం దగఁ బుచ్చుభంగి గలుగు; న్భూనాథ, కీడైనమం
త్రులయేపున్ విభుఁ డిట్ల మాపునద్ది నేర్పుం బెంపుఁ బొల్పారఁగన్.

వ. అని యత్తెఱంగున వామదేవుండు సెప్పినహితవచనంబులు వాటించి
కోసలపతి భాసమానుం డయ్యె. నీవును నట్ల వర్తిల్లి వెలయు మనినఁ,
బాండవాగ్రజుండు 'సమరంబున శత్రుల జయించునప్పటిపాడి యె
ట్లుండు' ననుటయు, భీష్ముం డతని కి ట్లనియె: ౧౭౯

—◆ ధర్మజునకు భీష్ముండు సమరంబున పాడి చెప్పుట. ◆—

సీ. పగవాఁడు బలములఁ బన్ని తోఁచినఁ, దాను
సబలుఁ డై యొంటిమై సంగరంబు

1. తొల్లింటి దైత్యుల పోరాటముం జూచినట్లు. 2. మల్లును ముల్లుతో

గోరిన, నమ్మెయి గొనకొని మాయ లొ
నర్చిన మాయలఁ జేర్చి గెలుపు
గొనునది; వెన్నిచ్చినను, బ్రమాదంబునఁ
బడినను, గైదువు భగ్నమైన,
శరణన్న, మ్రొక్కినఁ, దురగాళి యెడలిన,
నోరుతోడఁ బోరుచు నున్న,-నెట్టి

ఆ. పగతు నైనఁ జంపఁ దగ; దధర్మంబునఁ
జంపుకంటె ధర్మసమర కేళిఁ
జావు మేలు. రాజు శయ్యఁ జచ్చుట గొఱ
గాదు; గాన నోడఁ గాదు పోర. ౪౨౦

క. విను, [1]చిల్ల యిడినయాయుధ
మును, విషలిప్త మగుశస్త్రమును, నెట్టియమి
త్రునిపై నైనఁ బ్రయోగిం
చిననరపతి నరకమున వసించు నృపాలా. ౪౨౧

క. తనకుం దోడ్పడి యని నొ
చ్చినవానిం గాంచి కడఁగి చేష్టింపక యు
న్ననరేంద్రుఁ బొందుపాపం
బునకుఁ గొలఁది గలదె భరతపుంగవ తలఁపన్? ౪౨౨

వ. అని చెప్పి వెండియు, ౪౨౩

చ. అరిపయిఁ బోయి వానిపుర మగ్గలికం జెఱుపంగఁ, దద్ధరం
బరఁగుప్రజం జలంబుమెయి బాధలఁ బెట్టు టధర్మ; మట్టి ని
ష్ఠురత యొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగ రాదయేని, భూ
సురగృహదేవగేహముల చూఱ నవశ్యము మాన్చు టొప్పగున్.

వ. అనిన విని, యజాతశత్రుండు 'రాజధర్మంబుకంటెం బాపకర్మంబు
లేదు. హా' యని పలికి, 'యిట్లేని రాజున కెట్లు నుత్తమగతి వాటిల్లుఁ
గదే!' యనుటయు, నాపగాతనయుం డిట్లనియె: ౪౨౫

1 శల్యము (పూ. ముక.)

క. శరణాగతుఁ గాచియు, నని
వరిపోటులఁ బడ్డఁ దెచ్చి యరసియు, ధరణీ
సురులం బ్రోచియు, నానా
ధ్వరములు సేసియును రాజు దలఁగు దురితముల్. ౮౨౬

క. అన విని, యమ్మనుజేశ్వరుఁ
'¹డని ననివర్తులయి శౌర్య మభినుతి కెక్కం
దనువు దొఱంగినవారికి,
ననఘా, యెబ్భంగిలోక మగు?' నని యడిగెన్. ౮౨౭

వ. అడుగుటయు, నమ్మహీకాంతునితో శాంతనవుండు 'శక్రాంబరీష సంవాదంబు చెప్పెద దాన నీ యడిగినయది దేటపడు' నని యిట్లనియె: ౮౨౮

—♦ ఇంద్రాంబరీష సంవాదప్రకారము ♦—

సీ. అంబరీషుండు నానాధ్వరంబులు సేసి
కడచని వాసవుకడకు నేఁగి,
యచట నుజ్జ్వలవిమానారూఢుఁడును మనో
హారిసంక్రీడనోదారచరితుఁ
డును నై చెలంగెడు తనదుబంటు సుదేవుఁ
డను వానిఁ జూచి, యయ్యనిమిషేంద్రు
తోడ 'మదీయభృత్యుఁడు వీఁడు క్రతుముఖ్య
కర్మముల్ సేయఁ; డెక్కారణమున,
తే. ననఘ, నాకంబెఁగడుఁ బేర్చి యునికిగలిగె?'
ననుడు, నా జిష్ణుఁ 'డిమ్మహాత్ముని తెఱంగు
సెప్పఁ ²జిట్టలు వినఁగ వాంఛించితేని
వినుము చెప్పెద' నని యిట్టు లనియెఁ బ్రీతి: ౮౨౯

1. అనిన్ అనివర్తులయి = యుద్ధమున అనివారితు - (నివారింపరానివార)లై; నుపియునివారై. 2. = చిత్రములు; ఆశ్చర్యములు.

వ. శతశృంగుం డనియెడు దానవునితనూజులు సదముండును విదముండును దముండును ననియెడువారలు— ౪౩౦

శా. బాహాగర్వము సూపఁ గోరి పటుదర్పం బొప్ప నుగ్రాహవో
త్సాహం బూర్జితభంగి గా భయదఘోషస్ఫీతనానావిధ
వ్యూహంబుల్ ధరణీప్రకంపనము లై యుద్ధామసర్వాంగ స
న్నాహత్వంబునఁ బేర్చి తోడ నడవ న్సంరంభశుంభద్గతిన్— ౪౩౧

ఉ. మంచిమగండ వైననిను మార్కొనువా రయి దాడివెట్టి యొ
క్కించుక శంక లేక ప్రజ యెల్లను బెగ్గిల ముట్టి, యర్థముల్
గొంచు, ధరిత్రి నై కొనుటకుం [1]గన లగ్గల మెలంది యాతనిం
బంచితి సైన్యయుక్తముగఁ; బార్థివ, యి ట్లని పల్కి తత్తఱిన్:

మ. 'పసగన్ వే చని దోర్బలంబున రణప్రావీణ్యముం జూపి, నీ
వసురానీకముఁ ద్రుంచి, భూప్రజలకున్ హర్షంబు గావించి రా
క సుమీ రాక! జయంబు లేక ప్రజ దుఃఖం బొందఁగా రాక నీ
యసువర్గంబులపోక గా నెఱుఁగు; పెక్కాడంగ నిం కేటికిన్?' ౪౩౩

మహాస్రగ్ధర.

అనినన్ సంగ్రామకేళీవ్యసనరసికుఁడై 'యట్లకా' కంచు నిన్ వీ
డ్కొని యాతం డేఁగి తానప్డు దనుజతతియాటోపమున్ గూఢచారుం
డనుదృష్టిం జూచి, తా నిట్లను మనమున: 'సైన్యంబుచే లేల? [2]శత్రుం
గొన నీ నేలా? పురారిం గొలుఁతు, నతనికిం గోసి యిత్తున్ శిరంబున్'

మ. అని నిశ్చయుఁడై రణం బుడిగి సైన్యం బంతయుం గ్రమ్మఱం
జనఁగాఁ జేసి, పరేతభూమికి దృఢోత్సాహంబునం బోయి, శం
భునిఁ జిత్తంబున నిల్పి, వాలును గళంబుం గూర్చినన్, సత్కృపా
ఘనుఁ డద్దేవుఁడు ముందటన్ నిలిచి ఖడ్గంబుం దొలంగించుచున్.

మ. 'చను నే సాహస మిట్లు సేయ? నిది కర్జం బే? కతం బేమి యి
ప్పని?—' కన్నం, గని చక్కఁ జాఁగి ధరయున్ ఫాలంబునుం బొంద వం

---

1 = కోపము మిక్కుటముగాఁ బొంది, 2 = శత్రున్ - గొనన్ ఈనేలా = శత్రునిఁ గొన నియ్య నేటికి ?

దనముం జేసి, యితండు, నీపలుకులన్, దైతేయులం దాఁక నో
ల్లనివాఁ డైన తెఱంగుఁ జెప్పి శివునుల్లం బార్ద్రితం బొందఁగన్.

ఉ. ఆ పరమేశ్వరుం డితని కప్పుడు దివ్యరథోత్తమంబునుం,
చాపము, సస్త్రకోటియుఁ బ్రసన్నత నిచ్చి, 'రణంబునందు నీ
యేపున కోర్వ దేవతల కేనియు దైత్యుల కేని రాదు పొ;
మ్మేపగతేని గెల్వుము; మహిం జరణం బిడ కుండు మాజిలోన్'

మ. అని వీడ్కొల్పిన నీతఁ డుబ్బు మదిఁ బొంగారంగఁ దేరెక్కి వే
చని, దైత్యధ్వజినీప్రతాపమహిమోత్సాహంబులం జీరికిం
గొన కుగ్రోద్ధతిఁ దాఁకి, పీనుఁగుల పెంగుప్పల్ గొనం జేసె; న
య్యనిఁ బైఁ ద్రోఁచిన నిద్దఱుం దునిమె దైత్యాధీశులన్ వ్రేల్మిడిన్

వ. ఇవ్విధంబున సదముండును దముండునుం బడినం గని కోపోద్దీపితుండై

స్రగ్ధర. వీరోదారోగ్రలీలన్ విదముఁడు సమరోర్విన్ బలోల్లాస మొప్పం
జేరెన్ బాహాసముల్లాసితఘనరుచిరాసిప్రభాభాసురుం డై
యారక్షోనాథుపైఁ; బేరలుక మఱవుఁ జేయంగ నీతండు డిగ్గం
దే రుద్యత్ఖడ్గదీప్తుల్ దెసల నిగుడ, దైతేయవీరుల్ చలింపన్. ౨౨౦

వ. ఇట్లు విధాతృవశంబునఁ బాదచారి యై, ౨౨౧

మ. దనుజుం దాఁకి కృపాణఖేలనము చిత్రంబై వెలుం గొందఁ ద
త్తనుసంఛేదనకేలి సల్ప, నతఁడుం దన్నుం బటుప్రస్ఫుర
ద్ఘనకౌక్షేయకధారఁ జీరఁ బడియెం; దా నాతనిం గూల్చెఁ; ద
క్కిన దైత్యావలి విచ్చె నగ్గడఁ బరిక్షీణోద్యమత్వంబునన్. ౨౨౨

వ. ఇట్లు నిశ్శేషంబుగాఁ బరవీరులం బరిమార్చిన నీరాజ్యంబు పూజ్యం
బై వెలసె. భూపప్రజయుం బ్రమోదంబు నొందె. ఇత్తెఱంగున నీ
సుదేవుండు సుకృతవంతుండై యింతటిపదంబున కర్హుం డయ్యె. ఏ
యజ్ఞంబులును సంగ్రామయజ్ఞంబునకు సదృశంబులుగావు. వినుము,

[1]వీరమస్తకరాశి వేదికగాఁ, గృపాణబాణాదిసాధనంబులు సమిత్స్రు
క్స్రువంబులుగా, శోణితం బాజ్యంబుగా, మాంసంబు పురోడా
శంబుగా, వీరవ్రతదీక్షితుండు సమరాధ్వరంబు సలిపి, రుధిరపూర్ణ
యు, మస్తిష్కకర్దమయుఁ, గేశశైవాలయు, నాంత్రఫేనయుఁ,
భేరీమండూకయు, హేతిమీనయు, గజకళేబరపులినయు నగుసమర
పుణ్యనది నవభృథస్నానంబు సేసి, మదీయలోకంబున సుశ్లోకుండై
నిత్యస్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లుఁబుణ్యాత్ముం డగుటకుం
దనువు దొఱంగవలయు నని లేదు. తెగువతోడి యనివర్తనగతియుం
జాలు. ఇట్టిరణాచరణప్రభావం బేనును బ్రబలమై తేయవ్రతశాసన
సుకృతంబునంగాదె యీదేవేంద్రత్వంబు నొందితి. అని పలికిన,
నంబరీషుండు సమరశూరులసమధికపుణ్యత్వంబు దెలిసి సంభావించె
నని చెప్పి దేవవ్రతుండు వెండియు, ౪౪౩

— సమరానివర్తనంబువలని ఫలము —

క. జనకుఁడు ప్రతర్దనునకుం
దనకును రణమైనయపుడు తనయోధులకుం,
విను, నాకంబును నరకముఁ
గనుగొనుఁ డని చూపి చెప్పెఁ గౌరవముఖ్యా. ౪౪౪

తే. పుణ్యతమము భోగాస్పదంబును మనోహ
రాంగనాజనబహులంబు నైనయది—ర
ణంబు బిరుదులై చేసిన నరులనెలవు;
దూరఁబందలచోటిది దుఃఖమయము. ౪౪౫

---

1. తా. యుద్ధమునఁ గూలినవీరుల తలలు తిన్నెగాను, కత్తులు కటారులు లోనగు ఆయుధములు చిదుగులు మొదలగునవిగాను, రక్తము నెయ్యిగాను, మాంసము యజ్ఞము తోడుకలుగు అప్పములు (=సోమలతారసము, హుతశేషము)గాను, వీరవ్రతదీక్షుఁబూనిన వాఁడు యుద్ధము యజ్ఞము చేసి, రక్తము చేనిండి, తల మెదడు బురదయు, వెంట్రుకల నాచును, ప్రేవులనురుగును, దుందుభులు కప్పలును, కత్తులచేపలును, ఏనుఁగు పీనుఁగుల ఇసుకతిప్పలును గాఁగల యుద్ధగంగయందు అవభృథస్నానము (=యజ్ఞాంతమున న్యూనాతిరిక్తదోషపరిహారార్థము చేయుస్నానము) చేసి..... ...

వ. అని తనమాహాత్మ్యంబునం జూప నోపినయుభయుస్థలంబునుం జూపం జూచి, యేచి, యవ్వీరులు దెంపు పొంపిరివోవం దఱియ నుఱికి వైరుల జయించిరి. సమరంబు తెగువ దీప్తలక్ష్మిం గరం బొనర్పుఁ; బుణ్యతమలోకంబు లిచ్చుం; గావున శూరుం డధికపుణ్యోదారుం డని యిట్లు దేవవ్రతుండు ధర్మసూనునకు సమరానివర్తనజనవిశేషం బెఱింగించె- అని చెప్పిన విని, యటమీఁద వారలసంప్రశ్నోత్తరంబులు ప్రవర్తిల్లిన విధంబులు వినుపింపు మనుటయు- ౪౪౬

మ. పరమాయుఃపరమార్థసిద్ధిపరమప్రావీణ్యసంపాదనా
దరసంభావితభక్తలోక, నిగమాంతస్ఫీతహార్యాగ్రసం
చరణప్రౌఢమయూర, చిత్రమహిమా, సర్వాత్మవిజ్ఞానసం
పరిపాకప్రకటాకృతీ, శమదమోద్భావాహితస్వీకృతీ. ౪౪౭

క. యమనియమాద్యష్టాంగ
క్రమాభ్యసననిర్మథితవికారసుచేతః
కమలామోదమయాత్మా,
సమతారాహిత్యశస్య సర్వనమస్యా. ౪౪౮

మాలిని. సమధికనిరవద్యస్వైరనిత్యప్రభుత్వా,
విమలమహిమహేలావిర్భవత్సర్వసత్త్వా,
సమదమలినచిత్తోన్నత్యదివ్యన్మహత్త్వా,
దమమహితతపస్సద్భావసంవేద్యతత్త్వా. ౪౪౯

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతం బైన శ్రీ మహాభారతంబున
శాంతిపర్వంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ

హరిహరనాథాయనమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతి పర్వము

### తృతీయాశ్వాసము.



శ్రీ ధుర్యకరణ, సమ్య
గ్బోధాత్మవిహరణ, దివిజపూజ్యచరణ, యా
రాధకభరణ, నిరాధి
వ్యాధికరణ, సౌమ్యకిరణ, హరిహరనాథా. ౧

—♦ కాలనిరూపణాదు లగు రణోపాయంబులప్రకారము. ♦—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: అట్లు శూరులౌ
పుణ్యతమపురుషు లని విని, కుంతీనందనాగ్రజుండు గంగానందనుతోఁ
గాలనిరూపణాదు లగు రణోపాయంబు లెఱింగింపు మనుటయుఁ
నతండు భరితాదరుం డై— ౨

సీ. వానయు [1]సీతును వర్జించి, మందువే
సవి గాక మున్న, సస్యములపంట
లూఁదవెడుతఱి [2]నెత్తునది శత్రుపయిఁ; [3]బూరి
గట్టియల్ నీళ్ళులుఁ గలుగు తెరువు

---

1. = శీతకాలమును వదలి. 2 = దండెత్తవలయును. 3. = గడ్డి.

గాఁ జూచి నడచుట కర్జంబు; [1]సిడములుఁ
[2]గంకటంబులును [3]బల్లెలును [4]విండ్లు
మొదలగు నాయుధంబులు, రథ గజ హయం
బులసవరణలు నపూర్వభంగి

తే. నొప్పి, యరిభీకరంబులై యుండవలయు;
శంఖ [5]కాహళ [6]పటహ [7]నిస్సాణముఖము
లైనతూర్యముల్ మంచివి యైన లెస్స?
యధిప, [8]విడిదల [9]సమతల మగుట మేలు. 3

క. చరులఁ బనిచి యరుల తెఱం
గరయుచు, వా రెదురు నడచునట్టి దయిన, దె
ప్పరపుం దెరువున, డప్పిం
బొరసినయెడ, విడియుచోటఁ బొడుచు టురవగున్ ౪

ఆ. నిదుర వోవుచోట, నీరు దవ్వై వడఁ
బడినయెడను, గూడు దడసి సొలసి
నపుడుఁ, బెదరి యున్న యవసరమునఁ బగ
వారిఁ బొడిచి చెఱుపవలయు నధిప. ౫

సీ. చెట్టును దాయును మిట్టయుఁ బల్లంబుఁ
గలిగినచోటు గాల్బలమునేల;
వినుము, నీళ్ళును రొంపియును లేక సమవిశా
లము నైనచోటు గుఱ్ఱములనేల;
[10]కమ్మి గ్రుంగక గమగదుప రొంపులు గలు
గమి నొప్పుచోటు రథములనేల;
యెడనెడ మ్రాకులు మడువులుఁ గలచోట,
కురునాథ, యొఱుఁగుము కరులనేల;

1 = పతాకములు; జండాలు. 2. = కవచములు; తనుత్రాణములు, మైమఱువులు. 3 = డాలువాలు; ఖేటకము; కేడెము. 4 = ధనస్సులు. 5. = కొమ్ము; తూర్యము; బాకా. 6. = తప్పెట. 7. = డంకా. 8. విడియుచోటు; ముకామ్ (Camp.) 9. = చదరపునేల. 10. = చక్రపు చుట్టుకమ్మి.

ఆ. యేబలంబు దనకు నెక్కుడు గలిగె న
బ్బలమునేల పోరుగలను గాఁగ,
నినుఁడు, సీతు గాలి వెనుకగా, మొన నడ
పించి పోడువ సంభవించు జయము. ౬

చ. పలకలవార లగ్రమునఁ బన్నఁగ, విండులవారి ఘోటకం
బులఁ గరులన్ రథంబులను, భూవర, వెన్వెనుకం గ్రమంబునన్
నిలిపినఁ, గూడి నిల్చినయనీకమునం గడుమంచియోధులం
గలయఁగ నెందు నయ్యయిప్రకారమువారల నిల్ప బల్పగున్. ౭

ఆ. బంటు లుత్సహించి పగఱ 'పోయిరి పోయి'
రంచుఁ గడఁగి బొబ్బ లార్పు లెసఁగ,
నతిరయమున నడరు నట్లుగ, దొర సము
ద్ధతి యొనర్ప వలయుఁ దాఁకుదలల. ౮

వ. అనుటయుఁ, గౌంతేయాగ్రజుండు శాంతనవునితోఁ 'బంట్లెట్టివారు
గావలయు?' అని యడిగిన నతం డిట్లనియె: ౯

తే. 'ఏనుఁ గేనుంగుఁ బేర్చిన ట్లెసక మెసఁగు
నంగములసొంపుఁ, బులికిని సింగమునకు
వట్టినట్టియుద్ధతయును గట్టి మెఱయ
లనుఁ గలయోధవీరులు వలయు ననికి. ౧౦

వ. 'దేశవిశేషంబు లాకర్ణింపుము: గాంధార సింధు సౌవీరులు [1]కఠారంబుల [2]సబళంబులం బరిశ్రమంబు గలిగి బలశౌర్యసమగ్రులై సర్వసమరంబులకుఁ జాలి యుండుదురు. ఔశీనరు లెల్లకైదువులకు నేర్చి సత్త్వవంతులై యుండుదురు. ప్రాచ్యు [3]లేనిక కయ్యంబునకు నేర్తురు; కపటయోధులై యుండుదురు. యవనులుఁ గాంభోజులును మథురచుట్లదేశంబులవారును [4]గుద్దుపుబవరంబులకు నలవడి

1. = కత్తులయొక్కయు. 2. = ఈటె, బల్లెములయొక్కయు. 3. = ఏనుఁగుల పోరాడుటకు నేర్పుగలవారు. 4 = గుద్దులాటయొక్క యుద్ధము చేయుట నలవాటు పడినవారు.

యుండుదురు. ఘూర్జరులు [1]బద్ధపరుల నడిదంబులం బరిణతు లై యుండుదురు. మాళవులు రథంబులు మొదలైనచతురంగబలంబుల సంగరంబులం జతురు లై యొక్కఁ డొక్కండ పెక్కండ్రకైన నోర్చియుండుదురు. కొందఱఁ గొందఱ నిర్దేశించితి; మఱియు ననేక దేశంబులవారు వివిధప్రకారంబుల నుండుదురు. అయ్యైతెఱంగు లెఱింగి పెనంగించి జయంబు గొనునది'. అనిన, ధర్మనందనుండు 'జయించు సైన్యంబులం దోఁచులక్షణంబులు విన వలతు' ననవుడు, భీష్ముఁ డతని కి ట్లనియె: ౧౧

—♦ధర్మజునకు భీష్ముఁడు శకునావశకునములు దెలుపుట♦—

క. సైనికులమనము లుత్సా
హానూనము లగుచు నుండు, హయఘోషణముల్
వీనులకును సొగియించు, న
జానీకము లుబ్బు, విజయ మగుసైన్యమునన్. ౧౨

క. మృగములుఁ బక్షులు [2]ననులో
మగతిం జరియించు, వెనుక మందానిలుఁ డిం
పుగ వచ్చి సోఁకు, గడుమే
-లగుమాటలు వాడము గెలుచు నట్టిబలమునన్. ౧౩

క. [3]జ్వాలలు నెడఁ దెలివితో న
గ్నులు వలపల సుడియు శిఖలఁ, గొమ రగుఁ దూర్యం
బులు గంభీరధ్వనులం
జెలఁగును జయము గొనునట్టిసేనఁ గుమారా. ౧౪

క. అని చెప్పి మఱియు నతఁ డి
ట్లను: 'ముట్టినపగఱసొంపు నడఁచుట యొప్పున్;
విను, కయ్యమునకుఁ గాల్ద్రి
వ్వినఁ బాటిలు దురిత మట్టివిభునకు నైనన్. ౧౫

1. డాలు కత్తి సాములలో ఆరితేఱినవారు. 2. అనులోమగతిన్ = ప్రదక్షిణము; ఎడమనుండి కుడికి వరుసను. 3 రూ. వెడలు నప్పుడు,

క. '[1]చెఱువునకు మవిసినను, బెను
వెఱమొకములు సెదరినను, వివేకనిధీ, యు
క్కఱి బహుళసైన్య మఱిముఱిఁ
బఱచిన నాఁగంగ రాదు బలియుర కైనన్. ౧౬

క. 'విను, కొంచత్తైనఁ గడుఁదెం
పున మార్కొని కడిమి మీఱి పోఁగి యెదరినన్
మొన యెంత దైన విఱుగుం;
జనునే కయ్యంబు వోడువ శక్తుల కైనన్! ౧౭

క. 'క్షమ మే లగు; నైన నతి
క్షమ దైన్యముఁ దెచ్చు; నెదుర గర్వించినఁ గ
య్యము వోడిచి గెలిచి, యరి శే
షము నెడ సదయక్షమావిశదుఁ డగు టొప్పున్.' ౧౮

—♦ రాజు పగఱయెడ నుండవలయు విధము. ♦—

వ. అనిన నప్పాండవోత్తముండు 'పుడమితేఁడు పగఱయెడ నెట్టివాఁడుం
గావలయు' ననవుడు, నాభూపతితో భీష్ముండు బృహస్పతి దివస్పతి
కెఱింగించిన తెఱం గుపదేశించెద నని యి ట్లనియె: ౧౯

చ. [2]విను మరిఁ జంపనుం జెఱుప వేచుట లెస్స; [3]పరుషభాషణం
బున వెడ నుల్లిక్కట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి రేఁ
చినఁ దనపూఁవు దప్పు; [4]నఱ సేయనిచందము, నమ్మి యున్న చా
డ్పును మెఱయంగఁబల్కుచుఁ, గడున్ మదినమ్మక యుండఁగాఁ దగున్.

---

1. తా. చెఱువు కట్ట తెగినను, మహాభయంకరమృగములు చెదరినను, (ఉక్కు + అఱి =) శౌర్యస్థైర్యములు కోల్పడి సేనాసమూహము కలఁతపడి పాఱినను (బలియురకైన =) బలశాలురకైనను ఆఁపశక్యము గాదు. 2 తా. వినుము: పగవానిఁ జంపుటకుఁ గాని చెఱచుటకుఁ గాని వేచుట క్షేమము. 3. పరుషోక్తుల చేతను, పొల్లు మాటలచేతను, పుల్లవిఱుపుమాటలచేతను, బొంకుల చేతను (వాని =) శత్రువును కలఁతఁబెట్టి రెచ్చఁగొట్టినచోఁ దనపూన్కి (= ఉద్యమము) తప్పును 4 వంచనసేయనివిధ[illegible] నను, నమ్మియున్నట్లును పగవానికిఁ గనఁబఱచుచు నెమ్మదిగా మాటలాడుచు మనసునందు వానిని నమ్మకుండవలయును.

చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడుఁ దేనియ లట్టునట్లుగా
నరపతి వానివారలు వినం బ్రియ మాడుట మేలు. పక్షిఁ దాఁ
దిరముగఁ జేయఁగా, మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త
త్స్వరములు సూపి కాదె తుదిఁ జంపఁ దెగుం దనబారిఁ బాఱినన్.

ఉ. [1]వేమఱు శత్రునిం బరిభవించుట, రిత్తకు రిత్తవైరముం
దా మదిఁ బెట్టికోలు సుఖతంత్రము గాదు. సుసంధికాలముల్
సీమ దగంగ, రూపడఁగఁ జేయుటయుల్ వల దగ్గమైన వాఁ
డేమెయి నైన వధ్యుఁ డను నిట్టి వినిశ్చయ మాత్మఁ గల్గుటల్. ౨౨

క. [2]కాలవిపర్యయమున నర
పాలుఁడు దా మ్రొక్కియైనఁ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి యైనం
గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్. ౨౩

క. [3]అనదతనంబును బెడిదపుఁ
దనమును లేకుండఁ బరఁగి దరి యొత్తెడు నే
ఱునుబోలె నొత్తవలయును
మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా. ౨౪

క. [4]పెక్కండ్రతోడ నీరస
మొక్కటఁ జెట్టిన కొనక, తఱిఁగి యున్న పగతుతో

---

1. తా. తఱచు శత్రుని అవమానపఱుచుటయు, నిష్కారణ వైరము మనస్సునఁ బెట్టికొనుటయు సుఖమార్గము కాదు. తనబారినిఁ బడ్డవాఁడు ఏవిధమున నైనఁ జంపఁ దగినవాఁడు అను నిశ్చయము పూర్తిగ నుండుటం బట్టి అనుకూలమగు సంధికాలమును, ఒప్పిదమగు సీమను పాడు చేయవలదు. 2. తా. కాలము వ్యత్యాసమైనపుడు, ప్రభుఁడు తాను మ్రొక్కియైన పగవానిఁ గలసి (= నేస్తముచేసి), వాని వర్తనము నెఱిఁగి సమయముదొరకినపుడు సుకరముగా వానిని యమపురమునకుఁ బంపవలయును. 3. తా. మెత్తతనమును పెడుసుదనమును లేకుండ వర్తించి (దరి=) గట్టును (ఒత్తు=) ఆక్రమించునదివలె రాజగువాఁడు పగవారినిఁ గ్రమంబుగా నాక్రమింపవలయును. 4. తా. పెక్కుమందితో నొక్కమాటే (ఈరసము=) ఈర్ష్య పెట్టుకొనక, తగ్గియున్న వైరియెడ శౌర్యము బఱపి, కడమ వైరులయందు చుట్టఱికము నెఱపవలయును.

ను గ్రాఁడి, బంధుభావముఁ
దక్కటిపగఱయెడ వలయుఁ దా నెఱపంగన్. ౨౫

— కాలకవృక్షీయమహాముని క్షేమదర్శికిఁ జెప్పిన హితవాక్యములు. —

వ. అనిన శంతనుపుత్త్రుతో నజాతశత్త్రుండు 'నిజపరివారదోషంబున నైనను, బగులజేత నేనియు సంపద సెడుట నాపదం బొరసిన ధరణీశ్వరుండు నెవ్వగ నెవ్విధంబునం బాపికొను నెఱింగింపు' మనుటయుఁ, 'దొల్లి కోసలపతి యైన క్షేమదర్శి, విదేహపతి చేత భూమి గోల్పోయి వగం బొంది, మున్ను దనకు మంత్త్రియై యుండి తాను రాజ్యంబు సేయుచుండం బరమశాంతి నొంది వనంబునకుం జనిన కాలకవృక్షీయు నాశ్రయించి యిట్లు యడిగిన, నమ్మనుజపతికి నమ్మునిపతి సెప్పినవాక్యంబులు సెప్పెద విను' మని యక్కురుపితామహుం డిట్లనియె: ౨౬

తే. అర్థవంతుఁడై భోగంబు లనుభవించు
చున్నయప్పుడ 'యిది యిట్టులుండ నేర;
దస్థిరము తాను లోనుగా' నని యెఱుంగు
నతఁడు వగఁబొందఁ డేది యెట్లైన నధిప. ౨౭

క. కానియటు లుండి నెత్తిఁ బడు;
నైన తెఱఁగు దోఁచి మాయ మగు; నిబ్భంగిన్
మానసమున కుబ్బు వగయుఁ
దే నోవుం బనులు; బుధుఁడు దేలఁడు రెంటన్. ౨౮

క. జననీజనకులును సుహృ
జ్జనులును దెగునపుడుఁ గావఁ జనమి దెలియదే
ధనములు? వారల కంటెనె?
మనుజేశ్వర, వగవు వాని మగిడించునొకో! ౨౯

క. గతమునకును వగవ, కనా
గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక, దీ
నతఁ బొందక, దైవం బే
గతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కనవలయున్ 30

క. వెరవును లావును గలిగిన
పురుషులు లే రెట్లు లోకమున? నెవ్వారికిన్
సిరి శాశ్వతంబె? - యని వగఁ
బొరయఁడు ధీరుండు కలిమిపోకకు నధిపా. ౩౧

క. సారపుసిరి, చేటు - నరుఁడు
గోరకయే వచ్చునట్లు, కోరక యుండన్
శ్రీ లాక గలుగు దైవము
కారుణ్యము గలిగెనేని గాఢవివేకా. ౩౨

క. సిరి విడుచును బురుషుని, విను,
పురుషుఁడు సిరిఁదొరఁగు, - నిది యపూర్వమె? ఫలమూ
లరతుం డై వాఙ్నియతిం
బొరసి యునికి యట్టిచోటఁ బురుషున కమరున్. ౩౩

క. కలఁగిన పెద్దమడువు, విను,
తెలివిఁ బొరయు నెట్లుఁ - దా నధీరుం డట్ల
గ్గలము లయినదురితంబులఁ
గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌరవ మొప్పన్. ౩౪

వ. అని చెప్పి 'యిది యుపశమనప్రకారంబు. నీతి యెఱిఁగించెద నాకర్ణింపు' మనుటయు, నమ్మునివరుతో నమ్మనుజవరుండు 'మహాత్మా, నిన్నుఁ జేరి యేను దురితంబులం దొలంగ వలదె? యానతి' మ్మనిన, నతం డతని కి ట్లనియె: ౩౫

సీ. తద్దయు శాంతుఁ డై తక్కువ కోర్కి శ
త్రునిఁ గని యొడఁగూడి మనఁగవలయుఁ;
మన్నె రాజులభూమి మర్దించి సైన్య ము
ల్లన కూర్చి వైరిపైఁ జనఁగవలయుఁ;
బ్రబలునిఁ జేరి యారాధించి యాతని
సేన తోడుగ నరిఁ జెఱుపవలయు;
విషమున, మాంత్రికవిధిఁ, బంపుపోటున
నలయక రిపుఁ దెగటార్పవలయుఁ;

తే. బొంచి, భేదం బొనర్చి, కలంచి యేని,
సంగనలఁ గొని వారిమాయలఁ దగిల్చి
యైన, మఱియును బహువిధోపాయములను
దెగువ డింపక పగతు సాధింపవలయు. ౩౬

వ. అని చెప్పి నని చెప్పి గాంగేయుండు వెండియుం జెప్పు: ఆకోసల్యుం డధర్మోపాయవిధాయకంబు లగు నుపాయంబులకుం జోరం జాల నళిన, నమ్మౌని తద్విరోధి యగు విదేహవిభు రావించి యేకాంతంబున నాక్షేమదర్శిం బేర్కొని, 'నీ వతనిరాజ్యంబు గొనియున్నవాఁడవు. అన్నరపతి యొంకుమైఁ గార్యంబు సూచుటయొప్పదు; సంధి సేయుము' అని వెరవుకలిమి నొడంబఱిచి, యిరువురకును సంధి యొనర్చి నెయ్యం బువాటించి పీడుకొల్పినఁ, గొసల్యుం డోడ్కొని చని యతనికిఁ దన కూఁతునిచ్చి కరితురగాది వివిధపదార్థంబు లొసంగి విదేహజనవల్లభుం డవ్వసుమతీ వల్లభుని నిజపురంబున కనిచి పుచ్చె. రాజులకు జయాపజయంబులనుభావ్యంబులు. మదవిషాదంబు లనాదరణీయంబులు. అనవుడు ధర్మనందనుండు 'పరిజనంబులయందు గణంబులై యున్నవారిం బరిపాలించు సమ్యక్ప్రకారంబు సెప్పు' మనుటయు, నమ్మహీకాంతునకు శాంతనవుం డి ట్లనియె: ౩౭

—♦ ధర్మరాజునకు భీష్ముండు గణజనుల బాలించుప్రకారంబు సెప్పుట ♦—

క. విను, మర్థార్జకులును, గా
ర్యనిపుణమానవులు, నాయుధాజీవులుఁ, ద
క్కనుగలపనులజనులుఁ గల,
రనఘా, [1]యొక్కొండ్లవార లైనజనంబుల్. ౩౮

క. వారు గదా గణములు! పతి
వారలలోఁ గలసి మెలఁగువడువున నయ్యో
వారి తెఱఁగెఱుఁగవలయును;
వారికి నెమ్మి గలిగించువల నొదవుటకున్. ౩౯

---

1. ఒకతీరగల జనులు.

సీ. కుల మొక్కఁడైనఁ దేఁకువ లేక,
బుద్ధియు, శౌర్యంబుఁ బెంపును సరకుగొనక,
యెట్టివారలతోడ నెవ్వరైనను మత్స
రంబు గల్గుదురు [1]గణంబుజనులు;
దాన నంతర్భేద మైన, శత్రులు వాపి
కొంద్రు గొందఱ; [2]నది గ్రొచ్చు రాజ్య
మూలంబుఁ; గావున మున్ను భూపాలుండు
వారి నందఱఁ దగువచనరచన,

తే. నీగి, మన్ననఁ గలఁగంగనీక పొదివి,
యధికముగ గణముఖ్యుల నాదరించి
పనులు గొనునది తమలోనఁ బాయ కుండఁ;
బ్రోవు లెడలిన రాజ్యంబు పొలుపు దప్పు. ౪౦

క. ఏకార్యములను గణజను
లొక్కటియై మెలఁగు చున్న నుర్వీశునకుఁ
మిక్కిలి సిరి యగుఁ గావునఁ,
దక్కొని యరయంగవలయుఁ దగ గణవిధముల్. ౪౧

—◆ధర్మజునకు భీష్ముండు ధర్మసూక్ష్మత తెఱం గెఱిఁగించుట◆—

వ. అనుటయు, ధర్మజుండు 'ధర్మంబులు బహుశాఖలం గలిగి యుండు నన్నియు ననుష్ఠింప వచ్చునే? ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు?' ననిన మందాకినీనందనుం డతని కిట్లనియె: ౪౨

సీ. విను, తల్లియును దండ్రియును గురుండును సేవ
నీయులు; సద్భక్తి నిత్యనిరతి
వారలఁ గొలుచుచు వా రెద్ది సెప్పిన
నది యాచరించుట యధికధర్మ;

1. = సమూహము; సేనావిశేషము. [ఇరువదియేడురథములు, అన్నియేనుఁగులు, ఎనుబదియొక్క గుఱ్ఱము, నూటముప్పది యేవురుకాల్బంటు (= పదాతులు)ను గలది.]
2. = రాజ్యమూలమును జెఱచును. కొ- (తల + కొని =) పూనుకొని.

మాఁగమత్రయమును నగ్నిత్రయంబు లో
కత్రయంబును దేవతాత్రయంబు
ననువస్తువులు; వార లందును జనని గౌ
రవమున నెక్కుడు; రాజవర్య,

తే. యీజగంబున దివమునం బూజవడయు
మాతృభక్తుండు; పితృభక్తిమానసుండు
నట్ల; యవ్యయానందసంప్రాపణంబు
గురుపదాబ్జసమారాధకుండుఁ గాంచు. ౪౩

వ. అనవుడు, నజాతశత్రుండు గంగాపుత్త్రునితో 'సత్యానృతంబులు జగంబులం బరఁగియుండు; పురుషుండు వానియెడ నెబ్భంగివాఁడై ధర్మపరుం డగు?' అని యడిగిన, నమ్మహీపతి కమ్మహాత్ముండిట్లనియె:

సీ. సత్యంబు వలుకుట సర్వధర్మములకు
మిక్కిలి; యనృతంబు మేటిపాత
కము. తద్విశేషంబు గలదు చెప్పెద: నొరు
నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచుపాతకులతో సూనృతంబాడుట
పాపంబు; బొంకులు వలికి యట్టి
వారి హింసించుట వరధర్మ; మిది యొక్కఁ
డేల?- భూతములకు హితము సేయు

తే. బొంకులెల్లను ధర్మముల్; భూతబాధ
కంబు లగునిక్కములు పాతకములు- వినుము,
భూతముల దుష్టశిష్టత్వములు వివేక
సూక్ష్మతావేద్యములు;- వానిఁ జూడవలయు. ౪౪

పాపనిస్తరణప్రకారము

వ. అనినం, గాంగేయాగ్రజుం 'డెట్టివారు దురితంబులు నిస్తరింప నేర్తురు?' అని యడిగిన సురనదీసూనుం డిట్లనియె: ౪౫

సీ. వర్ణాశ్రమాచారవంతులు, నవిషయా
సక్తులుఁ, బ్రతికారశక్తు లయ్యుఁ
దిట్టులు వడి సైఁచు ధీరు, లుదారులు,
నతిథిపూజకులు, నధ్యయనరతులు,
నగ్నిహోత్రపరులు, నాజిఁ బిఱిందికి
నడుగు వెట్టక తెగి నడచువారు,
సత్యవాదులు, సాధుజనపోషకులు, సర్వ
దేవతాసములు నై భవ మొందు
తే. నిలిచె నమ్మూర్తి భక్తిమైఁ గొలుచువారు-
దురితదుర్గముల్ నిస్తరింతురు.-పురాణ
పురుషుఁ డవిచింత్యుఁ డచలుండు పుండరీక
లోచనుండు సద్భక్తులఁ గాచు నధిప. ౪౭

క. విను, మగ్గోవిందుఁడు, సఖుఁ
డును బంధుఁడుఁ గార్యకర్తయుఁడు నై నిన్నుం
గొనియాడు చుండ దురితం
బను పేరును గలదె నీకు ననఘచరిత్రా? ౪౮

ఆ. ఇంద్రుఁ డజుఁడు విష్ణుఁ డెవ్వాని వైదిక
స్తోత్రములఁ బ్రసాదితునిఁగఁ జేసి
యేలమిఁగొలుతు?-రమ్మహేశ్వరుఁ గొలుచువా
రెందు నెపుడుఁ గీడు నొంద రధిప. ౪౯

క. విను, మివ్వాక్యము లెవ్వఁడు
గొనియాడుఁ బఠించు విప్రకోటికిఁ జెప్పుఁ?-
జననాథ, వాఁడు దురితం
బనుదుర్గము నిస్తరించు నక్లేశమ్మునన్. ౫౦

వ. అనిన విని ధర్మనందనుండు ౫౧

## —♦ వ్యాఘ్రగోమాయుసంవాదము. ♦—

క. సౌమ్యు లసౌమ్యులభంగి, న
సౌమ్యులు సౌమ్యులవిధమున, జనవర, చిత్తా
గమ్యతఁ దోఁతురు; వారిని
సమ్యఙ్నిశ్చయతఁ గాంచుచందము సెపుమా. ౯౪

వ. అనుటయు, నాపగాతనయుం'డేతత్ప్రయోజనం బైన వ్యాఘ్రగోమా
యుసంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపుము' అని యిట్లనియె:

ఆ. పురిక యనఁగఁ బరఁగు పురిఁ బౌరికుం డను
నృపతి క్రూరకర్మనిష్ఠఁ బరఁగు;
నవ్విభుండు సచ్చి యధిప గోమాయువై
పుట్టెఁ బుట్టుఁగు బుద్ధితోడ. ౯౫

వ. ఇబ్భంగిం బుట్టినయానక్క, మహితపవిత్రశీలం బయి మాంసంబు
దినక హింససేయక, వనంబునం బతితఫలంబులుఁ బత్త్రంబులు
నాహారంబులుగా వర్తించుచుండఁ, దోడినక్కలు 'ఇది యేటి
వ్రతంబు! మాంసం బేము దెచ్చి యిచ్చెద ముపయోగించి సుఖివై
యుండుము' అని ప్రార్థించిన, నమ్మెయికిం జొరక దృఢనిశ్చయం బై
యుండె. అంత నొక్కనాఁడు మృగంబుల కెల్ల ముఖ్యం బైన
శార్దూలం బత్తెఱం గెఱింగి వచ్చి యగ్గోమాయువుతో నిట్లనియె:

క. 'నిను సౌమ్యుఁడ వని యెఱిఁగితి,
ననఘా, ననుఁ జెంది నిలిచి యతులసుఖము లం
దిన మేలు; నన్నుఁ గూర్రుం
డనులోకం;-బిదియు నుడువ నగు నీశిక్షకు. ౯౬

వ. 'నాతోడిబాంధవంబు సేయుము' అనిన, నగ్గోమాయు విట్లనియె.

క. 'నీ వాశ్రయణీయుండవు
గావే! విను, భోగపరము గాకున్నది మ
ద్భావం; బటు గావున నా
కీవచనము లింపు సేయ విద్ధగుణాఢ్యా. ౯౭

వ. 'అది యట్లుండ, భోగంబులు గా కున్న నేమి? నీకుం గార్యాకార్యంబులు నాయెఱింగిన తెఱంగున నుపదేశించుచు మైత్త్రి పాటించి యునికి గర్హణీయం బై భవదీయమూలభృత్యు లసూయ సేసి భేదింతురు; దాన నొప్పమి వచ్చు. నీవు, వారలు గలంచినఁ గలంగకుండుటకును, నాబుద్ధి పాటించుటకును సమయంబు సేసి నన్ను మన్నించికొని యుండుము. అట్లైన నీకడ వర్తించి యుండెద'-ననుటయు, నావ్యాఘ్రం బాభంగి నడపం గలయది యై, ౫౯

ఆ. సంతసంబుతోడ సమయంబు సేసిన
నెలమిఁ బొంది నక్క పులికి బుద్ధి
సెప్పికొనుచుఁ దగ వసించెఁ దదీయ ని
కేతనమునఁ బులియుఁ బ్రీతి సలిపె. ౬౦

వ. కొండొక కాలంబునకు నమ్మృగరాజు మన్నించువిధంబును, నగ్గోమాయువు దదీయ హితాహితంబు లరసి బుద్ధిసాచివ్యంబు సేయు తెఱంగును జూచి చూపోపక యప్పులిమూలభృత్యులు దమలోనం గూడికొని యొక్కనాఁడు- ౬౧

క. పులి నమలెడుమాంసము వెర
వలవడఁ దా మపహరించి, యానక్కకు ని
మ్ముల నిల్వం గావించిన
నిలయంబున గొందిఁ బెట్టి నేర్పారంగన్- ౬౨

వ. ఉన్నంత, భక్ష్యపదార్థపరిరక్షణంబును దాన చేయునది గావున నగ్గోమాయు వప్పనికిం జొచ్చి మాంసంబు గానక యెవ్వరేని మ్రుచ్చిలి కొనుటగా నెఱింగినది యై శార్దూలంబున కెఱింగించిన, [1]ఆమ్రుచ్చిమి యప్పులి యరయం దొడంగిన నెప్పటికపట భృత్యులు గపటోపాయంబు వన్ని, ౬౩

క. [2]నెమకుపరివార మమ్మాం
సము గను తెఱఁగును ఘటింప శార్దూలము చి

---

1. =ఆ దొంగతనమును 2. =వెదకునట్టి పరిజనము.

త్రమము నక్కవలన విరస
త్వము నొందిన నెఱిఁగి భృత్యతతి యి ట్లనియెన్.

ఆ. 'నక్క కేటి వ్రతము క్రుక్కి యిమ్మాంసమ
మపహరించినపుడ! యబ్బ నేని
నేమి యైనఁ జేయు;- నిది పాపశీలంబు;
కపటధర్మకంచుకంబు నువ్వె!

క. 'తా నట! మాంసముఁ దిన దట!
యీనక్కయు [1]చేలుపెట్టె నిన్నాళ్లును; నీ
యాన మఱుమాట వలుకం
గా నోడితి మిదియు నడపఁ గార్యములయెడన్.' ౬౬

క. అనుటయు మృగపతి మనమునఁ
[2]కన లడరిన నక్కఁ బట్టఁగాఁ బంచి వధిం
పను బుచ్చె; దాని నంతయు
విని యప్పులితల్లి [3]కరము వెసఁ జనుదెంచెన్. ౬౭

వ. చనుదెంచి యవ్వ్యాఘ్రవరునితో నిట్లనియె: ౬౮

క. ఇట్టివి కృత్రిమములు గల;
వట్టిదె యీనక్క?- [4]చేల వైతివి! భృత్యుల్
[5]పుట్టినకోలెను కుటిలత
లెట్టెట్టివి సేయ రకట [6]మెఱుక గలఁగెనే! ౬౯

తే. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు, లధికు
వలన హీనులు, రూపసి వలనఁ జెనఁటి
వా, రసూయలు సేయుదు [7]రీరసమున;
నింత మెఱుగంగవలవదే యీవు గొడుక? ౭౦

---

1. = మోసపుచ్చెను. 2= కనలు + అదరిన = కోపము మిక్కుటము కాగా. 3= అతివేగముగా. 4= యూథుఁడ వైతివి. 5. = పుట్టినది మొదలుగా. 6 = తెలివికలఁతవడెనా! 7= ఈర్ష్యతో.

క. ధర్మ మధర్మముభంగి, న
ధర్మము ధర్మంబుమాడ్కిఁ, దనయా, తోఁచుఁ.
నిర్మలమతి నరయ వలయు
ధార్మికతన కోరువాఁడు దన కేర్పడఁగ౯. ౨౧

క. విను, మీగోమాయువు వ
చ్చినయంతటనుండి మనకుఁ జేసినహితముల్
గనికొన వలవదె? యీతర
మునవాఁ డిట్లు సేయఁ డను సమూహాయు వలదే? ౨౨

క. హితుఁ డగుమంత్రిం, గుటిలుల
యతికపటోపాయములకు నగపడి చెఱుప౯
మతిఁ దలఁతురె? పతి సుపరీ
క్షితంబు గావింప కొకటి సేయం దగునే? ౨౩

చ. అనవుడు, నక్కఁ రాఁ బనిచి యప్పులి గాఁగిటఁ జేర్చి బాష్పము
ల్గనుఁగవఁ గ్రమ్మ నంబలుకులం దగఁ బెద్దయు గారవించిన,
"న్వినుము, మృగేంద్ర,మున్నటుల నీవుసభ౯ నను 'వీఁడుమంచివాఁ
డనికొనియాడి యిప్డు దెగ టార్చితి పెంపును నాదుమానముఁ.

వ. అని పలికి యగ్గోమాయువు వెండియు, ౨౪

క. నను నీవు పదస్థునిగా,
ననఘా, చేయంగఁ దలచినప్పుడ నీభృ
త్యనికాయము[1] కలపులఁ బడ
కునికియు నాబుద్ధి వినుటయును మఱవమికి౯- ౨౫

వ. బాస సేయవే? యట్లుం గాక- ౨౬

ఆ. ఎఱిఁగి యైన, నెఱుఁగ కేనియు నొక్కని
భంగపెట్టి, పిదప సంగతుఁడుగ

1=(సేవక సముదాయము యొక్క) ఉపదేశములచేఁ బడకుండునట్లును...

జేసికొనుట మేలె సిరి గలవారికి?
[1]నట్టినిలుపు వాని కగునె హితము? ౭౮

క. అని పాసి యరణ్యమునకుఁ
జని, యనశనదీక్ష నొంది సద్భావఖ్యా
తి నెఱయఁ బరమస్థానం
బున కగ్గోమాయు వరిగెఁ బురుషవరేణ్యా. ౭౯

వ. ఈకథ పూర్వాపరవాక్యంబులయందలి తాత్పర్యంబు నిరూపించి-

క. వాపిరిమాటలఁ దేలక,
భావంబునఁ గీడు మేలుఁ బరికించి, యస
ద్భావుని సద్భావుని, నవ
నీవర, యేర్పఱుప నెఱుఁగ నేరఁగ వలయున్. ౮౧

—♦ భీష్ముఁడు ధర్మరాజునకు సహాయసంపన్నత్వం బావశ్యకం బగుట సెప్పుట ♦—

వ. అనిన విని సంతోషించి, కౌంతేయాగ్రజుం, 'డేమిభంగివర్తనంబున భూపాలుండు సుఖియై యుండు? అనుటయు నన్నరపతికిం గురుపితామహుం డి ట్లనియె: ౮౨

సీ. [2]ఆలస్యమును నసహాయత్వమును నొప్ప;
వవి లేనిపతి సుఖియై చరించు;
విను, తొల్లి యొకయుష్ట్రమనితరసాధ్యత
పంబు సేయఁగ, మెచ్చి బ్రహ్మవచ్చి
'యర్థించినది యేమి?' యనిన, నాలొట్టెనుఁ
'గొప్ప నామెడ శతయోజన ప్ర
మాణం బగుట కోర్కి వాణీశ' నావుడు
'నట్లగుంగా' కని యతఁడు సనియె.

తే. నదియు వరగర్వమున సహాయంబు నొల్లక
కలసభావంబుతో నుండి, వలచి యొక్క-

---

1 = అట్టి నిలుపుకొనుట (భంగపడిన) వానికి మేలగునా? 2= ఆలసత్వము - సోమరితనము.

నాఁడు దనయుత్తు సాఁచి కాననములోన
దీనుఁ గొనిమేయుఁగాఁ బెనువానవచ్చె- ౮౩

క. వచ్చినఁ, దనమెడ సాఁగిన
యచ్చటిగుహలోన నుత్తమాంగం బిడి తా
నిచ్చమెయి నిదురవోవఁగ ,
విచ్చలవిడి నొక్క నక్క వెలఁదియుఁ దాన్ - ౮౪

వ. ఆగుహ సొచ్చెం; జొచ్చి యాఁకటిపెల్లున నాలుం దానును నొక్కట నాలొట్టెనుఁగుకుత్తుక కబళించి నెత్తురుం గండలు నొండొండ మ్రింగం దొడంగిన, నది మేలుకని మెడ పొరల్చునంతకు నానక్కలు నరంబులు ద్రెవ్వం గఱచిన, నెఱిదప్పి యయ్యుష్ట్రంబు నిర్గతప్రాణం బయ్యె. అట్టిచందంబు గాక నీ వనాలస్యుండవును, సహాయసంపన్నుండవును నై నెగడుము. అనిన, నజ్జగతీశుం డతనితో, 'శత్రుం డధికుం డైన నల్పబలుం డగురా [1]జేయోజ నాపద నిస్తరించు?' అనవుడు, నతండు 'సముద్రసరిత్సంవాదం బాకర్ణింపుము. దాన నీయడిగినయర్థంబు దేటపడియెడు' నని పలికి యి ట్లనియె: ౮౫

— సముద్ర సరిత్సంవాదము —

తే. 'ఉదధి సుఖగోష్ఠి నున్నప్డు నదులతోడ,
మీతటంబులతరువులు మీరు వొంగి
తెఱిమి పాఱినఁ గూలు; [2]వేతసము లేల
పెఱికి పో? వవి మీకేమి ప్రియ మొనర్చె? ౮౬

వ. 'వాని నున్మూలింప మీకు శక్యంబు గామింజేసియో వానికిం జేటు వాటిల్లదు! ఇది యేమి?' అనవుడు గంగ యి ట్లనియె: ౮౭

క. బిగు వెడలక నిలిచి పడున్
[3]నగములు; వేతసచయంబు నమ్రం బై పె
ల్లగుమావేగము గడపి యె
సఁగుఁ బూర్వస్థితిన బ్రిదుకు సమకూరంగన్. ౮౮

1= ఏయోజ=ఏరీతిగా 2. ప్రబ్బలిచెట్లు (గుంగజాతి గోవి) ఎందుచేత నిర్మూలనము కావు? 3=వృక్షములు.

వ. అనియె. ఆవ్యాఘ్రబ్బలిచెట్ల తెఱంగు కనికొని, ౮౯

ఆ. అరినృపాలు పెంపు, నాత్మీయశక్తియు
నెఱిఁగి, మూర్ఖవృత్తి నెదురుపడక
యుచితవృత్తి నతని యుద్ధతి [1]మేపడిఁ
గడపి, హీనబలుఁడు సెడకనిలుచు. ౯౦

వ. అనిన విని యుధిష్ఠిరుండు, 'తగుపదంబులకుఁ గులవంతు లగుపరిజను
లు దొరకొనకున్న నరనాథుండేమి సేయంగలవాఁడు?' అని యడి
గిన నప్పుడమి జేనికి భీష్ముం డి ట్లనియె: ౯౧

—♦సత్కారనీచత్వము దెలుపునట్టియితిహాసము.♦—

సీ. వినుమొక్కయితిహాస: మనుపమం బగుతపం
బునఁ బేర్చువాఁ డొక్క మునివరేణ్యు
నాశ్రమంబునఁ దద్దయావిశేషంబున
నఖిలజంతువులును నచట నచట
వసియించి సుఖముండు; వానిలో [2]నొక్కకు
ర్కుర మెప్డు భక్తిమైఁ గొలిచి తిరుగు;
నమ్ముని మెలగినయచట నెల్లను దాను
వర్తింప, నొక్కదువ్వ వైర మొత్తి,

తే. కఱవవచ్చిన నమ్ముని కడకుఁబాఱు
తెంచె; నాకుక్క నాతఁడు దీప్తరూప
మొనదువ్వఁగాఁ జేసిన నది గడంగి
కవియు, భయము నొంది పాఱె మున్కవియుదువ్వ. ౯౨

సీ. అట్లు బెబ్బులి వచ్చి యడరిన, బెబ్బులిఁ
గాఁ జేసి గెలిపించెఁ గరుణ మెఱయ.
నొకమత్తకరిఁ జూచి యోటమై నోదిగిన
నుద్ధతకరి జేసె, యొసఁగె జయమ్ము;

1=ఆడఁదనవమైగడపి; ఉపాయమున గడపి. 2 [illegible] పగపట్టె.

సింహంబుదెస భీతిఁ జెంది ప్రార్థించిన,
ఘనసింహముఁగఁ జేసి గర్వ మిచ్చె.
శరభంబుధాటికిఁ జకిత మైన, నుదగ్ర
శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె.

తే. నిట్లు దివసక్రమంబున నెక్కుడైన
సత్వముగఁ జేయఁగాఁ గుక్క శరభభావ
మండితం బయి తిరుగుచు నుండి, పూర్వ
వాసనానీచ మగుమనోవర్తనమున— ౯౩

వ. ఇట్లని విచారించె: ౯౪

చ. ననుఁ గని యొండుసత్త్వము మనంబున బెగ్గిలి పాఱునప్డు డి
మ్మునివరుఁ డిట్లుపోలెఁ గృప మొక్కలమై శరభంబు గాఁగఁ జే
యునొ తగ దాని! న ట్లయిన నుద్గతి నాకుఁ జరింప లేదు గా
వున, నితనిన్ వధింతు వెరవున్ బలమున్ సరి నుల్లసిల్లఁగన్. ౯౫

తే. అనువిచారంబు దివ్యబోధాఢ్యుఁ డైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి యీ యధమజాతి
యున్నతస్థితి మెలుఁగునే? మున్నుపోలెఁ
గుక్క యయి యుండుఁ గా కన్నఁ గుక్క యయ్యె. ౯౬

వ. కావునం గులహీనులు మాననీయులుగారు. అట్లుం గాక విశేషం
బాకర్ణింపుము: ౯౭

చ. కుల మని పట్టి చిత్తమునఁ గూరినకీ డరయంగ లేక య
గ్గలపువిభూతి దుష్టునకుఁ గల్గఁగఁ జేయుట గర్జ మెట్లు? భృ
త్యులమది యున్నరూ పరసి యుత్తమ మధ్యమ హీన రూప మా
తృలకుఁ దగంగ నయ్యయిపదంబుల నిల్పుట నీతి భర్తకున్. ౯౮

క. శౌర్యము సత్యంబును స
త్కార్యజ్ఞానమును భక్తితాత్పర్యము గాం
భీర్యముఁ గలిగినఁ, గురుకుల
వర్య, కులం బేల?— సిరికి వాఁ డుత్తుఁ డగున్. ౯౯

క. ఇది సిద్ధాంతం బన రా,
దుదితయశా, యెట్టు లైన నున్నతవంశున్
విదితగుణుం డగుపురుషు
న్నెదకి నిలుప వలయు మాననీయపదమునన్. ౧౦

వ. అది యెట్లం టేని, ౧౦

ఉ. ఒక్కటియేను జెప్పెద: మహావ్యాఘ్రముఁ గేసరి కైనఁ దోడు
నుక్కును లావునుం గలుగు నుజ్జ్వలసత్త్వచయంబుఁ గొన్నఁ
కెక్కుడుకృత్యముల్ నడప నెట్లగు? నిట్టివి సాలు నంచుఁ దాఁ
గుక్కలఁ గూర్చి చేయఁ దనకుం దలఁపుల్ దలకూడ నేర్చునే

చ. వలనుఁ గులంబు లేనిపరివారము గోటియు నేల? నేర్చు న
గ్గలికయు, భక్తి పెంపు మదిఁ గల్గి సుహృజ్జనమిశ్ర మాబలం
[1]బిలువడి గల్గెనేని నిల యెల్లను నేలఁగఁ జాలు; [2]వేయుర
జ్జులు విను రాజు నేర్పరియు శూరుఁడుఁ గా వలయుం జుమీ నృపా

వ. అని చెప్పి వెండియు, ౧౦౨

సీ. వినుము, మయూరంబువిధమున బహుచిత్ర
భంగులఁ బ్రజయంతరంగ మాత్మ
వశము సేయుచు, మృదువాక్యముల్ వలుకుచు,
మంత్రింబు నెడఁ దనమాట వెడల
కునికి, శరత్సమయోచితక్రియచాడ్పు
గాఁగ, ధర్మంబు శిఖాప్రకార
మొంది తనర్చ, సముల్లాసిపక్షమై
యానంబు గైకొంచు, నధికతరస,

తే. మున్నతత్వంబు సంశ్రయయోగ్య మగుటఁ
గాంచుచును, దటి వచ్చినఁ గారుగాల
మేఁచు తెఱఁగున నేఁచుచు, నీచకుటిల
గతులఁ దునుముచు నెగడ్పుట పతికి నీతి. ౧౦౩

---

1= మంచియింటిలోనము; కులీనత; మంచినడత 2= వేయిపాల్లుమాటల,

క. కిరణములభంగిఁ జతురపుఁ
బరిజనముల నెందుఁ బొనిపి, పరకృత్యంబుల్
నిరతంబును గనుఁగొనుచును
దరణికరణి వెలుఁగు టొప్ప ధరణీశునకున్. ౧౦౬
తే. అలుక గూరిమి ఫలదంబు లగుచు నుండఁ,
గృత్యములఁ దా నెఱుంగుచు నిత్యవిధుల,
నాయములును వ్యయంబులు నరసి కోశ
సంపదలు గాంచి యునికి రాజన్యగుణము. ౧౦౭
వ. అనిన విని, యుధిష్ఠిరుండు 'రాజులకు దండంబు సర్వసాధారణంబు.
తదీయస్వరూపంబు విన వలతుం జెప్పుము' అనిన నన్నరదేవునకు
దేవవ్రతుం డి ట్లనియె: ౧౦౮

—◆ భీష్ముఁడు ధర్మజునకు దండనీతిప్రభావం బెఱింగించుట ◆—

సీ. అసితోత్పలచ్ఛాయమై దంష్ట్రికాచతు
ష్టయమును, భుజచతుష్టయము, జిహ్వి
కలు రెండుఁ, బాదాష్టకంబును, [1]శంకుక
ర్ణములును, బహునయనములుఁ గల్గి,
యూర్ధ్వరోమంబులు, నుగ్రారుణాస్యంబుఁ
గపిలజటాజాలకంబు నొప్ప,
నసి గదా శక్తి శరాసన ముసల చ
క్ర ప్రాస శర తోమర త్రిశూల
తే. పరశుముఖసాధనంబులఁ బాపజనులఁ
దరతరంబ సంభేదన తాడనాదు
లైనవివిధప్రహాతుల నే పడఁచుచును జ
రించుదండంబు సుజనులు ప్రియము నొంద. ౧౦౯
సీ. పరుఁ డసంగుఁడు ధర్మపాలుండు ధర్ముండు
విజయుండు శాస్త్రంబు విశసనుండు
గ్రహ మక్షరుఁడు ప్రజాగరము దురాసదుఁ
డసి సత్యగుండు నిత్యగుఁడు శాస్త

1 = అసంఖ్యమగు చెవులు.

ప్రాగ్వచనుండు శస్త్రంబు బ్రహ్మము తీక్ష్ణ
వర్ముండు మనువు శివంకరుండు
కౌమారిసుతుండు శ్రీగర్భుండు వ్యవహార
తంత్రంబు సంగుప్తమంత్రి యనఁగఁ
తే. బరఁగు పేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ
డైనవిష్ణుండు దండ మై యాపహిల్లు;
శ్రీ సరస్వతి యనఁనివి శిష్టదండ
నీతినామాంతరంబులు నృపవరేణ్య. ౧౧౦

వ. ధర్మాధర్మంబులు, సుఖదుఃఖంబులు, నయానయంబులు, నర్థానర్థంబులు, బలాబలంబులుఁ, బ్రమాదాప్రమాదంబులు, మొదలైన సకలావస్థలును దండంబున సమ్యగసమ్యక్ప్రకారంబులం గలుగుం గావున. సమ్యక్ప్రకారంబుచేత దండంబున రక్షింపంబడిన ప్రజ రాజు నభివృద్ధి నొందించు. అట్లగుట దండంబు రాజునకుం బరాయణంబు. ౧౧౧

క. సత్యప్రకారధర్మము
నిత్యానుష్ఠేయ; మది సునీత మగుచు నా
దిత్యపతిఁ బ్రీతుఁ జేయఁగ
నత్యున్నతి నెసఁగు నాతఁ డన్నప్రదుఁ డై. ౧౧౨

వ. దానం జేసి దండంబు ప్రసన్నం బై వెలుంగు. తదీయాభిధానంబులు మఱియునుం గల వాకర్ణింపుము: ౧౧౩

ఆ. పురుషుఁ డీశ్వరుండు భూతాత్మకుండు జీ
వుండు ప్రాణుఁ డక్షయుండు సత్త్వ-
మనఁగ నేడు పేరు; లష్టమంబు ప్రజాప
తి యనఁ బరఁగు దండదేవు పేరు. ౧౧౪

## వసుహోముఁడు మాంధాతృనకుఁ జెప్పినదండోత్పత్తిప్రకారము

వ. దండంబు సాక్షాద్దేవుండు; అట్లగుటఁ దెలిపెడునది యొక్క యితిహాసంబు గలదు: అంగదేశాధీశుండు వసుహోముం డనురాజు

హిమశైలంబున ముంజపృష్ఠం బనం బ్రసిద్ధం బగుశృంగంబునకు దేవీసహితంబుగాఁ జని యందు వసియించి, మునిగణపూజితం బగువృత్తంబున సుదాత్తుం డయి యుండు. అమ్మహీపతికడకు మాంధాతృండు సనుదెంచి సవినయంబుగాఁ బ్రణమిల్లిన నబ్జాభ వల్లభునకు నతం డర్ఘ్యపాద్యాదు లగునుపచారంబు లాచరించి 'వచ్చినపనియేమి?' యని యడిగిన, నప్పుడమిఱేఁడు, 'సవిస్తరంబుగా దండప్రకారంబు వినుటకై నిన్నాశ్రయింప వచ్చితి' అనవుడు నమ్మహాత్ముం డతని కి ట్లనియె: ౧౧౫

సీ. అజుఁ డధ్వరంబు సేయంగఁ దలఁచి ఋ
త్విజు నాత్మసదృశుని వెదకి యెందుఁ
గానక, తా నొక్కగర్భంబు ధరియించి
వేయేండ్లకును దుమ్మి వెలువరించె;
[1]క్షుతసంభవతఁ జేసి క్షుతుఁ డనుపేరిటఁ
బరఁగెడు నాప్రజాపతియు ఋత్వి
జుండుగఁ గ్రతు వొనర్చుచునుండ నంతర్హి
తం బయ్యె వలచుచందమున నడచు

ఆ. నట్టి దగుట దండ; మధిప, కార్యాకార్య
తంత్రభేద మెడలె; దానఁజేసి
మహి గలంగెఁ; గడు నమర్యాద వర్తించెఁ;
గమలజుండు విష్ణు కడకుఁ జనియె. ౧౧౬

క. చని సంప్రార్థించి యతని
గొని రుద్రునిఁ గాంచి నీసఖుం డీతఁడు వ
చ్చినకార్యము గృపతోడను
విను మని దండంబు తెఱఁగు వినిపించెఁ దగన్: ౧౧౭

వ. అట్లు లోకరక్షకుం డగుపుండరీకాక్షు దండగొని దండాభావంబున జగంబు గలంగు టెఱింగించిన, నవ్విరించిపలుకులు మనస్కరించి

1 = తుమ్ము వలనఁ బుట్టినవాఁ డగుటచే క్షుతుఁడు.

మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండనీతి
కాశ్రయుం డై పరఁగు చుండె. ౧౧౮

సీ. వినుము, ఋగ్వేదాది వేదముల్ నాలుగుఁ,
గల్పాదు లైనయంగంబు లాఱు;-
బెరసి విద్యలు పది. పేర్చుపురాణంబు
లనియును నొకవిద్య; యధిప, ధర్మ
విదులు సెప్పెడుశాస్త్రవితతి యంతయు నొక
విద్య; సర్వన్యాయవిస్తరంబు
నొకటి, మీమాంసదా నొక్కటి,- యిట్టులు
వివరింపఁబడునాల్గు విద్య లయ్యె.

తే. వైద్య కోదండ గాంధర్వ విద్య, లర్థ
శాస్త్ర మగునీతివిద్య- తత్సహితవృత్తి
వెలయఁగా బదు నెనిమిదివిద్య లభవుఁ
డేర్పరించె జగత్త్రయహితము [1]పొంటె. ౧౧౯

వ. ఇట్లు సమకట్టి దండఁబును, దండనీతిప్రపంచంబు లయినయవ్విద్య
లను, విష్ణువశగతంబులు సేసె. ఆసర్వేశ్వరుండ త్తమ్మిచూలికిఁ దుష్టు
ఘటించి యీభంగిం బ్రజాపతిప్రసవంబు గావించె. దండనీతి సమ
గ్రరూప యై చెల్లె, ఎల్లజగంబులుం బ్రియం బందె. అరవిందభవుని
యాగంబును సుప్రయోగం బై నడచె. విష్ణుండు దండనీతిశాస్త్రంబు
సకలంబు నాంగిరసున కిచ్చె. ఆంగిరసుం డింద్రమరీచులకు, మరీచి
భృగునకు, భృగుం డనేకమునులకు నిచ్చె. ఈ క్రమంబున నది జగం
బులంబరఁగె-దండంబుజాగరణంబున లోకంబు మర్యాదామహితం
బై వర్ధిల్లె కపర్ది శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుండు ఉమాపతి
యను పేళ్ళం బరఁగునద్దండదేవుని నతులధర్మంబున నయించు
భూపాలుం డైహి కాముష్మికసిద్ధులం బొందు. ౧౨౦

క. అని వసుహోముఁడు సెప్పిన
విని, మాంధాతృండు దండవిభవజ్ఞుం డై,

1. =కొఱకు.

యనఘ, మహీపరిపాలన
మొనరించెను నీతి దండయుక్తి వెలయఁగన్. ౧౨౧

క. ఈ యాఖ్యానము విని భూ
నాయకుఁ డెవ్వఁడిలాజనంబుల నతుల
న్యాయంబునఁ బాలించుఁ, జి
రాయుస్స్థిరపుణ్యభాగి యగు నతఁడు నృపా. ౧౨౨

—♦ భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మార్థ కామంబుల తెఱం గెఱింగించుట ♦—

వ. అనిన విని, ధర్మనందనుండు, 'ధర్మార్థకామంబుల నడవడి యెట్లయిన మేలై చెల్లు?' నని యడిగిన, భీష్ముం డి ట్లను: తొల్లి యాంగరిష్ఠుం డనునరవరుండు కామందకనాముం డైన ముని నిట్లని యడుగ నతం డతనికిఁ జెప్పినభంగిం జెప్పెద నాకర్ణింపుము: ౧౨౩

చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగుఁ; గామతంత్రనిరతుఁ డైనవాఁడు సుపథప్రతిపన్నుఁడు గాఁడు; దుష్టదండన మొనరింపఁ; డట్టిపతి డాయరు సాధులు నార్యులుఁ సుహృజ్జనులును; దానఁ జేటు నగుఁ, జావును బాటిలు నెల్లభంగులన్.

ఉ. కావున, ధర్మసిద్ధికి ముఖం బగునర్థమునందు నిష్ఠమై
నేవిధి నైన ధర్మరతి యెక్కుడుగా మదిఁ జొన్పి టొప్పఁ; గా
మావిలబుద్ధిగాక యుచితాగతసౌఖ్యము లాచరించుచుఁ
భూవిభుఁ డెప్డు భూమిసతిఁ బొంది రమింప మహోన్నతుం డగున్.

క. అన విని, ధర్మతనూజుఁడు,
'జనమ్ము శీలమ్ము నధికసంస్తుత్యముగాఁ
గొనియాడుఁ; దత్స్వరూపం,
బనఘా, వివరింపవే దయారతి నాకున్.' ౧౨౬

వ. అనుటయు నాపగాతనయుండు విను మని యతని కి ట్లనియె. ౧౨౭

క. ము న్నింద్రప్రహ్లాదసంబున
నున్నతిమెయి ననుజ తనుజయుక్తంబుగ నీ

పున్న తెఱఁగు దుర్యోధను
కన్నులు గమరింప నతఁడు గడు వగ నొందెన్. ౧౨౯

వ. భవదీయసభయొప్పునకును, రాజసూయంబు చెల్లినయుల్లాసంబునకును, అట్లసహ్యపడి, ధృతరాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చలుం బది వేవురు భూసురులు పసిండి పళ్ళెరంబులం బాయసాహారంబులు గొనుట మొదలు గాఁగ లక్ష్మి పెంపు పుగ్గడించి, తనవగవు దోఁపం బలికిన, నతం డతని కిట్లను: 'మధురాన్నపానమణిభూషణవరవాహనాదులం జేసి యుజ్జ్వలం బై యున్నది గాక నీయైశ్వర్యం బస దే? పాండవాగ్రజుం డెక్కుడు మెఱసి యునికియుం గలదు ; వినుము చెప్పెద :

ఆ. శీలవంతు లైనసిరిఁ బొందుదురు ధర్మ
తనయునింటిసిరికి నెన యనంగ
నెక్కుడనఁగ; లక్ష్మి యొసకం బెసఁగ నీవు
శీల మలవరింపు చిత్తమునను. ౧౩౦

వ. మాంధాతృండు నాభాగుండు మొదలయిన మేదినీపతులు శీలంబునం గాదె యీ లోకంబునం బెంపు వడసిరి! ఇవ్విషయంబునకు నొక్కయితిహాసంబు గలదు; ఆకర్ణింపుము: ౧౩౧

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం
డనిమిషపతి రాజ్యలక్ష్మి యతులితశీలం
బునఁ గొని, త్రైలోక్యంబును
దనకు వశగతంబు సేసె ధర్మం బలరన్. ౧౩౨

క. దానికి రోసి బృహస్పతి
తో నమరేంద్రుండు 'మేలు దొరకొనువిధ మె
ట్లో!' నావుడు, 'భార్గవునిం
గానఁగఁ జను మతఁడు సెప్పఁ గరుణాన్వితుఁ డై' - ౧౩౩
అని గురుఁడు పంప, నింద్రుఁడు
సని భార్గవుఁ గాంచి, 'మేలు సమకూరు తెఱఁ,

గనఘా, యుపదేశింపవె'-
యనినం,-'బ్రహ్లాదుఁ డెందు మతఁ డెఱిఁగించున్. ౧౩౪

ఆ. 'అతని నాశ్రయించి యువ్వర విప్పించి
కొనిన మేలు వొందు' ననియె భార్గ
వుండు. వజ్రి బ్రాహ్మణుం డయి ప్రహ్లాదుఁ
జేరి శిష్యవిధులు సేయుచుండె. ౧౩౫

వ. అంత నద్దానవేంద్రుండు ప్రసన్నుం డై భూసురాకృతి యయినసుర
పతితో సంభాషించిన, నతండు, 'నీకుఁ ద్రైలోక్యరాజ్యంబుసంప్రాప్తం
బైనకారణం బేమి యెఱింగింపవే'? యనుటయు, ౧౩౬

ఆ. దనుజనాథుఁ డిట్టు లను: 'రాజ ననుగర్వ
మున ధరామరులకు మనసు గందఁ
జేయ నెపుడు నే ననసూయుడు; లమ్మహా
త్ములకు ధనము లిత్తు నెలమితోడ. ౧౩౭

వ. 'వారలు మెచ్చునట్టి శీలంబునం బ్రవర్తిల్లుదు; దానంజేసి మహో
న్నతుండ నైతి'. ౧౩౮

క. అనవుడు, 'నీశీలము నా
కనఘా, దయనొసఁగవే! మహాత్ములఁ దగఁ జెం
దినవారు బ్రదుక వలదే!'
యని దీనత దోఁప ననిమిషాధిపుఁ డరిగెన్. ౧౩౯

క. విని ప్రహ్లాదుఁడు, గృప దన
మనమునఁ గదురంగ విప్రమాత్రుఁడు గాఁ డీ
తనిభంగిఁ జూడ ననువెఱ
వును బుట్టఁగ నిచ్చె శీలముం జెం పెసఁగన్ ౧౪౦

తే. వడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ; దదనంతరంబ యద్దనుజవరుని
తనువునం దుండి తేజిష్ఠతనువిలాసుఁ
డైనపురుషుండు వెడలిన నతఁడు సూచి- ౧౪౧

'నీ వెవ్వండవు' అన, నప్పురుషుం డేను శీలంబ; నీ విచ్చినయవ్విప్రువాల
వసియింపం జనియెద' అని చెప్పి పోయెను. తదనంతరంబ క్రమంబు
నం దేజోమయరూపంబులు నిజదేహంబుననుండి నిర్గమింప నద్దాన
వేశ్వరుం డడుగుచు, ౧౪౨

క. ఉత్తమధర్మము సత్యము
వృత్తంబు బలంబు నగుట వినఁబడి బడిఁ ద
చ్చిత్తము విషాద మంద మ
హోత్తరమూర్తి యొక వారిజానన వెడలెన్. ౧౪౩

క. వెడలిన, 'నీ వెవ్వత?' వని
యడిగిన నాతనికి, నిట్టు లను దీనత న
ప్పడఁతి: 'సిరి నేను; బల మె
క్కడకు నరుగు నందుఁ బోవఁ గడఁగి వెడలితిన్.' ౧౪౪

చ. అనిన, భయంబు నొంది యతఁ డాయింతితో: 'పరమేశ్వరీ, మహా
వినయమతిన్ ననుం గొలిచె విప్రవరుం డతఁ డెవ్వఁ?'డన్న, న
వ్వనిత: 'సురాధినాథుఁడు; భవద్ఘనరాజ్యవిభూతి యింతయుం
గొనుటకు నిన్నుఁ జెందె; నిటు గోల్పడి తీవును నీదుశీలమున్. ౧౪౫

వ. 'వినుము చెప్పెద: శీలంబున ధర్మంబు వెలయు. ధర్మంబున సత్యం
బు దొరకొను. సత్యంబున వృత్తంబు సొప్పడు. వృత్తంబున బలంబు
వాటిల్లు. బలంబున నేను గలుగుదుం గావున, సమస్తంబునకు
మూలంబు శీలంబు' అని చెప్పి, సిరి పురందరు పాలికి ధర్మాదుల
తోడఁ గూడంజనియె- అనుటయు, దుర్యోధనుండుశీలం బెట్టి దనిన
ధృతరాష్ట్రుం డతని కిట్లనియె: ౧౪౬

క. 'ఒలసి మనోవాక్కాయం
బుల ద్రోహభావ మఖిల భూతములయెడం
గలిమి,- విను, శీల; మది మే
ళ్లొలయించును; దాని నుల్ల మూన్పుము పుత్రా! ౧౪౭

క. 'పరహితము, సిగ్గుపాటుం
బొరయక యుండంగ, నెదిరి బోధించుటయుఁ,
నరసముదయంబు వొగడెడు
చరితము,-శీలమున కంగసంపద వత్సా. ౧౪౮

క. అనియె నని చెప్పి, భీష్ముం
డను ధర్మజుతోడ: 'నీకు నది నైజము; యే
నును బోధించితి; శీలము
మనమ్మునం దిరము సేయు మనుజాధీశా.' ౧౪౯

వ. అనిన విని, యజ్జనపతి భీష్మునితో: "'ఆశ యనునది యనంతమై
యుండు. అది నిరర్థకమైన నయ్యెడుదుఃఖం బధికంబు. అది దుర్యో
ధనుం జేర్చి కలసియుండం జూచితి. అమ్మహాత్ముండు దేటకమదీ
యాశఁ గుంఠితంబుఁ జేసి[illegible]న్న దుర్బుద్ధిం గావించె. అది విషాదంబు
సేయు. ఆశ నడంచుట యరిది గదే!' అనుటయు, నాశాదోష
నిరాసకం బైనయొక్క యితిహాసంబు గలదు వినుము:' అని
యక్కురుసత్తముండు ట్లనియె: ౧౫౦

—♦ భీష్ముఁడు ధర్మజునకు సుమిత్రుఁ డను రాజు చరిత్రంబు సెప్పుట. ♦—

సీ. హైహయుండు సుమిత్త్రుఁ డనురాజు వేఁటవో
యినచోటఁ దనచేత నేటువడిన
మృగ మమ్ముతోఁ బాఱఁ, దగిలె వెన్వెంటన;
యదియును నొకమఱి యగ్గమయ్యె,
నొకమఱి దవ్వయ్యె, నొకమఱి దృష్టిక
గోచరం బయ్యెను, ఖురపదంబు
లరసి పోవిన, నింత నంతఁ దోఁచియు, నాశఁ
బెనుచుచుఁ జని మహావనము సొచ్చె;

ఆ. నవ్విభుండు డస్సి, యచ్చట నొకముని
పల్లె కేఁగి, మునులు ఫలజలములఁ

దృష్టిఁ జేయు, దప్పి దేటి యున్నెడ, ఋష
భాఖ్యుఁ డైనతపసి యాతనితోడ: ౧౫౧

క. 'వనమున నెక్కటి నీ వే
పనికై చనుదెంచి? తేల పరమవిషాదం
బునఁ బొందె?' దనిన నాతం
డను: 'నొకమృగ మమ్ముతోడ నరుగఁగ వెనుకన్- ౧౫౨

క. 'ఆసాసల వచ్చితి; నను
గాసిం బెట్టి యది యడవిఁ గలసెను; మృగయా
వ్యాసక్తుఁడు వగచుం దీన
యేసినమృగ, మనఘు, తప్పి యేఁగుటకుఁ గడున్. ౧౫౩

వ. 'ఆశ యింత దుర్నివార యగునే!' యనిన నమ్మునిపతి యమ్మనుజప
కి ట్లనియె: ౧౫౪

క. 'విను, తీర్థయాత్ర సని యే
నను త్తమం బైనబదరికాశ్రమమున నొ
క్కనిఁ గాంచితిఁ గృశగాత్రునిఁ
దనుఁ దను పేరింటివానిఁ దాపసవర్యున్. ౧౫౫

క. 'కని, భక్తిం బ్రణమిల్లుడు
ముని యాతిథ్యం బొనర్ప, మోదంబున నా
తనిపాల ధర్మఫణితులు
వినుచుండఁగ, నొక్కధరణి విభుఁ డేతెంచెన్. ౧౫౬

వ. 'విషాదవివర్ణుం డగుచు సపరివారంబును సదారంబునుగాఁ జనుదెం
చి యజ్జనపతి మునిపతిం గాంచిన నతం డతిథిపూజాసత్కారంబులు
సేసి యాగమనకారణం బడిగిన నన్నరనాథుండు: ౧౫౭

చ. 'తనయుఁ డొకండ; వాఁడుగుణధాముఁడు; క్రీడనవాంఛ సాంద్రక
ననమున కేఁగి కాడుపడినం; [1]దడవం జనుదెంచి యెందు గాఁ

1. = వెదకుటకై.

నన! మదియాశ ద్రిప్పికొనినఁ వెగడందుచు వచ్చినాఁడ' న
న్న, నతఁడు వల్కలుండెవదనంబొకయించుకవాంచి చింతతోఁ:

క. చింతించుచునతనితోఁ భూ
కాంతుం డి ట్లనియె మఱియు: 'గాఢతరాశా
క్రాంతత దుర్లభఫల యగు
టింత యసహ్యా మగునయ్య యెడఁద మునీంద్రా!' ౧౫౯

వ. అనుటయు నత్తాపసోత్తముం డమ్మహీపతియాననం బాలోకించి-

క. 'ఏనరుఁడు మానసము ధృతి
నూన నుచితవృత్తి నుండు నుదిలగొనక, యెం
దైనను నెయ్యది యేనియు
వానికి దుర్లభము లేదు వసుధాధీశా. ౧౬౧

క. 'అర్థాదు లగుఫలంబులు
ప్రార్థించినచోట సిగ్గు వఱుపక తగ న
య్యర్థి సులభార్థుఁ జేయుకృ
తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిలజగములఁ.' ౧౬౨

వ. అని పలికి పూర్వాచారస్మారకత్వంబున ని ట్లనియె: ౧౬౩

క. వినుము, గుణవంతుఁ డొకరుఁడు,
ధనవంతుం డైనయొక్కధరణీనాథుం
దనకూడుసీర కై కాం
చన మడిగి [1]తదీయబాలిశత్వము పేర్మిఁ— ౧౬౪

క. విహతాశుం డై లజ్జా
మహితం బగునాశ దొఱఁగుమదితోఁ: 'సకల
స్పృహాయును నెవ్వనియందును
వహింప' నని యతుల మైనవ్రతముం బూనెన్.' ౧౬౫

1 అధనవంతుని మూర్ఖత్వాతిశయమున.

వ. అని చెప్పి యప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలితప్రయ
త్నుండై తత్కాలజనితవైరాగ్యంబునం దపస్వి యగుట దేట
పఱిచి వెండియు- ౧౬౬

చ. ఒడఁబడి యీనివాని యెడ, నుల్లమునందుఁ గృతఘ్నుతం గడుం
జెడు గగుదుర్వినీతు నెడఁ, జిత్తము కోర్కికిఁ బట్టు సేసి, లే
వడి యగునీచకాంత యెడ వారక యాసలు సాఁగు;- నిట్లు పె
క్కొడలను బాఱునాసగమి యెల్లఁ దొఱంగుము; సౌఖ్య మొందెదున్.

వ. అని, యాసపజ్జం బోవమి సుఖకరం బగుటం దెలిపి, యవ్వీర
ద్యుమ్నునకుం గరుణించి యతనికొడుకు భూరిద్యుమ్నుం దనతపో
మహిమ నాకర్షించి వీడుకొలిపి- అని చెప్పి, ఋషభుండు సుమిత్రుని
చిత్తంబు మృగయాశాయత్తంబు గా కుండునట్లుగా బోధించె.
'పాండవాగ్రజా, నీవును నివ్వాక్యంబు లాదరించి సుస్థిరుండ వై
నిరాశత్వంబున సంతాపంబు దక్కి సుఖివి గ' మ్మని పలికిన, భీష్ము
నితో నబ్భాపతి: 'భవదీయవచనామృతాస్వాదనంబున మనంబు
దృప్తి సనదు. ఇంకను ధర్మప్రకారంబులు వివరింపుము' అనిన, నతం
డతని కిట్లనియె: ౧౬౮

క. తనభూమిఁ బరులభూమిని
ధనము లుపార్జింప వలయు ధరణీశునకున్;
ధనములు మూలము రాజ్యం
బునకును, మూల మగు ధర్మమునకు నరేంద్రా. ౧౬౯

క. [1]అది పెట్టిదంపు వెరవున,
మృదుభూతోపాయమునను మెయికొనదు; ప్రజం
బొదువ వలయు నాజ్ఞాసం
పద గలసాకతముతోడఁ బతి యవహితుఁడై. ౧౭౦

1. తా. ఆధనము కఠినతచేతఁగాని మెత్తదనముచేఁగాని లభింపదు. రాజు మెలఁకువ కలవాఁడై ఊరడించి ప్రజల నాజ్ఞావశవర్తులనుగ నుంచవలయును.

క. విను, బండారము [1]పెరుఁగని
జనపతికి బలంబు మిత్త్రసంపదయును గ
ల్గునె? బలమిత్త్రవిహీనున
కొనరునె రాజ్యంబు? విభవ మున్నతమగునె? ౧౭౧

ఉ. కావున నర్థసంపదలు గల్మిరయ యింతకు మూలు; మైన ను
ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తము లైనసముద్యమంబులం
దా [2]వలియందలంచి సముదగ్రతఁ గైకొను టొప్పు; దద్విధం
బావిభుతొంటికల్మికిని హాని యొనర్చు, హరించుఁ బ్రాణముల్.

క. తనకొలఁది నుపాయంబులు
వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము; ని
ర్ధనుని [3]నిజప్రజయును గై
కొనదు; విరోధులును నరకు గొనరు కుమారా. ౧౭౩

క. తెరవాటున ద్రుచ్చిమి ని
[4]ద్దురు లగుక్రూరులకు మరాఁక దోరం బగు, న
వ్వైరవరిదొరల బలంబుగ
ధరణీశుఁడు గూర్చుకొనుట దైన్యము దెచ్చున్. ౧౭౪

క. అన్యాయంబునఁ బొదలిన
సైన్యముచే సమరజయము సమకూర; దనూ
నన్యాయపరులు గాంతురు
మాన్యత్వము [5]దస్యులైన మనుజాధీశా. ౧౭౫

వ. ఇట్లగుటకు నుదాహరణం బగునొక్కయితిహాసంబు గల దా
కర్ణింపుము: ౧౭౬

—♦ భీష్ముఁడు ధర్మజునకుఁ గాపవ్యోపాఖ్యానము చెప్పుట ♦—

సీ. అవనీశ, పారియాత్త్రచలంబున నుండు
నొకబోయ, ధర్మసంయుక్తబుద్ధి,

1. పెరుగని = వృద్ధిగాని – రాజునకు... 2. = చెల్లచెదర చేయ నెంచి 3. తన సంతానముగూడ ఆదరింపడు, 4. దిట్టరులగుక్రూరులను 5. దొంగలైనవు; శత్రువులైనను.

వింట నేర్పరి, మృగవితతిప్రకారజ్ఞుఁ,
డారణ్యదేశ సంచారశాలి,
తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై
ఫలమూల మధుమాంసములును మేలి
కూడుగూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి
యావహించుచు, శయనాసనాదు

తే. లగుపదార్థముల్ హృద్యంబులుగ నొనర్చు;
వలయునాహారములు మునివరుల కిచ్చుఁ;
బగఱఁ దోఁచినఁ బరిమార్చు భండనమున-
నొకఁడు వేవుర నైన మహోగ్రగతుల. ౧౭౭

క. కాపవ్యుం డనుపేరను
దీపించినయతని భూరితేజము గని, ర
క్షాపరుఁడు వలయు మన కని
యాపాలమునఁ గల్గుదస్యు లందఱుఁ దమలోన్- ౧౭౮

ఆ. అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు
వానిఁగా వరించువారు గాఁగ
నిశ్చయించి కూడి నెమ్మిమైఁ జనుదెంచి
కాంచి యిట్టు లనిరి గారవమున: ౧౭౯

క. 'బలవిక్రమసంపన్నుఁడ
వలఘుచరిత్రుఁడవు, మమ్ము నందఱఁ బ్రభువై
తలకొని రక్షింపుము;- నీ
వలచినపని గొనుము పుత్రవర్గముఁ బోలెన్.' ౧౮౦

వ. అనిన విని యాతండు వారల కిట్లనియె: ౧౮౧

సీ. 'శిశుజన మునిజన స్త్రీజనంబులఁ జంపఁ
గా; దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ
గవియక పోడుచుట కల్మషం; బంగనఁ
జెఱుపట్టఁ దగదు; విశేష మొకఁడు

వినుఁ:[1] డెల్లసత్త్వంబులను బెంటిఁ జంపుట
పాపంబు; గోవుల బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ జనదు. [2]తదీయహి
తము గోరి పూని యుద్ధంబు సేఁత

తే. యధికపుణ్యంబు; [3]సస్యక్రియావిఘాత
మాచరించుట గడుదోష; [4]మవనిప్రజకు
బాధ గావించి కుడిచి, శవంబు దొలుచు
ప్రువ్వగతి నది వోలియుంగఁ బోలియు నతఁడు.' ౧౮౨

వ. అని చెప్పి, 'మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱంగున బ్రిది కెదరేని మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు లరసెద' ననియె. దానికివార లందఱుఁ బ్రీతిం బొంది యాతని వశంబున వర్తించి వర్ధిల్లిరి. ఇట్లు కాపవ్యుండు సాధులకు హితం బగునట్లుగా దస్యులం బాపంబులకుం బాపి తానును వారును నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. ౧౮౩

క. కాపవ్యోపాఖ్యానము
పాపహరము; దీనిశ్రవణ పరనము లటవీ-
వ్యాపార క్షేమంకర
రూపము లగు; దస్యు మృగవిరోధము లడఁచున్. ౧౮౪

-♦ భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల తెఱఁగెఱింగించుట. ♦-

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను: 'దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడుజలచరబహుళం బగునొక్క యేటి మడువునఁ దమలోనం బొందుగలిగి యుండునవి; వేసవి సొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటెని గూడం బిలిచి,—

1. = మృగము లన్నిటియందును ఆఁడుదానిఁ జంపుట పాపము. 2. = ఆ గో బ్రాహ్మణుల మేలుగోరి యుద్ధముచేయుట అధికపుణ్యము. 3. = పైరులను పాడు చేయుట కడుదోషము. 4. = భూప్రజను బాధించి పొట్టబోసికొను వాఁడు, శవమును దొలిచ్చి తిను పురువు ఆశవముతోఁ గూడ నశించునట్లు నశించును.

క. 'మడు వింకఁగఁ బాఱెడు; నీ
రెడ తెగిఫ్వోన నొండుసోటి కేఁగఁగ రా; దె
ప్పుడు నింకనినీళ్ళులు గల
మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్?' ౧౮౭

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డి ట్లనియె: 'నేది
ప్రాప్త మయ్యె నక్కార్యంబుభంగి నెఱిఁగి
యప్పటికిఁ దగునట్లు సేయంగ వలయు
మానితోపాయవృత్తి నేమఱుట లేక? ౧౮౮

వ. అనిన నయ్యిరు దెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుం డి ట్లనియె:

క. 'జడనిధిచందంబున ని
మ్మడు వొప్పఁగ నిప్పు డేమి మాఁడెనె యిమ్మై
నడచిపడ? రిత్తనెవ్వగ
లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్' ౧౮౯

క. అనుటయు 'నిది కర్జము గా'
దని పల్కుచు దీర్ఘదర్శి యంబుస్రోతో
జనితాభయ మగుపథమునఁ
జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. ౧౯౦

వ. తక్కినరెండును నంద నిలిచె. ఇట్లు నిలిచిన యమ్మత్స్యద్వయంబు
నకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు— ౧౯౧

క. పాఱెడునీ రెడ తెగ్రివ్వఁగఁ
దాఱి బెడిద మైనయెండ దనుకఁగ నివురం
బాఱె మడు; వంత వేడుక
కాఱులు జాలరులు సొచ్చి క్రిందుకొనంగన్. ౧౯౨

క. వెరపున [1]నూఁతల [2]నిత్తెలఁ
గరముల మత్స్యములఁ బట్టి కడుసంతసముం
బొరయుచుఁ ద్రాళ్ళం [3]గ్రువ్వఁగఁ
గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుండున్- ౧౯౩

1. = చేఁపలఁ బట్టుబుట్ట. 2. = చేఁపలఁ బట్టెడు అడ్డువల. 3. = గ్రుచ్చఁగా

క. 'ఇం దొక త్రాడు గలఁచి యే
నొందంగా గ్రుచ్చినట్ల యుండెద; వీ కీ
క్రిందుకొనుట మానంగ న
మందత నది యెడల విడిచి మడువు దఱిసెదన్.' ౧౯౪

క. అని యొకగుదిమీలనడుమ
నెనయంగాఁ దూఱి కలఁచి యిరుదాడలఁ ద్రా
డొనరంగఁ బట్టుకొని గ్రు
చ్చినచందము దోఁప మూర్ఛఁ జెందినభంగిన్. ౧౯౫

వ. ఉన్నంత వేఁట దీఱె యగ్గుది గలయతండు.— ౧౯౬

క. తెలినీట రొంపి వోవం
దొలుచునెడం ద్రాడు విడిచి దురితంబునకుం
దొలఁగి పొరదప్పి యుం దొక
జలచర మున్న యెడ కేఁగె సంభ్రాంతగతిన్. ౧౯౭

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం
డి ట్టట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ
బట్టువడెఁ దనదుడెందము
పట్టు వదలి చకితవికలభావేంద్రియుఁడై. ౧౯౮

క. విను, దాదవ్వులఁ గార్యము
గనికొని వలయుపని మున్న కావింపఁగ నే
రనిజడుఁడు, దీర్ఘసూత్రుం
డనునమ్మత్స్యంబుభంగి నాపద నొందున్. ౧౯౯

తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ
ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యునట్లపోలెఁ
బరమసంశయ మయ్యెడుబ్రమకు గాంచు. ౨౦౦

క. ధుర్యత ననాగతము లగు
కార్యము లూహించి పని తగం [1]జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును
నార్యస్థితి దీర్ఘదర్శి యనుమీనుక్రియన్. ౨౦౧

—♦ పలితరోమశు లను మూషికమార్జాలంబుల సంవాదప్రకారము. ♦—

వ. అనిన విని, ధర్మనందనుండు: 'పెక్కండ్రు పగఱకు నగ్గమై హీనబలుం డైన నరపతి యెవ్వరునున నాపద నిస్తరించువాఁడు?' అని యడిగిన నప్పుడమితేనితో భీష్ముండు: 'మార్జాలమూషిక సంవాదం బనునితిహాసంబు గలదు. అది నీ దగుప్రశ్నంబునకు నదుత్తరం బగు వినుము'— అని యిట్లనియె: ౨౦౨

సీ. అడవిలో [2]నొకమఱ్ఱి యడుగున లాఁగలఁ
బలితుండు నా నొక్క యెలుక యుండు;
నమ్మహీజముమీఁద ననిశంబు రోమశుం
డనుపిల్లి వసియించు; నాసమీప
మున సంజకడ నిత్యమును మృగంబుల కురు
లొడ్డి, వేకువ వచ్చి యొక్కవాలఁ
డగపడ్డవానిఁ గొం చరుగు; నొకప్డు డా
హారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁ

తే. బోయి యురిఁ బడి యుండంగఁ, బొంచి చూచి
భయము దక్కి యచ్చోటన పలితుఁ [3]డెరకుఁ
గ్రుమ్మరఁగఁ, జంద్రకుం డను గూబవులుఁగు,
హారికుఁ డనుముంగియు నింత నంత దోఁచె. ౨౦౩

వ. [4]ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యెలుక యీ రెంటిబారికిం దప్పి పోవ రామిదలంచి, బెగ్గలించియు ధైర్యంబుకొలఁదిం గార్యం బూహించి, యప్పిల్లిం గొండొక సేరం జనుచుం దానితో నిట్లనియె:

---

1. = చేయునట్టి నీతిఁదోవిదుఁడు. 2. = ఒక మఱ్ఱిచెట్టు నడుమున కలుగుల- బొరియలలో. 3. = మేఁతకు. 4. = మేఁతలకై.

క. 'ఉరి దెగ్వ్రఁ గొఱికి యిప్పుడ
వెర వారఁగ నీకు నేను విడుగర సేయం
దొరకొనుట నీదుభాగ్యం;
బరిత్యము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్. ౨౦౫

క. 'ముంగికి గూబకు నగపడి
యంగంబులు వడఁకుచున్న యవి నా;[1]కిమ్మై
సంగతి గలిగిన [2]నీయు
త్సంగంబున నుండి భయము దక్కుదు నేనున్.' ౨౦౬

చ. అనవుడుఁ, బిల్లి యిట్టు లను: 'నార్తశరణ్యుఁడ నయ్యె; దిట్టినీ,
కనఘ, హితంబు సేయ వల దయ్యె? జగత్పతి సాక్షి గాఁగ ని
ప్పని దగఁ బూనితిన్; వెఱపుఁ బాచి ననుం గదియంగ రమ్మ; వ
చ్చిన [3]నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్.'

ఆ. అనిన, 'నట్ల యగుట నాత్మ నెఱింగియ
కాదె సంధి యైన నాదుబ్రదుకు,
నీదువిడుగరయును నిజ మగు టూహించి,
నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చయంబు-'

క. అని పలికి పిల్లి పొదిగిట
ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసిం
చినఁ జూచి [4]యయ్యులూకం
బును నకులము సచటు వాసి పోయె నిజేచ్ఛన్. ౨౦౯

క. నకులము నులూకమును బో
కకు సంతస మంది యుండి గ్రక్కున నమ్మా
షిక మయ్యురిచేరులు గొఱు
కక యలసత నల్ల నల్లఁ గఱచుచు నుండెన్. ౨౧౦

వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యురిం గొఱుక కుండుట
యెఱింగి రోమశుం డి ట్లనియె: ౨౧౧

1. = ఈపట్టున (మనసు) నేస్తము కుదిరినచో. 2. = నీ యొడి యుండి. ౩. = ముంగిస. 4. = గూబ.

ద్ముల మనుట యొప్పదే? నను౯
గలసి మెలఁగుము, విడువు శంకఁ, గను మభిమతముల్. ౨౨౫

వ. అనిన విని యప్పలితుండు రోమశునితో : 'నీపలుకు లుచితంబులు-
నామాటలు వినుము' అని యిట్లనియె: ౨౨౬

చ. అరులను మిత్త్రులం దెలియ నారయ నెంతయు సూక్ష్మకృత్యమ
వ్వారి వతిదుర్లభం; బరులు పే రన నుండియు మిత్త్రభావముం
బొరయుటయున్, సుహృజ్జనులపోలికి గల్గియు శత్రుతాగుణ
స్ఫురణ మొకప్డు సూపుటయుఁ జూతుము గాదె ధరిత్రి నెల్లెడన్ ?

వ. కావున నిన్నుఁ బెద్ద గదియుట గర్జంబు గాదు. నీవును మదవ్వశగతిం
బొందుటఁ జూచి తేనియు నేమఱం జనదు. ఎట్లంటేని: ౨౨౮

క. బలవద్రిపులు ప్రయోజన
ములకై లోఁబడుట గల్గుఁ, బొలముల నేనుం
గులు [1]దీమంబులపజ్జఁ ద
గిలి నెట్టన పట్టువడిన క్రియఁ జతురమతీ. ౨౨౯

చ. అరియెడ మిత్త్రభావ మొకయప్పుడు కార్యముపొంటెఁ గల్గిన
న్వారపునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివాతికిం
గరము దొలంగఁ జేయునరు కర్జము పట్టి చరించు టొప్పదే?
పొరుగున నుండి నీకు హితముం దగఁ జేసెద నెప్డు పంచినన్. ౨౩౦

మ. విను, నీ కామిష మేను; నీయెడఁ గడున్ విశ్వాసముం బూని చే
రిన నీచిత్త మొకప్డు దుద్గతవికారీభూత మై దుర్వినో
దనహింసారుచి నొందు; నీసుతసుహృద్బంధువ్రజం బేని మున్
ననుఁ గన్నన్ సహియింప దాత్మఁ, గరుణ న్మన్నింపు మి ట్లుండెదన్.

వ. అని యంత నిలువక. ౨౩౧

క. బలువు టురిఁ జిక్కి పే
లితో రే మెల్ల నున్న

[1]ఎనుఁ, మృగములను బట్టుటకు వేటకాండ్రచే ప్రయోగసాధనముగా
మృగము;

జలిది వలసి పిలిచెద; పిటు
వలయునె? నీపలుకు నమ్మి వత్తునె చేరన్? ౨౩౩

ఆ. అనుడు, 'నిట్టు దలఁప నగునె? మత్ప్రాణర
క్షకుఁడ వైననిన్ను శత్రుఁగాఁగఁ
దలఁతునే కృతజ్ఞతయుఁ బౌరుషంబును
గలుగ నేను! వెఱవ వలవ దనఘ.' ౨౩౪

వ. అనిన రోమశునకుఁ బలితుం డిట్లనియె: ౨౩౫

క. నీవలన నేను బ్రదికితి;
నీవును నాకతన మూలనికి నగపడవై;
తీవిధమునఁ గల్గుసుహృ
ద్భావము చాలు; నినుఁ జేరఁ దగ దిటమీఁదన్. ౨౩౬

వ. ఇవ్విధంబునకు శుక్రవాక్యంబులుం గల వాకర్ణింపుము: ౨౩౭

క. బలవంతుఁ డైనశత్రుని
వలనఁ బ్రయోజనము గలిగి, వలను కలిమిఁ దాఁ
గలిసియు నది గడచనఁగాఁ
దొలఁగ వలయు; నమ్మెనేనిఁ దుదిఁ గీడొలయున్. ౨౩౮

ఆ. నమ్మఁ దగనివారి నమ్మక యున్నది;
తగినవారి నైనఁ దద్ద నమ్మి
యుండఁ దగదు; తన్ను నొరులు నమ్మెడునట్ల
యుండి యొరుల నమ్మకునికి నీతి. ౨౩౯

వ. ఇట్టిద బ్రదుకుఁదెరు వగుటం జేసి, ౨౪౦

క. నినుబోంట్లను నమ్మక యే
నును బ్రదికెద, ననఘ, నీవునుం గని చండా
లునియట్టివారిమాయలు
నినుఁ బొందక యుండ బ్రదుకు నెఱిఁ బొమ్మింకన్. ౨౪౧

క. అనిన విని, సిగ్గువడి తన
చనుచోటికిఁ జనియెఁ బిల్లి; సమ్మతిఁ బలితుం

కును వే ఱొకతగులాఁగకుఁ
జని సముచితవర్తనమున సౌఖ్యముఁ బొందెన్. ౨౮౨

క. బలుపగఱవలనియాపద
దలఁగుటకును, రిపుని హీనతరు నైనఁ దనుం
గలపికొని బ్రదుకుటకు, ని
య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెఁ దగన్. ౨౮౩

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు, శాంతనవునితోఁ: 'ఎవ్వరియెడ విశ్వసింప కున్న చిత్తంబునకు విశ్రామంబు గల్గదు? విశ్వసించిన దురితంబులు దొడరవు? అట్లగుటం జేసి విశ్వసించుటయు విశ్వసింపక యుండుటయు ననురెంటిలోనను బరమకర్తవ్యం బెయ్యదియో నిశ్చయింప నేర' ననుటయు, నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియె: నీయర్థంబు దేటపడుచునట్టి యితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము:

——♦ బ్రహ్మదత్తునితోఁ బూజని యను శకుని కైన సంవాదప్రకారము ♦——

సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిననరపతి
నగరఁ బూజని యనునామ మొప్పఁ
జతురభాషిణి యొక్క శారిక వర్తించు;
నది పిల్లఁ బెట్టి యింపారుపండ్లు
దెచ్చి యర్మిలి దాని కిచ్చుచో నే తెఱి
నృపపుత్త్రున కిచ్చు నందుఁ గొన్ని;
వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ
జల్లాట మాడుచు సంచరింపఁ;

ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లేకుండ న
ద్దారకుండు పిల్లతల నొగిల్చి
చంపె. దానితల్లి సనుదెంచి కని మది
నిట్టు లనియె శోక మెసఁగ నొసఁగ; ౨౮౪

తే. 'అకట! కూడి మెలంగి యే కొంకటి లేని
నర్థి నిదియున్నను దాన్నను ననుభవింపఁ;

బట్టి యాడుచు నుండు; నిప్పాపజాతి పడుచు
సంపునె యిటుల దీని మిడుకక మిడుక ! ౨౮౬

ఆ. 'రాచకొడుకు గాఁడె! రాచవారికి నేటి
పరిచయంబు! వేగ కరుణ విడుచు
హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె!– సమదమతులు క్రౌర్యరతులు!' ౨౮౭

వ. అని నిందించి ౨౮౮

క. ఈపగ దీర్చెద నంచుం
గోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం
[1]బోపడునట్లుగ గోళ్ళఁ
వే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. ౨౮౯

వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుండు విన నిట్లనియె: ౨౯౦

క. 'చేసె నఘము; దత్ఫలముం
జేసేతం గుడిచెఁ; గాని శిశువునెడఁ నా
చేసినకార్యము లే; దేఁ
జేసితి మా; యొండు గీడు సెందదు నన్నున్?' ౨౯౧

చ. అనవుఁడు, బ్రహ్మదత్తుఁ: 'డది యట్టిద! నీదెసఁ గీడు లేదు; నీ
చనుటకు నామనం బతివిషాదముఁ బొందెడుఁ; దొంటియట్ల నె
మ్మిన నిలు' మన్నఁ, బూజని:'శమించునె యొండొరుచేతఁబడ్డ యా
పెనుఁబగ నొంచి, మాటపస బేల్పడి క్రమ్మఱఁ జేరు టొప్పునే ?'

వ. అనిన విని యతండు– ౨౯౩

క. చేసినదానికి మాఱుగఁ
జేసినఁ బగ యంతతోడఁ జెడుఁ గాక, గుణుల్
డాసిన నమ్మలు విడిచి
దోసముఁ బట్టుదురె యెట్టితుచ్ఛులుఁ జతురా? ౨౯౪

వ. అనిన నతనికి శారిక యి ట్లనియె: ౨౯౫

---

1 = ఊడిపడునట్లుగ.

క. [1]నెయ్యము సెడినను మాటల
తియ్యఁదనము వట్టి పగ మదిఁ మఱచినఁ జా
వయ్యెం జే టయ్యెఁ గలఁక
యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మే లగునే? ౨౪౬

ఆ. [2]వినుము, నేల వోఁచికొనినను, దాయాదు
లైన, మాటమాట కేని, నాఁడు
వారియెడను, గీడు వారక చేసినఁ-
బగ జనించు నిట్లు భంగు లైదు. ౨౪౭

ఆ. పగయుఁ గల్లెనేని పాయునే?- గూఢ మై
ప్రమాన నగ్ని యున్నమాడ్కి- నుండుఁ;
గాన నమ్మి బేల కాలాంతరంబున
నైనఁ జెడును సందియంబు వలదు. ౨౪౮

క. జననీ జనక సహోదర
తనూభవుల సఖుల నమ్మఁదగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారల
జనునే నమ్మంగ విడువు చతురవచనముల్. ౨౪౯

వ. అనుటయు బ్రహ్మదత్తుం డి ట్లనియె: ౨౫౦

క. కాలవశంబునఁ గీడు
న్మేలును జనులకును మూఁడు; నీకును నాకుఁ
వాలి యవి సేయ వచ్చునె?
బేలన యే నంత? యేల పెడఁబాయంగన్. ౨౫౧

వ. అనిన విని శారిక యతనిమొగంబు దేఱకొనం జూచి- ౨౫౨

---

1 = తా. నేస్తము చెడినయెడ మాటతియ్యదనమున మనస్సుఁంచలిపగ మఱచినచో, చావైనను, చేటైనను, కలఁకయైనను—ఏదే నొకటిమూడునుగాని మరల చేరుట మే లగునా? 2—తా. భూమిని దోఁచినను, దాయాదులైనను, మాటమాట పట్టింపునను, స్త్రీలవిషయమునను, నిరంతరము కీడుచేసినను పగపుట్టును. ఇవి ఐదును పగకుఁ గారణములు.

క. విను, చల్లనిమాటలలో
మునిఁగి యలుక గుబ్బతిలు: సముద్రజలములో
నన యుండి యాఱ కెప్పడు
గనగన మనుబాడబాగ్ని కరణి నరేంద్రా. ౨౬౩

క. అని పలికి యవిశ్వాసము
మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లనివెరవుతోడ నాపూ
జని దన కిమ్మైనయెడకుఁ జనియెఁ గుమారా. ౨౬౪

వ. అదియునుం గాక, ౨౬౫

క. 'జననాథునకు నవిశ్వా
సనిరూఢత వలయు నెల్లజనములయందుం
దనుఁ దనసిరిఁ గాచుటకై'-
యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. ౨౬౬

— ♦ కణికుఁడు శత్రుంజయున కుపదేశించిన హితవచనములప్రకారము ♦ —

వ. 'అవ్వాక్యంబు లాదరింప వలయు'నని పల్కి యెండియు భీష్ముండు పాండవాగ్రజుతో: 'సౌవీరపతి యగుశత్రుంజయునకు భారద్వాజవంశవర్యుం డైనకణికుం డుపదేశించిన హితవచనంబులు గలవు. వానిం జెప్పెద నాకర్ణింపుము'-అని యి ట్లనియె:— ౨౬౭

క. వికచముఖుఁ డగుచు శాత్రవు
లకు హిత లగునట్టివారలం గని భూపా
లకుఁ [1]డెడ్డ కత్తెరయు, నా
లుక బెల్లము నై మనంబులుం గన వలయున్. ౨౬౮

ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రుల నోర్చి యహీనరాజ్యముం
బ్రీతి యెలర్పఁ జేకొనినపిమ్మట సౌఖ్యసమృద్ధితోషిత
జ్ఞాతినికాయుఁ డై, మది నజస్రము నమ్మక సర్పసంయుతం
బై తనరారురమ్యనిలయంబున నున్నటు లుండఁగాఁ దగున్. ౨౬౯

1 -(భూపాలకుఁడు +) ఎడ్డ-ఎడ్డ, ఎకఁద=మనసున్న.

వ. అని మఱియును,

క. [1]వినుము, తఱి వేచి రిపు మూఁ ౨౭౧
పున మోవఁగ వలయు; సమయముం గనికొని గ్రి
క్కునఁ గడవ శిలాస్థలి పై
చినచాప్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్. ౨౭౨

క. పానము జూదము వేఁటయు
మానినియును భూపతులకు మధురవినోద
స్థానము లగు; నైనను దగ
వైనవిధము దక్కఁ, [2]దగుల మాపద దెచ్చున్. ౨౭౩

క. విని విననివాఁడపోలెం,
గని కాననివాఁడపోలె గావలయు విభుం
డొనరింపఁ దలంచినపని
కను వగునంతకు నభేద్యుఁ డై జనులయెడన్. ౨౭౪

క. [3]ఒల్లనికార్యం బాసల
నల్లన కాలగతిఁ గడపునది; కాలముచేఁ
బెల్లొదవు విఘ్నములు భూ
వల్లభునకు నెపము వెట్టవచ్చుం బిదపన్. ౨౭౫

తే. బహుళ మగుగర్వమునఁ గార్యభంగియును న
కార్యసరణియు నెఱుఁగ, కనార్యవృత్తిఁ
గాని తెరువున నడచు చున్నని గురుని
నైన శాసింపఁగాఁ దగు నండ్రు బుధులు. ౨౭౬

క. తెగఁ దీర్పక, తగ నార్పక,
తెగటార్పక, కడమ కొంత [4]దిగ్గిడఁగ నున్నన్

1 = తా. అదనెఱిఁగి పగవానిని పీఁచ్చుమీఱఁద పోయవలయును. సమయము గ్రహింపఁ దగిన కడవ (కుండ) ను ఱాతిసేలమీఁదఁ బడవేసి నట్లు, పగవానిని జెఱుపఁ దగును. 2 = వ్యసనము. 3 = తా. తనకిష్టము కాని పని చేయక ఆశలు పెట్టుచు కాలము గడపవలయును. కాలగతిచేవచ్చు విఘ్నములు నెపము బెట్టి పిదప ఆపని మానివేయవచ్చును. 4 = మిగిలియున్నచో.

జగతీశ, యప్పు, నగ్నియుఁ,
బగయును-గడుఁ బెరుఁగుఁ గీడువాటిల్లుఁ దుదిన్. ౨౭౬

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు;
మార్దవమున ఖరవిమర్దనంబుఁ
జెల్లు; మార్దవమునఁ జెల్లనియది లేదు;
గాన మృదువ తలఁప [1]ఖరము సువ్వె! ౨౭౭

వ. అనిన విని, యజాతశత్రుండు: 'ధర్మంబు నడవక యవగ్రహాది దురితంబులు దుస్తరంబు లయిన నాహారంబులు దొరకొనని యట్టిచో ద్విజాతు లేమిభంగిం బ్రాణంబులు రక్షించుకొనువారు?' అనుటయు, నాపగానందనుండు: 'విశ్వామిత్రచండాలసంవాదం బనునితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరం బై యుండు. ఆకర్ణింపుము' అని యి ట్లనియె: ౨౭౮

—♦ విశ్వామిత్రచండాల సంవాదము. ♦—

క. ఏపారి తొల్లి త్రేతా
ద్వాపరములసంధి నొక్క [2]వఱపు ధరిత్రీ
తాపంబుఁ జేసె జనముల
పాపంబున వత్సరములు పండ్రెం డధిపా. ౨౭౯

సీ. ఏఱులుఁ జెఱువులు నిపురఁ, [3]గర్షనము లెం
దును జెడఁ, దరులతాదులును [4]గమర,
[5]భూమియుఁ బస మాల, గోమహిషాదుల
వధనంబు వొలియ, భూవరులు మేర
దప్పి లోకములోని ధాన్యముల్ గొన, నధ
ర్మం బంత కంతకుఁ బ్రబ్బ, నధిక
లనదలఁ జెఱుపంగ, యాగముల్ దేవతా
పూజలు నెడలంగ, భూసుర ప్రి

1 = వాఁడిమి గలదియుమా! 2 = అనావృష్టి. 3 = కృషులు; వ్యవసాయములు మాడిపోవఁగా. 5 = భూమియు సారము దోల్పడఁగా.

ఆ. ముఖము లైనవర్ణములచొప్పు దప్పె, నా
హారరహితజనము లచట నచటఁ
బడఁగఁ, జూడ ఘోరభంగిగాఁ దఱచయ్యె
డొక్కలున్నవారి కెక్కు భయము. ౨౮౦

వ. అట్టి సమయంబున— ౨౮౧

క. మునిపతి విశ్వామిత్రుఁడు
దనయాఁకలి కెందు మెలఁగి ధైర్య మెడలి యో
దన మాంస మూల ఫలములు
జనుల నడిగి యెందుఁ బడయఁ జాలక డప్పిన్- ౨౮౨

వ. తూఁగాడుచుం జనువాఁడు— ౨౮౩

చ. [1]పసరపుటెంపపోత్రులును, బందులడొక్కలుఁ, గుక్కగుట్టలున్-
ముసుఁగు వడంగ భూమితలముం దఱచారఁగఁ గప్పుచున్, మదిం
బస యొకయింత లేక పెఱప్రాణులనుం బొరిగొంచు, నెప్డు దు
ర్వ్యసనతఁ గూరి యున్న వెలివాండ్రపల్లియఁ జేరి యయ్యెడన్-

వ. ఆర్తి నొంది యిట యట వోవంజాలక నేలం బడి యుండి 'ప్రాణంబులు వోవుట యుపేక్షింపం దగదు- ప్రాణరక్షణంబ పరమధర్మం' బని వితర్కించి, తగునుపాయంబు చింతించువాఁడు- అప్పుడ చంపి [2]తిత్తొలిచి గాలిగొన వైచినకుక్కకడిమంబుఁ గనుంగొని - ౨౮౫

క. ఇది దప్ప నిప్పు డెయ్యెడ
నొదవదు ప్రాణంబు గావ నొం డొకఁ; డిదియున్
మది నూహింపఁగ ముచ్చిమి
నొదవించి కొనంగ వలసియున్నది నాకున్. ౨౮౬

తే. ప్రాణములు వోవ కుండంగఁ బరిహరింప
నొం డుపాయ మెయ్యెదియు లే కుండెనేని
ముచ్చిమియు ధర్మ మగు; నధమునిధనంబు
గొనుట యెందును ముఖ్య మై చనుట గలదు. ౨౮౭

ఎముకల రాసులును. 2 = తోలు ఒలిచి గాలి కారబెట్టిన మాంసము

చ. అనుటయు నంత్యజుండు నగి: 'యెట్టివిధం బధమంబు
ట్టిన యది ధర్మమే? కటకటా! మిముబోంట్లకు నిట్లు
జనునొకో!' యన్న నమ్ముని: 'ప్రశస్తుఁ డగస్త్యుఁడు

దినఁడె? నశించెనే యతని తేజముఁ బెంపును నంతనుండియున్?

వ. అనవుడు వాఁ డి ట్లనియె:

క. 'పరహితము సేయఁ బూనిన
పురుషుఁడు పాపంబు సేసి పొందఁడు కీడుం;
బరమముని యగునగస్త్యుఁడు
పరోపకారార్థకృతి నభవ్యుం డగునే?'

క. నావుడు, 'మదాత్మ బ్రాహ్మణ
తావిద్వత్తాస్పదంబు; దానికిఁ గా నే
నీవిధి యొనరించుట పా
పావేశము లేదు; దీని కడ్డపడకు వే.'

క. అని ముని పల్కఁగ, నంత్యజుఁ
డను: 'మాంసము విడువనోప కనుటగఁ దలఁపం
జనునె? భవదీయ తేజో
ధనహానికిఁ గరుణ పుట్టదా యెవ్వరికిన్?'

వ. అనవుడు గాధినందనుండు—

తే. కరుణ గలవేనిఁ బ్రాణంబు గాచికొనఁగఁ
దలఁచునాకు నిమ్మాంస మి మ్మలఘుచరిత;
యెట్టులైన మ్రుచ్చిమియు లే; దన్నృత మొడలి
పడయువస్తువు సేయదు పాతకంబు.'

వ, అనిన విని చండాలుం డి ట్లనియె:

క. 'అతిశయితపుణ్యదీప్తులు
ప్రతిగ్రహము నీచనరునిపాలం జేయున్
మతిఁ దలఁపఁ గూడునే? వి
శ్రితగుణ, యే వెఱతు నింకఁ జూఱచూఱఁ బల్కన్.

వ. 'నీవలచినయట్లు సేయుము' అని సారమేయమాంసం బిచ్చినఁ బుచ్చికొని దానం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె. ఇంద్రుండు తదనంతరంబ లోకంబులపడ దేఱ వర్షించె. అంత హర్షించి యత్తపస్వివర్యుండు దపోవిశేషంబున దోషంబు నీఁగికొని మనీషిజనస్తుత్యం బగునిత్యవ్రతంబున విలసిల్లె. ఆపత్సమయసమాచారం బిట్టిద యని చెప్పిన భీష్మునితో భూవల్లభుండు: 'ధర్మసూక్ష్మప్రకారం బింతదురవగాహం బగునే! ఈ యితిహాసం బాకర్ణించుట నాడెందంబు విషాదంబు నొందె.' అనవుడు, నతండు: 'ధర్మంబు బహుశాఖాసమన్వితంబై యుండు; రాజులకు నెల్ల తెఱంగులు నెఱుంగవలయు; విషాదం బేల?' యనవుడు, నజ్జనవిభుండు: 303

—◆ భీష్ముఁడు ధర్మజునకు శరణాగతరక్షణసుకృతం బెఱింగించుట ◆—

క. 'శరణాగతసంరక్షణ
పరులకు సమకూరు నెట్టిపాటిఫలము? ని
ర్భరకరుణాకర, పరమా
దరమున నెఱిఁగింపు నాకు దాని తెఱంగున్. 304

ఆ. అనిన, భీష్ముఁ డిట్టు లను: 'ముచుకుందుండు
నాఁగఁ బరగుధరణినాయకుండు
దనుజమంత్రిచేత వినినది యొకకథ
యఖిలపాపహరణ మాచరించు. 305

వ. అయ్యితిహాసంబు సెప్పెద; దాన నీయడిగినయర్థంబు దెలియు; నవహితుండ వై యాకర్ణింపుము. 306

సీ. పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి
తినియును బె క్కమ్ముకొనియు వదియ
బ్రదుకఁగా — దానికి బహుసాధనంబులు
నవరించుకొని మహాటవిఁ జరింప,
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి,
సకలజీవులకు నాశంబు పుట్టు

నట్టిది యై కాన యంతయు జలమయం
బైన, బెగ్గిలి యన్నరాధముండు

తే. వేఱ్ఱోఁగ [1]వడి [2]యెల్లను వెడలి మిఱుత
నొకవనస్పతి జొంపమై యున్నదానిఁ
జెంది, రాతిరి యగుటయు శిలయ సెజ్జ
గాఁగ శీతార్తుఁ డైయుండెఁ గొరవేందఱి. ౩౦౭

క. ఆ లుబ్ధకుఁ డత్తరువర
మాలోకించి కడుభక్తి ననియె: 'నిచటిభూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలత ననుఁ గాచుటకు విశిష్టవినీతిఁ.' ౩౦౮

వ. అని యిట్లప్పక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించియుండ, నమ్మహీరుహంబుకోటరంబున వసియించి యుండునది, యొక్క కపోతంబు తనవల్లభ యెటయేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి, ౩౦౯

సీ. 'ఎచట నున్నదియొక్కొ! యింతప్రొద్దొకచోట
నుండునే ననుఁబాసి యుజ్జ్వలాంగి!
యేకారణంబున నే మయ్యెనో వాన
యేపునఁ దెగియెఁ గా నోపు! నకట!
యమ్మెను లేకున్న సిమ్మెనికలిమి ని
రర్థకం; బధికానురాగయుక్త
యగుసతిగుణముల నైహికాముష్మిక
సుఖసాధనంబులు సువ్వె పతికి!

తే. నేమి సేయుదు! మందిరం బిపుడు పాడు
వాఱుచున్నది!' యనఁగ నప్పలుకు లెల్ల
బోయవలలోన నున్న కపోతి విని మ
నంబు సంతోషపూర్వమగ్నంబు గాఁగ. ౩౧౦

క. 'పతిమదికి నింత యెకిఁ, న
పుణ్యవతి! ప్రియాలాపము లీ

[illegible]

గతి వినఁ గాంచితి; జన్మము
గృతకృత్యం బయ్యె నాకు; గెలిచితి జమునిన్.' ౩౧౧

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి విధికృతంబునకు వగవం బని లే దని మఱియు ని ట్లనియె: ౩౧౨

చ. 'శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధికధర్మముగా బుధకోటి సెప్పు; నీ
వరసి మహార్తు వీని శరణాగతు నోదనభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపుసీతునఁ గొంకువోవఁ యెదున్.'

క. అని యేర్పడ భాషించిన
విని శోకము డిగ్గ విడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్: ౩౧౪

క. 'ఓయన్న డస్సినాఁడవు
మాయింటికి నతిథి వైతి! మసలక నీకుం
జేయ వలయు నాతిథ్యం
బేయది భవదీప్సితార్థ మెఱిఁగింప వనా?' ౩౧౫

చ. అనవుడు, నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి: 'సీ
తున సకలాంగకంబులు [1]బ్రతున్నము లయ్యెడు నీనిఁ బాపవే'
యనిన, విహంగమంబు రయ మారఁగ నచ్చటి పుల్ల లెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రో విడి యకుంఠిత మైనదయాగుణంబునన్—

వ. ఆపొంతపల్లియకు రయంబునం జని [2]పుల్లకొఱవి సంగతం బైనయింగ
లంబు—

క. కొని వచ్చి పుల్లప్రోవున
దనుకంగాఁ జేసి నెమ్మి దఘుకొత్తఁగ ని
ట్లను బోయతోడ: 'మే నీ
యనలంబునఁ గాఁచికొనుట కై లె మ్మనఘా.' ౩౧౬

చ. అనవుడు, వాఁడు, గువ్వ, హృదయం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున నల్లన యల్లన కాఁచి శీతబా

1. = బాధపడుచున్నవి. 2 = పుల్లచివర సంటింపబడిన అగ్గి — కొఱవి యనుట.

ధన ముమగంగఁ జేయఁగఁ, బదంపడి యాఁకలి చాలఁదోఁచెఁ,దోఁ
చిన నెఱిఁగించె గువ్వ; కదిసేయ నుపాయములేక యాత్మలోఁ—
వ. వగచి వెలువెలం బాఱి తలంచికొని వాని కి ట్లనియె: ౩౨౦
తే. 'ఖగములను జీవనం బనఁ గలదె సంగ్ర
హించినట్టిది? యాఁకలి కేమి యైన
మాకు దొరకొన్నఁ దిండుముగాక! యైన,
నీవు డస్సితి వాతిథ్య నియతి వలయు. ౩౨౧
—♦కపోతి.బు దనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట.♦—
వ. 'నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము—' ౩౨౨
క. అని పలికి యగ్నివలగొని
తనదేహము దానిలోనఁ దడయక యిడినం
గని బోయ విస్మయంబున
మన మూనఁగఁ గొంతసేపు భ్రమాన్పడి యుండెన్. ౩౨౩
వ. పదంపడి, ౩౨౪
మ. 'కలదే యిమ్మెయిపౌరుషంబు జగతిం! గారుణ్య మేపార ని
ప్పులఁ గి ట్లిచ్చెనె మేను! నాదుచరితంబుల్ నిందకుం బట్టు లై
తలఁ పన్ వచ్చిన నింత కీ డగునె? యేతత్కాత్రిరతాఘోరచే
ష్టలు మానం గలవాఁడఁ; బక్షి గురు వై సంధించె సద్బోధమున్.'
వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు నంత
నిలువక: ౩౨౫
మ. 'ఇది యి ట్లాలిని బంధులం దొఱఁగి తా నీయగ్నిలోఁ గూలె; నా
ప్పిద మై యుండఁగ నిట్టి తెంప, యొలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ దుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నే నిప్పుడ' యంచు మానసము శాంతింబొంద నిర్మోహుఁ డై.
వలలోన నున్న పులుఁగుల
వెలువడఁగా విడిచి, పలయు, వెండియుఁ దనకుం
గలపక్షి నిహంతిసాధన
ములు నైచబలనె యుండఁ— బోయె బోయ నియతుఁ డై కాశి౨౫

ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు
శోకవహ్నిఁ జిత్త మాకులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె
నశ్రుజలతరంగితాస్య యగుచుః ౩౨౯

క. 'నా యాఁకలి కోర్వ వెపుడు!
వే యైనను నేఁ గొనంగ వెండి యనుభవిం!
తాయాసపడుటఁ గనుఁగొని
నోయుదు! నన్నుఁ బాసి యిటు సనుట దగ వగునే? ౩౩౦

వ. అని వెండియు, ౩౩౧

సీ. 'ఇగురుజొంపంబుల నింపారు విరులను
బలు పైనపొదల కేళివలకుఁదార్చి,
సెలయేరులందలి తెలినీటఁ దనువుసొం
పెలసినగిరుల [1]తెప్పలకుఁ జేర్చి,
మావిమ్రోకల నెలదీవలఁ జెన్నొందు
తోఁటలకడ నలితోడఁ జెంది,
యలరునెత్తమ్ముల కలిమిఁ జెల్వగుడిగ్గి
యలతీరభూముల నల్లఁ బొంది,

తే. 'నన్ను మనమునఁ దేల్చి యానందమొందఁ
గేలి సలిపెడు నీదగులీల మఱువ
నావశంబె ప్రాణేశ! ప్రాణంబు లిపుడ
నిన్న కూర్చి యేతెంతు నీసన్నకడకు. ౩౩౨

వ. 'అట్లుంగాక, ౩౩౩

క. 'ఱేనియనుమరణమునఁ దన
మేను విడిచినట్టికాంత మేలిపదవికిం
దాను నతండును నరిగి య
నూనస్థిరసుఖము లందుచుండుట విందుః ౩౩౪

1. = అతిశయింపఁగా.

క. అని పలికి యపుడ యనలము
ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందన్
దనవల్లభుఁ దలచుచు వల
గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. ౩౩౫

క. స్ఫురితవిమానముమీఁద న
మరతతి వేష్టింప రత్నమయభూషణసుం
దరదివ్యమూర్తి వెలిగెడు
వరునిఁ గలసి పరమసౌఖ్యవైభవ మొసఁగన్. ౩౩౬

తే. లీల మూఁరిఁబో నచ్చరలేమపిండు
బలసి యభివందనము సేయఁ బొలిచె; నిట్లు
నన్నిపక్షియుగ్మంబు వర్తనముదోఁచె
బుణ్యవర్తనుఁ డగుట నాబోయ కపుడు. ౩౩౭

వ. తోఁచిన నతండు: ౩౩౮

క. 'ఏనును నిట్లగుదు' ననుచు
సూనినకౌతూహలమున నుల్లము వొదలన్
మే నెల్ల ముండ్లు సింపఁగఁ
గానఁ దఱిసి గళితరక్తకలితాకృతి యై— ౩౩౯

తే. అరుగు చుండువాఁ డొకచో దవానలంబు
గట్టిదిరి కాననం బెల్ల ముట్టి మండ
సంప్రమోదితచిత్తుఁ డై చక్కఁ జొచ్చి
యొడలు దొఱఁగి దేవత్వంబు వడసి యొప్పె. ౩౪౦

ఉ. ఈయితిహాస మర్థి మెయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు సుదాత్తగోహననపాతక మైనను; భూరిసౌఖ్యముల్
వేయివిధంబులం బొరయు; విన్ము, తగన్ [1]శరణార్థిఁ దోషితుం
జేయనినాఁడు కల్మషముఁ జెందు;— నొకప్పుడుఁ బాయ దేమిటన్.

---

1=శరణన్న వానిని సంతుష్టునిఁగఁ జేయని యెడల.

వ. అని యిట్లు శరణాగతరక్షణఫలవిశేషప్రకటనం బగు లుబ్ధకకపోతా ఖ్యానంబు సెప్పిన విని, యప్పితామహునిమీఁదం బ్రీతివినయ విస్తారవిలోకనం బెలయ నప్పాండవాగ్రజుండు — ౩౪౨

క. 'పాపంబు బుద్ధిపూర్వ
వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం
డేపాట దాని నంతయుఁ
బాపికొనం జాలు సుజనబాంధవ చెపుమా.' ౩౪౩

వ. అని యడిగిన, నయ్యార్యవర్యుం డాధరణీభరణధుర్యునకు ని ట్లనియె: తొల్లి పరీక్షిత్తనయుం డగుజనమేజయుం డనుమహారాజు దన కబుద్ధిపూర్వకబ్రహ్మహత్య వాటిల్లినం దత్కల్బిషంబు వాపి కొనియె. అది పురాణకథ యై మునులవలన వినంబడు. అత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము:— ౩౪౪

క. పాపంబు దొడరుటయు నా
భూపాలకుఁ బ్రజయ విడిచె; భూసురులును నిం
దాపాత్రంబుఁగఁ జేసిరి;
తాపము మదిఁ గదిరి యతఁడు దల్లడ మందెన్. ౩౪౫

తే. అట్లు జనమేజయుఁడు వగ నారఁ గూరి
పురము వెడలి, యొక్కరుఁడును బోయి కాన
నాంతరము సొచ్చి శౌనకుం డనుమునీంద్రు
నాశ్రమము [1]రోసికొని చని, యమ్మహాత్ము— ౩౪౬

వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు మొగిచి నిల్చినం జూచి యతండు— ౩౪౭

చ. [2]పెనుఁబొల వల్చుచున్న యది; పీనుఁగుఁ జూచినయట్టు లయ్యెడున్ నినుఁ గనుఁగొన్న. నీయొడకు నీ విది యేటికి వచ్చె? దెక్కడేఁ జనుము; శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలఁ గలాఁడ వీభవం బునతుదిఁ గ్రూరకాకచయముల్ దొలువ న్నరకాధివాసివై. ౩౪౮

1 = వెదకికొని. 2 = చెడుకంపుగొట్టుచున్నది.

చ. అనుటయు, '[1]గర్హ్య కర్ముఁ డగునట్టిదురాత్మునిఁ బూజితవ్రతుల్
గని యిటు లంట యుక్త; మటు గానఁగదా భవదీయపాదపం
దన మొనరించి మీవలన దారుణపాపము వాసికొందు నే
నను మది వచ్చినాఁడ! సదయుం బగుచూడ్కిఁ బరిగ్రహింపవే!'

వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగు నత్తపోధనసత్తముం డిట్లనియె:

క. విను, కొంద ఱల్పబుద్ధులు
నను నెంతయు ధిక్కరింప నవ్వుఁగ వారిం
గొనక, బుధులైన విప్రులు
ననిమిషులును మెచ్చుచుండ నని మొద నీతోన్- ౩౫౧

క. హీనప్రజ్ఞుఁడు కార్యము
లైనవి సేసి తుది వగచు; నతుల ప్రజ్ఞా
సానుమదారూఢుఁడు వగ
నూనఁడు [2]దురిత మనుపతితి కోడక యునికిన్. ౩౫౨

వ. ప్రజ్ఞాకార్యంబు లై యనుష్ఠింప వలయువాని జెప్పెద. నీకుం బాపంబు నెడ ననుతాపంబు గలిగి ధర్మప్రవణుఁడ వైతే? అనుటయు, నమ్మనుజనాథుండు- ౩౫౩

క. 'తాపసవర, తీవ్రం బగు
పాపాగ్ని జ్వాలచయముపాలుపడి పరీ
తాపము నొందుచు ధర్మ
వ్యాపారజలాభిలాషి నై యున్నాఁడన్. ౩౫౪

వ. 'భవదీయకృప నాశ్రయింప వచ్చితి; నన్ను రక్షింపవే' యనవుడు, నమ్మునీంద్రుండు- ౩౫౫

క. భీతి యొకటి గోరుటయును
నీతలఁపులలోన దీని కిది గత మనఁగా
నే తెరవును గలుగవు మ
చ్ఛ్రేయోగతి ధర్మవృత్తిఁ జిక్కుట దక్కన్. ౩౫౬

1 = నిందకుఁ డగునట్టి దుష్టాత్ముని. 2 = దురితము అనుపతితికి-'పాతికి' అనిరూపాంతర మగపడుచున్నది. పాప మనుమహాప్రవాహము నవు అని యర్థ మగును.

క. ఆతురత నీవు నాకడ
కేతెంచినదానఁ జేసి యెలసినధర్మ
ద్యోతనకౌతూహలమున
నీతోఁ బడ వలసె వినుము నిశ్చలమతి వై: ౩౫౭

క. భూవిబుధుల కెయ్యది హిత
మావిధమున నడచువాఁడ వగునది! ద్రోహా
భావంబు ప్రతిజ్ఞాతం
బై వెలయఁగ వలయు నీకు నాజాతియెడన్! ౩౫౮

చ. అనవుడు, 'ధర్మవృత్తము మదాత్మకు నైజము; ద్రోహవృత్తికిన్,
మునివర, యేను భీతుఁడ; సముజ్జ్వలవిప్రకులంబు నాకు మ
న్ననలకుఁ బాత్ర; మెవ్విధమునం దెగి ద్రోహము దానియందు నా
మనము దలంప దింతకును; మాన్య, భవచ్ఛరణంబు లంటెదన్.'

వ. అనుచుఁ దదీయపాదస్పర్శనంబు సేసి యవ్విధంబునం గృతశపథుం
డగుటయుఁ, గరుణాగోచరంబగు చిత్తంబుతో న త్తపోధనవర్యుం
డాదరమేదురావలోకనం బా భూపాలునిమీఁద నొలయ ని ట్లను:
'నన్నెనం జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపుము: ౩౬౦

సీ. శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగురాజు
భోగంబు దర్పంబుఁ బోవ విడిచి
ధర్మంబు గైకొని తపమును దానంబు
నధ్యయనంబును యాగవిధులు
నాచరింపఁగఁ జూచి యచ్చెరువడి యను
గ్రహము సేయదె భూతరాజి యతని?
యధిప, యయాతివాక్యమునర్థ మెఱిఁగింతు
వినుము: సరస్వతి యను దృషద్వ

తే. తియును ననుపుణ్యనదులందుఁ దిరిగి తీర్థ
సేవ సేయుచు నధ్యయనావధాన
దాననిర్ధూతరాగత్వదయులు గలిగి
పరఁగఁ బాపకళంకలేపంబు వాయు. ౩౬౧

వ. అదియునుం గాక యొక్కపరమస్మృతి సెప్పెద వినుము: ౩౬౨

చ. దురితము సేసి తాపమునఁ దూలిన, నిం కిటు సేయ సన్మతిం
బొరసిన ధర్మసంచరణబుద్ధియ మే లని యూఁదినం, గ్రియా
పరుఁ డయి మేలు సేసినను, బాదము పాదముగాఁ గ్రమంబునన్
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్. ౩౬౩

చ. నరవర, వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె: 'బుద్ధితోఁ
బొరయని పాతకంబులు సబుద్ధికపుణ్యములన్ నశించు [1]సం
బరమునఁ బట్టినట్టి మలపంకము గారములోన నద్దఁగా
విరిసినయట్లు; నమ్ము మిది! వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్' ౩౬౪

వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగునత్తాపసోత్తముం డా భూవరు బోధించి, తీర్థసేవాదిపునశ్చరణంబులం బరిపూతాత్ముం గావించి, యశ్వమేధంబు సేయించిన నుజ్జ్వలుండయి యజ్జనమేజయుండు నిజరాజ్యంబు పరిపాలనంబు సేసె నని చెప్పి వెండియు— ౩౬౫

—♦ భీష్ముఁడు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట. ♦—

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజు
నకు: "విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁ డైన, బంధులు పిత్రభూ
మికిఁ గొనిపోయి యమేయశోక
వివశాత్ము లై పలవింపగా, గ్రద్ధ యొ
క్కటి వచ్చి, 'మీర లిక్కడ భయంబు
దక్క యేడ్చుచునుండఁ దగ. దిదె క్రుంకెడుఁ
బొద్దు. రాక్షసులును భూతములుఁ బి

తే. శాచములు వచ్చి తిన నిపుడేచి వచ్చు.
జననమరణముల్ వింత లె! చన్న శిశువు

1 = వస్త్రమునకుఁ బట్టిన మురికి చవుడులో నద్దఁగా శుద్ధియగునట్లు — బుద్ధిపూర్వకముగఁ జేయని పాతకము పరాకుఁ జేసిన పుణ్యములచే నశించును. 'కారము' క్షారశబ్దభవము.

తోన యుందఱుఁ జనుటకుఁ బూనియుండు
వారలే! పొండు పీనుఁగు వైచి వేగ. ౩౬౬

క. 'తెగి పోయినవా రేడ్చిన
మగుడుదురే వెఱ్ఱులార! మానుఁడు; మీరుం
దెగుదురు దడసిన' నావుడు,-
'నగునట్టిద కర్జ' మనుచు నందఱు భీతిన్- ౩౬౭

వ. శవంబు విడిచిపోవం జూచిన, నొక్కనక్క బొక్కలో నుండి
వెడలి వారలతోడ- ౩౬౮

సీ. 'గ్రిద్దమాటల కేల కడు భీతిఁ బొందితి?
రక్కటా! బాలుని నబ్జవదను
నిటు వైచి పోవఁ గా నెట్లాడె! నేడ్వుఁడు
శోకంబు వోవ నిచ్చోట గొంత
ప్రొద్దంతలో విధి క్రూరుండు గాకున్నఁ
బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు
నో తెలుంగుదురే! యినుండును నస్తాద్రిఁ
జేరఁడు. వెఱవక మీరు నిలువుఁ'

తే. డనిన, వారును మనమున నాస పుట్టి
మగిడి వచ్చినఁ, గ్రిద్ద:'యి మ్మందబుద్ధి
యైన నక్కమాటలు విన నగునె! వికృత
మయ్యెఁ బీనుంగు! వచ్చునే యసువు లింక! ౩౬౯

క. 'కడు బెట్టిదుండు కాలుఁడు
మిడుక మిడుక నపహరించు! మీ రీయాసల్
విడువుఁడు; బాలునికి సుగతిఁ
బడయుఁడు దానాదులైన బహుధర్మములన్.' ౩౭౦

వ. అని పలికిన నాగృధ్రింబువచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు
వారల నుద్దేశించి- ౩౭౧

క. 'క్రూరంబు గృధ్రి! మిట్టికు
మారకునిం జూఛి చూచి మసలక పోవన్

మీ రెట్లోర్చెదరో! క
న్నీ రిటు పసుబోఁటులకును నిలువ కొలికెడుఁగా! ౩౨౨

క. 'దయ మాలి పోవ నేటికిఁ?
బ్రియత్నమున బొదువ దైవబలమున మీకుం
బ్రియ మెసఁగ బ్రదుకు. బ్రిదుకం
డయినను మఱిపోవరాదె?' యని చెప్పుటయుఁ. ౩౨౩

వ. గ్రిద్ధ యి ట్లనియె: ౩౨౪

ఆ. 'ఏను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱుఁ
గలవు వత్సరములు; గాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ-
జచ్చి పోయి మగిడి వచ్చువాని. ౩౨౫

క. 'ఒకటి గలదె?- వత్తురు వే
లోక గర్భంబునకు మృతులు; [1]నుక్కివ మా న
క్కకు నేటిబుద్ధి! పీనుఁగు
నకు బ్రిదు కెట్టు కలుగుఁ! నిట్టినవ్వులు గలవే?' ౩౨౬

సీ. అనవుడు, నెగ వెక్కి యాబిడ్డ వైచి పో
యెడువారలకు నడ్డపడుచు నక్క:
'వినుఁడు, రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే
మృతుఁ డైనభూసురసుతుని మగుడ?
సృంజయుకొడుకు నచ్చిన, నారదుఁడు ప్రభా
వంబునఁ గ్రమ్మఱ వానిఁ బడఁడె?
యట్టుల నొకసిద్ధుఁ డమరుండు మీ యేడ్పు
లాలించి దయ బాలు నసువు లొసఁగ

ఆ. నేని మేల కాదె? యిది యేల పోయెద?'
రనిన, వారు మగిడి యరుగుదెంచి
శిశువుశవము చుట్టుఁ జేరి పెల్లేడ్చిరి
పనవి పనవి;- యంత నినుఁడుఁ గ్రుంకె. ౩౨౭

1. = ఉక్కివ మానక్కకు = కపటి యైననక్కకు.

వ. ఆగృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి, తాన తాన బాలశవంబు నాహారంబు గొనుటకై యివ్విధంబునం దమతమ పలుకు నేర్పున నజ్జనంబుఁ గ్రమ్మఱించె. ప్రొద్దు గ్రుంకినం దానచ్చోట నిలువ నేరదు గావున గ్రద్ద యటమున్న వారు వోవునట్టి తెఱంగుమాట లాడె. రాత్రి యైనం దనకు మేలు గావున నక్క వారలు దడయుటకుం దగినచందంబుఁ జెప్పె. అది వాని తెఱఁగు. ప్రేతవనవిహారనిరతుం డగుశంకరుండు కరుణాకింకరుండు నగుట నప్పుడు— ౩౪౮

ఆ. అట్లు పనవి యేడ్చు నజ్జనంబులకుఁ బ్ర
త్యక్షు డై 'వరంబు లడుగుఁ' డనిన,
సంప్రమోదభక్తి సంభ్రమభరితు లై
చక్క నవనిఁ జాఁగి మ్రొక్కి వారు— ౩౪౯

క. 'బాలమరణశోకంబునఁ
దేలక యుండంగఁ గావు దేవోత్తమ, నీ
వాలించిన బ్రదికితిమి; ద
యాళుహృదయ, పార్వతీప్రియా, చంద్రధరా!' ౩౫౦

వ. అనుచు లేచి నిలుచుటయు, శివుం డాశిశువుప్రాణంబు లొసంగి, 'వీఁడు శతాయుస్సంపన్నుం డగువాఁ' డని యాన తిచ్చి యాగృధ్ర జంబుకంబులకు నాఁకలి యెన్నండును లేక యుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె. సంతోషంబున నంతరంగంబులు నంగంబులుం బొదల నజ్జనంబులు బాలు నెత్తికొని పలుమఱుం జూచుచు కౌఁగిలించుచుం జనిరి. గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచుం బోయి తమతమ కులంబులలోఁ బ్రభూతంబు లై ప్రవర్తిల్లె. ఆర్తజనబాష్పప్రమార్జనంబు ప్రభువులకుం గర్తవ్యం బగుటకును, నిజకార్యార్థు లగుకపటుల నేర్పుమాటల తెరువు లెఱింగికొనుటకును నుదాహరణం బైన యీగృధ్రజంబుకోపాఖ్యానంబు— ౩౫౧

క. వినినఁ బఠించిన వ్రాసిన
గొనియాడిన దురితపీడకుం దొలఁగి నరుం
డనుపమధర్మములకు భా
జన మగు; నాయుఃప్రవృద్ధి సంపద నొందున్. ३౮౨

—♦ భీష్ముఁడు ధర్మజునకుఁ బవన-శాల్మలీతరుసంవాదంబు సెప్పుట. ♦—

సీ. అని వినతుం డగు నాధర్మసుతునకు
ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు
ని ట్లను: "నిది యొక్క యితిహాస, మధిప, యా
కర్ణింపు: హిమవన్నగంబునందుఁ
గల దొక్క బూరుగు, గడుఁబెద్దకాలంబు,
ముదురు, శాఖాశోభి, మూలదృఢము;
నారదముని యొక్కనాఁడు త్తరువుపొంతఁ
జని చని వేడ్క ని ట్లనియె నెమ్మి:
తే. 'బూరువా, యింతపఱపును బొడవుఁ గల్గి
నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికి గని ప్రీతి నడిదెద ననిలుచేతఁ
బడు నొకప్పుడు తరులు; నీ పడమి యెట్లు? ३౮३

క. 'పవనునకును నీకును బాం
ధవము గలదొ! యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రదికితొ!
చెవులకు నిం పెసఁగ నిజము సెప్పుము నాకున్. ३౮౪

క. అనిన విని, బూరు వి ట్లను:
'ననిలునిబల మస్మదీయ మైనబలముతో
నెన గా; దేర్పడ విను, పదు
నొనిమిది యగునంశమునకు నేనయి దరయఁగన్.' ३౮౫

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు- ३౮౬

ఆ. 'అమ్మచెల్లి! యిట్టు లనకుము; కొండలు
లోను గాఁగ బవనుచే నపాస్త
మహిమ గలుగు టెఱుఁగుమా! భూతములచేష్టి
తములు వాయువశగతములు గావె?' ౩౮౭

క. అనుటయుఁ, బెలుచని యెలుఁగున
'ఘనమూలప్రబలశాఖికాదుర్జయు న
న్నును దాఁకిన నతనిప్రభం
జనుఁ డను నామంబునకు నసత్యత వచ్చున్. ౩౮౮

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలింజూచి సురమునిప్రవరుండు—

చ. 'మఱవక యుండు నీబిరుదుమాటలు! నీ విటు లంట మారుతుం
డెఱిఁగెడు నెట్లు!' నంచు వెస నేఁగి సమస్తముఁ జెప్పఁ, నాతఁ డే
డ్తెఱఁ జనుదెంచి 'నీ వటు కడిందిమగండవు! నిన్నుఁ దాఁకినం
జెఱు తఱు పేరు! బూరుగ, నశించితి గా కిట పల్కు లేటికిన్?'

మ. అని కోపంబునఁ బల్క నప్పవనుతో నాభూరుహం బింతపె
ల్చన 'నీ వాడెదునంతతక్కువనె! బేలా, లోకసామాన్యవృ
క్షనికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చం జూచితే!' యన్న, న
ల్లనినవ్వొప్పఁగ నాసమీరణుఁడు హేలాస్ఫారుఁ డై యిట్లనున్:

క. 'ఒకనాఁ డజుండు నీనీ
డకు [1]డబ్బాటరుగుదెంచుటయు, నమ్మేలా
త్మకు [2]వ్రేఁ గై మన్నించిన
మెకమెకపడి తిట్ల పలుకుమీ తగ రేపున్!' ౩౮౯

వ. అని పలికి [3]బలుమొగంబుతోడం బోయిన నబ్బూరువు దలంకి—

చ. 'మనగడ దప్పెనొక్కొ! మునిమాటలు గైకొన నైతి! నాబలం
బన నది యెంత! యుగ్రతమహాబలురాకకు నోర్వఁ జాల! నా

1. = అకస్మాత్తుగా. 2. = (ఆ యుపకారమాతని మనస్సునకు) భారమై
3. = ఆక్రోశమున.

తని నొకభంగి గెల్తు' నని తాఁ దలపోసి హరించె సాకులుం
గొనలును జొంపముల్ నిడుదకొమ్మలు [1]రేయుగుడుక రయంబునన్.
వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత, వేగుటయు- ౩౯౫
చ. ప్రతినకు నీడు గా భయదభంగి, బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
క్షితిరుహముం గనుంగొని 'యిసీ! యిది నాపని నీవ చేసి! తీ
ధృతి మతి సంతసింపు! మిట తేజముఁ బొందుము! నీదుబాంధవ
ప్రతతికి నివ్విధంబుసదుపాయము మే లెఱిగింపు పెంపునన్! ' ౩౯౬
వ. అని యుల్లసం బాడి సముల్లసద్గతి నాసదాగతి సనియె. అట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందె. ప్రబలునితోడ దుర్బలుండు దొడరి మత్సరగ్రస్తుండయిన నపాస్తవిభవుం డగు నని తెల్పు నప్పవన- శాల్మలీ సంవాదంబు పుణ్యాప్రదం బయిన యుపాఖ్యానంబు అని చెప్పిన, ౩౯౭
ఆ. పాండవాగ్రజుండు: 'పాపంబునకు నధి
ష్ఠాన మెద్ది భరతసత్తమాగ్రి
గణ్య? దాని నెఱుఁగఁగాఁ జెప్పు' మనుడు, నా
తనికి భీష్ముఁ డిట్టు లనియెఁ బ్రీతి : ౩౯౮
సీ. వినుము: పాపముల కెల్లను నధిష్ఠానంబు
లోభంబ; యది గామలోలతయును,
గ్రోధంబు, మత్సర ద్రోహంబులును, బర
ధనదారవాంఛలు, దైన్యపాటు,
వీని డాతుమా సత్యవిముఖభావంబును
గలిగించి, ధర్మంబు గలఁచి, నరునిఁ
[2]బ్రియి మాలి యేమిటి కయినను [3]గర్ధించు
వానిఁగా సమకట్టుఁ; గాన లుబ్ధ
ఆ. జనులఁ దొఱఁగి, [4]లోభ మనుతిరిం బడనిస
కులను బరమధార్మికులను

యగుటతో. 2 = సిగ్గుమాలి. 3 = ఇచ్ఛగించువానిఁగాఁ. చేయును
వను పెలిక (కుడి) యందుఁ బడనట్టి...

బాపభీతమతులఁ [1]బనిగొను; లోభంబు
జెంద నీకు నీదు చిత్తవృత్తి. ౩౯౯

వ. అనిన విని, యజాతశత్రుండు: 'అజ్ఞానం బాపదలకును దుర్గతికిని మూలం బని విందు; దాని తెఱం గెఱింగింపుము' అనిన, నాపగా తనయుం డమ్మనుజపతి కి ట్లనియె: ౪౦౦

క. రోషము శోకము రాగ
ద్వేషము లభిమాన దర్ప వేగాలస్య
శ్లేషము లజ్ఞాన మని మ
నీషిజనము సెప్పు మాననీయచరిత్రా. ౪౦౧

క. విను, లోభము నజ్ఞానం
బును సదృశఫలప్రదముల; పుట్టును లోభం
బున నజ్ఞానము; గావున, జననాయక,
లోభ ముడుగ సౌఖ్యము లొందున్. ౪౦౨

ఆ. అనిన, ధర్మపుత్రుఁ: 'డనఘ, ధర్మంబు నా
నాప్రకారగతి వినంగఁ బడు; మ
దీయచిత్తమునకుఁ దేటపడంగ వి
శిష్టధర్మ మెద్ది సెప్పు' మనుడు— ౪౦౩

వ. ప్రియం బంది భీష్ముం డతని కి ట్లనియె: ౪౦౪

—♦ భీష్ముఁడు ధర్మజునకు దమప్రభావం బెఱింగించుట. ♦—

క. తమతమ కలవడువిజ్ఞా
నముల తెరువు లాదరించి నానాగతులన్
సుమతులు ధర్మము దెలిపిరి;
దమము పరాయణము, ధీరతమ, యన్నిటికిన్. ౪౦౫

తే. దమము నిశ్శ్రేయసము పుణ్యతమము ధర్మ
సార; మది వెలిగా ధర్మసంచయంబు
సిద్ధిఁ బొందునె? దమముతో బుద్ధి పొందు
గనినఁ బొందనియున్నతుల్ గలవె యధిప? ౪౦౬

1. —నియోగింపుము.

క. 'దమముం గడచినసద్ధ
ర్మము లే' దని విందు నాశ్రమము లన్నిటికిన్;
దమవంతుఁడు గామముఁ గ్రో
ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్.

క. [1]శీలంబు మైత్రి కరుణ యు
లోలుపభావము తితిక్ష లో నగుమునిలో
కాలంబనీయసద్గుణ
జాలంబు దమంబురూపసంపద యధిపా.

క. [2]గుహాయందు నిహిత మని యెడు
మహనీయబ్రహ్మపదము మహితదమత్వో
పహితుం డగువానికి స
న్నిహితం బని చెప్పుదురు మనీషిజనంబుల్.

వ. అని విశదంబుగా వివరించె.

ఆ. అట్లు దమముమహిమ యాదరంబున విని
యమృతసేవ సేసినట్లుపోలె
హర్షమయమనస్కుఁ డై భీష్ము నడిగె నా
ధర్మనందనుండు దపమువిధము.

వ. అడిగిన నతం డతని కి ట్లనియె:

—♦ భీష్ముఁడు ధర్మజునకుఁ దపంబువిధము సెప్పుట. ♦—

క. తపము [3]నిదానము ధర్మ
ప్రపంచమున కెల్ల; దానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు, ర
ధిప, ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్.

1. తా. మునిసమాజమునకు అలంబనీయమైన మంచి నడత, నేస్తము, కనికరము, తగులాటములేని మనస్సు, ఓర్పు లోనగు గుణసంచయము దమము యొక్క సంపత్తి. 2. తా. గుహ (గొందబిలము న) యం దున్నది అని యెడు పరపదము, స్వచ్ఛ మగుదమము-దాంతి (=ఇంద్రియనిగ్రహము) గల మహనీయుని ఘనునకే యుండు నని ...... 3. పరీక్ష (=Diognasis).

క. విను, [1]మశననిగ్రహము దప
మను నభిధానంబు గలమహాధర్మము; త
ద్ధనవంతుచిత్తవశగతిఁ
జను నఖిలస్థావరమును జంగమతతులున్. ౪౧౪

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు
లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున; సత్యశౌచాదు లోలియు;
నఖిలసిద్ధులు నట్టిచేత నావహిల్లు. ౪౧౫

వ. అనిన విని, 'దేవ పితృ భూదేవగణంబులు సత్యంబు ప్రశంసించును. తదీయస్వరూపంబును నది దొరకొను తెఱంగును నెఱింగింపు' మని యడిగిన, నజాతశత్రునకు శంతనుపుత్త్రుం డి ట్లనియె: ౪౧౬

— ♦ భీష్ముఁడు ధర్మజునకు సత్యస్వరూపాదులు సెప్పుట ♦ —

క. సమతయు, దమముఁ, దితిక్షయు,
నమత్సరము, హ్రీయు, ధృతియు, ననసూయార్య
త్వములు, నహింసా దాన
క్షమాత్యజన సూనృతములు సత్యమువూర్తుల్. ౪౧౭

క. సత్యాకృతు లగుగుణములు
నిత్యానుష్ఠితసమగ్రనిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము;
లత్యంతసుఖప్రదంబు; లవి కార్యంబుల్. ౪౧౮

చ. ఇదురు సమస్తధర్మములకున్ విను సత్యము; యోగమోక్షస
త్ప్రదములు సత్యకార్యములు; పాప మసత్యముకంటె నొండు లే
దు దలఁప; నశ్వమేధములు దొమ్మిదినూఱులు వెండి నూఱునై
యొదవిన నీడు గావు, భరతోత్తమ, సత్యముతోడ నారయన్.

వ. అనిన విని, ధర్మతనయుండు: 'అరిషడ్వర్గం బేమిట నుదయించు? ఎట్లు సమయు?—ఎఱింగింపవే!' యనుటయు, ననిమిషనదీనందనుండు ధర్మనందనున కి ట్లనియె: ౪౨౦

1.—భోజననియతియుఁ దపస్సు పేరి మహాధర్మము.

—◆ భీష్ముఁడు ధర్మజున కరిషడ్వర్గాదులు దెలుపుట. ◆—

సీ. [1]మనుజేంద్ర, సంకల్పమునఁ బుట్టుఁ గామంబు;
రూపఱు దేహానిరూపణమునఁ;
బరులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధ; మ
క్షీణాత్మమాయుక్తిఁ జేసి పొలియు;
భూతాస్థిరత్వంబు బుద్ధిఁ గానమి లోభ,
మనఘ, జనించుఁ; గాంచిన నడంగు;
నజ్ఞానమున మోహ మావహిల్లు; నధర్మ
లేపవర్జనమున లేక తక్కుఁ;

తే. గులమునను విద్య ధనమునఁ గలుగు మదము;
మరలి వానిపెంపూహింప మఱది పోవు;
సాత్త్వికుఁడు గామిఁ బొడము మాత్సర్య; మదియుఁ
జెడుఁ, గురూత్తమ, సాధుసంసేవనమున. ౮౨౧

క. ఈయాఱింటను సకలా
పాయంబులు మానవులకుఁ బాటిలు; వీనిం
బాయంగ జడియ నోపిన
ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్. ౮౨౨

క. ఇవి దోషదేశులభంగిం
గవియు బురుషు ధైర్యహానిఁ గనికొని; ధైర్యం
బవలంబించిననరుఁ జే
రవు; వీనికి నిదియ తెఱఁగు రాజవరేణ్యా. ౮౨౩

1. తా. సంకల్పమునఁ గామము (=కోరిక) పుట్టును; దాని స్వరూప మెఱిఁగిన నది (రూపు + అఱు — రూపఱు =) నశించును. పరుల దుష్టత్వమునఁ గ్రోధము ప్రభవించును; తెలిగిని యోర్పుచే నది పొలియును. ప్రాణుల అస్థిరత్వము దెలియమిచే పిసినిగొట్టుతనము జనించును; దానిఁ దెలిసికొనినచో నది యడంగును. అజ్ఞానమున [illegible]ము (=వలపు) ఆవహించును; అధర్మమును వదలుటచే నది వదలును. కులము ధనమువలనను విద్యవలనను మదము గలుగును; వాని విజృంభణము గ్రహించిన [illegible]గును. సాత్త్వికుఁడు గాక పోవుటవలన మాత్సర్యము (=మచ్చరము; [illegible]ఉఱాపును, సాధుజనులను సేవించుటచే నది తొలఁగును.

తే. అధిప, యివి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁ
గలిగి యుండు; నీబుద్ధి నొక్కండుఁ జొరదు;
సారధీరతాసంపదుదారమతివి
గాన నింకనుఁ నిర్జింతు వీని నెల్ల. ౪౨౪

వ. అని వెండియు, ౪౨౫

క. [1]హింసావిహారి యైనన్నృ
శంసుం డీయాఱుఁ గలుగు జనుకంటెను గీ,
డంసప్రదేశలలితో
త్తంసీకరణోపలాల్య ధరణీవలయా. ౪౨౬

క. [2]మే లనుభవించుఁ జుట్టము
లాలోకింపంగఁ గుజనుఁ; డదియు నృశంసా
శీలము; పంచి కుడుచునతఁ
డేలోకంబునకుఁ బేర్మిఁ యెసఁగ సుఖించున్. ౪౨౭

వ. అని చెప్పి వెండియు, ౪౨౮

ఆ. [3]విను, కుటుంబభృత్యజనజీవనంబు ద్రి
వర్షములకుఁ గల్గు వాఁడు, నధిక
మొదవినట్టియతఁడు, నుర్వీశ, యర్హులు
మానసీయసోమపానమునకు. ౪౨౯

క. [4]క్రతువు లొనరించుభూసుర
తతికిఁ గ్రియాశేషయోగ దానాదులు దు

---

1. తా. హింసయే వృత్తిగాఁ గల క్రూరుఁడు పైయాఱు దుర్గుణములుం గల వానికంటె కీడు... 2. తా. చుట్టములెల్ల చూచుచుండఁగాఁ దానుమాత్రము సౌఖ్యపడుచుండు వాఁడు కుజనుఁడు (=దుష్టుఁడు); అదియుఁ గ్రూరచర్యయే. అందఱితోఁ బంచుకొని యనుభవించువాఁడు ఏలోకముననను సుఖపడును. 3. తా. తనకుటుంబమునకును పరిజనమునకును మూఁడుసంవత్సరములకు సరిపడు జీవనోపాధిగల వాఁడును, అంతకన్న అధికముగాఁ గల వాఁడును సోమపానము (యజ్ఞము) చేయ నర్హులు. 4. తా. యజ్ఞయాగాదులు సేయు బ్రాహ్మణ బృందమునకు కర్మసమాప్తికై వలయు దానములు లోనగునవి, దుర్గతివలనఁ గొఱఁతపడినచో, వానినిగ్రహించి రాజగువాఁడు సమకూర్ప వలయును.

ర్గతిఁ గొఱఁతవడిన, ధరణీ
పతి నెఱపఁగ వలయు వానిఁ బరికించి తగన్. ౪౩౦

క. ధన ధాన్య పశు సమగ్రుం
డనఁ బరఁగెడునట్టి వైశ్యుఁ డధ్వరముం జే
యనినాఁడు, బ్రాహ్మణాధ్వర
మునకు నతనిసొమ్ము రాజు పుచ్చి యిడఁ దగున్. ౪౩౧

క. కుడువక పెట్టక శూద్రుఁడు
కడునెక్కుడు గూర్చినట్టి కనకముఁ గొలుచుం
బుడమిపతి ధర్మకృతులకు
నిడునది సగము గొని మేదినీశ్వరవర్యా. ౪౩౨

క. [1]విను, విప్రులు పేద లగుట
మనుజేంద్రుఁడు బుద్ధిలేమి; మాతాపితృ భా
వన నతఁడు వారిఁ బ్రోచినఁ
గను మేలున కెల్ల గలదె కౌరవనాథా ? ౪౩౩

క. [2]ఆమద్రవ్యము మణియును
రామయు శుచు లగుటఁ గాదె రామారత్నా
రామత దగ వగు, దుష్కుల
మై మెచ్చుమిదోఁచెనేని, ననిరి మునీంద్రుల్ ? ౪౩౪

క. [3]అమృతము విద్యయుఁ బరమహి
తము సేయుటఁ బుచ్చికొందురు దానిని దానిన్
సుమతులు, విషమువలన నై
న, మహీశ్వర, నీచ మగుజనముచే నైనన్. ౪౩౫

1. తా. బ్రాహ్మణులు పేదవా రగుటకు రాజు బుద్ధిమాలినతనమే కారణము. తల్లిదండ్రులభావనతో నతఁడు (=ఆరాజు) వారిని (ఆబ్రాహ్మణులను) బ్రోచినచో ఆరాజుం జెందు మేలునకు ఎల్ల (=హద్దు; సీమ; మేర) గలదా? 2. తా. అపక్వవస్తువులును, మణియు, కన్యయు, శుచిగలవి యగుటచేత నేగదా చెడుకులమునకుఁ జెందినవిగ దోఁచినను అవి యోగ్యములగునని మునీంద్రులనిరి. 3. తా. అమృతము విద్యయు మేలు సేయునవి గావుననే బుద్ధిమంతులు వానిని విషమునుండియైనను, నీచజనముచేనైనను పుచ్చికొందురు. విషమునుండి అమృతమును, నీచజనమునుండి విద్యయు గ్రహణయోగ్యములు.

సర్వజనసమ్మతంబు; ధనువునకు బాణంబులకు వైకల్యంబు వాటిల్లినయెడం బరవీరపరిహారణంబునకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మే లని యుండుదు. ఆతలం బెట్టిదియో తెలిసికొనవలయు; తత్ప్రభవ ప్రభావంబులుం దదీయపూర్వాచార్యునిం జెప్పవే' యని యడిగిన- ౨౫౧

—♦ భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావంబు తెలియఁ గఱపించుట. ♦—

సీ. అతనికి నాతఁ డి ట్లను: బ్రహ్మ జగములు
సృజియించి భూతసంసృష్టి సేయు,
దివిజమర్త్యాదిజంతువు లమ్మహాత్ము వి
ధించిన తెరువులఁ దిరిగి బ్రదుకు
చుండ, దైత్యులు సముద్దండత నన్యాయ
వర్తులై సురమునివ్రాతములకు
బాధ లొనర్ప, నప్పరమేష్ఠి హిమశైల
తటమున వేయువత్సరము లధిక

తే. నియతిమెయిఁ దప మొనరించి నిష్ఠఁ గ్రతువు
సేసె; నయ్యగ్నిఁ బుట్టె నశేషలోక
భీతికర మగునుగ్రంపుభూత మొకటి
[1]ప్రాంశుకృష్ణ మై దంష్ట్రలు ప్రజ్వరిల్ల. ౨౫౨

ఆ. అప్పు డినుఁడు మాసె, ననిలుండు సుడివడి
వీచె, నుల్క లుఱిలె, వెఱఁ దలంకు
సురల మునులఁ జూచి సరసిజభవుఁ: 'డిది
నాదుమతమ యెండు గాదు వినుఁడు- ౨౫౩

వ. 'ఇది రాక్షస నాశంబునకుం దోఁచినయుత్పాతంబు. లోకంబుల రక్షింపను, రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబుఁ గల్పించితి'- అని పలుక నాభూతం బారూపంబు విడిచి ఖడ్గాకృతి [illegible] మెఱుంగులు దిక్కులు దీటుకొనం బొల్చిన- ౨౫౪

1. నలుపునైన భూతమొకటి కోరలు విస్ఫురింపఁగా బుట్టెను.

క. కమలాసనుండు నిజచి
త్తము భక్తిమయంబు సేసి తలఁచె హరుని; ఫా
లముకంటిమంటతో న
య్యమరవరదుఁ డేఁగుదెంచె నచటికి నెమ్మిన్. ౨౨౫

ఉ. వచ్చినఁ దత్పదాంబురుహవందనపూర్వము గాఁగఁ బద్మజుం
డిచ్చెఁ గృపాణ; మవ్విభుఁ డహీనసముద్యమలీలఁ గ్రాలుచుం
బుచ్చికొనంగ, నాసభ యపూర్వమనఃప్రమదంబుతోడి పే
రచ్చెరువాటు నొందె; నటు [1]లయ్యసిఁ గైకొని మేను పెంచుచున్.

తే. హరుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును
విని సముద్ధతరయమున దనుజకోటి
మునుగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ
ధించి యిల యెల్ల నెత్తుట ముంచె నతఁడు. ౨౨౬

ఉ. దైత్యుల నిట్లు గీటడఁచి ధర్మము నిల్పి ప్రసన్నమూర్తిసాం
గత్యము నొంది యప్పరమకారుణికుండు, త్రిలోకరక్షణా
దాత్త్యమునన్ వెలుంగుహరిఁ దద్దయు వేడుకఁ బిల్వఁ బంచి, సం
ప్రీత్యభిరాముఁ డై యొసఁగెఁ బెంపుగ నమ్మహనీయఖడ్గమున్.

వ. అట్లొసంగినం గైకొని దుష్టదమనం బాచరించుచు నుండెడు నవ్విష్ణుండు మహాస్త్రరూపం బగునయ్యాయుధంబు పదంపడి మరీచి కొసంగె. మరీచి భార్గవునకు, భార్గవుం డనేకమునులకు, మును లిందునకు; ఇంద్రుండు లోకపాలురకు నొసంగె. క్రమంబున మనుప్రభృతు లైనమానవేంద్రులు వడసి నిజసంతతికి నిచ్చుచు వచ్చిరి. అందు దుష్యంతుండు భరతునకిచ్చె. ఆభరతువంశంబునందు ఖడ్గసంప్రదాయంబు గలిగి వచ్చె. ఒకముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపున కిచ్చె. కృపునిచేత మీ రేవురుం బడసితిరి. విశేషించి యీవిద్యయం దత్యంతాదరణవంతుండ వగుటం జేసి దీనివలన వెలసితివి. [2]నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక, అగ్ని యధిదేవత, గురుండు రుద్రుండు అని చెప్పి,

1. = ఆఖడ్గమును, 2. = కత్తికి.

వెండియు నిట్లను: అసి విశసనంబు ఖడ్గంబు తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగర్భంబు విజయంబు ధర్మపాలంబు అన నెనిమిది పూజ్యనామంబులం బరఁగి కృపాణంబు ప్రహారణంబులలోన నం బ్రధానంబై నెగడుచుండు. ౨౨౯

క. సుమహిత మగునీఖడ్గా
గమ మగుపుణ్యకథ వినఁగఁ గాంచినపురుషుం
డమితయశంబును నధిక
ప్రమదంబును సద్గతియును బడయుఁ గుమారా. ౨౩౦

క. అని యిట్లు నకులునకు భీ
ష్మని చెప్పినకథ సుచిత్తమున విని కుంతీ
తనయాగ్రజుండు పురికిం
జనియెడుప్రొద్దగుడు వినయసంభృతుఁ డగుచున్. ౨౩౧

వ. సముచితంబుగా నమ్మహాత్ముని వీడ్కొనిచని యోగ్యవర్తనంబు లాచరించి వినోదగోష్ఠిఁ గండి విదురునిం దమ్ముల నుపలక్షించి 'ధర్మార్థకామంబులయం దుత్తమ మధ్య మాధమత్వనిరూపణంబు సేయుఁడు చూత' మని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె:

—♦ ధర్మజునితో విదురాదులు ధర్మార్థకామంబుల తారతమ్యంబు చెప్పుట ♦—

క. విను, ధర్మంబున ధన మగు;
ధనమున సిద్ధించుఁ గామతంత్రం; బటు గా
వున, మధ్యమంబు నధమము
ధనకామము; లుత్తమంబు ధర్మం బధిపా. ౨౩౩

చ. అనవుడుఁ, బార్థుఁ డిట్టు లను: నర్థము మూలము ధర్మ కామవ
ర్తనముల; కట్లుగాకయు, విరక్తతనొంది జటాదిధారణం
బునఁ జరియించువారికిని, భూవర, యర్థము దేహకృత్యసా
ధన; మను రేజ్యకణ్వులును దానిన మే లని పూని చెప్పరే? ౨౩౪

వ. కావున నర్థంబు ప్రధానం బనుటయు నకులసహదేవు లేకవాక్యులై యి ట్లనిరి: ౨౩౫

తే. అర్థ ధర్మంబు లితరేతరాశ్రయములు
గాన వానిలో నొకఁడూఁదు మానవేంద్రు
జగము పోకులఁ బుచ్చు; [1]నసంభృతార్థుఁ
డైనవానికిఁ గామ మప్రాప్య మరయ. ౪౫౬

క. తమలో సరి ధర్మము న
ర్థము; నర్థంబునకుఁ గామతంత్రము ఫల రూ
పము; గావున, నప్పురుషా
ర్థమునుం గొనియాడ వలయు ధరణీనాథా. ౪౫౭

వ. అనిన విని పవననందనుం డి ట్లనియె. ౪౫౮

క. దధిసారముచందంబున,
నధిపా, ధర్మార్థసార మగుకామరసం
బధమ మనుతలఁపు సుఖసం
విధానబాహ్య మని నీవివేకమ యెఱుఁగున్. ౪౫౯

క. విను, మళి [2]యలరునఁ దేనియఁ
గొనుగతి నత్యంతసుఖము గొన నగుఁ గామం
బున; నధికసుఖము లొండని
జనుసేరి [3]యెనుకొల్చు లేనిసస్యము కాదే? ౪౬౦

తే. [4]అనఘ, ధర్మార్థకామంబులందు నొకట
నర్థిఁ దగిలినమానవుం డధముఁ; డొకటి
మాని వర్తించునాతఁడు మధ్యముండు;
నడపు నన్నింటి నుత్తమ నాయకుండు. ౪౬౧

క. అని యి ట్లందఱుఁ జెప్పఁగ
విని చిఱునవ్వున ముఖారవిందము చెలువం

---

1. = నిండుగా నర్థము (= ధనము) లేనివానికిఁ గోర్కులు సిద్ధింపవు. 2. = (తుమ్మెద) పుష్పమునఁ దేనియం గొనునట్లు. 3. = గింజగల ఎన్ను (= సస్యమంజరి) వేయని వైఖరిగదా! 4. = తా. ధర్మార్థకామములలో నొకదానినే అవలంబించువాఁడు అధముఁడు. ఆమూఁడింట నొకటివదలి వర్తించువాఁడు మధ్యముఁడు. ఆ మూఁటిని క్రమముగా నడపువాఁడు ఉత్తమ నాయకుఁడు.

బినుమడిగా ధర్మజుఁ డి
ట్లను వారలఁ గలయఁ జూచి యాదర మెసఁగన్: ౪౬౨

వ నా యడిగిన తెఱంగునకు విదురునివాక్యంబు సిద్ధాంతంబు; తక్కటి
వారివచనంబులు నొక్కొక్క మెయి నాదరణీయంబులు. అది
యె ట్లుండె-నామతంబు వినుండు: ౪౬౩

క. [1]భూతములు జరామరణో
పేతంబులు; గాన, మోక్ష మెదఁ గోరుట మే,
లాతతవర్గత్రయసం
జాతమనోదుఃఖభారసహుఁ డగు కంటెన్. ౪౬౪

వ. అది గోరిన దొరకొనునే యందు మేని, ౪౬౫

క. [2]మనమున ధర్మము నర్థం
బును గామముఁ గీలుకొనక, పొరపొచ్చెము లై
చన, సుఖదుఃఖంబుల మద
మును దైన్యముఁ బొంద కునికి మోక్షకర మగున్. ౪౬౬

వ. అనిన విని వార లందఱు నభినందించిరి. మఱునాఁడు నదీనందనుం
గొలిచి యుండి ధర్మనందనుండు, 'నరపతులకు వలయువారును,
వలవనివారును నెట్టెట్టివారు?' అని యడిగిన, నమ్మహాత్ముం
డమ్మహీపతి కి ట్లనియె: ౪౬౭

ఉ. తాలిమిఁ బేర్చువారలును, ధర్మవిధిజ్ఞులు, సత్యవంతులున్,
లోలత లేనివారు, మదలోభనిరర్థకకోపహీనులు,
న్శీలసమేతులుం,- బలుక నేర్చుట [3]కార్యముకాన్పు పెంపుమైఁ
జాలుట- గల్గుభృత్యులును సంపద సేయుదు రాత్మభర్తకున్. ౪౬౮

---

1. = తా. ప్రాణులు జరామరణములతోఁ గూడినవి కావున, తెంపులేని (-గార ధన పుత్త్రి) ఈ వర్గత్రయమువలనఁ బుట్టెడు మనోదుఃఖముల భారమును మోటకంటె, మోక్షము (= విడుదల) ను గోరుట మేలు. 2. తా. ధర్మమును కామమును మనసున్నఁ దగులొక్కనీక, అవి (ఆ ధర్మార్థకామములు) లై, పోవఁగా, సుఖము వచ్చినపుడు మదమును, దుఃఖము వచ్చినపుడు (దీనత్వము) బొందకుండుట మోక్షకర మగును. 3. = కార్యముమీఁది చూపు వీక్షణము,)

ఉ. క్రూరుఁడు, లోభియుఁ, శఠుఁడుఁ, [1]గొండియుఁడుఁ, జడుఁడుం, గృతఘ్నుఁడుఁ,
నేరనివాఁడు, బొంకరియు, నిందకు నోర్చునతండుఁ, బందయుఁ,-
ధీరత లేమి- దుర్నయ మతివ్యసనత్వముఁ గల్గువారలుం-
జేరువ నున్కి- భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా. ౪౬౯

క. ఒప్పనిగుణములఁ బరఁగెడు
నిప్పురుషాధములలోన నెల్లఁ గృతఘ్నుం
డొప్పఁడు గడు; ని ట్లగుటం
జెప్పెదునితిహాస మొకటి సెప్పెద నధిపా. ౪౭౦

వ. అది కాశ్యప గోత్రమాఖ్యానం బనం బెద్దలగోష్ఠిం బ్రవర్తిల్లు. ౪౭౧

—♦ భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘుని చరిత్రము సెప్పుట. ♦—

చ. విను, మొకబ్రాహ్మణుండు కులవృత్తము పెంపుఁ దొఱంగి బోయదా
ని నొకత నాలిఁ జేసికొని నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం
జనుఁ; దిను మాంస; మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపఁగాఁ దగువిధంబని చూచి వణిగ్జనంబుతోన్- ౪౭౨

వ. చెలిమి సేసి కొందఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబు నకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ, గిరిగహన దుర్గమస్థలంబున నొక్క- వనగజంబు- ౪౭౩

ఆ. [2]సాతులోని కుఱికి జనముల నున్మద
లీల నేలఁ బెట్టి కాలఁ జమరఁ
జొచ్చుటయును, భీతి విచ్చి నల్దిక్కు-లఁ
బఱచి రెల్లవారు బటురయమున. ౪౭౪

క. ఆయనయుఁ [3]గాందిశీకుం
డై యుత్తరదిక్కు- వాఱె నతిదూరముగా
నోయెడ నొకమార్గము గని
పోయెను దాను నట పోవఁ బోవం గెలనన్- ౪౭౫

1. = కొండెగాఁడు; చాడీలుచెప్పువాఁడు. 2. = వర్తకసమూహము- పథిక సమూహములోనికి. 3. = వెఱపునఁ బాఱినవాఁడై.

తే. పొదలతలఁచున జొంపమై పొడవుఁ బఱపుఁ
గలిగి వటుప్రవఁదనమునఁ జెలువు మిగిలి
యున్న వటభూరుహముఁ గని యుల్ల మచట
నిలువఁ గోరిన నామూ్రనినీడఁ జేరి- ౪౭౬

క. వనలతలకుసుమగంధము
గొని సుడివడుగాడ్పు డప్పిఁ గొండొక దేర్పం
దను పారునచటఁ గూర్చుం
డె నతం; డ ట్లుండ నచ్చటికి లలితగతిన్- ౪౭౭

వ. ఒక్కమహాబకంబు వచ్చె. అది పద్మభవునకుం బ్రసాదపాత్రం బగుచు నాడీజంఘుండును రాజధర్ముండు నను పేళ్ళం బరఁగు. ఆ కొక్కెరకు నమ్మఱ్ఱి నివాసం బై యుండు. అప్పక్షి యు ల్లెలించి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొనుచూడ్కి నాదరించి,

క. 'ఎం దుండి యేమిపనికై
యెందుల కరిగెదవు భూసురేశ్వర? ప్రీతిం
బొందితి నినుఁ గని; తగియెడు
వింద వయితి నాకు; నీదువిధముం జెపుమా.' ౪౭౯

వ. అని యడిగిన నతం: 'డేను మధ్యదేశీయుండ; గౌతముండ; ఒక్క మహానీయచరితుని పుత్రుండ. [1]ఆలస్యంబున వేదాధ్యయనాది విప్రకర్మవిరహితుండ నయి కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయబలం గలసి యుండి, పేదఱికంబునకు నలసి బేహారంబువెంట నొక్క [2]సాతుం గూడి పరదేశంబున కరుగుచోట గిరిగహనదుర్గమప్రదేశంబున- ౪౮౦

క. 'వనకరి యొక్కటి యాసా
తునకుఁ గవిసి జనచయంబుఁ దుంపఁ దొడఁగుడున్,
విను, మెల్లవారునుం గను
కనిఁ బఱచిరి; భీతి నేను గాననభూమిన్- ౪౮౧

1. సోమరితనమున. 2. = వర్తక (పథిక) సమూహమును.

ఆ. 'పఱచి దిక్కు దప్పి, భాగ్యంబుకల్మి నీ
దైన నిలయమునకు నరుగుదేరఁ
గంటి' ననిన, 'మేలుగాక! నీదారిద్ర్య
మపనయింతుఁ జింత యపనయింపు. ౪౫౨

వ. 'అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొనుము' అని రుచిమంతంబు లగుమందాకినీమీనంబులు సుపక్వంబులు సేసి మధురంబు లగు వన్యఫలంబులు దెచ్చి తృప్తి యగునట్లుగా నతనికి నాహారవిధి యొనర్చి, రాత్రి యగుటయుం బల్లవపుష్పసాంద్రం బగు శయనంబు గల్పించి, యబ్బకపతి యద్ధరణీసురునితోడి సముచిత సల్లాపంబులను సుఖనిద్రను నారాత్రి గడపి, వేగుటయు నవ్విప్రు నాలోకించి, ౪౫౩

క. విను, 'మిత్త్రుండును రజతముఁ
గనకము బుద్ధియును; నాల్గు కారణములు మ
ర్త్యునిదారిద్ర్యము వాయుట'
కని దేవగురుండు సెప్పె;-నన్నిటిలోనన్- ౪౫౪

క. మిత్త్రం డెక్కుడు; కాశ్యప
పుత్త్రుఁడ నగునేను నీకు, భూసురవర, ప
న్నైర్ఋతి యనుష్ఠించెద నట
పాత్రము గాకుండుదే యపారశ్రీకిన్! ౪౫౫

తే. నాసఖుండు విరూపాక్షు నామధేయుఁ;
డతనిపురము మధువ్రజ; మదియు మూఁడు
యోజనము లిచ్చటికి; దాని కున్న తెరువు
వట్టి వే చని యాదైత్య భర్తఁ గనుము. ౪౫౬

క. కాంచి యతనితో నేఁ బు
త్తెంచితి నని చెప్పు; మతఁ డతి ప్రీతుం డై
కాంచనమును రత్నంబులు
నంచితుఁగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్. ౪౫౭

క. అని యప్పురిదెస సెప్పినఁ
జని యాతం డతనిఁ గాంచి, సముచితభంగిన్
వినిపించె రాజధర్మున
కనుగల మగుసఖుఁ డ ననియు, నతనిపనుపునన్- ౪౮౮

తే. అరుగుదెంచితి ననియు, ధనార్థి ననియు,
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుండు
[1]దేఱకొనఁ జూచి యాత్మ నిప్పాఱుఁ డధముఁ
డగుట దోఁచుచు నున్నది యడుగ వలయు- ౪౮౯

వ. అని తలంచి- ౪౯౦

క. 'కులమును విద్యయు వృత్తముఁ
గలరూ పెఱిఁగింపు' మనినఁ, గలఁగక తన్నుం
దెలియంగఁ జెప్పె విప్రుం;
డలఘుం డగునసురపతియు నవికృతుఁ డగుచున్- ౪౯౧

క. 'ఇతఁ డెట్టిఁ డైన నే మగు!
నతనికి సఖుఁ డట్టె! బకమహాత్తరసఖ్యం
బితనిం బాత్రముఁ జేయదె!
యితనికిఁ దృప్తి యగునట్టు లిత్తు ధనంబుల్.' ౪౯౨

వ. అని నిశ్చయించి యాతనికి నాహార [2]సంఛాదనంబులు సమీచీ
నంబులుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి, మఱునాఁడు
కార్తికపౌర్ణమాసియైన భూసురసహస్రంబులు దనగృహంబునం
బసిండిపళ్లెరంబుల భోజనంబులు సేయను, బహుళదక్షిణలు ప్రతి
గ్రహింపనుం గలనైమిత్తికక్రియానుష్ఠానంబులు గలిగిన నమ్మహా
జనంబులలోఁ గలపి యత్యంతాదరంబున- ౪౯౩

క. మహనీయబహుళపూజా
సహితంబుగ భోజనంబు సంతృప్తిగ న
మ్మహితాత్ములకు నడపి దు
ర్వహభారము గాఁగఁ గనకరాశియు మణులున్, ౪౯౪

1. = తేఱుబడఁజూచి. 2. = వస్త్రములు శుద్ధమైనవిగా.

చ. కడిచినపళ్ళెరంబును సకుంఠితహర్షముతోడ నిచ్చినం,
గడు ముద మంది యెత్తికొని గాఢ భరంబున మార్చి మోవఁగా
మెడయును వీఁపు మూఁపులును మిక్కిలినొవ్వనఁ గొంకు వోవ నె
క్కుడు వెస నేఁగుదెంచెఁ, గని కొక్కెర సమ్మద మంద మత్రికిన్.
తే. అట్లుసంతోషమునఁ దేలి యతని డప్పి
వోవ బకవల్లభుఁడు పక్షపుటయుగమున
నల్ల వీచి యాహారసమర్పణంబు
సేసి నిసి యైన సుఖనిద్ర సేయుచుండ- ౪౯౭

—♦ నాడీజఘుఁడు దుష్టబ్రాహ్మణునిచే హతుం డై మరల జీవించుట. ♦—

వ. ఆ దుర్బ్రాహ్మణుండు దన రేపటిపయనంబునకు నాహారంబు చింతించి
'యిమ్మహాబకంబుశరీరంబు గ్రొవ్వి యున్నది. దీనియందు మాం
సంబు సాలం గలదు. ఇది యేమఱి నిద్రవోయెడు. చావ నడిచి
చెండికొని పోయెదం గాక' యని పాపనిశ్చయుండై చీర సక్కం
గట్టికొని, యొక్కకాష్ఠంబు గరయుగంబునం జిక్క నమర్చికొని,
క. అందంద మెడయుఁ దలయు న
మందాటోపమునఁ బెక్కుమాఱు లడిచి చా
వుం దెలియఁ జూచి యల రెడు
డెందముతో నీఁక లన్నిటిని వెస నూడ్చెన్. ౪౯౮
తే. ఊడ్చి [1]బొందువు వ్రచ్చి [2]పే వురివి నంజు
డంతయును బుచ్చి పొదుకగా నమరఁ గట్టి
కొనుచు వేగుఁబో కగుటయుఁ జనియె; నట్టి
సమయమున మేలుకని దనుజప్రభుండు- ౪౯౯
క. '[3]పొల వలచె నేమిగీడొకొ
కలిగెడు!' నని తలఁచి మనసు గలఁగఁగ దనవా
రలతోడ నుగ్గడించుచుఁ
జలియించుచు నుండఁ బ్రొద్దు జా మెక్కుటయున్- ౫౦౦

1. —రూ. బొందుగ=కంఠనాళము. 2.—రూ. ప్రేవు; పేగు- పేవు + ఉరివి=పేగు పరిహారించి. 3. = మాంసపు కంపు గొట్టుచున్నది.

వ. రాజధర్మునిం దలంచి, ౫౦౧

ఉ. 'నిచ్చలు వచ్చు రేపకడ నెయ్యమెలర్పఁగ మత్సఖుండు,-నేఁ
డిచ్చటి కేల రాఁడు? గుణహీనత విప్రునియందుఁగల్మి నా
యిచ్చఁ దలంచితిం; దులువ యేమి దలంచెనొ! యక్కటా! మదిం
బొచ్చెము లేదు నమ్మ బకపుంగవుఁ! డెట్లగునొక్కొ దైవమా!'

క. అని తూర వగచి యారయఁ
బనిచెం బని గఱపి భటులఁ బలువుర; వారుం
జని [1]బకముడొక్క యేర్పడఁ
గని యతనికిఁ జెప్పి పుచ్చి, కడువేగమునన్- ౫౦౩

వ. అవ్విప్రునిచొప్పు పట్టి- ౫౦౪

చ. [2]పరిమెయిఁ బాఱి వానిఁ గనిపట్టి వడిం బెడగేలు గట్టి తె
చ్చి; రసురభర్త సూచి: 'యిటు సేరఁగఁ దేవల దీకృతఘ్నునిం
బొరిగొని వే తినుం' డనినఁ, 'బోకడ మాలినవార మయ్య యి
ద్దురితశరీరముం దినఁగ దోసము మా' కని వార లొల్లమిన్-

వ. అతండు- ౫౦౬

క. 'తినుఁడు, తినకుఁ, డొం డేమై
నను జేయుఁడు-వీని నేల నాముందటికిం
గొని వచ్చితి?' రని పలికిన
దనుజులు పురి వెడలఁ దెచ్చి తద్గాత్రంబున్- ౫౦౭

క. వెడగోఁతల నెత్తు రొలుకఁ
బడఁ ద్రోచిన, వచ్చి కుక్కపదుపు వెనుకకుఁ
జడిసెఁ గబళింప నొల్లక
కడుపులు నకనకఁబడంగఁ గొరవముఖ్యా. ౫౦౮

వ. అని చెప్పి భీష్ముండు— ౫౦౯

క. విను, ధృతి యుట్టిడ! కుక్కలుఁ
దిన్నగా ద్రోహ్యుం గృతఘ్ను దేహముమాంసఁ

---

1 = బకమునొక్క ఎముకలగూడు. 2. = పంక్తిగా బరువెత్తి.

బని చెప్పు నాగమంబులు;—
మనుజేశ్వర, తెల్ల మయ్యె మన కిచ్చోటన్. ౫౧౦

వ. అని పలికి వెండియు ని ట్లనియె: ౫౧౧

క. పురపురఁ బొక్కుచు బకపతి
[1]కరంకమ్ముం దేరఁ బనిచి గారవమున నె
య్యురఁ దాను నగ్ని యిచ్చి యా
సురపతి యున్నంత, వచ్చె సురపతి నెమ్మిన్. ౫౧౨

క. కని యతఁడు సంభ్రమంబును
వినయంబును బెరయ గారవించి యడిగె నా
తని: 'రాజధర్ము నీవే'
యని దైన్యము దోఁప వగచి యశ్రులు దొరఁగన్. ౫౧౩

వ. అడిగిన నమరవిభుండు: 'నీ సఖుండు చతుర్ముఖునకు సఖుం డగుట
యెఱుంగవే? వానికి వగవ నేల? అవ్వారిజాసనుండు దనపాలికి
ననుదినంబు వాఁడు వచ్చుటం గోరుచుండుం గావున, ౫౧౪

క. పలుమాఱును రామికి ను
త్తలపడియెను; దాన నిట్టిదశ నతఁ డొందెం;
జెలి యగుట నితనిఁ డొక్కుడు
నలఘువిధిఁ వహ్ని యిచ్చి తది మేల కదా! ౫౧౫

వ. అ ట్లగ్నిసంస్కారంబు సేసి నీవు వచ్చినయనంతరంబ తచ్చితాసమీ
పంబున. ౫౧౬

క. [2]కడు నర్మిలిఁ బ్రేపుం జను
గుడుపఁ దొడఁగె నొక్క సురభి గురుస్థా ల్పెరయం
బడువత్సవ క్త్రఫేనము
సుడిగాలిం దూలి పడియె సొదపై ననఘా. ౫౧౭

వ. దానం జేసి యన్నాడీజంఘుండు సంజీవితుం డయి యెప్పటియట్ల
యొప్పిదునాకారంబుతో నరుగుదెంచు చున్నవాఁడు. ఇ ట్లగుట

1. = కంకాళమును; ఎముకల గూఁటిని. 2. తా. ప్రేమతో నొకగోవు వత్సమునకుఁ బాలిచ్చుచుండ దూడనోటినుండి చిందిన పాలనురుఁగు గాలికెగిరి (రాజధర్ముని) చితిపైఁ బడియెను.

కుం గారణంబును నద్దేవునిదివ్యచిత్తంబు మహానుభావంబ- ౫౧౮

క. అని చెప్పె. నంత బకపతి
ననుదెంచెను దనుజపతికి సమ్మద మెసఁగన్;
మును వాసవుఁ డజువాక్యము
నన పాశనిబద్ధుఁ జేసినాఁ డవ్విప్రున్. ౫౧౯

క. ఆనాడీజంఘుండును
దాని నెఱిఁగి భూసురునకుఁ దనకతమున న
ద్దీనదశ యగుట కోర్వక
వానివిడుపు గోరి వేఁడె వరముగ నిందున్. ౫౨౦

చ. అతఁడును దివ్యబోధమున నాసమయంబున బ్రహ్మసత్కృపా
న్వితుఁ డగు కేర్పడం గని, వినీతతముం డగురాజధర్మవాం
ఛిత మొనరించె; విప్రునకుఁ జేర్చిరి తెచ్చినవారు తద్ధన
ప్రతతియు దైత్యనాయకుఁడు పంప బకాధిపుఁ బ్రస్తుతించుచున్.

వ. అవ్విప్రుండు ధనసంచయంబు మోచికొని మరలి మరలి చూచుచు
సంభ్రమంబునం బోయె. తదనంతరంబ- ౫౨౨

క. సురపతియుఁ ద్రివిష్టపమున
కరిగె; బకాధీశుఁడును నిజాలయమునకున్
గరిమంబు మెఱయఁ జనియెం
బరితుష్టుం డగుచు దైత్యపాలుం డనుపన్. ౫౨౩

క. అని చెప్పి తాత యిట్లను
మనుమనితో నాదరమున మఱియును: 'బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును;
వినుము, కృతఘ్నునకు లేదు విమలచరిత్రా. ౫౨౪

క. 'అరయ మిత్రద్రోహము
దారుణ మగుపాతకము గృతఘ్నతకంటెన్;
వైరము గొని విడువవలయు
నా రెండుదెఱఁగులవారి నాప్తుల నైనన్. ౫౨౫

క. మిత్త్రుం డైహికములు [1]నా
ముత్త్రికములు నైనభద్రములు దలఁకొలుపున్;
మిత్త్ర-ధనంబులలోనను
మిత్త్రుఁడ యెక్కుడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్. ౧౨౬

క. ఉత్తమకులజుఁడు సుగుణా
యత్తుఁడు సస్నేహమతియు నగుమిత్త్రునకుం
జిత్త మెలర్చు తెఱంగునఁ
బొత్తు మనఁగ వలయు శుభముఁ బొందవలసినన్. ౧౨౭

వ. అని యిట్లు కృతఘ్నతయు మిత్త్రద్రోహంబును నధికపాతకంబు
లగుటయు, సన్మిత్త్రుఁ బాటించుట శుభంబుఁ జేయుటయు భీష్ముండు
భీమార్జునకుం జెప్పెననిన విని యయ్యుత్తమపురుషులయడు
గుటలును నుత్తరం బిచ్చుటలును నింతలెన్న లై చెల్లెడునే! అట
మీఁదఁ జెల్లిన తెఱంగు లెఱింగింపు మనుటయు. ౧౨౮

చ. స్మయభయదర్పితక్షుభితసామజమర్దనరక్షణక్రియా
శ్రయణవిలాసభాసురభుజా, చరణప్రణతామరవ్రజా,
జయవిభవప్రభుత్వధనసంపదుదాత్తచరిత్రకీర్త్యపా
నయనకృతార్థసేవకజనా, మునిసంభృతయోగపూజనా. ౧౨౯

క. తరణిశశినేత్ర, జగదుప
కరణచణచరిత్ర, బోధగాత్ర,తపస్సం
భరితశమమునిమనోజ్ఞా,
భరణీయప్రాజ్ఞ, విశ్వభారవిధిజ్ఞా. ౧౩౦

మాలిని. వరదచరణలీలా, వైకృతాగమ్యశీలా,
విరతినిరతసేవ్యా, వేదవిద్యావిభావ్యా,

---

1.— (ఆముష్మికములు—) పరలోకసంబంధములు.

నిరవధికవిభూతీ, నిశ్చయాతీతరీతీ,
భరితకరుణాదృష్టీ, భక్తమాధ్వీకవృష్టీ. ౫౩౧

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతంబైన శ్రీమహాభారతంబున
శాంతిపర్వంబునందుఁ
దృతీయాశ్వాసము

---



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## శాంతి పర్వము.



### చతుర్థాశ్వాసము.



శ్రీ శ్రితవక్షస్స్థలగౌ
రీశ్రితవామాంగసుభగరేఖాసంప
త్త్యశ్రాంతతనూలలిత, స
మాశ్రితజననిత్యఫలిత, హరిహరనాథా. ౧

—♦ భీష్ముండు ధర్మజునకు సర్వోత్తమం బగుధర్మంబు సెప్పుట ♦—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: అట్లు బహుప్రకారంబుల శాంతనవుండు వివరింప రాజధర్మంబులు విని, ధర్మనందనుండు దమ్ములుం దానును బ్రియం బందె. అమ్మందాకినీనందనుం డతనితో 'నా యెఱింగిన తెఱంగునం బ్రజ్ఞాకరంబు లగువాక్యప్రకరంబు లుపన్యసించితిని. ఇంక నేమి విన నిచ్ఛ సేసెదవు?' అనిన నా దేవవ్రతునకు నన్నరదేవోత్తముండు వినయం బెసఁగ వినతుండై

క. 'రాజోచితధర్మంబుల
యోజ విశదభంగిఁ జెప్పి, తుజ్జ్వలవిసర
త్తేజోధన, నాకు సకల
భూజనపరమహితధర్మముం దెలుపు దయన్- ౩

క. 'ఉత్తమ మెయ్యది?' నావుడు
సత్తటినీనందనుఁడు సమాదరసమ్య

క్షితిస్థుం డగుచు నక్కురుభూ
పోత్తమునకు నిట్టు లనియె నుర్వీనాథా: ౪
తే. విను, మనేకవిధంబుల విస్తరిల్లు
ధర్మములయం దొకండును దలఁప నిష్ఫ
లంబు లే; దాత్మమోక్షఫలంబి దైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప. ౫
క. ప్రియములు నప్రియములును హృ
దయమునఁ బొరయమియ మోక్షదం బగుధర్మం;
బయమహితా, తదర్థ వి
షయ మగునితిహాసముం బ్రసన్నాకృతిగన్- ౬
వ. చెప్పెద నాకర్ణింపుము: సేనజితుం డనురాజు పుత్రశోకార్తుం డయి
యున్నయెడఁ దదాప్తుం డగువిప్రుం డతని కిట్లనియె: ౭
క. ఇది యేమి శోకమున వం
దెదు? పుట్టినవారి కెల్లఁ దెరు వారయఁ గా
నిదియె?—భవత్సుతుఁ డొకనికె?
వదలు వనట మూఢునట్లు వనరం దగునే? ౮
వ. అనిన విని యజ్ఞనపతి 'నీ వేమిటం జేసి వగవు వారింతువు?'
అనవుడు నతం డతని కిట్లనియె: ౯
క. కదియుం గాష్ఠముఁ గాష్ఠము
నదిలో, మఱి కొంతసేపునకుఁ బాయును; నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ వల
సదె పితృపుత్త్రాదిబంధువర్గము నధిపా? ౧౦
క. [1]తనకుం దా నెర వనినను,
విను, బంధులు నతమె యన్వివేకంబున నే
పనులపయిఁ జేయు నర్మిలి;
వను వగ నొంద దది కారణముగ నరేంద్రా. ౧౧

[1] తనకుఁ దానే ఎరవు (=పరాధీనము) అనఁగా, ఇఁక బంధువులు నతమా వివేకమున ఏపనులయెడను అపేక్ష సేయును, అది కారణముగ సంతాపము, శోకము: విచారము) ననఁ బొందదు.

క. [1]నరనాథ, సుఖము దుఃఖముఁ
బరువడిమెయిఁ బొరయుఁ గాక, పన్నుగ నరునిం
బొరయునె యం దొక్కటి? యవి
పొరసిన వల దూఁద మోదమును ఖేదంబుల్. ౧౧

క. [2]ఇది నాయది యన నూఁత
న్నది సెయ్యది పట్టుకొల్పినను వాసిత మై
తుదిఁ జేటు నొంది వానికి
నదిశోకము నావహించు నత్యంతంబుల్. ౧

క. వినుము, పురాతనజన్మం
బునఁ జేసినయట్టి కర్మముల ఫలములు ప్రా
జ్ఞుని నైనఁ బొందు; వానికి,
మనుజేశ్వర, మందు ధైర్య మహిమయ చుమ్మీ. ౧౩

క. [3]పరమసుఖము దృష్ణ యుడుగు;
టరయఁగ ని ట్లగుట పింగళాలాపములం
బరిబోధిత మగు; ధరణీ
శ్వర, చెప్పెదఁ దెలియ వినుము వాని తెఱంగుల్: ౧౪

వ. పింగళ యను వేశ్య దనకూర్చువాని రాక [4]వార్చి పెద్దయుంబ్రొద్దు
వోవునంతకు నుండి వాఁడు రాకుండుటయును— ౧౫

ఆ. [5]ఏను వేఁదు ఱగుడు వాని నివ్వేఁదుఱ
పట్టఁ జదురు గలదె? భ్రాంతి దొఱఁగి

---

1. తా. సుఖము దుఃఖము పరువడి (=పరువు + వడి = జంటగా) గలుగును గాని అందొక్కటి (=సుఖమో దుఃఖమో ప్రత్యేకము) నరునిఁ బొందునా? అవి (=ఆసుఖదుఃఖములు) కలిగినను మోదము గాని ఖేదము గాని పొందవలదు. 2. తా. ఇదినాది అను పూనికతో దేనిని మనస్సునకుఁ బట్టించుకొనినను అది నాటుకొని తుదకు వానికి అధికముగ శోకముం గూర్చును. 3. తా. ఆశయుడుగుటయే పరమసుఖము... 4. =ప్రతీక్షించి... 5 = నేను వెఱ్ఱివగుటచే వానినిఁగూడ ఈ వెఱ్ఱిపట్టుటకు చదురు (=నేర్పు; సామర్థ్యము) కలదా? భ్రాంతిని వదలి ఒంటికంబపు ఇల్లగు ఈశరీరముయొక్క తొమ్మిది వాకిళ్ళు— (నవరంధ్రములు) పూర్తిగా మూసి నిద్రవోవుదును.

యొంటికంబ మొప్పు నింటివాకిళులుదొ
మ్మిదియు నెఱయ మూసి నిదురవోదు. ౧౭

క. పొంతకు వచ్చినవానిన
శాంతునిగాఁ గొనుచు, నొరునిఁ గాంక్షింపక యే
నెంతయు నూఱడి మనమునఁ
జింత యొకఁడు లేకయున్నఁ జెందు సుఖంబుల్. ౧౮

క. ఆశయ యింద్రియజయము వి
నాశముఁ బొందించుఁ గావునం, దొఱఁగెద నే
నాశను; సౌఖ్యము నిచ్చు ని
రాశయ- యని పలికి యట్టిదై నిద్రించెన్. ౧౯

వ. అని విప్రుం డుపదేశించినవాక్యంబులం గలంక దేఱి సేనజిత్తు సుఖియయ్యె. నీవును నందలితాత్పర్యం బనుసంధించి శాంతి నొందుమని చెప్పినఁ, గుంతీతనయాగ్రజుండు శాంతనవుతోఁ: 'భూతక్షయావహం బగుకాలం బతిక్రాంతం బగుచున్నయది. అట్లుండ జనంబుల కెయ్యది కర్తవ్యంబులు? ఉపదేశింపు' మనిన, నమ్మనుజపతిం బ్రీతిం గనుంగొనియమ్మహాత్ముండు: 'పితాపుత్ర సంవాదం బను నితిహాసంబు గల దాకర్ణింపుము. దాన నీయడిగిన యది దేటపడును' అని పలికి యి ట్లనియె: ౨౦

—♦ మేధావి యను బ్రాహ్మణకుమారుఁడు దనతండ్రితోఁ జేసిన సంవాదము. ♦—

సీ. వేదవిదుం డగువిప్రనందనుఁడు మే
ధావినామకుఁడు మేధావివర్యుఁడు
పత్సమయంబున జనకుతోఁ: 'నాయువు
జనులకు వేగంబ చనుచు నుండు;
దీనిపైఁ గను వెట్టి ధీరత ధలకొల్పి
మేలు వాటిల్ల నెమ్మెయిఁ జరించు

వారొకో!' యనవుడు, వానికి నిట్లనుఁ
దండ్రి: 'యాలును [1]నపత్యంబుఁ గలుగు

ఆ. తెఱఁగు నడపి, [2]యజ్ఞతృప్తనిర్జరుఁ డయి,
శమము నొంది, కాననమున కేఁగి
సౌమ్యవృత్తి ముక్తి సాధించి మృత్యువు
నలఘునియతి గెలువ వలయు ననఘ.' ౨౧

వ. అనిన విని, మేధావి తండ్రి కిట్లనియె:- ౨౨

సీ. 'నిక్కము, కాలంబు నీకుఁ గొంత గలట్లు
పలికెదు! నీవు గర్భంబు సొచ్చి
నప్పటనుండియు నన్వేషణము సేయుఁ
గొనిపోవుటకు మృత్యు వని యెఱుంగు;
[3]ఇవిరెడు నీటిమీనవు గావె! దార పు
త్రాది సక్తుండగు నతని, గాన
నమున సుప్తుండైన నరుఁ బులి గొనిపోవు
నట్టులు సూ, మృత్యు వపహరించుఁ!

తే. జేసినది సేయు చున్నది సేయవలయు
నది యనం గల కార్యంబు లందుఁ దగులు
వాని మృత్యు వేపునఁ దనవశముఁ జేయుఁ
గానఁ, గాలంబు నేమనఁ గాదు తండ్రి. ౨౩

క. 'భీరుఁడు శూరుఁడు జడుఁడు వి
శారదుఁ, డబలాత్మకుండు సబలుం డన లే;-
దేరి నయిన మృత్యువు దు
ర్వారం బై యపహరించు వైదికవర్యా. ౨౪

క. '[4]విను, సంస్మృతి మృత్యువు ప;
ట్టనఘా, నిస్సంగవృత్తి యమరగృహము; నె

1.=సంతానము. 2.=యజ్ఞములచే దేవతలను తృప్తిపఱచినవాఁడై. 3.=ఇవిరెడు నీటిమీనవుగావా!=ఇగిరిననీటిలోని చేఁపవుగావా! 4. తా. సంసారము మృత్యువునకుఁ జోటు. ఇతర సాంగత్యము లేకుండుట స్వర్గము. వెంటనే ఇట్లగుట ఎఱిఁగి సంసారమను పాశమును త్రెంచుము.

ట్టన ని ట్లగుటం గనికొని
తునుము సంసారరజ్జు దురితవిదూరా. ౨౫

క. [1]అమృతము-మృత్యువు నన, స
త్యము-మోహము గాన, విను, మహాత్మా, యేస
త్యమునన మృత్యువు గెల్చెద
సమసుఖదుఃఖుండ నగుచు శాంతిపరుఁడనై? ౨౬

తే. '[2]నాకుఁ బ్రజ గతి నిచ్చు ననంగ వలవ;
దేన ప్రజ నయి పొడమెదఁ గాన, నేను
నన్నుఁ గనుచున్న నది మోక్షణంబు సేయు;
నాశపడనట్లు లగుటఁ బ్రజాభియుక్తి. ౨౭

క. '[3]విను, పశుయజ్ఞము హింసన;
మనంతఫలదంబు గా; దహంకృతిసహితం;
బనఘా, వాఙ్మనసనియమ
మనుయాగం బిచ్చు నవ్యయానందంబున్. ౨౮

వ. 'కావున నీవును, ౨౯

క. '[4]కామక్రోధాద్యము లగు
నీమానసవికృతు లుడిపి, యేకాంతగుహా
రాముఁడ వై నిను వెదకుట
సూ మే! లొం డెల్ల నుడుగు సులభనివేశా.' 30

క. అని పుత్రుం డుపదేశిం
చిన, జనకుం డట్ల చేసి చెందె సుఖంబున్.

---

1. తా. అమృతము-మృత్యువు సత్యము-మోహము (అమృతము, సత్యము, మృత్యువు మోహము) కావున, సుఖమును దుఃఖమును సమానముగ నెంచువాడనై శాంతుడనై ఎట్టిసత్యముచే మృత్యువును గెలుతును? 2. తా. నాకు సంతానము (కొడుకు) గతిఁ గల్పించునవలదు. నేనే కొడుకనై పుట్టెదను గావున, నేను నన్నుఁ గనుచుండినయెడ అది మోక్షసాధన మగును. ఆశపడకుండునెడల అదియే సంతాన ప్రాప్తి 3. తా. పశుయజ్ఞము చేయుట హింసించుట (బాధించుట.) ఆయజ్ఞము ఎక్కుడుఫలము నొసఁగదు. అది (ఆయజ్ఞము) అహంకారముతోఁ గూడినది. 4. తా. కామక్రోధాదు లగు మనోవికారములను తొలగించుకొని ఒక్కఁడవే గుహలో నివసించి నిన్ను నీవు వెదకికొనుటయే సుఖమేలు! ఇతరముల నెల్ల ఉడుగుము,

మనుజేంద్ర, యవ్విధముఁ గని
కొని, యూఁదుము సత్యధర్మకుశలత్వంబున్. ౩౧

వ. అని చెప్పిన నజాతశత్రుండు శంతనుపుత్రునితో: 'జగంబున ధనవంతులు అధనులుం గలిగి యుండుదురు; వారలలోన సుఖు లెవ్వరు దుఃఖు లెవ్వరు?' అని యడిగిన, నక్కురుపితామహుండు: 'శమ్యాకుం డనునొక్క శాంతిపరాయణ బ్రాహ్మణుండు సంసారంబు వదల విడిచి, కూడుసీరకు నవసి యుండు నట్టివాఁడు దొల్లి నాకడకువచ్చి గోష్ఠీప్రసంగంబున నుపదేశించినవచనంబులు గలవు; వాని వినుము. అవి భవత్ప్రశ్నంబునకు నుత్తరంబు లై యుండు' నని పలికి యి ట్లనియె: ౩౨

తే. ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు
నిలిపి యెత్తంగ ములు సూపె నిర్ధనత్వ
మెక్కుడై దానిదిక్కున; నెట్టు లన్న
వినుము, గుణదోషములభంగి విస్తరింతు: ౩౩

క. [1]ధనము గలవాఁడు మృత్యు వ
దనమున నున్నట్లు భయము దనచిత్తమునం
దనుకఁగ నుల్లల నుడుకును,
విను, శిఖి చోరాదిముఖ్యవిషయాపదకున్. ౩౪

క. కోపంబును లోభంబును
నేపారి మనంబు గలఁప నెప్పుఁడు జింతా
తాపంబు నొందు సధనుం
డాపద గా కవ్విధము సుఖావహ మగునే? ౩౫

క. ఎచ్చోట నైన నధనుఁడు
విచ్చలవిడి నుండు; లేదు వెఱపించుకయుం;
బొచ్చెపుఁజందం బొల్లఁడు;
మెచ్చరె సుర లైనఁ? బలుకు మృదు వై యుండున్. ౩౬

1. తా. ధనవంతుడు, మృత్యువదనమున (=ముఖమున) నున్నట్లు, అగ్ని చోరాది ఆపదలకు తనమనస్సున భయము దనుకఁగ (=తాఁకఁగా) నుల్లల (=కుతకుత) నుడుకును.

క. [1]లోకముచందము గనికొని
యీకాలంగ నగుధనాదు లెల్లను గాల
వ్యాకులతఁ బొందఁ గలయవి
గాకుండమి యెఱిఁగి విడుపు గడుఁ జదు రెందున్. ౩౨

క. [2]ధనవత్త్వము దుఃఖకరం
బని కని, తత్కాంక్ష విడుచునతని కధనతా
జనితాత్మాధీనత్వం
బనుపమసౌఖ్యంబు సేయు నక్షీణముగన్. ౩౩

— భీష్ముఁడు ధర్మజునకు మంకి యను బ్రాహ్మణు నిచరిత్రంబు సెప్పుట. —

వ. అని చెప్పిన నది విని, ధర్మతనయుండు పితామహునితో: 'ధనతృష్ణాభిభూతుం డగు పురుషుం డేమిట సుఖి యగు?' అనుటయు, నయ్యమరనదీనందనుండు: 'ధనార్జనంబుతోడివిసువుటం బుట్టిన విడుపున సుఖంబు గలుగు. అయ్యర్థంబుఁ దెలిపెడునది యొక్క యితిహాసంబు గలదు వినుము' అని యిట్లనియె: ౩౪

సీ. మంకి నాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై
వర్తించు; శిక్షింప వలయునట్టి
గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి
యుండ, లంకియుతోన గండు మీఱి
పాఱె నక్కోడియల్ పడి యున్న గనపలో
ట్టెనుంగుపై; నది యెగసి పఱవ,
నుభయపార్శ్వంబుల నురివోసిన ట్లువి
వ్రేలి చచ్చినఁ జూచి, విప్రుఁ డడలి,

1. తా. లోకమురీతి గ్రహించి ఇచ్ఛ ధనాదు లెల్లను కాలముచేఁ గలఁతఁ బొందనివి అనియెఱిఁగి వాని (ఆధనాదుల) విడుపు(=విడుచుట) కడు చదురు ఎందుఁ బ (=ఏపట్టునను మిక్కిలి నెప్పరితనము; నేర్పు.) 2=ధనవంతుడుగా నుండుట దుఃఖకరం బని తెలిసికొని దానియందలి కాంక్ష విడుచువానికి అధనతా జనితాత్మాధీనత్వంబు (=దారిద్ర్యమువలనఁ గలిగిన ఆత్మస్వాధీనతయే పోలికలేని అక్షయసౌఖ్యమా నందించును.)

తే. 'రత్నములుఁబోనివత్సరంబు లకట!
వ్రేలు చన్నవి లొట్టగ్నువెంటఁ దవిలి!'
యనుచు నిర్వేద మొంది యి ట్లనియెఁ దన్నుఁ
గరుణతోడఁ గనుంగొనునరులతోడ: ౮౦

తే. సారమతిఁ బరికింపంగ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి;
కెచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె
నేని నది దైవదత్తంబ యింత నిజము. ౮౧

కావున, ౮౨

క. మనమునకు సుఖము గోరెడు
జనులకు నర్థక్రియావిశారదభంగుల్
పొనుపడ విడిచి భరము లే
కునికియ– యూహించి చూడ నుర వెబ్బంగిన. ౮౩

అని పలికి యుద్దామం బైనకామంబు విడువ వడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగునే యనువిచారంబు పుట్టి తదీయోత్సారణం బూహించి యాచిత్తధర్మంబు నుద్దేశించి, ౮౪

క. నీమూలం బే నెఱిఁగితి,
గామమ, సంకల్పమునన కలిగెదు; సంక
ల్పామర్శరహిత మగుచే
తోముద్రం దాల్తు నేను;—దుది యది నీకుఁ. ౮౫

అని కామం బనునది గోర్కి గావునఁ, గోర్కియొప్పమి దేలపఱుపం దలంచి, ౮౬

తే. సౌమ్య గోరినయంతన సుఖము గలుగ;
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె?
కలిగెనేని ననేకచింతలనొనర్చు;
జెడుట చావుతోఁ దుల్య;—మ య్యెడమయేల? ౮౭

ఇచ్ఛానిరసనంబు సుఖం బని వెండియు, ౮౮

క. [1]శోకశ్రమతృష్ణలకును
నీకలిమియు మూల మగుట నీ కగపడువాఁ
డేకర్తవ్యము గానఁ;
డో కామమ, నిన్నుఁ దొలఁగి యుండెద సుఖినై ౪౯

క. [2]నీ వాసపఱుప ధనములు
గావించెదఁ బో! వినాశకముల నడుపఁగా
నీవశమె? కాన, నీచెడు
కేవగపుం దేదు; పెనుప దేదైన్యంబున్. ౫౦

చ. [3]సులభమొ దుర్లభంబొ యని చూడ నెఱుంగవు; గన్నదానిపై
నలముదు;—కామమా, యిడుమ లందఁగఁ జేయుదు; నిండు తేమిటం
గలుగదు నీకు; నీతెఱఁ గగాధరసాతలభంగి; నీవు స
న్నోలమునఁ బోవ కుండి నినుఁ బుచ్చెద బచ్చెనరూపుపోకులన్ ౫౧

తే. ధనము చేటున విసివి నామనము నిన్ను
నీడవిడిచె; నో కామమ, యేను శాంతి
దాంతి సత్య క్షమా భూత దయలఁ జెంది
నాఁడ; లోభాదు లొందవు నన్ను నింక. ౫౨

తే. [4]కామసుఖ దివ్యసుఖములు కాంక్ష దొఱఁగు
మేలిషోడశాంశంబునఁ బోల లేవు

---

1. తా. శోకమునకును శ్రమకును ఆశకును నీవే మూలము. నీకు లోబడినవాఁడేమి చేయవలయునదియుఁ గానఁడు. ఓ కామమా, నీకుఁ దొలఁగి సుఖినైయుందును. 2. తా. నీవు ఆశపెట్టుచో ధనము లార్జింతు లెమ్ము. ఆధనములు నాశము నొందునపుడు నీవు మాన్ప గలవా? నీవు నశించుటవలన ఏచెడుగును రాదు; ఏదైన్యమును పెరుగదు. 3. తా. సులభమా దుర్లభమా అని చూడనేరవు. కనఁబడ్డదానిపై నెల్ల కవియుదువు. కష్టములఁ బెట్టుదువు. తృప్తి అనునది దేనితోడను నీకు గలుగదు. నీత్రోవ మిక్కిలి లోతైన రసాతలము (=నీటిపట్టము) వంటిది. నీ పోవు మార్గమునఁ బోక నిన్ను బచ్చెనబొమ్మను (=ప్రాణము లేని పెడబొమ్మను) వలె వెడలఁ ద్రోయుదును. 4. తా. ఇచ్ఛవదలుటతో కామాది స్వర్గసుఖములు పదునాఱవ పాలైనను పోలవు. కావున కామమా, శత్రువునువలె నిన్ను జయించి రాజువలె బ్రహ్మలోకమున నుందును.

గానఁ, గామమ, నిను శతృక్రియఁ జంపి
బ్రహ్మపురమున నుండెద రాజుఁ బోలె. ౫౩

—♦ అజగరచరిత్రము. ♦—

వ. అని పలికి, మంకి- యివ్విధంబునం గోడెలు సచ్చినం బుట్టిననిర్వేద నంబున సకలకామంబులం బరిత్యజించి, దేవసముండై యుండె. అని చెప్పినవిని, పాండవాగ్రజుండు: 'ఏమివర్తనంబున నరుండు వీతశోకుం డగుచుఁ జరించు? ఎద్దానం జేసి పరమగతి వడయు?-అనుటయు ననిమిషనదీనందనుం డజగరచరితం బనునితిహాసంబు వినుము దాన నీయడిగినయర్థంబు దేటపడుం దాని జెప్పెద. ఆజగరనామధేయుం డగు నొక్క బ్రాహ్మణునిఁ బ్రహ్లాదుండు శమప్రకారం బుపదేశింపు మని యభ్యర్థించిన నతం డతని కిట్లనియె: ౫౪

క. [1]అనిమిత్తము భూతంబుల
జననం; బవి రూపు సెడుట, సంపన్నములై
యునికి- విషాదము మోదం
బును జేయఁగ లే వనిత్యములుగ నెఱిఁగినన్. ౫౫

తే. [2]వఱదఁ గాష్ఠముల్ గూడిన వడువ బంధు
సంగమం; బవి వాసినచాడ్పు తద్వి
యోగ; మింత సూచిన వాని నుమ్మలికము
వారయు నేరదు దానవవరతనూజ. ౫౬

వ. ఈతెఱంగు లే నెఱుంగుదు. నాదెసఁ బ్రశాంతిం గని కాదె నీవు శమోపదేశం బర్థించితివి వినుము: ౫౭

---

1. ప్రాణులపుట్టువునకుఁ గారణములేదు. అవి నిలుకడగలవికావు అని ఎఱిఁగిన యెడల వాని నాశమునకు దుఃఖముగాని, వానివృద్ధికి సంతోషముగాని కలుగదు.
2. తా. బంధువుల సాంగత్యమంతయు ప్రవాహమున కట్టెపుల్లలు గూడినంతమాత్రమే. ఆపుల్లలు కాయువిధముననే ఆబంధువులయెడబాటును. దీనిని గ్రహించినవానిని దుఃఖము చెందదు.

క. ¹మే లర్థింపను; గీడును
జాలింబడి తొలఁగఁ ద్రోవ; నరిఁ దూష్ణీంభా
వాలంబిమనస్కుఁడ నై
యాలంబుగఁ జేసి నడతు నయ్యరు దెఱఁగున్. ౫౮

క. ²సరసాన్నముఁ బిణ్యాకము
సరిగాఁగ భుజింతు; మృదులశయ్యాతలముం
ధరణియు శయనరుచికి నా
కరయం గా నొక్కరూప యసుర ప్రవరా. ౫౯

ఆ. ³నారచీర యేనిఁ, జారుచీనాంబరం
బైనఁ గట్టికొనినయపుడు హృదయ
మొప్పు దొప్పు ననక యుండు; రూపాదుల
నలమికొనవు చక్షురాదికములు. ౬౦

వ. అని వెండియు, ౬౧

ఆ. ⁴చలన మేది, పుట్టుఁ జావునుం బిఱువెట్టి,
యామిషార్థిజనుల నపహసించు
చెలమితోడ లేమి, కలిమి వాటింపని
రమణ నునికి యాజగరవ్రతంబు. ౬౨

---

1. తా. మేలుకోరను; జాలిపడి కీడును తొలఁగఁ ద్రోసివేయను. సరిగా ఆరెంటి తెఱఁగును (=ఆమేలు కీళ్ళయెడ) మౌనము నవలంబించి ఉపేక్షతో నడతును. 2. తా. రసయుక్తమైన అన్నమును గాని, తెలికపిండిని (=గానుగ నాడిన నువ్వుబిండిని) గాని సరిగా తిందును. మెత్తని పరుపైనను నేలయైనను నా కొకటియే. 3 తా. నార చీరయైనను, సొగసైన పట్టు వస్త్రమైనను గట్టుకొన్నపుడు అది (నారచీర) అప్రియము ఇది (పట్టువస్త్రము) ప్రియము అనదు, నామనస్సు. రూప రస గంధ స్పర్శాదుల వెంట కనులు చెవులు ముక్కు శరీరము లోనగు నాయింద్రియములు మరులు గొనవు. 4. తా. చలింపక, పుట్టును చావును లెక్కింపక, భోగములను గోరువారినిఁ గని అపహసించుచు చింతింపక, కలిమిని (=ఐశ్వర్యమును) పాటింపక ఉండుట అజగర వ్రతము. అజగరము=పెద్దపాము; కొండచిలువ.

ఆ. [1]అనియతంబు లైనయాహార విహరణ
శయనముల విధాతృసంప్రయుక్త
భంగిఁ బరఁగు నంతరంగ నిర్వ్యాభరవ
ర్తనముకలిమి యజగరవ్రతంబు. ౬౩

ఆ. నిత్యతృప్తి శౌచనిరతి తాల్మి సమత్వ
మారఁ గలిగి, నిత్యసుఖానుభవము
ప్రచుర మగుట యజగరవ్రత; మది విను,
మజ్ఞదుర్లభంబు;— ప్రాజ్ఞభూమి. ౬౪

వ. ఇది శమప్రకారం బనియె నని చెప్పి భీష్ముండు— ౬౫

క. [2]అజగర చరితము దనకును,
నిజముగ నలవడుప నేర్చు నిర్మలమతికిన్
వృజినభయమన్యుశోకము
లజేయములుగావు; మోక్ష మాయత్త మగున్. ౬౬

వ. అనిన విని, యజాతశత్రుండు: 'బంధుమిత్త్వకర్మవిత్తప్రజ్ఞలయం
దెయ్యది నరునకు సుప్రతిష్ఠం జేయు?' అని యడిగిన, నాపగా
తనయుం డతని కిట్లనియె: ౬౭

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ, లాభము
ప్రజ్ఞయ, నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే!
ప్రజ్ఞయ కైవల్యంబును,
బ్రజ్ఞాసాధ్యములు గాని పనులుం గలవే? ౬౮

1. తా. ఇట్టి యాహారమే కావలయునని గాని, ఇట్టి చోటనే తిరుగవలయు ననిగాని, ఇట్టి పక్కయే కావలయునని గాని పాటింపక, దైవము ఏవిధముగా నియోగించునో అట్లు జరుగఁ గలదను నమ్మకమున మనస్సునకేమాత్రము భారము కలిగించుకొనకుండుట అజగరవ్రతము. 2. తా. ఇట్టి అజగరవర్తనము, నిజముగా అభ్యసింప నలవడునట్టి నిర్మలచిత్తుఁ డగువానికి, పాపము-భయము-దైన్యము-శోకము —గెలువ రానివి కావు- అనఁగా వానిని అజగరవ్రతుఁడు జయింపఁ గలఁ డనుట.

వ. బలి ప్రహ్లాద మంకి ప్రభృతులు ప్రజ్ఞనకాదె సమాధాన సంపన్ను లయిరి? కాశ్యపనామధేయుం డగు ధరణీసురోత్తముం డొక యుద్ధతపురుషుని రథంబు దాఁకి పడి తదవమానదూయమానమానసుండై యసుపరిత్యాగపరవ్యవసాయుం డగుటయు, నింద్రుండు సృగాలరూపంబున నమ్మహాద్విజునిపాలికి వచ్చి ప్రజ్ఞాసంబోధకం బగు సంవాదంబునం జిత్తప్రసాదంబు గావించె నవి విందుము. ఎల్లభంగులఁ బ్రజ్ఞ యుత్తమాధికారం బనిన విని ధర్మతనయుండు—

క. నరవర, దానముఁ దపమును
గురుశుశ్రూషయును యజ్ఞకోటియు నెట్లై
పరిణతిఁ బొందం గలయవి
పురుషునకి త్తెఱఁగు దెల్లముగ విన వలతున్. ౨౦

వ. అనుటయు దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను: మేలులను బంధించుమేలు లట్లు కీళ్లును [1]ననుస్యూతంబు లయి తొడరు-నాకర్ణింపుము: ౨౧

క. కఱవుపయిఁ గఱవు వొరయుచు
వెఱపుపయిన్ వెఱపుదోఁప విడువని యిడుమం
దొఱఁగమిపై బురుషుఁ డీకుమఁ
దొఱఁగమిఁ జేడ్పడుచు నడచు దుష్కర్మములన్. ౨౨

వ. అని మఱియును, ౨౩

ఆ. ఉత్సవంబుమీఁద నుత్సవ మందుచు,
సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ,
బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున
కరుగు నరుఁడు సుకృతి యైన నధిప. ౨౪

క. పులుగులలోఁ [2]బూత్యండక
ములు, సారము లైనధాన్యములలోనం బొ
ల్లలుఁబోలెను జూవె మను
ష్యులలో ధర్మరహితాత్ము లుర్వీనాథా! ౨౫

1. = ఏడ తెగనివై. 2 = చెడుకంపుగల ఒక దినుసు పురుగు.

క. చనినఁ జను, నున్న నుండు,
న్మనుజుఁ డొకటి సేయఁ జేయు, నరనాయక, తో
డన తగిలి నీడవోలెను,
విను, చేసినకీడు మేలు విడువవు వానిన్. ౭౬

క. సమయంబైనను గుసుమఫ
లము లెట్టులు దోఁచుఁ దరువులం దటితోఁ గ
ర్మములం బొడకట్టుఁ సుఖదుః
ఖము లట్టుల నిష్ప్రియత్న కలితోద్భూతిన్. ౭౭

క. తెలిసికొనఁ బడయ రొరు లా
ర్యులపోయెడి తెరువు లరసియును; జదలం బ
క్షులు, నీళ్లలోన మీనం
బులు వోయెడుత్రోవ లెఱుఁగఁ బోలునె యధిపా? ౭౮

క. ఐనను గాఢనిరూపణ
మానసుఁడై యార్యజనులమహితవచనముల్
వీనుల నినుచుచు ధర్మము
లైనవి సేయంగఁ దప్ప కగుఁ దత్ఫలముల్. ౭౯

వ. అనిన విని, కౌంతేయాగ్రజుండు శాంతనవునితో: 'భూతసృష్టి యెవ్వానివలన నెబ్బంగి నైనయది యెఱింగింపుము' అనవుడు, నతండు: ఇదియును మఱియుం గొన్నియర్థంబులు భరద్వాజుం డడిగిన భృగుండు సెప్పె. అప్పరిపాటి యుపన్యసించెద నాకర్ణింపు మని యతని కిట్లనియె:— ౮౦

—♦ భీష్ముఁడు ధర్మజునకుఁ బృథివ్యాదిభూతోత్పత్తిక్రమం బెఱింగించుట. ♦—

సీ. కైలాసశైలశిఖరమునఁ దేజోవి
రాజితు భృగు భరద్వాజుఁ డధిక
వినయంబుమైఁ జేరి: 'మునినాథ భూత సృ
ష్టిప్రకారము నాకుఁ జెప్పు' మనిన,
నమ్మహితాత్ముఁ డిట్లను: 'విను, నారాయ
ణుం డవ్యయుం డనంతుండు భూత

సృజనంబు దలఁచి ముఁ దా సృజియించెఁ దనదు స
హాస్రాంశకమున నవ్యక్తుఁ డనఁగ

తే. మనసునన యజరామరు ననుపమాను;
నతనివలన మహత్తత్త్వ మావహిల్లె;
నతఁడు దివ్యతేజోమయుం డైనపద్మ
మొకటి గలిగింప బ్రహ్మయం దుద్భవించె. ౮౧

తే. 'అతనితలఁపున బ్రభవించె నాకసంబు;
దానియందు జలంబు లుద్భవమునొందె;
సలిలమున నగ్ని మారుత జనన మొనరె;
ననల పవనయోగమున మేదిని జనించె. ౮౨

వ. 'ఆబ్రహ్మ యఖిలభూతాత్మకుం డెట్లనిన: అతనికి శైలంబులు అస్థులు; మేదిని మేదో మాంసంబులు; సముద్రంబులు రుధిరంబు; ఆకాశంబు ఉదరంబు; పవనుండు నిశ్వాసంబు; అగ్ని తేజంబు; [1]సరిత్తులు సిరలు; రవిచంద్రులు నయనంబులు; ఊర్ధ్వలోకంబు శిరంబు; పాతాళంబు పాదంబులు; దిశలు బాహువులు- ఇట్లనంతాత్మకుం డగువాఁడు విష్ణుండు- ఇత్తెఱంగున విశ్వంబు విష్ణుని వలనం గలిగె' ననిన, విని, భరద్వాజుం డాకాశాదిభూతంబు లేనింటిపరిమాణంబులు నడిగిన, భృగుండు: 'అవి యనంతంబులు; దేవతలకుఁ గొలఁది వెట్ట రాకుండు; ఒక్కచోటు నిరూపించి యీభూతం బింతనుండి యట లే దనరాదు. పంచభూతంబులు నిరవధికంబులు. అది యెత్తెఱం గనిన, విష్ణునకు గాణం బై యనంతుం డనునామంబు గలదు గాదె! విష్ణుండు జగన్మూర్తి- విష్ణుతనుభూతం బయినమహాభూతపంచకం బప్రమేయంబు గాక తక్కునే?' అని యెఱింగించిన— ౮౩

సీ. విని, భరద్వాజుండు: మునినాథ, పుష్కరం
బునఁ బుట్టె నన్నష్ట పుష్కరంబు

[1] ఏఱులు [illegible]

బ్రహ్మకు నాది నాఁ బట్టయ్యె నెట్లొకో!'
నావుడు, 'విష్ణుమానసభవుండు
బ్రహ్మ యాద్యుఁడు; పుష్కరము దదాసనరూప
ముగఁ గల్పితంబయ్యె; మున్ను పిదప
ననునిశ్చయంబు లే కునికిఁ బద్మజుఁ డన
వలసియు నుండు నయ్యలఘుతేజుఁ;
తే. బద్మ మదిభూతధాత్రి; యప్పద్మమునకు
గగనమూర్థిత మగుమేరునగము రుచిర
చారుకర్ణిక; యందుండి సకలజంతు
సృజనధుర్యత్వమహిమ నయ్యజుఁడు వెలుఁగు.' ౮౪

వ. అని భృగుండు సెప్పిన విని, భరద్వాజుండు: 'భూతంబు లైదగుట యేమిట?' అని యడిగిన, నతం డతని కిట్లనియె: ౮౫

క. 'వాయువు చేష్టారూపము;
మోయు నెడ నభంబు; ద్రవము, మునివర, జల; మూ
ష్మాయిత మనలము; గాఁ
న్యాయితము ధరిత్రి—యిట్టు లైదు దెఱంగుల్. ౮౬

వ. ఈయయిదింటన కాదె జంగమంబులు స్థావరంబులు నైనయవి?' అనుటయు, భరద్వాజుండు: 'స్థావరంబులయందు భూతగుణంబు లేమిటం గంటిమి?'—అని యడిగిన, భృగుం డిట్లనియె: ౮౭

సీ. [1]అశనినిర్ఘోషంబు నాకర్ణనము లేక
వికృతి నెట్టులు వొందు వృక్ష? మాక

---

1. తా. పిడుగు చప్పుడు (ఉఱుము) వినకయే చెట్టు ఎట్లు వికారమునొందును? వినుట ఆకాశశక్తిచేసుమా! ఎండ సోఁకుటచేఁ చెట్టువాడును. ఆసోఁకు (=అస్పర్శము) సెఱుఁగుటయే వాయుశక్తి. దారి చూచి సాగుచున్నదనుట అది తేజశ్శక్తి. పాదములే నాలుకలై (నీటిని) పానము నేయుటచే పాదపము అని చెట్టునకుఁ బేరు. ఆచెట్టునాలుకలే జలశక్తి. తమలోఁ బుట్టునట్టి పువ్వు గూల దూప (=స్వాదైనరాగ=Flavour) వాసనలు గొనుటచే వికసించుచు—అనఁగా దానికి ఘ్రాణము (ముక్కు) ఉన్నది. అఘ్రాణమే పృథ్వీశక్తి. ఈవిధముగా ఐదు తత్త్వములు గలవు. కావుననే వృక్షము ఐదు భూతములతోఁ గూడినదని వృక్షశాస్త్రము చెప్పుచున్నది.

సముశక్తినూనె శ్రోత్రము! నిదాఘంబుచోఁ
దున వాడుఁ; జోఁకెఱుంగుట సమీర
శక్తి; మార్గముఁ గని చాఁగెడుఁ; గనుట తే
జశ్శక్తి; పాదపసంజ్ఞఁ బరఁగుఁ
బాదజిహ్వలఁ గొని పానంబు సేయుట;
జలశక్తి జిహ్వ; నైజంబు లైన

తే. కుసుమధూపాదిగంధముల్ గొనుట నెలమిఁ
దాల్చు నని చెప్పఁ దరువు వేదంబు; ఘ్రాణ
ముర్విశక్తి;- యి ట్లయిమను నుల్లసిలుట,
ననఘు, భూజంబు పంచభూతాత్మకంబు. ౮౮

వ. శైలాదులయందు నిట్ల యూహింపఁ బెఱభంగులుం గలిగియుండుఁ; బంచభూతాత్మకంబు గానిభూతంబు లే దనుట వేదనిశ్చయంబు- అనిన విని భరద్వాజుండు: ౮౯

క. 'భూముఖ్యం బగుభూత
గ్రామంబు గుణంబు లైన గంధాదులఁ, దే
జోమహిత, యనుభవించుట
యేమెయి నెద్దాని కావ హిల్లుచు నుండుగ్?' ౯౦

తే. అనిన, భృగుఁ డిట్టు లను: విషయములు నింద్రి
యములు మనసును గ్రమసాధనములు గాఁగ
నంతరాత్మ ప్రదర్శి యై యనుభవించి
తత్కృతము లగు మోద ఖేదములఁ బొందు. ౯౧

వ. అప్పురుషుండు- ౯౨

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల
గాత్రవ్యాప్తత్వమహిమ గలిగి సమీరా
సూత్రణమున జీవుండును
శ్రోత్రము నై సర్వవర్తకుం డగుచుండున్. ౯౩

క. అగు నీతత్త్వము సత్త్వా
దిగుణత్రయవికృతి కత్యతీతం బై ఘ్రా

ర్వగురుత్వంబునకుం జన,
విగతత్వంబునకు నెలవు విమలవిచారా. ౯౪

ఆ. బుధుఁడు సూక్ష్మవిమలబుద్ధి నప్పురుషుని
నరసి కాంచి, యతని యంద మనసు
డిగ్గ విడిచి, యెగ్గు లగ్గును బొందక
శుద్ధశాంతిఁ బరమసుఖముఁ బొందు. ౯౫

వ. అని వెండియు― ౯౬

―◆ భృగుమహాముని భరద్వాజునకుం జెప్పిన వర్ణాశ్రమాచారక్రమము. ◆―

సీ. ఆగమసత్యధర్మాచారతపముల
కునికిపట్టులు గాఁగ వనజభవుఁడు
గలిగించె మును బ్రాహ్మణుల; మఱి కల్పించె
నృప వైశ్య శూద్రుల; నిర్మలాత్మ,
బ్రాహ్మణాదికముగ బరఁగు నన్నాలుగు
జాతులయుజ్జ్వలచ్ఛాయ లోలి
సొంపారుఁ― దెలుపును గెంపును బసుపుజా
యయుఁ గప్పు నయ్యె నం ద్రార్యవర్య;

ఆ. లాత్మకర్మ మెడలి యనులోమవృత్తినె
జ్జాతి సొచ్చు నన్య జాతిపనికి?―
దాని కట్టిభంగి దలకొనఁ బెక్కులు
పనులఁ జేసి జారతనము వచ్చు ౯౭

క. సిత రక్త పీత నీలము,
లతులమతీ, మొదలు దొడఁగి యుం తంతకు హీ
నతఁ దాల్చుఁ గాన నెఱిఁగిం
చితి నీపరిపాటిఁ గర్మశీలతకొఱకున్. ౯౮

వ. అని మఱియును, ౯౯

క. సత్యమ బ్రహ్మము దపమును;
సత్యమ ప్రజలను సృజించు; సత్యమలోక

స్థితాృధానము జేయును;-
సత్యం [1]బన్నృతంబుచేత సంపిహిత మగున్. ౧౦౦

వ. అట్లుంగాక ధర్మాధర్మంబు లనఁ, బ్రకాశతమంబు లన, బోధాజ్ఞానంబు లన, స్వర్గనరకంబు లన, సుఖదుఃఖంబు లనఁ, బరగు బుధజనవ్యావహారికశబ్దంబులకు నర్థంబు లై సత్యానృతంబులు వ్రిన్తిల్లుం గావున— ౧౦౧

క. అనఘా, దుఃఖాత్మక మగు
నన్నృతం బడఁగించుటకుఁ బ్రయత్నమున సుధీ
జను లాచరింతు రనిశం
బును మోహావిఘాతినియమములు నిష్ఠమెయిన్. ౧౦౨

క. ఒలయు జరావ్యాధిప్రభృ
తులుఁ శారీరములు, [2]గాఢతోదకశోకా
దులు మానసములు, దుఃఖం
బులు రెండువిధముల నిట్లు పురుషు నలంచున్. ౧౦3

క. శారీరమానసము లగు
నీ రెండువిధములు దన్ను నేఁపక యుండం
గోరికొని నియమములఁ బ్రతి
కారం బొనరింపఁగా సుఖం బొందు నరున్. ౧౦౪

క. విను, దుఃఖంబులఁ దెగఁ ద్రో
చినపురుషుఁడు సౌఖ్యసక్తచిత్తుఁడు గా కా
రినవైరాగ్యముఁ జెందిన
ననుపమ మగుపరమపదము నమ్మెయి నేర్చున్. ౧౦౫

వ. అనిన విని భరద్వాజుం డాశ్రమధర్మప్రకారంబులు సువ్యక్తంబులుగా నెఱింగింపు మనుటయు భృగుం డి ట్లనియె: ౧౦౬

సీ. గురునకు భక్తుఁడై పరమాదరమున వే
దాభ్యాస మెవ్వఁడు నాచరించు

---

1=(అట్టి సత్యము), అనృతము చేతఁ గప్పఁబడును, 2_ గాఢమగు బాధయు శోకము మొదలగునవి మానసములు,

చును, శౌచశీలత, వినయంబు, [1]త్రిషవణ
స్నానంబు, భాస్కరానలసపర్య
పాటించుచుండుట బ్రహ్మచారికవృత్తి;
ధనధాన్యములు గర్హితంబు గాని
తెరువునఁ బడసి యతిథిపూజ మున్నుగా
నన్నపానాదిభోగానుభవముఁ

తే. బొందువాఁడు గృహస్థుండు; గందమూల
శాకఫలము లాహారంబు, శయ్య భూమి
వననివాసికి; నిస్సంగవర్తనమున
భిక్ష బ్రదుకుగ యతి శాంతిఁ బేర్చియుండు. ౧౦౭

క. ఫలకాంక్షి గాక నియతిం
జలిపిన నీయఖిలకర్మజాతంబును ని
ర్మలమోక్షపదముఁ జేర్చుట
గలుగు నవశ్యంబుఁ బుణ్యకరణప్రవణా. ౧౦౮

వ. అనిన విని, భరద్వాజుండు: 'పరలోకం బన నొకండు గలదండ్రు.
ఈలోకంబునకును ఆలోకంబునకును విశేషం బెట్టిది యెఱింగింపవే!'
యని యడిగిన, భృగుం డతని కిట్లనియె: ౧౦౯

క. ఇది కర్మభూమి— భోగా
స్పద; మాలోకంబు ధర్మపరులకు సులభం;
బది సత్యశౌచసౌజ
న్యదయాదులు లేనివారి కప్రాప్య మగున్. ౧౧౦

క. ఈలోకము దుఃఖబహుళ;
మాలోకము భూరిసుఖనిరంతర; మందే
జాలియును లేక యొండొరు
తో లెస్సగఁ బొంది యుండుదురు జను లనఘా. ౧౧౧

---

1 = త్రిసవనస్నానము = (ప్రాతస్సవనము, మధ్యందిన సవనము, సాయంసవనము) మూఁడు పర్యాయములు స్నానము సూర్యోపాసనము అగ్నికార్యము నిర్వర్తించుట—

తే. హస్తిమశకాంతరము గల దరసి చూడ:
వాస గృహ శయ నాసన వసన గంధ
మాల్య [1]తౌర్యత్రి కారామ మానినీజ
నాదిసుఖసాధనములకు—నందు, నిందు. ౧౧౨

వ. అని వెండియు, ౧౧౩

క. ఇవి పుణ్యలోకవిషయ
వ్యవసితవచనంబు; లధమ మగులోకము ధ
ర్మవిదూరజనులు వొందుదు;-
రవిరతబహుదుఃఖనిలయ మది విప్రవరా. ౧౧౪

క. విను, మమకారవివర్జిత
మనస్కులకుఁ బుణ్యపాపమార్గంబులు లే
మిని లోకంబులఁ ద్రిమ్మర;
రనఘా, పొందుదురు శాశ్వతానందంబున్. ౧౧౫

వ. అనిచెప్పి భృగుండు బ్రహ్మవిహితంబు లగుధర్మంబులు సంక్షేప రూపంబున నెఱింగించితి ననిన, భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముం బ్రశంసించి వినతుండై వీడ్కొనియె. అతనిచేత విన్నంతవట్టును నీకుం జెప్పితి. నీ వింక నెయ్యది విన వల తనుటయు, ననిమిషనదీనందనుతో ధర్మనందనుండు: 'ఆచారవిధి వినువాంఛ నామనంబునం బేర్చి యుండు'- ననవుడు నతం డతని కి ట్లనియె: ౧౧౬

—♦ భీష్ముఁడు ధర్మజునకు నాచారవిధి నెఱింగించుట. ♦—

సీ. సజ్జను లందు రాచారవంతుల దుదా
చారంబు గష్టతత్త్వకారి; దుష్టు
గావున న్నాచారగతి వింట గడుతెన్న;
రాజమార్గంబున రచ్చ మంద-

---

[1] తూర్యత్రికం = వాద్యనృత్యగీతములు. 

మూత్రపురీషవిమోక్షంబు సేయుమి
శౌచి వై [1]వార్చి నిష్ఠను జలంబు
సొచ్చుట, సంధ్యల సూర్యు సేవించుట,
యర్కోదయాస్తమయముల నిద్ర

తే. వోవకుండుట, [2]పంచార్ద్రి భావ మొంది
కుడుచు, టన్నంబు దెగడమి, దడిపదములు
గలుగ నిదురకుఁ జొరమి- సత్కర్మవేది
నారదుఁడు వివరించె నాచారములుగ. ౧౧౭

తే. ఉదయ మగుసూర్యుఁ గనుఁగొను టొప్ప; దన్య
వనిత నగ్నయై యుండంగ వలదు చూడఁ;
దనపురీషంబు సూచుట, ధరణినాథ,
కీడు, నిజపాపగుప్తి యకృత్య మరయ. ౧౧౮

క. సురతంబు గుప్త మగుటయు,
గురుశుశ్రూషయును, బ్రహ్మకులభజనము-నా
యురవాప్తిఁ జేయు, లక్ష్మీ
కరంబు లగు నూర్ధ్వలోకగతియు నొనర్చున్. ౧౧౯

వ. అనిన విని, యుధిష్ఠిరుండు: 'అధ్యాత్మవిద్య విన వలతుం జెప్పవే!'-
అనిన నతనికి దేవవ్రతుం డిట్లనియె: ౧౨౦

---

1=ఆచమించి. కాళ్ళు చేతులు నోరు ముఖము కడిగికొని-

2. తా. సముద్రమునందు కెరటములవలె భూతాత్మని (జీవుని) యందు భూమి మొదలగు పంచభూతములు పుట్టుచు గిట్టుచు నుండును. ఈపంచభూతముల గుణములు గంధాదులు: (శబ్ద స్పర్శ రూప రస గంధములు-ఐదు భూతగుణములు.) ఇవి పంచేంద్రియములు: (శ్రోత్ర = చెవి, త్వక్ = చర్మము, చక్షుస్సు = కన్ను, జిహ్వ = నాలుక, ఘ్రాణము = ముక్కు)చే గ్రహింపఁదగినవి. ఈ పంచేంద్రియములు మిల్లి ( = చిన్ని గరిటె) వంటి ఉపకరణము లగును. ఇంద్రియములకు మనస్సు మహాశ్రయము (=గొప్ప అండ.) ఆ మనస్సువలన బుద్ధి నిర్ణయమునకుఁ దేఁగా పురుషుఁడు ఆ విషయములను (=ఆయింద్రియ వ్యాపారములను) బొందును. అట్లు బొందనీయకుండ ఇంద్రియములను మఱల్చి మనసుతోఁ గూర్చి బుద్ధిలోననే వానిని అడఁగించినచో విషయముల యందు వర్తింపక పురుషుని (ఆత్మను) బొందును.

సీ. జలధితరంగల చాడ్పునఁ బొడముచు
నడఁగుచు నుండు భూతాత్మనందు
భూమిప్రభృతిభూతములు; వానిగుణములు
గంధాదు లింద్రియగ్రాహ్యకోటి;
యనఘ, శ్రోత్రం బాదియగునింద్రియశ్రేణి
దర్వియుఁబోలె సాధనత నొందు;
మన సింద్రియములకుఁ బెనుఁబ్రాపు; బుద్ధి త
న్ముఖమున నిశ్చయంబునకుఁ దెరఁ
తే. బురుషుఁ డవ్విషయంబులఁ బొందు;— నిట్లు
గాక యుండ నింద్రియములఁ గ్రమ్మఱించి,
మనసుతోఁ గూర్చి, బుద్ధిలోనన యడంప—
బుద్ధి నిర్విషయస్థితిఁ బురుషు నొందు. ౧౨౧

క. విను, మాత్మఁడు: క్షేత్రజ్ఞుం
డన భూతాత్మఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యన నం
జనరహితుం డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. ౧౨౨

క. తనయందు దోఁచువిషయము
లనుభవగోచరము లగుట యది మాయాసం
జనితస్వప్నం బై యా
త్మునికిం దనుఁ గాన లేని మోసము దెచ్చున్. ౧౨౩

క. విను, గుణములు మాయకు నొడ
లని యెఱిఁగి తమోరజస్సు లడఁచి సుసత్త్వం
బున నిలిచి సద్వివేకం
బున నదియుం ద్రోచి విమలబోధాత్మఁ డగున్. ౧౨౪

తే. అరసి చూడ సత్త్వంబు సుఖాత్మకంబు;
సాంద్రదుఃఖమయంబు రజస్సు; బోధ
మాంద్యమూర్తి తమస్సు;— సమత్వ మాఁది
యీయవస్థలఁ బొరయమి మాయపోక. ౧౨౫

వ. అని యధ్యాత్మప్రకారంబు నిర్దేశించి భీష్ముండు వెండియు యోగంబు సెప్పెద నాకర్ణింపు మని యమ్మనుజపతి కి ట్లనియె:

—• ధర్మజునకు భీష్ముఁడు యోగప్రకారంబు సెప్పుట. •—

సీ. [1]తెలి వొంది మనసు నిశ్చలవృత్తి నేకాగ్ర
మై యున్కి గోరి, నిష్ఠాత్రిశయము
కలిమి కృత్యంబు; మేఘుంబున మెఱుఁగును
నలినపత్త్రంబున సలిలకణముఁ
బోలె మంతవ్యంబు పొంతఁ జరించుమ
నంబు; దానికిఁ బవనంబుగతియ
గతి; గాన హితేచ్ఛు మారుతధారణము; పవ
మానంబు గ్రమమునఁ గాని నిలువ;

ఆ. దలయ విసువఁ గాదు; తలకొని యమనియ
మాదు లెనిమిదియును నభ్యసింప-
గా విచార మొలయుఁ; గలుగు వితర్కంబు;-
మఱివివేక మనిలు నెఱికిఁ దెచ్చు. ౧౨౭

క. విను, మంతర్నాడిం జనఁ,
బనుపడి పవనంబు బ్రహ్మపద మొందఁగ, శాం

1. = తె. తెలివు + ఒంది- తెలివు (= దేహాత్మాది భేదజ్ఞానము; వివేకము; వికాసము; ప్రకాశము; కాంతి; ప్రసన్నత) పొంది, మనస్సు చలింపని విధమున ఒకటే గుఱిగా నుండుటకుఁ గోరి, ఎక్కువు నిలుకడతో నుండుట దగును. మేఘమున మెఱుఁగువలె తామరాకున నీటిబిందువువలె మనస్సు ఆలోచనవంకకే చరించుచుండును. ఆమనస్సునకు గాలినడకయే నడక. కావున వాయువును స్వాధీనమున నుంచుకొనుట మేలు. ఆగాలి క్రమసాధనమునఁ గాని నిలువదు. అలసత్వము గూడదు; వేసటయుఁ గూడదు. యమనియమాదులు [:అష్టాంగములు:. యమము (= హింసాదులనుండి నుడుగుట; శరీరమునే సాధనముగాఁ గలియోగ మూనుట) – ఈయోగములు– దశవిధములు– సత్యము, దయ, క్షమ, ధృతి– ధైర్యము, మితాహారము, ఆర్జవము ఋజుభావము, బ్రహ్మచర్యము, అస్తేయము—చౌర్యము లేకుండుట, అహింస, శౌచము..] ఎనిమిదింటిని పూని అలవఱచుకొనినయెడల ఆలోచన వ్యాపించును; ఊహాపోహలు (సంశయములు) గలుగును: అంతట ఆవివేకము—దేహాత్మాది విభేదజ్ఞానము ఆవాయువును క్రమస్థానమునకుఁ దెచ్చును.

తినిరూఢ మైనచిత్తము
గను నానందంబు; నంద కలయుం బిదపన్. ౧౨౮

వ. అనిన విని కురుపతి కురుపితామహునితో: 'జపవిధిప్రకారంబును జపశీలు రగువారు పోవుగతియును నెఱింగింపవే' అనుటయు, నమ్మహీవిభునకు నమ్మహాత్ముం డి ట్లనియె: 'జప్యంబు విషయంబుగా యమకాలమృత్యు భూసు రేక్ష్వాకులకు సంవాదంబు ప్రవర్తించె నయ్యితిహాసంబునుం జెప్పెద; మున్ను నాయెఱింగిన తెఱంగునుం జెప్పెద నాకర్ణింపుము: ౧౨౯

—♦ యమ కాల మృత్యు భూసు రేక్ష్వాకుల సంవాదము. ♦—

సీ. వేదాంతవిదు లనుమోదించునట్టిది
జపకర్మ; మత్యంతశౌచశాలి
యై, కుశాస్తీర్ణ సమావనీతలమునఁ
గుశముష్టి సేకొని, విశదచిత్త
వృత్తి నింద్రియములు విషయాసక్తంబులు
గాకుండ నిలిపి, తదేక పరత
మత్సరాహంకార మాన దంభాపగ
మంబును బ్రహ్మచర్యంబుఁ గలిగి,

తే. జపము సెల్లించుపురుషుండు సర్వలోక
విజయునిస్పృహా మగుజపవిధి విశోక
హర్ష రాగాదికంబును నవ్యయంబు
నైనపదముఁ బొందించు నృపాగ్రగణ్య. ౧౩౦

క. శౌచాదిగుణము లెడలుట
నీచత్వము వాటిలంగ నిశ్చలమతి దు
ష్టాచరిత మైనజపవిధి
నాచెప్పినసుగతి దేదు;- నరకము దెచ్చుఁ. ౧౩౧

అని చెప్పి వెండియు ని ట్లనియె: ౧౩౨

సీ. వేద వేదాంగసంవేది గౌశికుఁ డను
ధరణీసురుఁడు సంహితాజపంబు
విహితశీలతఁ జేయ, వేయు వత్సరములు
సనిన, సావిత్రి యమ్మునివరునకుఁ
బొడసూపి తనుఁ జెప్పఁ, గను భక్తితో నతం
డెఱిఁగిన, 'నిచ్చెద నిష్ట మడుగు'
మనిన, నాతండు జపాతినిష్ఠయ కోర,
నది యిచ్చి దేవి: 'నీ కత్యుదాత్త
తే. గతియు నగుధర్మ మర్థి నీ కడకు వచ్చు;
యముఁడుఁ గాలుండు మృత్యువు నరుగుదెంతు;
రనఘ, నీకును వారికి నావహిల్లు
వాద' మని చెప్పి చనియె భూవరవరేణ్య. ౧౩౩

క. ధరణీసురుఁడును జపత
త్పరుఁడై దివ్యాబ్దములు శతంబు గడపె; న
ప్పురుషవరుకడకు ధర్మము
పరమప్రీతిఁ జనుదెంచెఁ గౌరవముఖ్యా. ౧౩౪

తే. అట్లు సాకార మై వచ్చి యతనితోడ:
'నీజపంబున సిద్ధించె నిరతిశయము
లైనపుణ్యలోకములు; నీ వందుఁ జనుము
తనువుఁ జిత్తంబు విడిచి యుత్సవ మెలర్ప.' ౧౩౫

వ. అనిన విని యమ్ముని ధర్మంబున కి ట్లనియె: ౧౩౬

క. తనువు దొఱఁగి సనులోకము,
లనఘా, యే నొల్ల మేల లైనను; దుఃఖం
బున కోర్చి నాతలంపున
కనుగుణమై యుండ [1]దీని నగునె తొఱంగన్. ౧౩౭

వ. అనుటయు, ధర్మంబు—— ౧౩౮

1= ఈ దేహమును.

క. 'ఒడ లెట్లు విడువ వలదే?
కడురమ్యము నాక మింత గానవొకో!' నా
వుడు, 'మేను వెలిగ నట వో
నోడఁబడ' నని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా. ౧౩౯

వ. అని పలికిన, ధర్మం బతనితోఁ: 'నీ వొడలు విడువ నొల్లవు పో! యమ కాల మృత్యువులు వీరె వచ్చిరి—చూడుము' అనియె. అయ్యవసరంబున వారలు వచ్చి యమ్మహీసురవరుముందఱ నిలిచి తమ్ముం బేర్కొనిరి. ఆతని నుద్దేశించి యముండు: 'నీ జపంబు ఫలంబు సిద్ధించె' ననియుఁ, గాలుండు: 'నీకు నాకలోకారోహణంబునకుం గాలం బైనం దోఁచితి' ననియును, మృత్యువు: 'కాలచోదిత నై నిన్ను నేఁడు గొనిపో వచ్చితి' ననియునుం బలుకుటయు, నమ్మాటలు [1]గీటునం బుచ్చుచు వారలవదనంబులు విలోకించి సవినయవ్యాహృతస్వాగతుం డయి యవ్విప్రుండు: 'ఏను మీకు నెవ్వని సేయువాఁడ?' అని పలికె. అట్టియెడఁ దీర్థయాత్రాపరుం డైన యిక్ష్వాకుం డచ్చటికి నేతెంచి వార లందఱకుం బ్రణతుం డయ్యె. బ్రాహ్మణుం డతిథింగా నిరూపించి యాదరభరితుం డై—

—◆ కౌశికునకు నిక్ష్వాకుమహారాజునకు సంవాదము. ◆—

క. 'నాకలిమితోడ నిచ్చెద
నీ కెయ్యది యిష్ట?'—మనిన, 'నృపతి, నృపులు దా
నైకపరులు; గొనువార లె?
యేకామ్యము లైన నిత్తు నీ వడుగు తగన్.' ౧౪౧

వ. అనిన విని విప్రుం డవ్విభున కిట్లనియె: ౧౪౨

క. 'కొనువారు ప్రవృత్తులు గా
క నివృత్తులు గొందు రయ్య? కామ్యంబులు నా
మనమున లే; వే నేమియుఁ
గొన నిత్తున; కాన, నధిప, కోరుము తగఁగన్. ౧౪౩

1=నిరాకరించుటం

వ. 'పూజార్హుఁ డవని యిచ్చిన యది యతిథి గ్రైకొనుట యొగ్గు గా'దను
టయు, నమ్మనుజపతి: 'నీ విచ్చువాఁడవయేని నీ సకలజపంబుఫలం
బును నిమ్ము' అన నమ్మహీదేవుండు: ౧౪౪

క. 'జపఫలమున సగ మిచ్చెద,
నృప, యంతయు నైనఁ గొనుము నీ;' వనవుడు, 'న
జ్జపముఫలం బెయ్యది?' యని
నృపుఁ డడిగిన నాతఁ: 'డేను నిర పేక్షుండన్- ౧౪౫

క. 'కావున, ఫల మిట్టిది యని
భావింప; నెఱుంగ నొరులఁ బనివడి యడుగన్;-
నీ వాఫలంబు గొను; [1]మది
దా వినఁబడుఁ బిదప ధర్మతత్త్వజ్ఞుల చేన్'. ౧౪౬

వ. అనుటయు నియ్యనతనయుండు: 'ఫలం బిట్టి దని యెఱుంగ వేనిం
గొన నొల్ల' ననవుడు, నతం డతని కి ట్లనియె:- ౧౪౭

క. 'నీ వడిగి తేను నిచ్చితి;
భూవల్లభ, యింక [2]సత్యమున కూనము గా
దే వరియింపమి?' నావుడు,
నావసుధాధీశుఁ డద్ద్విజామరవరుతోన్: ౧౪౮

వ. 'రాజులకు యుద్ధంబు సుకర్మంబు గావున నీతో వివాదయుద్ధంబు
సేసితి' ననిన, నతండు: 'నీ వేమి సేసి తేమి? అది య ట్లుండనిమ్ము-

క. 'విను, మిచ్చెద నని యీమియుఁ,
గొనియెద నని పలికి పిదపఁ గొన కునికియు, న
త్త్యనృతంబులు; సత్యవ్రత
మునకుం దొలఁగంగ మనకు, భూవర, తగునే? ౧౫౦

క. 'సత్యమ తపమును యజ్ఞము,
సత్యమ వేదంబు దాంతి శాంతులు నగుటన్,

---

1-అది=అఫలమెట్టిదియో పిమ్మట తత్త్వజ్ఞులచేత వినఁబడును. 2- సత్యమునకు
+ ఊనము గాదు=సత్యమునకు హాని కాదు.

సత్యము దొఱఁగుట నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్.' ౧౫౧

వ. అనిన విని, ధర్మంబు వారల నుద్దేశించి యమాదులు విన: 'వీరికి వివాదంబు వలదు. విప్రుండు దానఫలంబును, రాజు సత్యఫలంబునుం బొందువారు' అనియె. అట్టియెడ నాకంబు నరాకృతి దాల్చి వచ్చి త న్నాలింగించి, యయ్యిరువుర నాలోకించి: 'వాదేల?- మీరిద్దఱుం దుల్యఫలప్రాప్తుల రయ్యెదరు. ఇట్లు సేయుండు' అని పలికె. అవ్విభుండు: 'అ ట్లేని నితండును నాయిచ్చునది గొనవలయు' ననుటయు, నమ్మునిః 'యేను దపస్స్వాధ్యాయనిరతుండను; పరిగ్రహవిధియందు విరతుండ'. ౧౫౨

క. అనఘుఁడు, నరనాథుఁడు: 'నా
కును నీకును సరియ కాఁగఁ గోరెద; సత్క-
ర్మనిరూఢి మత్సుకృతఫల-
మనఘా, కొనవే యనుగ్రహంబు దలిర్పన్.' ౧౫౩

వ. అని ప్రార్థించె. అప్పుడు వికృతవేషు లగుపురుషులిరువురు దమలో, వివాదంబు సేయుచు వచ్చి 'యవ్విభుండు మనల శాసింప నోడయుండు వొమ్ము!' అనుచు నిక్ష్వాకుముందర నిలిచిరి; వారి తెఱంగు వినుము: ౧౫౪

తే. ఒకఁడు గోదాన మొనరింప, నొక్కరుండు
తత్ఫలము వేఁడఁ, బ్రీతి [1]నాతండు నొసఁగఁ,
గొనినవాఁ 'డిది దక్కవ దనకు' నని త
లంచి యుత్తమగోయుగళంబు [2]విలిచి- ౧౫౫

వ. సత్పాత్రదానక్రియ నిర్వర్తించి, తత్ఫలంబు మున్ను దనకు గోదాన ఫలం బిచ్చిన యతని కిచ్చువాఁ డయిన, నతండును గొనువాఁడయి యుండి కొనక యెడసేసి తిరుగం, దిరుగనప్పుడు ముట్టం బట్టినవాడు పుట్టిన వచ్చినవా రైరి. అత్తెఱం గెల్ల నుక్తప్రత్యుక్తుల నప్పుడమి

1=గోదాన మొనరించనవాఁడు. 2=వెలఁగొని-(అమ్మట అనియు 'విలుచు' న కర్థాంతరము గలదు కాని ఈ పట్టుకొనుటయే గ్రాహ్యము)

జేనికి నేర్పడం జెప్పిరి. అట్లు సెప్ప వినినయవ్విభునితోడ; *దొలుత నొసంగినవాఁడితండు, అడిగిన నెమ్మిం బ్రతిగ్రహింపఁగా నొసంగితి. ప్రతిగ్రహం బొల్లనినన్ను నితండు నిర్బంధింపందగునే?' అని చెప్పినఁ బిదపటియాతండు: "ఇతండు 'గొనియెద' నని యొడంబడి కొనమి పాతకం బగుట కర్మకాండవిదు లెల్ల నెఱుంగుదురు"– అనవుడుఁ, గౌశికుం డిక్ష్వాకు నుద్దేశించి: 'వింటె యిప్పురుషుని వచనంబులు!' అని పలికి వెండియు, ౧౫౬

క. 'నృప, నీవు మదీయం బగు
జపముఫలం బడిగి; తేను సమ్మతి నీఁగా
విపరీతఫణితు లాడిన
శపియింతుఁ జుమీ!– యెఱుంగఁ జాటితి నీకున్!' ౧౫౭

తే. అనిన, నాతఁడు భయ మంది యాత్మలోన
'నొరులయీగికి నకట! చే యొడ్డకుండు
నట్టినా కిది వలసెనే!' యనుచుఁ గరము
సాఁచె నవ్విప్రుదెసకు నిశ్చయముతోడ. ౧౫౮

వ. [1]అతండు: 'అనేకవర్షంబులు సేసినజపంబుఫలం బంతయు నీ కిచ్చితి' ననుచు ధారవోసిన, నమ్మహీసురవరునాననం బాలోకించి భూపాలుండు: 'నాకరంబున జలంబులు వడియె. మనకు నిద్దఱకును సత్కర్మసమత్వంబు గలుగవలదే! నాయది యైనయాగఫలం బేనును నీ కిచ్చెదఁ గైకొనుము' అని పలికె. అట్టియెడ వికృతవేషు లగునప్పురుషు లిరువురు నన్నరనాథు నుద్దేశించి: 'యేము కామక్రోధులము. ధర్మయమాదులచేతను మాచేతను మీ రిద్దఱుం బరీక్షితుల రైతిరి. ఇంతియ కాని యిచ్చుటయుఁ గొనుటయును నివి దైవాచరితంబులు; మీకుం బని గాదు'– అని పలికిన విని, యవ్విప్రుండు భూవిభునితో ని ట్లనియె: ౧౫౯

ఆ. శ్రద్ధయును బలంబు జపవిధియందు సా
విత్రి నాకు నిచ్చె; వేఱు జపము

---

1=ఆ విప్రుఁడు.

నాచరింపఁ దగదు; నైనను నిందఱ
రెదుర నీవు గోరి తివ్విధంబు. ౧౬౦

క. కావునఁ బ్రార్థన సెఱుపం
గా వెఱచెద; నట్లుఁ గాక గైకొంటి, ధరి
త్రీవల్లభ, [1]నీ సుకృతం
బే వెంటం డిగిచె నరుగు మీ వగ్గతికిన్. ౧౬౧

వ. అనియె. అయ్యిరువుర సత్కర్మనిష్ఠావిశేషంబునం బ్రీతు లయి బ్రహ్మాది దేవతలు వారలమీఁదం బుష్పవృష్టి గురియించుచు నయ్యెడకు నరుగుదెంచి, యభినందించిరి. దేవతూర్యంబులు మొరయ నప్సరోగణంబు లాడుచుం బాడుచు నుల్లసిల్లె. అయ్యవసరంబునం గాశికు నిక్ష్వాకు నుద్దేశించి నాకంబు: ౧౬౨

తే. 'అనఘులార, సంసిద్ధుల రైతి; రింకఁ
దడయ నేటికి నిర్మలోదాత్తగతికి
నుత్సహింతురు గా!' కన్న మత్సరాది
బంధకంబులఁ బోఁ ద్రోచి బ్రాహ్మణుండు: ౧౬౩

వ. ధర్మయమాదులను నాదిత్యసంఘంబును సవినయప్రణామ సహితంబుగా నామంత్రితులం జేసి,— ౧౬౪

—♦ కౌశికేక్ష్వాకులు బ్రహ్మపదప్రాప్తు లగుట. ♦—

క. వాయువుల నియతవృత్తి మ
నోయంత్రిణ బొమలనడుమ నూల్కొలిపి విచే
ష్టాయితశరీరు, డై మూ
ర్ధామోజ్జితములుగఁ జేసె యుత్తల జేర్చెన్. ౧౬౫

వ. అప్పుడు తదీయబ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలాకృతియుం [2]బ్రాదేశమాత్రుండును నగుపురుషు నెదుర్కొని పరమేష్ఠి సమాధానంబున: 'వచ్చితే!' యని పలికి వెండియు— ౧౬౬

1=నీసుకృతము ఏమార్గమునకు లాగునో ఆగతికిఁ బొమ్ము. 2=చూపుడు ... వ్రేలిని చాఁచిపట్టిన- (ఉపదేశముద్ర)- నడిమికొలత మాత్రము.

తే. '[1]జాపకులకు యోగులకును సమము పుణ్య
గతివిశేషంబు ప్రత్యక్షకలిగె; మంచు
జాపకులు నిర్భరోత్థాన శక్తి నధికు'-లనుచు
వక్త్రంబు విచ్చి-'ర'-మ్మనియె నధిప. ౧౬౭

వ. అనుటయు- ౧౬౮

తే. బ్రహ్మరంధ్రనిర్గతుఁడైన బ్రాహ్మణుండు
బ్రహ్మవదనంబుసొచ్చె; భూపతియు నట్ల
వెడలి తద్వక్త్ర మెప్పటి వికసనంబుఁ
బొంద నందుఁ బ్రవేశించె భూపవర్య ౧౬౯

క. దేవత లచ్చెరువడి యా
ద్దేవుని నయ్యిరువురను నుతించి; రజుఁడు సం
భావించె ధర్మమును; నవ
నీవర, యప్పరమవిభుఁడు నిరుపమలీలన్- ౧౭౦

వ. తదనంతరంబ యంతర్హితుం డయ్యె. తక్కినవారును నిజస్థానంబుల
కరిగిరి. జాపక ప్రకారంబును దదీయసుగతివిశేషంబు నెఱింగించితి.
నీ వింక నెయ్యది విన వలతు ననవుఁడు, నాపగాసుతునితోడం గుంతీ
తనయాగ్రజుండు: 'నిరతిశయజ్ఞానయోగంబువిధంబు వినువాంఛ
నాకుం గలదు సెప్పవే!' యనిన, నప్పురుషుం డప్పౌరవోత్తమున
కి ట్లనియె: మనుబృహస్పతిసంవాదం బనునితిహాసంబు గలదు. అది
నీ యడిగినయర్థంబునకు బోధకం బయి యుండు నాకర్ణింపుము.
మను వాత్మీయగురుం డగు దేవగురునకుం బ్రణమిల్లి- ౧౭౧

—♦ మనుబృహస్పతి సంవాదము. ♦—

సీ. 'జ్ఞానయోగము కృపా సంపన్నబుద్ధి నా
కెఱిఁగింపవే!' యన్న, నెలమి నాతఁ
డతనికి ని ట్లను: 'ననఘ, సత్కర్మయో
గశ్రద్ధ దానికిఁ గారణం. బ

1=జపము చేయువారికి.

నిష్టంబు ద్రోవను, నిష్టంబు చేరను
నరుఁడు గర్మాచరణం బొనర్చు.
నెయ్యవి సుఖము లొక్కింతకాలమునకు
నవియ దుఃఖంబులై యావహిల్లు.
ఆ. నింత యెఱిఁగి ఫలమునెడ నిరపేక్షుఁ డై
నతఁడు సౌఖ్య దుఃఖయమముద్రోచి
కామముఖ్యవిప దకంపితజ్ఞానవి
శేషబుద్ధిఁ బరమసిద్ధిఁ బొందు.' ౧౭౨

వ. అని వెండియు, ౧౭౩

క. [1]అసమాలంబ మశబ్దము
రసగంధస్పర్శరూప రహితం బగుటం
బ్రసరించు నింద్రియములకు
వసంబు గా దొందఁ బరమవస్తువు పుత్త్రా. ౧౭౪

క. స్త్రీ పు న్నపుంసకత్వము
లాపరతత్త్వమున లేమి, నది, విను, తత్త్ర
ద్వ్యాపారాపేతం బయి
దీపించుచు నుండు బోధ దేహాత్వమునన్. ౧౭౫

తే. వెలుఁగుచుండెడిదీపంబు వేఱ వస్తు
వులఁ బ్రకాశింపఁ జేయున ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియంబులను మాన
సమును దన ప్రభన్ విగతజాడ్యములఁ జేయు. ౧౭౬

క. [2]విను, పురుషున కింద్రియములు
మనంబుఁ గలిగించుఁ గ్రియల, మను జేశునకుం

---

1–తా. ఆపరమాత్మ దేనియందును ఆధారపడునదికాదు– శబ్దించునదికాదు– రూపము రసము గంధము స్పర్శము లేనిది. కావున వ్యాప్తిగల ఇంద్రియములకు ఆపరమాత్మను బొంద వశముగాదు. 2. తా. రాజునకు మంత్రులు తనతన కార్యములు పెక్కులు తానుచేసిచూపునట్లు పురుషునకు (అంతరాత్మకు) ఇంద్రియములు మనస్సును క్రియలు గలిగించును.

దనతన తెలుఁగునఁ గార్యము
లనేకములు సూపుసచివు లట్టుల వత్సా. ౧౭౮

వ. అని మఱియును, ౧౭౯

చ. [1]అనలము దోఁచునే తరువు నందుఁ గుఠారముఖంబు లైనసా
ధనములఁ బ్రివ్వ, సజ్జనహితా, తగఁ దర్చినఁ గాక? యట్ల యి
త్తనువు నలంగఁ జేసి పరతత్త్వముఁ గాంతు మనంగ రాదు వి
న్ననువున నాగమోక్తమథనం బొనరించినఁ గాని యారయన్.

క. [2]డెందమున కింద్రియములకు
నొందఁగ రా కున్న లేక యున్నే తత్త్వం?
బెందు నపరభాగంబునఁ
బొందవు చూడ్కు; లది లేకపోవునె సుమతీ? ౧౮౦

క. [3]వల యురి యోదము గాలము
గలిగి కదా-మృగముఁ బక్షి గజము ఝషము-ద
క్షులు వట్టుదు! రట్టుల త
ద్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. ౧౮౧

క. పా మెఱుఁగుఁ బాముకాళ్లులు;
ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని
ధీమలనిర్మోచనంబు తెలుఁగు నెఱిఁగినన్. ౧౮౨

---

1. తా. సజ్జనహితా, చెట్టును తఱచినంగాక కొడ్డలి మొదలగు సాధనములతోఁ నఱికినంతనే అగ్ని పొడముునా? అట్లే నేర్పున వేదోక్తరీతిని చిలికిననేకాని ఈశరీరమును (ఉపవాసాదిక వ్రతములచే) నలఁగఁ జేసినంతమాత్రమునఁ బరతత్త్వము గాంతుమని చెప్పరాదు. 2. తా. మనస్సునకును ఇంద్రియములకును పొందరామన్నంతనే తత్త్వము (అపరాశక్తి) లేకుండునా? మన చూపు వెనుకభాగమును జూడఁజాలదు-కాని వీఁపు లేకపోవునా? 3. తా. వల, ఉరి, ఓదము (=అవపాతము=ఏనుఁగు లోనగు పెద్ద అడవి మృగములను బట్టుటకై త్రివ్వి మీఁద తేలికైన కఱ్ఱలను కంపలను గప్పి ఆపైని పలుచగా మట్టిపఱచి చదరముగాఁ జేయు పల్లము), గాలము కలిగి గదా దక్షులు (=నేర్పరులు) మృగమును పక్షిని గజమును చేఁపను పట్టుదురు! అట్లే తద్జ్ఞులు (=బ్రహ్మము తెలిసినవారు) విజ్ఞానము గలిగియుండుటచేఁ బురుషునిఁ జూతురు.

క. [1]కలుగుం దోఁపమి యమవసఁ,
గలుగునె యంతటన యమృతకరునకు నాశం?
బలఘుపరవస్తువునకుం
గలదె యభావంబు మనసు గాననికలుచన్? ౧౮౩

క. రవిబింబము రాహువు పయిఁ
గవిసినఁ బాసినను దోఁపకయుఁ దోఁచియు నుం
డువిధమ యజ్ఞానంబున
యవిరతి-విరతులయధీనుఁ డగు టాత్మునకున్. ౧౮౪

క. [2]విను, మానసప్రసన్నతఁ
దనుఁ గనుఁ బురుషుండు; గలుషతం గానఁడు;-దే
ఱిననీట రూపు సూడఁగఁ
నను వై, కలఁక నది లేనియట్టులపోలెన్. ౧౮౫

తే. ఇంద్రియంబులు దమయిచ్ఛ నిట్టు నట్టుఁ
దిరిగెనేనియు దుఃఖముల్ దెచ్చు; నవియ
కట్టువడి సుఖమొనరించుఁ; గాన, నాత్మఁ
గావవలయు నింద్రియ-చోరగణమువలన. ౧౮౬

క. పాపక్షయమున బోధం
బాపాదింపఁబడి మెఱుఁగుటద్దము కరణిం
జూపునకు వచ్చుఁ దనుఁ దా
నాపురుషుఁడు గాంచుపనికి నై తన్మయతన్. ౧౮౭

తే. ధ్యానయోగనిశ్చల మగునంతరంగ
మెడల విడుచు గుణంబుల నిద్ధశాంతి
మైననిర్గుణవస్తువు నందుఁ గలయుఁ;
బరమపద మది; దానికిఁ బరము లేదు. ౧౮౮

---

1 తా. అమావాస్యనాఁడు చంద్రుఁ డగఁపడఁడు. అంతమాత్రము అతనికి నాశము గలిగినట్లగునా? మనస్సుచూడఁజాలని మాత్రమున ఘనమగు పరవస్తువులేకపోవునా?

2 తా. వినుము: తేఁటిన నీట రూపు కనఁబడును; కలఁకఁ బాఱినచో ఆరూపు కనఁబడదు. అట్లే మనస్సు నిర్మలముగా నుండుటచేఁ బురుషుఁడు తన్నుం గాంచును. అమనస్సు కలఁకఁ బాఱుటచే చూడఁ జాలఁడు.

వ. అనిపలికి సమ్యగ్జ్ఞానంబునకు మాతయు మాటు గావున దాని
మొఱంగు తెఱంగు దేటపఱుపం దలంచి యి ట్లనియె: ౧౮౯

— బృహస్పతి మనువున కుపదేశించిన మాయాప్రకారము —

క. విను, మాయావిధ మిట్టిది
యని యారయ వెరవు గలుగ; దవనిం జరణం,
బనఘా, మోపనిజంతువు
సనుచొ ప్పరయంగ రానిచందం బొందున్. ౧౯౦

క. [1]గుణమూర్తి మాయ; దానిని
గణుతించెద నన్నఁ దెగడు గ్రాహ్యత్వంబున్;
గుణములఁ బెడఁ బాపంగా
గణనాతీత మగు వెలుఁగు- గనుఁ దాన తనున్. ౧౯౧

తే. వినుము, నృప, సత్త్వమును రజస్సును దమస్సు
ననఁగ గుణములు ముప్పిరి గొనుచు నాత్మఁ
జుట్టుకొను; నొండుమెయిఁ దెగ విట్టలముగ
నొలయు-వైరాగ్య మనుకోడవలిన కాని. ౧౯౨

వ. అని నిర్దేశించి వెండియు, ౧౯౩

ఆ. మణిమయములుఁ గనకమయములు రజతమ
యములు మఱియు మృణ్మయాదికములు
నైనపెక్కు-పూసలందుఁ ద్రా డున్నట్లు
భూతకోటియందుఁ బురుషుఁ డుండు. ౧౯౪

క. ఏకరసమయక్షేత్ర మ
నేకౌషధిరసమయం బయినయట్లు సుమీ
యేకవిధ మైనబుద్ధి య
నేకము లగుకర్మముల మెయిం [2]బోక నృపా! ౧౯౫

---

1. = తా. మాయ గుణమూర్తి. ఆ మాయను గణుతించెద (= ఐక్యమున నుంచుకొనెద; స్తోత్రము చేసెద) ననినచో (గ్రహించు సమర్థతను ఉపేక్షించును- అనఁగా గ్రహించు శక్తి నశించును. గుణములను తొలఁగించుకొనినచో అఖండ మగు తేజస్సు - ఆ తేజస్సున తన్నుతాను చూడఁ గలుగును 2. = పోవుట.

ఆ. జలము పృథివికంటె, జలముకంటెను దేజ,
మంతకంటెఁ వాయు, వాకసంబు
దానికంటెఁ—బెద్ద; వాని కెల్లను బెద్ద
మనసు; బుద్ధి పెద్ద మనసుకంటె. ౧౯౬

తే. ధరణి మొదలైన పంచభూతములకంటె,
మనసుకంటెను, బుద్ధికంటెను—మహత్త
రంబు గాలంబు; గాలతత్త్వంబు [1]మిగిలి
యుండువిభుఁ;—డిజ్జగంబుల కొడయుఁ డతఁడు. ౧౯౭

క. ఆదియు మధ్యము నంతము
నాదేవేశునకు లేమి నవ్యయుఁ డతఁ;—డీ
వేదములకు నానావిధ
వాదములకుఁ జేరుగడ [2]భవక్షేపి నృపా. ౧౯౮

క. అనుభవము మ్రింగు శాంతిం
గనునది—నిర్వేదసత్ప్రకాశం; బది, దా-
విను, తలఁపునకును బలుకున
కు నగమ్యము; గర్మముల కగోచర మనఘా. ౧౯౯

క. [3]మనసు గొని మనసు,—బుద్ధిం
గొని బుద్ధిని,—దర్శనంబు గొని దర్శనమున్—
విను, క్రమమున నొదిఁగించినఁ
గను బుధుఁ డక్షరుని విష్ణు ఘనబోధమయున్. ౨౦౦

క. అమృతం బచ్యుత మమలం
బమేయ మవ్యయ మనంత మవ్వెలుఁగు; [4]యమమా
ద్యముల నలవడినచిత్తము
శమాతిరేకమునఁ బొంద సంవేద్య మగున్. ౨౦౧

1. = మించి. 2. = జన్మముల నెగఁ జిమ్మువాఁడు. 3. = మనసును లోఁగొని మనస్సును, బుద్ధిని లోఁగొని బుద్ధిని, దర్శనము (=చూపు) లోఁగొని చూపును క్రమముగఁ దొలఁగించినచో, అక్షరుఁడు విష్ణుఁడు మహాబోధమయుఁడును నగువానిని బుధుఁడు గాంచును. 4. = యమనియమాది సాధనముల నభ్యసించిన మనసు—చూ 126 వ పద్యతాత్పర్యము

క. అని గురుఁ డుపదేశించిన
విని, మనువు కృతార్థుఁ డయ్యె; విద్వన్నుత, నీ
వును వలవరింపుమీ మన
మున నివ్వాక్యముల యర్థము దత్పరతన్. ౨౦౨

వ. అనిన విని, పరమహర్షంబునం బాండవాగ్రజుండు పితామహుం బ్రశంసించి: 'మహాత్మా, మహనీయుం డగుకృష్ణుని మాహాత్మ్యంబు వినవలతుం జెప్పవే!' యని యడిగిన, నతం డమ్మహీపతితో: 'నారద జామదగ్న్య మార్కండేయ వ్యాస వాల్మీకిప్రభృతి మునీంద్రులు సెప్ప వినిన తెఱం గెఱింగించెద నాకర్ణింపు' మని యి ట్లనియె:- ౨౦౩

క. కృష్ణుఁడు ప్రభవిష్ణుం డగు
విష్ణుం- డని లాగ్ని తోయ వియ దిలలఁ గ్రియా
నిష్ణాతత్త్వవినోదన
తృష్ణం గల్పించెఁ దనదుదివ్యవిభూతిన్. ౨౦౪

తే. అట్లు కల్పించి జలములయందు భవ్య
తల్పగతుఁ డైన నాభిఁ బద్మంబు దోఁచె;
అం దజుఁడు పుట్టి సృజియించె నందనుల మ
నంబునన సప్తసంఖ్యుల నరవరేణ్య. ౨౦౫

వ. మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండును బులహుండును గ్రతువును దక్షుండు ననంబరఁగువారలయందు మరీచికిం గశ్యపప్రజాపతి జన్మించె. అతనివలన సురాసురగరుడనాగాదిజాతిసంభవంబునుం గలిగె. అతనికి సూర్యుండును, నత్రికి సోముండును నుదయించి, రాజవంశంబులకుఁ గూటస్థులైరి. సూర్యసోమాన్వయజాతు లైననృపతు లనేకు లనేకదేశంబు లేలిరి. దేశకాలవిశేషంబుల నృపకులంబులు బహుశాఖంబు లై వర్తిల్లు. వాని నెల్లం దన వలసినయప్పుడు విష్ణుండు పరస్పరవిరోధజనితసంగ్రామంబులు నిమిత్తమాత్రంబులుగాఁ గలవిశేషప్రకారంబుల నుపసంహరించు,

అద్దేవుండు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాత్మకంబు లగుచతుర్విధదివ్యస్వరూపంబులు గలిగి జగద్భరణం బాచరించుచు నిట్లు లీలాజన్మంబులం బొంది క్రీడ సలుపును—అని కృష్ణునిం జూపి, యీభూతేశ్వరు మానుష సామాన్యదృష్టిం జూచుట యజ్ఞానంబు. కృష్ణుండు భక్తపరతంత్రితం జేసి యుత్కృష్టచరితులయారాధనంబులకు భాజనం బయి భోగమోక్షంబులు గరుణామంతాంకటాక్షంబుల నొసంగును— అనినం బ్రీతుండై భీష్మునకుం బ్రణామిల్లి యుధిష్ఠిరుండు: ౨౦౬

క. 'మునిజనవినుతచరిత్రా,
మనుజుం డెవ్వానిఁ దలంచి మహనీయనిరం
జనసిద్ధిఁ బొందఁగను నే
యనువు దలఁపు నలవరించు?' నని యడుగుటయున్— ౨౦౭

—♦ భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రప్రభావంబు తెలియఁ గతేంగించుట. ♦—

వ. ఆధర్మతనయుతోడ నద్దేవవ్రతుం డిట్లను: నారదునిచేత వినిన తెఱంగు వివరించెద నాకర్ణింపుము:— ౨౦౮

తే. పరము నక్షరు విష్ణునిఁ బ్రస్తుతించి
నారదమునీంద్రుఁ డంజలి నమిత మైన
మస్తకముఁ జేర్చి భక్తిసమగ్రచిత్త
వృత్తి నల్లన యిట్లని విన్నవించె: ౨౦౯

క. 'దేవా, మోక్షార్థిజనము
లేవెరవున నిన్నుఁ దలఁతు? రేజప్యము నం
భావింతురు? నా కానతి
యీవే భక్తపరతంత్ర యేర్పడఁ, గరుణన్!' ౨౧౦

తే. అనిన నద్దేవమునిపలు కాదరించి
వరదుఁ డగువిష్ణుఁ డిట్లనుఁ: బరమభక్తి
ప్రసిద్ధ యిందిరయును నిగ్రహంబు,
మధ్యానమునకు నమాత్యకోటి, ౨౧౧

క. విను, వీతకల్మషున కవి
పనుపడుఁ; గల్మషము లెల్లఁ బాపఁగ నా మె
చ్చినయట్టిపరమసాధన
మనుస్మృతి జపించునది నియతిమెయి దానిన్. ౨౧౨

తే. [1]ప్రణవపూర్వక మగునమఃపదముపొంత
షడ్గుణైశ్వర్యవాచక సర్వవసన
నిర్వచనశబ్దములు గ్రమనిష్ఠమెయిఁ జ
తుర్థిఁ గూర్పంగ మంత్రంబు దోఁచు బెరసి. ౨౧౩

క. తొలితొలి యిమ్మంత్రము ని
శ్చలమానసుఁడై జపించి జపియింపంగా
వలయు ననుస్మృతి; దానం
గలుగుఁ జతుర్వర్గసాధకత పురుషునకున్. ౨౧౪

క. అని మఱియు దయ ననుస్మృతి
యనుపేరం గలుగుదాని నమ్మునిపతి కి
ట్లని చెప్పె నచ్యుతుఁడు నిజ
మనఃప్రియుం బైనయట్టి మహితస్తవమున్: ౨౧౫

సీ. అవ్యక్తు శాశ్వతు నఖిలప్రభవభూమి
భక్తవత్సలు విష్ణు బరమపురుషు

---

1. తా. 'ఓమ్' అనుప్రణవము మొదటఁగలిగి, 'నమః' అను శబ్దము తరువాతను గలిగి, *షడ్గుణైశ్వర్యసంపన్నతం దెలుపు 'భగవత్' పదమును, (సర్వవసన=) సర్వమునను వసించు నని తెలుపు 'వాసుదేవ' పదమును గలిగి, చతుర్థీ 'య' విభక్తితోఁ గ్రమముగాఁ గూడినవాక్యము మంత్ర మగును-

అదియే "ఓమ్ నమో భగవతే వాసుదేవాయ"-ద్వాదశాక్షరి. *షడ్గుణైశ్వర్యములు: "ఐశ్వర్యస్య సమగ్రస్య। వీర్యస్యయశసశ్శ్రియః। వైరాగ్యా స్యాథమోక్షస్య। షణ్ణామ్ భగ ఇతీరణా." మఱియొక పాఠము- "మాహాత్మ్యస్య సమగ్రస్య। ధైర్యస్య యశసః శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవ। షణ్ణామ్........." [ఐశ్వర్యము (మాహాత్మ్యము), సమగ్రత, వీర్యము (ధైర్యము) యశస్సు, వైరాగ్యము- (జ్ఞానము) మోక్షము, (వైరాగ్యము)- ఈ ఆఱు భగవంతుని గుణములు.]

నక్షయుఁ బ్రాంజలి నై యాశ్రయించెదఁ;
బుండరీకాక్షుని భువనసాక్షి
నిత్యుఁ బురాణు వర్ణించెదఁ; బరు సహ
స్రాక్షు నక్షరుని లోకైకనాథు
భవ్యుఁ గొల్చెద; భూతభవ్యభవత్ప్రభు
సర్వతోముఖు భూతసంప్రవర్తి

ఆ. నమృతు నచ్యుతుని ననంతు హృషీకేశు
రవిసహస్రనిభు హిరణ్యగర్భు
నబ్జనాభు సత్యు నాద్యంతరహితు భూ
గర్భుఁ బ్రభువు భక్తగమ్యుఁ దలఁతు. ౨౧౬

తే. అచలు సూక్ష్ము వరేణ్యు సహస్రశీర్షు
నభయకారి నశీర్షు నారాయణుని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు
ధ్రువుని నీశ్వరు హరి భక్తితోడఁ గొలుతు. ౨౧౭

క. ఎవ్వఁడు సచరాచరగురుఁ?-
డెవ్వనినాభీసరోజ మిూనె విధాతకు?-
నివ్వటిలు జగము లన్నియు
నెవ్వనిచే?- నమ్ముకుందు నెప్పుడుఁ గొలుతున్. ౨౧౮

తే. స్థావరములు జంగమములు దాతలోను
గాఁగఁ బ్రళయంబునొందినకాలమునను
నిలుచు నెవ్వఁ డొకండ?-యా నిత్యసత్య
లలితు శార్ఙ్గిఁ బ్రసన్నుఁగాఁ గొలుతు నియతి. ౨౧౯

క. కాలముఁ బర్జన్యుండును,
నేలయు సస్యంబుఁ, గ్రియయు నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ
ల్లీల నలువువాసుదేవునిం బ్రణుతింతున్. ౨౨౦

క. అనలునకు రవికిని శశాం
కునకును గ్రహతారకములకును దేజం బె
వ్వనివలన నావహిల్లెడు?-
ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్మున్. ౨౨౧

తే. [1]నాలుగింటను వెండియు నాలుగింట,
రెంట నైదింట మఱియును రెంట వేల్చి,
యజ్ఞశీలు రారాధించు నట్టివిష్ణుఁ
డిష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడును నాకు. ౨౨౨

ఆ. యజ్ఞధరుఁడు, [2]పంచయజ్ఞుఁడు, లక్ష్మికి
నునికిపట్టు, యోగమునకు నెలవు,
సర్వమునకు నిష్టసదనంబు గా నొప్పు
వాని నాశ్రయింతు వరదుఁ బరము. ౨౨౩

క. అగమనునిం- బొంధు, నఖిల
జగద్భరణపరు- నమూర్తి, సాగరనిభబో
ధగరిష్ఠుఁ- బంచకాల
జ్ఞు, గుణాత్మకు- నిర్గుణత్వశోభితుఁ-గొలుతున్. ౨౨౪

క. వ్యక్తమునకుఁ బ్రభవం;- బ
వ్యక్తం; బాతత్త్వమునకు నవుల యనువచో
యుక్తికిఁ బరాయణం బగు
భక్తపరాధీను భవ్యభావ్యు నుతింతున్. ౨౨౫

క. జ్ఞానధ్యానపరాయణు
లైనమహాత్ములు జితేంద్రియత్వమహితు లె
వ్వానిం బొందిన మరలరు?-వాని
శరణుఁ జొచ్చి బ్రదుకువాఁడ సుకృతి నై. ౨౨౬

---

1. తా. 'ఆశ్రావయ'-నాలుగు; 'అస్తుశ్రౌషట్' నాలుగు; 'యజ' రెండు; 'యేయజామహే' ఐదు; 'వషట్'-ఈ యక్షరములచేత, యజ్ఞముల సేయువారు, ఎవని నారాధింతురో ఆవిష్ణుఁడు కోర్కు లిచ్చువాఁడు నాకుఁ బ్రసన్నుఁడగుఁగాక. 2= ఐదు యజ్ఞములు (=వేదపాఠము, హోమము, అతిథిపూజ, తర్పణము, భూతబలి) గానైన వాఁడు.

క. లోకం బంతయు నెవ్వం
డేకాంశంబునన నిర్వహించుచు [1]నగ్రా
హ్యాకారుం డై వెలుఁగుఁ ద
యాకరు నప్పద్మనాభు నభివర్ణింతున్. ౨౨౭

తే. అయిదుదెఱఁగులఁ బ్రకృతిఁ బంచాననముల
ననుభవించుక్షేత్రజ్ఞు సత్త్వాదిగుణచ
యంబు లీల భుజించు మహాత్త్వకలితు
సంశ్రయింతు మదాత్మ ప్రసక్తిఁ గోరి. ౨౨౮

క. మతిగతసాంఖ్యులు యోగా
న్వితులు నగుమహాత్ము లెవ్వనిం గని పునరా
గతి లేనిసుగతి వడయుదు-
రతర్క్యవై భవునిఁ దలఁతు నప్పరమాత్మున్. ౨౨౯

క. ఇనునడుమ వెలుంగుచు, సో
మునిమధ్యమునం జలత్వముం బొందనిని
ల్పున వెలయుదీప్తియగు వా
ని నిరంజను నంతరాత్మునిం బాటింతున్. ౨౩౦

క. సోమార్కాగ్నిమయముఁ దా
రామయమును నిత్య సుస్థిరంబును నగు తే
జోమయతత్త్వము నాత్మా
రామత్వంబున నిరంతరంబును జూతున్. ౨౩౧

క. గుణములకు నాది యై ని
ర్గుణమ్ములకు నాద్యుఁ డగునరూపుని లక్ష్మీ
ప్రణయపరము నజు నూత్మునిఁ
బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁ బరము సర్వగతున్. ౨౩౨

క. కలయంగ నెల్లయెడలుం
దలలును లోచనములును వదనములు నగు ని

[1] గ్రహింపఁ బూనిఅకారము గలవాఁడై.

ర్మలు నిర్వికారు నిన్నుం
గొలిచెద సర్వైకసాక్షి, గోవింద, హరీ. ౨౩౩

క. నిను నెఱుఁగ కున్న సంసా
రనిమగ్నత వోదు; గోచరము గావు మనం
బునకు నఖిలేంద్రియములకు;
నను నే మనువాఁడ వింక నారాయణుఁడా? ౨౩౪

క. రోషముఁ గామము రాగ
ద్వేషములును లేక భక్తి దిరమై యేకా
శ్లేషిణిగాఁ గొలుతు రవి
శ్లేషమనోనిలయవృత్తి సిద్ధులు నిన్నున్. ౨౩౫

క. ఫలములు గోరక కర్మం
బులు నడపుచు, వాని విమలబోధాగ్నిహతిం
బొలియించుచు నిర్ద్వంద్వత
నెలకొను నేకాంతిజనులు నినుఁ గండ్రు హరీ. ౨౩౬

క. దేహస్థు నదేహు నఖిల
దేహిసమున్ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత
వ్యూహమ్ముఁ బుణ్యచయము న
మోహాత నిరసించుయోగిముఖ్యులు కృష్ణా. ౨౩౭

చ. ప్రకృతియు బుద్ధ్యహంకృతులు భావము భూతచయంబు నింద్రియ
ప్రకరముఁ— గేశవా, భవదుపాశ్రయ భావితవర్తనంబు; లా
సకలమునందు నీవును బ్రసన్నత ని; ల్తది నీకు, నీవు దా
నికి నిలువంగఁ బట్టగుట నిక్కము గా; చిటు లై వెలుంగుదే?

క. ఏకత్వం బన్యత్వ మ
నేకత్వము గలుగునీమహిమచందం బా
లోకింప నిపుణు లగును
శ్లోకులకుం బరమపదము సులభము శార్ఙ్గీ. ౨౩౯

తే. అచరములును జరంబులు నైనభూత
సముదయంబులు, మణులు సూత్రముననున్న
కరణి, నీయంద యున్నవి. గాన, సమత
నేకభక్తి నేఁ గోరెద నిమ్ము దేవ. ౨౮౦

క. హేతురహితుఁడ- వకర్తవు;
భూతస్రష్టవు- సమస్తభోక్త; వతత్త్వం
బై-తత్త్వము నగుదు; జగ
న్నేతవు కూటస్థుఁడవును నీవ ముకుందా. ౨౮౧

సీ. [1]ద్వేష్యంబుఁ- బ్రియ మను వేర్పాటు లేదు; భూ
తములయం దెల్లను సముఁడ; నాకు
భూతసంయోగంబు బుద్ధ్యహంకారయు
క్తియు గుణత్రయసంగతియును లేవు;
ప్రారంభణంబు ధర్మాధర్మములు నింద్రి
యములపొందును విషయాభిరతియుఁ
బరిహృతంబులు; జరామరణమోక్షార్థి నై
శరణంబు వేఁడెదఁ! గరుణ నాదు

తే. ఘ్రాణ జిహ్వలు మహి-నుదకమున, దృక్కు-
త్వక్కు- దేజంబునందును- వాయువునను,
శ్రోత్ర మాకాశమునఁ,——క్రమసూత్రితముగఁ
బొందఁ జేసి——గోవింద, యానంద మిమ్ము. ౨౮౨

సీ. ఇల జలంబుల, జలంబులు శిఖి, శిఖి వాయు
వున, వాయు వంబరంబునను, నంబ
రంబు చిత్తమునఁ, జిత్తం బహంకృతి, నహం
కృతి బుద్ధిఁ—దగ నొదిఁగించి యింత
వట్టును గూడ నవ్యక్తంబుఁ జేర్చి, యా
వ్యక్తంబు నిజభంగి నైనఁ ద్రిగుణ

1. ద్వేషింపఁ దగినది యని ప్రేమింపఁ దగినది యని వేర్పాటు లేదు.

సామ్యవ్యవస్థితి సడిసన్నఁ గారణ
భూతతన్మాత్రలు పొదువ కుండఁ

తే. దొలఁగఁ బెట్టుట దొరకొనవలయు; దానఁ
బరమమున కేవలము నగుపదము గలిగి,
యేన నీ వనునైక్యంపుటెఱుక వొడముఁ
గాత గమనాగమనములు గ్రాఁగిపోవ. ౨౮౩

క. హరియం దేనును, నాయం
దరయం గా హరియుఁ గలము; హరి నాకును, నా
హరి కేను-[1]ననశ్వరులము;
హరిప్రసాదోదయముమహత్త్వరమహిమన్. ౨౮౪

తే. బుద్ధియును బ్రాణమును నిన్నుఁ బొరయఁ జేయఁ
జాలుభక్తి నా కొసఁగుము, జలధిశయన,
పూర్వకర్మఫలంబులు వొందుఁ గాక
యవి ఋణంబులు గడతేఱు నై సుఖింతు. ౨౮౫

తే. నిన్ను నెప్పుడుఁ దలఁచెద; నన్ను నీవు
వత్సలుఁడ వయి- 'వీఁడు నావాఁ'- డనంగ
వలయుఁ జుమ్మయ్య మఱవక! వాసుదేవ,
దేవదేవ, మునీశ్వరభావనీయ. ౨౮౬

క. తనుఁ దనయందు నిలిపి పే
రనువున బుద్ధికడ వెలుఁగు నచ్యుతుని సనా
తను నగ్రాహ్యునిఁ జిన్మయు
ననుస్మరించునది యపునరావృత్తికి నై. ౨౮౭

క. పరమాత్ముని నారాయణుఁ
జిరంతనుని భక్తి శేముషీనిష్ఠాన్వి
కరణై కాయనుని సమ
స్కరణంబునఁ దలఁతు నతులషడ్విధభూతిన్. ౨౮౮

---

1-అనశ్వరులము=నశించువారము గాము.

తే. అని జపించి సర్వావస్థలందు నను వి
శిష్టభక్తి ననుస్మరించినయతండు
సకలపాపంబులను బాసి శాంతినొంది
యవ్యయానంద పదమున నతిశయిల్లు. ౨౪౯

తే. వైష్ణవియుఁ గల్మషవ్రజధ్వంసినియును
నైన యీ యనుస్మృతి ప్రాజ్ఞుఁ డైన, నజ్ఞుఁ
డైన నెవ్వాఁడు పఠియించు?—యజ్ఞదాన
సమయముల వాఁడు తత్ఫలశతము వడయు. ౨౫౦

క. సురపితృపూజలఁ బావక
పరిచర్యలయందు నన్ను భక్తిఁ దలఁచుచుం
బరమనియతి నివ్వాక్యో
త్కరముఁ బఠించినయతండు గనుఁ బుణ్యగతిన్. ౨౫౧

క. వినిపించునది యనుస్మృతి
నను భక్తిం గొలుచుబహుజనముల కమావా
స్యను బున్నమ [1]బారసిని స
వినయంబుగ! దాన నెల్ల విభవముఁ గలుగున్. ౨౫౨

క. జనము లనుస్మృతిఁ జదువఁగ
విని మ్రొక్కినయంత్యజునకు విశ్రుతగతి గ
ల్గు ననిన—సద్భక్తి జపిం
చినయుత్తమజాతిజునకుఁ జెప్పఁగ నేలా? ౨౫౩

ఆ. అఖిలకర్మఫలము [2]నంతవంతంబు మ
ద్భక్తులకు ననంతపదము గలుగు;—
నట్టు లగుటఁ, దలఁపు మమరమునీంద్ర, ని
న్నది మదీయపదమహర్ధిఁ జేయు. ౨౫౪

క. జ్ఞానము గేవలకృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం

1. =బార+అసి (ఊరుదు)=ద్వాదశి ఇట్లే తేరసి-తేర+అసి = త్రయోదశి.
2 =అంత మగుటతో.

గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధికతరఫలద మగున్. ౨౪౪

క. కావున, నీ కేఁ జెప్పిన
యీవిధ మంతయును శుద్ధహృదయులకుఁ గృపా
శ్రీ వెలయఁ జెప్పుమీ! పు
ణ్యావహశీలురకు సులభ మగుసర్వంబున్. ౨౪౫

తే. అశ్వమేధసహస్రంబు లాచరించి
పడయ రానిమహోన్నతపదము నస్మ
దీయభక్తిరసైకపరాయణుండు
వడయ నేర్చు సుకరముగ బ్రహ్మపుత్ర- ౨౪౬

సీ. అని చెప్పె; నిట్లు లయ్యనిమిషమునిపతి
యడుగంగ శంభుఁ డెయ్యది సమాద
రంబున నెఱిఁగించె—రాజవంశోత్తమ,
తెల్లంబుగా నదియెల్ల నీకుఁ
జెప్పితి; నేకాగ్రచిత్తుండవై పర
మాత్ము నన్నారదునట్ల భక్తి
సంభృతశ్రద్ధానుషంగ తాత్పర్యంబు
తోఁ దలంపుము కృతార్థుండ వగుదు

తే. పరమవరదరహస్యానుభావపూజ్య
మానమూర్తి యనుస్మృతి; దీనిజపము
బుద్ధిఁ బెనుచు, దుఃఖంబులఁ బోవఁ ద్రోచు,
బంధములఁ బాపు, నిత్యశుభంబు నొసఁగు. ౨౪౭

క. అని భీష్ముం డుపదేశిం
చిన విని యానందభరితచిత్తుం డై పాం
డునృపాత్మజుఁ డప్పుణ్యా
త్మునకుం బ్రణమిల్లె వినయమునఁ దను వొప్పన్. ౨౪౮

వ. ఇట్లు ప్రణామంబు సేసి యాధరణీవరుండు గురుపితామహుతోఁ:
'మోక్షమార్గబోధనప్రపంచం బుపదేశింపవే!' అని యడిగిన,

నతండు: 'వార్ష్ణేయాధ్యాత్మం బనునితిహాసంబు గలదు. ఆతంత్రంబు నీయడిగినది యై యుండు' నని పలికి, వినుము వార్ష్ణేయనామధేయుండగువాఁడు— ౨౬౦

—♦ భీష్ముండు ధర్మజున కధ్యాత్మవిద్యాప్రకారం బెఱింగించుట. ♦—

క. మానితముని యొకఁడు సుఖా
సీనుండై యున్న నతనిశిష్యుఁడు వినయం
బూని నిలిచి: 'మోక్షము తెరు
వానతి యీవే దయామయా నా' కనుచున్— ౨౬౧

వ. పాదములకుం బ్రణమిల్లినఁ బ్రబోధ మహితాత్ముం డగున మ్మహాత్ముండు— ౨౬౨

ఆ. భక్తి గలవు నాకుఁ; బ్రజ్ఞానఘనుఁడ;—వ
ట్లవుట నీవు యోగ్యుఁడవు కుమార.
సదుపదేశమునకు సమవధానుండవై
వినుము, నాదు వాక్యవృత్తి తెలుఁగు. ౨౬౩

వ. అని పలికి యి ట్లనియె: ౨౬౪

తే. కాలచక్రంబు నిరవధికంబు; దీన
[1]సర్గములుఁ బ్రళయంబులుఁ జనుచు నుండుఁ;
బ్రళయమునఁ బరమాత్ముండు ప్రకృతిఁ బొంది
యఖిలమును సృజియించుఁ గల్పాదియందు. ౨౬౫

---

1 = సృష్టులు— [సృష్టి తొమ్మిది విధములు: మహత్సర్గము, అహంకారసర్గము, భూతసర్గము, ఇంద్రియసర్గము, దేవసర్గము, తమస్సర్గము, వనస్పత్యాదిసర్గము, తిర్యక్సర్గము, మనుష్యసర్గము; కుమారసర్గం బని మఱియొకటి కలదు. ఇది మనుష్యసర్గమున నంతర్భూతమయినది. ప్రత్యేకముగా గ్రహించినచో సర్గము (=సృష్టి) పదివిధము లగును.

దేవసర్గము— ఎనిమిది విధములు; తమస్సర్గము— ఆఱు ప్రాకృతములు; వనస్పత్యాది సర్గము— ఆఱు విధములు; తిర్యక్సర్గము— ఇరువదియెనిమిది విధములు; మనుష్యసర్గము— మూఁడు వైకృతములు.

తే. భూతజాలంబుతో మునిపుంగవులును
దోఁచి, మును ప్రళయంబునఁ దోఁచ పడఁగి
చనినసర్వవేదంబులు శాస్త్రములును
బడసి రద్దేవుదివ్యానుభావమునను. ౨౬౬

క. న్యాయాద్యనేకతంత్రము
లాయంచితమతు లొనర్చి యఖిలజనాను
ష్ఠేయాచారములఁ బరి
జ్ఞేయములుగ విశదభంగిఁ జేసిరి పుత్త్రా! ౨౬౭

క. అవి వినఁగ నెఱుఁగఁ జేయను
నవుఁ బరమబ్రహ్మబోధ; మమరులకు ముని
ప్రవరులకు దుర్లభ మ
య్యవగతము; జనార్దనునక యలవడి యుండున్. ౨౬౮

ఆ. సకలదుఃఖభేషజం బగునత్తెరు
వప్పురాణపురుషు నగ్గలంపుఁ
గరుణ నతనివలనఁ గనిరి మునీంద్రులు;—
క్రమముతోడ నర్థగమ్యమయ్యె. ౨౬౯

క. చైతన్యశక్తిఁ బురుషున
మేతత్త్వవిశేషమున వహించుఁ బ్రకృతి; త
జ్జాత యగును బుద్ధి; తదు
ద్భూత మహంకార;— మదియుఁ బొరయుం జిత్తున్. ౨౭౦

క. కలిగె, విను, మహంకారము
వలన నభము; దానఁ జేసి వాయువు, క్రమనం
కలితజననములఁ దేజము
జలము నిలయుఁ దత్తదాత్తజన్యత్వమునన్. ౨౭౧

వ. బుద్ధికి మహత్త్వనుతత్త్వనిర్దేశంబునుం గలిగి యుండు. ౨౭౨

క. వికృతులు మహదాదికస
ప్తక; ముభయవిధేంద్రియములు పదియు, విషయపం

---

1= ఎల్లదుఃఖములకును ఔషధ మగు అమార్గము...

చక్రమును, మనసును గూడఁగ
వికారషోడశక మిది వివేకాభ్యర్థీ. ౨౭౩

క. ఈసర్వము దేహాత్మా
భాసిత; మిది దేహి యైనపరమాత్ముని వి
న్యాసమునకుఁ గా నొదవి యు
పాసించుం గరణరూపమై యాకర్తన్. ౨౭౪

తే. పుత్త్రి, వినుము, నవద్వారపుణ్యపురము
నం దచింత్యసంవ్యాపకుఁ డై శయించు
నీసమస్తభావంబుల నెనసి; యట్టు
లగుటఁ బురుషుండు నాఁ జను నవ్విభుండు. ౨౭౫

క. అమరుం డవ్యయుఁ డజరుం
డమేయుఁ డమలస్వభావుఁ డప్పురుషుఁడు—దే
హమున—మహీజమునం దన
ల మున్నగతి—నుండుమథనలక్ష్యుం డగుచున్. ౨౭౬

ఆ. వినుము, యోగమథనమునఁ దోఁచు నత్తేజ
మది ప్రబోధసాంద్ర; మఖిలభూత
గణసమాశ్రయంబు; గావున, శ్రవణ ద
ర్శనముఖక్రియాకరంబు దాన. ౨౭౭

క. భూతము లవ్యక్తంబున
జాతములగు, నంద పెరుఁగు, సమయుఁ దదీయ
స్థితత్వమునన;—పురుషుం
డేతద్విధసాక్షి తా సమిద్ధుఁడు వత్సా. ౨౭౮

—♦ భీష్ముఁడు ధర్మజునకు గాలచక్రప్రభావం బెఱిఁగించుట. ♦—

ఆ. [1]వ్యక్తసత్తధార, మవ్యక్తనాభంబు,
షోడశకవికారసుపరిమండ

1. తా. కనఁబడుచుండు అంచులు ఏడుగలది; కనఁబడని బండికంటి తూము గలది; పదునాఱు వికారములతో గుండ్రనైనది; నిలుకడఁ ద్రాయైనది; ఆత్మచేతఆక్రమింపఁబడినది—ఇట్టి కాలచక్రము శాంఖ్యునకు వశమై తిరుగుచుండును.

లంబు, ధ్రువ, మధిష్ఠితం బాత్మచేతఁ—జ
క్రంబు—దిరుగుచుండుఁ గా లవశత. ౨౬౯

క. [1]ఈచక్రంబున సకలచ
రాచరమయ మైనలోక మవశానిష్ఠా
గోచర మై చరియించుట
సూచికొనఁ వలయుఁ దత్త్వశోధనదృష్టిన్. ౨౭౦

తే. పొందు సత్త్వ రజ స్తమంబులు విశుద్ధ
నంతరాత్మఁ—బొంసువార్త మనిలుఁ జెందు
నట్లు; సద్వివేకమునఁ దదంతరంబు
బుధుఁడు గాంచి యగ్గుణములఁ బోరయ కుండు. ౨౭౧

క. వేదాంతవిదుఁడు దుర్లభుఁ;
డాదరము ప్రవృత్తిలక్షణాన్విత మగుధ
ర్మోదయమంద కలుగు; నది
లే దరయ నివృత్తి సౌఖ్యలినత్వమునన్. ౨౭౨

క. ఆర్యులుఁ బ్రవృత్తిలక్షణ
కార్యంబులచేతఁ జేసి గార్హ్యము నగుత
ద్ధుర్యత్వమందు విడువ ర
నార్యము లగుమదనమదభయక్రోధాదుల్. ౨౭౩

తే. వినుము, దేహాభిమానికి వీని నెల్లఁ
దొఱఁగ దొరకొన దెంతశాంతునకు నైనఁ;
గాన, నేమిట దేహాభిమాన మెడలు?—
నట్టిచూ పభ్యసించు వేదాంతవిదుఁడు. ౨౭౪

ఆ. అడవి సొచ్చి యంతకంతకు నవులకు
నతికుతూహలమున నరిగి యరిగి

---

1. తా, ఈ చక్రమునందు సకలచరాచరమయ మైనలోకము, వశము గానిది– నిలుకడ లేనిది– కనఁబడనిది– యై చరించుచుండుట తత్త్వపరిశీలనదృష్టితోఁ జూచి కొనవలయును.

చూచుచుండునట్లు నూవె సంసారకా
ననమునందుఁ దిరుగు జనులనడవు! ౨౮౫

క. విను, తెవు లుడుపఁగ భేషజ
మునకుం దలకొనిన చందమున, మది సత్యం
బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగవలయు మోహాత్యయికిన్. ౨౮౬

తే. భూమి మొదలుగఁ గలభూతములకు, నింద్రి
యముల కన్నింటికిని, సత్త్వమాది యైన
గుణములకు నెల్ల, జగములకును, దదీశ్వ
రునకు—నరయ నహంకార మునికిపట్టు. ౨౮౭

తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మఱియు
నీదృశములును: సత్త్వగుణోదితములు;
రాగ లోభ రోషాదులు: రాజసములు;
దర్ప శోక ప్రముఖములు: తామసములు. ౨౮౮

క. జ్ఞానమునకు నగ్గుణసం
తానం బడ్డంబు గానఁ, దత్ప్రతిహతికై
పూని మును సాత్త్వికమునను
మానస మూన్పంగవలయు మహనీయధృతిన్. ౨౮౯

క. విను, సాత్త్వికములు మది నెల
కొని రాజస-తామసములకును విగతత్వం
బొనరించుఁ; బదంపడి స
త్త్వనిరూఢత బోధసంపదకు హేతు వగున్. ౨౯౦

తే. క్రియ లహంకారమునఁ గల్గుఁ; గ్రియలవలన
దేహసంబంధ మెడలక తిరుగవలయు
జన్మపర్యాయములయందు; జన్మ మనఁగ
మిళితనవతుకశ్రోణితకలితవృత్తి.

ఆ. మాత్రియమునఁ బురీషమున నూనుచును గర్భ
మునఁ బ్రవర్ధనమ్ముఁ బొంది వెడలి
సంతతానుబంధసంసారదుఃఖని
ర్మగ్నుఁ డగుచు నుండు మానవుండు. ౨౯౨

క. ఇంతకు మూలము తృష్ణా
తంతులతయ; వత్స, వినుము: దానికి నడరం
గాంతాజనంబు [1]దోలుప్రాఁ;
కింత యెఱిఁగి తృష్ణ దొఱఁగు టిచ్చు విముక్తిన్. ౨౯౩

క. జ్ఞానాజ్ఞానంబులకుం
దాన యుపాశ్రియము బుద్ధి; తత్త్వాహంకా
రానూనలక్షణాఢ్యం
బై నయెఱుక— దాని జీవుఁ డని చెప్ప శ్రుతుల్. ౨౯౪

ఆ. అతఁడు కాలకలిత మైనకర్మమున సం
సారవర్తనంబు సలుపుచుండు—
స్వప్నసంప్రవృత్తి సలిపెడునరుమాడ్కి—
నింద్రియములతోడ నెనయ బెరసి. ౨౯౫

క. రాగపరిలిప్తమానస
యోగంబున నింద్రియంబు లుల్లసితము లై
భోగు లగుట యుడిపిన, నప
రాగతసంసారదుర్విరామము సేయున్. ౨౯౬

క. పురుషు లఖిలభూతములను,
బురుషులలో భూమిసురులు, భూమిసురులయం
దరయంగ మంత్రవేదులు—
వరు;— లధికులు బోధయుతులు వారలకంటెన్. ౨౯౭

క. జ్ఞానంబు దృష్టి నరునకుఁ;
గాన, నయనహీను నడపుకరణి యగుటఁ బ

---

1. తీగయల్లుటకు ఊతముగా నుంచుకొయ్య.

జ్ఞానవిహీనునినడవడి,
దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. ౨౯౮

క. క్షమయును సత్యంబును శౌ
చమును సుధర్మములు; బ్రహ్మచర్యం బత్యు
త్తమధర్మము; వానికిఁ జి
త్తము నలవఱుపంగవలయు ధైర్యముపేర్మిన్. ౨౯౯

క. పరిహాసము భాషణమును
నిరీక్షణము లోను గాఁగ నింద్యంబులు సుం
దరులయెడ; దీని కే మని
చొరఁ దగ; దట్లైన మనసు సొత్తురు సుదతుల్. 300

క. విను, మాంసాస్థిమయం బని
వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు మది దగుల; దా
పనికిని [1]నాడీవిశుద్ధి ప్రాపగుఁ బుత్త్రా. 301

క. శారీరస్థితికిఁ బ్రథమ
కారణమై యుండు నాడికాదశకము; సం
చారిక లగునింద్రియముల
కారయ నాడికలు మఱియు నైదమలమతీ. 302

తే. స్థూలభంగులు పదియును, సూక్ష్మభంగు
లైదు, నివి — వీనికంటె నత్యంత సూక్ష్మ
భంగి హృదయంబునడుముగాఁ బరఁగి యున్న
నాడి యది సర్వగత యగుఁ జూడఁ జూడ. 303

క. ఆచూపు మరగి చిత్తం
బేచవికిం బోదు; పోయెనేని మరలుపన్
గోచర మగు — వెలిచవులం
బాచిన లోచవిన నిలిచి పరమాత్ముఁ గనున్. 304

1. పింగళ సుషుమ్న అను ప్రాణాయామమందలి మూఁడు నాడుల శుద్ధి
నను ఆశ్రయ మగును సాయనా.

క. [1]ఆవిధము శుక్రగతి గను
భావమునకుఁ గాని పట్టు వడదు; వినుము, శు
క్రావేశము సంకల్పజ;
మావాసము శుక్రమునకు నఖిలాంగకముల్. ౩౦౫

క. [2]అరయఁగ సంస్పర్శమునన
తిరుగుడు వడు శుక్ర మనుట తెలుఁగే? సంక
ల్పరతిం గలదే చోఁ?-కెడఁ
జరింప కుండంగ వలయు సంకల్పంబుల్. ౩౦౬

తే. అత్రిముని యింద్రదైవత్య మని జనులకుఁ
దెలిపె; నది కారణముగ నింద్రియ మనంగ
బరఁగుఁ జూవె నృబీజంబు! పరమ మెల్ల
ధాతువుల కది! విను, పుత్త్రి, దానివిధము: ౩౦౭

ఆ. శుక్రమునకు మనసు సూక్ష్మరూపము; మనో
బలము నిల్వరింపఁ బక్వబుద్ధి
యోపుఁ; దరుణవృద్ధు లోప రజ్ఞానదా
ర్బల్యమూఢవికలభావు లగుట. ౩౦౮

క. కావున, శుక్రస్థితికిం
గావించినయట్టిపుణ్యకర్మము లగుస
త్సేవితయమ-నియమాదుల
త్రోవ సొరఁగవలయు విషయదూరాత్మకుఁ డై. ౩౦౯

క. అరయఁగ విషయము లెంతయు
దురంతములు; వానియందుఁ దొడరినఁ జేటుం
బొరయుదురు; దొడర కున్నం
బరమపదవి యమ్మహానుభావులకు నగుఁగా. ౩౧౦

---

1 = తా. ఆ పరమాత్మను జూచువిధము శుక్రగతి (= రేతస్సుయొక్క నడక) జూచుదృష్టికిఁగాని పట్టుబడదు: రేతస్సుయొక్క వేగిరపాటు మనస్సువలనే గలుగును. అంగములెల్ల ఆశుక్రమునకు నెలవు. 2. తా. విచారింపఁగా శుక్రము స్పర్శమాత్రమువలనే భ్రమించు నని చెప్పఁ దగునా? సంకల్పేచ్ఛవలనను సంస్పర్శము కలదా? సంకల్పమూలే మనస్సువ చరింపకుండ వలయును.

క. జననము జరయును మరణం
బును మొదలుగఁ గలుగుదుఃఖములు లోకమునం
గనుఁగొని బుధుండు మోక్షం
బున కుద్యోగించు నియతిఁ బూతహృదయుఁడై. ౩౧౧

తే. వాఙ్మనఃకాయములు శౌచవంతములుగఁ
జేసికొని యనహంకారశీల శాంత
బుద్ధియై నిరపేక్షతఁ బొంది యఖిల
భూతదయ గల్గి మెలఁగంగ బోధ మొందు. ౩౧౨

క. మనసును వాక్కును గాయం
బు నియంత్రితములుగఁ జేసి పొందుదురు ధనం
బునకై ప్రముచ్చులు; దానిం
గనుఁగొనఁగా వలదె మోక్షకాంక్షికి వత్సా. ౩౧౩

ఆ. బుద్ధిఁ గొని మనంబు వోసీక నిలిపి, మ
నోభియుక్తి నింద్రియముల నాఁగి,
విషయసమితి నెడల విడిచినవానికి
ననిమిషులు ప్రసన్ను లగుదు రనఘ. ౩౧౪

క. విను, దేవతాప్రసాదం
బున నిర్మలయోగతంత్రములు పనుపడు న
య్యనువున నిశ్చలమతి ని
ల్చునది శిథిలితాన్నపానసుఖతృష్ణుం డై. ౩౧౫

క. శాకకణమూలఫల[1]పి
ణ్యాకాదుల భైక్షమైన యన్నంబున ని
శ్శోకత నాఁకలి వుచ్చుచు
లోకాలోకంబున నచలుఁడు గావలయున్. ౩౧౬

క. జ్ఞానమ యింధనము గ వి
జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ జరయు మరణమున్

1.– తెలికపిండి లోనగువానిని...

నానావిధదుఃఖంబులు
లేని యమృత మక్షరంబు లెస్సెన్నఁ దోఁచున్. ౩౧౭

క. విను, నిద్రాదోషంబునఁ
గనుకలల రజస్తమోవికారంబులచే
మనసు దిరుగఁబడఁగాఁ [1]గఱ
చినవి మఱచి, యపుడ దుష్టశీలుండ యగున్. ౩౧౮

వ. అది యోగి కొప్పదు గావున, ౩౧౯

క. వినుతజ్ఞానాభ్యాసం
బున సమధిక జాగరత్వమ్ముం బడసి, సకృ
జ్జనితం బగునిద్రాభర
మునఁ బొందును యోగి;- యదియుఁ బోఁ ద్రోఁచుఁ దుదిన్.

వ. అని వెండియు, ౩౨౧

—♦ భీష్ముఁడు ధర్మజునకు స్వప్నాద్యవస్థల తెఱఁ గెఱింగించుట ♦—

క. [2]విలయం బింద్రియములకుం
గలుగఁగ విషయానుభవము గలిగినభంగిన్
మెలఁగును స్వప్నంబున మెయి
గలయట్టుల దేహి; భావగతి యెయ్యదియో! ౩౨౨

క. అని యిట్లాలయువితర్కం
బునెడ హృషీకేశుఁ డైనపురుషోత్తముద
ర్శనమును గ్రమమున నెఱిఁగిన
మునివర్గము శిష్యవర్గమున్ బోధించున్. ౩౨౩

క. శ్రమమున నింద్రియములు లీ
నము లగునది నిద్ర; కల యనం దత్సంస్కా
రము మిథ్యావిషయప్రా
ప్త మగుట; యప్పుడును దేహి దా సాక్షి యగున్. ౩౨

1.= నేర్చిన ధర్మములను మఱచి. 2. తా. ఇంద్రియములకు విలయము (= మూర్ఛ; అపాయము; మృత్యువు; కల్పాంతము) గలుగఁగా స్వప్నమున తనకు శరీరమున్నట్టును విషయానుభవము (ఇంద్రియాది సుఖము గలిగి నట్లు) దేహి మెలఁగును; ఆ భావవృత్తి ఎయ్యదియోకదా!

తే. [1]అనిలముఖదోషములను, సత్త్వాదిగుణవి
కారముల జాగరంబునఁ గలుగునట్టి
తోఁపు బెరయంగఁ గల యయి తోఁచు;-నది శు
భాశుభములకు సూచక మనియుఁ గలదు. ౩౨౫

క. [2]స్వాపావస్థం బ్రకృతి క
దీపిత వాటిల్లునపుడుఁ దెలి వెడలక తా
దీపించుఁ బురుషు ; డిమ్మెయి
చూపు ప్రబోధంబు పరమ సూక్ష్మత పుత్రా. ౩౨౬

తే. [3]తెలియ మేల్కనియుండుట-గలలు-నిద్ర
యను నవస్థాత్రయంబును నవులఁ బెట్టఁ
జాలు విజ్ఞాననిర్మల సత్యబోధ
రూపనిర్భరానందస్వరూపుఁ డనఘ. ౩౨౭

తే. వ్యక్త మవ్యక్తమును రెండు నవగతములు
గాక మోక్షంబు మార్గంబు గానరాదు.
'వ్యక్త మది మృత్యు; వవ్యక్త మమృత' మనియె
నతులవిజ్ఞానఘనుఁడు నారాయణుండు. ౩౨౮

క. అనఘా, విను. మవ్యక్తం
బనునది త్రైలోక్యమునకు నాధారము; దా
ని నివృత్తలక్షణం బగు
ననుపమధర్మ మని [4]చాటు నాగమఫణితుల్. ౩౨౯

---

1. తా. వాతపిత్తశ్లేష్మముల దోషములును సత్త్వరజస్తమోగుణముల వికారముల జాగరము (=మేల్కనుట) వలన గలుగునట్టి తోఁపు (=తోఁచువడి; తలఁపు)ను గూడి స్వప్నముగాఁ గనఁబడును అది (అకల) శుభములకు అశుభములకు సూచక మనియుఁ గలదు. 2. తా. నిద్రావస్థయందు ప్రకృతికి (స్వాభావికమునకు) నిర్వికారసత-వికాసత లేమి గలిగినపుడు తెలివి విడువక పురుషుఁడు ప్రకాశించుచుండును. ఇట్టిచూపు ప్రబోధముయొక్క పరమసూక్ష్మత్వము (=అధ్యాత్మము). 3.=జాగ్రతము, స్వప్నము సుషుప్తి-మూఁడు అవస్థలు. 4. చాటున్ + ఆగమఫణితుల్ = వేదవాక్కులు చాటుచున్నవి.

తే. వినుము, బ్రహ్మోదితంబు ప్రవృత్తిధర్మ;
మది గతాగతవ్యాప్తుల నావహించు;
బ్రహ్మ మంత్రము నివృత్తిధర్మంబు; నమ్మ
హాశ్రయము మోక్షదం బను నాగమములు. ౩౩౦

క. కట్టినచీరయునుం బైఁ
బెట్టినచీరయును మాళి బిగి యారంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను
నెట్టన పొదివినది దేహిని గుణత్రయమున్. ౩౩౧

క. విను, సత్త్వ రజ స్తమముల
[1]పెనఁకువ కవ్వల వెలుఁగొందు పెంపు గలుగు [2]తు
ర్యనిరంజనతత్త్వము పర;
మనఘా, యది భావనీయ మను వేదంబుల్. ౩౩౨

క. వాకును మనసును గాయము
నేకాయనవృత్తిశౌచ మెడలనితపముం
జేకొనునది;- యది బోధ
శ్రీకి- ఘృతంబునకు వెన్నక్రియ- జనక మగున్. ౩౩౩

తే. బ్రహ్మచర్య మహింసనాఁ బరఁగు పరమ
ధర్మములు రెండును వ్వో యుత్తమతపంబు!
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ
వంతుఁ డై చూడ నేర్చు సర్వంబు ననఘ. ౩౩౪

క. ఆతతసంసారము తృ
ష్ణాతంతుస్యూతిబంధనంబున దృఢ మై
చేతస్సంగతిఁ బాయమి
కాతెఱఁగుతపంబు, వృత్తి, యౌషధము సుమీ! ౩౩౫

క. వికసితతృష్ణాలతికకు
నకుటిల మగుతపము [3]దాత్రమై నఱకంగా

---

1.= పెనఁగులాటకు అవ్వల-ఆవల-వెలిగా ననుట. 2. నాలవది యగునిరంజన తత్త్వము (=దోషరహితమయిన తత్త్వము) 3.=కొడవలి యై

వికృతులఁ, బ్రకృతిని బురుషుని
నకలంకజ్ఞానదృష్టి నవలోకించున్. ౩౩౬

క. అని యమ్ముని పలుదెఱఁగులఁ
దనుబోధించినఁ గృతార్థతం బొందెఁ దపో
ధనుఁ డాశిష్యుఁడు; నీవును
గనికొను మేతద్వచోనికాయార్థంబుల. ౩౩౭

తే. అనిన విని, ప్రీతుఁ డై పాండవాగ్రజన్ముఁ
డావగానూనుతో: 'మిథిలాధినాథుఁ
డైన జనకుండు మోక్షంబు,-ననఘ, యేమి
కృత్యమునఁ గాంచె?- నదియెఱిఁగింపు' మనుడు- ౩౩౮

వ. అతం డతని కిట్లనియెఁ: దత్సంబంధి యైనయితిహాసంబు సెప్పెద——

క. విను, మాచార్యులు నూర్వురు
జనకనృపాలునకు; వారు సతతంబును స
జ్జనపతి వినిపింతురు త
త్త్వనిరూపకశాస్త్రములు [1]పృథగ్విధములుగన్. ౩౪౦

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన
నావసుధాధిపుఁడు దాని ననుమోదించున్
భావము సంతోషశ్రీ
భావిత మగు చుండఁ- గురునృపాలప్రవరా. ౩౪౧

వ. అట్టియెడఁ దత్త్వజ్ఞానఘనుండును నిర్ద్వంద్వుండును సంశయరహితుండును నగు పంచశిఖుం డనుమునివరుండు మహిం దిరుగుచుండి మిథిలకుం జనుదెంచె. అతండు కపిలాభిధాన యగుగురుకుటుంబిని చన్నుగుడిచి పెరిఁగినవాఁ డగుటం గాపిలేయుండు నా నంబరఁగు. అమ్మహాత్ముండు హేతుమద్వాక్య విశేషంబుల నయ్యాచార్యుల నూర్వుర నయ్యుర్వీపతిసన్నిధిన నిరుత్తరులం జేసిన, నాతం డతని [illegible]త మెఱింగి వారల విడిచి తన్నుం బ్రబోధించుట కై

1 వేఱ్వేఱురీతులంగా, [illegible]

ప్రార్థించి యతనికిం బ్రీణితుం డైన, నమ్మానసీయుం డనూనద యాయత్తచిత్తుండు గావున నాభూవల్లభునకు మోక్షోపాధిబోధ ప్రదంబు లగువాక్యంబు లి ట్లని యుపదేశించె: 3౮౨

—♦ పంచశిఖుం డను విప్రుండు జనకునకుఁ దత్త్వోపదేశంబు సేయుట ♦—

ఆ. విను, మవిద్య కామమునకుఁ, గామము గర్మ
మునకుఁ బుట్టఁ బట్టు; లనఘ, యింత
వట్టుఁ గారణముగ వచ్చుఁ బునర్జన్మ
మండ్రు తత్త్వవేదు లైనమునులు. 3౮3

ఆ. ఒలసి లోభమోహములు దోషసంసేవ
నం బొనర్పఁగా ఘనత్వగాఢ
యగు నవిద్య భూమి యై బహుకర్మ బీ
జముల కంకురాదిశక్తు లొసఁగు. 3౮౪

క. ప్రియములు నప్రియములును హృ
దయమును జిక్కువడఁ దివ్వఁ దత్తదనేక
క్రియలకుఁ జొచ్చు నరుఁడు; మేఁ
ద్రయ మగు, టెఱుఁగఁడు వితతజరావ్యాధుల చేన్. 3౮౫

క. ధనములు బంధులు భోగము
లనియెడు నస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును; మన
మున శాంతిశ్రీసమృద్ధి మోక్షము నిచ్చున్. 3౮౬

వ. అనిన విని, జనకజనవల్లభుం డమ్మునివల్లభునితోడ- 3౮౭

క. 'కేవలవైరాగ్యము మో
క్షావహ మగునేని నట్టి లైన విరక్తిఁ
భావమున నరుఁడు దాల్చెడిఁ
బో!-వాఁ డవ్యయపదంబుఁ బొందునె?' యనుడున్. 3౮౮

వ. అవ్విప్రవరుం డతని కి ట్లనియె: 3౮౯

క. విను, నృప, హర్షంబు ప్రియం
బనూనసుఖయుక్తి నిర్భరానందము శాం
తినిరూఢి యనఁగ మనమునఁ
[1]బనుగొనునవి సాత్త్వికాఖ్యభావంబు లగుణ్. ౩౫౦
క. పరితాప, మనభితోషము,—
నరేశ్వరా, శోచనము, జనవ్యాపారా
దర, మక్షమ—యనియెడునివి
యరయంగా రాజసంబు లగుభావంబుల్. ౩౫౧
క. తలఁపులు గ్రిందుగఁ బొడముట,
గల గను, టేమఱుట, భ్రిమము గదురుట, జాడ్యం,
బలసత—యనునీభావం
బులు దామసకోటి యండ్రు బుధులు నరేంద్రా. ౩౫౨
క. కారణము గలిగియును ని
ష్కారణకలితంబు లయ్యు జనియించు, ధరి
త్రీరమణ, మూఁడు దెఱఁగులు;
నారయ నివి యస్థిరంబు లై తిరుగఁబడుణ్. ౩౫౩
చ. జనవర, సౌఖ్యముం బొరసి సాత్త్వికభావసముద్గమంబు సు
మ్మనియును, దుఃఖముల్ గదిరినప్పుడు రాజసభావభంగి సు
మ్మనియు, జడత్వసంగసమయంబునఁ దామసభావవృత్తి సు
మ్మనియును ద్రోచి [2]వానఁ బడకాత్మరతిణ్ నిలు పిచ్చు మోక్షముణ్.
వ. ఇవ్విరవునకు వైరాగ్యంబుమూలం బని చెప్పి వెండియు— ౩౫౪
తే. వినుము, సత్త్వాదిగుణముల,—ననఘ, యాత్మ
తత్త్వమున లీనములఁ జేయఁ దన్మయత్వ
దర్శనము; [3]దాన [4]నవి మహాహ్లాదధి నడంగు
నేఱులట్టుల రూపఱు వేఱు లేక. ౩౫౬
తే. నరుఁడు సుఖదుఃఖముల వెంటఁ బొరయనీక
[5]మలఁచి యాత్మునిఁ జేర్చిన మానసంబు

1. వృథపడునవి; గట్టిపడునవి. 2. వానియందు. 3. తన్మయత్వదర్శనమున-
4. మూలం. 5. మరలి; తిరిగి.

లీన మగు నంద—జలములలోన నిడిన
లవణకణము చందమ్మున నవనినాథ. ౩౫౮
క. తోలు దిగవిడిచి నాగము
లీలఁ బోలుచుమాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ
గీలుకొన నీక వెలుఁగు ని
రాలంబనబోధఘనుఁడు రాజవరేణ్యా. ౩౫౯
వ. అని బోధించె. ఇట్లు పంచశిఖునిచేత బోధితుండై కాదె జనకుండు దనపురం బైన మిథిలగాలునప్పుడు దుఃఖంబులం బొరయమిం జేసి తన కేమియుం గాల దని పలికె? కౌంతేయాగ్రజా, యాకర్ణింపుము:
క. అమలం బగునీయితిహా
సము భక్తిఁ బఠించినం బ్రశాంతి యొలసి దుః
ఖములం దొఱఁగి మనుష్యుం
డమృతత్వావాప్తిమహితుఁ డై వెలుఁ గొందుఁ. ౩౬౦
వ. అనిన విని, ధర్మతనయుండు దేవవ్రతుతో: 'ఎట్టివాఁడు సుఖియును మంగళవంతుండును నిర్భయుండును నై వర్తించు?' అని యడిగిన నప్పుడమితేని కప్పురుషవరుం డిట్లను: దమసంపన్నునకు నీచెప్పిన చందంబు గలుగు; నాకర్ణింపుము: ౩౬౧
తే. సర్వవర్ణాశ్రమములకు శమము దమముఁ
గలిగి యునికి విశిష్టప్రకార మగుట
బ్రాహ్మణునకు విశేషించి, రాజవర్య,
దమసమాహితవృత్తి పెద్దయును వలయు. ౩౬౨
వ. దమంబు సద్గుణంబులరాశి; అవి యెయ్యవి యంటేని, ౩౬౩
సీ. శౌచ, మక్రోధంబు, సంతోష, మార్జవ,
మనసూయ, విగతదైన్యత్వవృత్తి,
యప్రమాదంబు, దురభిమానరాహిత్య,
మతివాదవర్జన, మఖిలభూత
దయ, గురుపూజ, నిందాస్తుతిప్రవణతా
త్యాగం, [1]బ పైశునత్వంబు, సాధు

1. కొండెగాఁడు (చాడీకోరు) గాకుండుట.

జనసంగమం, [1]బమృషాభాషణంబు, ని
స్స్పృహాత, యహింస, సుశీలభావ—
తే. [2]మింద్రియగ్రామజయ: మివి యెల్ల దమము
నాకృతులు; వీనిఁ గలవుణ్యుఁ డభయుఁ; డైహి
కములవలనను నాముష్మికములవలన
శాంతిమంగళనిధి; బోధసౌమ్యమూర్తి. ౩౭౫
వ. అనినం, బితామహునితోఁ బాండవేయాగ్రజుండు: 'వ్రతస్థు
లొకొక్కయెడ భోజనంబులు సేయుదురు. వారలకు వ్రతహాని
లే కుండునే?' అని యడిగిన నతనితో నతండు:— ౩౭౬
తే. 'వినుము, విప్రకామార్థభోజనము లోను
గాఁగఁ గలుగు వేదోక్త ప్రకారభోజ
నములు వ్రతహానిసేయవు నరవరేణ్య;'
యని నిరూపించి పలికి యి ట్లనియె: మఱియు— ౩౭౭
వ. సదోపవాసియు సదాబ్రహ్మచారియు అమాంసభోజియు [3]విఘ
సాశనుండును అమృతాశియు అస్వప్నుండునుం గావలయు; తత్స్వ
రూపంబు లెట్టి వంటేని— ౩౭౮
సీ. ఇరుపొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువక
యుండునాతండు సదోపవాసి;
ఋతుకాలమున నాత్మసతియందు రతి సల్పు
భవ్యశీలుఁడు సదాబ్రహ్మచారి;
దేవపితృతిథిపూజావిధులం దిడి
మఱి [4]నంజు పురుషుఁ డమాంసభోజి;
తనయట్లు పంక్తివారును భుజింప భుజించు
నంచితాత్ముఁడు విఘసాశనుండు;
తే. భృత్యవర్గంబు గుడిచినపిదపఁ గుడుచు
నాతఁ డమృతాశి; దివసంబు నందు నిదుర

1 = అసత్యము (దబ్బర) లాడకుండుట. 2 = ఇంద్రియములను జయించుట
3 = దేవతలయొక్కయు అతిథులయొక్కయు భుక్తశేషము భుజించువాఁడును. 4
= తినునట్టి.

వానిపుణ్యుఁ డనవ్వపుఁ; [1]డిష్ఫలము లగు మ
హాధికవర్తితములు దేహబాధకములు. ౩౧౯

—♦ ఇంద్రప్రహ్లాద సంవాదప్రకారము. ♦—

వ. అనిన విని, కౌంతేయాగ్రజుండు శాంతనవుని తోడ: 'కర్మంబులు సంస్కారయోగంబున శుభాశుభంబులం బురుషుం బొందించు. వానికిం గర్త యప్పురుషుండ యగుట గాకుండుట నిశ్చయింప రాకుండు; నాకేర్పడం జెప్పవే!' అనుటయు, నప్పుణ్యుం డక్కురువరేణ్యున కిట్లను: ఇంద్రప్రహ్లాదసంవాదసమాకర్ణనంబున నది దేటపడు నాకర్ణింపుము: సత్త్వస్థుండును, సంయమనిరతుండును, అనహంకారుండును, [2]అమర్షక్రోధదూరుండును, [3]తుల్యనిందాస్తుతియును- [4]సమలోష్టకాంచనుండును, నారాయణధ్యానపరాయణుండును- అగు ప్రహ్లాదుం డొక్కయెడ నొక్కరుండ యాసీనుండై యుండ, నింద్రుం డతని యంతరంగం బారయవేఁడి చేరం బోయి,

క. సంపదలేమికి మది శో
కింపవు; శత్రువులచేతికిని లోనగుటూ
హింపవు; నిను నూరకునికి
పెంపని పాటించె దిట్టిబేలవు గదవే! ౩౨౦

వ. అనవిని, హిరణ్యకశిపునందనుం డప్పురందరున కిట్లనియె:

ఆ. [5]కలిమి లేమియనఁగ గల వొకరెం; డవి
యత్నగౌరవము వియత్నతయును
గలుగ వచ్చు 'ననుట గా; దది నూబేలఁ
దనము! వినుము, తెలియ ననిమిషేంద్ర: ౩౨౧

క. తేరక యుండఁగఁ జేరుం;
దేరంగాఁ బొలియు; విధియధీనంబులు గా

---

1 = ఈవిధములగు, 2 = కోపమునకు క్రోధమునకును దూరమైనవాఁడును, 3. =నిందా స్తుతి (దూషణము భూషణము) సమానముగ గణించువాఁడును, 4. మంటి గడ్డను బంగారమును ఒకటిగాఁ జూచువాఁడు. 5. తా. కలిమి యని లేమి యని రెండు గలవు. అందు కలిమి ప్రయత్నముచేతను, లేమి ప్రయత్నము లేకుండుటచేతను వచ్చు ననుట తగదు. అది(అట్లనుకొనుటయే) సుమీ బేలతనము!

కారయ విత్తంబులు పురు
షారంభాయత్తములె మహాబుద్ధినిధీ? 323

క. శత్రుజనములు చెఱుచుటయును,
మిత్రులు బ్రతికించుటయును, మిన్నక యాపత్ప్రాప్తియును, సంపదయు—వి
ధాత్రుఁడు సంధించఁ జూవె గతితోఁ బురుషుల్. 324

ఆ. భావములు నిజస్వభావంబునన తోఁచు,
నడఁగు; నట్లు గాన, నస్థిరతకు
నెలవు లని యెఱుంగ నేర్చిన భావంబు
లందుఁ దగులు నెట్లు డెంద మనఘ? 325

ఆ. ఏను గర్త ననుట యెఱుఁగమి; దాఁ గర్త
యేని నేమిఫలము నెడల కుండ
నఖిలకర్మములును నాచరించుచు నున్న
వాఁడె?—కానఁ గర్త గాఁడు దాను. 326

వ. అని పలికి వెండియు, 327

క. అనఘా, విధివిహితంబుఁ
దనచేతఁగఁ దలఁప ఫలము దగులు నహంకా
రనిరూఢున; కనహంకా
రున కది లేమి పలయుక్తిఁ ద్రోసం జాలున్. 328

క. విను, విధికృత్యము లూరక
గనుగొనుచును, సిద్ధ్యసిద్ధికల్పితసుఖదుః
ఖనిరూఢిఁ బొంద కుండఁగ
మనముం దొలగించువెరవు మహనీయ మగున్. 329

క. కావున భూతానిత్యత
భావించుట యెపుడు గలిగి బంధచ్ఛేద
ప్రావీణ్యము సంపదతో
హాముగ నున్నవాఁడ నమర ప్రవరా. 330

క. దాంతుఁడుఁ బ్రజ్ఞావంతుఁడు
శాంతుఁడు నగువానిమానసం బాయాన
భ్రాంతము గా దెవ్వోయి?— ని
శ్చింతుఁడ నై యుండుదును విశిష్టవిచారా. 3౮౧

క. అనవుడు, ననిమిషపతి: 'యే
యనువున నీశాంతి నీకు నగపడియె? మహా
జనపూజ్య, చెప్పవే నా!'
కని యడిగిన నిట్టు లనియె నతఁ డాతనితోఁ: 3౮౨

తే. ఆర్జవంబు, ప్రసన్నత, యాత్మవత్త్వ,
మప్రమాదంబు, వృద్ధసేవాభినిరతి—
మేలు సేయుఁ; బ్రజ్ఞాశాంతి శాలియగుట
కాలపాకంబుతోఁ దాన కలుగు ననఘ. 3౮3

క. అనిన విని, విస్మయము నె
మ్మనమునఁ దళుకొత్తఁగా నమరపతి యభివం
దన మొనరించి పొగడుచుం
జనియె నిజావాసమునకు జగతీనాథా. 3౮౪

వ. అని చెప్పిన విని, యుధిష్ఠిరుండు: 'భూపాలునకు లక్ష్మి
భ్రంశం బేమిటం గలుగు?' అనుటయు నయ్యాపగానందనుం
డతని కిట్లనియె: 3౮౫

తే. వాసవునకును బలికి సంవాద—మనఘ,
కలిగె; నయ్యితిహాసంబు గర్ణగోచ
రంబు సేయుము; నీ దగు ప్రశ్నమునకు
నుత్తరం బది సెప్పెదఁ జిత్త మలర. 3౮౬

సీ. ఇంద్రుఁ డబ్జజుకడ కేతెంచి వినతుఁ డై;
'బలి మహాసంపద వెలుఁగుచుండె;
నతని నివ్వాడు గాన; వాఁ డెచ్చో నున్న
వాఁడొకో! యనుడు, నవ్వారిజాస

నుండు: 'నీతలఁ బొప్ప కుండుట యెఱిఁగితి;
నైన నను జెప్పెద; నన్నృతవాది
గాకుండుమీ! యుష్ట్ర ఖర గో హయంబుల
యందుఁ దా నొక్కటిచంద మొంది

తే. యడఁగి యున్నాఁడు;—వధియించు టనుచితంబు
వాని; 'నని పల్కె; 'నటు సేయువాఁడఁ గాను;
మాట వెట్టుదుఁ గన్నచో-మానసీయ
వాక్య' యని వీడుకొనియె నవ్వాసవుండు. ౩౭౮

వ. వీడ్కొని చని జగతిం జరియించి యొక్కచోట ఖరరూపంబున సంప్రీతుం డయి యున్న యబ్బలిం గని బలారాతి యి ట్లనియె:

—• ఇంద్ర బలిచక్రవర్తి సంవాద ప్రకారము. •—

క. ఏనుఁగులు సుట్టి రాఁ బే
రేనుఁగుపై మణిమయంపుటెల్లులు మెఱయం
గా నీ వేతెంతువు! మఱిఁ
[1]గానికిఁ గొన వచ్చు! ఈపుడు గాడిద వై తే! ౩౭౯

క. [2]కనకమయయూప మొప్పఁగ
ననూనవిభవమున నీవు యాగం బొనరిం
చినయొప్పును!—నిప్పటినీ
యునికియునుం జూచి నాకు [3]నుమ్మల మయ్యెఁ. ౩౮౦

ఆ. [4]ఊఁక దినుచు నిట్టులుండి, నీతొల్లింటి
లీలఁ దలఁచి యుమ్మలింతో! లేదో!—
యున్నరూపు సెప్ప వన్న, గార్దభరూప
ధారణైకనిపుణ, దానవేంద్ర! ౩౮౧

సీ. అన విని, బలి దేవతాధీశుతో: 'నీకు
నావిభవంబు గానంగ రాదు

1= లత్త్యపెట్టువు అప్పుడు 2= బంగారుతోఁ జేయఁబడిన యూపము (=యజ్ఞమునందు పశువును గట్టుటకై నాటెడు పైపట్టలేనికొయ్య; పాలకొయ్య; గంగరావి) 3=దుఃఖ మగుచున్నది. 4=రూ. ఊఁక=పొట్టు.

గుప్తమై యున్నది గుహాయందు; నా కిచ్చ
పుట్టిన నవ్వాడ పొలిచి తోఁచు.
నది యటు లుండె నీ వధికుండ; వల్పుల
యెదుర రజ్జులు వల్కు టేఁటి పెంపు?
పొమ్ము!—దుశ్చ్యవన, నీపోయెడు తెరు!' వన్న,
నాతండు నవ్వుచు నతనిఁ జూచి
ఆ. మున్ను వలికినట్లు [1]కన్నోట లేక ప
ల్కుటయు, నతఁడు: 'భూతకోటి మంచు
వోలెఁ దోఁచు, విరియు; బుద్ధిమంతులు దాని
కిచ్చ వగవ రింత యెఱుఁగ వెట్లు?' ౩౯౨
వ. అని వెండియు విరోచననందనుండు— ౩౯౩

క. పొరి నర్థంబు- ననర్థము,
మరణము-జీవితము, సుఖసమాగమమును-దు
స్తరదుఃఖసంగమంబును,—
దొరకొనునే నెపుడు సమతతోడన నిలుఁతున్. ౩౯౪

చ. బలమును నొప్పు బుద్ధియును బ్రౌఢతయుం గలవారు, లేనివా
ర లనక యొక్క భంగిఁ దఱి రాకయ చూచి హరించు చుండు వి
చ్చలవిడిఁ గాలుఁ; డ ట్లగుట, సారమతిం గని యున్నవాఁడ; సు
మ్మలికయు సుబ్బు నాదుమది మందున కైనను లేదు వాసవా.

ఉ. గాడిదరూపు దాల్చి యుముకల్ దిను చుండఁగఁ జూచి యుల్లసం
బాడెదు! శక్ర, శాంతిసమయం బగుటన్, విను, మింకఁ గొన్ని నీ
వాడిన నాదుచిత్తమున నల్క యొకింతయుఁ బుట్ట. దిట్లు నీ
వాడితె మున్ను? ని న్నెఱుఁగనా! వలదానను నీ వెఱుంగఁగన్!

క. ఎలమియు వాడుటయును దన
వలచినయట్టివె; యెఱుంగవా విధిచరితం
బులు బలవంతంబు లగుట?
వలదె వివేకంబు [2]పెద్దవారికి నింద్రా? ౩౯౭

1. = బెదరులేక. 2. = కుందుటయును.

క. ఇటు గర్వించుట నీచత;
యెట వోయెదొ పొమ్ము! మాను మీ వలవని త్రు
ళ్లుట! వజ్రము నీవును బిడి
కిటితాఁకున నొఱగు దేను గినిసితి నేనిన్. ౩౯౮

క. ఇది మేలపుమాట సుమీ!
మది నుద్ధతి లేదు నాకు; మహితాశ్చర్యా
స్పద మగువిధాతృ చెయ్దియిం-
దుది నీవును [1]దుస్స్వప్నోదు; త్రుళ్లు టుడుగుమీ. ౩౯౯

వ. శాంతుఁడవగు మనిపలికె. అట్టియెడ నవ్విరోచననందను శరీరంబున నుండి సురూపయు సుకారయు నగునొక్కమగువ నిర్గమించినం గని, కౌశికుండు విస్మయ వికసితాక్షుం డగుచు నతనితో: 'నివ్వనిత యెవ్వతె?' అనిన, నాతండు: 'ఏ నెఱుంగ; నీవ యీయమ నడుగుము' అనుటయు, నయ్యనిమిషపతి యమ్ముద్దియమొగంబు గనుం గొని: 'మాకు ని న్నెఱింగింపుము' అనవుడు, నద్దేవి యతనితోడ:

క. 'శ్రీయును భూతియు లక్ష్మియు
నాయభిధానములు; మీరు న న్నెఱుఁగమి చె
ద్దే? యింద్ర, యెజ్జగంబుల
నేయుగములయందు నెఱుఁగ రెవ్వరు'-ననినన్. ౪౦౧

క. అనవుడు, నతండు: 'నీ వీ
దనుజేశ్వరుఁ బాయుటకుఁ గతం బేమియొకో!'
యనిన విని, లక్ష్మి: 'సత్యం
బును ధర్మము దమము దానమును నాయిక్కల్- ౪౦౨

క. 'అవి గలిగి పరాక్రమయుతుఁ
డవుపురుషునిపాల నిలుతు; నమరాధిప, యీ
దివిజారి దొల్లి యట్టిఁడ;
యవినీతత నిపుడు బ్రాహ్మణాసూయమెయిన్- ౪౦౩

1. ఎగిరి పోవుదువు.

క. ‘తొల్లిటిసచ్చారిత్రము
లెల్లను దిగ విడిచెఁ గాన నీతనికడ నే
నొల్ల నిలువ; వచ్చెద, సుర
వల్లభ, నీపాల నెలమి వసియింపంగన్. ౪౦౪

ఆ. ‘ఆగుణములు మఱియు నాగమోదితసమా
చారములును, గలిమిఁ గోరి, యింద్ర,
నిన్నుఁ బొంది యేను నిల్చెద; నేమిట
నేమఱంగ వలవ దెప్పుడు నీకు!’ ౪౦౫

వ. అని పలికె. ఇట్లు లక్ష్మిచేతం బరిత్యక్తుం డైనబలి యాఖండలు
నాలోకించి: ౪౦౬

క. ‘అయనవశంబునఁ దేజో
వియుక్తుఁడై రవి ప్రతాపవిరహితుఁ డగునా
క్రియఁ 1బొనుగుపడినఁ— బొంగకు
జయింతు నిను దేవదనుజసంగర మగుడున్.’ ౪౦౭

వ. అనుటయు మహేంద్రుండు: ౪౦౮

క. ‘అది యట్లు లుండె;—నీతోఁ
బదరం బని లేదు నాకుఁ. బద్మభవునిమా
ట దలంప వలయు; నీపై
2భిదురం బిడ;— దనుజనాథ, ప్రియ మందు మోదన్.’ ౪౦౯

క. అనిన విని, యొండు వలుకక
దనుజాధీశ్వరుఁడు వోయె దక్షిణదిశకుం;
జనియె నుదఙ్ముఖుఁ డై దివి
కనిమిషనాథుండుఁ గౌరవాన్వయముఖ్యా. ౪౧౦

వ. అని చెప్పి యనిమిషనదీనందనుండు వెండియుఁ బాండవాగ్రజున
కిట్లను: ఇంద్ర-నముచిసంవాదం బనునితిహాసంబు హృదయప్రసాద
కరంబు: దాని నాకర్ణింపుము: ౪౧౧

1. తేజము ఆఱిపోయినను. 2. (నీపై) వజ్రాయుధము విడువ(ను).

—ఇంద్ర-నముచి సంవాదప్రకారము—

సీ. సిరిఁ బాసియును నొక్క చింతయు లేక [1]వీ
చులక్రిం దడంగినజలధివోలె,
నముచి యేకాంతస్థలమున నుండఁగ నింద్రుఁ
డచటికి నేతెంచి యతనిఁజూచి:
'పేదవడ్డాఁడవు! ప్రియజనంబును బరి
వారంబు లే! దియ్యవస్థ కెంత
వగచెదవో దానవశ్రేష్ఠ!' నావుడు,
నాతండు: 'వగపు నిరర్థకంబు;
తే. వలయువస్తువు వగచిన వచ్చునయ్య?-
రామి యొక్కటియే; శరీరంబు నెదయుఁ
దాపమునఁ బొందు వగపున; ధర్మ మేదు;
నింత యెఱుఁగుదు; వగవ నే నేమిటికిని. ౪౧౨

తే. సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు
గాదె యొక్కరుఁ! డాతనికల్పనమునఁ
బ్రాప్తమైనది-నీళ్ళులు పల్లమునకు
వచ్చుక్రియఁ దాన వచ్చు గీర్వాణముఖ్య. ౪౧౩

క. 'ఇది నా కయ్యెం గాఁగల
యది యై' యనుగాఢనిశ్చయం బెవ్వనిచె
మ్మదిఁ గలుగు?-నుబ్బ- వగ, సం
పద-యాపద-గలుగ వట్టిభవ్యున కింద్రా. ౪౧౪

క. ధైర్యంబున వీర్యంబున,
శౌర్యంబునఁ బ్రజ్ఞఁ బడయఁ జాలునె నరుఁ డే
కార్యము నప్రాప్యమయినన్?
నార్యుం డది యెఱుఁగుఁ గాన నడలఁడు శక్రా. ౪౧౫

తే. మేలుఁ గీడును నరుఁ బొందుఁగాలముల న
వశ్యమును. వానిఁగోరిన వచ్చుటయును,

---

1. తరంగమ్ములప్రాంత

వినుము, త్రోచినఁ బోవుటయును, సురేంద్ర,
కలదె? వానికిఁ, గావున, వలదు చింత. ౪౧౬

క. అని యిట్లు నముచి పలికిన
విని మెచ్చుచు దివికి నమరవిభుఁ డరిగెం. బా
వనచరిత, యింక నెయ్యది
వినవల తవవుడును, భరితవినయుం డగుచున్— ౪౧౭

క. ఆనరపతి శాంతనవుని
తో ని ట్లను: 'నెద్దియేని దుర్దశ యైనన్
మానవుఁ డెట్టిఁ డగుట మే'?
లానతి యీవే దయామయా తేటపడన్. ౪౧౮

వ. అని యడిగిన నయ్యుధిష్ఠిరునకు బుధశ్రేష్ఠుం డి ట్లనియె: ౪౧౯

క. ఏవిధమున దుర్దశలకు, భూవర,
ధైర్యంబ మందు. భూరిధృతి మెయిం
జేవ గలుగు దృఢనిశ్చయ
భావము నెవ్వగలఁ దొట్రుపడ దెబ్భంగిన్. ౪౨౦

క. ధృతి యారోగ్యము నొసఁగును;
ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు; ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ; గాలగత్యవ
గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా. ౪౨౧

—◆ఇంద్రబలిసంవాద ప్రకారము.◆

వ. ఏతద్విషయం బైనయది యొక్కటి యింద్ర-బలిసంవాదం బనునితి హాసంబు గలదు ఆకర్ణింపుము: దేవాసురులకు సమరంబు సెల్లిన నందు విష్ణునిమహానుభావంబున దేవతలకు గెలు పై రుద్రాదిత్య మరుద్వసుగంధర్వసిద్ధాదులు పరివేష్టింప, నిందుఁ డైరావతారూ ఢుం డై లీలం ద్రైలోక్యంబును జరించుచుండి యొకప్పుడు సము ద్రప్రాంతంబున నొక్కగిరిగహ్వరంబునయంగణంబున వైరోచ నుం డగుబలింగని చేరం జని, యద్దనుజపతి దన్నుం జూచి

నిస్సంభ్రముండును వైమనస్యరహితుండును నై యునికి నిరూపించి యతనితో ని ట్లనియె: ౪౨౨

క. హీనస్థానమున విభవ
హీనత ని ట్లుండి, రిపులయొలమిఁ గనియు నీ
మానసమున శోకింపమి,
దానవకులనాథ, యెవ్విధంబునఁ గలిగెన్! ౪౨౩

ఆ. శౌర్యముననొ వృద్ధసంసేవవలననొ
తపముననొ యుదాత్తతానిరూఢి
గలిగి మమ్ము సరకు గాఁ గొన కున్నాఁడ
వేమికతము దీని నెఱుఁగఁ జెపుమ? ౪౨౪

వ. అనిన విని బలి యతని కి ట్లనియె: ౪౨౫

ఆ. సరకుసేయ వను చసడ్డమాటలు గొన్ని
యాడినంత నేమి యయ్యె? నింద్ర,
నీదుశక్తి వింతయే! దైవవశమున
నెట్టిపాటివారు నెట్లుఁ గారె! ౪౨౬

క. నీవు మును హీనుఁ డగుటయు
నావలనం గాదు; నీకు నను హీనదశా
భావితునిఁ జేయ రా; దివి
దైవకృతము; లట్లు గాన ధైర్యము వలయున్. ౪౨౭

క. విను, పర్యాయంబున సుఖ
మును దుఃఖముఁ జెందు జనుల; బురుషుఁడు ధైర్యం
బున గర్వంబు విషాదం
బు నడంగింపఁ దగు నండ్రు బుధు- లది వినమే! ౪౨౮

క. చెలులుం జుట్టలును సహా
యులు విభవము పెంపుకాలయుక్తి నవస్థం
దొలఁగించుట గలదె? మదిం
దెలిసి మనుము; మనికి యిట్టిదియ కా దెప్పుడున్. ౪౨౯

క. నిను నే గెలుచుట కాలము
నన; నీవును గాలయుక్తి నను గెలిచితి; గా
వున, నశుభమునకు శుభమున
కును గాలము సూవె కర్త కుశికతనూజా! ౪౩౦

ఆ. నాకు నీకు నేల,—నాకేశ, శత్రుత్వ
మేరికైనఁ గలదె యెందుఁ? బాక
మునకుఁ దెచ్చుచుండు జనులఁ గాలము—వృక్ష
ఫలవిధముగ; రజ్జుపలుకు లుడుగు. ౪౩౧

వ. అని చెప్పి యంత నిలువక— ౪౩౨

క. కాదిది విక్రమకాలము;
లే దిప్పుడు నాకు నలుక; లీలాత్మక, రో
షాదరము గలిగినను నిను
నీ దగుపరిజనము గూల్పనే పెడచేతన్? ౪౩౩

వ. అని పలికి వెండియు, ౪౩౪

క. సిరిపెంపునఁ గడు నొప్పెదు,
సురనాయక, యిపుడు; మీఁదఁ జూచెదు నీకుం
బరిభవము దెచ్చుటకు నై
కరము వెసన్ వచ్చుఁ జేటుకాలము తెలియఁగన్. ౪౩౫

తే. ఇంద్రు లెందఱు వో!— రింద్రు లేల!—బ్రహ్మ
లుండుదురె! — తఱితోఁ దెగుచున్నవారు
గాక! దానవసంఘంబు గాలవశతఁ
బొందు టేటికి సెగ్గింపఁ? బొమ్ము నీవు. ౪౩౬

క. క్రతువులు సేఁతయు, దేవ
వ్రతములు సల్పుటయు, వృత్తవంతుఁ డగుటయుం—
గతమే కాలము ద్రోచుట?—
కతర్క్యవర్తనము గాల;— మది గొనదు సుమీ! ౪౩౭

క. అని యిట్లాడినమాటలు
విని, దనుజానిఁ జూచి, యమరవిభుఁ డుల్లములో

నన సంరంభంబు నుడిపి
కొనుచు, నతని కిట్లు లనియెఁ గురువంశవరా: ౪౩౮

క. అకట! భవచ్చిత్తము ని
ర్వికారమై భరితధృతివివేకవినయశాం
తిక మగుచు వెలింగెడు! దీ
నికిఁ గారణమైననిష్ఠ నెఱి యెట్టిదియో? ౪౩౯

క. అనిన నతఁ డతని కిట్లను:
'విను, మనిమిషనాథ, యేను వే లోకచోటం
గొని వచ్చితినే చిత్తం
బున కవికృతి ధృతి వివేకముఖ్యగుణంబుల్. ౪౪౦

వ. 'కాలప్రకారం బెఱుంగుదుం గావునఁ గలంగ కుండుదు. ౪౪౧

తే. 'చెప్పుచున్నాఁడఁ: గాలంబుచేత నెల్ల
విధము జొప్పడు జనులకు; వినుము, కాల
మప్రమాదవర్తన; మధికప్రమాద
సంగమత్తులు వా రెట్లు భంగపడరు? ౪౪౨

క. [1]కళలుం గాష్ఠలు లోనుగ
గలచిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం
బుల,—వడ్డి కిచ్చునాతని
వలెన్ నలవడఁ బొదివి తనకు వశ్యులఁ జేయున్. ౪౪౩

క. 'కాల మడఁగించు జనుఁ గ
ల్లోలిని గిరిఁ ద్రెంచుకరణి; లోభ క్రోధా
శీలత్వ కామ భయములఁ
దేలుజనుఁడు గాలవృత్తి తెలుఁగు నెఱుఁగునే! ౪౪౪

క." 'ఇంతకు మును నూచితి! నతఁ
డెంతయు నొప్పు గొని యుండె! నిది గడుఁజిత్రం!

---

1. తా. కాలము, వడ్డి కిచ్చువాని విధమున, కళ (=ముప్పది రెప్పపాటుల కాలము) లనెడు, కాష్ఠ (=పదునాఱు రెప్పపాటుల కాలము) లను లోనగు చిదురల (=సూక్ష్మభాగముల)ను గూర్చుకొనుచు జనులను అలవఱచికవిసి లోబఱుచుకొనును.

బెంతవెసఁ జచ్చె!' ననుఁ;– దనుఁ
జింతింపఁడు జనుఁడు మూఢచిత్తత్వమునన్. ౪౪౫

క. "విను, భావాభావంబులు
గని యుత్త్యుత్తమతపంబు గైకొనువిద్వ
జ్జనుఁడు గనుఁ గాలగతి యె
ల్లను [1]కరతలశోభితామలకముంబోలెన్. ౪౪౬

క. "కాలగతి గనుట శాంతికి
మూలం బై యంతరంగమున కాత్మమయ
త్వాలంబనంబు నిచ్చు; [2]దఁ
దాలీనుం డైనపురుషుఁ డక్షోభ్యుఁ డగున్" ౪౪౭

వ. అనిన విని పాకశాసనుం డతనివివేకపాకంబున కచ్చెరు వొంది యభినందించి యతని కిట్లనియె: ౪౪౮

ఆ. దనుజనాథ, యివ్విధంబునఁ గాలచా
రిత్రవేది వై పవిత్రశీల
యుతుఁడ వైతి; నీవు కృతకృత్యుఁడవు; నీదు
వృత్తి గోర వలయు నుత్తములకు. ౪౪౯

తే. లోక మెల్లను నఱచేతిలోన నున్న
యట్లు గనికొని, సత్త్వాదు లైనమూఁడు
గుణములను బాయఁ బెట్టి, నిర్గుణత వెలుఁగు
నాత్మఁ గనుచున్నవాఁడ వే మందు నిన్ను!- ౪౫౦

క. కెలనికిఁ జూడఁగ దైన్యా
కలనం బగుచున్నయిపుడు గదిరినదశయుం
దొలఁగుం గావుతఁ! గడుమే
లెలసి పరమసుఖముఁ బొందు మిచ్ఛావృత్తిన్! ౪౫౧

క. అని పలికి యుచితముగ వీ
డ్కొని విభవం బెసఁగ నభ్రకుంజరముపయిన్

---

1. – అఱచేయియందలి ఉసిరికవలె. 2. – ఆయాత్మమయత్వముయొక్క ప్రాపునఁ బూర్తిగఁ గరఁగినవాఁ డగును.

వినువీథిఁ జనియె సురలును
మునులును వేష్టింప భూతములు వినుతింపన్. ౪౫౨

తే. అమృతపానంబుఁ జేసినయంతకంటె
నద్దనుజపతిమధురవాక్యామృతమున
సంభృతానందుఁ డై సురేశ్వరుఁడు దనదు
పురమునకుఁ నేఁగి సుఖ ముండెఁ గురువరేణ్య. ౪౫౩

వ. అని యిట్లు ధర్మతనయునకు భీష్ముండు పునర్వ్యాతం బైనయింద్ర
బలిసంవాదంబు సెప్పె నని చెప్పిన విని, మఱియేమి సత్కథలు
సెల్లెఁ జెప్పు మని యడుగుటయు, ౪౫౪

చ. పరమమునీంద్రసంయమనపక్వవివేకవిభూతిరమ్య, వి
స్తరమహనీయతార్కికవచఃకలనానభిగమ్య, దేవతా
సురపరిరక్షణోన్మథనశోభికటాక్షవిహార, నిత్యసుం
దరశుభకాంతిపూర, దురితప్రవిదారణ, వీతకారణా. ౪౫౫

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాదిసకలదేవతామయాత్మక, శ్రీసం
పాదనవిధావిచక్షణ
పాదసరోజా, మహర్ధిభక్తసమాజా. ౪౫౬

మాలిని. అమలహృదయవేద్యా, హవ్యకవ్యప్రసాద్యా,
శమసుఖమయమూర్తీ, సర్వలోకప్రవర్తీ,
కమలభవనిషేవ్యా, కామదూరానుభావ్యా,
యమనియమవికాసీ, వ్యాసచేతోనివాసీ. ౪౫౭

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతం బైన శ్రీమహాభారతంబున
శాంతిపర్వంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీ

హరిహరనాథాయనమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## శాంతి పర్వము.

---

### పంచమాశ్వాసము.



శ్రీ కరణనిపుణచరణ
వ్యాకోచాంభోజనిత్యవాసముదితసు
శ్లోకమునిచిత్తభృంగ, మ
హాకరుణామిళదపాంగ, హరిహరనాథా. ౧

—శ్రీ-శక్రసంవాదప్రకారము.—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: అట్లింద్రబలి సంవాదరూపంబునఁ గాలప్రకారంబు విని యుధిష్ఠిరుండు దేవవ్రతునితోడ— ౨

క. 'ఏమిట రూపగుఁ బురుషుం
డేమెయి రూపు సెడు?—నాకు నెఱిఁగింపుము తే
జోమహిత,' యనిన, నతఁడా
భూమిపతికి నిట్టు లనియె భూపప్రవరా: ౩

వ. ఇవ్విషయంబునకు నొక్కయితిహాసంబు శ్రీ-శక్రసంవాదం బవం గలదు; దానిం జెప్పెద నాకర్ణింపుము. నారదమునీశ్వరుం డెందును నిజేచ్ఛం జరియించు చుండి యొక్కనాఁడు మందాకినికిం జని కృతస్నానుండై — ౪

క. ఆనదియుం దాచరిత
స్నానుండై నియతి నున్న శక్రుం గని యు
ఛ్ఛ్రాయ నయ్యురువురు సల్లా
పానందముఁ బొందు చుండ నాకాశమునన్ — ౫

తే. బాలభానుబింబంబు గీడ్వడుచునట్టి
దీప్తిమండలి దోఁచె; న ద్దేవపతియు
మునిపతియుఁ జూచు చుండ గ్రిక్కున విమాన
మవతరించి యాసన్నయై యతివ యొర్తు— ౬

క. పురుహూతున కభిముఖ యై
కరములు మోడ్చుటయు, నతఁడు గారవమున: 'నె
వ్వర వబ్జానన ? యెచటికి
నరిగెద ? వెందుండి రాక?' యనిన న తేంబ్రా. ౭

సీ. అనవుడు, న ద్దేవి, యాదరభరిత యై—
'బాలార్కబోధితపద్మజాత
యైనట్టిదాన; శ్రీ యన, లక్ష్మి నా, భూతి
యనఁగ-వెలుంగుదు; ననఘ, యేను
స్వాహా స్వధా మతి శ్రద్ధా ధృతి స్మృతి
మేధల దనుజుల మెచ్చి, వారి
కడ నుండి, మెచ్చ కిప్పుడు నీకడకు నేఁగు
దెంచితి'-ననిన నద్ద్విజనాథుఁ:

తే. 'డేమికారణమున మెచ్చి?- యేకతమున
మెచ్చ వైతి దానవుల? నీమెచ్చుచొప్పు
మాకు నెఱిగింపు' మనిన, న మ్మానినీయు
వాక్య యి ట్లని చెప్పె నవ్వాసవునకు: ౮

క. 'దానాధ్యయనాతిథిస
మ్మానాదివిశిష్టగుణసమగ్రతకల్మిన్
దానవుల నియ్యకొంటిని;
వాని విడిచి గర్వ లగుట వారి విడిచితిన్.

వ. 'సత్యధర్మపరుండ వగుటంజేసి నీపాల వసియింప రుచి పుట్టి వచ్చితి' నని చెప్పి వెండియు, ౧౦

సీ. 'గురుభక్తినిరతులు సురపితృపూజన
పరులును సత్యసంభాషణులును
దానశీలురుఁ బరధన పరదారప
రాఙ్ముఖచిత్తులు బ్రాహ్మణప్రి
యులు దివానిద్రావియుక్తులు వృద్ధ దు
ర్బల దీనయోషిత్కృపారతులును
శౌచులు నతిథిభోజనశిష్టభోజులు
నేను మెచ్చుజనంబు; లిట్లు గాక

తే. ధర్మ మెడలి కామంబుఁ గ్రోధంబుఁ జాలఁ
గలిగి, గర్వులై బలియు భైక్షంబు నిడక
పరుషవాక్యులఁ గ్రూరంపుఁ జరితములను
మిగిలి వర్తించువారు నా మెచ్చుగారు. ౧౧

క. 'బుద్ధియు ధృతియును నీతియు
శ్రద్ధయు సన్నతియు క్షమయు శాంతియు ననఁగా:
వృద్ధశ్రవ, యేడ్వురు మ
ద్వృద్ధిప్రద దేవతలు శ్రుతిస్మృతికథితల్. ౧౨

క. 'అష్టమి యగు దేవత నేఁ
గష్టాత్మత యసురులందుఁ గని విడిచితి; మ
త్తుష్టికరచరితు లగుటఁ ద్రి
విష్టపసదులకడ నిలిచి వెలసెద' ననినన్— ౧౩

క. 'అభినందించిరి దేవ
ప్రభుఁడును నారదుఁడు; నపుడు పవనంబును సౌ
రభసుఖసంస్పర్శంబుల
నభిరామం బగుచు వీచె నల్లన యుచటన్. ౧౪

ఆ. కురిసెఁ బుష్పవృష్టి, మొరసె గీర్వాణదుం
దుభులు సిరి వరింప; నభినవోజ్జ్వ

లత్వ మొంది దివిజులకు నేత్రపర్వ మై
పొలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె. ౧౫

క. శతమఖకమలావాసా
ప్రతిమసమాగమవిశేషబహుమత మగు నీ
యితిహాసము శ్రుత మైనఁ బ
ఠిత మైనను నెఱయ సంఘటించును లక్ష్మిన్. ౧౬

క. ఇందుల తాత్పర్యము నీ
డెందము నొందించి యతిదృఢీకృతశీలా
స్పందితుఁడ వగుము; తిర మై
యిందిర నీకడ వసించు నిభపురనాథా. ౧౭

క. అనిన విని ధర్మజుఁడు శాం
తనవునితో: 'జనుల కెవ్విధమునాచారం
బున నెట్టిపాటిశీలం
బున నేవిద్యను, మహాత్మ, ముక్తి దొరకొనున్'? ౧౮

క. అనవుడు నతనికి నతఁ డి
ట్లను: 'విను, మితిహాస మొకటి; యది నీప్రశ్నం
బున కుత్తర మగు; నేర్పడ
వినిపించెద గాఢతరవివేకనిరూఢా. ౧౯

—— దేవల-జైగీషవ్యసంవాదప్రకారము.

వ. అసితుం డగు దేవలుండు జైగీషవ్యుం డనుసంయమితోఁ: 'నీవృత్తం బెఱింగికొన వలయు నెఱింగింపవే' యనిన, నమ్మహాత్ముం డమ్ముని వరున కి ట్లనియె: ౨౦

ఆ. శాంతిమంతు లైన సౌమ్యుల కెయ్యది
నిష్ఠ దానియందు నిరతిశయన
మాదరంబు గలదు నాదుచిత్తంబున;
వినుము, తద్విధంబు విస్తరింతు.

క. వినుతించిన నిందించిన,
ననఘా, మనమునఁ బ్రియంబు నప్రియమును లే

కునికియు, వ్రేసిన నైనను
గనలు వొడమమియుఁ బ్రబుద్ధగణ్యగుణంబుల్. ౨౨

ఆ. ఒకటి గోరి దాని కుల్లంబు గందంగ
జాలిఁ బడమి, యేమి సంభవించె
నేని దానఁ దృప్తి నూనుట, దప్పిన
పనికి వగవ కునికి: భవ్యగుణము. ౨౩

క. హర్షంబును మానంబు న
మర్షము నపరాధమును సమదభావము ను
త్కర్షాపకర్ష చింతలు:
నార్షసమాచారమున నిరస్తగుణంబుల్. ౨౪

క. అవమానమునకుఁ దృప్తుం
డవు నమృతము ద్రావినట్లు; యాంచితసమ్మా
నవిధికి నుద్వేగముఁ బొం
దు విషంబునఁ బోలె శమరతుఁడు మునినాథా. ౨౫

క. చుట్టము పగ యనుభేదం
బెట్టిజనులవలనఁ దగుల; దెల్లప్పుడు నె
ప్పట్టున నెద్దానను మదిఁ
బుట్టదు సంతోషహాని బుద్ధాత్మునకున్. ౨౬

ఆ. ఇంద్రియముల గెల్చి హృదయంబు శాంతిసు
ఖంబుఁ బొంద, నిర్వికారవృత్తి
యైనవానిపొందు మానితగతి; దేవ
తలకుఁ బొంద నరిది ధర్మనిరత. ౨౭

క. అని చెప్పె ననుడుఁ, గుంతీ
తనయాగ్రజుఁ డాత్మసమ్మదముఁ బొంద నదీ
తనయునితోఁ: 'నెవ్వఁ డఖిల
జనప్రియుఁడు సకలసత్త్వసమ్మతుఁ?' డనినన్. ౨౮

—♦ ఉగ్రసేన శ్రీకృష్ణసంవాదప్రకారము. ♦—

వ. అమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను: నారదుని విషయంబుగా నుగ్రసేనునకుఁ గేశవునకు సంవాదంబు గలిగె. అది నీయడిగినయర్థంబుఁ దేటపఱుచు; దాని నాకర్ణింపుము: ౨౯

క. నరనాథ, యుగ్రసేనుఁడు
హరితో ని ట్లనియె: 'జనము లభివర్ణనత
త్పరు లగుదురు నారదునెడ;
నరయఁగ నతఁ డంతవాఁడె యంబుజనాభా?' 30

వ. అనుటయు నాకృష్ణుం డగ్గురుమతి కి ట్లనియె: 3౧

సీ. శ్రుతము నాచారంబు నతిశయవంతంబు;
[1]లెడ నహంకార మొక్కింత యేని
లేదు; శీలము గడు లెస్స; వేషము నిర్వి
కారం; [2]బమత్సరగర్వమదుఁడు;
జననంబుఁ దపముఁ దేజంబును బుద్ధియు
వినయంబు నయమును విశ్రుతములు;
ధైర్యంబు వచనమాధుర్యంబు శౌర్య దై
న్య క్రోధ లోభ నిరాసకత్వ 3౨

ఆ. మోజ యతనియందు నైజంబు; లీర్ష్యయు
నుద్ధతియు నసూయయును నవజ్ఞ
యును నెఱుఁగఁ; డట్టిమునివరు నారదు
నఖిలజనులుఁ బొగడు టరుదె యధిప! 33

వ. అని చెప్పె. అగ్గుణంబు లఖిలజనప్రియకరంబులు; సకలసత్త్వసమ్మతంబులు—అనిన విని, ధర్మతనయుండు, శంతనుతనయుతో: 'కాలావయవప్రకారంబులును యుగప్రమాణంబులును భూతవిధంబులు నెఱింగింపవే!' యని యడుగుటయు, నతండు: 'శుకుం డడుగ వేదవ్యాసమునీశ్వరుండు సెప్పినయర్థంబులు నీయడిగినవియును మఱియు ననేకంబులుఁ గలవు; సెప్పెద వినుము' అని యజ్ఞనపతి కి ట్లనియె:

1=మనస్సున. 2=మాత్సర్యము గర్వము మదము లేని వాఁడు.

క. అనఘుఁ బరాశరసూను స
వినయంబునఁ జేరి భక్తివినతుం డై త
త్తనయుండు బుద్ధిసంప
ద్ఘనుఁడు శుకుం డిట్టు లనియెఁ గౌరవనాథా: ౩౪
తే. కాలవిధములు భూతసంఘప్రకార
ములును లోనుగ నెఱుఁగంగ వలయు; వాని
బహులకారుణ్యసంపద పల్లవింప
నాకు నెఱిఁగింపవే మునినాథవర్య! ౩౫

—♦ వ్యాసుఁడు శుకునకుఁ జెప్పిన కాలావయవనిరూపణము. ♦—

వ. అనిన విని, భరితాదరుం డై వేదవ్యాసమునీశ్వరుం డమ్మహనీయున
కి ట్లనియె: ౩౬
క. కాలములకు భూతములకు
నాలంబనభూత మగుమహామహిమఁ గ్రియా
లీల వెలింగెడు నప్పర
మాలోకం బెందు నిష్క్రియాత్మక మయ్యెన్. ౩౭
వ. అది భావనీయంబు. ౩౮
క. [1]వినుము, నిమేషంబులు పదు
నెనిమిది యగుఁ గాష్ఠ; గాష్ఠ లిరువదియుం దో
డన పదియుం గళ; యిఱువది
యును మున్నూఱుఁ గళలై ముహూర్తము నడచున్. ౩౯
తే. మూఁడుపదులు ముహూర్తముల్, మోహదూర,
యగు నహోరాత్రి; మఱ్ఱివి యన్ని గూడ
మాస; మవి రెండు ఋతు వనుమహితసంజ్ఞఁ
బరఁగు; ఋతువు లా ఱైన వత్సరము వత్స. ౪౦
తే. అందు మూఁడేసిఋతువుల కయననామ
కంబు: లగు నుత్తరాఖ్య మొకండు, దక్షి

1. తా॥ పదునెనిమిది నిమిషములు ఒక కాష్ఠ. ఇరువదియు మీఁద పదియుఁ జేరసి ముప్పది కాష్ఠలు- ఒకకళ. అఱువది + మున్నూఱును = మున్నూటఅఱువది కళలు ఒక ముహూర్తము.

ణాభిధాన మొక్కటియు; గుణాభిరామ,
యవి యహస్సును రాత్రియు ననఁగ బరఁగు. ౪౧

వ. అది యోగిజనంబుల నిర్దేశంబు. ౪౨

తే. అనఘ, యుత్తర దక్షిణాయనము లమ్మ
హాత్ము లగ్నియు ధూమంబు నంద్రు; మఱియు
వినుము, శుక్లంబుఁ గృష్ణంబు ననుట గలుగు
సుగతి కగతికి హేతువు లగుటఁ జేసి. ౪౩

క. నరుల నెలలు నేఁడులుఁ బిత్రు
సురులకు దినము లగు నండ్రు సూరులు; వరుసం
బరఁగు కృత త్రేతా ద్వా
పర కలియుగవత్సరముల భంగిఁ దెలిపెదన్. ౪౪

వ. ఆకర్ణింపుము: ౪౫

— చతుర్యుగసంవత్సరపరిమితిప్రకారము. —

సీ. విబుధులపండ్రెండు వేలేండ్లు ననునంత
నాలుగు యుగములు నోలి నడచుఁ;
గృతయుగమ్మున కందుఁ జతురంశకములుఁ, ద్రే
తకు మూఁడుపాళ్లును, ద్వాపరంబు
భాగద్వయంబునఁ బర్యవసిత మగుఁ;
గలియుగ మంశ మొక్కటన యిలు;
నిబ్భంగి పాళ్ళగు నిన్నియుగముల: [1]కం
బర యుగ్మ వసు వార్ధిపరిమితములు,

తే. ఖద్వయ ర్తు గుణంబులు, గగనయుగళ
వేద నేత్రంబులును, నభోద్వితయ కర సు
ధాంశులును వచ్చు ముమ్నూటయఱువదింటఁ
బెంప మానుష్యాబ్దంబు లై పేర్చి యుండు. ౪౬

1. తా. కృతయుగమునకు ౪౮౦౦, త్రేతకు ౩౬౦౦, ద్వాపరమునకు ౨౪౦౦, కలికి ౧౨౦౦-దేవవర్షములు. ఒక్కొక్క యుగమందలి దేవవర్ష సంఖ్యను ౩౬౦ చేఁ బెంచినచో మనుష్య సంవత్సరము లగును.

వ. ఇట్లు కృతయుగంబునకుఁ బదియేడులక్షలు నిరువది యెనిమిదివేలును, త్రేతాయుగంబునకుఁ బండ్రెండులక్షలుఁ దొంబదియాఱువేలును, ద్వాపరంబునకు నెనిమిదిలక్షలు నఱువదినాలుగువేలును, కలియుగంబునకు నాలుగులక్షలు ముప్పదిరెండువేలును-మనుష్యవత్సరంబు లయ్యెను. ఇందు సంధ్యలును సంధ్యాంశంబులు ననుపేళ్ళఁ గొంతసేసి కాలంబు సెల్లు. ౪౭

క. క్రమమున సంధ్యలు సంధ్యాం
శములు ననం బరఁగుఁ; బుత్రి, సకలయుగాద్యం
తములును యుగయుగమునకుం
దమలో నవి సరియ కాలతత్త్వం బరయన్. ౪౮

వ. అది యెట్లంటేని దేవసంఖ్యం జెప్పెద- ౪౯

క. నన్నూఱులు మున్నూఱులు
నిన్నూఱులు నూఱులును మహితవర్షము; ల
య్యన్నియుగమ్ములకుఁ గ్రమా
సన్నత సంధ్యలను వానిసంధ్యాంశములన్. ౫౦

వ. ఇట్లు కృతయుగంబునకు సంధ్య లక్షయు నలువదినాలుగువేలు; దానిసంధ్యాంశంబు నంతియ. త్రేతకు సంధ్య లక్షయు నెనిమిదివేలు; దానిసంధ్యాంశంబు నంతియ. ద్వాపరంబునకు సంధ్య డెబ్బదిరెండువేలు; దానిసంధ్యాంశంబు నంతియ. కలియుగంబునకు సంధ్య ముప్పదియాఱువేలు; దానిసంధ్యాంశంబు నంతియ-ఇవి మానుష వత్సరంబులు. ౫౧

క. [1]వరుసఁ గృత త్రేతా ద్వా
పర కలియుగములఁ దపంబు, భవ్యజ్ఞాన
స్ఫురణము, యజనము, దోషా
దరమును—మానవులకుం బ్రధానతఁ గలుగున్. ౫౨

1. తా. వరుసగా: కృతయుగమున తపము, త్రేతయందు శుభమైన జ్ఞానోదయము, ద్వాపరమున యజ్ఞము, కలియందు దోషముల నాదరించుట-ఇవి మానవులకు ప్రాధాన్యముగాఁ గలుగును.

క. న్యాయంబులు ధర్మంబులు
నాయువులు దనూబలములు నంతంతకు, వ
త్సా, యెంతయుఁ దఱుఁగుం ద్రే
తాయుగముఁ దొడంగి మనుజతతి కరయంగన్. ౫౩

తే. ఆయుగంబులు నాల్గు మహాయుగంబు
నాఁగ జనుఁ; దత్సహస్రంబు నలువపగలు;
దానికొలఁదియ రేయును; దీని నెఱుఁగు
ప్రౌఢజనములు సుమ్మహోరాత్రవిదులు. ౫౪

తే. అతఁడు రాత్రి నిద్రించు నిద్రావసరమ
ప్రళయ మగు లోకములకుఁ; బ్రభాత మగుడు
మేలుకను దివమునఁ; భూతజాలసృష్టి
పరతఁ బొందుఁ-బర్యాయమి ప్పాటఁ జెల్లు. ౫౫

వ. అని వెండియు, ౫౬

తే. అనఘ, బ్రహ్మంబు తేజోమయంబు, శుక్ల
మగ్రభాసిత; మెద్దాని యాతులసార
రసము విశ్వంబు?- నది యహర్ముహితకాల
బుద్ధమై చేయు బహువిధ భూతసృష్టి. ౫౭

వ. తత్ప్రకారం బెట్టి దనిన: నమ్మహనీయతత్త్వంబువలన, ౫౮

ఆ. [1]విను, మహాన్మనో గగన పవ నానల
సలిల భూము లనఁగ సంభవించు
మహితవిభవములు గ్రమంబున నేడు రూ
పములు జన్యజనకభావ మొంది. ౫౯

క. క్రమయుక్తిని: శబ్ద స్ప
ర్శములును, రూప రస గంధసద్భావములుం,

---

1. తా. మహత్తు (=బ్రహ్మము), మనస్సు, ఆకాశము, గాలి, అగ్ని, నీరు భూమి: అను మహాసంపదలు క్రమముగా ఒకదానినుండి మఱియొకటి జన్య-జనకభావముతో (=ఒకదాని పుట్టువునకు మఱియొకటి పరస్పరముగా కారణమై) జనించును.

దమగుణములు గా నాకా
శమము మొదలగుభూతములు ప్రశస్తి వహించున్. ౬౦

క. నరనుత, విను, మీా సత్త
స్వరూపములు పురుషు లందుఁ సంయమివరు; లీ
పురుషులు గూడిన సృష్టికి
వెరవరు; లది సంఘటిలదు వేర్పడి రేనిన్. ౬౧

వ. ఇట్టిమహిమ గలిగి, ౬౨

క. తేజోరూపము బ్రహ్మము
ప్రాజాపత్యం బనంగ బరఁగి పురుషుఁ డు
ద్భ్రాజిష్ణుసత్యనిత్యా
వ్యాజమహిమ వెలుఁగు చుండు నకలంకమతిన్. ౬౩

క. వ్యాపకుఁడు స్రష్ట బ్రహ్మ ప్ర
జాపతి నాఁ బరఁగి, నిత్యసత్యాత్మత్వో
ద్దీపితుఁ డై పురుషుఁడు ని
ర్లేపుఁ డనిర్దేశముం గలిగి వెలుఁ గొందున్. ౬౪

క. సుర సంయమి గరు డోరగ
నర కిన్నర గిరి సరి ద్వన పయోధులఁ, ద
త్కారణీయములం జేయుం
బురుషుఁడు దివ్యాంతరంగమునఁ దలఁచి సుతా. ౬౫

వ. ఇట్లు గలిగి వర్తిలు చున్నలోకంబులందు— ౬౬

ఆ. పౌరుషంబు సూవె ఫలద మందురు గొంద!
అనఘ, దైవ మిచ్చు నందుఁ గార్య
ఫలము గొంద; తెల్లఫలము భూతస్వభా
వంబ యండ్రు గొంద ఱమితతేజ. ౬౭

వ. ఇవి కర్మస్థుల తెఱంగులు. సత్త్వస్థులు సమదర్శను లయి
యుండుదురు. విశేషంబు వినుము: ౬౮

క. శివకరము తపము, మేధా
ధవ, సకలజనంబులకును; దానికి మూలం

బవిరళశమదమసంపద
లవుట,– నివి మనంబుతోడ నలవడ వలయున్. ౬౯

వ. స్వాధ్యాయంబు దపంబునకు బలం బిచ్చి తత్ఫలంబు గావించు. ౭౦

క. అరయంగా శబ్దంబును
బరంబు నన రెండునూ వె బ్రహ్మములు! గుణో
త్తర, శబ్దబ్రహ్మభజన
పరుఁడు పరబ్రహ్మమహితపదముం బొందుఁ. ౭౧

క. [1]పరమబ్రహ్మము భూతా
త్కారముం గలిగించు మిగ్రింగుఁ దా నిష్క్రియతా
స్ఫురితం బయ్యును బ్రకృతి
స్ఫురణను శబలత్వ మొంది పురుషవరేణ్యా. ౭౨

వ. సృష్టి తెఱంగు మన్నెఱింగించితి; సంహార ప్రకారంబు సెప్పెద
నాకర్ణింపుము: ౭౩

తే. స్థావరములు జంగమములుఁ దన్నుఁ గలయ
విలయ మొందిన [2]ఘుటపృష్ఠవిధము దాల్చు;
భూమి నంబువుల్ మ్రింగు, నంబువుల నగ్ని,
యగ్ని ననిలుం, డనిలుఁ డ్రావు నాకసంబు. ౭౪

ఆ. ఆకసమును మనసు హరియించు; గంధాది
యగుగుణాళితోడ నఖిలభూత
ములును నిట్లు లయముఁ బొందిన- గ్రసియించు
మనసు నాత్మగుణము నెనసి విధుఁడు. ౭౫

క. అతనిఁ బొదువు సంకల్పం
బతులజ్ఞానంబు; దాని నడఁచును విజ్ఞా

1. తా. తాను ఏపనియుఁ జేయనట్లు అగపడుచుండియుఁ బ్రకృతి(=సృష్టి) రూపమైన చిత్రవర్ణములం గలిగి ఆపరబ్రహ్మమే ప్రాణికోటిని సృష్టించుచు మ్రింగుచు నుండును. 2. తా. అచరములు చరములును తన్ను (బ్రహ్మమును) గలిసినను, విలయ మొందినను తాను (బ్రహ్మము) కుండయొక్క అడుగువలె మోసి మోవక యుండును. భూమిని జలము, జలమును అగ్నియు, అగ్నిని వాయువు, వాయువును ఆకాశము త్రాగును.

నితఁ దద్బలముఁ బురుషుఁడే
హితనుం గాలంబు వరుస నెడలం జేయున్. ౭౬

క. కాలం బెడలిన విద్యో
న్మీలిత మగుబోధ మన్యమిశ్రిత్వంబుం
దూలించి వెలుఁగు చుండు; వి
శాలమతీ, బ్రహ్మ మది! ప్రశస్తము శ్రుతులన్. ౭౭

క. విను, మీసంహారణంబును
దనవన; మాతత్త్వ మవ్విధంబున దివసం
బును రాత్రియు, భూతములకు
జననము విలయమును జేయు సంక్రీడమెయిన్. ౭౮

వ. అని చెప్పి పారాశర్యుం డార్యవర్యుం డగుశుకునితో వెండియు
నిట్లనియె: ౭౯

సీ. జనియించి విప్రుండు జాతకర్మంబును
చౌలంబు నుపనీతి సంస్కృతియును
బడసి, యాచార్యునిపాల నధ్యయనంబు
సేసి, తా నాతనిచే ననుజ్ఞ
గాంచి, తక్కటివిమూఁడంచితాశ్రమముల
యందు నొక్కటి పూన నగు; గృహస్థ
ధర్మ మాశ్రయ మండ్రు తక్కనమూఁటికిఁ
గావున, నది పూని దైవపైతృ

తే. కంబు లైనఋణంబులఁ గ్రాఁచ; వ గు
నాఁటినడవడి ఋషులఋణమ్ము దీర్చి,
వచ్చి కానఁ గాషాయపక్వతఁ బ్రశుద్ధిఁ
బొంది మఱి యుత్తమాశ్రము మొందు టొప్పు.

తే. [1]క్రతువు సేఁత, సేయించుట; శ్రుతులు గాథ
నియతిఁ జదువుట, చదివించుటయును; ధనము

---

1. తా. క్రతువు(=యజ్ఞము)చేయుట, చేయించుట; శ్రుతులు చదువుట చదివించుట; దానముచేయుట, కొనుట—ఇవి ఆఱుకర్మములు. ఇంతమాత్రమే బ్రాహ్మణులుచేయదగినవి. యజన యాజన, అధ్యయన అధ్యాపకత్వ, దాన ప్రతిగ్రహములు:షట్కర్మములు.

లీగి, కొనుట— షట్కర్మంబు. లింతవట్టు
సర్వాకృత్యంబు లండ్రు ధరామరులకు. ౮౧

—♦ దానగుణంబు సర్వవర్ణసామాన్యంబుగా నిరూపించుట. ♦—

వ. దానానుష్ఠానంబు సర్వజాతిసామాన్యం బయినయుత్తమధర్మంబు. పుణ్యపరులకు [1]దాతవ్యంబు గానివస్తువు లేదు. కాశ్యుం డనురాజు దనప్రాణంబు లిచ్చి బ్రాహ్మణప్రాణంబులు గాచె. ఔశీనరుం డగుశిబి యాత్మాంగంబుల నౌరసపుత్త్రునిని బ్రాహ్మణార్థంబుగా నొసంగె. కాశీపతి యగుప్రతర్దనుండు బ్రాహ్మణునకై నిజనయనంబు లిచ్చె. విదేహుండును జామదగ్న్యుండును గయుండును నొక్కొక్కతఱి సకలవసుంధరయును బ్రాహ్మణుల కిచ్చిరి. పాంచాల్యుం డగు బ్రహ్మదత్తుండు [2]శంఖనిధి విప్రోత్తములకు దానంబు సేసె. మఱియును, బ్రాహ్మణులకుఁ బ్రాణ శరీర మణి హిరణ్య కన్యా గవాదిప్రశస్తవస్తువు లనేకు లర్థుల కొసంగిరి. వారల కెల్లను సమకూరిన సద్గతులవిశేషంబులం జెప్పం బెద్ద యని వెండియు,

క. దానాధ్యయనయజనముల
నానావిధపాపములు వినాశముఁ బొందుం
గాన నవి మేలు; హింసా
హీనత ధర్మవిధి లేనియెడఁ గడు వలయున్. ౮౩

ఆ. [3]ధూతపాపుఁ డైన పూతాత్మకుండు ల
ఘ్వాశి యగుచు నింద్రియముల గెల్చి
మనసులోనఁ గామమును గ్రోధమును జొర
నీక బ్రహ్మపదము నిచ్చఁ గోరు. ౮౪

ఆ. [4]ఇట్టివాఁడు వెడల నీఁదు: నింద్రియజల
మన్యుపంక లోభమయతటాది

---

1. = ఇయ్యఁ దగని వస్తువు లేదు. 2. =నవనిధులలో నొకటి యగు 'శంఖనిధి'.
3. తా. పాపములను విడిచినవాఁడైన శుద్ధాత్ముఁడు అల్పాహారమును బుచ్చుకొనుచు ఇంద్రియములఁ గెల్చి......4 తా. ఇట్టివాఁడు ఇంద్రియము లనెడి జలమును క్రోధ శోక దైన్యము లనెడి బురదయు, పిసినితన మనెడి గట్టును గలిగి ఘోరమగురూపము గల సారములేని సంసారమనెడి భిరివియగు నదిని వెడల నీఁదును.

ఘోరరూప యగునసారసంసారవి
శాలనదిఁ—బ్రశాంత శాలిహృదయ. ౮౫

తే. ఘనతరప్రజ్ఞ యను తెప్ప గలుగువాఁడు
సంసరణనదిఁ గడవంగఁ జాలుఁ గాక,
కామమును గ్రోధమును మదిఁ గలిగి ప్రజ్ఞ
చించునేని నక్కడచుట చిక్కవడదె? ౮౬

క. గతహర్ష భయ క్రోధుఁడు
ధృతిమంతుఁడు నప్రమత్త ధీమహితుఁడు సం
శ్రితధర్ముఁడు దాంతుఁడు నగు
నతఁ [1]డపసాదంబు నొందఁ డతులవివేకా. ౮౭

క. ధర్మ మధర్మమువోలె, న
ధర్మము దా ధర్మవిధివిధంబునఁ దోఁచుం
గర్మసమితి నొక్కొకయెడ;
ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్. ౮౮

వ. అని యుపదేశించి మఱియును, ౮౯

క. జ్ఞానంబు వడయుటకు వా
ఙ్మానసములు సునియతములు గావింతురు; స
మ్మానితశాంతికొఱకు వి
జ్ఞానంబున నాత్మనియతి సల్పుదురు బుధుల్. ౯౦

క. ఈ తెరువున వేదవిదుఁడు
వీతామ్నాయుండు, ధర్మవేదియుఁ బాప
స్ఫీతుఁడు—సరి యై కడతు ర
నాతురత జరామరణ మహాంభోరాశిన్. ౯౧

1-అపసాదము=నాశము.

వ. [1]ఆచార నేమియుఁ, బ్రాణయుగంబును, నపానాక్షంబును, హ్రీవరూథంబును, నుపాయాపాయకూబరంబును, ఘ్రాణ శ్రవణవాహనంబును, జ్ఞానసారథికంబును, సర్వతంత్ర ప్రతోదంబును, ద్యాగరశ్మియును నగుయోగరథంబు నెక్కి వెరవు గలవాఁ డక్షరపదంబు సారం జనఁ జాలు; ఆరథికుం డా తంత్రంబు ప్రభావంబునం జేసి,

క. వరుసన ధరణీపవనాం
బరజల తేజముల గెలుచు బల మెక్కి, యహం
కరణంబు ద్రోచు, బుద్ధిం
బరువడి నడఁగించుఁ బ్రకృతిపవిఁ బెడఁబాపుఁ. ౯౩

ఆ. భూమిజయము దొడఁగి పురుషుఁ డంతంతకు
వృద్ధిఁ బొంది యోగసిద్ధిఁ బొందుఁ;
బొగయు మిడుఁగురులును బొనుఁగు లేనిశిఖియు
బహులశిఖలు నైన పగిది ననఘ. ౯౪

తే. [2]విను, మహంకారజయము పృథ్వీముఖంబు
లైనదానిని బుద్ధి ప్రధానమును జ
యించు నట్టిసంస్కారంబు నిచ్చు; దాన
నగు మహానుభావంబు సంయమివరులకు. ౯౫

వ. ఇది యోగప్రకారంబు. ౯౬

తే. అనఘ, యింద్రియముల విషయములమీఁద
నిగుడ నీక, మనంబుతో మగుడఁ దిగిచి
యాత్మఁ గూర్చుట సాంఖ్యుల యనువు; సాంఖ్య
యోగములు రెండు నారయ నొక్క తెరువ. ౯౭

---

1. తా. ఆచార మనుచక్రము, ప్రాణమను కాడియు, అపాన మను బండికన్నుఁ, లజ్జ యను పేకులు [చక్రముకన్ను కడవేయు ఇనుపమేకులు = (చక్రము కనులలో జొన్పు ఇనుప గొట్టములు; పులితోలు లోనగు వానిచే నేర్పఱచిన రథము మీఁదికప్పు— అనియును]; ఉపాయము అపాయము అను నొగయు, ఘ్రాణము (= ముక్కు) శ్రవణము (= చెవి) అను వాహనమును, జ్ఞాన మను సారథియు, సర్వతంత్రములు అనుములుగోలయు, ఈవి (= త్యాగము) అను పగ్గమును గలది యగు యోగరథము నెక్కి......2. తా. అహంకారజయము, ఐహికములయెడ ప్రధానతవహించుబుద్ధిని జయించునట్టి పరిపాకమును నొసఁగును. దానివలన అహింసావ్రతులకు మహానుభావం బగును.

క. ఈ రెండు ప్రకారంబుల
వారలకును మమత విడువ వలయుట సరి-ని
స్సారపు సంసారమునకుఁ
గారణము మమత్వ మగుటఁ గవిజనముఖ్యా. ౯౮

వ. భూతతారతమ్యంబులు సెప్పెద నాకర్ణింపుము: జంగమస్థావరంబులయందు జంగమంబులు లెస్స-యవి జరాయువు నండజంబును నుద్భిదంబును స్వేదంబును నను జనకవిశేషంబుల జనియించి, బహుపాదంబులును ద్విపాదంబులును నై యుండు. అందు మనుష్యులు మేలు. మనుష్యులయందు జాతిధర్మోపధారకు లెక్కుడు. జాతిధర్మోపధారకులయందు విప్రు లుత్తములు. విప్రులయందు వేదజ్ఞు లుదాత్తులు. వేదజ్ఞులయందుం బ్రవచనశీలు రుత్కృష్టులు. ప్రవచనశీలురయం దాత్మజ్ఞు లధికులు. వారలు సర్వధర్మవిదులు, సత్యసంకల్పులు, నధిభూతాధిదైవవేదులు నగుదురు. వారలం జూవె దేవతలు బ్రాహ్మణు లందురు! వా రెల్లవారికి నమస్కారాద్యుపచారాదరణీయులు. వారికి సరిలేరు. వా రాధారంబుగా సమస్తజగంబులుఁ బ్రవర్తిల్లుచున్నవి. అని చెప్పి యమ్మహాత్మునకు వెండియు, ౯౯

తే. బ్రాహ్మణునకుఁ బ్రధానవర్తనము వినుము:
నిర్మలజ్ఞానయుక్తుఁడై కర్మసమితి
నలఘునిష్ఠమైఁ జలుపంగవలయు; దాన
సంశయము లెల్లఁ బాయుఁ బ్రసాద మొందు. ౧౦౦

క. ఇయ్యఖిలము సృజియింపఁగ
నెయ్యది ప్రభు?—వమ్మహామహితభూతము పొం
దయ్యెడిశుభంబు దపమునఁ;
జయ్యన సిద్ధించు నది విసంశయ మనఘా. ౧౦౧

క. మైత్త్రిం బోలెదుధర్మము
ధాత్రీదివిజులకు లేదు; దాని నడపినం,

బుత్త్రా, యేకర్మంబు ప
విత్రతయును వలవ; దది వివేకముఁ జేర్చున్. ౧౦౨

వ. అనిన విని శుకుండా సంయమివరున కిట్లనియె:- ౧౦౩

—◆ వ్యాసుఁడు శుకున కుపదేశించిన పరబ్రహ్మప్రాప్తి సాధనప్రకారము. ◆—

క. పరమబ్రహ్మపదము, న
ధ్వరముననో ప్రజ్ఞ పెంపువలననో యోగా
చరణముననో సాంఖ్యసమా
దరణముననో పొందవచ్చుఁ దత్త్వజ్ఞవరా. ౧౦౪

చ. అనుటయు, నమ్మునిప్రవరుఁ డాతని కిట్లను: 'నీవు పేరుగ్రు
చ్చినయవి యెల్ల మేల. సవిశేషతపంబును, నింద్రియప్రవ
ర్తనముల నిగ్రహించుటయు, రాగము లోభముఁ ద్రోవఁజాలు నే
ర్పును, దృఢవిద్యయుం గలుగుపుణ్యుఁడు పొందఁగ నోపు బ్రహ్మమున్.

క. 'విను, మందు నొకవిశేషం:
బనఘా, బుద్ధీంద్రియంబు లైదును బరముం
గను వెలుఁగున కడ్డము; వా
ని నడంగింపంగ మనసు నిపుణత యొప్పన్. ౧౦౫

క. 'మనసు నియమింప భూతా
త్మనియత్నం బోపు; నియమమున నట్టి లో నై
మన సింద్రియములఁ గుదియిం
చిన శబ్దాదులు దొలంగి సిద్ధి దొరకొనున్. ౧౦౬

ఆ. 'కనుట వినుట యాదిగాఁ గలయింద్రియం
బుల కగోచరంబు బుద్ధిదీప
రూపు గాఁగఁ దోఁచు రూపశబ్దాదిగు
ణాత్త్వరహిత మైనతత్త్వ మనఘ. ౧౦౭

చ. 'వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నా
పన్నా, నెఱయుహస్తియందు, నొకఘోఁకశుఁ బోవనికుక్కయందు, దా

ని నడచి తెచ్చి వండి తినునీచపుమాలనియందుఁ—దుల్యద
ర్శనులు, దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్. ౧౦౯

క. 'స్థావరముల జంగమముల
నావిభుఁడు వసించు; నతనియందు నవి నిస
ర్గావాసత నుండును; ద
ద్భావన మెఱుఁగుట తదైక్యపదముం జేర్చున్. ౧౧౦

తే. 'క్షరము నక్షరమును ననం గలవు రెండు
మూర్తులాత్మ; కఖిలభూతములను బూర్వ
మొలయు మృత మన, దివమున నుండు నమృత
మనఁగ నపరంబు—రెంటిని గను బుధుండు. ౧౧౧

క. [1]ఈలోకంబుల నెల్లం
గాలము పక్వంబు సేయుఁ గా, నెవ్వాఁ డ
క్కాలము పక్వము సేయుం?—
జాలు నతం డమృతు నజరు సత్యుఁ గనుటకున్. ౧౧౨

తే. 'విను, నవద్వారపురమున వెలుఁగుచుండు
హంసుఁ; డతనిన యక్షరుఁ డమృతుఁ డంద్రు
పరమయోగు; లాతత్త్వంబుభంగిఁ గాంచు
యోగ్యసత్క్రియాభ్యాసవైరాగ్యపరుఁడు.' ౧౧౩

వ. అని చెప్పి యప్పారాశర్యుండు వెండియు, ౧౧౪

తే. అనఘ, విను, కామమును గ్రోధమును భయంబు
నిద్రయును లోభమును—జాల నిందితములు
యోగిజనులకుఁ; గావున నుడుగ వలయు
వీని నైదింట నచలావధానవృత్తి. ౧౧౫

1. తా. ఈలోకముల నెల్లఁ గాలము పరిపాక మొందించుచున్నది. అట్టి కాలము నెవ్వాఁడు పక్వము సేయునో అతఁడు అమృతు (మృతిలేనివాని) ని, అజరు (ముదుసలి కానివాని) ని, సత్యు (నిజమైనవాని) ని—పరమాత్మని చూడఁ గలఁడు.

శా. [1]కామంబుం బెడఁబాచుఁ బండితుఁడు సంకల్పంబు వర్జించి; ని
ద్రామోహంబు నడంచు సత్త్వగుణచింతన్; లోభముం బ్రాజ్ఞసే
వాముద్రిం దొలఁగించుఁ; గ్రోధము శమవ్యాప్తిన్ మగుడ్చున్, మతి
శ్రీమాన్యా, భయ మప్రమాదమున నిర్జించున్ దృఢస్వాంతుఁ డై.

తే. [2]శిశ్నము నుదరమును—ధృతిఁ,
జేయిఁ గాలుఁ—జూడ్కిఁ, జూడ్కిని వినికిని—శుద్ధమాన
సమున, మానసవాక్కుల—విమలవిద్య—
నవహితుండు రక్షించుఁ గులాగ్రగణ్య. ౧౧౭

వ. మఱియు నొక్క తెఱంగు సెప్పెద— ౧౧౮

తే. [3]ఇంద్రియములలో నొక్కటియేనిఁ బట్టు
వడక వెడలిన, నాఁగంటిప్రజ్ఞ గాఁటు
నట్లు గావున మనసు ము న్నాఁగి, వినికి
యాదియగు నైదుఁ గ్రమమున నాఁగవలయు. ౧౧౯

క. మనసును నింద్రియములనుం
దనయుం దొడుఁగంగఁ జేయఁ దానఁ దెలివి నొం
ది నిరంజనత్వసిద్ధిం
గని యపధూమానలంబుకరణి వెలుంగున్. ౧౨౦

1. తా. పండితుఁడు దృఢస్వాంతుఁడై-సంకల్పమును వదలి కామమును వదలును; సత్త్వగుణచింతచే నిద్రామోహమును అడంచును; విజ్ఞానసంపన్నులగు పెద్దలను సేవించి లోభమును తొలగించును; శాంతతను వ్యాపింపఁజేసి క్రోధమును మగిడించును; అప్రమత్తతచే ప్రమాదమును జయించును. 2. తా. ధైర్యముచే శిశ్నమును ఉదరమును, చేతిని కాలిని చూపుచేతను, చూపును వినికిని శుద్ధమానసము చేతను, మనస్సును వాక్కును విమల విజ్ఞానము చేతను—అవహితుఁడు (=అవధానము గలవాఁడు; ఎచ్చరిక గలవాఁడు) రక్షించును. 3. తా. ఇంద్రియములలో నొకటి యైన స్వాధీనము గాక చెదరినచో, నాఁగటి సామర్థ్యము కాఱు (కట్టు) నందుండును గావున, మనస్సును తొలుత అఁపి (స్వాధీనపఱచుకొని) పిమ్మట వినికి మొదలగు ఐదు ఇంద్రియములను ను.

మ. [1]మన సేకాగ్రతఁ బొందఁ జేయ, జనసమ్మర్దంబు వర్జించి శూ
న్యనికేతాద్రి గుహా వివిక్తవన దేవాగారముఖ్యంబులై
న నివాసంబుల నుండఁగా వలయుఁ: ద న్మన్నించినం-గీడు సే
సిన, హర్షంబు-నమర్షముం హృదయమున్ జెందింప కక్షోభ్యుఁడై.

క. సమదృష్టిని ఱాయియుఁ గన
కముఁ జూచుచు, సత్సమాధికలితం బగువృ
త్తము నడపిన-[2]శబ్దబ్ర
హ్మము షణ్మాసముల యోగి యతివర్తించున్. ౧౨౨

క. సుత, విను, శబ్దబ్రహ్మము
నతివర్తించి భువనత్రయమునను యోగా
న్వితుఁ డగుముని గనుఁ: నజు శా
శ్వతు నచలుఁ బురాణతము నజరుఁ బరమాత్మున్. ౧౨౩

వ. అనిన విని శుకుండు వేదవ్యాసమునీశ్వరుతో నిట్లను: 'వేదంబు గర్మంబుల నాచరించుటయుం బరిత్యజించుటయుం జెప్పును. ఇవ్విధంబులు పరస్పరవిరుద్ధంబులై యున్నయవి. ఇం దెద్దాన నెట్టిగతి సిద్ధించు నేర్పడ నెఱింగింపవే'-యనుటయు నతం డతని కిట్లనియె: ౧౨౪

ఆ. విను, ప్రవృత్తి కర్మ, మనఘ, నివృత్తిని
ష్కర్మ— మరయ బంధకంబు మోక్ష
ణంబు నగుట, బోధనత్వసంపన్నులు
సారరు కర్మతంత్రకరణమునకు. ౧౨౫

---

1. తా. మనస్సును నిలుకడగా నుంచుకొనుటకై, తన్ను ఆదరించునందులకు సంతోషముగాని తనకుఁ గీడుసేయునందులకుఁ గోపముగాని మనస్సునఁ గలుగనీయక మనుష్యుల సందడి వదలి శూన్యగృహముననో కొండలనో గుహలనో ఏకాంతవనము, లనో దేవాలయాదులనో నివాసములుగా నుండవలయును' 2. తా. ...నడపినచో ఆఱు నెలలో శబ్దబ్రహ్మమును యోగి యగువాఁడు అతివర్తించును (=అతిక్రమించును; దాఁటును).

క. కొందఱు కర్మకరణ మభి
నందింతురు; వారలకు జననమరణములం
బొందక పో రాదు; మహా
నందముఁ బొందుదురు నిత్యనైష్కర్మ్యపరుల్. ౧౨౭

ఆ. చిత్తశుద్ధిమాత్రిఁ జేసె నేనియు, నవి
ద్యాత్మకంబ చూవె యరయఁ గర్మ!
మది దొలంగు, టంచితాత్మవిద్యాత్మక
ధర్మ; మదియ మోక్షదంబు సుమ్ము. ౧౨౮

ఉ. [1]గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ, గూపము నైందవరేఖకాంతియుం
జు మ్మరయంగఁ గర్మఫలశోభనసంపద! జున్ను నేఱుఁ, బూ
ర్ణ మ్మగుచంద్రబింబము ననం దగు నిర్మలవిద్య గాఢపా
కమ్ము ఫలోదయం;బది యఖండసుఖాత్మపదంబు పుత్త్రికా. ౧౨౯

వ. కర్మంబునం గానిది యై విద్య నయ్యెడునట్టి తెఱం గెఱింగించెద—

క. [2]విను, రేఖామాత్రపుఁజం
ద్రునియట్టుల జీవుఁ, డతనిదుష్పక్షముఁ బో
లినయజ్ఞానము నపగమ
మున బోధానంద సాంద్రపూర్ణతఁ బొలుచున్. ౧౩౦

—♦ బ్రహ్మచర్యంబు బ్రహ్మవిద్యాప్రాప్తికి ముఖ్యకారణం బని చెప్పుట ♦—

వ. అని చెప్పిన విని: 'విద్య యెట్టివారికి నలవడు నెఱింగింపవే' యనిన
నందనునితో గంధవతీనందనుం డి ట్లనియె: ౧౩౧

తే. బ్రహ్మచర్మసమేతతపంబు విపుల
కాననమున వానప్రస్థగణముపొంత

1. తా. గుమ్మడిపూవు తేనెయు, నూతిలోఁ బ్రతిఫలించు చంద్రరేఖా కాంతియుఁ బైమెఱుఁగులు మాత్రము గలవి- అనుభవింపరానివి. తేనెవాఁకయు, పున్నమ చందురుని బింబము-పరిపక్వమై ఫలమునిచ్చునట్టి అధ్యాత్మవిద్య యనఁ దగును. అది (=ఆయధ్యాత్మవిద్య-తెలుఁగని సుఖాత్మపదము (=పరమపదము.) 2. తా. విదియ తదియలలోఁ గాన్పించు-రేఖామాత్రపుఁ జంద్రుని వంటిజీవుఁడు, అతని (ఆట్టిజీవుని) దుష్పక్షముఁ బోలిన =కృష్ణపక్షమువంటి- (చంద్రునిపరమున) అజ్ఞానము పోవునంతట విజ్ఞానానందము నందలి అక్షయ మగుపూర్ణత్వము సిద్ధించును.

నిలిచి చేయుచుఁ, బర్ణశాలలకు నుచిత
కాలమునఁ జని యెత్తి భిక్షలు భుజించి— ౧౩౨

క. నుతియు నమస్కృతియును లే
క తిరిగి, శుభ మశుభ మనువగం బొందక, గో
ష్ఠి తెరువు సొర కుండుట సు
వ్రత; మది యధ్యాత్మవిద్యఁ బ్రచురముఁ జేయున్. ౧౩౩

ఆ. అనుడు, నతఁడు: 'కర్మ మఖిలంబు నీడఁబో'
విడుచు టొప్ప దండ్రు వేదవిదులు;
దాని నాదరింపఁ దగదొకో సంయమి
ప్రవర! సందియంబు వాప వలయు, ౧౩౪

వ. అనినం, గర్మంబు విడువమియు విడుచుటయుం గలిగియుండుఁ; దదీయ యోగ్యతావిశేషంబు లెఱింగించెద— ౧౩౫

సీ. విను మని, ముని యిట్టు లను:'బ్రహ్మచారి గృ
హస్థ వానప్రస్థ యతులు విహిత
కర్మనిష్ఠత సిద్ధిఁ గాంతు; [1]రాశ్రమచతు
ష్కముఁ జతుష్పట్టికా ఘటిత మైన
నిఃశ్రేణి తుదిముట్టునెల వెక్కుటకు; నిట్టి
క్రమవర్తనము సుకరంపుమార్గ;
మాయువు మొదలినాలవుపాలు గురుపాల
దాసునియట్ల సంతతముఁ బనులు

తే. ప్రీతిఁ జేయుచుఁ, గుడిచిన పిదపఁ గుడిచి,
శయ్యఁజెందిన నాతని చరణయుగము
గరయుగంబున నొత్తుచుఁ, గలితనిద్రుఁ
డైన నిద్రించు బ్రహ్మచర్యాన్వితుండు. ౧౩౬

1. తా. గమ్యస్థాన (=పరమపద) మెక్కుటకు ఆశ్రమములు నాలుగును నాలుగుపట్టెలం గూర్పఁబడిన నిచ్చెన. 2. తా. ఆయువు యొక్క మొదలి నాల్గవభాగము–గురుసన్నిధిని దాసునివలె ఎల్లప్పుడు పనులు ప్రీతిం జేయుచు, ఆగురుఁడు భుజించిన పిదపఁ దాను భుజించుచు, పరుండిన గురుని పాదములను చేతులచేనొత్తుచు, ఆగురుఁడు నిద్రించిన పిమ్మట నిద్రించుచు బ్రహ్మచర్యము నడపువాఁడు.

క. రసగంధ ప్రముఖంబుల
దెస వేడుక లేక, గురుమతికి వచ్చిన యు
ట్టిసమయములఁ దగ వేదా
భ్యసనంబులు సేయుచుండు నాతఁడు నియతిన్. ౧౩౭

వ. ఇది బ్రహ్మచారి ప్రకారంబు. ఆతం డాశ్రమాంతరగతుం డయి
వర్తించువిధంబు సెప్పెద. ౧౩౮

సీ. సవినయంబునఁ దనశక్తితో గురునకు
దక్షిణ యిచ్చి, యాతండు వనుపఁ
గా [1]సమావర్తన కార్యంబు నడపి, వి
వాహ మై, హవ్యకవ్యముల నతిథి
తోషణ బాంధవ పోషణంబుల సత్య
భాషల నిజదారపరతఁ బుత్రి
సంశిక్షఁ గ్రతువిశేషంబుల-నొకయాయు
రంశంబు గడపి గృహస్థధర్మ

తే. వృత్తిఁ గృతకృత్యుఁ డగు నగ్ని విడువ; కడవి
బూరిపంటల ఫలమూలములను భిక్షు
పూజ సలుపుచుఁ, బరిశిష్టములు భుజించి,
తపము సేత వానప్రస్థధర్మసరణి. ౧౩౯

క. వానప్రస్థప్రక్రియ
దా నొకపా లాయువునఁ; బదంపడి తుదిపా
లైనను సన్న్యాసాను
ష్ఠానమునకుఁ జొచ్చు వాఁడు శాంతాత్మకుఁ డై. ౧౪౦

వ. ఇ ట్లాయురంశంబులు నాలుగుం జెల్లుట యుత్తమ ధర్మస్వరూ
పంబు. అంశత్రయకాలాచరితం బైనయాశ్రమత్రితయంబు ప్రవ
ర్తనంబులఁ గపాయపక్షం బగుటయుఁ, జతుర్థాశ్రమంబుఁ జెందుట

1 తా. వేదాధ్యయన మైనపిదప ఇఁక గృహస్థుఁడవు గమ్మని గురువుచే ననుజ్ఞ బొందు క్రమము నడపి.

కృత్యంబు; దాని తెఱం గెఱింగించెద నవహితుండవై యాకర్ణింపుము

సీ. ఆత్మయం దగ్నిసమారోపణము సేసి
యజన మాంతరముగ నకృతసంధి
విగ్రహుం డగుచుఁ బరిగ్రహవిముఖుఁ డై-
[1]ముండుండు ననికేతనుండు వృక్ష
మూలవాసియును గపాలధారుండు నే
కాకియు నక్రోధ కామ శోకుఁ
డును గాఁగవలయు భిక్షునకు; నిందాస్తుతుల్
దనయంద యడఁగంగఁ దాను బరుల

తే. దిక్కువలుకక, దివియెల్లఁ బిక్కటిలఁగఁ
దాన యున్నట్లు గనుచు నేమేనిగుడిచి,
యెద్దియేనియుఁ గట్టి, యెందే శయించు
నతని దేవతల్ బ్రాహ్మణుఁ డండ్రు పుత్ర. ౧౪౨

క. జననికరములకుఁ దొలఁగును
ఘనభుజగంబులకుఁ బోలెఁ గనుఁ బీనుఁగుఁగా
వనితం; దనుఁ [2]బాటించిన, నసఘా,
నరకముగఁ దలఁచు నతఁడు మనమునన్. ౧౪౩

తే. [3]అతనివలన భూతములకు నభయ మగుట
భూతములవెస నభయంబ యాతనికిని;
బుత్ర, యీవు లెల్లవియును భూతములకు
నభయ మిచ్చుటఁ బోల వం డ్రార్యజనులు. ౧౪౪

1. తా... బోడితలవాఁడును, ఇల్లులేనివాఁడును, చెట్టు మొదట గూర్చుండినవాఁడును, కుండబొచ్చె చేపట్టినవాఁడును, దిక్కులేనివాఁడును, క్రోధము కామము శోకము లేనివాఁడునుగా బిచ్చగాఁ డుండవలయును. 2 = ఆదరించిన-చో. 3 తా. ప్రాణుల కతనివలని భయము లేదు- కావున ప్రాణులవలని భయము అతనికి లేదు. ఎన్ని దానము లైనను ప్రాణులకు అభయమిచ్చుట (=భయము బాపుట) తోఁ బోల వండ్రు పెద్దలు.

ఆ. [1]జంతుపదము లెల్ల దంతిపదంబులో
నడఁగుక్రియ నహింసయందు సకల
ధర్మములు నడంగు; గర్మసంత్యాగికి
నైన భూతదయ సమర్థగుణము. ౧౪౧

వ. కావున, ౧౪౨

క. జగముల కెల్ల శరణ్యుం
డగుచు నమృతసిక్తమైనయట్టి మనసుతో
విగతాఖిలలేపస్థితి
గగనమున ట్లుండు నతఁడు గణనాధికుఁ డై. ౧౪౩

వ. అని చెప్పి యప్పరాశరనందనుండు వెండియు ని ట్లనియె: ౧౪౪

—♦ వ్యాసుఁడు శుకున కుపదేశించిన యంతర్యాగ ప్రకారము. ♦—

తే. హృదయ వేదికయందు సమిద్ధమూర్తి
వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁ బ్రాణ
ములను యాజియు; ట్లంతరమున నొనర్చు
యాగమున వీతకల్మషుఁ డై వెలుంగు. ౧౪౫

క. విను, 'మాత్మతీర్థసంసే
వనము తెలం గెఱుఁగునట్టివానికిఁ దిరుగం
జన వలయునె పెఱచోటుల?'
కని చెప్పుదు రాశ్రితులకు నధ్యాత్మవిదుల్. ౧౪౬

తే. అవనిఁ బొందదు, దివమున నప్రమేయ,
మండజంబు హిరణ్మయ, మండమధ్య
మున వెలుంగు నుజ్జ్వలపక్షఘునత,— దాని
నెఱుఁగు సంతతయోగ సమేతుఁ డనఘ. ౧౪౭

క. విను, మాఱంచులుఁ, బంచ్ఛ్రిం
దనుపమధారలును నై, నిజాస్యము విశ్వం

---

1. తా. ఏనుఁగు అడుగులో ఎల్ల జంతువుల అడుగులును అడఁగునట్లు అహింసయందు సకలధర్మములు నడంగును. కర్మత్యాగముచేసిన వానికైనను భూతదయ తగిన గుణము.

బును బొందువఁ దిరుగుకాలం
బనుచక్రము; దురవబోధ!—మది యెఱఁగు గుహా! ౧౫౨
ఆ. మనసు నిందిృయములఁ బనిగొని పురుషుండు
ప్రచురశిక్ష లేని రథ్యసమితి
నడపు రథికుమాడ్కి— నడవడి నవి యీడ్చి
నట్టులైన నశుభ మావహిల్లు. ౧౫౩
క. తనకు మహితప్రసాదం
బొనరక యున్నేనిఁ గీళ్ళు లోలయు; నది దృఢ
త్వనిరూఢ మైనఁ జేకుఱు
ననంతపదసిద్ధి;— దాని కను వెటిఁగింతుజా. ౧౫౪
తే. సర్వసంకల్పరహితుఁ డై సత్త్వమున వి
నిశ్చలంబుగఁ జిత్తంబు నిలుపవలయు;
సత్త్వసక్తచిత్తంబు ప్రసాద మొసఁగు;
దాన గాలంబు నడపు టుత్తమవిధంబు. ౧౫౫
క. వినుము, నివాతస్థానం
బునఁ గంపనరహిత దీపము వెలింగెడు చా
డ్పున నంతరాత్మ వెలుఁగుచు
నునికి ప్రసాదంబు భంగి యుత్తమధిషణా. ౧౫౬
క. విను, తత్ప్రసాదవంతుఁడు
దనయందు నిరంజనముగఁ ద న్నవిశంబుం
గనుఁగొనుచు, నియతి నియతా
శనుఁ డై యుండుట యొనర్చు శాశ్వతపదముజా. ౧౫౭
తే. అతులవేదాంతశాస్త్రమహాంబురాశి
దృచ్చి పుచ్చిననవనీత మిచ్చితిని; స
మాదరంబునఁ గై గొను; మనుసరించు
నిర్మలాత్మతపస్వికి నీవు నొసఁగు. ౧౫౮
ఆ. సకలరత్నపూర్ణ సర్వవసుంధరా
చక్రదానవిధియు సరి యెసంగ

కాదు_విశ్వవేదరాశిసారాధ్యాత్మ
విద్య యిచ్చుటకు వివేకధుర్య. ౧౫౯

వ. అని యుపదేశించి యింక నేమి విన వల తనిన, శుకుండు: 'దీని
కంటె విన వలయు నది గలదె? దీనిన సుదృఢంబుగా ననుగ్రహిం
పవే' యనుటయు, ననుకంపావిధేయుం డగుసాత్యవతేయుం డతని
కి ట్లనియె: ౧౬౦

క. భూతంబులఁ బచరించుచు
భూతాత్ముఁడు వానిఁ దనవిభూతి నడంచున్;
భూతాహరణంబు నిజ
ద్యోతనము దనీయవృత్తి దుర్దశ పుత్త్రా. ౧౬౧

క. అవయవము లెట్లు కూర్మము
నివిడించును, లోని కడఁచు నెఱి- నట్టుల భూ
తవితతి భూతాత్ముండును
బ్రవర్తన నివర్తనముల పాల్పడఁ జేయున్. ౧౬౨

క. మాయాశబలుం డై యుటు
సేయక పోరామి భూతసృష్టి యొనర్చున్;
మాయఁ బెడఁబాప భూతని
కాయాభావ మగు నదియు కవిజనముఖ్యా. ౧౬౩

తే. గగన పవన తేజో జల క్ష్మాగుణములు
నూవె శబ్దాదికంబును శ్రోత్రముఖ్య
కంబు లై చెల్లు; విషయచయంబు, నింద్రి
యవ్రజంబును, సర్వంబు నడఁచు శమము. ౧౬౪

క. వినుమ షై దింద్రియములకును
మనంబు షష్ఠంబు; సప్తమత్వము బుద్ధిం
బనుగొను; భవ్యక్షేత్ర
జ్ఞునియం దష్టమత గల్గు సుగుణాభరణా. ౧౬౫

తే. తలఁచు మనమందు; నిశ్చయదశ యొనర్చు
బుద్ధి; సర్వైకసాక్షిత్వమున వెలుంగు

నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ డనఁగ;— వాని
మెఱుఁగు సత్త్వాదిగుణము లై మెఱయు వత్స. ౧౬౬

తే. స్వస్థతయు దుఃస్థతయు జడత్వమును గ్రమవి
గణన సత్త్వ రజ స్తమోగుణము; లవి స
మీరితము లగు—టడఁగుట, యింద్రియంబు
లడరు—టూడుఁగుట: బుద్ధికృత్యములు పుత్రి. ౧౬౭

తే. [1]అనఘ, యింద్రియములు విషయములు; మనసు
బుద్ధియును నాత్మయును గ్రమంబునన యెక్కు—;
డాత్మ బుద్ధి యనంగ నల్పాంతరంపు
వస్తువులు— బుద్ధి యిన్నింట విస్తరిలుట. ౧౬౮

క. కనుఁ గన్నై, వినుఁ జెవి యై,
కొనుఁ జవి జిహ్వ యయి, మూరుకొను నాసిక యై,
తను వై స్పర్శము గైకొను—
ననవద్యా, బుద్ధి యాత్మయందు నిలుచుచున్. ౧౬౯

క. ప్రీతిం గడుఁ బొదలు, విషా
దాతురతః సుక్కుఁ, దద్ద్వయము లేక సమ
త్వాతిశయంబున నిలుచును—
నేతృత్వంబునను బుద్ధి నెఱపు గుణములన్. ౧౭౦

ఆ. తత్స్వభావ మెఱిఁగి తా నింద్రియాదిస
క్తకము వెంటఁ బోక, తన్నుఁ గనుచు
నున్నవానిఁ బొంద నోపునె దుఃఖ మె
న్యంబు సుఖమదంబు నప్రమత్త? ౧౭౧

ఆ. జలములందు నిలిచి జలపక్షి మునుఁగదు;
మేడిపండు మశకపీడఁ బొరయు;

---

1. తా. ఇంద్రియములు విషయములు మనస్సు బుద్ధియు ఆత్మయును ఒకదానిని మించునది మఱియొకటి-బుద్ధి ఈ యన్నింట విస్తరిలి యుండును. కావున, ఆత్మయు బుద్ధియు కొలది యంతరవులు మాత్రిసే గలవస్తువులు.

దట్లు విషయసమితియందుఁ దా, నది దన
యందు నుండు;— వికృతి నొంద దాత్మ. ౧౭౨

వ. అని చెప్పి మఱియును, ౧౭౩

క. విను, [1]మూర్ణనాభి తంతువు
జనియింపఁగఁ జేసినట్లు సత్త్వము గుణసం
జనకం బగు; నది పురుషుఁడు
గనుట యుదాసీనతన;— వికారము గలదే! ౧౭౪

ఆ. [2]ఆదినిధనరహితుఁ డగునిరంజనుఁ జెంది
గుణము తొడల విడిచి, క్రోధలోభ
ములకుఁ బొరవ యీనిమునిఁ, హృదయగ్రంథి
విరియ నడఁచి, మోక్షవిభవ మొందు. ౧౭౫

క. శమసంపద బ్రాహ్మణజ
న్మమునకు సామగ్రి; మవ్వినయసారము చి
త్తమున కలవడ్డమునికి భ
యము శోకము మదము హర్ష మనునివి గలవే? ౧౭౬

క. శమనిరతియు నాత్మజ్ఞా
నముఁ జువ్వె బుద్ధలక్షణంబులు! పర్యా
ప్తము లివి రెండు; నరయ మో
క్షము సాధించుటకు వేఱ కల్పన లేలా? ౧౭౭

వ. అనిన విని శుకుండు: 'ధర్మంబుల కెల్లఁ బరమం బయినధర్మం బెఱిం
గింపవే' యనుటయు, వాత్సల్యపరాయణుం డగుబ్బాదరాయ
ణుండు: 'సనాతనంబును మునిసత్తమసంస్తుత్యంబును నగునుత్తమ
ధర్మంబు సెప్పెద. నేకాగ్రచిత్తుండ వయి యాకర్ణింపుము' అని పలికి
యి ట్లనియె: ౧౭౮

---

1—తా. (ఊర్ణనాభి=)సాలెపురుగు దారమును గలిగింపఁ జేసినట్లు గుణముల
నన్నింటిని సత్త్వమే ప్రసవించును. అసత్త్వమును పురుషుఁడు గనుటయు ఉదాసీనత
తోడనే—అంటీ అంటకుండు నట్లే. కావున తగులము లేని యపుడు వికారము
[illegible] 2—ఆది అంతము లేనివాఁడు-(నిధనము=చావు; చేటు; కులము.)

—◆ ఇంద్రియనిగ్రహం బుత్తమధర్మంబుగా నిరూపించుట ◆—

తే. ఎల్లకడలకు వెలువడు నింద్రియముల
బాలపుత్రులఁ దండ్రియుఁబోలె నాఁగు;
మఱియు మనమును నిశ్చలైకాగ్రభావ
మొందు టుత్తమతప మది యుజ్జ్వలాత్మ. ౧౭౯

క. అది ధర్మంబుల కెల్లం
దుది యగుధర్మంబు; మనసుతోఁ దానిఁ దగం
గుదియించి మేధతోడం
గదియింపుము నియతిఁ, బుత్ర, కడు గాఢముగన్. ౧౮౦

తే. ఇంద్రియంబుల నాఱింటి నిట్లు విషయ
ములకు నొలయక యుండంగ నిలువరించి,
తలఁపు లుడిగి, తేనియఁ బ్రమదమున నాను
భంగిఁ దృప్తుఁడ వై యుండు;— పరముఁ గాంతు. ౧౮౧

వ. అని వెండియు, ౧౮౨

చ. [1]తనకుసుమంబులన్ ఫలవితానము మూర్కొన నాన మ్రాను సే
రనిక్రియఁ, గాన నేరదు పరం బగుతత్త్వము నైజభంగి; వి
న్ననువున నంతరాత్మ గను నైష్ఠికతం గను మింతవట్టుఁ;— బా
మెనసినతోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజమున్.

వ. ఇవ్విధంబున శాంతి నొంది, యవ్యక్తసంభవయు సంకల్పకూలయుఁ
గ్రోధపంకయు నింద్రియగ్రాహయుఁ గామభుజంగయు మోహ
తృణచ్ఛన్నయు సంసారసాగరగామినియు నై ఘోరప్రకార
యగుచు నకృతాత్ములకుం గడవ రానియట్టి లోభవాహిని సత్య
తీర్థంబున నుత్తరించి— ౧౮౪

క. సుత, నీవు సుప్రసన్నా
త్మతఁ బొంది, నగాగ్రగతుఁడు మహిఁవారలఁ జూ

1. తా. తన పుష్పాలను వాసన చూచుటకును తన పండ్లను భుజించుటకును వృక్షు మెఱుఁగని విధమున పరతత్త్వము స్వభావము చూడ నేరదు. నేర్పున అంతరాత్మ చూచు నిలుకడతోఁ జూడు మింతమాత్రమున - కుబుసమును పాము వదలినట్లు పాప పుంజమును నీవు తొఱఁగుదువు.

చు తెఱంగున, నీభూత
ప్రితతిం గనుఁగొనుచు నుండు పరితృప్తుఁడ వై. ౧౮౫

క. శాంతము ధర్మప్రచయం
బంతటికి విశిష్ట; మిమ్మహావిద్య మదీ
యాంతఃకరణము సాక్షిగ
నెంతయు సంప్రీతి నీకు నిచ్చితిఁ బుత్త్రా. ౧౮౬

వ. అని యి ట్లుపదేశించి పరమసంవిదేకాయనుం డగుకృష్ణద్వైపాయ
నుండు కృతార్థీభూతచేతస్కుం డగునందను ప్రతిపత్తికి నభినందన
విశేషంబుగా నధ్యాత్మవిద్యావిలాసవిషయంబు లగువాక్యంబులు
మఱియు ననుగ్రహించె; వాని జెప్పెద— ౧౮౭

క. వేదములుఁ దదంగములు స
మాదరమునఁ జదివినను, సుయజమానత్వా
పాదకుఁ డైనను, బ్రాహ్మణ
తాదశ దక్కునె ప్రశాంతిఁ దక్కఁ గుమారా? ౧౮౮

క. ఒరులకుఁ దా వెఱవక, తన
కొరులు వెఱవ కుండునట్టియొప్పెడుసమతం
దిర మైననడవడిం గల
పరిణతచిత్తుండు సూవె బ్రాహ్మణుఁ డనఘా! ౧౮౯

తే. బంధనంబులలో నెల్లఁ బరమబంధ
నంబు గామంబు; దద్వర్జనమున నాత్మ—
యభ్రపటలంబు వాసినయమృతకిరణ
పూర్ణమండలమునుబోలెఁ బొలుచు ననఘ. ౧౯౦

క. పరతత్త్వోపాసనత
త్పరుఁ డై సంక్షీణకామభావత నున్నం
బురుషు సుఖమొందు వృద్ధిం
బొరయుచు— నవు నమృతకిరణుఁ బొందినమాడ్కిన్. ౧౯౧

క. పొరిఁ బొరి భూతముల గుణో
త్కర మవిశేషాన్వితముగఁ గనుఁగొనుసంవి

త్పరదుఃఖంబు సుఖముచే
విరియుఁ, దరణిచేతఁ దమము విరిసినభంగిన్. ౧౯౨

ఆ. తనది యనక యేమిధనమునఁ బ్రియమంచు?-
నెద్ది గుడువ కుండ నెసఁగు దృప్తి?-
యిచ్చఁ బొందు లేక యెయ్యది బలమిచ్చు?-
దానిఁ గనుట శ్రుతులతలఁపు గనుట. ౧౯౩

క. పరిపాటిఁ గర్మ మెడలఁగ,
వరుస గుణము లడఁగ, విషయవర్గముపొందుం
బొరయక యుండెడు బ్రహ్మము
జరయును మృత్యువును బొరయఁజాలవు వత్సా. ౧౯౪

తే. అనఘ, దేహంబుకంటె వే ఱయిన దేహ
సూక్ష్మరూపము శాస్త్రోక్తసుకృతములఁ బ్ర
శాంతజనములు గాంతురు; సాధనముల
నాదరింపరు దర్శనానంతరమున. ౧౯౫

క. ఇనురూపము జలములఁ దోఁ
చినక్రియ-బుద్ధిఁ బ్రతిబింబసిద్ధత వెలుఁ గొం
దినయాత్మను బరమార్థత
గనుసత్త్వస్థులకు నిజము గానంగ నగున్. ౧౯౬

క. అనఘ, దివసంబు రాత్రియు
ననునివి భానునకు లేనియట్టులు, సతతం
బును బరమయోగయుతుఁ డగు
మునికి వివేకావివేకములు లేకుండున్. ౧౯౭

క. కరణంబులు దొడరిన, ని
ష్కారణత నున్నను,-శమంబు గలయోగికి సు
స్థిర మగు సమాధి యని, ముని
వర, శాండిల్యుండు శిష్యవరులకుఁ జెప్పెన్. ౧౯౮

సీ. విను, మోహబీజసంజనితంబు గామద్రు
మంబు: ప్రమాదజలంబు దనకుఁ
బరిషేచనంబుగఁ బెరుఁగు నజ్ఞానస్థి
రాధారకలిత మై; యం దసూయ
పత్త్రసంపద-యది చిత్త్రోతరంబు; మా
నస్కంధదృఢత నున్నతి వహించు;
శోకశాఖంబు ననేకచింతోపశా
ఖంబుఁ; బురాకృతకర్మసార

తే. ఘనముఁ దృష్ణాలతాపరిగతము నగుచుఁ
బొలుచుఁ; దత్ఫలములకు లుబ్ధులు గడఁగి
ప్రాఁకి పడుదురు; విడుపు శస్త్రముగ నది వి
ఖండితము సేసి బుధుఁడు దుఃఖములఁ దొలఁగు.

సీ. [1]పురము శరీరంబు, బుద్ధి తత్స్వామిని,
సర్వార్థచింతనసచివపదవి
నడచుచు నుండు మనంబు; శబ్దాద్యంబు
లై చెల్లువిషయంబు లైదుఁ దగుపు
రోహితవర్గంబు; శ్రోత్రాదు లగు నింద్రి
యంబులు పౌరజనంబు;- లిట్లు
పరఁగెడురాజ్యంబుపరిభోగమునకు దూ
షకులైన దొరలు రజస్తమములు;

---

1. తా. శరీరము పురము-ఆపురమునకు బుద్ధి ఏలిక, వ్యవహారములనెరించు మంత్రిపదవిని మనస్సు నడచుచుండును. శబ్ద రస రూప గంధ స్పర్శమను లౌకిక విషయములు పురోహితవర్గము. చెవి నాలుక కన్ను ముక్కు- అను ఇంద్రియములు పౌరజనములు. ఈ విధము నడచుచుండు రాజ్యానుభ భంగము గలిగించు దొరలు రాజస తామస గుణములు. ఎఱుఁగక బుద్ధి మనసు వేర్పడినచో ఆ రజస్తమస్సులకు వశమగును. ఆ బుద్ధియు మనస్సు ఒక్కవర్తించునేని దుష్టుల అడఁగుగును అనుభవము తఱుగని దగును.

తే. వారికలపులఁ బడు బుద్ధి నేరకుండి
మనసుతోడ వేర్పడినఁ; దానును మనంబు
నేకముఖతఁ గార్యము సూచు నేని దుష్టు
లడఁగుదురు; భోగ మవ్యయ మగుఁ గుమార. ౨౦౦

వ. అని చెప్పి ననిన విని, పాండవాగ్రజుండు భీష్మునితోఁ: 'గార్యబలంబును వీర్య బలంబును మనోబలంబునుం గలుగు నుత్తమక్షితిపతులనేకు లీకయ్యంబున మృతులైరి. నిజప్రాణంబునకు నొక్కరుండు నోడయుండు లేక తక్క. మృత్యువనునది యెయ్యది? ఏమిటం గలిగె? ఎట్లు ప్రజల సంహరించు?- ఎఱింగింపవే'- యనుటయు, నతం డి ట్లనియె: ౨౦౧

—♦ భీష్ముఁడు ధర్మరాజునకు మృత్యుదేవత తెఱంగెఱిఁగించుట. ♦—

సీ. విను మకంపనుఁ డనుమనుజేంద్రుఁ డాత్మజుఁ
డాహవంబున మృతుఁ డైన వగపు
గదురంగ నుండి, నారదు[1] నలవోక వ
చ్చినవానిఁ గని, సవిశేషభక్తి
యుతముగా నాతిథ్య మొనరించి, తనవగ
పెఱిఁగించుటయు, నమ్మునీశ్వరుండు
గరుణ శోకనిరాసకారణం బైన యా
ఖ్యాన మొక్కటి సెప్పె; దాని తెఱఁగు
తే. దేటపడునట్లుగాఁ బరిపాటితోడ
నఖిలమును నెఱిఁగించెద; నవహితుండ
వై వినంగ నీయడగినయర్థమునకు-
బోధకం బగు నది కురుభూపవర్య. ౨౦౨

1. అలవోక = స్వేచ్ఛగా.

వ. అజుండు జగంబులు సృజియింప జంతుసంతానంబు వెరిఁగి సన్మార్గం బధికం బై యూర్పు వోవనియ ట్లైన, నద్దేవుండు సంకటపడి సంహార ప్రకారంబు విచారింపం దదీయచిత్తంబు కార్యదాహం బున మహాదహనుండు జనియించి జగంబులు దహింపం జొచ్చిన,

తే. త్రిణయనుఁడు వచ్చి యాతనిఁ దేర్చె,
నాతఁ డా తెఱం గెఱిఁగించి యయ్యగ్ని నుడిపె;
నపుడు పుట్టెఁ దదీయేంద్రియవ్రజమున
నొక్కయంగన రక్తాక్షి యుజ్జ్వలాంగి. ౨౦౪

వ. పుట్టి, దక్షిణాభిముఖి యై పోవం గని కమలసంభవుండు పిలిచి: మృత్యువ, ప్రజలఁ బ్రబల దుర్బలభేదంబు లేక సంహరింపుమను టయు, నవ్వనిత వనటం గన్నీరొలుక: 'నీ కుద్భవించి క్రూర కర్మంబు సేయుదునే! ధర్మకార్యంబునకుం బనుపుము' అని పలికిన, నయ్యశ్రుబిందువులు దోయిటం బట్టి యద్దేవుం డమ్ముద్దియతో: 'నిదియ పనిగా నుదయించినదానవు; నీవు ప్రజాసంహారంబు సేయ వలయు.' అనవుడు, నాబాల గాలిం దూలుతీవయుంబోలెఁ గంపంబు నొందుచు, ౨౦౫

క. 'మనుజుల హరించి బాంధవ
జనమునశోకంబుఁ జూడఁ జాలుదునె! తపం
బున కేఁగెద సదయంబుగ
ననుజ్ఞ సేయంగ వలయు' నని ప్రణమిల్లెన్. ౨౦౬

వ. దానికి, నరవిందసంభవుండు మందస్మితంబుతో: 'నిక్లే లగు? జంతుసంహారంబు నీ కవశ్యకర్తవ్యంబు; దానిం జేయుమి సువ్వె యధర్మంబు!' అని నిర్బంధించిన, నూరకుండి యన్నాతి వదంపడి యల్లన సురిఁగి ధేనుకాశ్రమంబున కరిగి, యత్యంత దీర్ఘకాలంబు ఘోరతపంబు సేసి, కౌశికి గంగ నంద యనునదులకుం బోయి వాయు వాహారంబుగా నతిదుష్కరవ్రతంబు లనేకవత్సరంబు లాచ

రించి, హిమశిఖరిశిఖరంబునకుం జని చతురాననప్రీతికరం బగు
నిష్ఠాతిశయంబున సంయమంబు దాల్చి యుండ, నద్దేవుండు— ౨౦౭

క. సన్నిధి సేసి : 'తపము మెయి
నున్నఁ బ్రయోజనము గలదె! యుడుగుము పుత్రీ'
యన్న- 'శరణంబు వేఁడెద
నన్ను దయం గావు' మనియె నాతి యతనితోన్. ౨౦౮

వ. అనిన విని యమ్మహాత్ముండు— ౨౦౯

తే. 'ప్రజల హరియించు టిది నీకుఁ బరమధర్మ;
మేను బొంకెద నే! దీని నెల్లభంగి
నాచరింపక వలయు; మత్ప్రార్థనంబు
భగ్న మొనరించు టొప్పదు పద్మనయన. ౨౧౦

వ. 'మఱియు నొక్క విశేషంబు సెప్పెద : నీ యశ్రుజలంబు లే నంజలి
పుటంబునం బట్టుకొఱుంగుదు గాదె! యవి నానావ్యాధిరూపంబుల
మానవుల బాధించుఁ; గామక్రోధంబులు వానికిం దోడుపడు; వారు
దానన తెగుదురు; నీవు నిమిత్తమాత్రం బింతియ; నీకు వరంబిచ్చెద.

తే. 'పురుషుఁడును నంగనయును నపుంసకుండు
నగుము, పుత్రిక, పురుషుని నంగనను న
పుంసకునిఁ జంపువేళల; బొందకుండు
పాపమును; నిది ధర్మమై పరఁగు నీకు.' ౨౧౨

వ. అని పలుకుటయు, నప్పొలంతి శాపంబునకు వెఱచియు, నది
యట్టిద కాక యను తలంపు దోఁచియుఁ, బ్రజాసంహారంబు సేయు
నధికారంబు పూనె. మృత్యుదేవత ప్రాణాపహారిణి యగుఁ; బ్రాణి
జాలంబు దేహంబులం బాసి దేవాదిభావంబులం బొందుచు మగుడ
మనుష్యత్వంబు నొందుచుండు. ౨౧౩

తే. భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్ర
తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డొడలు

క. ఒరు లేమేమి యొనర్చిన,
సరవిఁ, యప్రియము దనమనంబున కగుఁ?- దా
నొరులకు నవి సేయ కునికి
పరాయణము పరమధర్మపదముల కెల్లన్. ౨౨౦

వ. అని చెప్పినం బ్రీతుం డై తాతకుం బ్రణమిల్లి, పాండవాగ్రజుండు: 'ధర్మస్వరూపనిరూపణం బింత యొప్పునే!' అని యభివర్ణించి, 'యాగ్రహంబున నేతనియు నడుగుచున్నవానింగా నన్నుం దలంప వలదు; వలవనియట్టిది యడుగను. తెలిసికొనుటకై వలయునది యడుగుదు. అట్లుంగాక యడిగినదానిన యడుగుటయుం గలుగు. కృప నాదరింపుము: సమ్యగాచారంబు ధర్మప్రకారం బని నిర్దేశించితివి. ఉత్తమాచారప్రకారం బెఱింగింపవే' అనుటయు, నమ్మనుజ పతికి నమ్మహాత్ముం డి ట్లనియె: ౨౨౧

తే. వేద మాచారములఁ జెప్పు వివిధగతుల;
సకలహిత మగునట్టి యాచార మరయ,
ననఘ, వేఱొండు గలదె? మహాత్ము లెద్ది
యాచరించిరి దానిఁ జేయంగవలయు. ౨౨౨

వ. అని పలికి తొల్లి జాజలి యనుమునికిఁ దులాధారుం డనువణిగ్వరు నితో సంవాదంబు గలిగె. అది యితిహాసరూపంబునఁ జెల్లు. ఏత ద్విషయం బయి యుండు దాని జెప్పెద నాకర్ణింపుము: ౨౨౩

—జాజలి తులాధారుల సంవాదప్రకారము.—

సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నా
సీనుఁడై యుండఁ, బిచ్చికలు గూఁడు
గావించెఁ దన్మస్తకంబున; నమ్మిథు
నము గారణముగ నండములు గలిగి
పిల్ల లై వర్తించి యెల్లెడ కెర గొన
నరుగుచు మరలుచు నవియు నవియు

నగ్గాఁట వసియింప, నతఁడు దయాళుఁడై
వానిఁ జోపక యుండి, వత్స, తనదు
తే. నియతి కెడ మెచ్చి, 'యీధర్మనిష్ఠ యెందుఁ
గలదె!' యనుటయు, మ్రోసె నాకాశవాణి :
'ధర్మపరుఁడైన యత్తులాధారుఁ డింత
యాడఁ; డిట్లాడ నే?' లని యద్భుతముగ— ౨౨౪

వ. అట్లు మ్రోసిన విని వెఱఁగుపడి, యత్తులాధారుం గాన వలయు ననితలంచినం,- 'తులాధారుండు వారాణసీపురంబున నున్నవాఁడు'- అను వాక్యంబును నంబరంబున వీతెంచె. అమ్మునియును మత్సరభరితుఁ డగుచు నప్పురంబునకుం బోయి జనసంపూజ్యవాణిజ్యంబునం బ్రవర్తిల్లునతనిం గాంచె, అతండు సముచిత సత్కారం బాచరించి యి ట్లనియె: ౨౨౫

తే. 'పిచ్చికలు గూఁడు శిరమునఁ బెట్టి, తారుఁ
బిల్లలును సుఖలీల వర్తిల్లుచుండఁ
జిత్తవికృతి లే కెట్టులు సేయు దయ్యె
తపము? సంభావనీయవర్తనుఁడ వీవు.' ౨౨౬

వ. అనినఁ, దదీయబోధనంబునకు విస్మయం బందుచు విప్రోత్తముండు: 'నీవు వణిగ్వర్తనంబుననుండ నెవ్విధం బగుధర్మంబునని విశేషంబు గలిగె?' అనవుడు, నతం డతని కి ట్లనియె: ౨౨౭

సీ. విలుచుట నమ్ముట నొలయను వంచన;
యర్ఘలాభంబుల యనుభవింతు;
సరి సిద్ధ్యసిద్ధులు; సమలోష్టకాంచన
మై యుండు మనసు; నిందాభినుతులు,
హింసయు, నాత్మప్రశంసయు లేవు; భూ
తంబులయం దెల్ల దయ ఘటిల్లు;

సభయదక్షిణ మగు; నంచితసత్యయా
గము సెల్లుఁ; గోర భోగమును యశము;

తే. నెవ్వరికి మేలు సేసిన నింత సేసి
నాఁడ ననుబుద్ధి, మమత యెన్నండు నాకుఁ
గలుగ; దేమిట నేనియు వలపు, నొల్ల
మియును బుట్టదు; నిక్క మింతయు మహాత్మ. ౨౨౮

క. లోకం బెల్లను నేఁ జి
త్రాకారము గాఁగఁ జూతు; నట్లగుట మనం
బేకార్యములం దగులదు
[1]శోకనదదళాంబుబిందుగుణ మొనరంగన్. ౨౨౯

వ. అనిన విని జాజలి తులాధారున కిట్లనియె: ౨౩౦

తే. తపములును యజ్ఞములు నీవు ధర్మములుగఁ
బలుక వైతివి; యార్యసంభావనీయ:
పదము లగుకర్మములలోనఁ బరిగణింపఁ
బడవొకో వేదశాస్త్రతత్త్వజులచేత ! ౨౩౧

చ. అనవుడు, నాతఁ డిట్లను: 'నహంకృతియుక్తముఁ గామసంశ్రితం
బును నగు నేని నట్టితపమున్, ఫలకాంక్ష యొనర్చుయజ్ఞమున్-
ఘనతరలోభవృత్తి యనుకొన్నన మెచ్చదు దేవకోటి; వా
న నగు గతాగతంపు భ్రమణంబులు; గీల్గులు గాక మేలులే ?

ఆ. 'నిత్యతృప్తుఁ డైనసత్యయజ్ఞునియెడ
దేవతలును నధికతృప్తు లగుదు;
రమరతృప్తివలన నన్యయానందంబు
సంఘటిల్లుఁ జూవె సంయమీంద్ర!' ౨౩౩

తే. అనిన, జాజలి: 'యట్లని, యనఘ, నీవు
కర్మ ముడుగమి కెయ్యది కారణంబు ?

1. = ఎఱ్ఱగలువ రేకుమీఁది నీటిబొట్టువలె.

మాకు నెఱిఁగింపు' మనుటయు, మహితబోధుఁ
డగుతులాధారుఁ డి ట్లను నతనితోడ : ౨౩౪

క. ధర్మారాముఁడు సంతత
ధర్మసఖుఁడు నై యసంగతానిష్ఠమతిన్
నిర్మలుఁ డగువానికి ని
ష్కర్మతానందసిద్ధి గలుగు మునీంద్రా. ౨౩౫

ఆ. నగము లెల్లఁ బుణ్యనగములు, నదు లెల్ల
బుణ్యనదులు, వినుము భూసురాగ్ర
గణ్య, యకలుషం బకర్దమ మనఁ జాలు
నాత్మతీర్థ మెఱుఁగు నకలుషునకు. ౨౩౬

క. కారణములవలనఁ గృత
ప్రారంభం బైనకర్మ మంచితగతికిం
గారణమే కర్తవ్య
త్వారబ్ధక్రియలయట్టు లనఘచరిత్రా ? ౨౩౭

వ. అని చెప్పి యంత నిలువక, ౨౩౮

క. విను, మంచివారిచే నై
నను, నితరులచేత నైన నాయెఱిఁగిన యీ
యను వొప్పదొ మేలో యను
ననుమానము వాపుదమె మహాధర్మనిధీ. ౨౩౯

వ. అప్పని మనచేత నయ్యెడి. నీవు దండ్రివోలెం బెనిచిన మరగి నీతో నరుగుదెంచి నీశిరంబు చక్కటిచదలం జేరువం బొలయునిప్పులుఁ గులం బిలిచి కరంబుల ధరించి యుపలాలింపుమా యనుటయు, జాజలి వానిం బిలిచిన, నవి దివిన నిలిచి యతనితో ని ట్లనియె :

చ. 'మునివర, ధర్మదేవత మముం బనుపన్ నిను నారయంగ వ
చ్చినభటసంఘ మేము; విన్ము చెప్పెద: మీను. గలంక పోరితం..

బనునివి మత్సరంబు గలయట్టిమనంబునఁ బుట్టు; హింస వీ
నన జనియించు; సంయమిజనంబు విమత్సర మైన మే లగున్.

తే. [1]స్పర్ధ సద్ధర్మమునకు నాశని; సుధర్మ
నాశమునఁజేసి నరుఁడు వినష్టభావ
మొందుఁ; గావున సంస్పర్ధ యుడుగవలయు
నిర్మలశ్రద్ధ గైకొని నిపుణుఁ డనఘ. ౨౪౨

క. శ్రద్ధ, రవితనయ, సాత్త్వికి
బోద్ధవ్యావాప్తి శుభముఁ బొనరించు; మన
శ్శుద్ధిస్వరూప దానిఁ బ్రి
బుద్ధుఁడు వాటించుఁ జూవె పురుషార్థికఁగన్. ౨౪౩

క. అమరులు విమలశ్రద్ధా
సమేతములు గానితాపసత్వముఁ, గ్రతుమ
త్త్వముఁ-గైకొన; రాసువిశే
షము గలిగిన మెత్తు; రది ప్రశస్తం బనఘా. ౨౪౪

క. విను, మునివర, వాగ్వృత్తియు,
మనఃప్రవర్తనముఁ-గాచు మహితశ్రద్ధా
ధనసంపద; శ్రద్ధ యనం
జనునది జీవాత్మ సుప్రసన్నత సుమ్మీ! ౨౪౫

— తులాధారుఁడు జాజలికిం జెప్పిన బ్రహ్మగీతలు. —

వ. అని మఱియు నిట్లను బ్రహ్మగీత లనువాక్యంబు లాకర్ణింపుము:

క. [2]యాగంబునందు శ్రద్ధా
యోగము గలయశుచి, శ్రద్ధ యొనరనిశుచి,- పు

1. = పోటీ; వంతు. 2=యాగములయెడ శ్రద్ధగలిగియు త్రికరణశుద్ధి లేనివాఁడును, త్రికరణ శుద్ధిగలిగి శ్రద్ధలేనివాఁడును పుణ్యము నార్జించుటయందు సమానులే యని అగని ఎన్నికచేసిరి.

ణ్యాగమసంపదఁ - దుల్యాలు
గా గణుతించిరి నిరూపకత నమరవరుల్. ౨౮౮

క. విను, మజుఁడు: 'శ్రద్ధ యతిపా
వని; యది గలవాఁడు గౌరవశ్రేష్ఠుం; డా
తనియన్నము భోజ్యతరం'
బని నిర్దేశించె నెల్లయమరులు వినఁగన్. ౨౮౯

ఉ. వారక వడ్డి కిచ్చి కుడువన్ వెర వారినదానశీలు, నె
వ్వారికిఁ జేయుఁ జూపక ధ్రువంబుగ లోభగుణంబ పట్టి ని
స్సారత నుండువేదవిదు సామ్యముఁ జేర్చి రమర్త్యు; లందు, న
వ్వారిజసూతి: [1]దాత యగువాఁ డధికుం డనియెన్ హవిర్విధిన్.

ఆ. దానగుణము శ్రద్ధ లేనివానికి లేదు;
గాన నివ్విధమునఁ గమలభవుఁడు
నిశ్చయించె; నీవు నిర్మలశ్రద్ధాభి
పూతమతివి గమ్ము పుణ్యచరిత. ౨౯౧

ఆ. వినుము, శ్రద్ధ గలుగుమనుజుండు పాపంబుఁ
దొలఁగఁ ద్రోవ నేర్చుఁ - దోలు డిగ్గ
నూడ్వ వెరవు గలుగునురగంబుచాడ్పునఁ;
గాన, మేలు శ్రద్ధధానుఁ డగుట. ౨౯౨

వ. అని వెండియు, ౨౯

ఆ. మత్సరాదిచిత్తమాలిన్యములు శ్రద్ధ
గలమనంబునందు నిలువ నేర
వనినఁ, దేటి యిట్టు లనియె జాజలి తులా
ధారుతోడ నిభృతిఁ గౌరవేంద్ర. ౨౯

1. దానము చేయువాఁడు.

క. మునులవలనఁ దత్త్వం బే
విన కుండుటఁ జేసి యిట్టివిధము గలిగెనా;
కనఘా, నీవాక్యంబుల
మనంబు దెలి వొందె శాంతి మరగెద నింకన్. ౨౫౪

వ. అనిన నభినందించి తులాధారుండు—— ౨౫౫

క. తనతన తెరువునఁ గర్మం
బనుష్ఠితం బైన మేలు; యనఘ, నివృత్తిం
గని శ్రద్ధఁ గూర్పఁగొ నే
ర్పనయంగా వలయు దాని యెడయుం దలఁడున్. ౨౫౬

ఆ. అట్ల కాక యని ప్రియంబుమై వీడ్కొని
జాజలియును జనియె; రాజవర్య,
యిహపరముల నెసకమెసఁగ సౌఖ్యము తులా
ధారుఁడును సమున్నతత్వమొందె. ౨౫౭

క. అవణిజుఁడు ధర్మస్థితి
దేవతలును మెచ్చునట్లు దెలియఁగఁ బలికెన్;
నీ వీవాక్యము లన్నిట
భావం బలవడిచి కనటు వాపుము వత్సా. ౨౫౮

వ. అని చెప్పినం బ్రమదంబు నొంది, ౨౫౯

క. సురసరిదాత్మజుతోఁ గురు
నరపాలోత్తముఁడు వినయనమ్రుం డగుచుం
'జిరమో కార్యసమీక్ష య
చిరమో! వలయునది కరుణఁ జెప్పు' మనవుడున్. ౨౬౦

వ. అతం డతని కిట్లనియె: ౨౬౧

క. త్వరితము సేయక కార్యము
చిరంతనవిమర్శనముగఁ జేసి యొనర్పన్,

ధరణీశ్వర, యోటువడఁడు
పురుషుఁడు; సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్. ౨౬౨

క. తాలిమి లేనిజనంబులు
మే లెఱుఁగక యట్టివాని మీఁదను: 'జాడ్యం
బాలస్యం బిది'- యని దో
షాలోచన మాచరింతు; రది మతి యగునే? ౨౬౩

వ. అని చెప్పి వెండియు ని ట్లను: నీయడిగినయర్థంబు మేధాతిథి యను మునిసుతుండు చిరకారి యనువానివృత్తాంబు వినినం దెలియు; దానిం జెప్పెద: ౨౬౪

—•• చిరకారి యను మునికుమారుని చరిత్రము. ••—

క. అతఁడు చిరకాలసువిచా
రితంబుగాఁ జేసి యాచరించుం, గురుభూ
పతివర్య, యెద్దియును; నది
కతముగఁ జిరకారినామకంబునఁ బరఁగున్. ౨౬౫

సీ. విను, మొక్కకారణంబున ముని, పత్నిపైఁ
గోపించి చంప నక్కొడుకుఁ బనిచి,
యొటయేని వెడలి పోవుటయును, బను లెల్లఁ
జిరవిచారముతోడఁ జేయుఁ గాన,
నచ్చిరకారి యి ట్లని విచారించె: 'జ
నకుపంపు సేత మానంగ రాదు;
తల్లిఁ జంపుటయును దగదు; తండ్రితలంపు
దప్పింతుఁ గా కని తలఁతునేనిఁ,
తే. గల్మషం బందుఁ దాని సత్కర్మవిదులు;
మాతృరక్ష గర్తవ్య మెమ్మాడ్కి నైనఁ;

బుత్రభావ మస్వాతంత్ర్యమునకు నెలవు !
పాప మడఁగింప నెవ్వల నోపునొక్కొ ! ౨౬౬

క. 'జననీవధంబు సేసిన
ననుమానమె నరక మగుట యని యుడిగితిఁ బో,
జనకావమాన మొనరిం
చినవానికి నరకమున వసింపఁగ వలదే ! ౨౬౭

తే. 'తల్లి భస్త్రిక బీజంబు తండ్రి పెట్టు
వంశధరణార్థముగ; నిది వారిభంగి;
యేను బొత్తులవాఁడ నయ్యెరువురకును;
వీరలం దిప్పు డెవ్వరి విడుచువాఁడ?' ౨౬౮

వ. అని విచారించి తలంచుకొని, ౨౬౯

క. 'జనకుఁడ యే నైన జన్మిం
చినవాఁడను; జనకుపంపు సేసినఁ బాయుం
దనయుని పాపము లనియును
విని యుండుదుఁ; దలఁపు లింక వేయును నేలా? ౨౭౦

క. 'జనకుఁడు దపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవమును గావున, నా
తనికిఁ బ్రియం బగుపని సే
సిన దేవత లెల్లఁ బ్రీతి జెందుట గల్గుఁ,' ౨౭౧

వ. అని వితర్కించియుఁ దల్లి తెఱంగుఁ దలంచి, ౨౭౨

చ. 'కరచరణాదిసంఘటితకాయము సంజననంబు, వహ్నిపు
ట్టరణికిఁబోలెఁ, దల్లిదెస నైనది గాదొకో! యట్లుఁగాక దు
ర్భర మగుగర్భఖేదమును బట్టికినై, నిజదేహచింతపై
భర మొకయింత లేక, పడుపాటులు నక్కట!-యెక్కు డెంతకున్!

ఆ. 'వచ్చి పోయి చూచువాఁడు గా కిడుమలఁ
బడు నె తల్లివోలెఁ బట్టితోడఁ
దండ్రి?-చెప్పు నిట్లు ధర్మశాస్త్రంబులు
నంబ గౌరవమున నధిక యగుట. ౨౭౪

ఆ. 'బాలుఁ డైనఁ గొడుకు ప్రౌఢుఁ డైనను వృద్ధుఁ
డైన-నొక్క-విధమ యర్థిలియును
నరయుభరముఁ దల్లి;-కాపదార్థంబు జ
గంబుకలిమి కెల్లఁ గారణంబు. ౨౭౫

ఆ. 'క్షుద్రజంతువులకు గురులకు-నెమ్మెయిఁ
దలఁప నొక్క-రూప తల్లి వలయు;
నూఱడిల్లఁగలదె యొండుసోటుల సుఖ
స్థవు నివాస మైనచోటఁ గాక ? ౨౭౬

క. 'అప్పుడ యసమర్థుం డగు,
నప్పుడ దుఃఖి యగు, శూన్య మై తోఁచు జగం
బప్పుడ-మాతృవియోగం
బెప్పుడు వాటిల్లె?—నపుడ యెంతయుఁ దూలున్. ౨౭౭

క. 'కలవాఁడు లేనివాఁడు, స
బలుఁ డబలుఁడు, మూఢబుద్ధి ప్రౌఢుం-డనఁగా
వల; దెవ్వరి కైన జనని
కలిమియ యత్యంతసౌఖ్య కరమై యుండున్. ౨౭౮

తే. 'ఇట్టిజనని వధించుట యెల్లభంగి,
నధికపాపపయోరాశి యందు ముంచు;
దీని నెఱుఁగంగ పసులవాఁ డైన ? వధకు
నేల తెంపు వాటిలుఁ? జేతు లెట్లు లాడు? ' ౨౭౯

వ. అని యిట్లు పెక్కుభంగుల నూహించుచుఁ జిరకారి యగుట,
నతండు, శీఘ్రకారి గాక యుండం దడ వెంతయేనియుం గలిగె;
నంతకుం దదీయజనకుండు— ౨౮౦

క. 'వెడపనికి నాలిఁ జంపం
గొడుకుఁ బనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం!
గడవంబడునో కో పని!'- యని
కడువేగ జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్. ౨౮౧

వ. అట్లు సనుదెంచునప్పుడు— ౨౮౨

క. 'చిరకారి యెట్లునుం దన
చిరకారితఁ జూపుఁగాక, శీఘ్రపుఁ జేఁతన్
దురటిల్లఁ జేయునే నను?
వెరవరి వాఁ; డిట్టిపనికి వేగిరపడునే!' ౨౮౩

వ. అని పుత్త్రు నుద్దేశించి, ౨౮౪

చ. 'చిరముగ గర్భవాసమునఁ జెందితి, పుత్త్ర, చిరంబు గాఁగ ని
న్నురసెఁ గదయ్య తల్లి యనయంబును! నేఁ బనుపంగఁ బూనియుం
జిర మగునట్టి యిత్తెఱఁగు సేఁత దలంచితయేని, సత్కృపా
పరచిరకారి నాఁ బరఁగు భాసితనామము సార్థకం బగున్. ౨౮౫

ఆ. 'నాకు నాతపంబునకు నింద రాకుండ,
దురితభయము నిన్నుఁ బొరయకుండ-
నెమ్మిఁ జేసి, తన్ను, నీచిరకారిత
సకలభూతములును సంస్తుతింప.' ౨౮౬

వ. అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశించినం గని, చిరకారి నిజ
కరంబున నున్న వధసాధనంబు డిగ విడిచి, యగ్గౌతమ వంశవర్యు
చరణంబులు శిరంబు సోఁకఁ బ్రణామంబు సేసె. పత్నియుం జాఁగి
మ్రొక్కె. అయ్యిరువురు నెత్తి శోకబాష్పంబు లానందాశ్రువులుగా

నమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును మూర్ధఘ్రాణంబు
నుం జేసి, దీవనలం బొగడ్తల నభినందించి, తానును వారును
సుఖాసీనులై యుండి యిట్లనియె: ౨౮౭

క. 'కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడప వలయుఁ; దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁ డని
యార్యులు సేయుదురు నిశ్చయమును జిరముగన్. ౨౮౮

క. 'మిత్రత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయును బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రితముగ; - దాన నెల్లశుభములు నొందున్.' ౨౮౯

వ. అని నిర్దేశించె. అట్లా చిరకారి చిరకారిత్వంబు సఫలత్వంబు
నొంది వినుతింబొందె. ౨౯౦

క. కావునఁ, గురువంశోత్తమ,
నీవును సదసత్ప్రకార నిశ్చయము చిరం
బై వఱలఁ జేయుమీ! - యది
గావించుం జిరము లైన కార్యఫలములన్. ౨౯౧

క. విను, మచిరవృత్తిఁ జేసిన
పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం;
బనఘా, చిరభావిత శు
ద్ధినిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్. ౨౯౨

వ. అనిన విని, ధర్మపుత్రుండు: 'ప్రజల శిక్షించు వెర వెట్టిది?' - అని
యడిగిన, నాపగానందనుండు: 'దొల్లి ద్యుమత్సేనుం డను రాజు
నకు నిజతనూజుం డగు సత్యవంతుతోడ సంవాదంబు గలిగె. అది

నీయడిగిన యర్థంబునకుం బ్రకాశకం బగు. చెప్పెద నాకర్ణింపుము. వా రిద్దఱుం బ్రజాశిక్ష దెలుంగు మాటలాడుసమయంబున,— ౨౯౩

సీ. వధము ధర్మంబుగా బుధులు సెప్పుదు రని
యనుశాసనము సేయు జనకుతోడ
సత్యవంతుఁడు: 'హింస కృత్యకర్మం బగు
నేని నకృత్య మింకేది?' యనుడు,
'ముచ్చులు ప్రల్లదుల్ నచ్చువారల; యట్లు
గాకున్న బాధలు లోకమునకుఁ
బుట్టవె?' యనిన నబ్భూపతి, యమ్మాట
కతఁడు: 'సంపుట దక్క నన్యదండ

తే. విధిన శిక్ష సెల్లించుట వెరవుగాదె?'
నావుడును, బతి: 'య ట్లెల నడచు? దృష్టి
దండ వాగ్దండ ధనదండ తనువికార
దండములు—సేయునది తప్పు దర మెఱింగి. ౨౯౪

క. 'విను, చంపఁ దగినతప్పున,
కనఘా, చంపుటయు వలయు; నాప్తుఁడు బంధుం
డనుజుఁడు తనుజుఁడు నను మ
న్ననయును దుష్టునెడ రాజునకుఁ బాప మగుఁ౯. ౨౯౫

తే. 'తాను మున్ను వినీతుఁ డై, తనదుమంత్రి
వరులఁ బుత్త్రుల భృత్యుల వరుసతోడ
వినయవంతులఁ జేసి, భూవిభుఁడు ప్రజకు
రక్షణము సేయ నిహాముఁ బరంబుఁ గల్గు. ౨౯౬

క. 'దోష మరసి, కామంబును
రోషంబును లేక, తగినరూపునఁ జేయం

బోషక మగుధర్మమునకు
వైషమ్యవిహీన మైనవధము కుమారా. ౨౯౭

క. 'చంపఁగఁ జూచియు, లోభము
పెంపునఁ గ్రోధమునఁ గామపీడను మది శం
కింపక దుష్టులు గీడొన
రింపఁగఁ జూడమె? కలంక రేఁగు నహింసన్. ౨౯౮

ఆ. 'విను, మహింస పిప్రజనులకు నెల్లభం
గులను వలయుఁ; బ్రజలవలనఁ గరుణ
గలిగి వారిఁ గీడు గదురక యుండంగఁ
గాపు పతి కహింసకత్వ మనఘు.' ౨౯౯

కపిల-గోసంవాదప్రకారము.

వ. అనియె నని చెప్పిన విని, యజాతశత్రుండు తాతతో: 'అవశ్య
కర్తవ్యంబు గృహస్థధర్మంబో, పరిత్యాగంబో నిరూపించి చెప్పవే'
యనిన, నతండు: 'రెండును మాననీయధర్మంబుల. కపిలగోసంవాదం
బను నితిహాసంబు వినుము. దాన నీవితర్కంబు వినిశ్చయదశం
బొందు.' అని పలికి యిట్లనుఁ: గపిలుం డనుసంయమిసత్తముం డుత్త
మాకృతియు భీతిరహితయు నహుషసంభావితయు నగు నొక్క
గోవుం గాంచి, 'నీవు వేదస్వరూపవుగావే!' అని పలికె. అమ్మాట
వేదంబులవలని యాదరంబు లేమిం జేసి వెడలినదిగా నూహించి,
యప్పుడు గెలన నున్న స్యూమరశ్మి యనుముని సూక్ష్మరూపంబున
నగ్గోవునందుఁ బ్రవేశించి— ౩౦౦

క. 'వేదములు డాంభికత్వా
పాదనములుగాఁగ యతులు వలుకుదు; రవి స
ర్వాదరణీయంబులు; నీ
కాదరపాత్రములు గావా!' యని పలుకుటయున్. ౩౦౧

వ. అగ్గోవున కతం డి ట్లనియె: ౩౦౨

క. 'వేదములవలన నాకు న
నాదరమును నాదరమ్ము ననురెండును లే;
వేది కతంబుగ నడిగితొ
నీదుతలం పెఱుఁగునట్టి నేరిమి గలదే! ౩౦౩

వ. 'అయినను నాయెఱింగినంత సెప్పెద నాకర్ణింపుము. బ్రహ్మచర్య గృహస్థధర్మ వానప్రస్థవృత్తి పరివ్రాజనంబు లనునాలు గాశ్రమంబులును దేవయానంబులు; యత్తెరువుల నడచుట సంసారులకుం గర్తవ్యంబు గావున, ౩౦౪

క. 'వారలకు వేదవిహితా
చారంబులు వలయు; నది ప్రశస్తము; హింసా
ప్రారంభ మాచరించుట
యారయఁగా మేలొ కీడొ యంచితమూర్తీ!' ౩౦౫

వ. అనుటయు స్యూమరశ్మి యతని కి ట్లనియె: ౩౦౬

క. 'అలఘుమతిని యజ్ఞార్థం
బులుగాఁ బశువులను ధాన్యములఁ గల్పించెఁ
జలజభవుం; డది గాకయుఁ,
దలకొని యజ్ఞంబు లతఁడు దాఁ జేయఁ డొకో! ౩౦౭

క. 'విను, మజ్ఞునకును బ్రాజ్ఞున
కును గలయది దివ్యసుఖము గోరుట; దివ్య
త్వనిరూఢి యాగకరణం
బునఁ దక్కఁగ నొంటఁ గలుగఁ బోలునె చెప్పుమా? ౩౦౮

క. 'అమలిన గృహస్థధర్మో
త్తమముం గల్మషహరంబు దైవతసంభా

వ్యము లైనయజ్ఞకర్తృ
త్వము, మునివర, హింస గాఁగఁ దలఁపం దగునే!' 3౦౯

చ. అనుటయు ని ట్లనుం గపిలుఁ: 'డా త్మసుఖైకపరాయణుండు మె
చ్చునె పెఱసౌఖ్యకోటి? గతశోకుఁ డకాముఁ డసంగశీలుఁ;- డా
తని కవి యెల్ల నేటికి? మదప్రదలోకము లొల్లమిన్ సనా
తన మగుమోక్షముం గోఱలి తా విడుచున్ గృహధర్మవర్గమున్.'

వ. అనిన విని స్యూమరశ్మి యాసిద్ధప్రవరున కి ట్లనియె: 3౧౧

ఆ. 'ప్రజలు దల్లిఁ జెందుపగిది,
గృహస్థధర్మంబు నెల్లయాశ్రమములుఁ జేరి
కాదె జీవనంబు గావించుకొను గృహ
యుక్తుఁ డోపఘులకు నోడయుఁ డగుట! 3౧౨

క. 'విను, మోక్షము గార్హస్థ్యం
బునఁ గా దని యెవ్వఁ డెచటఁ బురుషుం డెవ్వం
డు నిరూపించి పలికె? స
ర్వనిధానము గృహము వేదవాక్యఫలజ్ఞా. 3౧3

క. 'అలసులు ధనహీనులు నై
సొలసి క్రియలు విడుతు;-రది విసూత్రత;- దానం
గలదే సద్గతి! వేదం
బులు విడిచి యఘుంబుపరతఁ బోవరె తండ్రీ? 3౧౪

క. 'విదితము గర్భాధానము
మొదలుగ శ్రుతికలితమంత్రములు నిర్మలసం
పద లెల్లను బ్రాహ్మణునకు
నొదవించుట దగునె శ్రుతుల నొల్లక యుండన్?' 3౧౫

ఆ. అనినఁ గపిలుఁ డిట్టు లని వివరించు: 'నా
చారములను దేవసమితి నెల్ల

భూమిసురులు దృష్టిఁ బొందింతు; రమృత మా
నంగఁ బ్రీతి నిచ్చుభంగి యొలయ. ౩౦౬

వ. అది యట్లుండె వినుము చెప్పెద- ౩౦౭

క. పాణి యుపస్థం బుదగము
వాణి యనఁగ: మూయ రానివాకి ళ్ళివి గీ
ర్వాణులకు; వీని బుధుఁడు పు
రాణపురుషరక్షకై తిరంబుగ మూయున్. ౩౦౮

తే. పుచ్చి కొనఁడు ముందటఁ బైఁడి పోఁకి యున్న;
నలుక వాఁడమియుఁ బాడువను నడువఁ దొడఁగఁ;-
డట్టి యానైష్ఠికునిచేత నడఁగ కున్నె
పాణి యనియెడువాకిలి బంధురముగ? ౩౦౯

క. ఏవిధముకాంత నైనం
దా విహారణమునకు నెపుడుఁ దార్పఁడు; తనయం
దావిష్టము భార్యావ్రత;-
మావెర వడ్డం బుపస్థ మనువాకిటికిన్. ౩౧౦

క. తనుయాత్రకుఁ గా నశనము
గొనుఁ;-బూర్ణముగాఁ గొనండు; గోరఁడు లౌల్యం
బున రానిదాని;-నమ్మెయి
ముని యుదరద్వార మోపి మూసెనకాదే. ౩౧౧

క. పలుకఁ డసత్యము; దూఱం
బలుకఁడు; బెట్టిదము గాఁగఁ బలుకఁడు; వాదం
బులకుఁ జొరఁడు; వాణి యనం
గలవాకిలి యట్టిబుధుఁడు గప్పం జాలున్. ౩౧౨

తే. ద్వారములు నాల్గు మూయంగ దక్షుఁ డైన
వాఁడ చూవె బ్రాహ్మణు!-డట్టివాని కేల

తపములును యజనంబులు దానములును
వ్రతములును వేదకింకరత్వంబు [1]దొడఁకు ? ౩౨౩

తే. ద్వంద్వములు లేక, [2]పెర్మికి వ్రస్సి పడక,
ప్రకృతివికృతులఁ గనుచుండు బ్రాహ్మణత్వ
శాలి;-యాసదాచారంబు సలుప లేని
వాఁడు ఫలకాంక్షి యై కర్మవశతఁ బొందు. ౩౨౪

వ. అని నిర్దేశించిన, గోవునం దడంగి యునికి దక్కి, సన్నిహితుండై
స్యూమరశ్మి తనపేరు సెప్పి: 'యేను ధర్మనిర్ణయం బెఱింగికొనఁ
వలసి గోవిలీనుండనై పలుకుచుండితిఁగాని యొండుగాదు. మహాత్మా,
నిన్నాశ్రయించితి. వేదంబులు ప్రమాణంబు లగుట యూఁది వర్ణా
శ్రమవిహితాచారంబులు నడపుటయుం, బరిత్యాగంబునుం గల
దెయ్యది యత్యంతవిధేయంబు సువ్యక్తంబుగా నెఱింగింపవే! నీవు
ధర్మసూక్ష్మత్వదర్శివి. ఏను శుశ్రూషకుండ. నన్ననుశాసింపు'
మనవుఁడుఁ, గపిలుండు ప్రీతుం డై యతని కి ట్లనియె: ౩౨౫

క. జ్ఞానంబు నాశ్రయించిన
వానికి నేపనులఁ గీడు వాటిల్లదు; ప్ర
జ్ఞానరహితుండు గామా
ధీనతమెయిఁ గర్మసమితిఁ ద్రిప్పునఁ జిక్కున్. ౩౨౬

క. అనహంకారుఁడు నక్రో
ధనుఁడు నతృష్ణుండు నైనతఁడు శుభ మశుభం
బను భేదముఁ బొరయఁడు; [3]విడు
పున సమతాసుఖమయత్వముం గనుచుండున్. ౩౨౭

1=తొడఁకు-రూ. తొణఁకు; తొనకు; తొలఁకు=తొట్రుపాటు; కలఁత; [2]నమునకు విలుగఁ బడక (=మిట్టిపడక.) 3=త్యాగనము.

క. విను, మెఱుఁగ గలర మీ రె
ల్లను నేకాత్మత్వసిద్ధి లాభం బెందే
ని నొకని కలవడు; నాతం
డన్నుమానింపఁ; డఖిల క్రియలుఁ బోఁ ద్రోచున్. ౩౨౮

వ. అనిన విని స్యూమరశ్మి యమ్మునివరున కిట్లనియె: ౩౨౯

ఆ. వేదశాస్త్ర సరణి విడుచు [1]టున్మార్గవ
ర్తనము; మోక్షపదము రాదు దాన
ననఁగ విందు; నంచితాత్మ, వేదంబులం
గైకొనమియ కీడు నాకుఁ జూడ. ౩౩౦

వ. నామనంబు సందియంబుఁ బాపవే యనినం, గపిలుం డమ్మ...
నితో: 'వేదంబుల నేల కైకొనకుండ వచ్చు? అవియు ...
లోకంబులకుం బ్రమాణంబులు!' అని పలికి యిట్లనియె: ౩౩౧

—•• కపిలుఁడు స్యూమరశ్మికి వేదంబులు ముఖ్యప్రమాణంబులుగాఁ జెప్పుట. ••—

క. [2]అరయంగా శబ్దంబును
బరంబు నన రెండు సూవె బ్రహ్మములు! గుణో
త్తర, శబ్దబ్రహ్మభజన
పరుఁడు పరబ్రహ్మమహితపదముం బొందున్. ౩౩౨

క. మనమున నెగ్గియుఁ గోరం;
డనసూయయు శమము దమము నతులజ్ఞానం
బును గలగృహపతి— ధర్మం
బని నడపును వేదచోదితాచారములన్. ౩౩౩

---

1=ఉన్మార్గము=తప్పుత్రోవ. 2. తా. విచారింపఁగా శబ్దము పరము అని రెండు బ్రహ్మములు గలవు. అనఁగా శబ్దబ్రహ్మము పరబ్రహ్మము అని రెండు. శబ్దబ్రహ్మ భజనము చేయువాఁడు పరబ్రహ్మపదము బొందును.

క. భూతదయయు ననహంకా
రాతిశయముఁ గలుగువిమలుఁ డపాప్రియుఁ డ
త్త్రాతురుఁడు సూవె విధులు సు
నీతము లైనను దృఢాత్మనిష్ఠకతమునన్. 33౪

క. విను, శాంతు లైనవిప్రులు
మనుజేంద్రులు- గృహమునందు మహితవ్రతసం
జనితపరిజ్ఞాననిరం
జను లై పడయుదురు సూవె శాశ్వతపదమున్! 33౫

తే. బ్రహ్మచర్యాదు లగునాల్గుఁ బాదమహిమ
గాఁగఁ బరఁగెడు; ధర్మ మొక్కటియ సూవె!
యెవ్వఁ డెందు వర్తించిన నేమి?-సకల
కర్మఫలరూపకత్వ మొక్కటియ కాదె? 33౬

క. సంతోషామృతసుఖిత
స్వాంతుం డగు నేని,- నట్టివాఁడు, గృహంబుం
గాంతారదేశమును నొ
క్కంతగ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 33౭

క. విను, తృష్ణారాహిత్యం
బున [1]నాలవునాశ్రమంబుఁ బొందుదురు మహా
జనుఁ;- లది [2]యుపనిషదుక్తం
బనక యవైదిక మనంగ నగునే నీకున్? 33౮

క. జ్ఞానము ధర్మమున కధి
ష్ఠానము; మూలంబు పరమసంతోషము; భ

1=నాల్గవయాశ్రమము-సన్న్యాసము. 2=ఉపనిషత్తు చెప్పినమాట అనక. వేద విహితము కానిది అన నగునా?=ఉపనిషత్తు చెప్పినదే వేదవిహిత మన్నట్లు.

వ్యానూనత్యాగము రూ;
పానందము పొందుకు దాని-కను వేదంబుల్. ౩౩౯

క. ఏదియుఁ దలఁప ననేవ్యము
గా దాశ్రమసమితిలోనఁ; గావున, శుచు లై
యేదాన నున్న సంసా
రోదధి యాదరికిఁ బోవ నోపుదురు బుధుల్. ౩౪౦

క. సంతోషంబున నేగతి
శాంతాత్మున కొదవు?-దాని సద్గతిగా వే
దాంతవిదులు గొనియాడుదు;-
రింత నిజము దీని నీవు నెఱుఁగు మనింద్యా. ౩౪౧

తే. వేదతాత్పర్య మారసి వేదితవ్య
మెఱుఁగువారలు వేదజ్ఞు; లిట్లు గాని
వారు వేదపాఠకులు; సర్వంబు నరయ
వేదపరినిష్ఠితము సూవె విప్రవర్య! ౩౪౨

క. త్యాగ మొక నెలవు; శమసం
యోగం బుత్తరము; దాని కూర్ధ్వము సంతో
షాగమము; మోక్షలాభో
ద్యోగికి నివి గమ్యభూము లుత్తమధిషణా. ౩౪౩

వ. అని యి ట్లుపదేశించి, ౩౪౪

సీ. వేదితవ్యం బన, విదితంబు నా, ఋతం
బనఁగ, సత్యం బన నతిశయిల్లి,
సంభృతస్థావర జంగమం బనఁగ, స
ర్వాత్మకం బన, శుభం బనఁగ వెలసి,
యవ్యక్త మనఁగ, బ్రహ్మంబు నా, నుత్తర
మనఁగ, శివం బన వినుతి కెక్కి,

ప్రభవం బనంగ, నవ్యయ మన, శాంతి నాఁ,
దేజంబు నా నెందుఁ దేజరిల్లి,
తే. క్షమ యనఁగ, నంబరం బనఁగా, ధ్రువంబు
నా, ననామయ మన నొప్పి, లీనరూప
బుద్ధి సంప్రాప్య మగుతత్త్వమునకు, వేద
మానిత బ్రాహ్మణులకు నమస్కరింతు. ३४౫

వ. అని పలుకుటయు, స్యూమరశ్మి ప్రీతుం డగుచుఁ గపిలునిం బ్రశం
సించె. ఇయ్యితిహాసంబుతాత్పర్యంబు నీవుం గనికొనుము. అని
చెప్పినం దద్దయుఁ బ్రియం బంది ధర్మనందనుండు ధర్మార్థకామం
బులు మూఁడును వేదశంసితంబులు; వీనిలో నెద్దానిలాభంబున
విశేషంబు గలిగి యుండు నెఱింగింపవే యనిన, గాంగేయుండు,
కుండధారుం డనువాఁడు నిజభక్తున కుపకారంబు సేసిన ప్రకారం
బితిహాసరూపంబునం బ్రవర్తిల్లు;నది భవత్ప్రశ్నంబునకు నుత్తరం
బై యుండు; వినుము చెప్పెద నని యప్పుడమిఱేని కి ట్లనియె: ३४౬

## కుండధారుం డనుదేవానుచరుని వృత్తాంతము.

సీ. యజ్ఞార్థ మొక్క బ్రాహ్మణుఁడు ధనార్థియై
తపము సేయఁగఁ, గుండధారుఁ డనఁగఁ
బరఁగెడు దేవానుచరుఁ డచ్చటికి వచ్చి,
'యభిలాష మేరూప?' మనుడు;'నర్థ
సిద్ధిఁ గోరెద' నని చెప్పినఁ బ్రీతి నా
తఁడు మాణిభద్రుని ధనదభృత్యు
నియతిఁ దలంప, సన్నిధి సేసె నయ్యక్షుఁ;
డతఁడు: 'మదాశ్రితుం డైన యితని
తే. ధనసమగ్రునిఁ జేయవే' యనిన, 'నెంత
ధనము వలసిన నిచ్చెద' ననియె మాణి

భద్రుఁ; డమ్మహాత్ముఁడు మర్త్యభావ మస్థి
రత్వదూషిత మనువిచారంబు పుట్టి— ౩౪౭

క. 'ధన మేటికి నీవిప్పుడు
మన మొలయఁగ వలయు? ధర్మమార్గంబున దా
నన సర్వసంపదలు నగు;' నని
నిశ్చయ మొంది వినయ మతిశయ మందన్— ౩౪౮

ఆ. యక్షవరునితోడ నవ్విచారము మృదు
వచనరచనఁ జెప్ప, వాఁడు దాని
కాత్మఁ బ్రీతిఁ బొంది, యనుమతి సేయంగ,
నధికభక్తినిరతుఁ డై యతండు— ౩౪౯

క. దేవతలను బ్రార్థించిన,
నావసుధామరునిచిత్త మాత్రపొద్ద తప
స్సేవనతత్పర మగుడు,
న్దేవానుచరునకు ని ట్లనియె నతఁ డధిపా:

క. 'అనఘా, భవదీయదయ
న్మనంబు దెలి వొందె నిపుడు నా; కే నొల్లన్
ధనము; తపంబ యొనర్పఁగ
ననుజ్ఞ సేయంగ వలయు నాదరణమునన్.' ౩౫౦

ఆ. అనిన 'నట్ల కాక యాచరింపుము ధర్మ'
మనుచు నరిగె నిర్జరానుచరుఁడు;
భూసురుండు మూలములును బత్త్రములు నా
హారములుగఁ జేసె నధికతపము. ౩౫౧

క. క్రమమున జల-పవనము లశ
నములుగఁ గొని తపము సేసినం గాయముఁ జి
త్తము మానుషంబు లగుచం
దములు విడిచి, దివ్యమహిమధామము లయ్యెన్. ౩౫౩

వ. అట్లు సిద్ధుం డగుటయు, ౩౫౪

క. 'నను నెవ్వ రాశ్రయించిన
ధన మొసఁగుదు; రాజ్య మిత్తుఁ; దద్దురితములం
దునుముదు; నను సద్గతికలు
మనమున జనియింపఁ జొచ్చె మనుజాధీశా. ౩౫౫

వ. అవ్విధంబున మహానుభావుం డై,— ౩౫౬

తే. అతఁ డతిభక్తిఁ దలఁచె దేవానుచరుని;
నపుడ యక్కుండధారుఁడు నరుగుదెంచె;
నరుగుదెంచిన నతఁడు నిజానుభావ
జనితగంధపుష్పములఁ బూజన మొనర్చి, ౩౫౭

ఉ. చక్కఁగఁ జాఁగి మ్రొక్కుటయుఁ, జయ్యన నెత్తి మనం బెలర్పఁగా
నక్కునఁ జేర్చి యి ట్లనియె నద్రివిజానుచరుండు: 'శంక దాఁ
దక్క ధనంబుఁ గామమును ధర్మముతోఁ గలయంగ నెన్నునే
యక్కట యిట్లు వేద మని! యప్పురుషార్థము నోలి మేలగున్.'

వ. అని ధర్మం బగ్గించి, ౩౫౯

క. అసుకృతము [1]గడ మెట్టి, మ
హాసత్త్వా, యోగసేవనారామత ను
ద్భాసితుఁడ వగుచు నిష్ఠా
వ్యాసంగవిహారి వగు మనామయలీలన్. ౩౬౦

క. అని యతఁడు నిజనివాసం
బున కరిగెను; విప్రవరుఁడు-మునిజనములు పూ
జనము లొనరింప, ఖేచరు
లనుమోదింప విహరించె నప్రతిహతుఁడై. ౩౬౧

1. = కడముట్టి; సాంతముగాఁ బొంది.

—• నారదప్రవర్తితం బగునితిహాసము. •—

వ. అని చెప్పి యప్పురుషవరుం డప్పాండవాగ్రజుతో వెండియు నిట్లను: ఒక్క ధర్మసూక్ష్మత సెప్పెద నాకర్ణింపుము. ఉంఛవృత్తి యగువిప్రుం డొక్కరుండు, భార్యాసహితుండై వనంబున నుండి, యజ్ఞాచరణంబునకుం దొడంగి,*యహింసా పరుండగుటం బశువిధి యుడిగి, ఫలమూలంబుల హవిస్తంత్రంబు నడపం జూచె. అది విహితాచారంబు గామి యెఱింగియు శాపభయంబునం దత్పత్ని యమ్మహీసుర వరు నెదుర నిలిచియుం బలుకకుండె. పాకశాస నాదులు హవిర్భాగంబులు గొనంగ డంగమి నగ్నియుం బచనశక్తిం దొఱంగె. అట్టియెడ నాసమీపంబునందిరుగు హరిణంబు మనుష్య వచనంబులం దత్పత్ని దూఱి, యమ్మహీసురవరు నెదుర నిలిచి, తన్ను హింసించి యాగంబు సెల్లింపు మనిన, నతం డట్లు సేయం బొమ్మనవుడుఁ, గొన్ని యడుగులు వోయి మగిడి యాకృష్ణ మృగంబు: 'నాయిచ్చుదివ్యదృష్టిం గనుంగొనుము. ఏను జెప్పినట్లు సేసిన నిన్నభినందించువారై యప్సరఃకాంతలును గంధర్వులును వీరె విమానంబుల నేతెంచినవారు—అనుటయు, నవ్విప్రుండు విలో కించి దివ్యత్వసిద్ధికై దాని హింసించువాఁ డగుటయు, దానం దదీ యతపంబునకు నుత్పాతంబులు వుట్టె. ఏణరూపంబున వర్తించు నాధర్మ దేవత యాభూదేవునకు సన్నిధి సేసి: 'నీయజ్ఞశ్రద్ధకు సంతోషించి ధర్మసూక్ష్మత్వంబు దెలుప వచ్చితి. అర్హం బగు హిం సావిశేషం బహింసావ్రతహాని జేయదు. క్రతువుగదా యని యనర్హహింస గర్తవ్యంబు గాదు'-అని నిర్దేశించి తత్పత్నీసమాధా నంబునం దపశ్శక్తి ప్రత్యాసత్తియుం జేసి, యాగవిశేషవిధానంబు వరప్రదానంబున నిర్వహించె. అయ్యితిహాసంబు నారదప్రవర్తితం బని చెప్పిన, నప్పాండమితేఁడు ప్రీతుండై— ౪ౘ౩

—•• భీష్ముఁడు ధర్మజునకు ముక్తిమార్గము దెల్పుట. ••—

క. 'పురుషుం డేమిటఁ బాపా
చరణమునకుఁ జొచ్చు? ధర్మచర్యకు మూలం
బరయఁగ నెయ్యది?-రెంటిం
బొరయం డెడ్డాన? నెట్లు-వొందును ముక్తిన్?' ౩౬౩

వ. అని యడిగిన నతనికి భీష్ముం డి ట్లనియె:— ౩౬౪

సీ. 'గంధరసాదులకాంక్ష, లోభము మోహ
ముం దెచ్చు; నద్దోషమునకు మనసు
లోనైన ధర్మవిలోపంబు వాటిల్లు;
దానఁ బాపము సేయుతలఁపు లోదవుఁ;
బ్రజ్ఞ నక్కీడులు భావించి, సద్గోష్ఠిఁ
బరఁగంగ విషయతత్పరత మాను;
నది ధర్మబుద్ధికి నాలవాలం బగు;
ధర్మాచరణములఁ దనివి సనక

తే. హృద్గతద్వంద్వముల నెల్ల నెడల విడుచు;
ననఘు, యనపాయ మగునుపాయమున ముక్తి
వడయుఁ బదపడి; యేను నీయడగినంత
వట్టు దెలిపితి ధర్మనిర్వాహి వగుము.' ౩౬౫

తే. అనుడు, 'ననపాయ మగునుపాయం బనంగఁ
జెప్పి తొక్కటి మోక్షంబుఁ జెందు తెఱఁగు;—
దానిఁ దెలియంగ నెఱిఁగింపవే, నరేంద్ర
ముఖ్య,'- యనియె నక్కురువంశముఖ్యుఁ డధిప ౩౬౬

వ. అనుటయు నమ్మహీకాంతునకు శాంతనవుం డి ట్లనియె: ౩౬౭

క. వినుము, ఘటము సేయుట సా
ధనములు లేకున్న నగునె ? ధరణిప, పూర్వం

బునిధికిఁ జనుమార్గ మపర
వనరాశికిఁ జనునె? వెరవు వలయుం దెలియన్. ౩౬౮

వ. అడిగి మేలు సేసి తాకర్ణింపుము— ౩౬౯

సీ. [1]క్షమఁ గ్రోధ, మకృతసంకల్పతఁ గామంబు,
చిరనిద్ర సత్త్వసంసేవనమున,
గాఢధైర్యమున రాగద్వేషములు, భయ
మప్రమాదమున, మోహంబు భ్రమము
వినివర్తనాభ్యాసమున, రోగములు నుప
ద్రవములు హితము మితంబుఁ గాల
యోజితంబును నగుభోజనంబున, జీవ
సందర్శనమున నిశ్శ్వాస, మఖిల

తే. విషయములు నంతవిరసతావేక్షణమున,
నిత్యసంతోషమున లోభనిరతి, కృపన
ధర్మ, ముచితకృతావేక్ష ధర్మ—మవులఁ
ద్రోవ నేర్పుట ముక్తికిఁ ద్రోవ యధిప. ౩౭౦

తే. తాను గ్రోధాదు లెడలించుఁ గాని ముక్తి
దెచ్చి యీ దోకభంగి; ముక్తికిఁ బథంబు

1. తా. క్షమ (= ఓర్పు) చేతఁ గ్రోధమును, సంకల్పము (= మనోవ్యాపారము) లేకుండుటచేఁ గామము (= కోరిక) ను, సత్త్వగుణమును సేవించుటచే దీర్ఘనిద్రను, అధిక ధైర్యమున రాగ ద్వేషములును, అప్రమాదము (= ఏమఱుపాటు లేమి; పరాకుపడకుండుట) చే భయమును, సద్వర్తనముచే మోహము (= మోజు; వలపు) ను భ్రమమును హితమును తగు మాత్రము నగు భోజనము కాలమున తనుకాలముగాఁ జేయుటచే రోగములను ఉపద్రవములను, జీవులను చూచుటచే నిట్టూర్పును, పూర్తిగ విరసత్వమును కాచుకొనుటచే ఐహిక సంబంధములగు నెల్ల విషయములును, ఎల్లప్పుడు సంతోషముగా నుండుటచే పిసినిగొట్టుతనమును, కృపచే నధర్మిష్ఠను, చేయఁదగిన క్రియ యెడల హెచ్చరిక గలిగియుండుటచే ధర్మగుణ—అవలకు నెట్టివేయ నేర్పుటయే మోక్షమున (= విడుదల) కుఁ ద్రోవ.

నగుట ననపాయ మగు నుపాయం బనంగ
వలసె నీ నేర్పు పే రిందువంశవర్య. 3౭౧

చ. అనుడు, నజాతశత్రుఁ: 'డిటు లన్నలు దమ్ములు లోను గాఁగఁ దృ
ష్ణ నఖిలబంధుకోటులను జంపెడు తెం పొలసెన్! మహాత్మ, యే
యనువునఁ దృష్ణ త్రోపు వడు?-నట్టిసమంచిత చిత్త ధర్మముం
బనుపఱుపంగఁ జాలు కలభాషణపంక్తి ననుగ్రహింపవే!' 3౭౨

క. అనుటయు, దేవవ్రతుఁ డ
మ్మనుజపతికి నిట్టు లనియె: మాండవ్యునితో
'జనకుఁడు సెప్పిన మాటలు
విను మవి తృష్ణ నడఁగించు వెరవు నొనర్చున్.' 3౭3

—•• జనకరాజ-మాండవ్యమహామునుల సంవాదప్రకారము. ••—

వ. జనకునికడకు మాండవ్యుండు వచ్చి వితృష్ణత్వశిక్షఁ గోరిన, నమ్మేది
నీశ్వరుం డాదరభరితుం డై- 3౭౪

సీ. 'అర్థముల్ దుఃఖదోషాకరంబులు; విను,
మేమిటిపై నాశ లేమిఁ జేసి
పొరయవు నను దుఃఖములు; మునినాయక,
మిథిల గాలంగ నేమియును నాకుఁ
గాలనియ ట్లుండెఁ; గామసుఖంబును
దివ్యసుఖంబును - దృష్ణ విడుచు
సుఖముఁ బోలునె? యర్థసులభతతోడన,
గోవుతోఁ బెరిఁగెడు కొమ్ములట్లు,

తే. 'తృష్ణ దానును పెరుఁగుఁ; దదీయసక్త
మమత గలుగు; మా బంధులు మా ధనములు
మా నివాసంబు లనని మమత్వ మెదఁ ది
గంబుగాఁకున్న-నింకుఁ దృష్ణాంబురాశి,' 3౭౫

క. ‘దొరకొన్న ననుభవించుచు,
దొరకొనమికిఁ జింత నొంది దురపిల్లక ని
ర్భరుఁడై యున్నను,-దృష్ణకుఁ
జొర వచ్చునె యతనిమనసు సువ్రతశీలా? ౩౭౬

తే. ‘విడువరాదు దుర్మతులకు; నొడలు ముదియఁ
దాను ముదియదు; ప్రాణాంత మైనరోగ,
మనఘు, తృష్ణ; వర్జితకాముఁ డైనతండు
దానిఁ బోఁదోచి సౌఖ్యసాంద్రత్వ మొందు. ౩౭౭

క. ‘శోక-ప్రమదాదిద్వం
ద్వాకులుఁడవు గాక శాంతి నంతఃకరణ
శ్రీకిఁ బరిరక్ష సేయుము;
నీకు వితృష్ణత్వసౌఖ్యనిత్యత గలుగున్.’ ౩౭౮

క. అని చెప్పిన నమ్ముని య
మ్మనుజపతిం బ్రస్తుతించి మనను ప్రశాంతిం
బనుపడఁగఁ బ్రీతి వీడ్కొని
చని వర్తిల్లెను వితృష్ణసరణిఁ గుమారా. ౩౭౯

—♦ పితా-పుత్ర సంవాదము. ♦—

వ. అనిన విని, ధర్మనందనుండు, శంతనునందనుతో: ‘సర్వభూతభయా వహం బగుచుం గాలం బతిక్రమించు చుండఁ బురుషుం డెద్ది యాచరించుట మేలు ? దీని మున్ను నడిగి విన్నవాఁడ, ఇది పెద్దయు విన వలయునది గావున నడిగెదం జెప్పవే!’ అనుటయు, నమ్మహాత్ముండు: ‘ఈయర్థంబు దెలియుటకు ముంద రేను జెప్పిన పితా-పుత్ర సంవాదం బనునితిహాసంబు లెస్స; అందుఁ గొన్నివాక్యంబు లప్పుడు సెప్పనియవియునుం గలవు చెప్పెద వినుము. అధ్యయన పరుం డగు నొక్క బ్రాహ్మణపుత్రుం డన్వర్థనామధేయుండు మేధావి యనువాఁడు దండ్రి కభిముఖుం డై- ౩౮౦

సీ. 'ఆయువు దఱుఁగు నంతంతకు ధీరుఁ డె
యృది సేయువాఁ?' డన్న, నతఁడు: 'బ్రహ్మ
చర్యంబు, వేదాభ్యాసనమును, సంతాన
సంపాదనంబు, యజ్ఞ ప్రవర్త
నంబును, - జేసి, వానప్రస్థధర్మంబు
నడపి, యాచరితసన్న్యాసుఁ డగుట
కృత్యం' బనుడు, 'జరామృత్యువుల్ జనన మా
దిగ వెనుతగులంగ దిగులు లేమి,

తే. [1]మీను వల దన్నుఁ బొదువుట గాన కిష్ట
వృత్తి విహరించుచుండెడు విధమ కాదె?
యెల్లి సేసెద ననక మే లిపుడ చేయు;
మనఘ,[2]వార్చునె మృత్యువు జనులపనుల? ౩౮౧

వ. అని పలికి పుత్తున కిట్లనియె, ౩౮౨

క. [3]'కృత మిది, యకృతం బిది, యిది
కృతాకృతం-బనుచు నరుఁడు గింకర్తవ్య
త్వతిరోహితాత్మహితసం
స్మృతియైనఁ - గృతాంతుఁ డతనిఁ జేర్చుఁ దనపురికిన్. ౩౮౩

క. '[4]అనఘా, మృత్యువు నమృతం
బును దేహమునందె కలవు; మోహము మృత్యు
త్వనిరూఢ; మున్నరూపుం
గను టమృతత్వోపహితము గాఁగ నెఱుఁగుమీ. ౩౮౪

---

1. తా. చేఁప తన్ను వల క్రమ్మ నని తెలియక 2. ప్రతీక్షించునా?; కాచుకొని యుండునా? 3. తా. ఇది చేయఁబడినది, ఇది చేయఁబడనిది, ఇది చేసియుఁ జేయ బడనిది అని నరుఁడు ఏది చేయవలయునని తెలివి లేక పలుచబడ చో నట్టి వానిని యముఁడు తనపురినిఁ జేర్చుకొనును 4 తా. చావు(=మృత్యువు), చాకుండుటయు (=అమృతము)-ఈరెండును దేహమునందే యున్నవి. మోహమే చావు. వను ప్రసిద్ధకారణము యథార్థస్థితిఁ గనఁగొనుట అమృతత్వము (=చావులేమి)గా నెఱుఁగుమా.

క. 'ననుబోఁటికిఁ బశుయజ్ఞం
బున హింసకుఁ దగుట దగునె భూసురవర? [1]హిం
సనరహిత మైనశాంతియు
జనమున బ్రహ్మాధ్వరంబు సలిపెద నియతిన్. ౩౮౫

క. 'యోగంబుఁ దపంబుఁ బరి
త్యాగంబును గాక యొండు లగునె హితంబుల్!
రాగమునరి దుఃఖాంటును,
ద్యాగముఁ బోలెడిసుఖంబు నరయం గలవే? ౩౮౬

క. '[2]ప్రజ యేన: కాన, నన్నుం
బ్రజ సుగతికిఁ బుచ్చు నని భరంపడి కోరం;
బ్రజ విడిచెద నాయం; దది
యజేయమును నవ్యయంబు నగుపద మిచ్చున్ ౩౮౭

ఉ. 'కావున, లోకసంక్షయము గన్గొని, యెల్లెడ నిర్మముండ వై
నీవును శాంతియున్ సమతనిష్ఠయుఁ బూని గుహాప్రవేశసం
భావన నాత్మదర్శనవిభాసివి గ' మ్మనినం, దదీయవి
ద్యావచనంబులం జనకుఁ డట్టిఁడ యై వెలిఁగెం గృతార్థతన్. ౩౮౮

క. నరనాథ, యమృత మగు ను
న్నరూపు గను దీవు, మరగు నాచెప్పినయి
ప్పరమేతిహాసవాక్యో
త్కరంబునర్థ:బు చిత్తగత మగు చుండన్ ౩౮౯

వ. అనిన విని యుధిష్ఠిరుండు: 'ఎవ్విధంబుశీలంబు గలవాఁడు బ్రహ్మ
పదంబు నొందు?' అని యడిగిన భీష్ముం డత్యాదరంబున— ౩౯౦

1. హింసకాని శాంతి అను యజనము (=యజ్ఞము) బ్రహ్మయజ్ఞమున.

2. తా. కొడుకను నేనే యగుట కొడుకు నన్ను సుగతికిఁ బంపు నని కోరను. ననుఁ గూర్చి సంతానమును విడిచెదను. అట్టి విడుపు (=త్యాగము) జయింపరానిదియు, తఱుగనిదియు నగు పదము (=మోక్షము) ఇచ్చును.

తే. అధిప, లఘ్వాశి యై యింద్రియప్రపంచ
జయము గలిగి, మోక్షార్థోక్తసారధర్మ
నిరతి నుండెడివానికిఁ బరమ మగుప
దంబు తం గోటిజన్ము చందంబు నొందు. ౩౯౧

వ. అని పలికి మఱియు నిట్లను: 'హారీతగీత' యనువాక్యసంచయం బాకర్ణింపుము. దాన మోక్షధర్మంబులు దేటపడుం; జెప్పెద: హారీతుం డన్నమునివరుండు విద్వజ్జనంబులు దనవలనం బ్రవ్రజనంబు సమీచీనప్రకారంబుగా నెఱుంగ నపేక్షించిన, ౩౯౨

హారీతుండు విద్వజ్జనుల కుపదేశించిన తత్త్వప్రకారము

సీ. వారి కి ట్లనియెః 'నిస్తారంభమతి నిలు
వెడలి కోర్కుల కెల్ల విముఖుఁ డగుచు,
జనములకీడు - వాక్చక్షు ర్మనో వర్త
నముల గూర్పక, మైత్రి సమత గరుణ
గలిగి, నిందా ప్రశంసలః ఖేదమును నుబ్బు
లేక, పాడింటను-నేకతంపు
గుడి-మ్రానిపొంతను-గుహలోన నుండుచు,
డంపకములకు వంటకములకును

తే. భోజనములకుఁ దఱి యైనప్రొద్దు గడపి,
భిక్షగొనుఁ బ్రీతి-మన్నన-పెద్దవెట్టు

1. తా. నిలుకడ యైన మనస్సున ఇల్లు వెడలి కోర్కుల కెల్ల విముఖుఁడగుచు, మాటలోను చూపునను మనస్సునను జనులకు చెడుగు చేయక, మిత్రభావమున అందఱయెడ కరుణ గలిగి, నిందకు ఖేదము, స్తుతికి మోదము నొందక, పాడుకొంపలోను-ఒక్కటిగా నున్న గుడిలోను-చెట్టుక్రిందను-గుహలోను ఉండుచు, బియ్యము మొదలగునవి దంచుకొనుటకును వంటకములకును, భోజనములకును దగినప్రొద్దు గడపి, భిక్షము గొనును, ప్రీతితోడను మన్ననతోడను ఎక్కుడుగాను బెట్టుచోటులను మాని క్రొత్త చోటికిఁ బోవు సన్న్యాసి ఎల్లప్పుడును ఆత్మానందము గలవాఁడై చరించును.

సట్టియెడఁ దక్కి, క్రొత్తగా నరుగు యతి ని
రంతరంబు నాత్మారాముఁడై చరించు.' ౩౯౩

తే. అనిన వారు కృతార్థులై యతనిఁ బ్రస్తు
తించి; రని చెప్ప విని, నరదేవవరుఁడు,
దేవతటినీతనూజుతో: 'భావశుద్ధి
కలిమి యొప్పుఁగదే!' యని పలికి మఱియు- ౩౯౪

తే. [1]రాజభావంబుతోడుసునఁ గ్రిచ్చుకొన్న
మనసుతో నుండ, కెన్నఁడో మరలి యింద్రి
యముల నిర్జించి సత్త్వాదు లవ్రులఁ ద్రోచి
యేను శాంతిసుఖంబున [2]కెలయు టనఘ! ౩౯౫

చ. అనుటయు, నాతఁ డిట్టు లను నక్కురుభర్తకు: "వేగ మేటికి?-
ఘనభుజ, యెల్లచందములుఁ గాలముతోడివ చుమ్ము! వర్ణధ
ర్మనిరతి చిత్తపాకము గ్రమంబునఁ దెచ్చుఁ; గపాయపక్వతం
బనుపడ కర్హుఁ డే లగు నృపాలకుమారుఁడు సన్న్యసింపఁగన్.'

వ. "ఇవ్విషయంబున 'వృత్రగీత' యనునితిహాసంబు గలదు వినుము:
వృత్రుండు భండనంబునం బడిన నెత్తికొని పోయి పెట్టుకొని
యున్నయెడ, నవ్యవస్థ నొందియు విషాదంబు లేక యున్న య
ద్దనుజవిభునితో శుక్రుండు: 'వైరిహృతవిభవుండ వైన నీకు మనో
వ్యథ లేమికిఁ గతం బేమి?' అని యడిగిన నతం డతని కిట్లనియె:

—•• వృత్రగీత. ••—

తే. 'కలిమియును లేమియును, విను, కాలవశగ
తములు; బోధవిహీనులం దర్ప-దైన్య

1. తా. రాజ నను అహంకారమునఁ జుట్టుకొనిన మనస్సులో నుండక, ఇంద్రియములను గెలిచి సత్త్వాది గుణములను ఆవలకు నెట్టి నేను శాంతిసుఖమునకు ఆసక్తి పడుటు ఎన్నడోగదా! 2. ఎల్లయు=చేరు; ప్రవేశించు; కలుగు; ఆసక్తిపడు; పొందు,

కలిత సుఖ-దుఃఖములఁ బెట్టుగాక, యర్థ
ములయనిత్యత యెఱిఁగినఁ గలదె వికృతి?' ౩

వ. అర్థంబుల యస్థిరత్వంబ కాదు ఆకర్ణింపుము—— ౩

క. 'దైవత మానుష తిర్య
గ్భావంబులఁ బొందుచును వికారిణి యై, భూ
తావలి దిరిగినవెంటన
వైవిధములఁ దిరుగుఁ గర్మవివశత్వమునన్.' ౪

క. 'ఏ నిది యంతయు నెఱుఁగుదుఁ గాన,
వగపు నుబ్బు నాకుఁ గలుగ;' వనుడు, 'ని
మ్మానవిహీనపుమాటలు,
దానవకులనాథ, నీకుఁ దగునే యాడన్?' ౪

వ. అని యతనిమనశ్శుద్ధి యెఱుంగుటకు నై భార్గవుండు—— ౪

క. అనఘము నీవు వొనర్చిన
విని, యతనికి నిట్టు లనియె వృత్రుఁడు: 'విజయం
బునకు నలి తపముసేయనె
మును? తత్సుకృతమునఁ గొనవె మూఁడు జగములున్? ౪

క. 'ఆయైశ్వర్యము గ్రమ్మఱ
మాయుటకుం గారణంబు, మాన్యచరిత, లే
దే యొకదుష్కృత? మది యిటు
సేయుం గా కేమి? యేల చింతింపంగన్?' ౪

క. 'విను, మనఘ, యింక సుకృతం
బునకుం జోర; దుష్కృతంబుపొంతకుఁ బో; నే
ననుపము నచ్యుతు నవ్యయు
ననంతుఁ జెందెద ననామయుత నవిష్ణున్ ౫

చ. '[1]అనిమిషనాథుతోడియని యప్పుడు గంటి ననంతు నాద్యు వి
ష్ణుని నలవోకఁ; దన్మహిమ, సువ్రత, నా కెఱిఁగింపు; కర్మసం
జనితవిశేషతం గలుగు చాయలలోపల నెద్ది యవ్విభుం
గనుటకు నర్హ? మయ్యెఱుక గల్గఁగఁ జేయుము నాదుబుద్ధికిన్.'

ఆ. అనిన, 'నట్ల కాక వినుము చెప్పెద' నని,
యసురగురుఁడు పలుకు నవసరమున,
నచటి కరుగుదెంచె నఖిలమునీంద్రస
మ్మాన్యుఁ డగుసనత్కుమారుఁ డధిప. ౪౦౭

వ. వచ్చి యభిపూజితుండై సమున్నతాసనంబున నున్నయమ్మహాత్ము నితో శుక్రుండు: 'విష్ణుమాహాత్మ్యంబును వర్ణవిశేషంబులు నిద్దానవేంద్రునకు నెఱింగింపవే' యనిన, నతండు ప్రసన్నవదనుం డగుచు నిట్లనియె: ౪౦౮

ఆ. వినుము, దనుజనాథ, విష్ణునియం దఖి
లంబుఁ గలుగు-నిలుచు-లయముఁ బొందు;
నతనిభక్తి నింద్రియజయంబునను బోలె
దానధర్మవిధులఁ గాన రాదు. ౪౦౯

వ. అవి ప్రయోజనపటుటయుం గలిగి యుండు; నదియునుం జెప్పెద. మున్ను విష్ణునిమహిమ యాకర్ణింపుము— ౪౧౦

తే. ధరణి పాదంబు; లతనికి శిరము దివము;
దిశలు బాహు; లతఁడు సర్వదేవమయుఁడు;-
[2]భూతవిక్షేప సంహారములు దదీయ
మానసస్వైరలీలలు దానవేంద్ర. ౪౧౧

1. తా. ఇంద్రునితోడి యుద్ధసమయమున అనంతుని ఆద్యుని విష్ణుని స్వేచ్ఛగాఁ జూచితిని. సువ్రతా, ఆయనమహిమ నాకెఱింగింపుము. కర్మమువలనఁ బుట్టిన విశేషత్వము (=అతిశయము) చేఁ గలుగు నట్టిజాడలలో ఆవిభుని-ఆవిష్ణునిఁ జూచుటకుఁ దగిన దేది? నాబుద్ధికి ఆ తెలివి కలుగఁ జేయుము.

2. తా. పంచభూత -పృథివి, (ఉదకము, తేజస్సు, వాయువు ఆకాశము)లను సంచలింపఁ జేయుట సంహారము చేయుట అతని మానసము యొక్క స్వతంత్రక్రీడలు.

వ. వినుము, జీవావస్థలు ఛాయ లై యుండు. [1]కృష్ణంబును ధూమ్రం
బును హారితంబును హారిద్రంబును రక్తంబును శుక్లంబును నై నవి
యాఱు గలవు అద్దశావిశేషంబులు. ౪౧౨

తే. అనఘ, విష్ణువిహారంబు లైనవిషమ
వివిధవిక్షేపసంహార వృత్తులందు
భ్రమణ మొందెడిజీవుని బహుళకర్మ
ములవశంబున నాతనిఁ బొందు చుండు. ౪౧౩

తే. తన్ను నుత్తమ మధ్య మాధమము లైన
ఛాయ లొందంగఁ బ్రచురపర్యాయవృత్తి
జీవుఁ డమరత్వముఖ్యనానావిధముల
నొంది, యెక్కుచు డిగ్గుచు నుండుఁ జూవె! ౪౧౪

క. మే లొనరింపఁగ దొరకొను
మేలిమి గలచాయ; కీడు మెయికొని చేయక-
లోలత్వరహిత, చాయకుఁ
జాలం గీడ్పాటు వొరయుచందము వచ్చున్. ౪౧౫

వ. కావున, ౪౧౬

క. [2]రసకర్మజ్ఞుఁడు దారము
పసిండి సేఁతకుఁ బ్రయత్న పరుఁడై శుద్ధ
త్వసమగ్రము సేయుక్రియ
న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయు టురున్. ౪౧౭

క. [3]విను, కుసుమంబుల వాసిం
చిన, నొప్పనికంపు విడిచి, చెందును సౌర

1. తా. ఆదశావిశేషములు ఆఱు: నలుపు, పొగవన్నెయు, పసరు, పసుపు, ఎఱుపు, తెలుపు. 2. తా. రసవాద మెఱిఁగినవాఁడు వెండిని బంగారముగా సేయుటకుఁ బ్రయత్నించి ఆవెండిని పూర్తిగా శుద్ధిచేయునట్లు వేసరుకపడక జీవునకు పరిశుద్ధి చేయుట ఒప్పును. 3 తా. వినుము, నువ్వులు-పువ్వుముల సహవాసమున వాని సహజమైన చెడుకంపును వదలి ప్రసిద్ధ మగు సువాసనను చెందును అట్లే, ఓష్ఠాష్ఠరహితుఁడై, సుకృతములచే జీవుఁడు కల్మషములేనివాఁ డగును.

భ్యనిరూఢిం దిల; లట్టుల-
యనఘా, సుకృతముల జీవుఁ డకలంకుఁ డగున్. ౪౧౮

క. అంతంతకు సత్కర్మము
లెంతయుఁ బెను పొంద జీవుఁ డెక్కుడుచాయం
జింతాకలుషము వాయఁగ
సంతోషామృతము నాని సంశుద్ధుఁ డగున్. ౪౧౯

వ. ఎక్కుడుచాయ శుక్లత్వంబు. ౪౨౦

క. జీవుఁడు శుక్లచ్ఛాయా
భావితుఁ డైనపుడు విష్ణు భావించుటకుం
దా వెరవరి యగుఁ; దద్గత
భావ మొసఁగు గఱుతు లేనిపం డగునెలవున్. ౪౨౧

వ. అనిన విని వృత్రుండు: 'అదీనంబులు నమృతస్వరూపంబులు నగు భవదీయవచనంబులు వినికిం జేసి విశుద్ధుండ నైతి.' అని పలికి, ప్రాణంబులు విడిచి విష్ణునిం బొందె' నని చెప్పుటయు, నప్పాండవేయాగ్రజుండు: 'వృత్రునివిజ్ఞానంబును విష్ణుభక్తియునింతయొప్పునే!' యని యగ్గించి, 'యతండును నాఖండలుండును భండనంబు సేసిన తెఱం గెఱింగింపవే!' యనుటయు, ననిమిష నదీనందనుం డతని కిట్లనియె: ౪౨౨

## ఇంద్ర-వృత్రాసురుల యుద్ధ ప్రకారము

సీ. ఇంద్రుఁ డుజ్జ్వలరథం బెక్కి దేవానీక
సహితుఁడై వృత్రుపైఁ జన, నతండు
దనుజసైన్యముఁ గొని తాఁకెఁ; దత్సంగర
మహ్వాసవునకు భయం బొనర్చెఁ;
బర్వతప్రతిమరూపమున నయ్యసురయు
గ్రతఁ జూచి, వడఁకుడై వతకు లేంద్ర

నద్దానవుండు మాయాబలంబున మోహి
తునిఁ జేయ సాగయుడు, మునిసమాజ
తే. సంస్తుతముగ రథంతరసామశక్తిఁ
జేసి యమ్మూర్ఛ దేర్చి, వసిష్ఠుఁ డతని
తోడ: 'నజుఁడును హరియు రుద్రుండుఁ బోరు
గనుఁగొనంగ వచ్చినవారు గడఁగు' మనుడు— ౪౨౩

వ. అతఁడు గడంగ, దేవగురుఁ డప్పు మునీంద్రులుఁ దాను సమ్మరు
త్పతివిజయంబు గోరి హరుఁ బ్రార్థన సేయఁ, దదీయతేజ ము
ద్ధతచటులజ్వరం బగుచు దైత్యపతిం బొదివెన్; సురేశ్వరో
ద్యతకులిశంబుఁ బొందె హరి, తత్సమయంబునఁ గౌరవేశ్వరా,-
తే. ఇంద్రునకు రుద్రుఁ డత్తఱి నిట్టు లనియె:
'ననఘ, యఱువదివేలు దివ్యాబ్దములు మ
హాతపం బొనరించె నీయసుర; వీని
కొసఁగెఁ బద్మజుఁ డధికమహోగ్రబలము.' ౪౨౪

క. అని చెప్పి, 'యబ్బలము నా
ఘన తేజముచేత నడఁగుఁ; గడఁగు' మనుడు, న
య్యనిమిషనాథుఁడు వజ్రం
బున వైవ నతండు వడియె మునిగణ మలరన్. ౪౨౫

క. సుర లార్చిరి; తూర్యంబులు
మొరసె ననేకంబు;- లపుడు మోదమున మునుల్
హరిహరులం గీర్తించిరి;
సురేంద్రు నగ్గించి రధికశుభవాక్యములన్. ౪౨౬

క. విను, విష్ణునిసంస్పర్శం
బున నప్పుడ చూవె కనటు వోయిన నతనిం
గనుటయు, శాంతిం బొందుట
యును, కురువర, కలిగె వృత్రునుల్లంబునకున్! ౪౨౭

వ. అని పలికి భీష్ముండు వెండియు నవ్విభున కిట్లనుః అట్లు వృత్రుని
జయించి, ౪౨౯

చ. హరునకు మ్రొక్కి, 'మీకరుణ నార్తిదొలంగి యనూనసౌఖ్యముం
బొరసితి' నంచు వీడుకొని పోయె మహేంద్రుఁడు;బ్రహ్మహత్యయా
సురపతి నప్పు వెన్కొనియెఁ, జొచ్చె బిసాంతర మాతఁ; డందునుం
బరిగొని యుగ్రవృత్తి[1]నది పట్టెఁ జలంబున నమ్మహాత్మునిన్. ౪౩౦

ఆ. బ్రహ్మహత్య దన్నుఁ బట్టిన నమరేంద్రుఁ
డజునికడకు నేఁగి ప్రార్థనంబు
చేసి, దీనిఁ బాయఁ జేయవే! యన నతం
డది దొలంగఁ జేయు ననువు దలఁచి, ౪౩౧

వ. అగ్ని నోషధి వృక్ష తృణంబులను వనితాజనంబులను దలంపున
రావించి, వృత్రుని వలన వాసవునకుం బాటిల్లిన బ్రహ్మహత్య
చతుర్భాగంబులు సేసితి; మీర లొక్కొక్కపాలు గైకొనుం డని
పనిచె. పనిచిన వారుః 'దేవా, నీపంపు సేసెదము. మాకు నిష్కృతి
యెట్టిది? దాని నీదివ్యచిత్తంబున నవధరింప వలయును' అని పలికిన,
నగ్నికిని నోషధి వృక్ష తృణంబులకును వనితాజనంబులకును జలం
బులకును వరంబులుగాఁ గ్రమంబున,-'నీవు ప్రజ్వలింపక హవిః ప్రదా
నంబు సేయువాని యందును, మీకుఁ బర్వకాలంబుల భేదనచ్ఛే
దనంబు లాచరించువానియందును, మీరు రజస్వలలై యుండ
మీతో సురతంబు సలుపువానియందును, మీలో మలమూత్ర
శ్లేష్మంబులు విడుచువానియందును,- మీ మీకడనున్న బ్రహ్మ
హత్య ప్రవేశింపం గలయది.' అని నిర్దేశించిన దానికిం బ్రియం
బంది యగ్నిప్రముఖంబులు శతమఖు బ్రహ్మహత్యపాళ్ళు ధరి
యించిరి. ఇట్లు విరించిప్రసాదంబునం గల్మషంబు దొలంగి

1=ఆబ్రహ్మహత్యాపాపము చలంబున(ఊపఁగొని)పట్టె.

యాఖండలుండు జదనుమతి నశ్వమేధంబుసేసి, నాకసామ్రా
జ్యంబున సర్వలోకపూజ్యత్వంబు నొంది వెలింగె-నని చెప్పి
వెండియు ని ట్లనియె: ౪౩౨

తే. ఒదపువృత్రు రక్తమున బుద్బుదము లెసఁగి
పుట్టకొక్కు-లై యవి జనభోజ్యభావ
మొంది విప్రాదికద్విజయోగ్యతాభి
పన్నములు గావు ధర్మసంపన్నచరిత. ౪౩౩

క. ఆవాసవుచందంబున
నీవును శత్రుజయకీర్తనీయుఁడ వగుచుఁ
భూవిబుధుల కెపుడుఁ బ్రేమా
దావహుఁడవు గమ్ము భారతాన్వయముఖ్యా. ౪౩౪

తే. పర్వములయందు, విప్రసభను సభక్తి
కంబుగా నెవ్వ డీశక్రకథ బఠించు-
వానిఁ బాపము లొందదు, మాననీయ
ధర్మములయందు రతుఁ డగు, ధర్మతనయ. ౪౩౫

వ. అనిన నతండు ప్రీతుం డై: 'వృత్రుండు జ్వరంబుచేతం బాదువం
బడియె నని వింటి. దానిజననంబుసు దత్ప్రకారంబును నెఱింగింపవే!'
యనుటయు, భీష్ముం డాభూపతి కి ట్లనియె: ౪౩౬

—•• దక్షుమఖధ్వంసంబునప్పుడు శివునివలన జ్వరం బుద్భవించిన ప్రకారము. ••—

సీ. రజతాచలంబున రత్నతటంబున
నంబికాసహితుఁ డై హరుఁడు- పేర్మి
నమరమునీంద్రయక్షాదులు గొలువంగ
నుండు; న ట్లుండంగ నొక్క-నాఁడు
దేవర్షి కోటు లతిప్రమదంబునం
జనఁ, జూచి: 'వీ రేమి పనికి జనెరి

కరిగెద?' రని పతి నడిగె భవాని; యా
తఁడు: 'దక్షుచేయు నధ్వరమునందుఁ

తే. దమహావిర్భాగములు గొనుదాని'కనినఁ,
బాలఁతి:'నీ వేల పో?' వనుపలుకు వలికె;
'నాకు మును భాగపరికల్పనంబు లేమి,
నతఁడు బిలువఁ; డేను బోవ'-ననియె భవుఁడు. ౪౩౭

క. తనపతికి భాగకల్పన
మొనరింపఁడు దక్షుఁ డని మహోగ్రపుఁగోపం
బున బొమలు ముడివడఁగ, న
వ్వనిత పలుకు మాని యుండె వసుధాధీశా. ౪౩౮

సీ. దేవిచిత్త మెఱింగి దేవుండు, ప్రమథసం
ఘంబును, దాను నాక్రతువు సెఱుప
నరిగె; యజ్ఞాంగంబు లన్నింటిఁ బ్రమథులు
గాసిసేయుచును రక్తములు సల్లి
యార్పంగ, మృగరూప మై గగనంబున
కెగసె నధ్వరము; మున్నీశు నుదుట
నలుకఁ బుట్టిన ఘర్మజలకణ మిలఁ బడ్డఁ,
బెనుమంట లెగసిన, జనితుఁ డయ్యె

ఆ. నందుఁ బురుషుఁ డొకరుఁ; డరుణనేత్రకము నీ
లంబు, నూర్ధ్వరోమకంబు-ఘోర
భంగికంబు నై నయంగంబుతో 'సప్త
తంతుదాహి యగుచు ధరణినాథ. ౪౩౯

క. సురలు మునులు భయమునఁ బఱ
చిరి నలుగడ; బ్రహ్మవచ్చి శివుఁ గని వినమో

1 -యజ్ఞమును ధ్వంసము చేయువాఁ డగుచు.

త్తరముగ మ్రొక్కుచు, 'నమరులు
పరికల్పించెదరు నీకు భాగము భక్తిన్ ౪౪౦

వ. 'స్వామీ, కోపం బుపసంహరింపుము.' ౪౪౧

క. నావుడు, నల్ల నగుచు న
ద్దేవుఁడు గరుణించి, మునుల దేవతలను సం
భావింప, భాగకల్పన
గావించిరి వార లాజగత్ప్రభువునకున్. ౪౪౨

వ. అప్పరమేశ్వరుండు సుప్రసన్నుండై, యనిమిషులకు మునిగణంబులకు నానందం బొసంగె. శతానందుం డయ్యిందుశేఖరునితో: 'దేవా, నీ నుదుటిచెమటం బుట్టిన యప్పురుషుండు జ్వరం బను నామంబునం బ్రశస్తుం డయి ఎందును జరియించు. ఈజ్వరం బేక ముఖత్వంబునం బృథివికి దుర్భరంబగు; బహువిధంబుగా సృజియింపవే!' యనుడు, నగ్గిరీశుండు [1]గరులకు శిరస్తాపనంబును, [2]భుజంగంబులకు నిర్మోకంబును, [3]గోవులకు ఖురాంతర్బాధనంబును, [4]మృగంబులకు నైజస్వరూపదర్శనప్రత్యవరోధనంబును, [5]తురగంబులకు పార్శ్వశోషణంబును, [6]మయూరంబులకుఁ బత్త్రోద్భేదనంబును, గోకిలంబులకు నేత్రరోగంబును, [7]శుకంబులకు హిక్కయు, [8]అజంబులకుఁ జిత్తభ్రమణంబును, శార్దూలంబులకు శ్రమంబును, మనుష్యులకు జననమరణాదులయెడ వేదనావేశంబునుంగా విభాగించె- ఇవి జ్వరప్రకారంబు. జ్వరంబు మాహేశ్వరం బగు తేజంబు గావున సర్వజనంబులకు నమస్కార్యంబును మాననీయంబును నైయుండు.

---

1=ఏనుఁగులకు తలవేఁడిమియు, 2=పాములకు కుబుసంబును, 3=ఆవులకు గొరిజలలో నొప్పియును, 4=నాలుగుకాళ్లుగల మృగములకుఁ దమరూపము తాము చూచుకొనుటకు అడ్డగింతయు, 5=గుఱ్ఱములకు డొక్కలెండుటయు. 6=నెమళులకు ఫింఛముచీలికలును, 7=చిలుకకు ఎక్కిళులును, 8=మేకలకు నిలుకడలేని మనస్సును.

క. జ్వరకథ వినినఁ బఠించినఁ
బురుషుం డారోగ్యసిద్ధిఁ బొందలుం, దేజ
స్స్ఫురణముఁ జిత్తసమాధియు
దొరకొనుఁ, గోర్కులు ఫలించు, దురితము లడఁగున్. ౨౨౪

క. అని చెప్పి యమరతటినీ
తనూభవుం డాదరమున ధర్మసుతునితో:
'ననఘా, నీవిం కెయ్యది
వినవల?' తనవుడు, నతండు వినయానతుఁడై— ౨౨౫

—♦ శాస్త్రతత్త్వం బెఱుంగనివాఁడు సేయఁవలసిన విధము ♦—

తే. 'శాస్త్రతత్త్వ మెఱుంగక సంశయాత్ముఁ
డగుచుఁ, బరమార్థ మిట్టిది యనఁగ లేని
యట్టివాఁ డేమికర్మంబు నాచరించు
వాఁడు సెప్పవె ధర్మప్రవర్తనజ్ఞ'. ౨౨౬

వ. అని యడిగిన నమ్మహామతి యతని కిట్లను: గురుపూజయు, వృద్ధో
పసేవనంబును, విద్యాశ్రవణంబును నవశ్యకర్తవ్యంబులు. మఱియు
నుం జేయవలయు నవి నారద-గాలవసంవాదంబు వినినం దెలియు.
వినుము, చెప్పెద: నారదు నాశ్రయించి గాలవుండు— ౨౨౭

క. నానాశాస్త్రంబుల నర్థానేకత్వంబు గనుచు నప్రాప్తసువి
జ్ఞానపరినిష్ఠ మగు మన్మానసముం దేర్పవే సమగ్రవివేకా. ౨౨౮

వ. అని యభ్యర్థించిన నద్దేవముని యమ్మహాద్విజున కిట్లనియె: ౨౨౯

క. చతురాశ్రమముల వృత్త
స్థితులు పరీక్షించి, యందుఁ జెందఁ దలఁచి, త
ద్గతిసూక్ష్మదృష్టిఁ గనుఁగొని,
సతతంబుఁ ద్రివర్గచరిత సౌమ్యుం డగుచున్— ౨౩౦

తే. పాపకర్మంబు లెల్లను బాయఁ బెట్టి
పుణ్యకృత్యంబు లగువాని బురుషుఁ డోపి
నట్లు శుద్ధమనస్కుఁ డై యాచరించు
వాఁడు; - సజ్జనసంగతి వలయు నెపుడు. ౪౫౧

క. విను, సర్వభూతములయం
దును మార్దవయుక్తుఁ డై మధురవాగ్వృత్తిం
బనుపడఁగ వలయు నార్జవ
మనూనముగ దేవపితృసమర్చకుఁ డగుచున్. ౪౫౨

క. అనహంకారము, నప్రా
ర్థనమును, విషయములఁ బెద్ద దగులమియును మేఁ
లనఘా, పరు నిందించుట
దను వర్ణించుకొను టనుచితము లెయ్యెడలన్. ౪౫౩

క. విను, మలసుండును గర్వియు
ననర్థభాషియును మత్సరాలీఢుఁడుఁ గ్రో
ధనుఁడును గా వలవదు; శ
క్త్యనురూపతఁ జేయ వలయు నాతిథ్యంబున్. ౪౫౪

క. వేదాధ్యయనంబుఁ, దదం
గాదరణము, యజ్ఞవిధిసమారంభము, ధా
త్రీదైవతసమ్మాననము-
నేదేశమునందుఁ గలుగు,- నిర వది నిలువన్. ౪౫౫

క. ఇత్తెఱఁగునఁ బురుషుం డ
త్యుత్తమచరితముల నడచు చుండఁగఁ బాయుం
జిత్తంబుకలఁక; బోధో
త్పత్తికి నదిమూల మగు నధర్మవిదూరా- ౪౫౬

క. అని చెప్పె ననుడుఁ, గుంతీ
తనయాగ్రజుఁ డమరతటినీతనయునితో ని

ట్లనుఁ: 'గాలపాశసంఛే

దనమును ననుబోఁటి యెవ్విధంబునఁ జేయున్?' ౪౫౭

వ. అని యడిగిన నతం డతని కిట్లనియె: ౪౫౮

—♦ అరిష్టనేమి యనుముని సగరున కుపదేశించినధర్మప్రకారము. ♦—

ఆ. విను, మరిష్టనేమి యనుముని నడిగె నీ

యడిగినట్ల సగరుఁ; డమ్మహాత్ముఁ

డన్నరేంద్రునకుఁ బ్రియంబునఁ జెప్పిన

సౌమ్యవాక్యములు ప్రశాంతిఁ జేయు. ౪౫౯

వ. వానిం జెప్పెద నవహితుండవై వినుము: సగరుం బ్రబోధించుటకు నరిష్టనేమి యిట్లను: ధన ధాన్య పశు కళత్ర పుత్త్రాదుల సందడిం బడి డెందం బాకులం బగునేని ముక్తిమార్గము దుర్గమమైయుండు.

సీ. వృద్ధకళత్రంబు బుద్ధిమత్పుత్త్రుల

విడిచి నిర్భరత [1]వివిక్తదేశ

మునకుఁ బోవలయు; సపుత్త్రుం డపుత్త్రకుం

డనువిశేషంబు లే దతులశాంతి

వైరాగ్యములు గలవానికి; విను, నృప

వర్య, బంధులఁ బ్రోవ వలదె యనుత

లంపున సంసారలంపటుం డగువాఁడు

బేల; దా మృత్యువుపాలు వడిన

ఆ. యపుడ వారి నరయ నబ్బునే? యద్దశఁ

దలఁచి ముక్తి గోరఁ దగదె? యట్లుఁ

గాక తనకు వారు గలుగుదురే యప్పు?

డదియుఁ దలఁప వలయునది యు కాదె? ౪౬౦

తే. భూతములపుట్టుఁ, జేష్టయుఁ, బోలియుటయును

జూచు నేర్పు గలుగువాఁడు సూడ నేర్చు

---

1 ఏకాంతస్థలమునకు...

మోక్షమార్గంబు; చిత్తంబు మూఢ మైన
సక్తుం డగు లోకగతి; నెట్లు ముక్తి కలుగు? ౪౬౨

క. అనఘు, [1]దురన్నము-శాలో
దనమును, భూమియు రు—మృదులతల్పము, నజిన
మ్మును-సురుచిరచీనాంబర
మును—సరి యెవ్వనికి?-నతఁడు ముక్తిం బడయున్. ౪౬౩

తే. [2]నేల యెల్లను నేలిన నృపులపుట్టు
నీఁగిపోకయుఁ, జూ పాదిగాఁగఁ గలుగు
శక్తు లెడలినఁ జెడుమేని చందమును—ద
లంప నేర్చు నతఁడు మోక్షలక్ష్మిఁ జెందు. ౪౬౪

క. ధనయోగము దుర్లభ మని
యును, క్లేశము సులభ మనియు నూహించుచు, నె
మ్మనమున మర్త్యత్వము గీ
డని యెఱుఁగు నతండు గను మహానందంబున్. ౪౬౫

క. కానన గృహస్థవృత్తిన్
నీ వతిలోలుఁడవు గాక నెఱిఁ జేయుము;ర
క్షావిధి ధరణీప్రజకుం;
గైవల్యము దాన నీకుఁ గలుగుం జులుకన్. ౪౬౬

క. అని బోధించిన సగరుం
[3]డనయముఁ దెలి వొంది నియతుఁ డై ప్రజ రక్షిం
చె; నరేంద్ర, నీవుఁ దద్వ
ర్తనమున నెగడుము జనాభిరంజన మొప్పన్. ౪౬౭

1=మడ్డికూడు-వరిబువ్వ...2=తా. భూమియెల్లపాలించిన ప్రభువులు శరీరమును వదలిపోవుటయు, రూపు మొదలైన శక్తులుడిగిపిమ్మట చెడునట్టి దేహము విధమును తలంప చెప్పువాఁడు మోక్షమును బొందును 3=అత్యంతము.

తే. అనినఁ బ్రియ మంది పాండవేయాగ్రజుండు
ధర్మవిద్వేషపరు లగుదానవులకు
మంత్రి యైయుండుశుక్రత్వ మహిమ యెట్లు
గలిగె భార్గవునకుఁ బుణ్యగణ్యచరిత? ౪౬౮

—◆ శుక్రనామంబు భార్గవునకుం గలిగినవిధము. ◆—

చ. అనవుడు, భీష్ముఁ డి ట్లనియె: నాతఁడు యోగబలంబుపెంపునన్
ధనదుని మోసపుచ్చి తదుదాత్తధనం బవలీలఁ గొన్న, నె
మ్మనమున నొచ్చి చెప్పెఁ బురమర్దనుతోడ నతండు; దానికిం
గనలున నమ్మహేశ్వరుఁడు కన్నుల నిప్పులు రాలు చుండఁగన్—

తే. శూల ముగ్రత నెత్తి 'యెచ్చోట నున్న
వాఁడు భార్గవుఁ?' డనుచు దుర్వారకోప
వివశుఁ డగుటయు, నాతఁడు వెఱచి చాల
దూరముగఁ బోయి తుప్పలఁ దూరియుండె. ౪౭౦

క. అమ్మెయి నిలుచుటకును జి
త్త మ్మొర్వమిఁ, దల్లడంబు దనికినఁ గడు వే
గమ్మున త్రిపురహరునిహ
స్తమ్మునఁ జొప్పడియెఁ; గని యతఁడు వెస మ్రింగెన్. ౪౭౧

ఆ. కడుపులోననుండి కలగొన బాటెడు
విబుధవైరిగురుఁడు వెడల కుండు
నట్లుగాఁగఁ దెరువు లన్నియు మూసి శి
శ్నంబు మూయ కంగజన్మరిపుఁడు— ౪౭౨

క. 'వెడలు' మని తెరువు సూపిన
వెడలెను భృగునందనుండు; వెండియుఁ గోపం
బడరఁగ నాతనిఁ గనుఁగొని
యెడురుద్రునిఁ జూచి, దేవి యి ట్లనియె నృపా: ౪౭౩

క. 'నీకడుపున జన్మించుట
నాకుం గొడు కయ్యెఁ నితఁడు; నాసుతునకు, సు
శ్లోకా, యలుగం దగునే
నీకు? సుఖం జేయు మీతనిం గృపతోడన్'. ౪౭౪

తే. అనినఁ, దేజస్విఁ జేసి, చంద్రార్ధమౌళి:
'శిశ్నమున నిర్గమించుటఁ జేసి యితఁడు
శుక్రుఁ డను పేర వర్తించు; సుదతి, నీకుఁ
బ్రియ మొనర్చితి'-ననియె సంప్రీతితోడ. ౪౭౫

తే. 'అనఘ, యిది భార్గవుఁడు శుక్రుఁ డైన తెఱఁగు'
నావుడును, ధర్మజుఁడు శాంతనవునితోడ:
'నీదువాక్యామృతమున నా నెమ్మనంబు
తృప్తి సనదు సద్ధర్మంబుఁ దెలుపు'-మనియె. ౪౭౬

వ. అనవుడు, నమ్మహానుభావుం డమ్మహీనాథుతో: 'పరాశరగీతా
శ్రవణ ప్రవణుండ వగుము. అది ధర్మప్రబోధకం బగు' నని పలికి
యి ట్లనియె: ౪౭౭

—♦ జనకునకుఁ బరాశరముని యుపదేశించిన ధర్మప్రకారము. ♦—

సీ. జనకభూపతి యడిగినఁ బరాశరముని
ధర్మసంబోధనతానిరూఢి
ని ట్లని యెఱిఁగించె: నిహపరసౌఖ్యముల్
ధర్మకార్యము లని తలఁచి, నరుఁడు
ఫలము బీజంబునం బడయునట్టుల ధర్మ
మున సౌఖ్యసంసిద్ధిఁ బొందవలయు;
సుకృత-దుష్కృతములు— సుఖమును దుఃఖంబుఁ
గుడువఁ జేయక నరు విడువ వధిప;

తే. వాఙ్మనోదృష్టికలితప్రవర్తనములఁ
గాయచేష్టితములను నన్యాయపథముఁ
బొరయ నీకున్న సత్పథనిరతి గలుగు;
సత్య శమ దమాహింసలు సత్పథములు. ౪౭౮

క. [1]అనఘుం డింద్రియహయభృత
మనోరథరథంబు నాఁగు మహితజ్ఞాన
త్వనిరూఢరశ్మిశక్తిని,
జననాయక, దుష్పథమునఁ జన కుండంగన్. ౪౭౯

ఆ. పడయ రానియాయు వొడలికిఁ గలిగినఁ
బాపకృతుల దానిఁ బడటఁ గలుప
నగునె,- పుణ్యవిధిసమాచరణముల గై
సేయ వలయుఁగాక చెలువు మిగుల. ౪౮౦

క. [2]దురితంబులు దొడరుమహిత
కరణంబున మేలు వడయఁ గాఁ గోరుట,-భూ
వర, దుస్సలిలస్నానా
దరము తెఱఁగు సూవె యెవ్విధంబునఁ దలఁపన్! ౪౮౧

క. సమదర్శి యై యఖిలభూ
తములను దనయట్ల కాఁగఁ దలఁచుచు నెవ్వం
డమలన్యాయపరుం డగు,
నమరు లతని వందనీయుఁ డంద్రు నరేంద్రా. ౪౮౨

క. ధన మించుకేని ధర్మం
బునఁ బడసినయట్టి దైన, భూవర, పాత్రిం

1. తా. పాపరహితుఁడయినవాఁడు, ఇంద్రియము లనెడి గుఱ్ఱములు కట్టఁబడిన మనోరథ మను రథమును దుర్మార్గమునఁ బోకుండ విజ్ఞాననిరూఢత అను పగ్గములచే ఆఁపును. 2. తా. పాపములు సంభవించుపనులచే మేలువడయఁగోరుట మురికినీట స్నాన మాడుటవంటిది.

బున నిడిన, నది మహాఫల
జనకం బగు నం(డ్రు వేదసంవేదిజనుల్. ౪౮౩

తే. మునులఋణ మధ్యయనమున, ననిమిషుల ఋ
ణంబు క్రతువున, నతిథిఋణంబు పూజఁ-
దీర్చునది ; శ్రాద్ధమునఁ బితృదేవతలఋ
ణంబు ; సరులఋణము రంజనవ్రతమున. ౪౮౪

క. నారద పర్వత దేవల
భారద్వాజాదు లైనపరమమునులు ధ
ర్మారంభంబునఁ బడసిరి
గారవ ; మ ట్లగుట ధర్మకరణము వలయున్. ౪౮౫

క. విను, సత్యంబ డగు నసత్యం-
డనఘా, విష్ణుస్తుతిక్రియం, దపమున, ధ
ర్మనిరూఢి ;— నివి మనంబున
ఘనపరిబోధంబుఁ గూర్చుఁ గావున నధిపా. ౪౮౬

ఆ. ఆహితాగ్నిఁ బుణ్యుఁ డను శ్రుతి: జననియు
జనకుఁడును గురుండు సద్గతియును
దేజమును బలంబు ధృతియును బుద్ధియు
నగ్ని యగుటఁ జేసి యమలచరిత్ర. ౪౮౭

తే. సుజనసంగతి గృత్యంబు ; గుజనుఁ డైన
దాన నిర్మలుఁ డయ్యెడుఁ ; గాన వినుము,
శూద్రజాతి భూదేవశుశ్రూషఁ గాదె
యిహముఁ బరమును బడయుట మహితవృత్తి ? ౪౮౮

1. తా. తల్లియు తండ్రియు గురువు సద్గతియు తేజము బలము ధైర్యము బుద్ధియు అగ్నియే యగుట నిరంతరము అగ్నిహోత్రము వేల్చువానిని పుణ్యాత్ముఁడు అని శ్రుతి యనుచున్నది.

క. అనఘా, మర్త్యులజీవన
మనిత్య మని యెఱిఁగి, సుఖమునప్పుడు దుఃఖం
బునయపుడు ధర్మ మేమఱ
కునికియ యెజ్ఞాతి కైన నుర వూహింపన్. ౪౮౯

తే. పాప మించుక దొడరినపనియు నెట్టి
ఫలము గలిగిన వల ; దల్పఫలవిధాయి
యైనపుణ్యమిశ్రితకార్య మాచరించు
నది ; శివం బగు దాన నిహమ్ముఁ బరము. ౪౯౦

తే. [1]యజ్ఞపరుఁడు, రక్షకుఁడు, నుపార్జకుండు,
విప్రశుశ్రూషకుఁడు—గాని విప్ర రాజ
వైశ్య శూద్రులు—దక్కటివాని నెట్టి
ధర్మములఁ జేసిరేని నధర్మపరుల. ౪౯౧

ఆ. ధర్మలబ్ధ మైనధనము పాతిక యేని
బహుళఫలము నిచ్చుఁ ; బాపవృత్త్య
పార్జితంబు కోటి యైన నిష్ఫల మండ్రు
దానశాస్త్రవిదులు మానవేంద్ర. ౪౯౨

క. నృపధర్మ-వైశ్యధర్మము
లపాపకర్మములు జీవనాభావముపా
లుపడిన బ్రాహ్మణునకు ;- నర
కపాత మగు శూద్రకర్మ కర్తృత్వమునన్. ౪౯౩

క. రాజునకును ధర్మము శ
స్త్రాజీవిక యొకఁడ, వైశ్యుఁ డాపద యైనన్-

1. తా. యజ్ఞములు సేయని బ్రాహ్మణుఁడు, రక్షకుఁడు గాని రాజు, పదార్థములు గడింపని (సంపాదింపని) వైశ్యుఁడు, విప్రులకు శుశ్రూష సేయని శూద్రుఁడు— కడమ ఎట్టిధర్మములను చేసినను వారందఱు అధర్మపరులే.

రాజవర, మధువు మాంసముఁ
[1]దా జట్టి యిడఁగఁ బొందు దౌర్గత్యంబున్. ౪౯౪

క. జనవర, కృషిఁ బశుపాలన
మున నేనియు బ్రదుకు ధర్మముగ నార్యులు శూ
ద్రునకు విధింతురు జీవన
వినాశమున, [2]వాన వృత్తివినిహత గామిన్. ౪౯౫

సీ. విను, తొల్లి ధర్మవర్తనము లసహ్యంబు
లైన, దానవులు మహాగ్రహమున
నరులయం [3]దెలసిన, నరవర, వారలు
దర్పరోషముల నధర్మవృత్తిఁ
దగిలినఁ,- గలఁగె వేదములును గ్రతువులు;
సురలు విషణ్ణు లై పురహరునకు
నంతయు నెఱిఁగింప, నతఁడు త్రిశూలంబుఁ
బనుప, దైత్యావిష్టభావ మడఁచె

తే. నది; మహామునుల్ మృడ నిఁ బ్రజాభిరక్ష
ణమునకై నిల్ప, శ్రుతులు జన్నములు దొంటి
చందమునఁ జెల్లె నమరులు సంతసింప;-
ననఘ, నీవును బాలింపు మట్ల ప్రజల. ౪౯౬

క. అని చెప్పి తపము పెంపును
వినిపించుట కిట్టు లనియెః విద్యాధర స
న్మాని దేవతాగణంబులు-
వినుతతపంబునన మహితవిభవముఁ బొందెన్. ౪౯౭

---

1. = వైశ్యుఁడు అమ్మకమునకుఁ బెట్టినచో దుర్గతిఁ బొందును 2 = వాని (=అకృషిచే పశుపాలనమున) చేవృత్తి (=బ్రాహ్మణసేవావృత్తి) భంగము కాదు కావున-
3. = చేరఁగా.

చ. కమలభవుండు దాఁ దపము కల్మినకాదె సృజించె నెల్ల లో
కములను? నాదిరాజు లధికం బగుపెంపు వహించు టెల్ల ను
త్తమతప మాచరించుటన; తద్దయుసౌఖ్యకరంబు లైన భో
జ్యములును గంధమాల్యములు శయ్యలు భవ్యతపఃప్రభూతముల్.

తే. దార ధన మిత్త్రి పుత్త్రికాద్యంబు లగు ప
దార్థముల సంగమునఁ జిత్త మలఁతఁ బొంది,
విసివినప్పుడు నిర్మల విపులతపము
గారణం బగు నుపశాంతికలిమి కనఘ. ౪౯౯

క. విను, లోభము సంతోషం
బును దుఃఖ-సుఖప్రదములు పురుషున; కవి సం
జనితము లగుట తపము లే
కునికిని గలుగుటను జూనె యుర్వీనాథా! ౫౦౦

తే. అనఘ, సుఖ-దుఃఖములు వచ్చినపుడు మదవి-
షాదములు లేక, సంప్రాప్త సముపభోగ
రతుఁడు నప్రాప్యవాంఛానిరాసకుండు
నగుట, సారతపోరూప మండ్రు బుధులు. ౫౦౧

క. వరధర్మము నర్థంబును
సరసం బగువిషయసుఖము సద్గతియుఁ: దపః
పరిపాకమునన కలుగుఁ
నరునకుఁ-ద త్తద్విధా త్త నైపుణుఁ డైనన్. ౫౦౨

వ. అనిశవిని, జనకుండు—వర్ణంబుల యుత్క—ర్షాపకర్ష త్వంబులకుమూలం
బెయ్యది? దానిని, దాన పుత్త్రిం డై జన్మించు నంద్రు అదియు,
విసంశయం బగుట నెఱింగింపవే యనుటయుం, బరాశరుం డతని
కి ట్లనియె: ౫౦౩

తే. [1]పద్మభవ—ముఖ-బా-హూరు-పాద—సంభ
వములు గాన భూసుర - రాజ - వైశ్య - శూద్ర
భావములు తారతమ్యసంప్రాప్తి నొందె
జననదేశగుణంబుల మనుజనాథ. ౧౦౪

క. తాన సుతుఁ డగుట దెలియం
గా నగు! మును లాత్మవీర్యకలనం బెచ్చో
నైనం జేయుఁగ మునిభా
వానూనత ఋశ్యశృంగుఁ డాదిగఁ గనుటన్. ౧౦౫

ఆ. అనిన జనకుఁ డిట్టు లను: వినినవి యైన
వలయుఁ దెలియ వినఁగ; వర్ణధర్మ
సమితిఁ గలపి శేషసాధారణత్వంబు
తేర్పరించి చెప్పవే మునీంద్ర. ౧౦౬

వ. అనుటయుఁ బరాశరుం డిట్టు లనియె: ౧౦౭

సీ. వినుము, ప్రతిగ్రహంబును యాజనంబును
నధ్యాపనమును—ధరామరులకుఁ;
బ్రజరక్ష—నృపునకుఁ; బశుపాలనము గృషి
వాణిజ్య మనునివి—వణిజులకును;
శూద్రజనులకు—శుశ్రూషయుఁ:శ్రుతులు వి
శేషధర్మములుగఁ జెప్పు; సత్య
శౌచంబులును, నహింసయు, ననసూయయు,
శ్రాద్ధంబు, నతిథిపూజనము, నాత్మ
తే. దారపరతయు—సర్వసాధారణంబు;
లనఘ, వీనను నిజవృత్తులను సమస్త

1. తా. బ్రహ్మయొక్క— ముఖమునను, భుజములందును, తొడలందును, పాద
ములందును బుట్టినవారు గావున బ్రాహ్మణత్వము రాజత్వము వైశ్యత్వముశూద్రత్వము
పుట్టినచోటి గుణములవల్లన న్యూనాధిక్యభావములను బొందెను.

జాతులును నిహ-పరసౌఖ్యసంపదలకు
నాస్పదము లగు; నింద్యంబు లన్యవిధులు. ౧౦౮

క. భూవర, నాకుం జూడం
గా విష్ణుండె దైవ; మట్లు గావున నతనిన్
భావించు నెల్లవారికిఁ
గావించును మోక్షమయసుఖము వెన్నింటన్. ౧౦౯

క. అనిన విని జనకభూవిభుఁ
'డనఘ, యహింసనము లైనయవి యెయ్యవి య
ప్పను లెఱుఁగఁ జెప్పవే నా'
కనుడు, నతని కిట్టు లనియె నమ్ముని యధిపా! ౧౧౦

## జనకునకుఁ బరాశరముని వివరించిన హింసాహింసల ప్రకారము

ఆ. శమము దమము లేమి జనులకు హింస నొ
నర్చుఁ; గాన, ధరణినాథ, విను, మ
హింస శమదమములు హృదయంబునకు నెప్డు
నలవడంగఁ జేత యండ్రు బుధులు. ౧౧౧

వ. అని చెప్పి వెండియుం బరాశర మునీశ్వరుం డిట్లనియె: ౧౧౨

క. దురమున జయము గొనుటకై
నరపతులకు వలయు హింసనం బెట్లును; ద
త్పరిహారణస్థానములును,
ధరణీశ్వర, కలవు సెప్పెదను విను వానిన్: ౧౧౩

క. పడినం, బాఱినఁ, గైదువు
వడినను, వాహనము వడినఁ, బార్థివముఖ్యా,
పొడువఁ దగదు శత్రుని;
నెయ్యెడల నహింసనమ్ముఁ బోల వేసుకృతములున్. ౧౧౪

క. న్యాయమున సంగరంబుం
జేయఁగ శస్త్రాగ్ని దన్నుఁ జెందిన దానం
గాయంబు విడుచుపురుషుఁడు
వే యేటికి మోక్షలక్ష్మివిభుఁ డగు నధిపా. ౯౧౫

క. తనతోఁ దుల్యుం డైనను—
మనుజాధిప, యధికబలసమగ్రత్వముగ
ల్గిన నని శత్రుని వధియిం
చిన నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. ౯౧౬

వ. అని మఱియును, ౯౧౭

క. భూతంబులు - నిందిృయసం
ఘాతము - సత్త్వాదిగుణనికాయముఁ — గాయం
బై తోఁచు టెఱిఁగినను ధ
ర్మేతరకృత్యములు సేయునే నరుఁ డనఘా? ౯౧౮

క. జాతుఁడు మృతుఁ డగుట ధ్రువము;
భూతోల్లాసము లనిత్యములు; విను, సద్యః
పాతి యగుశరీరంబున
కై తొలఁగునె ధర్మ పథము నార్యుం' డనఘా? ౯౧౯

తే. ఉత్తరాయణమును సంగరోత్సవాది
కారణంబులుఁ గలుగు సత్కర్మపరుః
మరణమునకు; దుష్కాలంబు గరళ రజ్జు
జలముఖములుఁ బాటిలు దుష్టచరితుమృతికి. ౯౨౦

క. మానవులకుఁ దలఁపఁగ న
జ్ఞానమునట్టిపగ లే; దసంగతకృత్యా
దీనుండై రూపు సెడును
ధ్యానం, గావున, నుదాత్తధర్మవిధిజ్ఞా. ౯౨౧

క. మానుషజన్మము మే లతి
హీనపుజాతిని జనించె నేనియు, నన్యం
బైనజననంబుకంటెను,
దాన సుగతి వడయ నగుటఁ దత్త్వప్రవణా. ౫౨౨

క. దానములఁ బుణ్యతీర్థ
స్నానంబుల నతిథిపూజనంబులను ఫలా
దాననిరతుండు గా కీ
మానుష్యము గారవించు మతి నిత్యుఁ డగున్. ౫౨౩

వ. అనిన విని జనకజనేశ్వరుండు, పరాశరమునీశ్వరునితో: "మే లెయ్యది? పరమగతి యెయ్యది? కృతం బైన నెద్దానికి నాశంబు లేకుండు నెఱింగింపవే?' యనవుడు, నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె:

ఆ. అరయ మే లసంగ; మంచితజ్ఞానంబు
పరమగతి; మహాతపంబు చేటు
లేనికృత్య; మిట్లు గా నెఱుంగుట సర్వ
వేదవాక్యతత్త్వవిత్త్వ మనఘ. ౫౨౫

వ. అని చెప్పి వెండియు, ౫౨౬

క. విను, సుమతి, విషయములఁ నం
దనికి గలిగెనేని బొందఁ డుదకఁబులఁ బొం
దని బిసరుహపత్త్రముచా
డ్పున; నది విజ్ఞానఫలము భూపవరేణ్యా. ౫౨౭

తే. అనఘ, మూఢాత్ము చిత్తంబునందు విషయ
జాల మత్యంతగాఢసంసక్తిఁ బొందుఁ
లక్కరసము దండాదులఁ జిక్కఁబట్టు
చందమున; దీనిఁ గనుట ప్రశాంతికరము. ౫౨౮

క. ఇనరుచిఁ బాషాణము ర
శ్మినిరూఢం బైనయట్లు- చిత్తము సద్భా
వనమున సదాత్మకం బగు;
ననామయస్థితికి మూల మది మనుజేంద్ర. ౧౨౯

క. ఆరయఁ గదళీగర్భా
సారము సంసార;-మిట్టిచంద మెఱిఁగినం
జేరవు జనన-మరణములు;
గారించును దీనిభంగిఁ గానక యున్నన్. ౧౩౦

క. ఒరులపనికిఁగా నిజహిత
విరహితుఁ డగునట్లు గాదె-వివిధేంద్రియకా
ర్యరతుండై యాత్మసను
ద్ధరణంబును జేయ కునికి ధరణీనాథా? ౧౩౧

క. తనగృహమున నభ్యాసం
బునఁ మెలఁగెడునంధు చందమున-సంసారం
బునఁ దిరుగుమూఢుఁ డెఱుఁగఁడు
వినుతం బగుమోక్షపదము విమలవివేకా. ౧౩౨

క. వినుము, మృణాళంబున నం
టినరొంపి జలంబులం గడిగినను వెడఁబా
సినక్రియ-విమలజ్ఞానం
బున సంసారంబు వాయుఁ బురుషు నరేంద్రా. ౧౩౩

క. నరనాయక, శిశ్నోదర
పరాయణుం డగుచు నొందు పరికింపనిదు
ర్భరుఁ-డెలుకఁ బిల్లి-మోదిపిన
పరుసున జరవోదువ్రముక్తిఁ బడయక పొలియున్. - ౧౩౪

తే. [1]వేఁగు పెద్దైన నోడ వారిధిఁ దరింప
లేనిభంగి, మనోభవాలీఢవృత్తి
యగుచు నుండుజీవుండు భవాబ్ధి యుత్త
రింప లేఁ; డిది నిజము గరిష్ఠచరిత. ౧౩౫

క. పడియెడు దుఃఖము లరయం
గడుఁ బె; క్కల్పములు గను సుఖంబులు; హీనం
బడయుఁగ నగుమే లెయ్యది?
[2]విడుప్ప యురవు శుభముపొందు విద్యాప్రవణా. ౧౩౬

క. మిత్త్రులు భార్యలు భ్రాతలుఁ
బుత్త్రులు నిజకార్యపరులు బోధము సుమ్మా
త్మత్రాణమునకు మూలము-
ధాత్రీపతివర్య, యెవ్విధంబునఁ జూడన్. ౧౩౭

ఆ. ధీరుఁ డై యభేదదృష్టియ పాటించు
చుండు నట్టిపురుషు నొక్కమాటు
విడువ,—దర్కు నంశువిభవంబు చాడ్పున—
బోధలక్ష్మి పెంపు భూపవర్య. ౧౩౮

క. అని యిట్లు పెక్కుభంగుల
మునివరుఁడు పరాశరుం డమోఘప్రజ్ఞా
ఘనత యెలయంగఁ జెప్పిన,
జనకుఁడు ముద మందె భరతసంతతివర్యా. ౧౩౯

—•• హంసగీత. ••—

సీ. అనిన, ధర్మసుతుండు హర్షమ్ము దనదు చి
త్తమున నిండార శాంతనవుతోడ:

1=భారము ఎక్కుడైనచో.... (2)= విముక్తియే—త్యాగమే ఉచితము.

'దమమును సత్యంబు క్షమయును నెల్లెడ
వినుతింపఁబడు నార్య జనులచేత;
నవి యంతలెస్సలే?' యనవుడు నతనికి
నతఁ డిట్టు లను: "విను హంసగీత;
యది యుత్తరం బగు, నధిప, నీప్రశ్నంబు
నకు; దానిఁ జెప్పెద: నలినభవుఁడు

తే. పసిఁడిరాయంచ యై కేలిపరతనొంది
తిరుగ, నొక్కెడ సాధ్యు లద్దేవుఁ గాంచి,
'పక్షివర, నీవు విద్యలఁ బ్రౌఢుఁ డగుట
సెప్పఁగా వింటి; మాశ్రయించెదము నిన్ను; ౫౪౦

వ. 'ఏము సాధ్యుల' మని పలికి వినయంబుగా ని ట్లనిరి: ౫౪౧

తే. 'ఉత్తమం బెద్ది? నీచిత్త మొలయు నెందుఁ?
బురుషుఁ డెయ్యది గల్గినఁ బొందు నఖిల
కర్మబంధమోక్షము? — నట్టి ధర్మ మెఱుఁగఁ
జెప్పవే కరుణాలత చిగురు లొత్త.' ౫౪౨

వ. అని యడిగిన నాదరించి యయ్యంచ వారల కి ట్లనియె: ౫౪౩

క. క్షమయును దమమును సత్యము-
నమేయమహిమాస్పదంబు లన విందుము; ధ
ర్మములం దెల్లను నభివ
ర్ణ్యము; లవి హృద్గ్రంధిభేదనప్రౌఢంబుల్. ౫౪౪

వ. అని చెప్పి వెండియు, ౫౪౫

క. పరమర్మభేదులును నయ
విరహితములు ధర్మకార్యవిముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలును
త్పురుషుం డాడఁ; — డవి సత్యములు గా కున్కిన్. ౫౪౬

క. జనములు దను నవమానిం
చిన నిందించినను మాఱు సేయక సైరిం
చిన శాంతాత్ముఁడు, వారల
మును చేసినయట్టి సుకృతముల నాఁచికొనున్. ౫౪౭

క. కీ డాడిన మే లాడుచుఁ,
దాడన మొనరించి రేని దరహాసముతో
[1]నీడం బోదును, క్రోధో
త్పీడ ఘోరయ దెప్పుడును మదీయహృదయమున్. ౫౪౮

తే. వేదసారంబు సత్యంబు; వినుఁడు, సత్య
సారమూర్తి దమము; దమసార, మనఘు
లార, మోక్షు; మీపరిపాటిగారవమున
నాదరించుజనంబుల కందు ముక్తి ౫౪౯

క. దమమునఁ గర్మేంద్రియముల
శమియింపఁగఁ జేఁత యది నిసర్గగుణం బై
రమియించు నెప్పురుషుచి
త్తము, - దాన నతఁడు సర్వధర్మకరుఁ డగున్. ౫౫౦

క. ఆ తెఱఁగఘముల బాచును;
బాతకములు వాయ - మొగులు వాసిన సంప్ర
ద్యోతితుఁ డగునమృతాంశుని
భాతి—వెలుఁగు నాత్మ; మోక్షపద మది సుండీ! ౫౫౧

క. మనసును వాక్కును రక్షం
బనుపడు నెవ్వనికి, - శ్రుతితపస్త్యాగము లా
తనిచేతిలోని వగు నని
మునిజనములచేత విందుము నిరంతరమున్. ౫౫౨

1. = జారి (-తొలఁగి) పోవుదును.

క. పలుకు వడినతనిఁ బాపం
బులు విడుచుం; బలికినతనిఁ బొందును బాపం
బులు; నోరుపాపము దనపై
నోలంబుంపఁగ నేల నింద యుడిగినఁ గాదె! ౧౧౩

క. కుపితుఁ డగువానివ్రతమును
జపమును దేవార్చనంబు శ్రాద్ధక్రియయుం
దపమును దానము యజనము
నపగతములు గాఁగఁ జేయు నంతకుఁ డలుకన్ ౧౧౪

చ. పలుకక యుండుకంటెఁ దగఁ బల్కుట మేలు; వినుండు, సత్యముం
బలుకుట, ధర్మమార్గమునఁ బల్కుట, సర్వజనప్రియంబుగాఁ
బలుకుట,-యోలి నెక్కు డగుభంగులు; వీని నెఱింగి యొండుమైఁ
బలుకక నాల్గుచందములఁ బల్కఁగ మెత్తురు వాని దేవతల్. ౧౧౫

క. సత్య క్షమా దమంబులు
నిత్యపదంబునకు నెక్కు-నిచ్చెన; యవి సం
గత్యనుగతములు; సత్సాం
గత్యం బటు గాన ముఖ్యకార్యము సుండీ! ౧౧౬

వ. అని సత్య క్షమా దమప్రకారవిషయంబు లైనవాక్యంబులు సెప్పిన
విని, కృతార్థులై సాధ్యులు సంతోషించి వెండియు హంసంబున
కి ట్లనిరి: ౧౧౭

క. ఏమిట లోకం బావృత?
మేమిటఁ దా వెలుఁగ కుండు? నేమిట మిత్రా
స్తోమంబు విడుచుఁ దనుఁ? గా
దేమిట మోక్షంబు?- మాకు నెఱిఁగింపు దయన్ ౧౧౮

వ. అనుటయు, ౧౧౯

ఆనతవైరి, యిట్టు లను హంసము వారలతోడ: 'లోక ము
ాముచేత నావృతము; సంభృతమత్సరుఁ డైన వే ఱొక్కఁ

దాను బ్రికాశసంపదకుఁ; దఱ విడుచుం దెగి మిత్త్రకోటి లో
భానుగతిన్; విమోక్షపద మందదు సంగముకల్మి నెమ్మెయిన్.

వ. అనిన వారు మరాళంబున కి ట్లనిరి: ౫౬౧

క. ఎవ్వఁడు రమించు నొక్కఁడ?
యెవ్వఁడు పెక్కండ్ర బ్రీతి నెసఁగఁగఁ జేయున్?
నివ్వటిలు నెవ్వనికిని బల?
మెవ్వఁడు కలహంబు [1]వెంట కెంతయుఁ దొలఁగున్? ౫౬౨

వ. అని యడిగిన హంస యి ట్లనియె: ౫౬౩

క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడ;
ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతి బరఁగఁగఁ జేయుం;
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ;
బ్రాజ్ఞుఁడు కలహమునఁ [2]దొట్టుపడక తొలంగున్. ౫౬౪

వ. అని చెప్పినరాయంచతో సాధ్యు లి ట్లనిరి: ౫౬౫

తే. విప్రుఁ డేమిట దేవత్వ విభవ మొందు?
నేమికతమున సాధుత్వ మెసక మెసఁగు?
నతని కెద్ది యసాధుత్వ మావహించు?
మానుషుం డగు నెద్దాన మహితమూర్తి? ౫౬౬

చ. అనుటయు హంస మిట్లు లను: 'నధ్యయనంబున దేవభావముం
గను; వ్రతవృత్తి సాధు వనఁగాఁ జరియించు; జనం బసాధు నాఁ
జనుఁ బరివాదశీలమున; శౌచవిహీనత, మృత్యుభీతి వాం
దిన, మదిలోన నెక్కొనిన దీనత—విప్రుఁడు మానుషుం డగున్.

క. అని పలికి సాధ్యులకుఁ దన
తనువిభవము సూపి సమ్మదంబున వారల్

1—కార్యమునకు (విషయమునకు; మార్గమునకు.) ఈయర్థము ప్రకృతము ప్రసక్తము
2—ఎగబడక (ఎదుర్కొనక).

దనుఁ గొలువ నిజనివాసం
బున కేఁగె నజుండు నగవు మొగమున నెఱయన్. ౫౬౮

వ. అని చెప్పి భీష్ముండు—— ౫౬౯

ఉ. సాదరవృత్తి సాధ్యులఁ బ్రహర్షసమేతులఁ జేయఁ బూని సం
వాదము సేసె దేవమునివంద్యుఁ డజుం;డిది సేయు నాయురు
త్పాదన, మిచ్చు సంతతశుభంబులు, గీర్తి యొనర్చుఁ,బుత్త్రపౌ
త్త్రోదయ మావహించు, భరతోత్తమ, తగ వినినఁ బఠించినన్. ౫౭౦

వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనుతో: 'సాంఖ్యయోగం
బుల తారతమ్యంబులుం దత్స్వరూపంబులు నెఱింగింపవే?' యను
టయు నమ్మహీపతికి నమ్మహాత్ముం డి ట్లనియె: ౫౭౧

—•• భీష్ముఁడు ధర్మజునకు యోగతంత్త్రప్రకారము సెప్పుట. ••—

క. తెలుపుదురు సాంఖ్యులును యో
గులుఁ దమతమ తెఱఁగు మే లగుట కారణసం
కలితముగ; నాకుఁ జూడఁగ,
నలఘుగుణా, యొక్కరూప యయ్యిరుదెఱఁగున్: ౫౭౨

క. ప్రత్యక్షహేతువాదులు,
సత్యపరా, యోగపరులు; సాంఖ్యులు శాస్త్రా
ర్థాత్యంతనైపుణులు; స
ద్గత్యాకలనంబు సరియ తదుభయమునకున్. ౫౭౩

క. ఆ తెరువులు రెంటికి వే
ఱై తోఁచుట దర్శనంబునంద; నరేంద్రా,
భూతహితము, సద్వ్రతచ
ర్యాతిశయము, శౌచమును నియతకృత్యంబుల్. ౫౭౪

వ. అనిన విని యుధిష్ఠిరుండు: 'భూతదయయును సద్వ్రతధారణంబును
శౌచంబును, దుల్యంబు లై సాంఖ్యయోగంబులకు దర్శనంబు

వే అగుట యెట్లు వివరింపవే' యనుటయు, నన్నరదేవునకు దేవ
వ్రతుం డిట్లనియె: ౫౭౫

క. యోగులకు యోగబలమున:
రాగము మోహంబునుం జిరస్నేహముం గా
మాగమముం గ్రోధమును గుణ
యోగము వరుసం బెడం బాప నున్నతి యొలయున్. ౫౭౬

చ. ఘనరుషమున్, సముద్ధతమృగంబును:జాలము వ్రచ్చి, వాగురా
వినిహతిం జేసి—యిష్టపదవిం జనుచాడ్పున, యోగతంత్రరో
ధన మగులోభజాతదురితవ్రజముం బెడం బాచి, సత్పథం
బునం జరియించు యోగి సుఖమూర్తిత సుస్థితగా వహించుచున్.

ఆ. యోగబలము లేని యొకభంగి యోగి: బల్
ద్రోపు లేనిమీను, నేపు లేని
మృగము—వలయు, నరియు దెగిపోవ నుటుకంగ
లేనియట్ల — భవము లోన నడంగు. ౫౭౮

ఆ. అల్పమైనయగ్ని యడఁగు నింధనములు
మీఁద వైవ—బలము మిగుల లేని
యోగ మట్లు; తనకు నురువట్టి దానన
సాద మొందు సకలజనమనోజ్ఞ. ౫౭౯

ఆ. ఇద్ధమైనయగ్ని యింధనసంపద
నతిశయిల్లునట్లు లధిక బలన
మగ్రిసారయోగమహిమయు నంతంత
కగ్గలించు వ్రతము లగ్గలింప. ౫౮౦

క. [1]స్రోతోవేగము పటుగతి
పీతబలుం దిగుచునట్ల విషయము లీడ్చుం

1. ప్రవాహవేగము.

జేతోబలసంభృతయో
గాతిశయుఁడు గానివాని నంచితచరితా.

క. [1]నదిరయమును వారణేంద్రుఁడు
గుదియించినయట్లపోలెఁ, గురువర, దైన్యా
స్పద మగువిషయోల్లాసముఁ
గుదియించును యోగసిద్ధి గురుహృద్బలుఁడున్. ౫౮-౨

తే. కుపితుఁ డగునంతకుండును, గోరిథఘోర
మృత్యువును నైన నియమసమృద్ధయోగ
బలునిదెస వోవఁ జాల; రప్రతిహతముగ
నెందుఁ జరియించు నతఁడు నరేంద్రముఖ్య. ౫౮-3

క. భోగంబుఁ దపముఁ: బొరిఁబొరి
రాగ-విరాగతల హృదయరంగమునకుఁ గే
లీగతులఁ దెచ్చి యార్చుచు
యోగి యనుభవించుఁ;-దగిలియుండం డెందున్. ౫౮-౪

క. జగతీవర, యోగస్థా
లగతులు సెప్పితి; వినం గలదు సూక్ష్మవిధం
బగుమార్గప్రచయము; [3]ద
న్నిగదన మవధానమున వినిన మతి దేఱున్. ౫౮-౫

క. ఏమిగతి లక్ష్యభేదముఁ దా
మేలుగఁ జేయు ధన్వి దత్పరుఁడై,—యో
గామలచిత్తుఁడు మోక్షం
బామెయి సాధించువాఁ డహంకృతిదూరా. ౫౮-౬

1. ప్రవాహవేగమును పెద్దఏనుఁగు లో బలుచుకొనునట్లు. 2 ఆబోధము
గనినచో మనస్సు తేఁట పడును.

ఆ. నేతికుండ మోచి యే[1] తెలివున సోప
నాలు ద్రాఁకునైపుణంబు గలుగు
పురుషునట్లు యోగపరిణతుండును నాత్మ
నేమఱక విముక్తి కెక్కవలయు. ౫౬౭

తే. [2]రథికునకుఁ-గలమరికిః సారథియుఁ-గర్ణ
ధారుఁడునుబోలె, నాత్మకుఁ దాను సుపథ
వర్తనైకవిధాయి గావలయు యోగ
ధారణానిశ్చలుం డగుఁధీరుఁ డధిప. ౫౬౮

క. శిరమును నాభియు హృదయము
నురమును గర్ణములుఁ బార్శ్వయుగళము నాత్మా
దరణీయస్థానము; ల
య్యురవులఁ గను యోగి యాత్మ నిభపురనాథా. ౫౬౯

వ. అనిన నజాతశత్రుం డాపగాపుత్త్రునితో ని ట్లనియె. ౫౭౦

తే. యోగి యెట్టియాహారంబు లుడుగవలయు?
నాతఁ డెబ్బంగిభోజ్యంబు లనుభవించి
బలము వడయువాఁ?—డిది నాకు దెలియఁ జెప్పు
వే జనస్తవనీయసమిద్ధబుద్ధి. ౫౭౧

సీ. అనవుడు, నతనితో నతఁడుః 'సుస్నిగ్ధంబు
లైనయాహారముల్ మానువాఁడు
యోగి; నీరసముల నుదకంబులను జాల
నాఁకలి వుచ్చుచు, నవియు నుదర

1. తా. జాగ్రత్తగా సోపానములు (=మెట్లు; పడికట్లు; తాపలు; పావంచలు) ద్రాఁకుఁబట్టి నేర్పు గలుగు పురుషుని వలె...... 2. తా. రథికునకు (=రథమున నున్న వానికి) సారథియు (=కడపువాఁడు), కలమరికి (=పడవయెక్కినవానికి) ఓడనడపు వాఁడు (=సరంగు; చుక్కాని ద్రిప్పువాఁడు) ను వలె...

మధికపూర్ణం బగునల్లుగాఁ గొనక వ
ర్తించుట బలము వర్ధింపఁ జేయు;'
వని చెప్పి వెండియు నను: 'గామమును గ్రోధ
మును నిద్రయును దృష్ణయును భయంబు

తే. రతియు నరతియుఁ బవనంబుగతియు నుడిపి
ధారణానిశ్చలుం డయి తన్నుఁ దాన
కనుచు నుండెడుయోగి దుర్గంపుఁజోటు
వెడల నరిగి సుఖస్థానవిభవ మొందు. ౫-౨

క. 'జనవర, [1]యసిధారావ్రత
మనఁ దగియెడుధారణానియతి పనుపడు నె
వ్వనిచిత్తంబున,— నాయో
గనిరూఢున కరిది యైనకార్యముఁ గలదే? ౫-౩

క. 'యోగనిరూఢుఁడు సంగ
త్యాగానందైకరతుఁ; డతనికి జననసం
యోగము, మృతిదైన్యంబును
భోగాభోగ సుఖదుఃఖములు లే వధిపా. ౫-౪

క. 'అతనికిః సరిత్సముద్ర
క్షితిభృ ద్ద్వీపములు గేలికిం బట్టులు; దా
మతిఁ దలఁచెనేనిఁ బరిశాం
తత నున్నను గూడియు గుహాయుఁ దగుమందిరముల్. ౫-౫

క. విముఖుం డగుటయుఁ గీళులు
దమయంతన చెందు జనులఁ; దావారలకుఁ
సుముఖుం డగుటయు శుభములు
సమకూరును శివునియట్ల చరితము లెల్లన్.' ౫-౬

వ. అని చెప్పి వెండియు, ౫-౭

---

1. కత్తిమీఁద నిలుచు వ్రత మనఁదగిన ధారణాశక్తి ఎవని మనస్సున గలుగునో...

తే. 'యోగతంత్రంబు సకలశాస్త్రోదితంబు;
విను, విశేషించి లోకైకవిభుఁడు సెప్పె
దీని నారాయణుఁడు; మునిమాననీయ
మిది మనంబునఁ దెలిసికొ మ్మిద్ధచరిత.'    ౯౮

వ. అనిన విని ధర్మతనయుండు: 'యోగతంత్రప్రకారంబు భవత్ప్రసాదంబునం బ్రబుద్ధం బయ్యె. సాంఖ్యస్వరూపం బెట్టిది? యెఱింగింపవే' యని యడిగిన నతనికి దేవవ్రతుం డి ట్లనుః కపిలాది మహాముని దర్శితం బైన మార్గంబున వివరించెద.    ౯౯

—♦ భీష్ముఁడు ధర్మజునకు సాంఖ్యస్వరూపనిరూపణంబు సేయుట. ♦—

సీ. వినుము, దృఢజ్ఞానమున విషయంబుల
భంగి లెస్సగ నారయంగవలయు;
నవియుఁ దిర్య ఙ్మను ష్యామర పితృ సిద్ధ
గరుడ గంధర్వ కిన్నరులయందు
వేఱ చందంబులై, విలసిల్లు శ్రుతివాక్య
దృష్టంబు లగు దానఁ—దెలియ నరయు
పరిచయంబున; భేదపరిబోధ మేమిటి
కనరాదు; తోఁచినయప్పు డవియు
తే. దురితకరములు యని వానిఁ దొడరకుండ
వలదె? లెస్సగ నెఱిఁగిన వచ్చుఁ దొలఁగ;
నేమఱుమి దక్క నొండొకం డేల చోర
జనులఁ జిట్టంగ నడుచుట కనఘచరిత?    ౧౦౦

చ. తలఁపఁగ నాయు వింతియ కదా యని, సౌఖ్యము దుఃఖముం బొరిం
గలుగవె కాలవృత్తి నని, కర్మము లి ట్లని, వేదచోదనం
బుల బహుభంగు లిట్టి వని, బుద్ధికి సత్త్వ రజ స్తమోగుణం
బులకుఁ బ్రవర్తనంబు లివి పొ మ్మని కాంచుట చాల మే లగున్,

సీ. ఇంద్రియార్థంబుల నేనింట నైదింద్రి
యములును — గోష్ఠంబునందు వహ్ని,
పవనుండు బయలను, పావకునందుఁ దో
యములును, భూమి తోయముల, బలము
గాశికునందును, గ్రాంతి యుపేంద్రుని
యందును, నర్థంబునందు లోభ
మును, దమస్సున బుద్ధియును, రజస్సున దమ
స్సును, సత్త్వమున రజస్సును—గరంబు ౬౦౧
ఆ. దగులు; సత్త్వ మాత్మఁ దగులు; నాత్మందు నా
రాయణుఁడు మహేశుఁ డనఁగఁ బరఁగు;
పగముఁ దగులు నతఁడు; పరము మోక్షంబునఁ
దగులు; మోక్ష మెందుఁ దగుల దధిప. ౬౦౨
క. ప్రకృతి పదాఱువికారము
లకు నాశ్రయ; మాత్మ కది నెలవు; విను, మాత్మం
డకుటిలతేజోరూపతఁ
బ్రకృతియు వికృతియును గాక ప్రస్ఫురితుఁ డగున్. ౬౦౩
తే. ఆత్మునకు రెండురూపంబు, లనఘ,
కలవు; విషయసంగతి నొక్కటి విస్తరిల్లుఁ;
దదుపభోగంబు లేకమధ్యస్థభావ
మొంది యొక్కఁడు వెలుఁగుచు నుండుఁ జూవె! ౬౦౪
క. పవనం బేకము; ప్రాణా
దివిభేదము లైదు; విను, తదీయంబులు, వా
నివిధంబు లరయు నిశ్చల
మవు నది; యాసుకృత మంతరాత్మునిఁ జూపున్. ౬౦౫
మ, గర్భవాసదుఃఖం
మ, జన్మవ్యథయు, బాల్యము, విమూఢత్వం

బును, రాగక్లేశజరా
జనితకృపణతలును జూపు,-సంగముఁ బాపున్. ౬౦౭

ఉ. చెందుచు నుండుఁ బుణ్యములు సేసి సురత్వము; మధ్యకర్మఁ బై
రొందు నరత్వముం; దురితయోగమునం బశుకీటభావముం
బొందు; సుఖంబు దుఃఖమును బొందఁగ జీవుఁడు—దీనిభేదశ
క్తిం దెలియంగ నేర్చినమతిం గలయాతఁడు గోరు మోక్షమున్.

క. క్షయ-వృద్ధులఁ జంద్రుఁడు న
బ్ధియు లోనుగఁ బొందుచుండఁ, దెలియఁడు! బంధు
క్షయమునకు వగచు నజ్ఞుం!
డయమహితా, దీని నెఱుఁగు టమలతఁ దెచ్చున్. ౬౦౮

క. తనదేహముదోషములం
గని, వేవురలో నొకండు గలుగు విముక్తిం
గనుపని కుద్యోగించుట—కనఘా,
పెక్కండ్రు లే రహంకృతికతనన్. ౬౦౯

వ. అనిన విని, యుధిష్ఠిరుండు— 'దేహదోషంబు లెవ్వి యెఱింగింపవే!'
అనుటయు ననిమిషనదీనందనుం డతని కి ట్లనియె. ౬౧౦

క. విను, కామముఁ గ్రోధము భయ
మును నిద్రియు నిశ్వసనము—భూవర, దేహం బు
బునఁ గలదోషము;—లీ వై
దును బాపెడి తెఱఁగు సెప్పెదం దెలియంగన్. ౬౧౧

సీ. క్షమ క్రోధమునకు, సంకల్పవర్జనము గా
మమునకు, నప్రమాదము భయంబు
నకు, సత్త్వసంసేవనము నిద్రికును, లఘు
భోజిత నిశ్వాసమునకు వైరు
లని చెప్పి, వెండియు ననుఁ ననేకము లగు
దోషముల్ దొలఁగంగఁ ద్రోచువెంపు

లును బెరుఁగ; లవి గని కొను వివేకము గల
పురుషుండు; దన్మార్గపరిచయమున—

తే. [1]విష్ణుమాయను దోఁచు నీవిష్టపములు:
భిత్తిచిత్రంబు విధమున, ఫేనభంగి,
బుద్బుదాకృతిగాఁగను; బుధుఁడు దీని
సరకుసేయక మోక్షంబు తెరువు వెదకు. ౬౧౨

—•• ఆత్మ పరమపదంబుఁ బ్రాపించెడు ప్రకారము. ••—

వ. ఇది సాంఖ్యప్రకారంబు. బహిస్స్పర్శంబులు దపోదండంబునం దొలంగన్ జడిసి, యానపాత్రరూపంబుగా [2]దీని నవలంబించిన యార్యుండు - ప్రజ్ఞాకర్ణధార సామర్థ్యంబున: దుఃఖోదకంబును, వ్యాధి మృత్యు [3]మహాగ్రాహంబును, [4]భయోరగంబును, హింసావేగంబును, రాగపంకంబును, దృష్ణావర్తంబును, నానాప్రీతిరత్నంబును, సత్యతీరంబును నగు సంసారసాగరంబు నుత్తరించు. ఆసుకృతి నట సూర్యుండు [5]దనరశ్ములవహించి నడపుపద్మతంతుసన్నిభంబైనమార్గంబు ప్రవేశించి చనంజన, సూక్ష్ముండును శీతలుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుతశ్రేష్ఠుండును నగు పవనుం డెదురొఁగని నభఃపరమగతిం జేర్చు. నభంబు రజఃపరమగతిని, రజస్సు సత్త్వపరమగతిని, సత్త్వంబు నారాయణుని, నారాయణుండు పరమంబునం జేర్ప, నందుం గలసి తన్మయుండై యమృతత్వనిత్యుం డగు. అనిచెప్పిన విని, పాండవాగ్రజుండు— 'అట్లమృతస్వరూపశాశ్వతుండగు నమ్మహాత్ముండు దన

1. తా. విష్ణుమాయచేఁ గన్పడునీలోకములు—గోడమీఁది చిత్తరువువిధమునను నురుగువలెను, నీటిబుడగ (బుగ్గ)గాను గనఁబడును. జ్ఞానియైనవాఁడు దానిని సరకుసేయక ముక్తికి దారి వెదకును. 2. ఈసాంఖ్యమును.... 3. పెద్దపెద్దమొసళ్లు గలదియు. 4. భయమనుపాములుగలదియు. 5. తనకిరణములపైమోచి నడపునట్టి తామరతూఁడునందలిపోఁగువంటి మార్గము జొచ్చి పోవం బోవ.

పూర్వవృత్తంబు దలంచునో తలంప కుండునో దానినిశ్చయం బతి
గహనంబు. మోక్షంబు దలంచి పరమజ్ఞానమగ్నుం డగుటం బురు
షున కెద్ది దశయో యనువితర్కంబున నది ప్రవృత్తిధర్మంబు
కంటె మే లన రాకున్నది. ఈరెంటుదెఱంగులుం దెలుప నీవ కాక
యీలోకంబున నొరులు గలరే? అనుటయు, నజ్జనపతికి జాహ్న
వీనందనుం డి ట్లనియె: ६०३

క. అడిగితి లెస్సగఁ బ్రశ్నము!-
గడుసంకట! మెట్టియెఱుక గలవారలు నె
ప్పుడు సంశయించుచో టిది;
దడయక యుత్తరము సెప్పెదం దేటపడన్ ६०४

వ. కపిలదర్శనవిదు లగుమునీంద్రుల పరమమతం బిది: అవహితుండవై
యాకర్ణింపుము—— ६०५

సీ. పురుషుని నింద్రియంబు లెఱుంగ—వవి మన
స్సములుగావున; మనస్సంగమమునఁ
గను వాని నతడు—ముక్తత్వంబు లేనియ
ప్పుడుఁ, గల్గినను;—నది పురుషునందు
సమము; నిర్విషభుజంగములట్ల నిశ్చేష్ట
నున్న యింద్రియములఁ గన్నఁ, గాన
కున్నను నేమి యయ్యుదితవిజ్ఞానామృత
తస్వరూపునకు? నాతండు దొఱఁగఁ

తే. గాష్ఠ కుడ్య [1]కుసూలాదికములచంద
మొందు;- నట్లుగాకయు, నింద్రియోత్కరంబు
శరధిఫేననిభం బయి విరియు; నవ్వి
భూతి యీశ్వరు తెఱఁగు—గాత్మఁ బొందకున్నె? ६०६

1=(ధాన్యముబోసెడి) గరిసె మొదలగు వానివలె....

క. విను, మింద్రియసహితముగా,
మనుజాధిప, బోధపూరమగ్నత్వముగ
ల్గినను౦ దత్పూనిక్ష్మగతులఁ
గనుఁ బురుషుఁడు;-గనియు నిర్వికారత నుండున్. ౬౧౭

తే. భూతములను గుణంబుల బుద్ధి మనసు
నడఁచికొని జీవుఁ డొందు నారాయణునిఁ; ద
దీయమాహాత్మ్యమున మాననీయపరమ
పదము గనుఁ గాన నిష్పుణ్యపాపుఁ డతఁడు. ౬౧౮

క. పునరావర్తనరహితుం, డనఘా,
పరమాత్మునిఁ జెందినట్టిపురుషుఁ; డ
వ్వినుతావస్థను "మోక్షం"
బని చెప్పుదు రంతకంటె నధికము గలదే? ౬౧౯

వ. అని చెప్పి వెండియు, ౬౨౦

క. గురునివచనంబు తెలుఁగునఁ
బరమార్థనిరూపణంబు పని నియతిం ద
త్పరుఁ డై నడపం జాలిన
పురుషునిఁ దడయక ప్రశాంతి నొందు నరేంద్రా. ౬౨౧

చ. జనవర, సాంఖ్య మిట్టిది: ప్రజాపతిపూజ్యము; బ్రహ్మభావభా
జనత ఘటింప దీనిసరి సమ్యగుపాయము లెందు లేవు; నె
మ్మనమున సంశయింపక సమాహితచిత్తత దీని నూఁదు ని
స్తనుఁ డగు నమ్మహేశునకుఁ దాఁ దను;-పిం కిట వేయు నేటికిన్?

తే. వేదశాస్త్రపురాణసంవేదితంబు
లై నబహువిధసంపరిజ్ఞానములకు
నెల్ల నిది [1]సేరుగడ సూనె
యేఱులకు సముద్రమునుబోలె నుపశాంతి భద్రచిత్త. ౬౨౩

1. గమ్యస్థానము.

వ. యోగులును సాంఖ్యులును జూచువెరవు లాకర్ణించితి కాదె! ఇది
యిట్లగుటం జేసి దర్శనభేదంబు గల దంటిని; అదియును నల్పాం
తరంబు;-అదియునుం గాక, ౬౨౪

ఆ. యోగి చూచుభంగి, నుర్వీశ, సాంఖ్యుండుఁ
జూచు; సాంఖ్యుఁ డరయుచొప్ప యోగి
వరుఁడు నరయుఁ; గాన వా రిద్దఱును నొక్క-
తెరువువార యండ్రు పరమమునులు. ౬౨౫

క. విను, సాంఖ్యమ్మును యోగము-
నను పేళ్లుల కాని, దీనియం దదియును, దా
న నిదియుఁ దోఁచుచు నుండుం;
[1]గనుఁ దత్త్వవిచారి: యొకఁడ కా నీ రెంటిన్. ౬౨౬

క. ఈ తెరువునఁ జరియించుచు
నే తెఱఁగున నైనఁ దప్పె నేనియుఁ బురుషుం
డాతతనాకసుఖము గనుఁ;
దో తెంచును మగుడ సద్బుధులవంశమునన్. ౬౨౭

ఆ. మఱియు నిత్తెఱంగు మనసున నెలసిన
వినుతమోక్షలక్ష్మివిభుతఁ గాంచు;
నిట్టి తెరువు సూప నెవ్వరి కలవి,—నా
రాయణునక కాక యమలచరిత? ౬౨౮

వ. నారాయణప్రణీతంబై యక్షరప్రదర్శకంబైనయిత్తెఱంగుఁ జిత్తం
బున నలవరింపుము— అని దేవవ్రతుండు ధర్మనందనునకుం జెప్పె—
నని యిట్లు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన, నటమీఁద
వర్తించినవిశిష్టసల్లాపంబును సెప్పవే యని యడుగుటయు——

1. ఈ రెంటిని ఒక్కటిగానే తత్త్వవిచారము గలవాఁడు గాంచును.

శా. లీలాస్వీకృతచక్రశూల, వినతాళీరక్షణాలోల, దు
శ్శీలస్వాంతవిదూర, వేదజలదశ్రేణీమయూరా, సమి
త్కేళీఖండితదైత్య, నిర్జరగణక్షేమక్రియానిత్య, ని
స్త్రైలోక్యత్వనిరంజనాగ్రవిహృతీ, సంస్థాపకవ్యాహృతీ. ౬౩౦

క. సురమకుటఘటితరత్న
స్ఫురితచరణ, పింఛదామ-భుజగాభరణా,
కరుణామయదివ్యాంతః
కరణ, జరామరణనోదకపదస్మరణా. ౬౩౧

మాలిని.

జపయజననిషేవ్యా, సంగనిర్ముక్తభావ్యా,
విపులదురితభేదీ, విశ్వలోకప్రమోదీ,
యపరిమితవిభూతీ, యప్రమాణస్వరీతీ,
యుపనిషదవగమ్యా, యోగభావ్యైకరమ్యా. ౬౩౨

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతంబైన శ్రీమహాభారతంబున
శాంతిపర్వంబునందు
పంచమాశ్వాసము.

శ్రీ

హరిహరనాథాయనమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## శాంతిపర్వము.

### షష్ఠాశ్వాసము.



సంధానప్రౌఢద
యాసంభృత భక్తమోద, యఖిలజగద్రి
క్షాసక్తవినోద, శమా
భ్యాసనిరతనిర్విభేద, హరిహరనాథా. ౧

—•• భీష్ముని ధర్మజుండు ప్రశంసించి యుత్తరోత్తరంబుల నడుగుట. ••—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయునకి ట్లనియె: అట్లు యోగ సాంఖ్యవిదు లక్షరంబు నొంది యానందస్వరూపు లగుదు రని చెప్పిన విని, ధర్మతనయుండు దేవవ్రతునితో: 'నీవు పరమజ్ఞాననిధి వని వేదసంవేదు లగువిప్రులు సెప్ప నప్పలుకులును, నిన్ను సాంఖ్యయోగప్రవీణు లయినయతులును మునిపతులును వర్ణింప నవ్వచనంబులును, నాకర్ణించుచుం బ్రమోదంబునం బొందుచుండుదుము. దక్షిణాయనశేషదినంబు లింక నల్పంబులు. అర్కుండు మరలంబడినం బరమగతిం బ్రాపించెదవు. మఱి మే మెవ్వరిచేత వినువారము? కురువంశంబునకుం బ్రజ్ఞాఘృతప్రదీపితం బగుదీపం బవుగావె?-భవత్తేజంబు నాశ్రయించెదము' అని తనవారలం గలపి

కొని పలికి,: 'నీవు నిర్దేశించినయక్షరం బనునది యెట్టిది? క్షరం
బెయ్యది?- ఎఱింగింపవే' యనుటయు, నతండు: 'వసిష్ఠ-జనకసంవా
దం బనం బరఁగు విశిష్టేతిహాసంబు గలదు. దాన నీయడిగినయవి
యును మఱియు నెఱుంగ వలయునట్టివి యనేకార్థంబులును
దెలివిపడు;—వినుము' అని సుప్రసాదభరితుండై, ౨

సీ. అనఘ, సుఖాసీనుఁ డైనవసిష్ఠసం
యమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి,
జనకభూనాథుండు వినయంబుతోడ ను
పాసించి: 'మునివర, యక్షరం బ
నాది శివం బన నపునరావృత్తి సి
ద్ధిద మగు చుండు నెయ్యది యెఱుంగఁ
జెప్పవే!' యనుడు, నాశ్రితవత్సలుం డగు
నమ్మహాత్ముఁడు దెలియంగఁ జెప్పె:

తే. 'నద్దయాళుండు చెప్పిన యత్తెఱంగు
ప్రస్ఫుటంబుగఁ జెప్పెదఁ, బాండవాగ్ర
జన్మ, నీ;' కని పలికి యజ్ఞాహ్నవీత
నూజుఁ డిట్లను నాననాంభోజ మలర: 3

—•• వసిష్ఠ-జనకరాజసంవాదప్రకారము. ••—

వ. జనకజనేశ్వరు బోధించుటకై వసిష్ఠమునీశ్వరుం డిట్లనియె: ౪

క. నయన ముఖ పాణి పాదము,
లయుమహితా, మొదఁ గలిగి యాద్యంతపరి
క్షయ - వృద్ధిరహితమై ని
ర్ద్వయ మగుతత్త్వంబు నక్షరం బండ్రు బుధుల్. ౫

క. క్షర మండ్రు దానివలనను
క్షరియించినతత్త్వములను; జనవత్సల, యు

య్యిరువదినాల్గింటిని దర
తరము విభాగించి చెప్పెదం దెలియంగన్. ౬

తే. [1]అక్షరము వికృతియగుచు బలాత్మకత్వ
మొందు; నవ్వికృతియకును బేళ్లు గలిగెఁ బ్రకృతి
యనఁ బ్రధానంబునాఁగ నవ్యక్త మనఁగ;—
దానఁ బుట్టు మహన్నామతత్త్వ మనఘ. ౭

తే. విను, మహాంకార మాతత్త్వమున జనించు;
దానఁ భూతపంచకమును, దద్గుణంబు
లైనశబ్దాదివిషయంబు లైదు, నింద్రి
యములుఁ బదియును, మనసును నావహిల్లు. ౮

క. క్షర మయ్యిరువదినాలుగు;
నరనాథా, యక్షరంబునకు నెయ్యెడలన్
క్షరభావము లే; దయ్య
క్షరమువిలాసములు సూవె క్షరతత్త్వమ్ముల్. ౯

వ. ఈచతుర్వింశతితత్త్వంబులును విజ్ఞానగోచరంబులు; పంచవింశతితమంబై యక్షరం బనం బరఁగు నిష్పరమతత్త్వంబు వినుము: అవిజ్ఞేయం బవ్యయం బకలంకం బనామయం బమృతంబు. ౧౦

క. జననాథ, [2]యక్షరం బెం
దును గ్రీడఁ జరించుఁ ద్రిగుణదోహలపరమై
తనకుఁ బ్రబోధము లేకు
న్నను నానాయోనిగతజననములవెంటన్. ౧౧

---

1. తా. నాశము కానివస్తువు వికారంపువస్తువులు గలదియగును. ఆవికారవతికిఁ బ్రకృతి యనియు, ప్రధాన మనియు, అవ్యక్తమనియు పేళ్ళు గలిగెను. ఆవికృతినుండి 'మహత్' అనుపేరుగల తత్త్వము పుట్టును. 2. తా. మూఁడు గుణము (—రజస్సు సత్త్వము తమస్సు) ల ప్రోత్సాహముచేత, ఆయక్షరము, తనకుఁ బ్రబోధము లేకున్నను, నానాయోనులలోఁ బుట్టుచుఁ జరించుచుండును.

క. విను, సత్త్వ రజస్తమముల
యనుసరణమువలన వివిధ మగుయోనిగణం
బున నెలసినయాత్త్వము
దనుఁ జూడఁగ లేక యవియ తా నని యుండున్. ౧౨

ఉ. [1]సత్త్వ రజస్తమోగుణవశస్థితి నక్షరః మర్థధర్మసం
గిత్త్వము మద్యకర్మతయుఁ గిల్బిషకృత్యము నొంది యొంది, ది
వ్యత్త్వ నరత్త్వ గో మృగ ఖగాదికతిర్యగనేకహీనజం
తుత్త్వములన్ సుఖంబులును దుఃఖములున్ నరకంబులుం గనున్•

క. జనవర, శుక్లము లోహిత
మును గృష్ణము నైనవర్ణముల నక్షర మొం
దును: సత్త్వ రజస్తమముల
యనుసారంబున నవర్ణమయ్యు వికృత మై. ౧౪

క. అగుణం బయ్యును నిమ్మైయుఁ
బ్రిగుణతఁ బ్రాపించు-నక్షర మహంకార
స్థగుణం బూదిన; విడిచినఁ
దెగు నన్నియు; నిర్వికారదీప్తంబు నగున్. ౧౫

వ. అని చెప్పి వెండియు, ౧౬

చ. క్రితువులఁ దీర్ఘయాత్రలను రాత్ర్యశనంబుల భూమిశయ్యలన్
వ్రితపరినిష్ఠలన్ జడలు వల్కలముల్ వివిధంపుదండముల్

౩. తా. ఆయతురము, సత్త్వరజస్తమస్సులకు వశమై • సత్త్వముచే అర్థమగు ధర్మముతోఁ గూడి దైవత్వమును, రజస్సుచే తొరిగుబోతువాని చేష్టల ననుకరించునది యై నరత్వమును, తమస్సుచేఁ బాపములకాకరమై గోవు మృగము పక్షి లోనగు హీనజంతువు లగును- బుట్టి సుఖ-దుఃఖములను నరకమును అనుభవించును.

సతతముఁ దాల్చుటకుఁ [1]వప్పువు సంకటపాటునఁ బెట్టు నాద్య మ
చ్యుత మమలంబు దాను దనుఁ జూడక యక్షర మప్రబుద్ధ మై.

క. [2]అమృతము నభవము నజరము
నమలము నగుతన్నుఁ: మృతము నాహితభవమున్
సమధికజరమును మలసహి
తముఁగా నక్షరము మమత దలఁచు నరేంద్రా. ౧౮

ఆ. తనకుఁ దాన బంధ మొనరించుకొనియెడు—
[3]సాత్తినూలికాయపురువుభంగి;
నగుణ మయ్యు సగుణతావాప్తి బొందు న
క్షరము ప్రకృతిగుణము సంక్రమించి. ౧౯

ఆ. అమలవాయుసేవనము నిర్మలత్వంబు
గలుగఁగాఁ, బదాఱుకళలఁ బూర్ణుఁ
డగుసుధాంశుమాడ్కి— నక్షర మమలినా
ఖండశాంతిబోధఘనత వెలుఁగు. ౨౦

వ. అనిన విని జనకుం డమ్మునీశ్వరున కి ట్లనియె: ౨౧

క. వనితకుఁ బురుషునకుం దన
తనయంతన రూపాకం డాదవఁ జేయఁగ వి
న్ననువు గలుగ,—దొండొరువుల
నెనయుటఁ గాని; శ్రుతిమతము నిట్లు మహాత్మా. ౨౨

---

1. తా. అక్షరము మేల్గొననిది యగుటచే, ఆద్యము (=మొదటిదియు), అచ్యుతము (=జాఱుపాటులేనిదియు), అమలంబు (=నిర్మలమైనదియు) అయిన తాను తన్నుఁ జూచుకొనక శరీరమును సంకటపాటునఁ బెట్టును. 2. తా. చావు, పుట్టువు, ముసలితనము లేక నిర్మల మగు నక్షరమును, మమత్వము (అభిమానము)నః చావు-బుట్టువులు ముసలితనము మురికితోఁగూడినదియు నని తలంచును. 3. సాలెపురువు (=తంతునాయము) వలె...

క. వనితగుణంబులుః చర్మం
బును మాంసము శోణితంబుఁ;- బురుషగుణతతిః
విను, మజ్జాస్థిస్నాయువు;-
లనఘతపోవిభవ, యిట్లు యని శ్రుతిసెప్పున్. ౨౩

వ. ఇది తిర్యఙ్మనుష్యాదు లైనసకల యోనులయందును జన్యంబు లావహిల్లెడి తెఱంగు. ౨౪

క. నర-నారీసంబంధము
వరుసగదా పురుషునకును బ్రకృతికి నన్యో
న్యరమణ? మది సర్వజనన
కర;- మిట్టుల శ్రుతులు సెప్పుఁ గారుణ్యనిధీ. ౨౫

క. వినుము, ప్రకృతి-పురుషులభం
గి నిరూపింపంగ ముక్తికిని మార్గంబుఁ
గను వెరవు లేక యున్నది;
మునినాయక, యెఱుఁగఁ జెప్పు మోక్షపదంబున్. ౨౬

క. అనుపమ మజర మతీంద్రియ
మనామయ మనంత మమల మన వెలుఁగున ౦ం
డని వేదశాస్త్రములచే
విని యుండుదు;-దానిఁ దెలుపవే కృప నాకున్. ౨౭

వ. అని వేఁడిన నమ్మునివరుండు సాదరంబుగా నతని కి ట్లనియెః ౨౮

—•• వసిష్ఠుఁడు జనకున కక్షర-క్షరతత్త్వంబుల తెఱం గెఱింగించుట ••—

సీ. గ్రంథంబు ధరియింతు గాని నీ కర్థబో
ధంబు లేఁ; దర్థబోధవ్యపేత
మగుగ్రంధధారణ మప్రయోజనఁ; మర్థ
నిశ్చయ మెఱిఁగింతు నిపుణబుద్ధి

నవధరింపుము: సాంఖ్య మనుసరించును యోగ
తంత్రంబు;— నదియును దాని తెరువు
నొందుఁ; గావున సాంఖ్యయోగంబు లేకంబ
యని కందురి ప్రాజ్ఞులు; మనుజనాథ,

తే. సాంఖ్యమునకు యోగమునకు జనని శ్రుతియ;
పురుష వనితా నపుంసకంబు లనఁ బ్రకృతి
లింగములు గల; వాత్మం డలింగుఁ; డతనిఁ
జెంద దది యెద్దియును నని చెప్పు శ్రుతులు. ౨౯

క. విను, బీజంబున బీజం
బును, దేహమునందు దేహమును, నింద్రియముల్
దనతనవలనం దానును,
మనంబునకు మనసు—పుట్టు మహితవిచారా. ౩౦

తే. ఇతఁ డబీజం డదేహుం డనింద్రియుండు
వీతమానసుఁ డని యాత్మవిధము సెప్పు
వేదములు; భవదుఃఖకర్మాదికములు
నాతనికి లేవు—నిర్గుణుం డగుటఁ జేసి. ౩౧

చ. ప్రకృతి యలింగ; తజ్జనితభంగులు లింగము;—లట్టు లయ్యు, రం
జకగుణశీల, లింగచయసంగతిఁ దాను సలింగ యయ్యె; మూ
ర్తికలన లేక యుండియుఁ బరిస్ఫుటపుష్ప-ఫలాదిసూచక
ప్రకరముచేత మూర్త మరయి రంజిలదే బుతువేళ సూడఁగన్. ౩౨

క. కావున, గుణములు ప్రకృతివ
యేవిధమునఁ జూచినను; మహేశ్వరుని గుణి
త్వావేశము పొరయ; దస
ద్భావము సద్భావ మగునె భరితవివేకా? ౩౩

వ. ఇది యక్షర-క్షరవివేకంబు, ఏకం-బనేకంబు, దర్శనం-బదర్శనంబు,
నిస్తత్త్వంబు-తత్త్వంబు, అపవర్గంబు-వర్గంబు, అని యక్షర-క్షరంబుల
పర్యాయనిర్దేశంబులు. అక్షరంబు నప్రబుద్ధులు గానరు. ప్రబుద్ధు
లగుసాంఖ్యులును యోగులును బుద్ధికిం బరంబై [1]పంచవింశతి
తమం బయినయాత్మత్త్వంబు నాలోకింతురు అని చెప్పిన వసిష్ఠుతో
నవ్వసుమతీ వల్లభుండు—. ౩౪

సీ. 'కలదు నానాత్వ మేకత్వ మాత్మునకు;-న
విద్యయు విద్య నా విందు; నదియు
నదియును నెఱింగింపు; మక్షర—క్షర భేద
మీవు సెప్పితి;—బుద్ధి యెంతయేని
నస్థిర గాన నయ్యవబోధమును మాసె;
సాంఖ్యయోగంబులచందములును
దెలియంగఁ జెప్పఁగావలయు నా; కనుడు, న
మ్ముని యిట్టు లనియె నమ్మనుజపతికి:

తే. 'యోగ మనఁగను ధ్యానంబు; రాగరహిత,
యదియు వినుము: ప్రాణాయామ మనఁగ నొకటి;
మనసు నేకాగ్రతావృత్తి యనఁగ నొకఁడు;—
పరఁగు సగుణత్వ— నిర్గుణభావగతుల. ౩౫

వ. తదనుష్ఠానప్రకారంబు సెప్పెద— ౩౬

క. మలమూత్రంబులకాలం
బుల, భుక్తి కనంతరమున, భూవర, యోగం
బలవఱుచు రెండుమార్గం
బులును నిషిద్ధంబు లండ్రు పూర్వాచార్యుల్. ౩౭

సీ. కొంచెపు టశనంబు గొనుచు, సంగంబులఁ
బాసి, యింద్రియములపజ్జఁ జనమి,

1—ఇరువదియైదవ దగు ఆత్మత్త్వము.

శబ్దాది యైనవిషయజాత మంతరం
గంబున సందడి గాక యుండ,
సద్బుద్ధి దృఢ మగుసాధనంబుగఁ గొని
మరలిచి యాత్మన మనసు నిలిపి,
యపగతసంకల్పుఁ డై [1]యుపల స్థాణు
భంగికస్థితిఁ బనుపడి, దివంబు
తే. రాత్రియును యోగసేవాను రతి, — నివాత
దీపమునుబోలె — వెలుఁగునాత్మీయమూర్తిఁ
గనుచు, నెడ నెడ నుపరమకాలములు స
నంగ వర్తించి యోగి యానంద మొందు. ౩౮

వ. ఇది యోగప్రకారంబు. సాంఖ్యంబు తెఱఁ గెఱింగించెద— ౩౯

తే. ప్రకృతివాదు లవ్యక్తంబు ప్రకృతి యందు్రు;
ప్రసవధర్మిణి యైనయాప్రకృతి దన్ను:
బుద్ధ్యహంకారములుఁ బంచభూతములును
విషయములు నింద్రియములుఁ గా విస్తరించు. ౪౦

వ. పురుషునివలన నివి యెల్లనుం గలుగుఁ; బురుషుం డింతకు నధిష్ఠాత యైయుండు. ౪౧

క. [2]అనులోమంబున సృష్టియు,
జనవర, ప్రతిలోమవృత్తి సంహారముఁ గ
ల్గును; జనన-ప్రళయంబులఁ
దనకు బహుత్వంబు నేకతయు శోభిల్లున్. ౪౨

వ. క్షేత్రం బన, నవ్యక్తం బనం, బ్రకృతి యనం, బ్రధానం బనం, బరఁగుతత్త్వం బొక్కటియ; — దానిన సత్త్వంబు నందు్రు జీవుం

---

1=ఱాయివలెను, మోడువలెను. 2=ఆరోహణమున (=ఎక్కుటచే) పుట్టువును, అవరోణహామున (=దిగుటచే) చావును గల్గును.

డా క్షేత్రంబు నెఱింగెడివాఁడు గావున క్షేత్రజ్ఞుఁడును, నవ్యక్తపురంబున వసియించుటంజేసి పురుషుండు నన వెలుంగు. క్షేత్ర-క్షేత్రజ్ఞులు వే ఱగుట ప్రస్ఫుటంబు. అవ్యక్తంబు జ్ఞానంబు. పురుషుండు జ్ఞేయుండు. ప్రకృతి సగుణాత్మిక. పురుషుండు నిర్గుణుండు — ఇది సాంఖ్యప్రకారంబు. ఇట్లు పరిసంఖ్యానరూపంబునఁ జతుర్వింశతి తత్త్వంబుల నేర్పరించి పురుషుండు దన్నుఁదానచూడం గైవల్యంబు సిద్ధించు.— ఇట్టిది యపునరావృత్తిపదంబు; తత్త్వసమూనాంబు; అప్రబుద్ధంబు—అది క్షరంబు. పంచవింశతితత్త్వవిశిష్టుండగు పురుషుండు ప్రబుద్ధుండు, అక్షరంబు అనం బరఁగు. ఇత్తెఱం గెఱింగిన వారెల్లవలనను నిర్భయులు. భూవర, యోగంబును సాంఖ్యంబును నక్షరంబును క్షరంబును జెప్పితి; విద్యావిద్యలు సెప్పెద నాకర్ణింపుము— ౪౩

ఆ. విద్య యనఁగఁ బంచవింశతితమతత్త్వ
మైనయక్షరంబు; మాన వేంద్ర,
విను, మవిద్య నాఁగఁ జనుఁ బ్రధానము దేట
పఱిచెదను విశేషభంగు లెల్ల. ౪౪

—విద్యావిద్యల ప్రకారనిరూపణము—

వ. కర్మేంద్రియంబులకు బుద్ధీంద్రియంబు విద్య. బుద్ధీంద్రియంబులకు మనస్సును, మనస్సునకు భూతపంచకంబును, భూతపంచకంబునకు నహంకారంబును, నహంకారంబునకు బుద్ధియు, బుద్ధికి నవ్యక్తంబును, నవ్యక్తంబునకుం బంచవింశతితమతత్త్వంబును—విద్యలు' అని చెప్పి, వెండియు నమ్మునివరుం డిట్లనియె: ౪౫

తే. క్షరము నక్షరమును నన నలుగు రెంటి
నేర్పఱిచి మున్ను సెప్పితి; నింక నొకటి

సెప్పఁగలదు సమగ్రవిశేషకలిత;
ఘనహితుండవై విను విదేహాధినాథ. ౪౬

సీ. జీవుండుఁ-బ్రకృతియు, భూవర, యక్షర-
క్షరములు; - నీరెంటిని క్షరము లనియు
నార్యులు సెప్పుదు; రక్షరంబులు నందు:
రాద్యంతరహితంబు లగుట, యీశ్వ
ర త్త్వంబు గల్గుట, తత్త్వాదికము లనఁ
జనుట; — రెంటికి సదృశంబు సూవె!
ప్రకృతిగుణంబులై పరఁగెడు మహదహం
కారాదికంబులఁ గలసినపుడు

ఆ. క్షర మనంగ వచ్చుఁ; బురుషునిఁ బ్రకృతి తా
నని తలంచుఁ గాన నదియుఁ బురుషుఁ
బొంద, గుణవికారములు లేమి, నిర్గుణ
మక్షరం బనంగ నగును దాని. ౪౭

వ. ఎప్పుడు పురుషుండు ప్రబుద్ధుం డయ్యె నప్పు డతండు, ౪౮

ఆ. ఇంతకాలమేని నెఱుఁగక సంగాభి
భూత యగుచు నప్రబోధ కలిత
మైన యట్టి ప్రకృతియే నంటి! నిస్సంగ
బోధమహిమ గానఁ బోల దయ్యె! ౪౯

క. ప్రకృతికి నాకును,- నుదకము
నకు మత్స్యంబునకుఁ బోలె, — నైసర్గిక మై
ప్రకటం బైనది వేర్పా;
టకట! యహంకారవశత నది యే నంటిఁ! ౫౦

క. ప్రకృతి గుణంబులఁ గొని బహు
వికృతపు రూపముల నట్లు వెట్టిగొలిపె; నే

సకలంకుండ నరూపుఁడఁ
బ్రకృతి దొలఁగి నిలిచెదను నిరంజనమహిమన్. ౫౧

తే. ప్రకృతి సేసెనె యీయపరాధ? - మరియు
నాయది యు కాక వేఱొకండే? యసంగ
కలితుఁ డగు నేను దానితోఁ గలయ నేల?
కలిగె బహురూపములు దానఁ గాదె నాకు? ౫౨

క. మమతం గాదే బహు జ
న్మము లయ్యెడు! దీని విడిచి నానాయోని
భ్రమణంబుం బాసెద; స
త్యమలుఁడ నగు నాకుఁ బ్రకృతి యాశ్రయ మేలా? ౫౩

తే. ఎన్నిరూపులు గొనివచ్చి యెట్లు పొడవు
సూపెనేనియు దాని నేఁ జూడ. మమత
నా, నహంకార మనఁ గల్గు; వానిఁ జేర
నీక తొలఁచినఁ బ్రకృతిదా నెట్లుఁ దోఁచు? ౫౪

క. నిశ్చేతనయును నెంతయు
దుశ్చేష్టయు నైనప్రకృతి దొలఁగి సముద్య
న్నిశ్చయవృత్తి నిరామయ
నిశ్చలనిర్మల పదైకనిరతుఁడ నగుదున్. ౫౫

వ. అని యిట్లు పరమసంబోధనంబునం జేసి క్షరం బగునవ్యక్తంబు దొలంగిన పంచవింశకుం డక్షరం బనం బరఁగు. అక్షరంబునకుం బరంబైనదానిం బెక్కండ్రెఱుంగరు; - సాంఖ్యసూక్ష్మతత్త్వదర్శకులు గాంతురు. క్షరాక్షరపరంబు లప్రబుద్ధ బుధ్యమానబుద్ధంబు లనునిర్దేశంబులు గలిగి యుండు. పరతత్త్వ నిర్దేశంబునం బొల్పుషడ్వింశకంబు బుద్ధంబును విమలంబును నప్రమేయంబును

సనాతనంబును నై, పంచవింశంబును జతుర్వింశంబునుం గనుచు
వెలుంగు నని చెప్పి వెండియు, ౫౬

క. విను, దృశ్యంబు నదృశ్యం
బును నగుజీవ - పరతత్త్వములు బ్రహ్మాసమా
ఖ్యను నెగడుఁ; బ్రకృతి కది లే
దనఘా, యక్షరము తెఱఁగు నభివర్ణింతున్. ౫౭

ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ బరికించుజీవుండు
పరము గాంచునపుడు ప్రకృతి సగుణ
తానిరూఢి యడఁగి తన్మయత్త్వము నొంది
జీవకేవలత్వసిద్ధి యొలయు. ౫౮

క. విను, కేవలుఁ డగుజీవుఁడు
దను బరముంగాఁగఁ జూచి తల్లీనత్వం
బున వెలుఁగు; — నది నిరామయ
మనంత మగుపదము సూవె యతులవివేకా! ౫౯

క. ఈనెఱి పురుషునకుం గల
నానాత్వైకత్వములును, నరనాయక, శా
స్త్రానూనదృష్టిఁ గనుఁగొనఁ
గానగుఁ దాత్పర్యశుద్ధికలితాత్మునకున్. ౬౦

క. అనఘా, మోక్షము తెఱఁ గిది.
విను, మోక్షణ మిట్లు పంచవింశకునకుఁగాఁ
గనినది; — యతండు ప్రకృతిం
దనుఁగాఁ గొని తద్గుణములఁ దగులుటవలనన్. ౬౧

తే. తగులు వాసి, షడ్వింశకత్వమునఁ గలయఁ,
దనకు మును లేని కేవలత్వమును నిర్మ

లత్త్వ శుచితా స్వతంత్రత్వ సత్త్వపరత
లొందుఁ—[1]దద్ధర్మసమవాయ పొలసి యధిప. ౬౨

వ. అని యిట్లు ప్రబోధించి, ౬౩

క. శివమును బరమబ్రహ్మము
సవికృతియు సనాతనంబు నగుపదమును, భూ
ధవ, యెఱిఁగించితి; నిర్భయుఁ
డవు గ;—మ్మలవఱుపు మిది దృఢంబుగ నాత్మన్. ౬౪

తే. దీని నెఱిఁగించునపుడు భక్తియును శమము
దమము సంశ్రయమును వేదతత్పరతయుఁ
గలుగఁ జూచి యెఱింగింపు; కాని వాని
కీకు మీవిద్య పాత్రదానైకనిరత. ౬౫

ఆ. అఖిలరత్నపూర్ణ యగువసుంధర యెల్ల
నొసఁగితేని నొసఁగు; యోగ్యతాభి
యుక్తి లేనివాని కొసఁగకు మీవిద్య;
తగినపాత్ర మైనఁ దడయ కిమ్ము. ౬౬

క. అని చెప్పు, నియతుఁడై విని
జనకనృపాలుఁడు కృతార్థజన్ముం డయ్యెన్;
మనుజేంద్రవర్య, నీ కే
వినిపించితిఁ దదితిహాసవిధ మేర్పడఁగన్. ౬౭

వ. అని పలికి భీష్ముండు పాండవాగ్రజున కి ట్లనియె: ౬౮

క. ఇది బ్రహ్మ వసిష్ఠునకు
నృదయుండై చెప్పె; నతఁడు నారదునకు సం
విదితంబు సేసె; నమ్ముని
మదాత్మకుం దేటపఱిచె మహనీయకృపన్. ౬౯

1. = ఆధర్మములతోఁ గూడిన సంబంధముం గలిగి...

క. ఏను వసిష్ఠువచనముల
కా నెఱిఁగించితి; మనంబుకలఁక విడిచి యీ
జ్ఞానం బలవఱుపుము;-పర
మానందప్రదము కౌరవాన్వయముఖ్యా. ౨౦

క. క్షరమును నక్షరమును ద
త్పరమును నెఱిఁగితి; విశోక-భయ-మోహుఁడ వై-
కురువర, [1]యానిశ్శ్రేయస
కరప్రబోధంబు నూఁదు గాఢాదరతన్. ౨౧

వ. అని చెప్పి వెండియు, ౨౨

సీ. వేఁట వేడుక నడవికిఁ జని వసుమంతుఁ
డనువాఁడు, జనకునితనయుఁ డొక్క-
చో భృగువంశతేజోవర్ధనుం డగు
నొకమునీశ్వరుఁ జూచి, యుచితవృత్తిఁ
జేరి వినమ్రుఁడై చిత్తానువృత్తి మై:
'నిహపరంబుల కెద్ది హితము సెప్పు
వే' యన్నఁ, గృప నతం డి ట్లను: 'భూతహి
తాహితాచరణంబు, లధిప, సౌఖ్య

ఆ. 'దుఃఖముల నొసర్చు దుర్వారతృష్ణ; త
న్నిరసనంబు మేలు; నరులు [2]జూఁటి
చవియకాని నొగులుఁజఱి రయంబున నెక్కి-
తారు విఱుగఁబడుటఁ దలఁపలేరు. ౨౩

క. 'ధర్మంబుఁ బరిజ్ఞానము
నిర్మలమతి నభ్యసించి, నృప, యనిశంబున్

1. = ఆమోక్షము నిచ్చు మేల్కొల్పును అవలంబింపుము. 2 = తేనెచవికి ఆశింతురే కాని, దుఃఖ మనుకొండ నెత్తి మెక్కి తాము విఱుగఁబడుదు మని తలఁపరు.

ధార్మిక సంగతి గలిగినఁ
బేర్మి యుభయలోకముల [1]నభిష్టుత్యు మగుఁగా.' ౭౪

వ. అని మఱియును, ౭౫

తే. బ్రాహ్మణప్రార్థితము లైన పనులు సేయు;
మిమ్ము ధనము పాత్రములకు; నిచ్చి వగవ
కుండు; మక్రోధ కామత్వ మొలయఁ జేయు
మతికి; ధృతి సాలఁ గల్గుము మనుజనాథ. ౭౬

వ. ధృతిలేమిం గాదె మహాభిషాఖ్యుం డగున్నృపముఖ్యుండు త్రివిష్టపం
బుననుండి విభ్రష్టుం డయ్యె? ధృత్యాలంబనంబునంగదా యయాతి
యాపద నిస్తరించె? ౭౭

క. అనిన విని, యానృపతి య
మ్మునివచనము లూఁది, కామమునకుం గ్రోధం
బునకుం దొలఁగించి తనదు
మనము ధృతికి ధర్మమునకు మరగం జేసెన్. ౭౮

వ. అని చెప్పినం బ్రియం బంది మందాకినీనందనుతో ధర్మనందనుండు:
'ధర్మాధర్మ వియుక్తంబును సర్వసంశయవిముక్తంబును జన్మమృత్యు
రహితంబును నిత్యంబును శుచియును శివంబును నవ్యయంబును
బరంబును ననాయాసంబును నగునట్టిదాని నెఱింగింపవే!' యని
ప్రార్థించిన, నతఁడు: 'యాజ్ఞవల్క్య-జనక సంవాదం బితిహాస
రూపంబునం బ్రవర్తిల్లు; అది వినిన భవదభ్యర్థితం బైనయర్థంబు
ప్రతిభాసించు. మఱియు వలయునవి యెఱుంగ నగుం జెప్పెద' నని
పలికి యతని కిట్లనియె:— ౭౯

## —యాజ్ఞవల్క్య-జనక రాజసంవాదప్రకారము.—

ఆ. వినుము, సకలలోకవిశ్రుతవిజ్ఞాన
ఘనుని యాజ్ఞవల్క్యుఁ డనుమునీంద్రు

[1] పా. గద్దెఁ దగిన దగును

వినయ మొప్పఁ గాంచి వినతుఁడై మిథిలేశుఁ
డైనజనకనృపతి యతనితోడ: ౮౦

వ. 'ఇంద్రియంబులు నవ్యక్తంబును బ్రహ్మంబును బరంబును భూత సర్గ-ప్రళయంబులును దత్కాలసంఖ్యలును దేటపఱిచి భవదీయ దయాళుత్వంబు నెఱపవే!' యనిన, నమ్మునివరుం డమ్మహీవరున కిట్లనియె: ౭౧

సీ. అధిప, సర్గముఁ బ్రళయంబు నవ్యక్తంబు
దా నొనరించుఁ దత్కాలసంఖ్య;-
విను: కల్పములు పది దినమున; కంతియ
రజనికాలంబు; సర్గంబు పగలు
సేయు; రే ప్రళయంబు సెల్లించుఁ; దొలుత న
శేషభూతములకు జీవనముగ
నోషధికల్పన మొనరించుదాన్నికై
హైరణ్య మైనమహాండమున వి
తే. ధాతఁ బుట్టించు; నతఁడు భూతముల నెల్ల
జనన మొందించు; భూమ్యాదిసారభూత
గంధముఖ్యగుణోత్కరగ్రాహకములు
శ్రోత్రముఖములు; తత్స్వామి సూవె మనసు! ౮౨

వ. అది యెట్లంటేని— ౮౩

క. వినుటకును గనుటకును సా
ధనము లయినచెవియుఁ గన్నుఁ-దనదనయంతః
విననుం గానను నేర్చునె
మనఃప్రభావమునఁ గాక మనుజాధీశా? ౮౪

తే. ఇంద్రియము లెల్ల నట్టివ;-యెలసి యొండు
వలన మన సున్నఁ దమతమవర్తనముల

నిగుడ నేరమి దెల్లంబు; నృపవరేణ్య,
యిట్టు లగు టజ్ఞులకు నైన నెఱుఁగవచ్చు. ౨౫

తే. మనసుచేతివ యింద్రియమహిమ లెల్ల;—
నుపరతం బైన మనసుతో నుడిగి మడఁగు;
నింద్రియము లుపరమ మొందెనేని దాన
మనసు మగుడదు;— విషయతృష్ణను జరించు. ౨౬

క. కావున, నింద్రియచేష్టల
నేవలనికిఁ బోవ నీమి యింతకు ముఖ్యం
బై వడిగొనుమనసు దిగువఁ
గా వలయును; మగుడ దీనిఁ గనుఁగొను మనఘా. ౨౭

వ. ప్రళయప్రకారంబు వినుము: రాత్రి యగుటయు, నవ్యక్తం బహం
కృతిపురుషు బోధించిన, నతండు పండ్రెండు మూర్తులుగా నొని రశ్మి
జాలంబుల జరాయుజప్రభృతిసర్వభూతంబులను యూపుమాపినం
[1]గూర్మపృష్ఠంబునుంబోనిపృథివి జలమయం బగు. జలంబు లోకంబు
లెల్లం దనమయంబకాఁ బేర్చి తన్నుం గాఁగాగ్ని మడియింపం
గుదియు. ప్రజ్వలజ్వాలాభీలం బగునయ్యనలం బనిలంబుచేతం
జెడు. ఎందునుం దాన యై పరఁగునమ్మహాబలు నాకసంబు మ్రింగు.
అతివితతం బగు [2]నవ్వియత్తత్త్వంబు మనఁబు గ్రసింయుంచు. మనంబు
నయ్యహంకారాధిష్ఠితపురుషుండు గబళించు. అయ్యహంకృతి
నవ్యక్తంబు లోఁగొను.— ఇట్లు రేయి వోయిన నెప్పటివిధంబు
ప్రవర్తిల్లు. ౨౮

క. ప్రీతిగ నధ్యాత్మము నధి
భూతము నధిదైవతంబు, భూవర, సంప్ర

1. తాఁబేటి వీపుఁటి భూమి. 2. ఆయాకాశ తత్త్వము.

దోష్యతితములుగాఁ జెప్పెద
నా తెఱఁగు ప్రబోధకారి యగు నూహింపన్. ౮౯

—•• అధ్యాత్మాధిభూతాధిదైవతప్రకారము. ••—

సీ. [1]పాదపాయూపస్థ పాణి వాక్కులు, విను,
మధ్యాత్మములు; దత్క్రమానుయుక్తి
గంతవ్యమును, విసర్గంబు, నానందంబుఁ,
గర్తవ్య వక్తవ్యకములు నయ్యె
నధిభూతములు; వాని కధిదైవములు:
వరుసన [2]విష్ణు మిత్త్రి ప్రజాపతులును
శక్రి పావకులును, జక్షువు జిహ్వయు
ఘ్రాణంబుఁ ద్వక్కు శ్రోత్రంబుఁ జూవె,
తే. యనఘ, యధ్యాత్మములు! రూపమును రసంబుఁ
జాలుపడ గంధ సంస్పర్శ శబ్దములును
దదధిభూతంబు; లధిదైవతములు: సూర్య
జల మహీ వాయు దిశ లండ్రు శాస్త్రవిదులు. ౯౦

క. మన మధ్యాత్మము; దానికి,
ననఘా, మంతవ్య మందు రధిభూతము; చం
ద్రుని నధిదైవతముగ బుధ
జనములు సెప్పుదురు శ్రుతివచఃప్రతిపత్తిన్. ౯౧

తే. బుద్ధి యధ్యాత్మ మనఁ జను; భూపవర్య,
దాని కధిభూత మండ్రు బోద్ధవ్య మైన
దానిఁ; బొల్పుతదీయాధిదైవతంబు—
వినుము: క్షేత్రజ్ఞుఁ డని చెప్పు వేదచయము. ౯౨

1=పాదము మలమూత్రద్వారములును, హస్తము, వాకు ... వాని క్రమముగా: నడచుట, విడుచుట, ఆనందించుట, చేయుట, మాటాడుట ...... 2=విష్ణువు. సూర్యుఁడు, బ్రహ్మ, ఇంద్రుఁడు, అగ్ని...

క. ఆరయ నధ్యాత్మ మహం
కారం; బధిభూతనామకం బభిమానం;
బారూఢయశఃపరమో
దారా, రుద్రుఁ డధిదైవతం బన నెగడున్. ౯౩

తే. ధరణివల్లభ, చిత్త మధ్యాత్మ మనఁగఁ
బరఁగుఁ; [1]చేతయితవ్యంబు భావితాత్మ
లైనమహనీయు లధిభూత మండ్రు; బ్రహ్మ
మంచితాధిదైవత మను నాగమములు. ౯४

వ. అని చెప్పి ప్రకృతి-పురుషప్రకారంబులు వినుట మనోనిర్వికారత్వ
కారణం బగు నను పలుకు వలికి యిట్లనియె: ౯౫

క. ప్రకృతి దనయిచ్చఁ గ్రీడా
ర్థకముగ: సత్త్వాదిగుణవితానము నానా
వికృతులఁ బొందింప నసం
ఖ్యకవిధ మై పరఁగు చుండు నది మను జేంద్రా. ౯౬

క. దీపమున ననేకము లగు
దీపములు పరంపరానుదీప్తాకృతు లై
వ్యాపించుచందమున—గుణ
రూపంబులఁ బరపుఁ బ్రకృతి రోషవిదూరా. ౯౭

సీ. సత్త్వగుణంబులు: సంతోష, మానంద,
మారోగ్య, మక్రోధ, మార్జవంబు,
శుద్ధి, ప్రకాశత, సుస్థిరత్వ, మహింస,
నిర్మలశ్రద్ధ, వినీతి, లజ్జ,
సత్యంబు, శౌచంబు, సమత, యాచారం, [2]బు
కార్పణ్య పైశున్య కామవృత్తి;

1 చిత్త వ్యాపారము. 2 కార్పణ్యము, పిశినిగొట్టుతనము, కామవర్తనము లేకుండుట.

వినుఁ, రజోగుణములు: విగ్రహ దర్పాభి
మాన కామ క్రోధ మత్సరములు,
ఆ. కరుణ లేమి, భోగకాంక్ష, యహంకార,
ముమ్మలిక; తమోగుణమ్ము: లప్ర
కాశ మోహ బహుతరాశన వాద ప్ర
మాద మౌర్ఖ్య మరణఖేదనములు. ౯౮

క. [1]ప్రకృతికిని గుణములం గొని,
యకలంకుఁ డైనయంతరాత్ముని వేవే
ల్వికృతులఁ బొందించుట వా
యక కలుగుఁ; దత్స్వభావ మది యరయంగన్. ౯౯

క. [2]పురుషుఁడు చైతన్యాత్ముఁడు;
నరనాయక, ప్రకృతి చేతనారహిత;-జగ
ద్ధరఁ బురుషుని వెలుఁగునఁ దా
ధరియించుఁ, బురుషుఁ దిగుచుఁ దనమొయిఁ దిరుగన్. ౧౦౦

ఉ. [3]సత్త్వ రజ స్తమోగుణవశస్థితిఁ గేవలపుణ్యమిశ్రకా
రిత్వవిరుద్ధకర్మములఁ బ్రేరితమై — కను నూర్ధ్వలోకసే
విత్వము, మానుషత్వపదవీకలనంబును, రౌరవంబు;—నా
తత్త్వము దన్నెఱుంగమి ప్రధానముచేతల నావహిల్లినన్. ౧౦౧

---

1. తా. నిర్మలుఁడైన అంతరాత్మని తనగుణములచే లోఁగొని వేనవేలు వికారముల నెల్లపుడును ప్రకృతి బొందించు-చుండుట గలదు; అట్లు బొందించుట ఆప్రకృతికి స్వభావము. 2. తా. పురుషుఁడు ప్రాణముగలవాఁడు. ప్రకృతిప్రాణము లేనిది. జగత్తుయొక్క భారమునను పురుషుని వెలుఁగునను తాను (=ఆప్రకృతి) చైత్యమును ధరించును; పురుషుని తనవంకకుఁ దిరుగునట్లు లాగును. 3. తా. ఆతత్త్వము (=ఆత్మ) ప్రకృతి చేతలలోఁబడి, తన్నుఁ దాఁదెలియనేరక, సత్త్వరజస్తమోగుణములకు వశమై కేవలపుణ్యమును జేసి ఉత్తమలోక సేవిత్వమును బొందును. పుణ్యపాపములు గలిసిన (మిశ్రి) కర్మములచే మనుష్యత్వమును బొందును. విరుద్ధకర్మముల (చెడుపనుల)చే రౌరవనరకమును బొందును.

క. [1]తను నెఱిఁగిన నవ్యక్తము
చనవునఁ బోఁ డాత్మ్యుఁడు; - డజర శాశ్వత విగతాం
జన విమలాచ్యుతపదముం
గని యక్షరుఁ డగు నిజప్రకాశస్థిరతన్. ౧౦౨

వ. అనిన విని జనకపతి యమ్మునిపతితో: 'అనాదినిధనంబులు న మూర్తంబులు నచలంబులు నగ్రాహ్యంబులు నగుపురుష - ప్రకృతి తత్త్వంబుల యం దొక్కటి సచేతనం బై యుండఁ దక్కినయది చేతనారహితం బగుటకుం గతం బేమి యెఱింగింపవే-యనుటయు, నతం డతని కి ట్లనియె: ౧౦౩

క. సగుణం బగుణం బగునే?
యగుణము సగుణ మగు నెట్లు? లవ్యక్తము ని
త్యగుణసమవేత మై జడ
త గలిగి యుండంగఁ బురుషధర్మము గలదే? ౧౦౪

క. పురుషునికలరూ పెఱిఁగెడు
పరిబోధము లేక యుండుఁ బ్రకృతికిఁ; బ్రకృతిం
బురుషుఁ డెఱుంగును; దనకుం
బరంబు లే దనియుఁ గను శుభస్థిరదృష్టిన్. ౧౦౫

క. కావునఁ, బ్రకృతి యచేతన;
భూవల్లభ, చేతనుండు పురుషుఁడు; సమ్య
గ్భావన యలవడినమునీం
ద్రావలి యిమ్మెయి సునిశ్చయంబుగఁ బలుకున్. ౧౦౬

వ. అని వెండియు, . ౧౦౭

1. తా. ఆత్మ్యుఁడు త న్నెఱిఁగినచో వ్యక్తముకాని విషయమువెంటఁబోవఁడు; ముసలితనము అనునదిలేక శాశ్వతమును నిర్మలమును నాశనమునులేని పదముంగని తన ప్రకాశము స్థిర మగుటచే ముక్తుఁ డగును.

ఆ. [1]తాను ప్రకృతిఁ, బ్రకృతి తనయందు నిల్చు; ని
ల్చినను దాన వికృతిఁ జెందకుండుఁ
బురుషుఁ;—డుదక-మత్స్యముల, యుదుంబర-మశ
కములసంగమంబుకరణి గలుగ. ౧౦౮

ఆ. జలముఁ గదిసి యుండ జలముచే నార్ద్రంబు
గాక యుండునట్టికమలదళము
భంగి, నంతరాత్మ ప్రకృతిఁ బొందియును ద
ద్వికృతిఁ బొందకుండు వీతదోష. ౧౦౯

వ. ఇది సాంఖ్యానుభవంబు; యోగంబు తెఱంగెఱింగించెద- ౧౧౦

క. [2]విను, సాంఖ్యసమజ్ఞానం
బును యోగసమానబలము, భూవర, లే వెం
దును; నవి రెండును వేఱుగఁ
గను బాలిశుఁ;—డొక్క-తెరువ కా నేఁ గందున్. ౧౧౧

క. జననాథ, మనోధారణ
యును బ్రాణాయామవిధియు నుపయోగ్యము లై
చను, నిర్గుణమును సగుణం
బును ననఁగా రెండుతంత్రములు యోగమునన్. ౧౧౨

క. ప్రాణాయామము గ్రమమునఁ
బ్రాణోత్పీడనము గానిభంగి నడపుచున్,
[3]ఘ్రాణాగ్రస్థితి విషయ
శ్రేణి దొలఁగి యుండి యోగసిద్ధతఁ బడయున్. ౧౧౩

1. తా. నీటియందు మత్స్యములు, మేడిపండున దోమలు ఉన్నట్టుల తాను ప్రకృతియందును, తనయందుఁ బ్రకృతియు నిలుచును. అట్లు నిలిచినను దాని వలనఁ బురుషుఁడు వికారముఁ జెందఁడు. 2. తా. విను, సాంఖ్యమునకు సరియగు జ్ఞానమును, యోగమునకు సరియగు బలమును ఎందును లేవు. ఆరెంటిని మూర్ఖుఁడు వేఱుగా జూచును; నే నొకటే మార్గముగాఁ జూతును. 3. తా. ముక్కుకొనయందు చూపు నిలిపి విషయము (= ఇంద్రియముల చాపల్యము) లను విడిచి యోగసిద్ధతం బడయును.

వ. ఎట్లం టేని— ౧౧౪

తే. కరము నియతుఁ డై శాంతేసి కాలముల శ
రీరధర్మావిరోధిగా రేయుఁ బగలుఁ
బ్రాణసంయమనము నడపంగవలయు;—
దానఁ జిత్తంబుఁ దనువు శుద్ధతవహించు. ౧౧౫

వ. అది సిద్ధత్వసంపదకు మూలము; ఇది సగుణతంత్రంబు తెఱంగు; నిర్గుణతంత్రప్రకారం బెఱింగించెద— ౧౧౬

తే. ఇంద్రియంబులు మనమునం దిపురఁ జేసి,
మనసుఁ దిగిచి యహంకారమున నడంచి,
బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి, బుద్ధి
బ్రకృతిఁ గలఁపఁ—దద్ధ్యానతత్పరత గలుగు. ౧౧౭

క. ధ్యానైకతత్పరాత్ముఁడు
గానఁ బడయుఁ: నజరు నిర్వికల్పు విమలు ని
త్యానందసత్యశుద్ధ
జ్ఞానమయుం బరము నచలు శాశ్వతుని శివున్. ౧౧౮

చ. ఉదితసమగ్రబోధుఁ డగు యోగికి : నిశ్చలదీపరూపసం
పద, సుఖసుప్తభంగి, ఘనపంక్తులు లేనివియత్తలంబు నొ
ప్పిద మొదవుం, దరంగములు పెల్లునఁ దాఁ జలితంబు గానివా
ర్ధిదశ నతం డగు పుఁ డగు ధీపరివృత్తులు గట్టై నేనియున్. ౧౧౯

క. భేరీశంఖాదికనాదాలు వాడమొనేసి నాతఁడు దానం
గారింపఁబడఁడు;పేతవి,కారస్థితిఁ బొలిచియుండు గగనముభంగిన్.

క. తేనియకుంకఁ గొనుము సో
పానము లేమఱుట లేక పాక్రికినక్రియ,— నా
త్మానందరసం బొకకణ
మైనఁ జిలుక నిక తుదికి నాతం డెక్కున్. ౧౨౧

క. అనఘ, యిది యోగపథం; బిం
[1]దనలసుఁడై చనఁగఁ జాలునతఁడు కృతార్థుం,
[2]డనితరసులభపదప్రా
ప్తినిరఘుఁ డనామయుం డభిష్టుతుఁ డెందున్. ౧౨౨

వ. అని యుపదేశించి వెండియు, ౧౨౩

సీ. [3]నరనాథ, యుత్క్రమణప్రదేశంబులు:
పాద జంఘా జాను పాయు గుహ్యా
ములు, నూరు పార్శ్వ నాభులు, బాహు వక్షో గ
ళానన శ్రోత్ర నాసాంబకములు,
భ్రూ ఫాల మస్తకంబులు;—నోలి విష్ణుండు,
వసు సాధ్య మిత్రులు, వసుధయును, బ్ర
జాపతి మరు దిందు సంక్రందన స్థాణు
లును, నరుం డను మహామునియు, విశ్వ

తే. దేవ దిగ్గంధవహులును, బావకుండు,
నశ్వి పితృ శతానందులు—నందు వెలుఁగు
చంద్రు హృన్మయపవనక్రమోత్క్రమముల
నొందునద్దైవతంబుల యోగివరుఁడు. ౧౨౪

---

1.=అలసత్వము (=సోమరితనము; మాంద్యము) లేనివాఁడై,... 2. తా. ఇతరులకు లభింపని పదమునందుఁ గలఁడ, రోగములేనివాఁడు, పొగడొందినవాఁడు. 3. తా. పాదములు, పిక్కలు, మోకాళ్ళు, మలమూత్రద్వారములు, తొడలు, ప్రక్కలు, నాభి (=బొడ్డు) భుజములు, ఱొమ్ము, కంఠము, నోరు, చెవులు, ముక్కు, కనులు, కనుబొమలు, నుదురు, శిరస్సు—ఇవి ప్రాణములు లేచి పోవు, ద్వారములు—ఆయువు పట్టులు. వీనియందు వరుసగా నొక్కొక్క—దానియందు విష్ణువు, వసువులు దేవసాధ్యులు, సూర్యుఁడు, భూమియు, బ్రహ్మయు, మరుత్=దేవగణము, (ఇందు=) చంద్రుఁడును, ఇంద్రుఁడు, శివుఁడు, నరుఁ డను మహామునియు, విశ్వదేవతలును, దిక్కులు, వాయువు, అగ్ని, అశ్వినీదేవతలు, పితృదేవతలు, బ్రహ్మయు వెలుఁగు చుందురు. హృదయమున ఆవరించియున్న వాయువులను క్రమముగా వదలఁ గలుగుటచే యోగివరుఁడు ఆ దైవతములను పొందును.

-యాజ్ఞవల్క్యుఁడు జనకునితో మరణసూచకంబులఁ జెప్పుట.-

వ. అని చెప్పి మఱియు ని ట్లను: అరిష్టంబుల తెఱం గెఱుంగవలయుం
గావున నెఱింగించెద నాకర్ణింపుము— ౧౨౫

సీ. ధ్రువమండలమున నరుంధతిఁ గనుశక్తిఁ
గంటికిఁ గలుగంగఁ గానకున్న,
ముక్కునవలపటఁ జెక్కువాసినయట్లు
దోఁచిన, బూర్ణచంద్రుండు మలినుఁ
డై కాన వచ్చిన, నాయువు సంవత్స
రంబునఁ గడచను; రాజముఖ్య,
కాంతి దొల్లిటియట్లు గాక యంతకు నెక్కు
డైనను, గడు జెడ్డ, నట్లు ప్రజ్ఞ

తే. క్రొత్తగాఁ బెద్ద యైనను, గొంచె మైన,—
నాఱునెలల మరణదశ యగుట గలుగు;
నిందుమండలమున రవియందు నడుమ
దెఱపిగాంచినఁ దెగు నేడుదివసములకు. ౧౨౬

క. [1]విను, గుడిలో నున్న సమయ
మున సురభిద్రవ్యములను బొల వల్చుట గ
ల్గిన నాఱుదివసములఁ గ
ల్గును మృత్యుసమాగమంబు గుణరత్ననిధీ. ౧౨౭

తే. ముక్కు వ్రాలుట, కర్ణముల్ మొగ్గఁబడుట,
రదనవైవర్ణ్య, మక్షి విరాగభావ,
మంగ మతికృష్ణ మగు, టుల్ల మడరఁ జెడుట,—
సూచకములు సద్యోమృత్యు గోచరతకు. ౧౨౮

1. తా. దేవాలయమున నున్న సమయమున అందలి సుగంధద్రవ్యములనుండి
దుర్గంధము గొట్టినచో ఆఱుదినములలోఁ జావు వచ్చును.

తే. కారణము లేక దాపలికనుద్రవించు-
నెత్తిచక్కటి ధూమంబు నెగయు– నపుడ
మరణదశ యావహిల్లెడు మానవునకు;
జనకనృప, యివి బ్రహ్మ సెప్పిన విధములు. ౧౨౯

క. విను, యోగివరుఁ డరిష్టము
గనుఁగొని యనిశమును యోగగతియుతసాంఖ్యం
బనపాయత నడపుచు నా
త్మనిఁ బరముం జేర్చి కాలముం గబళించున్. ౧౩౦

వ. ఇవ్విధమున నతండు– ౧౩౧

ఆ. కాలకబళనైకశీలుఁ డై మృత్యువు
గెలిచి, శాశ్వతము నచలము శివము
నచ్యుతము ననామయము నమృతము నవ్య
యంబు నగుపదంబునందు నిలుచు. ౧౩౨

వ. అని పలికి యాజ్ఞవల్క్యమునీశ్వరుండు జనకజనేశ్వరుతోఁ బరంబు దేటపఱుపు మని నీ వడిగితివి. ఆప్రశ్నంబు సూక్ష్మంబు; ఉత్తరం బవహితుండ వయి విను మని యిట్లనియె: ౧౩౩

సీ. మహనీయతపమున మార్తాండు నాకుఁ బ్ర
సన్నుఁగాఁ జేసితి సదయదృష్టి;
ననుఁ జూచి యద్దేవుఁ: 'డనఘ, వరంబు నీ
కిచ్చెద నీకోర్కి యెద్ది సెప్పు'
మనవుడుఁ, బ్రణతుండ నై: '[1]యజుస్సంప్రాప్తి
గోరెద' ననిన, నవ్వారిజాప్తుఁ:

---

1 యజుర్వేదము రాఁ గోరెదను.

'డక్లేని వాగ్దేవి నావహించెద విప్ర
తంబుగాఁ జేయు మాస్యంబు విప్ర'

తే. యనియె; నవ్వచనము విని యానమ్ము
సంతసమున విచ్చితి; సరస్వతియు నాదు
తనువుఁ జొచ్చెఁ; బదంపడి దాహ మొంది
తన్ను నెఱుఁగక వెగడొందు నన్ను, నినుఁడు— ౧౩౪

క. కనుఁగొని: 'యించుక సేపునఁ
[1]దనువడు' నని పలికెఁ; బిదపఁ దనువడుటయునుం
బనుపడియె; నప్పు డద్దే
వునివద నాబ్జమున నాచెవుల కింపారన్— ౧౩౫

క. 'భూసురవర, వేదము ప్రీతి
భాసిల్లుచు సాంతత్రపత్తి గలుగు; ను
ల్లాసంబు బుద్ధి నొందు; [2]స
మాసన్నంబు లగు సాంఖ్యమతయోగంబుల్. ౧౩౬

ఆ. 'యోగసాంఖ్యసిద్ధి నొందు నిష్ఠావాప్తి
సనుము సమ్మదమున' నను మృదూక్తు
లుద్భవించె, మోద ముత్కటము య్యో నా;
కమృతవృష్టిఁ దోఁగినట్టు లైతి. ౧౩౭

వ. 'తదనంతరంబ యద్దేవుం డస్తాచలంబువలని కరిగె. నేనుం బరమా
నందకందళితమనస్కుండ నగుచు మందిరంబున కేతెంచి సరస్వతిం
దలంచు చున్నంత, ౧౩౮

---

1=చల్లపడు నని. 2=సాంఖ్యమతయోగములు అత్యంతము దా పగును.

క. "వినుము, వినుతస్వరవ్యం
జనభూషిత యగ్రభాగసంస్ఫురదోంకా
ర నితాంతహృద్యమధుగ
ర్భ నిజాకృతి విశదముగ సరస్వతి దోఁచెన్. ౧౩౯

**విశ్వావసునకు యాజ్ఞవల్క్యుఁ డుపదేశించిన తత్త్వప్రకారము**

వ. "తోఁచిన నత్యంతభక్తిం బ్రపత్తిసేసి, సూర్యప్రసాదలబ్ధయుఁ బంచదశశాఖాసమన్వితయు నిఖిలోత్తరసంహితయు నయ్యజుర్వేదమూర్తి ధరియించి శిష్యులం బరిగ్రహించి వారల నధ్యయనంబు సేయించుచు, నివ్వాఙ్మయబ్రహ్మంబునందు వేదితవ్యం బెయ్యదియో యని విచారింప, విరోచనుమహానుభావంబునం జేసి యోగ-సాంఖ్యరూపోపాయప్రకారంబు దోఁచె, పదంపడి తనుపేరుం బగు వేదవేద్యంబును నద్దేవుని కరుణావిశేషంబునం బ్రతిభాసించె; కొండొకకాలంబునకు విశ్వావసుం డను గంధర్వేశ్వరుండు నాకడకుం జనుదెంచి తన్నెఱింగించి యేనుజేయునతిథిపూజనం బత్యాదరంబునం గైకొని విశ్వావిశ్వంబులు మిత్రావరుణులు జ్ఞానజ్ఞేయంబులుఁ దపోతపంబులు సూర్యాతిసూర్యులు విద్యావిద్యలు వేద్యావేద్యంబులు చలాచలంబులు ననునవి వేదోదితంబులు; వానిం దేటపఱుపవే యని యడిగిన, 'నవహితుండ వై విను' మని పల్కి, 'విశ్వంబు భూత భవ్య భవత్కరం బగు వ్యక్తం బవ్యక్తనామ ప్రకృతియ. విశ్వంబు, నిర్గుణుం డగు పురుషుండు, మిత్రావరుణులు, పురుషప్రకృతులు, జ్ఞానజ్ఞేయంబులుం, దపోతపంబులు, సూర్యాతిసూర్యులును-బ్రకృతిపురుషుల కా నెఱుంగుము; విద్యావిద్యా వేద్యావేద్య అచలచలంబు లనుశబ్దంబులు వరుసం బురుషునకుం బ్రకృతికిని వాచకంబు'లని చెప్పి వేఁడియు ని ట్లంటి— ౧౪౦

ఆ. అజము లవ్రణంబు లక్షయంబు లతీంద్రి
యములు ప్రకృతిపురుషు లనఁగఁ బరఁగు

రెండుతత్త్వములు నఖండరూపతఁ బొంది
నపుడు ప్రకృతి పురుషు నట్ల కాన. ౧౪౧

వ. అని తెలిపి మఱియును, ౧౪౨

క. విను, వేదవేద్యము నెఱుం
గనియాతని వేదపారకలనంబు, సుధీ
ధన, వేదభారవహనం
బనఁ జను నింతియ నిరర్థకాయాసం బై. ౧౪౩

ఆ. క్షరము నక్షరంబుఁ గానంగఁ బోలు వే
దార్థచింతనమున; నమ్ముముక్షునము
నందుఁ [1]బూర్వ మరివి, యపరంబు సేపట్టి
నిలువ వలయు నధికనిష్ఠ గలిగి. ౧౪౪

తే. అక్షరం బగుపంచవింశాఖ్యతత్త్వ
తత్పరత నున్నఁ గేవలత్వము ఘటిల్లు;
వినుము, కేవలత్వమున షడ్వింశదర్శ
నంబు పురుషున కొదవి తన్మయత గలుగు. ౧౪౫

క. పురుషుని నవ్యక్తము రెం
డురూపులుగఁ జూచు టొప్పెడు తెఱఁగ తఁడుం
బురుషోత్తముండు నరయఁగ
నిరుపుర గాఁ రతఁడ యాతఁ;- డిది నిజము సుమీ! ౧౪౬

క. పురుషోత్తమషడ్వింశక
పరమేశ్వరనామకములు పరఁగును; విను, మా
పరమునకు నదియ నిష్కళ
నిరంజనానందబోధనిత్యా బనఘా. ౧౪౭

---

1=కడచినదానిని పరిహరించి.

వ. అని చెప్పిన విశ్వావసుండు పంచవింశకతత్త్వంబునకుం బరంబు గలుగుటయు, నది రూపింప నేకం బగుటయు, నారద జైగీష దేవల కపిల శుక సుమంతు పైల్యాసులైనపరమమునులగోష్ఠివిశేషంబుల విందు. వినినను నిస్సంశయం బగుబోధం బుదితంబు గామిని న్నాశ్రయించితి. నీవు సంయమిలోక సురలోక బ్రహ్మలోక ప్రఖ్యాతపరిజ్ఞానసంభావనీయుండవు. మదీయ సందేహాపనయంబు సేయవే యనుటయు నాదరాయత్తచిత్తుండ నై— ౧౪౮

క. మునిగోష్ఠివలనికొలంతయె!
విను, భవదీయాంతరంగవృత్తి కలుషమై,
నను సంశయాత్మునింగా
నొనరించుచు నున్నయది సముజ్జ్వలతేజా. ౧౪౯

వ. ప్రసన్నైకాగ్రచిత్తుండ వై యాకర్ణింపు మని యి ట్లంటి: ౧౫౦

క. పురుషున కవ్యక్తపరి
స్ఫురణశబలవృత్తి గలుగఁ బోయిన నతనిం
బురుషోత్తముఁ డనరు—జనన
మరణాదివికారయుక్తి మాటయి యజ్ఞల్. ౧౫౧

అని వెండియు, ౧౫౨

తే. ప్రకృతి పురుషునిఁ గానదు; ప్రకృతిఁ గనుచు
నునికిఁ బురుషుండు పరమునిఁ గనుట లేక
యుండుఁ; గనుఁ దద్ద్వయముఁ బరముండు; - పరమ
వీక్షణము పురుషున కగు వెరవు వినుము: ౧౫౩

క. స్నేహ-సహవాసములు స
మ్మోహము దలకొలుపఁ గాలమున మునుఁగుచు, గా
ఢాహంకార-మమత్వము
లీహఁ బెనుపఁ, బ్రకృతిఁ బురుషుఁ డే నను చుండున్. ౧౫౪

క. అది లెస్సగ విడిచి, ప్రకృతి
కుదకనిభాకలనమును, ఝషోపమ దనకుం,-
బడిలుఁ డయు చూడ నేర్చిన
విదితుం డగు దానితోడి నేర్పా టనఘా. ౧౫౫

ఆ. ప్రకృతి దొలఁగి తన్నుఁ బన్నుగాఁ జూచువి
వేకధృఢతఁ బంచవింశకుండు,-
సంగరహిత మైనషడ్వింశపదము ని
స్సంశయముగఁ గాంచు వంశవర్య. ౧౫౬

క. జనన జరా మృత్యుభయం
బున యోగసమేతసాంఖ్యముం దిరముగ నూఁ
దినయతులు నిర్మమత్వం
బునఁ బడయుదు రప్పదంబుపొం దచలముగన్. ౧౫౭

వ. అపునరావృత్తిపదం బగునప్పదంబు సూవె పరం బని చెప్పి
వెండియు, ౧౫౮

క. నెట్టన చూడమి నవ్యోడు
నట్టిది యొక చూపునం బరానందంబున్
గట్టిగఁ జేయఁగ, వికృతులు
పుట్టక పురుషుండు తత్ప్రబోధాత్ముఁ డగున్. ౧౫౯

క. పురుషోత్తముండుఁ బురుషుఁడు
నిరువు రగుట గలదు; గలిగె నేనియుఁ బురుషుం
బురుషోత్తమునందుఁ గలపు
వెరవున నేకత్వమహిమ విజ్ఞాత మగున్. ౧౬౦

క. ఇది విజ్ఞానముకృత్యము;
తుది విజ్ఞానాత్ముఁడు నగు; దుర్లభము పరిశాం
తిదశాహీనాత్ముల క
ప్పద; మ్మద్ధి మోక్షంబుః- ఝమ్మత వాసినఁ గల్గున్. ౧౬౧

వ. అని యుపదేశించిన విని విశ్వావసుండు ప్రమోదంబు నొంది పథ్యంబును హితంబును దథ్యంబును నగుతెఱం గనుగ్రహించితివి. భవదీయప్రసాదంబునం గలఁక దేఱి నిర్మలుండ నయితిని— అని పలికి సభక్తికంబుగాఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి నిజస్థానంబున కరిగెను అని చెప్పి యాజ్ఞవల్క్యమునినాథుండు జనకజననాథుతో వెండియు నిట్లనియె: ౧౬౨

క. మానవపతిసత్తమ, యీ
జ్ఞానము బ్రహ్మాదిదివిజసంయమిమత; మె
వ్వానికి మోక్షంబునకుం
దాన తెరువు; తెరువు లొండ్లు దలఁపం గలవే? ౧౬౩

ఆ. జ్ఞానమునన కాని జన్మ జరా మృత్యు
వుల జయించునట్టియలఘుమోక్ష
పదము గల్గ నేర; దది కారణముగ సు
జ్ఞాన మెల్లభంగి సాధ్యతమము. ౧౬౪

క. గురుఁ డెవ్వఁ డైన నగు,—ని
వ్వేర వుపదేశించువాఁడ వేల్పుగ శ్రద్ధా
పరమతి గావలయు; జనన
మరణంబులు శ్రద్ధ లేనిమనుజునిఁ బొదువున్. ౧౬౫

క. విను, మజ్ఞానంబునఁ గ
ర్మనిరూఢత గలుగు; దాన మలఁగవు జననం
బును మరణము; సమ్యగ్జ్ఞా
ననిత్యుఁ డగువాఁడు మోక్షణముఁ జుల్కఁ గనున్. ౧౬౬

క. ఈవేర వ్రూఁదుము; నృప, నను
నీ వడిగినయంతయును వినిశ్చయకృతి సం

భావితము గాఁగఁ జెప్పితిఁ;
బోవిడువుము శోకమోహములు;—నిలుపు ధృతిన్! ౧౬౭

క. అని చెప్పిన ముదితుం డై
జనకుఁడు శోకాదిభావసంగవిరహితం
బును బ్రహ్మధ్యానపరం
బును నగు చిత్తంబుతోడ ముదితుం డగుచున్— ౧౬౮

వ. ఉండెను. పాండవాగ్రజా, యీయాజ్ఞవల్క్యమునివరు వాక్య
రూపంబునన యే నిమహ్మనీయజ్ఞానంబు నీ కుపదేశించితి నని చెప్పి
భీష్ముఁ డతనితో: నీ విందుల తాత్పర్యంబు గలిగి, యార్యగర్హితంబు
లగు శోకమోహాదిప్రాకృతభావంబులం దొఱంగి సుఖి వగుము.
అనిన విని, యక్కుంతీయాగ్రజుండు సంతుష్టాంతరంగుం డై య
గ్గాంగేయునకుం బ్రణమిల్లి: 'గృహస్థ ధర్మంబు పరిత్యజింపక మో
క్షంబువడయుట గలుగనోపునే? మదీయచిత్తంబు సంశయా
యత్తం బగుచుండు! నిష్కాలుష్యంబు వాపవే!' యని యభ్యర్థించిన,
నతండు, జనక—సులభాసంవాదం బనునితిహాసంబు గలుగు; దాన
నీతత్సంశయంబు వాయు; దానిం జెప్పెద విను మని పలికి యతని
కి ట్లనియె: ౧౬౯

—భీష్ముఁడు ధర్మరాజునకు జనక—సులభాసంవాదంబు సెప్పుట.—

క. సులభాభిధాన యగునొక
లలన విమలయోగధర్మలంపటు జనకుం
గెలన విని, యాతనిబోధము
కొలఁది పరీక్షింపఁ దనకుఁ గోర్కి వొడమినన్— ౧౭౦

వ. నియమాచరణకృశం బగుశరీరంబు యోగప్రభావంబున డాఁచి,
సుందరసుకుమారం బగునాకారంబు వహించి జనకుం గాంచి
భిక్షావృత్తిత్వసూచకంబు లగువచనంబు లుపన్యసించిన నతం డాసన

పాద్యార్చనంబు లాచరించి మహనీయం బగుభోజనం బొనర్చిన సంతృప్తిం బొంది, యవ్విదేహపతికి నాసన్నం బగునుచితాసనంబున నాసీనయై యుండి, యాతఁడు ముక్తుం డగు-గామి గనికొని తలం పున నిజానుభావంబున నతనిచిత్తంబు ప్రవేశించి మారవికారంబు భావించి,

క. తనలోచనదీప్తుల న
మ్మనుజపతి మొగంబునందు మల్లడిగొనఁ జే
సిన, నమ్మహాత్ముఁ డప్పు
డ్మనయనతలఁ బెఱిఁగి జనితమందస్మితుఁ డై. ౧౭౨

ఆ. ఎచటినుండి యెచటి కేఁగెద? – వెవ్వరి
దాన? — వేమి వెంటఁ దగిలి నడతు? -
సుదతి, నాకుఁ జెప్పు; మది యట్టు లుండె! నా
మాట లీవు విను సమాదరమున. ౧౭౩

సీ. పంచశిఖుం డను పరమమునీశ్వరు
శిష్యుండ; నతనిచే శిక్షితంబు,—
కమలాక్షి,—సాంఖ్యయోగక్షితిపాలనం
బులఁ ద్రివిధం బగుమోక్షధర్మ;
మట్లు గావున సంశయము లేక ముక్తకా
మస్థితి, నముమ్క్షుఁడు మార్గములను
నడచి పరంబున కెడపడ కుండుదు;
ముక్తివైరాగ్యకమూల సూవె!

తే. విను, విరక్తి దృఢజ్ఞానజనిత గాన,
దీపితజ్ఞానమును; విరక్తియు ధరింపఁ
బడిన బుద్ధి నిర్ద్వంద్వతఁ బరఁగు; నింటి
యొంద నిల్చి నిస్సంగుఁడ నై చరింతు ౧౭౪

క. వనితా, చందనమునఁ బూ
సినఁ, గత్తిని వ్రేసినను సుచిత్తత నాక
జ్జను లిరువురయందును సరి;
కనకము [1]లోష్టమును సమముగాఁ గనుఁగొందున్. ౧౭౫

తే. జ్ఞానమును గర్మమును రెంటిసంగమంబు
నిష్ఠలుగ మోక్షవిదులు వర్ణింతు రాత్మ
శాస్త్రములు గని; మద్గురు శాసనంబు
సుగమపథము [2]దృతీయంబు సూవె యబల! ౧౭౬

ఆ. కీడు గని, యొకండు గృహధర్మ ముడిగి స
మాశ్రయించు నాశ్రమాంతరంబు;
దాన సంగముడుగఁ గానేర;—దది యొల్ల
మియును వలపు గాన మీననయన. ౧౭౭

క. దండముఁ గాషాయంబును
ముండితయుఁ గమండలువును మోక్ష మొసఁగ;— వె
ట్లం డేని: [3]లింగములకు న
ఖండజ్ఞానప్రదత్వకలనము గలదే? ౧౭౮

క. మగువా, దుఃఖము శిథిలం
బగు నని లింగములు దాల్తు; [4]రమ్మెయి లే దె
ట్లు గొడుగునందుం? గావున
వగవఁగ మోక్షదముగాఁగ వలయుఁ గొడుగున్. ౧౭౯

ఆ. జ్ఞానముననకాని, మానిని, లింగమా
త్రమున ముక్తి యగునె? రాజ్యబంధ

---

1=మంటిపెల్లను. 2=వైరాగ్యము. 3. తా. (ఈబాహ్య) చిహ్నములకు అఖండమగు జ్ఞానము నిచ్చుమహిమ కలదా? 4. తా. ఆమహిమ గొడుగు (ఛత్రము) నందు లేదా? కావున, విచారింపఁగా గొడుగు గూడ మోక్షము నిచ్చునది కావలయును.

రాగబంధ నిఖిలభోగబంధములఁ— [1]ప్ర
జ్ఞాసిఁ దునిమినాఁడ; నది గతముగ— ౧౮౦

వ. ఇట్లు ముక్తుండ నైయున్న నాయెడ ముక్తత్వాముక్తత్వంబు లారయ వేఁడి వచ్చి మచ్చిత్తంబు మెత్తన చొచ్చితివి. అది యప్రయోజనంబు. అట్లుం గాక,

తే. బ్రాహ్మణివి! యోగినివి! పరభార్య! వబల,
[2]భర్తృప్రోషితుఁ! డేను నృపాలసుతుఁడ!
వినుము, గృహమేధి! నాచారఘనుఁడ! నిట్టి
నేను నీవు రమించుట నిందఁ దెదె? ౧౮౨

వ. స్వతంత్ర వై నీవు చేసిన యీయవినయంబున నెయ్యది వాటిల్లిన నది నీయంద నిలుచుం గాక యని పలికి, వెండియు, ౧౮౩

క. [3]నావలనిరాగమున నే
నీ వి చ్చైతి నను గెల్చునిపుణతకుం గా?
కీవెడమాయల నిప్పుడుఁ
బోవిడువవు యోగశక్తిపొలుపుకలిమి నే? ౧౮౪

క. [4]నిను డాఁచి కుటిలభావం
బున దుష్టచరిత్ర వైతి; ముక్తుల తెఱఁ గే!
వనిత, యిది యే బయలు పఱి
చిన నైనను మానవలదె చెన్నఁటిసూపుల్. ౧౮౫

క. అని తనవైరాగ్యంబును,
ఘనబోధముమహిమయుం బ్రకాశింప మనం

1.—ప్రజ్ఞ =బుద్ధి) అను కత్తిచేఖండించినాఁడను... 2=నీమగఁడు దేశాంతర మేఁగినాఁడు. 3. తా. నన్ను గెలుచు నేర్పుతీతనమునకేగాని నావలని యనురాగమున నా నీవిచ్చైతివి? యోగశక్తి నీకుఁ గలిగియుండుటచేతనా ఈ నీతుచ్ఛపుమాయలు పోవిడువకున్నావు? 4. తా. నిన్ను నీవు మఱుఁగుపెట్టుకొని కుటిలభావమున,.

బున సరకుగొనక యి ట్ల
వ్వనితఁ బలికి యన్న రేంద్రవర్యుఁడు మఱియున్— ౧౮౬

క. తను వొప్పెడునది; యౌవన
మును నూతన;— మిట్టినీకుఁ, జొలఁతీ, యోగం
బున నింతచొరవ యెమ్మెయిఁ
బనుపడియెం జెపుమ దాఁపఁ బనిలే దింకన్. ౧౮౭

వ. అనుచు, ౧౮౮

క. తను సరకుసేయ కి ట్ల
జ్జననాథుఁడు వలుక, నవ్వచనములు దెలియన్
విని, సులభ— చతురముగ ని
ట్లను నించుక గొంకు లేక యవ్విభుతోడన్: ౧౮౯

క. శ్రోతకుఁ దనకుం బ్రియ మగు
నే తెరువున,— నట్టిమెయి సవిారిత మైనం
జూ తగువాక్యం బది! నృప
సూతీ, పెఱపలుకు బాలిశులచొ ప్పరయన్. ౧౯౦

వ. భవదీయవాక్యవై దగ్ధ్యం బ ట్లుండె! నీవు న న్నెవ్వరిదాన వెచ్చట
నుండి వచ్చి తని తొలుత నడిగితివి; అవహితుండ వై వినుము
చెప్పెద— ౧౯౧

—•• జనకునివిప్రశ్నంబులకు సులభ ప్రత్యుత్తరంబు లిచ్చుట. ••—

క. [1]విను, పాంసూదకములచా
డ్పున, జతుకాష్ఠములభంగి, భూతంబులకున్,
మనుజేంద్ర, కలుగుఁ బొంది దా
పని నన్యోన్యసమధీనభావము గలదే? ౧౯౨

1. వినుము, దుమ్మునకు నీళ్ళకువలె, లక్కకును కట్టెకునువలె ప్రాణులకుఁ
బొందు గలుగును. అట్లు పొందు గలుగుటచే, అవి ఒకదాని కొకటి అధీనమగుట
(ఆ) కలదా?

ఆ. ఒక్క మేనియందె, యుర్వీశ, పంచభూ
తములు దశమితేంద్రియములు మనసు
బుద్ధియును ప్రధానమును గల; వివి యొక్కఁ
డొకటి యవియె; యేల యొండు సెప్పు? ౧౯౩

వ. నిక్కంబునకు నెవ్వరు నెవ్వరివారుం గామి దెలియవే యని పలికి
వెండియు, ౧౯౪

తే. [1]సకలలోకములను సదశ్వంబుకరణి
భావనము సేయుచుండుఁ బ్రధాన; మింత
యెఱిఁగి, జననాథ, యెవ్వరి నెచట నుండు
వార లనువార? మమ్మాటవలను సెపుమ. ౧౯౫

తే. నీవు నీయందు నినుఁ గను నెఱియ యొరుల
యందుఁ గానంగ వలవదే? యధిప, తన్ను
నొరుల నొక్కటిగాఁ జూచుపురుషుఁ 'డెచట
మీర లుండుదు? రెవ్వరివార?' లను నె! ౧౯౬

తే. అరులు మిత్త్రు లుదాసీను లనుచు సంధి
విగ్రహాదిషడ్గుణముల వెరవు లోకరుఁ
డలవరించుచు విజయంబు నాసపడుచు
నుండు నకట! ముక్తికెఱఁ గిటు లున్నె యరయ! ౧౯౭

ఉ. కావున, నీవు ముక్తుఁడవు గా; విటు గాకయు, నిన్ను ముక్తుఁగా,
భూవర, చూచె; దిక్కులఁక బుద్ధులు సెప్పి తగం దొలఁగఁగాఁ
ద్రోవఁగఁ బాడి బంధులకు;— దుర్మతి పుట్టినయట్టిమర్త్యు నా
రేవిధి నైన మాడు లిడి యెప్పటిబుద్ధి ఘటించుచాట్పునన్. ౧౯౮

వ. ఏ నెట్లు ముక్తుండఁ గా నంటేని విను మింకనుం జెప్పెద— ౧౯౯

1. తా. (ప్రధానము.) ప్రకృతి సకలలోకములయందును మేలైన గుఱ్ఱము వలెఁ బరువెత్తుచుండును. జననాథా, ఇంత ఎఱిఁగియు ఎవరినైని ఎచ్చట నుండు వారలు అని ఎట్లు అడుగుదుము? ఆమాటకుఁ బ్రయోజనమేమి చెపుమా?

సీ. [1]వర్గత్రయంబునవలనను సప్తాంగ
ములయందుఁ జిత్తంబు మెలఁగుచుండ,
రాజులు మజ్జన భోజన నిద్రావ
సరములు లోనుగా జనులు సేయు
విజ్ఞాపనము విని యాజ్ఞాపనం బొన
రించుచు, మంత్రులుఁ బ్రేమపాత్రి
తరుణులు నస్వతంత్రతఁ జేయ, నర్థుల
కొసరితిండియు, ధనగుప్తిమీఁది

తే. భరముఁ—దమలో విరోధు లై పట్టి మనసుఁ
జిక్కువఱుపంగఁ, బెక్కుఁడు సిరికి నడువఁ
బరిహరించుచు, బహుదుఃఖపరులు నల్ప
సౌఖ్యులును నగు చునికి రాజ్యంబు తెఱఁగు— ౨౦౦

వ. వారలు ముక్తులు గామిదెల్లంబ;అది యట్లుండె. నీకు విశేషించియు

చ. సదయమనీషఁ బంచశిఖసంయమి మోక్షము దెల్పె నంటి; నీ
హృదయము నాదు చొచ్చుటకు నెంతయు రోసితి; ముక్తుచందమే
యిది! నిరపేక్షుఁ డైన, విను, మెయ్యది యెట్లయినం బ్రశాంతిసం
పద నొకయింతయుం గలఁగఁ బొఱక యుండఁడె నిర్వికారుఁ డై?

---

1 తా. రాజులు=కర్త. వీరు, (వర్గత్రియముల=)ధర్మార్థ కామములయందును (సప్తాంశముల=) స్వామి, అమాత్యుఁడు (=మంత్రి), సుహృత్తు(=మిత్రుఁడు), కోశము (=బొక్కసము; ఖజానా), రాష్ట్రము, దుర్గము (కోట), బలము (=సేన)—ఈ యేడింటి యందును మనస్సు మెలఁగుచుండఁగా, స్నానము భోజనము నిద్రమున్నగు నవసరములయందును జనులు సేయు విన్నపములు విని, తగు నుత్తర్వు ఇచ్చుచు, మంత్రులును ప్రేమపాత్రము లగుతరుణులును తమ్ము (=ఆ రాజులను) అస్వతంత్రులుగఁ జేయఁగా, యాచకులు తిండికై కొసరుటయు, ధనము దాఁచుకొనవలయు ననునాశయుఁ బగవాండ్రయి రాజులమనస్సులను జిక్కువఱుపఁగాఁ, బెక్కుఁడు సంపద నపహరింప దండెత్తిరాఁ బరిహరించుచు,—బహుదుఃఖపరులును అల్పసౌఖ్యులును అగుచుండుట రాజ్యమురీతి—

క. విను, శూన్యస్థానంబున
నునికి యతికిఁ గృత్య మగుట, నుర్వీశ్వర, ము
క్తిని మానసంబు శూన్యం
బని చొచ్చితి; ముక్తి లేమి నది దప్పయ్యెన్. ౨౦౩

వ. అట్లుం గాక, ౨౦౪

ఆ. కాలుఁ జేయు మొదలుగాఁ గలనాయంగ
కములలోన నిన్నుఁ గలయ దొకటి
యేని; రిత్తయిప్పు డేటికిఁ గటకటం
బడుచు నిట్లు దూరఁ బలికి తధిప? ౨౦౫

వ. అని యమాత్యులదిక్కు సూచి, ౨౦౬

ఆ. వీరు పెద్దవారు; వీరలు విన, నిట్టి
తులువమాట లాడ దొరకుఁ దగునె?
యెదిరిఁ దూలపుచ్చుటే మంచి వెరవు? గాం
భీర్యహాని దలఁచు పెంపు లేదె? ౨౦౭

క. వనితల పురుషుల యెడఁ బు
ట్టినయది వెల్లివిరిసేఁత డిమ్మరితన; మె
ట్టి నికృష్టుం డైనను ని
ప్పునికిఁ జొరఁడు; దగునె యిది నృపాలసుతునకున్? ౨౦౮

చ. [1]బిసరుహపత్రలగ్న జలబిందువు చాడ్పున సంగవర్జితో
ల్లసనమునన్ వసించితి; నిలావర, నీమది నిట్టిదానిఁగాఁ
జూసఁగ నెఱుంగ వైతి నను; బొంకగు టేర్పడియెన్: విముక్తిచొ
ప్పు సదయవృత్తి నీకు మునిపుంగవు చెప్పుట;- మాట లేటికిన్?

1. తా. తామరాకున నున్న నీటి బొట్టువలె ఏతగులము లేక వర్తించితిని. ఇట్టిదానింగా నన్ను నీమనస్సున నెఱుంగ వైతివి. నీకు మోక్షమునుగూర్చి దయతో మునిపుంగవుఁడు చెప్పుట బొంకు అని స్పష్ట మయ్యెను....

క. నీవు గృహధర్మపరతయుఁ
బోవిడిచితి; నీకు మోక్షమును విదితము గా;
దేవలనికిఁ గా కిట్లు, ధ
రావర, మిథ్యాప్రబోధరతుఁ డై తరయున్! ౨౧౦

క. ముక్తులు ముక్తులఁ గలయుట
యుక్తము, యది నభము నభము నొందు తెఱఁగు; నీ
ముక్తత బొం కని దీనిని
సక్తతగా నీవు గనుట సాలదె తెలుపన్? ౨౧౧

వ. మనము ముక్తులము గాకున్నను మనకు సాంగత్యంబు గలుగుట నింద్యంబుగాదు. ఎట్లంటేని, ౨౧౨

సీ. నిఖిలజనశ్రోత్రసుఖకరం బగుచరి
త్రమునఁ బెంపారెడుప్రధననృపతి
కులమునఁ బుట్టితి; సులభ నాపేరు; మ
త్పూర్వులు శతశృంగమునను ద్రోణ
మునను శక్రద్వారమున మహాధ్వరములు
సేసిరి; విను, పాకశాసనుండు
దమపాలి కేతేరఁ దద్గోష్ఠిఁ బరమార్థ
చింత సేయుదురు; భూకాంత, యేను,

తే. నాకు నెన యైనపురుషుండు లేకయునికి,
మోక్షధర్మప్రవర్తనమునఁ జరియింతుఁ;
గాన, నీచూచువర్ణసాంకర్య మస్మ
దీయసాంగత్యమున లేమి దెల్ల మరయ.

క. నను డాఁప నేల?-దానం
గనియెడునది గలదె? ముక్తి గలదో లేదో

జనకున కరసేదఁ గా కని
చనుదెంచితిఁ; దప్పె యది విచారింపంగన్? ౨౧౪

క. అని యిట్లు వలుకు పలుకులు
విని పలుకక యున్నజనకవిభునాననముం
గనుఁగొని, సులభ నగుచు ని
ట్లనియె నతనితోడఁ గౌరవాన్వయముఖ్యా: ౨౧౫

తే. అగ్ని వెచ్చనో చల్లనో యని మనమునఁ
గరము సందియ మందుటగాదె నిన్ను,
నధిప, ముక్తుండవో కావొ యని తలంచు?
టది మదీయబాలిశభావ మని తలంపు. ౨౧౬

చ. జనవర, నీసుభాషల నసత్య మొకండును లేదు; నీవు స
న్మునిగణకీర్తనీయుఁడవు; మోక్షము నీకఱచేతిలోని దై
యునికి దృఢంబుగాఁ గనియు నొండొకచందము మాటలాడితిన్
నిను నగియింపఁగా వలసి; నీదగుమన్నన శంకవాసినన్— ౨౧౭

క. అవియెల్ల నసత్యంబుల;
యవనీశ్వర, యరయ వచ్చు టది యొక్కఁడు ని
క్కువ; మీయపరాధము భవ
దవిరళసౌజన్యమగ్న మగుఁ గాక తగన్. ౨౧౮

క. సులభానామము; సంసృతి
పొల మొల్లక తిరుగుటయును, భూలోకవరా,
కలరూపు; నేఁటి కిచ్చట
నిలిచెద నీవు మునిసేవనీయుఁడ వగుటన్. ౨౧౯

తే. అనినఁ దానును మంత్రులు నవ్విభుండు
సులభఁ గొనియాడె, నాఁ డెల్ల నలఘుగోష్ఠిఁ

ప్రియము రెట్టింప నయ్యోగినియును దారు
నెమ్మి నొక్కఁడై యుండిరి నృపవరేణ్య. ౨౨౦

వ. మఱునాఁ డజ్జనపతి యనుమతిసేయ నమ్మహానుభావ నిజేచ్ఛం జనియె. అని చెప్పిన నప్పురహోత్తముండు ప్రమోదాయత్తస్వాంతుం డయి శాంతనవునితోఁ: 'శుకుని కెవ్విధంబున వైరాగ్యంబు పొడమె నెఱుంగఁ జెప్పవే' యనుటయు, నతం డా ధర్మసుతున కిట్లనియె: ౨౨౧

-:వేదవ్యాసుఁడు శుకున కుపదేశించిన వైరాగ్యప్రకారము:-

సీ. ప్రాకృతజనులవర్తనముల వెంటఁ జి
త్తమున జరా-మరణములకలిమి
దలఁపక యేమఱి మెలఁగెడుశుకుఁ జూచి,
విపులధర్మజ్ఞాననిపుణధిషణుఁ
డైన వేదవ్యాసుఁ డాతని కిట్లను:
'మనసు నింద్రియములు మర్దితములు
గాఁ జేయు; ముత్పథగాములు గా నీకు;
మక్రోధ సత్య శమార్జవములుఁ

తే. దపము దమము నహింసయు ధర్మమునకు
నాకృతులు;- వీనిఁ బాలింపు; మాఁకలియును
నీరువట్టును దగియెడు నెఱి నడంచి
దేవతాతిథిశేషోపజీవి వగుము. ౨౨౨

క. నురువున నొనరించినపం
జరంబులో నున్నపులుఁగుచాడ్పున మేనం,
బురుషవర, జీవ ముండుట
పరికింపక యేమఱంగఁ బాడియె నీకున్? ౨౨౩

తే. ఎన్నికొనుచుండఁ జనుచుండు నేండ్లు;- లివ్వి
ధమున నాయువు దోడ్తోడఁ దఱఁగి జీవ

హాని వాటిల్లఁగాఁ, బుత్రి, యనవధాన
నిద్రిమోహితుఁ డై యున్కి నీకుఁ దగునె? ౧౧౪

క. విను, మాంసశోణితవివ
ర్ధన మగు నైహికమునందుఁ దత్పరులు పరం
బని యొకటికలిమి దలఁపరు;
గొనరు బుధులమాట నాస్తికులు వినయనిధీ. ౧౧౫

తే. బుద్ధిమంతుల తెరువునఁ బోక, యుత్ప
థప్రవర్తులనడచు పథంబునందుఁ
జనుట, విను, మప్పటికిఁ జూడఁ దనకుఁ జాల
నించి యుండు; నాపద యొనరించుఁ బిదప. ౧౧౬

చ. తనతనధర్మమున్ నడపి దానన సంతస మంది శాంతభా
వనరతి నుండువారిఁ గని, వారలచెప్పెడుధర్మవృత్తి ని
చ్చెనయుఁగ నూఁది, సత్పదముఁ జెందుట కెక్కుడము, [1]పొత్తినూలిపు
ర్వ నెనయుఁ గాకు; బంధకుఁ డవుం దన కజ్ఞుఁడు దాన యమ్మెయిన్.

తే. [2]అస్థిరేంద్రియసలిలమయంబుఁ, గామ
రోషదారుణగ్రాహప్రదూషితంబు
నైనసంసారసాగర మతులధైర్య
పోతపాత్రిక నిస్తరింపుము కుమార. ౧౧౭

క. కామాదితృప్తుఁ డై నరుఁ
డేమఱి యుండంగ,—గొఱియ నెత్తెడుపులియు

---

1. తా. పట్టునూలికాయలోని పురుగువలె గాకుము. ఆపురుగువలె తెలివిలేని వాఁడు తనంతకుఁదానే (బంధకుఁడు=) కట్టివేయువాఁడగును. 2. స్థిరముగాని ఇంద్రియములనఁబడు జలముచే నిండినదియు, కామము (=కోరిక), రోషము (=కినుక) అనఁబడు భయంకరములగు మొసళ్ళచేతను నీరుపాములచేతను కలఁక వాటిన సంసారసాగరమును అధికధైర్య మను పడవచే దాఁటుము కుమారా.

ద్ద్రామత,—మృత్యువు గొని చను;—
సామూహునియట్లు గాకు మతులవివేకా. ౨౨౯

తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్లభంబు; దాని
నెట్ట కేలకుఁ గని కడ [1]యెద్దుఁ జేయ
వలదె? తపము దమంబు నిశ్చలవివేక
సంపదయు నూఁది నరుఁడు దుస్సంగ ముడిగి? ౨౩౦

క. విను, విప్రశరీరము సుఖ
మునకే?— బహునియమదుఃఖముల నిహమునఁ జెం
దను, నిత్యసౌఖ్యముం బర
మునఁ బొందను బుట్టెఁ గాక బోధప్రవణా. ౨౩౧

క. [2]బలితపుటురి గ్రామంబున
నిలుచుట, యారజ్జు ద్రెవ్వ నీలిగి సుమతుల్
వెలుడి చని సుఖు లగుదు; ర
వ్వల నెఱుఁగరు పడుదు రంద, వత్స, దురాత్మల్ ౨౩౨

తే. తాను దెగునేని బాంధవ దార పుత్త్ర
మిత్త్రు లనుసజ్జనంబు లేమిటికి? విగత
చింతుఁడై గుహ సొచ్చి యశాంతబుద్ధిఁ
దడవి కానంగ వలవదె తన్నుఁ దాన? ౨౩౩

తే. జరయు మరణంబు మర్త్యునిజన్మ మాది
గాఁగ వెనువెంటఁ దగులు నగ్గంబు వేచి;
[3]యెల్లి సేసెద ననక మే లిపుడ చేయు;
తనయ, [4]వాచ్చునె మృత్యువు జనులపనులు? ౨౩౪

1 = అనుగమించుటకై, 2. తా. ఊరిలో నివసించుట బలమైన ఉచ్చు (=వాగురు) లోఁ జిక్కుట వంటిది. ఆత్రాడు తెగునట్లు ఒడలు విఱుచకొని బుద్ధిమంతులు దానినుండి వెలువడి సుఖమందుదురు. దురాత్ములు ఆ మార్గము నెఱుఁగరు; అందుననే—ఆ ఊరిలోననే పడుదురు. 3=రేపు. 4=జనుల పనులకై మృత్యువు వేచియుండునా?

ఆ. ఆశ్మశానగమను లంతియ చుట్టంబు;
లగ్నిఁ గలపి మగలు నఖిల మైన
జ్ఞాతిజనము; దీనిఁ జర్చింప కందఱ
యందు మమతఁ బెనుచు నజ్ఞుఁ డనఘ. ౨౩౫

క. లోకము గాలముచే ని
ట్లాకులపడు చునికి గాంచి, యధికధృతిని ధ
ర్మైకాంతతానిరూఢిం
గైకొని తోఁవంగ వలదె కాలవికృతులన్! ౨౩౬

క. మానుషము దుర్లభము; సో
పానం బగు నది విముక్తిపదము గనుటకుం;
దానిఁ గని, తొంటిచందము
రానీక సముద్యమమునఁ బ్రోకఁగ వలదే! ౨౩౭

క. అనఘా, తపోవనమునన
జననంబును మరణదశయు సంప్రాప్తము ల
య్యెనయేని వాఁడు ముక్తుఁడె—
మనంబు బహుకామవికృతిమగ్నంబై నన్! ౨౩౮

తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి
[1]కేవలాంగుఁ డై నిర్మలభావయుక్తిఁ
దపము గృహమునఁ నేనియుఁ దత్పరతఁ జ
రించి సంసారజలధిఁ దరించు నరుఁడు. ౨౩౯

క. [2]విను, దార పుత్త్ర మిత్త్రులు—
సనిరి, కొడుక, మున్ను చనినజన్మంబుల; నీ
కును వారు, వారలకు నీ
వును,—మఱుపుట్టువులఁ గొఱ యపుట గల్గెనొకో! ౨౪౦

1—విరక్తుఁ డై; భక్తుఁ డై; ఒక్కఁడై. 2. తా. కొడుకా, విను, కడచిన జన్మములయందు ఆలు పిల్లలు మిత్త్రులుగా నుండి చనిరి కదా!— తరువాతి జన్మములయందు వారికి నీవు లేవని, నీకు వారు లేరని కొఱత గలిగెనా?

ఆ. [1]ఏన కలను నాకు; నెవ్వరివానిఁ గా
నాత్మఁ దలఁతు నన్ను నట్టివాని
నెందుఁ గానఁ; గాన, నెవ్వరివాఁడను
గా ననంగ వలదె మానసీయ! ౨౪౧

క. దారాపేక్షం గష్ట
ప్రారంభముఁ బూని యిహామునందుఁ బరమునన్
వారనిసంక్లేశంబులఁ
గూరు నరుఁడు;— దాని జేయఁ [2]గొనకొంద్రె బుధుల్! ౨౪౨

చ. ధన మది యేల భోగమును దానము లే దగు నేని! శత్రుమ
ర్దన మొనరింపఁ డేని బల దర్పము లేల! సధర్మవృత్తికిన్
గొనకొనఁ డేని విన్కి, మునికుంజర, యేల! జితేంద్రియుండు గాఁ
డనఁ జను నేని నాత్మవిధ మారయు నాక్రమ మేల చెప్పుమా! ౩౪౨

క. అని యి ట్లుపదేశించిన
విని, శుకుఁడు విముక్తిమార్గవిదుఁడై చనియెన్
జనకుఁ దోడ్కొని నిశ్చలదీ
పనిభాత్ముం డగుచుఁ గురునృపాలవరేణ్యా. ౨౪౪

క. అనిన విని, దేవతటినీ
తనయునితోఁ బాండురాజతనయాగ్రజుఁ డి
ట్లనుఁ బ్రీతియు వినయము నా
ననమునఁ దళుకొత్త [3]నరతనయవంశవరా: ౨౪౫

1. తా. నాకు నే నేకలను. నన్ను ఎవ్వనివానిగా మనస్సునఁ దలంతునో అట్టి వాని నెక్కడను జూడను. కావున నే నెవ్వరివాఁడను గాను అనవలదా? 2. యత్నింతురా విద్వాంసులు! 3. అర్జునుని కొడు కగు నభిమన్యుని వంశమున శ్రేష్ఠుఁడా, — అని సంబోధనము.

—భీష్ముఁడు ధర్మరాజునకు శుకుని జన్మప్రకారంబు చెప్పుట—

వ. కృష్ణద్వైపాయనపుత్త్రుం డనుమాత్రయ కాని, శుకునిజన్మంబు తెలియఁగునను, నతని తల్లిని, నతండు బాల్యంబున మహానుభావుం డగుటకుం గతంబును, నతండు సిద్ధి వొందినభంగియు నెఱుంగను—అవి యెల్ల నెఱింగిపుము. ౨౮౬

సీ. అనవుడు, నతఁ డిట్టు లను నాతనికిఁ : "[1]కర్ణి
కారవనం బనఁ గలదు మేరు
తటమున; నం దద్రితనయయుఁ దానును
బశుపతి లీలమైఁ బ్రమథగణము
గొలువ నుండఁ, దనూజుఁ గోరి వేదవ్యాస
సంయమి తత్ప్రదేశమున యోగ
బల మూర్జితముగఁ దపం బొనరించె; యో
గమునకు రాజసూయములు నశ్వ

ఆ. మేధములును నపరిమితము లైనను సరి
గావు సూవె! వినుము, కౌరవ్యేంద్ర,
తత్తపోవిశిష్టతకు మెచ్చి శివుఁడు ప్ర
త్యక్షు మై 'యభీష్ట మడుగు' మనిన, ౨౮౭

వ. అమ్మునీశ్వరుఁడు భక్తిసంభ్రమభరితుం డగుచుదండప్రణామంబుసేసి,

క. 'జల పవ నాంబర వసుధా
నలసమవీర్యుఁ డగుపుత్త్రు నా కొసఁగంగా
వలయు' ననుడు, 'నిచ్చితి' నని
పలికి చనియె నమ్మహాకృపామూర్తి నృపా. ౨౮౮

వ. ఇట్లు లబ్ధవరుం డగుచు సత్యవతీసుతుం డగ్నికార్యపరుండై యరణి పుచ్చికొని మథింపం దొడంగిన, ఘృతాచి యనునప్సరోవనిత

1. కొండగోఁగుగల వనము.

లోచనగోచరం బగుటయుఁ, దానునుం గామగోచరత్వంబు నొందిన, నయ్యిందువదన యమ్మునితెఱఁ గెఱింగి వంచనం జిలుక యయి యుండె. అతండును ధైర్యం బవలంబించి యరణికార్యప్రవణుం డై యుండం, బ్రబలుం డగునంగజునిచేఁదు నప్సరోరూపాతిశయసక్తచిత్తుం డైన యాసంయమిశుక్లం బయ్యరణియందుఁ బడియె. ఆ విప్రుండు నిర్విశంకమగు నంతఃకరణముతో నరణిమథన మొనరించిన,

తే. అయ్యరణిఁ బుట్టె జనకసమాకృతియును
భూరికాంతియు వెలుఁగంగఁ బొలిచె శుకుఁడు—
యాగకాలసుసంభృతహవిరవాప్తి
మహితతేజస్కుఁ డగుహుతవహునిమాడ్కి. ౨౫౧

సీ. అపుడు, మందాకిని సాకార యై వచ్చి
మంగళస్నానసమన్వితుఁడుగ
నొనరించె; నాకసంబుననుండి పడియెఁ గృ
ష్ణాజినదండంబు లతనియెదుర;
దివ్యదుందుభులును దేవాంగనాగాన
ములును వీతెంచె నద్భుతము గాఁగఁ;
గుసుమవర్షంబులు గురిసె; నింద్రాదిదే
వతలు గారవమున వచ్చి; రంబి
తే. కాసమేతుఁ డై యేతెంచి కామవైరి
యతని నుపనీతుఁ గావించె; నమరనాథుఁ
డుజ్జ్వలంపుఁగమండలు వొసఁగె; నిచ్చి
రమరు లెన్నండు మాయనియంబరములు. ౨౫౨

క. మృగపక్షిసమూహము లా
దిగఁ గల్గుచరాచరముల దివ్యప్రభవుం
డగుశుకునిపు ట్టొనర్చెం
బ్రగాఢతమసంప్రమోదభరితంబులు గాన్. ౨౫౩

క. జనియించినమాత్రన య
మ్మునిపకిశోరమును వేదములు వొందెను ద
జ్జనకుని మును పొందిన తెఱఁ
గున; నబ్బాలుఁడు వరించె గురుఁడుగ ధిషణున్. ౨౫౪

వ. ఆచారపరిపాటి యవలంబించి యిట్లుపాధ్యాయవరణంబు సేసి,

తే. అతఁడు సదివింప వేదవేదాంగధర్మ
శాస్త్ర-రాజనీత్యాదికసకలవిద్య
లును గ్రమంబునఁ జదివి యమ్మునికుమారుఁ
డచ్చటన యుండె వ్రతచర్యలందుఁ దగిలి. ౨౫౬

వ. దేవతలకు లోనుగా మంత్రిణీయుండును మాననీయుండును నగుచు నట్లుండు నయ్యారణేయుండు, నిజాశ్రమంబున నున్నతండ్రిపాలికిం జనుదెంచి, తదనుసరణప్రక్రియం బ్రవర్తించునెడ, నచ్చేరువం జరియించుమునికుమారులతోడి యాటలు మరగి లోకంబుతోడి పాటిమై యాత్మానుసంధానంబు సేయ లేక మెలంగుచున్నం జూచి యాసత్యవతీసుతుండు సాంఖ్యయోగశాస్త్రంబు లతనికి నధిగతంబులు గావించె. మఱియు దేహంబునందలి యహంకారంబుఁ తెయు బంధులవలని మమతయుం బాయుసట్టివాక్యంబు లుపదేశించె. దానం బ్రబోధం బుదయించుటం జేసి యమ్మహామతికి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థధర్మంబు లనునాశ్రమంబులు మూఁటను బుద్ధి రమింప దయ్యె. అయ్యుపరమపరుం డప్పారాశర్యుతో: 'మోక్షప్రదం బెయ్యది దాని నెఱింగింపవే' అనుటయు, ౨౫౭

ఆ. అతఁడు మోక్షదర్శి యగుట నిరూపించి,
యమ్మహామునీంద్రుఁ డతనితోడ.:
'వత్స, [1]కానఁ బొమ్ము వైదేహుఁ డగుజన
కక్షితీశు వినయగౌరవమున. ౨౫౮

---

1. చూడఁ బొమ్ము.

క. 'గగనంబునఁ జను టుడుగుము;
తగంగఁ బాదప్రచారితన చను మిథిలా
నగరమునకు; నమ్మునిమా
న్యగుణుం గను;— మోక్షధర్మ మతఁ డెఱిఁగించున్. ౨౫౯

క. ఆరాజన్యు నెడ నహంకారిత మమకారితయును గర్తవ్యము గా;
దేరికి నైనను బూజ్యుం డారయ నాతఁడు— వినీతియతగుంజుమీ.'

ఆ. అనిన నట్ల కాక యని మేరుముఖనగం
బులు ననేకనదులుఁ బలుదెఱఁగుల
దేశములును వివిధతీర్థంబులును జుల్కఁ
గడచి వచ్చె భరతఖండమునకు. ౨౬౧

వ. వచ్చునప్పు డెయ్యెడ నేపదార్థంబులఁ జూచినం జూడనివాఁడపోలె
వచ్చె. ఇట్లు వచ్చి విదేహజనపదంబు సొచ్చి మిథిలాపురంబునుప
వనంబు దఱిసి చని తదీయప్రాకారద్వారదేశంబు సేరినసమయంబున

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై
నూరకున్నఁ, జూచి వారు వెఱచి
లోని కెఱుకచేసి లోఁగుచు వారు ద
న్ననుప నరిగె నృపగృహంబు సేర. ౨౬౩

క. అచటఁ బ్రతిహారు లాఁగిన
నచలితశమవృత్తి నుండె; నవ్వేత్రధరుల్
ప్రచలితమతు లై యాతెఱఁ
గుచితంబుగఁ జెప్ప, నృపతియుఁ బురోహితునిన్.— ౨౬౪

తే. అరయఁ బుత్తెంచె; నాతఁడు నరసి పోయి
నిజ మెఱింగింప, భక్తి వినీతి సంభ్ర
మములు ముప్పిరిగొనఁగ నమ్మనుజనాథుఁ
డఖిలమంత్రులు బుధులుఁ దో నరుగుదేర,— ౨౬౫

చ. శిరమున నర్ఘ్యపాత్ర గొని చెచ్చెర వచ్చి ప్రియం బెలర్ప న
గ్గురుసుతుఁ గాంచి యంతిపురికోటకు లోనగునొక్కసౌమ్యమం
దిరమున కమ్మునిం గొనుచు దేవసమప్రతిపత్తి నేఁగి ర
త్నరుచిరకాంచనాసనమునం దగ నుంచి సునీతపాద్యుఁ డై, ౨౬౬

క. లలితాక్షతములఁ గుసుమం
బులఁ బూజితుఁ జేసి యర్ఘ్యమును గోవును న
క్కులపతికి నిచ్చె; విధిపరి
కలనజ్ఞుం డైనయతఁడుఁ గైకొనియెఁ దగన్. ౨౬౭

వ. జనకుండు సవినయంబుగా నిలుచుండి, యమ్ముని యనుమతి సేసిన మఱి మహీయంద సమాసీనుం డై తానును మంత్రులు విద్వజ్జనంబులుఁ గొలిచి యుండె. అట్టియెడ నన్నరపతిపరివారజాతం బెల్లను గౌతుకమునఁ నేతెంచి యంతంత మ్రొక్కుచుం జూచుచుండ — ౨౬౮

తే. రూపవిభ్రమముల నప్సరోజనంబుఁ
గ్రేణి సేయువారాంగనాశ్రేణి: గీత
నృత్యనిరతి నారాధింప, నిర్విశేష
యోజితేంద్రియుఁ డై యతఁ డుండె నధిప. ౨౬౯

చ. అతనికి నన్నపానముల నంచితభక్తి నొనర్పఁగాఁ బురో
హితు నియమించి, యవ్వసుమతీశ్వరుఁ డద్దినశేషయామినుల్
చతురము భక్తియుక్తమును సంప్రమదంబునుఁ గా నయించె స
మ్మితమృదుసారభాషణసమీరణతం దదుపాంతవర్తి యై ౨౭౦

వ. మఱునాఁ డమ్మహీపాలుండు గాలోచితకృత్యంబు లాచరించి, కృతకరణీయుండును సుఖాసీనుండును నై యున్న యమ్మునిపాలికి సూరిజనసమేతంబుగాఁ జని పరివేష్టించియుండి కేలుమోడ్చి: 'మీరిట విచ్చేయుటకుం గతం బేమి?' అని సవినయంబుగా నడిగిన, న

మ్మహాత్ముండు: మాతండ్రిపంపున మోక్షమార్గబోధార్థి నయి వచ్చితి; విప్రునకుం గర్తవ్యం బెయ్యది? మోక్షం బేమిట్టం బడయవచ్చు?— ఎఱింగింపవే' యనుటయు నతండు సవిశేష సమాదరుండై— ౨౭౧

—•• జనకుఁడు శుకున కుపదేశించిన మోక్షధర్మప్రకారము. ••—

సీ. విను, ముపనీతుఁడై విప్రుండు బ్రహ్మచ
ర్యంబు వేదాభ్యసనంబు నడపి,
దారసంగ్రహము సంతానసంపాదనం
బును నధ్వరక్రియయును నొనర్చి,
దేవపిత్రతిథిపూజావిధిపరుఁ డగు
చుండి వనమునకు హుతవహాప్తి
యుతముగఁ జని, యందు నతిథులఁ గొనియాడి
వ్రతము గపాయపక్వత నొనర్చ

ఆ. నగ్ను లాత్మయంద యారోపితములుగఁ—
జేసి, వీతరాగచిత్తవృత్తిఁ
బరమశాంతిఁ బొంది బ్రహ్మశ్రమపదంబుఁ
బొందువాఁడు లోకపూజ్యచరిత. ౨౭౨

వ. అనిన విని యమ్మునివరుండు,— ౨౭౩

క. జ్ఞానోదయ మైన యుండఁగ
మానక వెండియును నాశ్రమత్రయవాసుం
డై నిలిచి తత్క్రియాను
ష్ఠానము గ్రమవృత్తి నడపుటయు వలయునొకో! ౨౭౪

తే. జ్ఞానవిజ్ఞానదృష్టి శాశ్వతికతత్త్వఁ
డయ్యెనేనియు విఘవ రా దాశ్రమములఁ
గ్రమసమారూఢి యనునె వేదములు; దీనిఁ
దెలియఁ జెప్పవె మోక్షపత్తిలకజన్మ. ౨౭౫

వ. అనవుడు, సతం డతని కి ట్లనియె: ౨౭౬

తే. జ్ఞానవిజ్ఞానములు మోక్షసాధనములు;
గురుని యుపదేశమున నవి దొరకొనంగ,
వానమోక్షంబు గాంచినవాఁడు విడుచు
నయ్యుపాయద్వయంబును నతులబుద్ధి. ౨౭౭

క. లోకోచ్ఛేదముఁ గర్మ
వ్యాకులతయుఁ గాక యుండ వలయుట కై, సు
శ్లోకా, చతురాశ్రమములుఁ
గైకొని నడపిరి దృఢంబుగాఁ బూర్వమునుల్ ౨౭౮

తే. అందుఁ దుద ముట్ట నడచిన నందవచ్చు
ముక్తి; బహుజన్మసంసిద్ధమోక్షకార
ణముల శుద్ధుఁ డై ప్రథమాశ్రమమునయంద
కాంచు మోక్ష మెందేని నొక్కరుఁడు మునిప. ౨౭౯

క. వానికి మూఁ డాశ్రమముల
లో నిలువఁ బ్రయోజనంబులుం గలవె? తమో
ధీనతను రజఃపరత
న్మాన వలయుఁ గాక సత్త్వనైష్ఠికమతి యై. ౨౮౦

తే. సత్త్వమార్గాభిరతి యాత్మతత్త్వదర్శ
నంబుగావింపఁ దనుఁ దాన నరుఁడు గాంచు;
విశ్వమునఁ దానుఁ, దనయందు విశ్వమును వ
సించుటయుఁ జూచుచును ముక్తిఁ జెందియుండు. ౨౮౧

వ. ఇవ్విషయంబున యయాతివాక్యంబులు గల వాకర్ణింపుము:— ౨౮౨

ఆ. జ్యోతి యాత్మయంద యున్నది; గాన్ప శ
క్యము సమాహితాత్ముఁ డైనమునికి;

నోరులవలన దనకు, నోరులకుఁ దనదెస-
భయయు లేక యున్నఁ బరముఁ గాంచు. ౨౮౩

క. కోరికయు, నొల్లమియు లే
కేరూపున భూతములకు నెగ్గగు తెఱఁగుం
జేరక, యకామవృత్తిఁ ద
పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్. ౨౮౪

క. వినఁ, జూడం బడునందె
ల్లను సమతం బరముఁ గనుచు, లౌల్యనిరసనం
బున సుఖ-దుఃఖాదిద్వం
ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁ గనున్. ౨౮౫

క. ఇనుమును-గనకము, నిందయు-
వినుతియు-సమములుగఁ గొనుచు, వివిధాంగకముల్
దనలోన నడఁచుకమఠము
ననువున, నింద్రియము లడఁచునతఁడు గను శివున్. ౨౮౬

వ. అని చెప్పి, ౨౮౭

తే. అవ్విశేషంబు లెల్ల నీయందుఁ గలుగు,
టనఘ, భవదీయజనకదయాసమృద్ధి
సిద్ధదివ్యబోధంబునఁ జేసి తోఁచె;
నవ్విధముకంటె నీచంద మధికతరము. ౨౮౮

క. నీ వట్టిఁడ వగు టెఱుఁగవు:
భావంబున సంశయమును భయమును బాల్యం
బావేశింపఁగఁ జేయ న
భావితనిశ్చయుఁడ వగుటఁ బరమమునీంద్రా. ౨౮౯

క. జ్ఞానము విజ్ఞానము నీ
మానితగుణము లగు; నవి సమగ్రము లైనం

గా నేరదు మోక్షపదము
[1]గానుపు దృఢనిశ్చయుండు గాకున్నేనిన్. ౨౯౦

తే. ఒక్కకొఱంతయు లేదు నీ వుదితమోక్ష
బోధుఁడవు; సంశయములెల్లఁ బోవవిడిచి
నిశ్చయింపుము నీ కన్న నెలవు శాశ్వ
తంపు నెలవుగ విషయావికంపితాత్మ. ౨౯౧

—♦ శుకుఁడు హిమవంతంబున నున్న వ్యాసునియొద్దకు వచ్చుట. ♦—

క. అని బోధించిన జనకువ
చనములు విని, శుకుఁడు విగతసంశయుఁడై శాం
తినిరూఢిఁ బరమసౌఖ్యం
బు నొంది తనుఁ దాన కనుచుఁ బోవుచు నుండెన్. ౨౯౨

తే. మారుతముతో సమానధర్మత్వ మొంది
యతఁ డుదఙ్ముఖుఁడై నిఖిలామరులును
మునులు గరుడ గంధర్వాదులును గుహ్యకా(?)హా
లమున వసియించు శిశిరశైలమున కరిగె. ౨౯౩

సీ. కురువంశముఖ్య, యగ్గిరి పుణ్యవిభవస
మేతంబు; విను, మమ్మహీధరమునఁ
బరమేశ్వరుండు దపం బేకపాదస్థుఁ
డై బహువర్షంబు లాచరించెఁ;
బుత్రలాభార్థిత్వమునఁ గృష్ణుఁ డుత్కృష్ట
నియమాచరణములు నిష్ఠ సలిపెఁ;
షణ్ముఖుం డాత్మీయ శక్తిప్రభావంబు
దెలిపి దేవాధికతేజుఁ డయ్యెఁ;

1. చూపు—చూచుటకు; కాంచుట.

తే. మఱియుఁ బెక్కండ్రు మునులు, నమర్త్యులును సు
చరితములఁ బెంపు నొందిఁ; రాశైల మావృ
షాంకునకుఁ గూఁతు నిచ్చె; యాగాంగయోని
యగుట నజుఁడు దదాత్మత్వ మర్థిఁ బొందె. ౨౯౪

వ. అట్టిమహామహిమ గలుగు నాహిమవంతంబునకు మున్న వచ్చి సుమంతు వైశంపాయన జైమిని పైలనామధేయు లగుశిష్యులంగరుణావిధేయుం డగుసాత్యవతేయుం డధ్యయనంబు సేయించు చుండం, బుణ్యతమం బగుతదాశ్రమంబు భానుప్రభానిభం బగునిజకాంతి విసరంబున వెలుంగ [1]నయ్యారణేయుం డమ్మునిపాలికిం జని, తాను యోగబలంబున ననేకంబు లైనగిరిసరిదరణ్యంబులు గడచి యొంటు నుం దగులు వడక కార్ముకజ్యానిర్ముక్తశరంబు చందంబున నేతెంచుటకుం బ్రీతుం డగు నప్పరాశరనందనుపాదంబుల కభివందనంబు సేసిన, నతం డభినందింప నాసన్నక్షమాసీనుం డై జనకజననాథసంవాదవిధంబు విన్నవించి, విశేషసమ్మదం బావహించె. ఇట్లరణిసుతు సమాగమంబు నొంది— ౨౯౫

క. అమ్మునియును శిష్యులతో
నమ్మహితాత్ము నునిచికొని యధ్యాపనశీ
ల మ్మగుచిత్తముతోడ సు
ఖమ్ముండఁగ నొక్కనాఁడు గౌరవమొప్పన్. ౨౯౬

వ. కొలిచి యుండి సుమంతుప్రభృతులు నలువు రతనితో: 'దేవా, శుకుండు మొదలుగాఁగల యే మేవురమును వేదవిషయప్రఖ్యాతి నెల్లవారికంటె నెక్కుడుగావలయు; మమ్ముం బోలె నొండ్లు నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరంబు' అని విన్నవించిన వీతపక్షపాతచిత్తుం డగునత్తాపసోత్తముండు,— ౨౯౭

[1] ఆశుకుఁడు.

తే. భక్తుఁ డగుబ్రాహ్మణునకు వాగ్బ్రహ్మ మఖిల
మును బ్రియంబున నిచ్చుసజ్జనునిచేతి
లోనియది బ్రహ్మలోకంబు; దీని మీఱ
లేర్పడఁగ నెన్నఁడును విని యెఱుఁగ రెట్లు? ౨౯౮

క. వినుఁ, డెల్ల వారు దుర్గం
బును గడచి శుభంబు నొంది పురుషార్థములం
గనువార కాక యనియెడు
ననుగ్రహము వలదె? యిట్టు లనఁ దగ వగునే? ౨౯౯

చ. అనుటయు వార లొండొరులయాననముల్ గనుఁ గొంచు నవ్వి యి
ట్లని: 'రటు లేనిఁ బోదుమె, దయాపర, శైలము డిగ్గి? భూమి నెం
దును జరియించి యధ్యయనదోహలులం జదివించి యాజనం
బు నడపి నీకృపారసముపొంగు నిగుడ్తుమె యెల్లచోటులన్?' ౩౦౦

చ. అనవుడు: 'మున్న యిట్టు లనరైతిరి; పోవఁగ నీవు మిమ్ము నెం
దును; [1]గడు వేడ్క వెట్టితిరి, దోహల మిమ్మయి నుండ, జాణలై
నను నిటు వేఱొకం డడిగి; నావచనంబులు మీమనోరథం
బున కిటు సాధనంబులుగఁ బోకులఁ బోయితి రంచు నవ్వుచున్—

తే. తమ్ము సంప్రీతిఁ గనుఁగొనునమ్మునీంద్రు
చరణకమలంబులకుఁ జక్కఁ జాఁగి మ్రొక్కి
రన్నలువురును;— వారల నతఁడు దివిచి
కరుణ సిగు రొత్త బిగి యారఁ గౌఁగిలించి— ౩౦౧

వ. దీవించి, 'యెయ్యది సేసిన నప్రమాదాయత్తచిత్తులరై చేయుండు.
త్రైలోకంబులందును మీకుం బ్రియం బైనచోటుల వర్తిల్లుండు'-

1. తా. మీయుత్సాహ మిట్లుండియు నేర్పరులై నన్ను వేఱొకటి యడిగి మోసగించితిరి.

అని వీడుకొలిపినఁ జని, వార లధ్యాపన యాజనవిశేషంబుల నశేష దేశంబులు నలంకరించుచుండిరి-అట్టియెడ— 303

క. నారదుఁడు వచ్చి ప్రీతిం
బారాశర్యమునిఁ గాంచి, 'బ్రహ్మనినాదం
బీ రున్నచోట లేమికిఁ
గారణ మేమియొకో!' యనుడు, గారవ మెసఁగన్— 304

క. అతఁ డతనితోడ: 'శిష్య
ప్రతతి యిచట లేమి' యనుడు, 'బ్రహ్మర్షివరా,
సుతుఁడును నీ వైనను ద
ద్వ్రతంబు సెల్లించు చుండవలదే?' యనినన్— 305

క. నారదునివచనములుఁ బెం
పారం గొనియాడి భువన మంతయు నాదా
పూరితముఁ జేసె నమ్ముని
సారాధ్యయనమునఁ బుత్త్రసంయుక్తుం డై. 306

వ. ఇట్లిద్ద్యరువురు నధ్యయనంబు సేయ, మహావాయువు బెట్టు వీచిన, నవ్విశేషజ్ఞుండు పుత్త్రుతో ననధ్యయనసమయం బగుట సెప్పి, తదధ్యయనంబు వారించి తానును నూర కున్న, నయ్యారణే యుండు: 'నిమ్మత్యధికమారుతం బెక్కడిది?' యని యడిగిన, 'నఖిలభూత వేది యగువేదవ్యాసుండు, దేవయానంబున విష్ణుం డును, పితృయానంబున భానుండును, నూర్ధ్వాధోగమనపర్యాయ రూపంబునం బ్రవర్తిల్లుదురు. అది పవనాలంబన కలితంబై చెల్లు. పవనుల వినుము చెప్పెద: సమానుండు దైవతసంఘసంభవుండు. అతనికి నుదానుండును, నుదానునికి వ్యానుండును, వ్యానునికి నపానుండును, నపానునికిఁ బ్రాణుండును జనియించిరి. జగంబులు వీరిచేత సంవ్యాప్తంబులై యుండు. ప్రవహుండు ఆవహుండు

ఉద్వహుండు సంవహుండు వివహుండు ఉవవహుండు పరావహుండు
అనం బవనులుస ప్తసంఖ్యులు. అదితిపుత్త్రు లఖిలభువనవ్యాప్తులై చరి
యింతురు. వారు సమానాదిపవనపంచకమహితాత్ములు. వారల
వలన వర్షరబులకుం బ్రవర్తన-నివర్తనంబులు గలుగు చుండు. వివిధ
దైవతవిమానంబులకును మహితయానం బావహిల్లు. ఒక్కొక్క
నాఁడు విష్ణుని నిశ్వాస వేగంబు— ౩౦౭

క. 'అప్పవనములను గలఁచిన
నిప్పరు సగఁవికృతవాయు విది; దీనిరయం
బిప్పుడు మహనీయం బగు;
నిప్పర్వతమును జలింప నెసకం బెసఁగెన్.' ౩౦౮

తే. 'ఇట్టియప్పుడు సదివిన నెల్లభంగి
నెడరు పుట్టుఁ గావునఁ, జదు వుడుగ వలసె'—
నని యెఁ; బదపడి,'ప్రకృతిస్థ మయ్యెఁ బవన;
మఖిలభూతంబులకు సౌఖ్య మావహిల్లె— ౩౦౯

స్నానకాలం బయ్యె' నని పలికి, పుత్త్రునకు: 'నీవు సదువుచుండు'
మని చెప్పి యప్పారాశర్యుం డాకాశగంగాప్రపాతప్రదేశంబునకుం
జనియె. అయ్యారణేయుండును, నారదుం డాకర్ణింపఁ గొంతసే
పధ్యయనంబు సేసిన, నద్దేవముని మెచ్చి, యతనితో: 'నీకు మే
లొనర్చెద నిష్టంబు సెప్పుము' అనిన, నతండు: 'ఈలోకమునం బుట్టిన
వానికిం హితం బెయ్యది దానిం జెప్పవే' యనుటయు, నమ్మహా
త్ముండు: 'తొల్లి సంయములకు సనత్కుమారుండు సెప్పిన
వాక్యంబు లేతత్ప్రయోజనంబు లయి యుండు; వానిం జెప్పెద
విను' మని యి ట్లనియె: ౩౧౦

—నారదుఁడు శుకున కుపదేశించిన తత్త్వప్రకారము.—

తే. [1]తపము సత్యంబ; కన్ను విద్యయ; సుఖంబు
విడుప; దుఃఖంబు రాగంబ;— వినుఁడు, నరుఁడు
ముక్తి కుత్సహింపక భవసక్తుఁ డైన
నొండువుట్టువునం దది యొంద రాదు. ౩౧౧

క. ఆరయఁ గామముఁ గ్రోధము
వైరులు ముక్తి;-కవి రెండు వారించిన సం
సార మనాకారం బగు;
నేరిమి యొం డేల ముక్తి నెలవు గనుటకున్. ౩౧౨

క. అపరిగ్రహసర్వారం
భపరిత్యాగములు గలుగుపండితునకు దుః
ఖపుఁదెరువు వాటిలదు; మో
క్షపదము సొప్పడి తదాత్మకసుఖం బొందున్. ౩౧౩

క. భూతంబుల దర్శింపమి,
భూతాస్పర్శనము భూతములయెడ సంభా
షాతరలత నొందమి,— సూ
రే తెరువు విమోక్షసుఖగరిష్ఠత వడయన్! ౩౧౪

ఆ. హింస లేక యునికి, యింద్రియజయమును,
నైరాశ్య, మచపలత్వ—మను గుణములు
నాల్గుఁ గలుగునట్టినరునకుఁ గరతలా
మలక మంతరాత్మమహిమ యెల్ల. ౩౧౫

క. అమ్మునిపతివాక్యముల వి
ధ మ్మిది; దీనిం బ్రగాఢతత్పరతం జి

---

1. తా సత్యమే తపస్సు. విద్యయే కన్ను. త్యాగమే సుఖము. రక్తియే దుఃఖము ...

త్తమ్మున నిడి తెలిసి నడవు;-
మిమ్మెయి సమకూరు నీకు నిహపరసుఖముల్. ౩౧౬

వ. అని చెప్పి వెండియు, ౩౧౭

ఆ. పుత్త్ర దార బంధు మిత్త్రసక్తుఁడు రొంపిఁ
బడినగజమునట్లు యెడరు నొందు;
[1]భోగజాలపరుఁడు వాగురాజాలసం
పతిత మృగ-ఝషములభంగిఁ దలరు. ౩౧౮

వ. ధర్మాధర్మంబులును సత్యాసత్యంబులును దొఱంగ వలయు. తొఱంగు టెట్లు సెప్పుఁడు నంటేని, ౩౧౯

సీ. విను, 'యధర్మం బహింసనమున నెడలు; ధ
ర్మంబు సంకల్పవర్జనముచేత
నవ్యాప్తిఁ బొందు; సత్యాసత్యములు బుద్ధిఁ
గొని,-త్రోవ నగు'నని మునివరుండు
మఱియును జెప్పు: 'నాత్మవిభావనంబున
బుద్ధి విలీనతఁ బొందు; శోక
భయహేతువులు నిచ్చఁ బదివేలు వాటిల్లుఁ;
బండితుం డందుఁ బొందండు; భూత

తే. ములును నింద్రియములు నొక్క-త్రోవ గట్టి
యున్న వీనికి వగఁ బొందు: టూరివారి
కొలయు నెడరుల కెల్లఁ దా నుమ్మలికము
గట్టికొని కుందునట్టులు గాదె వత్స?' ౩౨౦

చ. అన విని, సంశయం బుడివి యమ్మునితో నరణీతనూజుఁ డి
ట్లను: 'భవదీయదివ్యవచనామృత మాని యరోగచిత్తతం

---

1 తా. భోగలంపటుఁడు (వాగురా=) ఉరిలోఁజిక్కుకొన్న మృగమువలెను, (జాల=) వలలోఁ జిక్కుకొన్న చేఁపవలెను తలరు (-చింతించును).

గని కృతకృత్యతం బొరయఁ గాంచితిఁ; బొందెద యోగసిద్ధి సూ
ర్యునిమహితప్రసాదమున నూని; సమస్తము డిగ్గఁ ద్రావెదన్'

క. అని పలికి యమ్మునీశ్వరు
ననుజ్ఞ గొని తండ్రికడకు నరిగి వినతుఁ డై
తననిశ్చయంబు సెప్పిన,
విని, యతఁ డలరెం దదీయవిజ్ఞానితకున్. 3౨౨

ఆ. సంభ్రమోద మందు సాత్యవతేయునిఁ
గని ప్రదక్షిణంబుగాఁగ వచ్చి
యరుగ నుత్సహించె నారణేయుఁడు;
దానిఁ గాంచి వత్సలత్వగౌరవమున 3౨3

అబ్రహ్మర్షిసత్తముండు—— 3౨౪

క. 'ప్రమద మొనర్చెదు నానయ
నములకు నంత కటు నిలుము' నాఁగా, నిఃస్నే
హము నిస్సంశయముం దన
యమలమతిం బల్లవింప నాశుకుఁ డరిగెన్. 3౨౫

ఆ. జనకు విడిచి యిల్లు సని, సిద్ధచారణ
సముదయోపసేవితమును యోగ
సేవనార్హ విధము నై వెలుఁగొందు కై
లాసశిఖరితట మలంకరించె. 3౨౬

సీ. విను, మందు సమను వివిక్తంబు నగుచోటఁ
బ్రాఙ్ముఖాసీనుఁ డై పరమయోగ
రతిఁ బదప్రభృతిగాత్రములఁ గ్రమంబుగ
నాత్మధారణము సేయంగ, నంత
నినుఁ డుదయించినం గని, పాణి-పాదసం
యమ మొప్ప నద్దేవు నాశ్రయించి,

నిర్విషయం బగుసర్వాత్మత త్త్వంబు
గాంచి, విశిష్టయోగక్రమంబుఁ

తే. బొంది, నారదముని [1]యలవోక యచటి
కరుదెంచిన వినతుఁడై యాత్మయోగ
సిద్ధి యెఱిఁగించి, నీకృపఁజేసి తెరువు
గంటి; నరిగెద విగతసంగత్వ మొంది; ౩౨౭

క. అని పలికి విమలయోగం
బున నాకసమునకు నెగసి పోయె గరుత్మం
తునిభంగి; నపుడు సాధ్యులు
మునులుం గని విస్మయమున మునుఁగుచుఁ దమలోన్. ౩౨౮

తే. అచిరకాలంబునన యమ్మహాత్ముఁ డిట్లు
యోగసిద్ధిఁ బ్రాపించునె! యుల్ల మెంత
నిర్మలమొ! పితృభక్తివినిశ్చలత్వ
సంపదన చూవె యీతఁ డీపెంపు వడసె! ౩౨౯

—•• వ్యాసుఁడు వెనుకొన శుకుఁడు యోగమార్గంబున నదృశ్యుం డగుట. ••—

వ. అని మఱియు ననేకభంగులం బ్రస్తుతించుచుండిరి. అట్టియెడ శుకుండు, మృగ-పక్షి శైల సరి త్సరసీతరు గుల్మ లతలం గలయం గనుంగొని, "మాతండ్రి నావెనుకం జనుదెంచి నా దగుపేరం బిలిచెనేని మీ రెల్ల 'నో' యన వలయుం జుండీ!" అనిన, నవియట్లు చేసెద మనియె. ఆబ్రహ్మర్షివరుండు దమో రజస్సత్త్వంబులం గ్రమంబున డిగ్గఁ ద్రావి, యుత్తరాభిముఖుం డయిపోవ, నొక్క మహాపర్వతంబు శృంగంబులు రెం డత్యంతపీతశ్వేతంబులై మేరుహిమవంతంబులం దెగడుచుంగదిసి, యనేకయోజనాయామవిస్తారంబులు గలిగి మార్గంబున కడ్డపడి యుండె. అతం డప్రతిహతగమనంబునం జన నవి దుత్తుమురై

1. యథేష్టముగా.

రాలె. అద్భుతభంగి యగు నాసిద్ధపుంగవుపైఁ బుష్పవర్షంబు గురియుచు నమరగణంబు బహువిధంబులం బ్రశంసించె. అప్పారాశర్యపుత్త్రుం డయ్యెడం బ్రవహించు మందాకినిమీఁద జదలఁ జేరువం జనియె. అట్లు సనుసమయంబున,— 330

తే. [1]నగ్నలై యప్సర స్త్రీజనములు సలిల
కేళి సలుపుచు నుండి, శంకింప కమ్మ
హాత్ముఁ గనుఁగొను చెప్పటియట్ల నిర్వి
కారవృత్తి వర్తించిరి కౌరవేంద్ర. 331

వ. అయ్యవసరంబున సత్యవతీసుతుండు నిజసుతువెనుక మహాయోగగమనంబు గైకొని తగిలె. అంతకు నయ్యారణేయుండు వాయుపథం బతిక్రమించి సర్వభూతాత్మకుం డయ్యె. అప్పుడు,— 332

తే. వెనుక నరుగుచు నున్నయవ్వేదమూర్తి
తోడ సిద్ధ-చారణులు: దత్సుతుఁడు శైల
శృంగవిధ్వంసియై పోక సెప్ప, నెలుఁగు
పెంపు మిగుల 'శుకా' యని పిలిచె నతఁడు. 333

వ. పిలిచిన నాసర్వగతుండు నిజప్రాకారం బంతర్హితం బగుట దేటపడ, బయల 'నో' యను నాదంబు నిగుడునట్లు సేసె. తదనంతరంబ—

తే. సకలజంగమ-స్థావరసమితు లెల్ల
'నో' యనిన నద్భుతం [2]బెడ్డ నుద్భవింప
సత్యవతికొడుకు- కొడుకువిశాలమహిమ
దెలిసి యప్పర్వతముమీఁద నిలువఁ బడియె. 334

వ. ఇట్లు నిలిచినయవ్వేదవ్యాసమునీశ్వరుం గాంచి జలవిహారంబు సలుపు నయ్యప్సరోజనంబులుసిగ్గునగ్గలిక గ్రందుకొన నందఱునంబరంబులు

1. దిసమొలలు గలవారై; వివస్త్రలై. 2. రూ. ఎడ్డ; ఎద్ద; ఎడఁద, ఎద = మనస్సు.

ధరియించిరి. అద్దివ్యబోధమహానీయుండు నిజతనయు చనునప్పుడు వారు శంక లేక యునికి గని, యతనిముక్తతయుఁ దనసక్తతయుఁ నిరూపించి, ప్రియంబును లజ్జయు నొక్కటఁ బొడమనున్నంత— ౩౩౬

క. సురమునిసిద్ధగణంబులు
పరివేష్టింపంగ నతనిపాలికి గంగా
ధరుఁ డేఁగుదెంచి నెవ్వగఁ
బొరయునతనితోడఁ గరుణ వొంపిరివోవన్. ౩౩౭

వ. అనునయపూర్వకంబుగా ని ట్లనియె: ౩౩౮

క. జల పవ నాంబర వసు ధా
నలసమవీర్యుఁ డగుపుత్త్రి నా కొసఁగంగా
వలయు నని యడిగి; తిచ్చితి,
నలఘుతపోవిభవ, యేను నట్టికుమారున్. ౩౩౯

వ. వాఁడును మత్ప్రభావంబునను భవత్తపోవిశేషంబునను బ్రహ్మతేజోమయుండై దేవతలకుం బొందరానిపరమగతిం బ్రాపించె. దీనం జేసి మోదంబు నందవలదె? విషాదంబునకుం బని యేమి?— యని పలికి వెండియు, ౩౪౦

తే. ఇలయు గిరులును శరధులు నెంతదాకఁ
గలుగు నంతకాలంబును వెలయుచుండు:
శుకునికీర్తియు, నీదుయశోవిభూతి
యును జనంబుల వీనుల కుత్సవముగ. ౩౪౧

వ. అని నిర్దేశించి, 'వలయునేనిఁ బుత్త్రసదృశ యైనఛాయనిన్నెప్పుడు ననుగమింప దర్శించువాఁడవుగా' కనియె, ఇట్లనుగ్రహించి యా బ్రహ్మర్షిప్రవరుని సంప్రీతునిం జేసి వీడుకొల్పి విశ్వేశ్వరుండు నిజేచ్ఛం జనియె. ఇంతవట్టు నారదుండు నాకుం జెప్పె. ౩౪౨

క. ఇది యితిహాసవరము; దనుఁ
జదివినవారలకు వినినజనముల కాయుః
ప్రద మగు; లక్ష్మీకీర్త్య
భ్యుదయంబుల నిచ్చు; సుగతియును గావించున్. ౩౮౩

వ. అనియె. అద్దేవమునిచేత నా వినినచొప్పున నీకుం జెప్పితి. నీ వింక నేమి వినవల తనుటయు, ధర్మతనయుండు శంతనుతనయుతో: 'బ్రహ్మచర్యాదు లగునాలు గాశ్రమంబులవారును దమకు నుత్తమపద సిద్ధి గోరి యారాధించుదైవం బెయ్యది? దయపల్లవింప నా కెఱింగింపుము.'

క. అనియె నని చెప్పి గురు
భక్తినియూథుఁడు లోకమాన్యతేజుఁడు విద్యా
ఘనుఁ డగునావైశంపా
యనమునివరుఁ డిట్టు లనియె నాతనితోడన్. ౩౮౪

తే. వ్యాసమునినాథు షడ్గుణైశ్వర్యధుర్యు
నాగమవ్యాసకర్మరు నమితతేజుఁ
గొలిచి తత్ప్రసాదంబునవలనుఁ బెంపుఁ
గలిగి యేను నారాయణుకథ ఘటింతు. ౩౮౫

వ. అని భక్తిపూర్వకంబుగాఁ బలికి జనమేజయున కిట్లనియె: అట్లజాతశత్రుం డడిగిన, నయ్యాపగాపుత్త్రుం డతనితో నారాయణ-నారద సంవాదం బనుసితిహాసంబు మాతండ్రి నాకుం జెప్పె. దాన నీ యడిగినయర్థంబు దేటపడుం; జెప్పెద— ౩౮౬

క. అని పలికి యాదరంబున
మనంబు మేదురము గాఁగ, మనుజేశ్వర, య
జ్జనపతివీను లమృతరస
మున నించినయట్టిచందముగ ని ట్లనియెన్: ౩౮౭

—•• భీష్ముఁడు ధర్మజునకు నారద–నారాయణసంవాదంబు సెప్పుట. ••—

సీ. విను, మవ్యయుఁడు సనాతనుఁడు విశ్వాత్ముఁడు
నై ననారాయణుం డనుమునీంద్రు
బదరికాశ్రమమున భక్తిమైఁ గొలిచి నా
రదుఁ: 'డెద్దిసిద్ధి కారాధనీయ
మానతి యి' మ్మన్న, నతఁడు: 'ధ్రువం బచ
లం బింద్రియాగోచరంబు సూక్ష్మ
మనుపమ మన సర్వమున కంతరాత్మ మై
వెలుఁగుతత్త్వము దక్క– వేఱ కలదె?

తే. యరయ నారాధ్య మై యజుఁ డాది గాఁగ
సకలభూతంబులకును బూజ్యంబు దాన'
యనిమె; ని ట్లన్న, నరసఖుఁ డతికృపార్ద్ర
భావుఁ డై చెప్ప నప్పద్మభవసుతుండు—  ౩౮౯

వ. సంప్రీతుం డైనవిశేషవినయంబున నమ్మహాత్మున కి ట్లనియె:  ౩౯౦

క. లోకేశ, నీవు ధర్మ
శ్రీకావలి గాఁగ నవతరించుట విద్వ
ల్లోకంబు సెప్పు; నమూ
లాకృతి యె ట్లుండునో దయాత్మకమూర్తీ!  ౩౯౧

క. శ్రుతిపరతయు గురుభక్తియు
మతిఁ గల వొకకొంత కొంత, మన్నింపఁగఁ బా
త్రత గలిగెనేని నా కొసఁ
గు తదీయాలోకనం బగు తెఱంగు కృపన్.  ౩౯౨

వ. అని వేడిన, భక్తపరాధీనుం డైన యమ్మహానుభావుం డద్దేవసంయ
మితోఁ: 'బరమైకాంతి వగుము. నీ కట్టిపెంపు సంపాదించెదం
బొమ్ము' అని యత్యాదరంబున వీడుకొలిపినం బ్రీతుం డై వియద్వీథిం

జని, యమ్ముని గనకనగంబునందు నియతాత్ముం డయి యుండి,
దుగ్ధార్ణవంబు నుత్తరంబు చేరువనున్న శ్వేతద్వీపంబునం దనాహా
రులు నింద్రియవృత్తిరహితులు నస్వేదులు సుగంధిశ్వేతాంగులు
నగు పురుషులం గాంచె ననిన విని, ధర్మపుత్త్రుం డవ్విశేషంబులు
ముక్తలక్షణంబు లై యున్నయవి; అప్పురుషుల తెఱం గెఱింగింపవే
యని యడిగిన శంతనునందనుం డతని కిట్లనియె: ౩౫౩

క. వారలకథ మాతండ్రికి
గారవమున బుధులు సెప్పఁగా నేవింటిం,
గౌరవముఖ్య, విశిష్టా
చారుఁడు నృపుఁ డొక్కఁ డుపరిచరవసు వనఁగన్— ౩౫౪

ఆ. కలిగెఁ దొల్లి: భూమిగలయంతయును నేలు
సత్యమును దమంబు శమము విష్ణు
భక్తియును నయంబు బలిమియుఁ గ్రతుకుతూ
హలము బ్రాహ్మణప్రియంబు గలఁడు. ౩౫౫

వ. అమ్మహాత్ముండు— ౩౫౬

చ. అలఘుతపంబు గోరి వసుధాధిపతిత్వము డిగ్గఁ ద్రావి కా
నలఁ జరియించు చుండ, సురనాయకుఁ డాతనిపాలి కేఁగి: ‘నె
చ్చెలి వయి నాకడం దగ వసింపుము; వచ్చుచుఁ బోవు చున్న మే;
లిలయును నేలు దివ్యతయు నిచ్చితి, మెచ్చితి నీమనిషకున్ ౩౫౭

తే. ‘దేవభావంబునకుఁ దగ దీని నెక్కి
తిరుగు మెల్లెడ’ నని, రత్నదీప్తమైన
యొకవిమానంబు సంప్రీతి నొసఁగె నతఁడు;
నతనిమాటకు మిగులక యట్ల చేసె. ౩౫౮

వ. దానం జేసి వసునామధేయుం డైనయతం డుపరిచరుం డనం బరఁగె.
అదియునుంగాక వేఱొక్కటి యవ్విభునివిశేషంబు వినుము: కల్పాది

యందు మరీచి యత్రి యంగిరసుండు పులహుండు పులస్త్యుండు క్రతువు వసిష్ఠుం డనియెడు మహామునులు, చిత్రశిఖండినామ ధేయులు, స్వాయంభువుం డనుమనువుం దారు ననేకవర్షంబులు విష్ణు నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుం డదృశ్యరూపంబున వారల కట్టెదుర నిలిచి వారితో: 'మీరు ధర్మశాస్త్రకరణప్రవణుల రై న న్నాశ్రయించితిరి. భారతి మీయందు నిలువ నియోగించితి. మీచేతం బ్రణీతం బై సకల జగంబులకు హితంబును మర్యాదా ప్రవర్తకంబును నై శాస్త్రంబు వెలుంగు. అంగిరసువలన బృహస్పతి యను నొక్కమహామతి జన్మించు. వానియం దాసందర్భంబు ప్రతిష్ఠించునది.' అని యానతిచ్చి వెడియు,— ౩౫౯

తే. 'ఉపరిచరవసు వనునొక్కనృపతి పుట్టు;
నాతఁ డర్థిఁ డాశాస్త్రంబు నధిగమింపఁ
నాబృహస్పతి సెప్పంగ నధిగమించి
తత్సమాచారనాయకత్వము వహించు. ౩౬౦

వ. 'అస్మహితాత్ముండు మద్భక్తుండు; మీకు సంభావనీయుండు' అని పలికి చనియె. అత్తెఱంగునన యాపెంపు నొందినయట్టి య వ్వసువు హయమేధంబునకుం బ్రవర్తించిన నమ్మరీచ్యాదులగు సప్తసంఖ్యులును, మఱియును దత్సము లగుమహానుభావులును ఋత్విక్కరణంబు లాచరించిరి. బృహస్పతి యుపద్రష్టనంబు నడపె. ప్రజాపతి పుత్రు లగునేకతుండును ద్వితుండును త్రితుండును అనుముని సత్తములు సదస్యు లైరి. ఇట్లు సెల్లు నయ్యధ్వరంబునందు— ౩౬౧

తే. అ న్నరేంద్రుం డహింసకుం డగుటఁ జేసి,
పశు విశసనంబు లేకుండఁ బరమనిష్ఠ
నాతఁ డారణ్యకోద్గీత మైనవాక్య
సంచయము విష్ణుగుఱిచి పఠించె నధిప. ౩౬౨

క. కరుణావిధేయుఁ డగు నా
హరి యతనికిఁ గాన వచ్చునట్టులుగాఁ జె
చ్చెర వచ్చి హవిర్భాగా
హరణం బొనరించి చనుడు, నతికుపితుం డై ౩౬౩

వ. దివ్యధిషణుం డగు ధిషణుండు గన్నీ రొలుక నన్నరపతితోఁ: 'తనకై యెత్తిన[1]పురోడాశభాగంబు విష్ణుం డెల్లవేలుపులుంబోలె నాకు దర్శనగోచరుండై కొనక యదృశ్యుం డై కొనియె' నని యుగ్గడించిన నయ్యుపరిచరుండు భరితవినయుం డై యతని ననునయించె. సదస్యులు సంభ్రమంబులేక యన్నాకేశమంత్రితో ని ట్లనిరి: ౩౬౪

—•• ఏకత ద్విత త్రితులు బృహస్పతికి విష్ణుదేవుమహిమ సెప్పుట. ••—

సీ. అలుక మానుము హరికై సముద్యత మైన
భాగంబు హరి గొన్నఁ బదర నేల?
యతని దర్శింప శక్యమె నీకు మాకును?
నజునిమానసపుత్రు లైన యేము
హరిదర్శనము గోరి యధికతపం బాచ
రించు చుండఁగ, నశరీరవాణి:
'దుగ్ధార్ణవంబునందు విశాలరమణీయ
మగు నొక్కదీవి దె ల్లారి యుండు;

ఆ. నచటి కరుగుఁ, డచట నతిసితవర్ణు ల
స్వేదు లింద్రియప్రవృత్తివిముఖు
లధికసురభిదేహు లాహారరహితులు
హరిపరాత్ము లైన నరులు గలరు. ౩౬౫

క. వారలకుఁ జూపు నిజతే
జోరూపము విష్ణుఁ; డపుడు చూడఁగ నైనన్

1 యజ్ఞముకొఱకుఁ జేసిన అపూపము (=అప్పము; పిండివంట.)

మీరును జూతు' రనినఁ, బ్రియ
మారినచిత్తములతోడ నందఱము వెసన్‌— ౩౬౬

వ. శ్వేతద్వీపంబునకుం జని యశరీరవాణి సెప్పినచందంబుమానవులం గంటిమి. అట్టి దీప్తివిశేషంబు లేలోకంబుల నెజ్జాతులకు లేవు. వారలు మానసజపపరాయణు లై యున్నవారు. ఏ మయ్యెడ నేకాంతిక జనుల కింత నంత నున్నంత, భానుసహస్రప్రభాభాసితం బగు నొక్కదివ్యతేజోరూపంబు వారియగ్రభాగంబునం దోఁచిన, వారు గూండుకొని భక్తిమయప్రణామంబులు సేయుచుం జేరి, 'జయ పుండరీకాక్ష,' 'జయ హృషీకేశ' 'జయ విశ్వభావన నమస్తే నమస్తే' యనునెలుంగులు నింగి ముట్టం గొల్చిరి. అట్టియెడ.—

క. మానయనంబులు: దత్తే
జోనిహతము లగుడుఁ దెలియఁ జూడ నశక్యం
బై నం జేడ్పడి యుండం
గా నొక భూతంబు వలికె గగనతలమునన్‌: ౩౬౭

క. 'ఈదేవునిఁ గన్నట్టుల
కాదే యిప్పురుషవరులఁ గాంచుట మీకున్‌?
ఖేదంబు వలదు; నియమత
పోదానము లితనిఁ జూపఁ బూఁటవడియెనే?' ౩౬౮

క. 'ఏకాంతికభక్తిరతి న
నేకము లగువత్సరముల కివ్విష్ణుని నా
లోకింపంగా దొరకొనుఁ
గా, కిటు వేగపడ మీకుఁ గానఁగ వశమే?' ౩౭౦

క. అని పలికిన విని క్రమ్మఱఁ
జనుదెంచితి మేము; విష్ణుచందం బిది; నీ

కనఘూ, యలుగం బని లే,
దనూనములు గాఁగ నడపు మధ్వరవిధులన్. 320

వ. అని యి ట్లేకత ద్వితత్రితులు సెప్పినం బ్రశాంతుం డై పురుహూత పురోహితుండు, అయ్యాగంబు సుప్రయోగంబుగాఁ జెల్లించె. ఆ భూవల్లభుం డట్లు పుణ్యపరుం డగుచుఁ బ్రజాపరిపాలనం బొనరించె. అట్టియెడ నాకలోకంబున సుర-మునిగోష్ఠియందు సుర లధ్వరంబుల నజంబుల విశసింప వలయు నని పలికిన మునులు అజంబు లన్నంతన యెల్లయుగంబులను [1]ఛాగంబులఁ గాఁ గొనరాదు. కృతయుగవిష యంబుగా వేదంబులు: అజంబులు ఓషధులు అని చెప్పెం గాన ననిరి. ఇట్లు వివాదం బైనసమయంబున [2]నలపోకపోలె నుపరిచర వసు వయ్యెడకుం జనిన, నా రెండుదెఱంగుల వారును జయాప జయంబులకు నతనిమాట పాటిగా నూఁది యడిగిన, నాతండు—

క. 'ఛాగము విశసనయోగ్యము
యాగంబుల నెల్లయుగము లందును' ననియెం
దా గీర్వాణుల పక్షం
బై గెలు పడి యపుడు వారి కగుటకు నధిపా. 323

వ. అనిన విని వేదార్థాపలాపంబునకుం గోపంబు నొందిన, మునుల శాపంబున నతండు భూవివరపతితుం డయి యుండ, నమరు లేతెంచి యతనియంతరంగంబునకుం దెలివును, నంగంబునకు డప్పి లే కుని కియు నొసంగి, విష్ణుప్రసాదంబునఁ బ్రత్యాపన్నుండ వగు దని యూఱడించి యరిగిరి. అన్నరవరుండును విష్ణుధ్యాన జపపరా యణుం డగుచుండ నచిరకాలంబునకు విష్ణుండు విహగపతిం బుత్తెంచి యెత్తించికొనిపోయి శరీరంబుతోడన బ్రహ్మలోకగతుం గావించి సంభావించిన నమ్మహానుభావుండు పరమానందము నొంది వెలింగె. 324

---

[1] శ్లోకలనుగాఁ గొనరాదు, [2] యాదృచ్ఛికముగా వచ్చినవాఁడువలె.

క. కురునాథ, యుపరిచరవసు
చరితంబు ప్రసంగకలన సంప్రాప్తం బై
పెరసెను నీ వడిగిన య
ప్పురుషులదివ్యానుభావముం జెప్పంగన్. 3౭౫

వ. అని పలికి భీష్ముం డాభూపతితో నారదువృత్తాంతంబు వినరించెద
నాకర్ణింపుము—— 3౭౬

సీ. అని చెప్పి యిట్లను: నధిప, నారదు డట్టు
లద్దీవియును నద్భుతాంగు లైన
యమ్మానవులుఁ దనయంతరంగంబునఁ
దోఁచినఁ బ్రీతి నందులకు నేఁగి
యమ్మహాత్ములు దన్ను నాత్మల నాదరిం
పంగఁ, దానత్యంతభక్తిఁ బ్రణతుఁ
డై పరమైకాంతు లగువారి కింతంత
నిలిచి దుష్కరతపోనిష్ఠఁ బూని

తే. యూర్ధ్వబాహుతఁ గదలకయుండి వివిధ
గూఢదివ్యనామోక్తిసంప్రౌఢి యచటి
సకలజీవుల నానందసంభృతములఁ
జేయు చుండ, విష్ణుస్తుతి సేయు చుండె. 3౭౭

వ. ఇవ్విధంబున నేకాంతినై సంస్తుతింప [1]సితాసిత పీతారుణ పిశంగ హారి
తవర్ణంబులను, బహుశిరో బాహు పాదంబులను, వేది కమండలు
స్రుక్స్రువాగ్ని ధారణంబున నోంకారసావిత్రీ చతుర్వేదోచ్చారణం
బులను, మహాద్భుతం బయినవిజదివ్యరూపంబు నారదునకు దర్శన
గోచరంబుగా నిలిచి విష్ణుండు, వినయసంభ్రమోపేత భక్తిప్రణ
తుం డగునప్పరమముని నాదరించి యి ట్లనియె: 3౭౮

1_సిత=తెల్లని, అసిత=నల్లని, పీత=పసుపువన్నెయు, అరుణ=ఎఱ్ఱని, పిశంగ=కపిలవర్ణము (=గోరోజనమురంగు)ను, హారిత=ఆకుపచ్చని వన్నెయుఁ గలిగి....

శ్వేతద్వీపవాసి యగు నారాయణుఁడు నారదున కుపదేశించిన తత్త్వము.

క. నను( గానఁ బడయ రెవ్వరు ;
ననఘా, ధ్యేకాంతికులక యర్థాము మద్ద
ర్శన; మీ వేకాంతికుఁడవు
ననహంకారుఁడవుఁ గాన నన్నిం జూడన్. ౩౭౯

వ. అని పలికి వరంబు వేఁడు మనుటయు, నతండు: 'దేవా, భవద్దర్శ
నంబుకంటె మిగుల వరంబునుం గలదే?' యనుటయు, నద్దేవుండు
సవిశేషప్రసాదభరితుం డై, ౩౮౦

సీ. ఇంద్రియంబుల కందఁ; డెల్లభూతంబులుఁ
దెగినను దెగకుండుఁ; ద్రిగుణరహితుఁ;
డఖిలంబునకు నాత్మ యన, సర్వసాక్షి నా,
నజుఁ డన, నిష్కలుం డన వెలుంగు
క్షేత్రజ్ఞుఁ డాతండు; జీవుండు వాసు దే
వుండును సంకర్షణుండుఁ జూవె
వారు! మనం-బహంకారంబు వరుసఁ: బ్ర
ద్యుమ్నానిరుద్ధనామోపహితము;
తే. లింతయును మన్మయంబ;— యే నిరువదియును
నాల్గునగుతత్త్వకోటికి నాథుఁ డైన
పంచవింశ కాభిఖ్యుండఁ; బరమపురుషుఁ
డనియు నాపేరు; మఱి పర మరయ లేదు. ౩౮౧

క. విను, మేకాంతికుఁ డెవ్వనిఁ
గని నిత్యానందపదము గను నప్పరమా
త్మని వాసుదేవు నిష్కలు
ననఘుఁ గా నను నెఱుంగు టాత్మ హిత మగున్. ౩౮౨

క. భూతాత్మక మైనయఖిల
ధాతుచయము వెలిగ లేదు తను; వా మొత్తం
బాతతజీవవ్యాప్తి స
మేతముగాకున్నఁ జేష్ట నెసఁగదు వత్సా. ౩౮౩

క. జీవ—శరీరములు పృథ
గ్భావాకలితములు గాఁగఁ గనుటయు వలయున్;
జీవునిఁ గంటి ననుట మా
యావిలసన;— మస్మదీయ మది మునివర్యా. ౩౮౪

క. జీవుఁడు మత్సమవేతుఁడు
గావు నెఱుఁగ వలయు దృఢముగా, భక్తిమయుం
బైవఱలు నాశ్రయంబున
నేవాఁ డొందు నను వాని కిత్తు విముక్తిన్— ౩౮౫

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది దివిజగణము నంబుజాసనుఁడుఁ జతు
ర్వేదములు మదాత్మకతం
గాదే తత్తద్విశేషగౌరవ మొందున్! ౩౮౬

తే. కమలగర్భు సృజించి, సకలజగద్ధు
రానియుక్తునిఁ గావించి, యే నివృత్తి
పరత నేకాకి నై విద్య భవ్య మగు స
హాయముగ సంచరింతు మధ్యస్థవృత్తి ౩౮౭

వ. ఒక్కొక్క—కాలంబున జగద్ధితంబుగా జన్మకర్మంబులం బూనుదు; వినుము, వారాహరూపంబు దాల్చి హిరణ్యాక్షుని, నారసింహమూర్తి ధరియించి హిరణ్యకశిపుని, భృగువంశంబున జామదగ్న్యుం డన జనియించి సర్వక్షత్రంబును, దశరథుం డను రాజునకు రామనామంబునం బుట్టి రావణాసురుం బరిమార్పం గలవాఁడ.

భూభారంబు వాపుటకై యాదవకులంబునం బ్రభవించి పురందర నందనుండై యవతరించిననరుండుదోడ్పడ నక్కార్యంబు నిర్వహింతు. నేను దొల్లి నరనారాయణు లనియెడు నామంబుల మూర్తిద్వయంబును ఋషిత్వంబును వెలయ నొలసి లోక రక్షణం బాచరించుచున్నవాఁడ. అమ్మూర్తులపదంపడి కేలీ మానుషత్వంబు గైకొని యిట్లు సేయునయ్యవతారంబునఁ గంస కాలయవన ముర నరక బాణ ప్రముఖులైన కంటకులం జెఱుతు. అందు, బాణాసురుం గాతు నని పూని మహాదేవుండు మహాసేనాది సహితుండై యడ్డపడ, నమ్మహాత్ముని జయించి బాణునిం బరాభవింతు. ఇంతకు మున్ను మత్స్యత్వ కూర్మత్వంబుల నొంది నిఖిలచ్ఛందోబృందారకహితంబొనర్చితి. తచ్చరితంబులు నీకుం గర్ణగోచరంబులు గాకుండెడునే? మఱియు ధర్మరక్షణార్థం బుగా నే నేమి సేయవలయు నవి యెల్లనుం జేయువాఁడ. కృత్యం బులు గృతంబులైన మదీయప్రకృతిఁ బొందుదు. పరమేష్ఠి నందనా, నీ వేకాంతికుండ వగుట నీకు నా తెఱంగెల్ల నెఱిగించితి నని చెప్పి యమ్మునిం గని, యనాహారులు ననింద్రియులు నస్వే దులు సుగంధి శ్వేతదేహులు నగు నమ్మానవులం జూపి, వీరే కాంతికులు, మన్మయధ్యానపరులునై యున్నవారు; వీరలకు సమ్మర్దంబుగా మెలంగం దగదు. నీ విం కఁ బొ మ్మని పరమాదరంబునం బలికి వీడ్కొలిపిన, నద్దేవమునిసత్తముండు పరమానందభరితుండై బదరికాశ్రమంబునకుం జనుదెంచి నరనారాయణులం గాంచి,

తే. భక్తి వీడ్కొని చని మునిప్రతతి కొంద
ఱచ్యుతాననోద్గతము వేదార్థమయము
యోగసాంఖ్యాత్మకము నైన హాగమ్మృతము
గర్ణపుటపేయముగఁ జేయు గారవమున. ౩౭౯

వ. నారదుం డట్లు విష్ణునిదివ్యవాక్యవితతి విద్వజ్జనంబులకు వినిపించుచు బ్రహ్మసభ కరిగి యందునుం బ్రకటించె ననుటయు, నప్పద్మభవునకును నది వింతయె యనిన యక్కుంతేయాగ్రజుతో, శాంతనవుండు: 'ఆశతానందునకు నపరిజ్ఞాతంబునుం గలదే? యతనిం గొలువ వచ్చినట్టి సిద్ధసాధ్యాదులకు వినిపించెదం గాక' యని పలికి వెండియు నిట్లనియె: ౩౯౦

క. క్రమమున వాఙ్మయ మగున
య్యమృతము లోకమునం బరంగె; నది మజ్జనకుం
డమితదయం జెప్పె నాకును;
శమయుత, యేం జెప్పితిని విశదముగ నీకున్. ౩౯౧

క. మునులును సురలును దీనిని
విని కొనియాడుదురు; విష్ణు వినుతింతురు; భ
క్తినిరూఢు లై జపింతురు;
మనమునం జర్చింతు రతిసమాహితు లగుచున్. ౩౯౨

తే. నీవు నిట్టుల చేయు; వినీతిపరుండు
విష్ణుభక్తుండు శమదమాన్వితుండు నైన
యట్టివానికిం జెప్పు మీ యచ్యుతాన
నోద్గతం బై నయిప్పురాణోత్తమంబు. ౩౯౩

క. నీవినిన యుపాఖ్యానము
లేవియు సరి గావు దీని; కిది దీర్ఘాయు
శ్శ్రీవిభవారోగ్యములం
గావించుం బఠించినం, దగం దను వినినన్. ౩౯౪

క. అని శాంతనవుండు సెప్పిన
విని మోదము నొంది పాండవేయులు, దీనిన్

వినుచుఁ బఠించుచు విష్ణుం
గొనియాడుదు రధికభక్తిఁ గురువంశవరా. 3౯౫

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు, 3౯౬

ఉ. సాత్యవతేయుఁ డీపరమజప్యము భక్తిఁ బఠించుచుం బ్రియ
ద్గత్యభిరాముఁ డై నియమతత్పరతం జను దుగ్ధవార్ధికిన్
నిత్యము విష్ణుఁ గాంచి మహనీయతరం బగు పూజనంబు సం
స్తుత్యము గాఁగఁ జేతకుఁ గుతూహలసంపద పల్లవింపఁగన్. 3౯౭

వ. అనిన విని జనమేజయుండు మోదంబునొంది యమ్మునిసత్తమునితో: 'నీవు మోక్షం బత్యంతసుఖం బని చెప్పుదు. సకలజనంబులు నభ్యుదయకరంబు లైనకర్మవిశేషంబులం దగిలి యుండుదురు. ఒరులనన నేల, దేవతలును దద్ధర్మంబు వాటింపక హవ్యభోజనపరత్వం బూని యుండుదురు. అమ్మహాత్ము లట్లగుట యెట్లొకోయని యేను విచారించుచుండుదు. అత్తెఱంగు దేటపడ నెఱింగింపవే' యని యడిగిన, నప్పారాశర్యశిష్యుం డాభూవరున కి ట్లనియె: 3౯౮

క. విమలాత్ముఁడు పారాశ
ర్యమునీంద్రుఁడు శిష్యులను మహాభారతపం
చమము లగు వేదముల మే
రుమహీధరవాసి యై కరుణఁ జదివించెన్. 3౯౯

వ. అట్టియెడ నేనును, సుమంతు పైల జైమినులు, నీ విప్పుడు నన్నడిగినచందంబున నమ్మహాత్ము నడిగితిమి. దానికి సుముఖుం డయి సర్వజ్ఞుండును సదయహృదయుండును నగుసాత్యవతేయుండు మాకు ని ట్లని యాన తిచ్చె: ౪౦౦

తే. ఏ నతీతంబులును వర్తమానములు న
నాగతమ్ములు నగుజగదఖిలవర్త

నంబులును గనుదివ్యబోధంబుఁ గోరి
పాలకడలితీరమునఁ దపంబు సేసి.— ౪౦౧

వ. నారాయణ ప్రసాదంబునం జేసి సిద్ధమనోరథుండ నైతిం గావునం, గల్పాదియందుఁ గమలసంభవప్రముఖ బృందారకు లాచరించిన కృత్యంబులు గానవచ్చువాని జెప్పెద; దాన మీ యడిగిన యర్థంబు దేటపడు.— వినుండు, ౪౦౨

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాదిసురులు మునులు నంబుజాసనుఁ గని 'మా
కేది కరణీయ, మీశ, ద
యాదృష్టిని మమ్ముఁ జూచి యానతి యీవే' ౪౦౩

వ. అని విన్నవించిన విని, భరితాదరుం డగుచు నప్పరమేష్ఠి వారితోఁ: 'మీ కెయ్యది కర్తవ్యంబో యనుతలంపు మున్న నాచిత్తంబునం బొడమి యున్నయది. మీరు నిమ్మాట సెప్పి మేలు సేసితిరి. మీకును నాకును బ్రబలత్వం బెద్దానం గలుగు దాని నుపదేశించుటకుం 'బురుషోత్తము శరణు సొత్తము రండు' అని పలికి వారునుం దానును దుగ్ధవారాశితీరంబునకుం బోయి ఘోరం బగుతపంబు బహుసహస్రసంఖ్యంబు లగుదివ్యవర్షంబు లాచరించిన, వారలకు గంభీరమధురప్రకార యగువాణి యి ట్లని వీతెంచె:— ౪౦౪

విష్ణుఁ డదృశ్యరూపంబున బ్రహ్మాదిదేవతల కుపదేశించినహితప్రకారము.

క. 'మీవచ్చినపని యెఱుఁగుదు;
నీవనజభవుండు జగము లిన్నిటికి గురుం;
డేవిధిఁ బనిచిన నది శ్రుతి
భావితకర్మంబు; దానఁ బరఁగుదుఁ దగఁగన్. ౪౦౫

వ. 'ఏనునుం జెప్పెద వినుండు, వేదహితం బగునొక్కయాగంబు సేయుండు; అందు భాగంబు నాకుం గల్పింపవలయు' ననిన వారుం బ్రీతిఁ బొంది,— ౪౦౬

క. కమలజు పంచిన క్రియ యా
గము వైష్ణ మనఁగఁ జేసి కల్పించిరి భా
గము విష్ణున; కం దతఁ డ
య్యమరుల మునివరులపై దయను గగనమునన్.— ౪౦౭

వ. అదృశ్యుం డై నిలిచి వారలతో ని ట్లనియె: ౪౦౮

క. 'నాపంపునను బ్రవృత్తి
వ్యాపక మైనట్టిసత్క్రియం జేసితి; రి
ట్లీపుణ్యంబునకును ఫల
రూపం బగుదాని వే నిరూపింతుఁ దగన్. ౪౦౯

వ. 'మరీచి యంగిరసుం డత్రి పులస్త్యుండు పులహుండు క్రతువు వసిష్ఠుం డనువీర లవ్వారిజభవునకు మానసపుత్త్రులు; ఇమ్మహాత్ములు నట్టివార; వేదాచార్యులు యజ్ఞకార్యధుర్యులు; వీరు విధింప సర్వయజ్ఞంబులును మానవులు మాననీయంబులుగా నడప మీ రెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల నాప్యాయితు లై [1]యుపబృంహణంబు నొందువారలు. సన సనక సనందన సనాతన కపిల సనత్కుమారులు పరమేష్ఠిమనోనిర్మితులు, సహజజ్ఞానవిజ్ఞానులు, నివృత్తిపరులు నై సాంఖ్యయోగంబులకుం బ్రవర్తకు లగుచుండుదురు. వీరలచేత మోక్షధర్మంబులు సువ్యంజితంబు లగు; మీకుం దల్లియుం దండ్రియు గురుండును: నవ్విగురుండును నివ్విరించియు. మదీయానుశాసనంబున నితండు సర్వానుశాసకుం డై వర్తిల్లువాఁడు. మత్ఫాలపరిభవుం డై సరుద్రుండు సర్వలోకారాధనీయుండును సకలవరప్రదుండునుం జుండీ! మీరు వొందుఁడు. వేదోదితకర్మంబు లిక్కమలభవుండును మరీచాదిప్రజాపతులునుం బంచినట్లు నడవం గలయవి. ఇది కృత్యయుగం బనుపేరింటి

1—చక్కని పెంపు; సంవృద్ధి.

యుత్తమకాలంబు; దీనియందుఁ బశువులు హింస్యంబులుగావు; సంశయంబు వలదు.' అని నిర్దేశించిన.— ౪౧౦

క. మునులును సురలును విష్ణు
న్వినుతించి నమస్కరించి నిజపదములకుం
జనిరి; పరమేష్ఠి యొకరుఁడ
చన కచ్చట నిలిచె; హరియు సన్నిహితుం డై— ౪౧౧

తే. హయశిరోభాసితుండును హస్తకలిత
లలితదండ-కమండలూజ్జ్వలుఁడు సాంగ
వేదముఖరముఖుండు నై యాదరార్ద్ర
దృష్టి నిగుడంగ నిలిచి యద్దివిజముఖ్యు— ౪౧౨

వ. కౌఁగిలించుకొని, 'నీవు సర్వఁబునకును విధాతవు గురుండవు ప్రభువవు నయి నడపుము. నీయందు సర్వభారంబును బెట్టి సుఖి నై యుండెద. నడపుట నీ కెప్పుడేనిఁ గడింది యై తోఁచె నప్పు డేను దోఁచి సమస్తంబును సునీతంబు సేయంగలవాఁడ' ననియె. తదనంతరం బావిష్ణుం డంతర్హితుం డయ్యె. ఇట్లు యజ్ఞంబులం దగ్రభాగార్హుండును యజ్ఞధారియు నైనయప్పద్మనాభుండు ప్రవృత్తిధర్మంబు బ్రహ్మాదులకుం గృత్యంబు సేసి, నివృత్తిధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండును నై సర్వగతుం డగుచుఁ జరియించు నని చెప్పి యప్పరాశర్యుండు,— ౪౧౩

క. మొదలఁ గలిగించి జగములఁ,
బదిలంబుగ నునిచి, వానిఁ బదపడి తనయం
దొదిఁగించి, మఱియు నెమ్మయి
నుదారగతి నడపుచిన్మయునిఁ గొలుతు హరిన్. ౪౧౪

ఆ. అజుని విశ్వరూపు నమరుని సర్వామ
రాధినాథు నాద్యు సాంగవేద

వేదితవ్యు నాత్మవేద్యు నీశాను న
వ్యయుఁ దపఃఫలాత్ము నాశ్రయింతు. ౭౧౫

వ. అని మఱియు ననేకప్రకారంబుల నప్పరమముని యప్పుడు భావంబున నెలకొన్న నారాయణుం బ్రస్తుతించి మమ్మెల్లం గలయ నవలోకించి, 'పూర్వవృత్తాంతములు పరీక్షాదృష్టిని నాకన్నయది మీకెఱింగించితి. విష్ణునిదివ్యవచనంబుల చొప్పున నడచునది. అప్పరమేశ్వరుం గొలువుండు. వేదవాక్యంబులం దత్పరికీర్తనంబు సేయుండు' అనియె. ఏము నట్లకాక యని ఋగ్యజుస్సామంబుల నాత్రిధాముం బ్రస్తుతించి మనంబుల నారాధించితిమి' అని చెప్పి వైశంపాయనుండు వెండియు,— ౭౧౬

సీ. సర్వజ్ఞుఁ డగు పరాశరనందనుని చేత
భాషితం బైన యి ప్పరమపుణ్య
వృత్తంబు నదివిన విన్నను విప్రుండు
వేదవేదియు, రాజు విజయశాలి
యును, వణిజుండు లాభోపేతుఁడును, శూద్రుఁ
డత్యంతసుఖియును నగు. నరేంద్ర,
కన్య సద్వరకరగ్రహణంబు వడయు; గ
ర్భిణి యైనకాంత సద్గుణునిఁ బుత్త్రుఁ

ఆ. గాంచుఁ; బ్రసవకాలకలుషంబు నెఱి దప్పి
యున్న బిడ్డ గలుగు నువిద సుఖక
రప్రసూతినిర్భరత నొందు; వంధ్య సం
తానసిద్ధి సమ్మదంబు నొందు. ౭౧౭

—•• భగవన్నామనిర్వచనప్రకారము ••—

వ. మఱియు నెవ్విధంబుమనోరథంబు లైనను సఫలంబు లగు ననిన, విని జనమేజయుండు: గూఢంబు లగు విష్ణునామంబుల నిర్వచనంబులు

వినవలతు వివరింపవే యనుటయు, వైశంపాయనుం డమ్మ
హీనాయకునితో నర్జునుం డడుగం గృష్ణుండు వివరించిన నిజ
నామంబులనిరుక్తి తెఱుంగెఱింగించెద నాకర్ణింపుము; అప్పార్థుని
బోధించుటకై యద్దేవుం డిట్లనియె:                         ౨౧౮

తే. నరుఁడు నారాయణుండు ననంగఁ బరగు,
నిత్యపురుషులు—నీవును నేనుఁ జుమ్ము!
భువనహిత మాచరింపఁగా భూనివేడ్క—
వచ్చి యిమ్మెయి బుట్టినవార మనఘ.                         ౨౧౯

వ. గూఢంబు లగు మదీయాభిధానంబుల యర్థంబులు దేటపఱిచెద
నాకర్ణింపుము:                                              ౨౨౦

క. నారము లనఁగా జలముల
పే; రయనం బనఁగ నెలవు; ప్రీతిగ నాకున్
నారము లయనం బగుటను
నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ.                ౨౨౧

క. వసియింతు నే జగముల;
న్వసియించున్ జగము లెల్ల నాయం; దిమ్మై
పొసఁగి వెలుంగుచు నుండుట,
నసదృశగుణ, వాసుదేవుఁ డనఁగ బరఁగుదున్.               ౨౨౨

క. వ్యాపించి రోదసీకుహ
రాపూర్ణత్వమున నునికి నధికక్రమణ
శ్రీ)పొలుపున విష్ణుం డను
దీపితనామంబునను బ్రతీతుఁడ నగుదున్.                   ౨౨౩

తే. దమము నాఁగలయుత్తమధర్మ మెడఁద
నలవఱిచి నన్నుఁ గామించు నార్యజనము;

దివియు భువియు నానడుమన తేజరిల్లు;—
నట్టు లగుట దామోదరుఁ డంద్రు నన్ను. ౭౩౭

ఆ. అన్నమును జలంబు నమృతంబు వేదంబుఁ—
బృశ్ని యనఁగ నొప్పుపేరఁ బరఁగు;
నది మదీయగర్భ మగుట, విద్వజ్జను,
లనఘ, పృశ్నిగర్భుఁ డంద్రు నన్ను. ౭౩౫

క. ఇనరశ్ములుఁ జంద్రాంశులు
ననలశిఖలుఁ గేశసంచయము నాకుం; గా
వునఁ గేశవాభిధానం
బునఁ గొనియాడుదురు నను బ్రబుద్ధజనంబుల్. ౭౩౬

క. క్షత్త్రము బ్రహ్మము నై, లో
కత్త్రాణన మాచరింపఁ గా వలసి, పృథా
పుత్త్ర, యగ్నీషోములు
చిత్త్రస్థితి వెలుఁగుదురు ప్రసిద్ధాకృతులన్. ౭౩౭

వ. అని చెప్పి బ్రహ్మ-క్షత్త్రపదంబులు విప్ర-రాజనిర్దేశంబు లగుట దేటపడం బలికి విప్రుల రాజుల మహానుభావంబులు విలసిల్లిన యెడలు నిదర్శనంబులుగా నిరూపించి యుపన్యసించి, యవి యెల్ల నగ్నీషోమమాహాత్మ్యంబు గావు తెలిపింగించి, ౭౩౮

తే. బోధన-స్థాపనంబులు, బుధవరేణ్య,
యగ్నియును సోముఁడును జేసి యఖిలజగము
నఖిలహర్షముఁ బొందింతు; రవ్యయప్ర
వర్తనత్వంబు దమయందు వఱలుచుండ. ౭౩౯

క. అనఘా, యగ్నీషోముల
ననుఁ గా భావింప జగమునకు నెపుడు క్షేత్రం

బొనరింతుఁ; దత్సుకృతములఁ
బొనరిన మద్భవ్యనామముల వివరింతున్— ౪౩౦

ఆ. 'పరమవరద లోకభావనేశ్వర హృషీ
కేశ నామకము, లహీనచిత్త,'
యనియు, మఱియు నిట్టు లను: 'యోగములభాగ
,మాహరింతుఁ గాన హరియు నండ్రు.' ౪౩౧

సీ. గో వన మహి; యది గుహలోనఁ బడకుండఁ
జెంది యెత్తుటను గోవిందుఁ డనియు,
పీతంపురోమంబుచేత నొప్పార నా
విష్టుఁ డగుట [1]శిపివిష్టుఁ డనియు,
గర్షణక్రియ భూమిఁ గావింతుఁ; జాయయుఁ
గృష్ణంబు;— గావునఁ గృష్ణుఁ డనియు,
నలవడి సదసద్ద్వయంబును నాయందు
సమవేతమై యున్కి సత్యుఁ డనియు,

తే. దాత్త్వికం బైన నాకు జాతత్వవికృతి
లేమి నజుఁ డనియును, నది లేక పోయి
నపుడు తదనంతరక్షయ మందకునికి
బుధు లధోక్షజుఁ డనియుఁ జెప్పుదురు నన్ను. ౪౩౨

క. సత్త్వమునునుండి తొలఁగమి,
సత్త్వము నాచేతఁ జేసి, సత్తఁ బొరయుటన్,
సత్త్వమయజన్ముఁ డగుటను,—
సాత్త్వతుఁ డనునామ మయ్యె, జనవర, నాకున్. ౪౩౩

తే. చ్యుతము లే కున్కిఁ జేసి యచ్యుతుఁడ; వాత
ముఖ్యధాతుత్రయాకారమున శరీర

1. విష్ణువు; శివుఁడు; బట్టతలవాఁడు

ధారకుఁడ నై యునికిఁ ద్రిధాతువును న
నంగఁ బరఁగుదు మునివచనంబులందు. ౪౩౪

క. ఘృత [1]మర్చిస్సంపద యయి
ఘృతార్చిరభిధాన మొందెఁ; గీఁడి వృషము వి
శ్రుతధర్మము ధర్మమయ
స్థితికతమున వృషుఁ డనఁ బ్రసిద్ధి వహింతున్. ౪౩౫

తే. ఆదిమధ్యాంతములు నాకు నరయ లేమి
నై-యనాది యమధ్యుఁ డనంతుఁ డనఁగఁ
జెల్లువేళ్లులు; శుచులు నా చెవులకింపు
లగుటఁ మునులు శుచిశ్రవుఁ డండ్రు నన్ను. ౪౩౬

ఆ. ఒక్క-శృంగమునన యుర్వి యెత్తితి వరా
హావతారలీల యతిశయిల్ల;-
నట్టు లగుటఁ జేసి, యార్యజనప్రియ,
నాకు నేకశృంగనామ మయ్యె. ౪౩౭

క. వినుత మగులోక [2]రేచన
మున నన్ను విరించుఁ డండ్రు; బుధనుత, రవియం
దనుపాధికవిద్యాస్థితి
నునికిం గపిలాభిధాన ముల్లసిత మగున్. ౪౩౮

క. విను, యోగంబు హిరణ్యం
బనఁ బరఁగును యోగగర్భుఁ డగుటను;- విద్వ
జ్జనములు హిరణ్యగర్భుం
డని ననుఁ గొనియాడుదురు మహాగుణశాలీ. ౪౩౯

తే. నరుఁడు నారాయణుండు ననంగ లోక
రక్షణార్థంబు గాఁగ ధర్మమున కేను

---

1. మంటయై; వెలుఁగై. 2. (లోకమును) బహిర్గతము చేయుటచేత.

పుట్టినాఁడఁ గావున, బాండుభూపతనయ,
నాకు ధర్మజుఁ డనియెడునామ మయ్యె. ౪౪౦

వ. ఇట్లు వుట్టి గంధమాదనంబున నేను దపంబు సేయుచుండ నక్కా-
లంబునఁ గాలాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన, నది భీతిం బఱ
తెంచి నాయురస్స్థలంబు నొందిన మదీయ కేశంబులు [1]ముంజ
నిభంబు లగుటం జేసి ముంజకేశుం డనుపేరు గలిగె. ఆరుద్రుండు
రౌద్రాకారంబున నయ్యజ్ఞంబు వెనుకొని నాపయిం గవిసిన
నొక్క [2]యిషీక పరశురూపంబుగా నభిమంత్రించి యతనిపయిం
బ్రయోగించిన నతండు దాని ఖండితధారంబు సేయుటం జేసి ఖండ
పరశు వను నభిధానంబునుం గలిగె ననుటయు—— ౪౪౧

క. విని పార్థుఁ డిట్లు గలిగిన
యనియం దారుద్రునకొ జయము నీకో క
ల్గెను? దాని తెఱం గేర్పడ
వినఁ గౌతుక మొలసెఁ జెప్పవే విశ్వాత్మా. ౪౪౨

—•• శివ కేశవులపరస్పరకోపప్రసాదములవిధము. ••—

వ. అనిన విష్ణుం డర్జునున కి ట్లనియె: ౪౪౩

సీ. రుద్ర- నారాయణరూపప్రవర్తిత
మూర్తిద్వయము రణమునకుఁ జొచ్చి
పరశుసంరంభంబు వాటింప, నుద్వేజి
తము లయ్యె నఖిలభూతములు; శ్రుతులు
మునులకుఁ దోఁపవ; యనలంబు లాహుతుల్
గొన వయ్యెఁ; బగిలె దిక్కులు నభంబు;

---

1. ముంజిగడ్డి వంటివి. 2=ముండ్లదుబ్బు – ఇది ప్రకృతార్థము. (మఱియుఁగల అర్థములు: చిత్తరువు వ్రాయుకుంచె; ఏనుఁగు కనిగుడ్డు; ఏనుఁగు కను బొమ్మ విఱుపు (భ్రూభంగము).... గండ్రగొడ్డలి రూపముగా.

ధరణి వడంకె; భూధరములు దిర్దిరం
దిరిగె, దేవతలకు దిగులు సొచ్చె;
తే. నానసము పల్లటిల్లంగ నజుఁడు గలఁగె;—
నిట్టు లెందును సంక్షోభ మెసక మెసఁగ,
నావిధాత మునీంద్రులు దేవతలును
దన్ను వేష్టింప వచ్చె సత్వరముగాఁగ. ౪౪౪

వ. వచ్చి రుద్రునకుం బ్రణమిల్లి సంప్రార్థనంబు దోఁప నిట్లనియె: ౪౪౫

క. శివుఁడవు నీవు జగములకు
శివ మొనరింపంగ వలదె? చేయుము క్రోధ
ప్రవిహాతి! విష్ణుం డనఁగా
శివుఁ డన నొకఁ డౌట దివ్యచిత్తమ యెఱుఁగున్. ౪౪౬

తే. నిగమవేద్య మద్వంద్వంబు నిర్గుణం బ
మూర్త మనియెడుతత్త్వంబు, మూర్తిభేద
కలనమున లోకమున ద్విధాకారి యయ్యెఁ
గాక, హరియన నీవనఁ గలదె వేఱు? ౪౪౭

వ. అని బోధించి వెండియు— ౪౪౮

క. నరనారాయణు లనఁగాఁ,
బురహర, జగదాది యైనపురుషులు మనముం
బరికింపఁ దన్మయత్వ
స్ఫురితులము ప్రసన్నదివ్యబుద్ధిం గనుమా. ౪౪౯

ఆ. తెలుపు మితని ననుడుఁ జేటి కోశంబువో
పిడిచి, నన్నుఁ దెలిచె మృడుఁడు; పార్థ,
యేను నతనితోడ నిట్లంటి మృదుసత్య
పథ్యమునిమనోజ్ఞభంగికముగ. ౪౫౦

క. నిను నెవ్వఁ డెఱిఁగె,— నాతఁడు
నను నెఱిఁగినవాఁడు; నిన్ను నమ్మఁగ సేవిం
చిన నదియ నన్నుఁ గొల్చుట;
యనువాదితలేదు భేద మరయఁగ మనకున్. ౪౫౧

క. శ్రీవత్సము శూలాంకిత
మై వెలయుంగాక యిప్పు డాదిగ నాకున్;
నీవును మత్పాణ్యంకో
ద్భావన శ్రీకంఠుఁ డనఁగఁ బరఁగుము శర్వా. ౪౫౨

వ. అని యివ్విధంబున— ౪౫౩

క. ఇతరేతరమతిసంభా
వితలక్షణకలన మొంది, వృషవాహనుతో
నతినిర్మలసఖ్యము సే
సితి; బ్రహ్మాదులును సంతసిల్లిరి విజయా. ౪౫౪

వ. మదీయనామ నిర్వచనంబులును, రుద్రునితోడి రణంబున నైన జయంబు తెఱంగును నీ కెఱింగించితి. ౪౫౫

క. నానారూపంబుల ని
ట్లేను బ్రవర్తింతు జగము లిన్నింటను; నీ
శానుఁడు నభవుఁడు నమృతుఁడు
నైనశివుని నీవు గొలువు మర్జున యెపుడున్. ౪౫౬

తే. ఏను రక్షింప జయము నీ కెనక మొనఁగె;
సమరమున శూలపాణియై శత్రుకోటి
నీదుమునుమున వధియించు నిరుపమాన
తేజు రుద్రుఁగా నెఱుఁగుము ధీరచిత్త. ౪౫౭

వ. అనియె నని చెప్పిన విని జనమేజయుండు ౪౫౮

క. అరుదే సర్వేశ్వరుఁ డగు
హరితోఁడుగ జయము గొనుట యర్జునునకు? న
ప్పురుషోత్తము బాంధవు లై
పరఁగిరి పెఱవినుతు లేల పాండుసుతులకున్? ౪౫౯

వ. అని పలికి యి ట్లనియె: ౪౬౦

క. నారదుఁడు పరమపురుషుని
కారుణ్యము వడసి వచ్చి క్రమ్మఱ నరునిన్
నారాయణునిం గాంచుట
సారమతిం జెప్పి తీవు సంయమివర్యా. ౪౬౧

—నర—నారాయణ—నారదసల్లాపప్రకారము.—

వ. తదీయసల్లాపవిశేషంబులు విన వలతుం జెప్పు మనిన నప్పుడమిఱేనికి
వైశంపాయనుం డి ట్లనియె: ౪౬౨

క. నారదుఁడు వచ్చి నరునిన్
నారాయణుఁ గాంచి భక్తి నమ్రుం డైనన్
వా రతనికి నాతిథ్యము
గారవమున నడపి యడుగఁ గా వారలతోన్— ౪౬౩

వ. అద్దేవముని యి ట్లనియె: ౪౬౪

క. శ్వేతద్వీపంబున భవ
దాతతకృపఁ గానఁ బోలె నచ్యుతుఁ; దదూ
పాతిశయము మీచందము;
యాతనికడఁ గంటి మిమ్ము నద్భుత మెసఁగన్. ౪౬౫

క. శ్వేతులు నింద్రియవర్జిత
చేతస్కులు నైననరులఁ జెలువుగ మానో
పేతులఁ గంటి నచట వా
రా తేజోమూర్తికిని దయాపాత్రంబుల్. ౪౬౬

వ. అద్దేవుండు వత్సలుం డగుచు వారలతోడం గూడి విహరించు చుండ, నామీఁదం గృపసేసి, క్షేత్రజ్ఞప్రకారంబు సకలంబును దేటపడ ననుగ్రహించి, యాగామి నిజప్రాదుర్భావంబుల తెఱం గెల్ల నెఱింగించె. శ్వేతద్వీపం బనునది శాంతిస్వరూపంబు. అందు సూర్య - సోమాంశువ్యాప్తియు వాయుసంచారంబును లేదు. ఆలోకనాథునకు నేకాంతికజనంబులం గడచిన ప్రియులు లేకునికి యెఱింగి, యేకాంతి నై యుండితి. అవ్విభుండు వీడుకొల్పుప మీఁకడకు వచ్చితి. ఇచ్చట మీకుం గారుణ్య భాజనంబనై యుండెద ననుటయు, వార లతని కి ట్లనిరి: ౪౬౭

తే. పడసి తద్దేవుఁ గానఁ దద్భాషణములు
వింటి, నీవు ధన్యుండవు; గంటి మేము
నచట నీయున్న తెఱఁ గెల్ల; నిచట నునికి
మేల కాక యుండుము పరమేష్ఠితనయ. ౪౬౮

క. దైవముఁ బిత్ర్యంబును ద
ద్దేవసమారాధనంబు దెల్లము శ్రుతిసం
భావిత మది; తత్పరతఁ
నీ వేకాంతి వయి నిలువు నిర్మలహృదయా. ౪౬౯

ఆ. అనిన సంతసిల్లి యద్దేవముని వేయు
దివ్యవత్సరములు భవ్యతపము
నియతి నాచరించెఁ బ్రియమున వారు ద
న్నాదరింపఁగాఁ దదాశ్రమమున. ౪౭౦

వ. అ ట్లేకాంతియై తపంబు సేసి యత్యంతశాంతి నొంది నారదుండు నర—నారాయణుల వీడ్కొని హిమవన్నగంబునకుం జని తనయాశ్రమంబునందు బృందారకాది విశిష్టపూజితుం డై యుండె—నని చెప్పిన విని సంప్రీతుం డై జనమేజయుండు వెండియు వైశంపాయనుం డిట్లనియె: ౪౭౧

ఉ. పాండవవంశవర్య, పటుపాపవినాశని యైనయిక్కథన్
నిండుమనంబుతో వినుట నీవు కృతార్థుఁడ వైతి; శాశ్వతా
ఖండసుఖాత్ము విష్ణు నధికస్థిరభక్తి సమాశ్రయింపు; నీ
కొండొకఁ డేల? యిమ్మెయి మహోన్నతిఁ జేయు జగత్త్రయంబునన్.

క. లే వుభయలోకములు హరి
పై విద్వేషంబు గలుగు పాపాత్ములకున్;
భూవర, యట్టిజనులపితృ
దేవతలకు నరక మగుటఁ దెలుపును శ్రుతులున్. ౪౭౩

క. హరియాత్మ యెల్లవారికి;
నరవర, తనయాత్మపై మనంబున దృఢత
త్పరభావము లేని కుజనుఁ
బొరయవె యాపదలు!—వేఱ బోధన మేలా? ౪౭౪

క. మునివరుఁడు గంధవతినం
దనుండు నాగురుఁడు గరుణ దళుకొత్తఁగఁ జె
ప్పినవాక్యంబులయర్థము
లనఘా, యివి;—నీవు వీని నలవఱుపు మదిన్. ౪౭౫

శా. విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తివిఖ్యాతుఁ గృ
ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుంగా;[1] విప
శ్చిద్వంద్యం బగుభారతాధ్యయనముం జేయంగ శక్తుండు, ధ
ర్మాద్వైతుండు,— సరోజలోచనుఁడ కా కన్యుండు తద్వాచ్యుఁడే?

క. బహువిధధర్మంబులు లో
కహితంబుగ నిట్లు సెప్పఁగా నిర్మలతా
మహనీయధిషణుఁ డగున
మ్మహాత్మునకు తీరుఁ గురుసమాజవరేణ్యా. ౪౭౬

1. (విపశ్చిత్ =) పండితులకు, (వంద్యంబు =) నమస్కారము చేయఁదగిన...

— హయగ్రీవదేవమాహాత్మ్యాభివర్ణనము. —

వ. అనిన విని, సవిశేషసమ్మదుం డై జనమేజయుండు వైశంపాయనుతో [1]హయశిరోభాసితుం డగువిష్ణుండు వేధకు సన్నిహితుం డయ్యె నని చెప్పితివి. అప్పురుషోత్తముం డప్పు డేమిటికై యామూర్తి వహించె నత్తెఱం గెఱింగింపు మని యడిగిన నమ్మునియమ్మనుజపతి కిట్లనియె:

సీ. ప్రళయకాలంబున జలముల విష్ణుండు
యోగనిద్రారతి నొంది, మేలు
కాంచి లోకంబులు గావింపఁ దలఁప, న
హంకార మెసఁగ బ్రహ్మాభిధాన
కలిత మై తన్నాభికమలంబునం; దిట్లు
జనియించి యాబ్రహ్మ సకలసృష్టి
కాదిభూతములుగ వేదముల్ నాలుగు
గలిగించె; నప్పు డక్కమలనాభు

ఆ. నందు మును లయించినట్టిగుణంబులు
మూఁటఁ దొలుత సత్త్వమునకుఁ దోఁపు
కలిమి,—దాన నుండెఁ గమలోద్భవుఁడు; రజ
స్తమము లసుర లయ్యె ధరణినాథ. ౪౭౯

క. విను, కైటభుండు నా, మధు
వనఁ,—బేర్చినయద్దురాత్ము లవ్వేదములం
గొని వేగఁ జని రసాతల
మున వైచిరి గాఢబంధములు సేసి నృపా. ౪౮౦

వ. దాన నవ్వేధ విహ్వలించి,— ౪౮౧

1.—గుఱ్ఱపు శిరస్సుతో నొప్పినవిష్ణుఁడు వేధ(=బ్రహ్మ) కు సమీపించినవాఁ డయ్యె నంటివి.

క. లావును దృష్టియు గతియును
నావేదచయంబ నాకు; నవి యడఁగిన నే
నేవిధి సృజింతు లోకము?
లేవాఁ డీయెడరు దలుఁగు నిం కె ట్లోకో. ౪౭౨

వ. అని పలవించి,— ౪౭౩

ఆ. విష్ణు బహువిధముల వినుతింప, నజ్జల
శాయి హయశిరంబు సకలవర్ణ
భాసురంబు నైనపరమాద్భుతంపురూ
పంబు దాల్చి వేదపరత నొంది,— ౪౭౪

క. పాతాళమునకుఁ జని యం
దాతత మై ప్రణవరూప మగునాదం బు
ద్యోతితము సేసె; నది యా
దైతేయులు విని పటుప్రతాపం బెసఁగన్— ౪౭౫

క. ఆ నాదముదెసకుం జన,
దానవరిపుఁ డొండువలనఁ దా నరిగి, తదీ
యానూనబంధపీడిత
లైనశ్రుతులు విడిచి తెచ్చి యజునకు నిచ్చెన్. ౪౭౬

తే. ఇచ్చి యెప్పటియట్ల యహీంద్రతల్ప
శయనుఁ డై యుండె—నట తమచనినచోట
నెవ్వరినిగాన కాదైత్యు లెచట శ్రుతులు
దారు మును వెట్టి రందు సత్వరముగాఁగ— ౪౭౭

ఆ. అరిగి యచట వాని నరసి కానక రభ
సమునఁ గలయ దిరిగి శార్ఙ్గిఁ గాంచి,
యుద్ధమునకు బిల్వ నద్ధరణీధరుం
డడరి సమయఁ జూచె నసురయుగము. ౪౭౮

ఇట్లు విష్టర శ్రవుండు సృష్టికార్యంబు నిర్విఘ్నంబుఁ జేసిన, విధాత యప్పని సునీతంబు సేసె. నాఁటనుండియు హయశిరో మహితయగునమ్మూర్తి తక్కినమూర్తులకంటె నెక్కుడయ్యె. ఆజగత్కర్తను వేదంబులు నాశ్రయించి యుండు నని చెప్పి వెండియు,

క. హరిసత్త్వాదిగుణంబులఁ
బొరిఁబొరిఁ గలిగింపఁ బెంపఁ బొలియింపఁగ, భూ
వర, యవి యెక్కువఁ దక్కువఁ
బొరయుచుఁ బరివర్తనంబుఁ బొందుచు నుండున్. ౪౯౦

క. గుణవంతుఁడు గుణరహితుఁడు
గుణకల్పనతత్పరుండు గుణనాశననై
పుణశాలి గుణనిబద్ధుఁడు
గుణమోక్షణకరుఁడు శార్ఙ్గి కురుకులముఖ్యా. ౪౯౧

క. విను, నారాయణపరములు,
జననాయక, వేదములును జన్మంబులు ద
క్కినపుణ్యసమారంభము
లును రసముఖగోచరంబులును భూతములున్. ౪౯౨

అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో: 'నేకాంతికజనులు లోకోత్తరు లని చెప్పితివి. అయ్యేకాంతికత్వం బెట్టిది యెఱిగింపవే' యనుటయు, నతం డతని కి ట్లనియె: ౪౯౩

ఆ. 'సాంఖ్యయోగపరమసారభూతం బిది;
మున్ను వింటి యుద్ధమునకుఁ జొరక
కరుణ నార్ద్రుఁడైనగాండీవి బోధింపఁ
గృష్ణుచెప్పినట్టిగీతలందు, ౪౯౪

—వైశంపాయనుఁడు జనమేజయునకు నైకాంతికధర్మ మెఱింగించుట—

క. నిర్మల మగు నైకాంతిక
ధర్మము నారాయణోదితం బై క్రియలం
గర్మఠుఁ డగు బ్రహ్మమతిని,
ధార్మికవర, యొలసె నతఁడు దయ సిగు రొత్తన్. ౪౯౫

క. దక్షునకు నెఱింగించిన
దక్షుఁడు బోధించెఁ దనదుదౌహిత్రు జగ
చ్చక్షుని; నాసవిత్రుండు మ
నుక్షితిపతి కిచ్చె నవ్వినుతధర్మంబున్. ౪౯౬

క. మను విక్ష్వాకున కొసఁగె; న
తనివలనఁ దదీయయోగ్యతాకలితులు స
జ్జనములు వడసి రనేకులు;
విను, నారాయణునిచేత విని నారదుఁడున్— ౪౯౭

క. తగి యెడుశిష్యుల కొసఁగెను;
జగతీశ్వర, యిట్టు లది ప్రశస్తం బై యు
జ్జగములను గలిగె; విను, మ
య్యగాధధర్మంబు దుష్కృతాప్రాప్య మగున్. ౪౯౮

క. దాని కహింసయ మూలము;
దానన హరి ప్రీతుఁ డగు; నతం డన, ధరణీ
జానీ, క్షేత్రజ్ఞుం డనఁ
గా నొక్కఁడ యగుట దెలియఁగా వలయుఁ గడున్. ౪౯౯

క. ఏక ద్వి త్రి చతుర్వ్యూ
హాకారతఁ దోఁచుచుండు హరి భక్తజనా
లోకమున వాసుదేవా
ద్యోకః ప్రాప్తముగఁ దత్తదుచితస్ఫూర్తిన్. ౫౦౦

తే. వాసుదేవుండు ప్రథమంబు; వసుమతీశ,
యోలి సంకర్షణుండుఁ బ్రద్యుమ్నుఁడును ద్వి
తీయకంబుఁ దృతీయంబుఁ దెల్ల, మచ్చ
తుర్థ మనిరుద్ధుఁ;—డిట్లు చతుర్విధములు. ౫౦౧

క. ఈనెలవులఁ దోఁచును హరి
దా నొక్కఁడ; యింద్రియప్రతతి కందం; డే
కానూనభక్తి కగపడు;-
దానికిఁ దపమును శమంబు దమమును వలయున్. ౫౦౨

క. శాంతిపరినిష్ఠునకు నే
కాంతికధర్మంబు గరతలామలక మగుఁ;
[1]చింతాతంతుత్రుటనా
త్యంతవిదగ్ధంబు సూవె యది మనుజేంద్రా! ౫౦౩

క. అనిన, నతఁ: 'డిట్టిధర్మము
గొనియాడక వ్రతము లొండు గోరి నడపఁగాఁ
బని యేమి?—యెఱింగింపుము
జనములచందంబు నాకు సంయమివర్యా.' ౫౦౪

క. అని యడిగిన వైశంపా
యనుఁ డతనికి నిట్టు లనియె: నదిగల, దధిపా,
విను, సాత్త్వికమును రాజస
మును దామసమును వికారములు మానసముల్. ౫౦౫

తే. వికృతులందును సత్త్వస్థవిధము మేలు;
దానహరిఁ బొంద వచ్చు; నతండు నడపుఁ
దత్ప్రకారులకుశలంపుఁదంత్ర మెల్ల
వార లేకాంతికులు; పెఱవారి వినుము: ౫౦౬

1. చింత యను నూలిపోఁగును ద్రెంచుటయం దెక్కుడు నేర్పుగలదియునగు నది—అదే యైకాంతికధర్మము.

క. [1]కలఁగొన రాజసతామస
ము లయినభావములు వికృతిఁ బొందింపఁగ మ
ర్త్యుల కేకాంతికవృత్తిని
నెలకొనఁగా నెట్లు వచ్చు నిర్మలధిషణా? ౫౦౭

క. వారికిఁ బ్రవృత్తిలక్షణ
తారూఢం బైనధర్మ మలవడు; హరికిం
గారుణ్యపాత్రములు గా;—
రారయ వా రన్యపథసమాశ్రితు లగుటన్. ౫౦౮

క. ఏకాంతిజనంబులు సు
శ్లోకుం డగుహరిమనంబులో నుండుదు; రా
లోకింప వారి కతనికి
నేకత్వము గలదు;—దెల్ల మిది వేదములన్. ౫౦౯

క. ఈ తెరువు మద్గురుండు సం
ప్రీతిని దయ నన్ను నాదరించుచుఁ జెప్పెం
జేతశ్శుద్ధికలన మెయి
వీతదురిత మైనభంగి విన్నది యధిపా. ౫౧౦

క. చాలిన నీవును హరి ని
ట్లాలోకింపుము;— నిరంతరానంద శ్రీ
శాలి వగు; దనిన నాభూ
పాలోత్తముఁ డాతపస్విపతి కి ట్లనియెన్: ౫౧౧

తే. వేదములు సాంఖ్యమును యోగవిధియుఁ బాశు
పతముఁ బాంచరాత్రంబు నా బహువిధములఁ
జెల్లు బోధ సాధనముల కెల్ల నిష్ఠ
యొక్కటియొ!— యివి భిన్ననిష్ఠోదితములొ ౫౧౨

1, కలఁక బాఱఁగా; వ్యాపింపఁగా—

వ. నాకెఱింగింపవే. వీనికిం బ్రవర్తకు లెవ్వరు వారలం జెప్పుము అని
యడిగిన జనమేజయునకు వైశంపాయనుండు—. ౫౧౩

ఉ. ద్వీపమునం బ్రబోధపరిదీప్తుని వేదనిధానముం జగ
ద్వ్యాపకతేజు గంధవతియందుఁ బరాశరసంయమీశ్వరుం
డేపురుషోత్తముం బడసి యీడ్యతమోన్నతి నొందె,— లోకశి
క్షాపరు భారతాధ్యయనకారకుఁ గొల్చెద నమ్మహాత్మునిన్. ౫౧౪

వ. అనుచుం గృష్ణద్వైపాయనధ్యానపరాయణుం డగుచుం బలికి
యాభూవిభున కభిముఖుం డై, ౫౧౫

క. విను, మీతంత్రంబుల కె
ల్లను నరయఁ బరాయణం బలఘుతరసంవి
త్తనుఁ డగునారాయణుఁడు; య
తనిఁ బొందగ, ఋజువు లగుపథము లివి యధిపా. ౫౧౬

వ. వేదంబులకుం బ్రవర్తకుండు నారాయణనందనుం డపాంతరతముం
డనుపేరం బ్రసిద్ధుం డగువేదవ్యాసుండు; సాంఖ్యంబునకుం గపి
లుండును, యోగంబునకు హిరణ్యగర్భుండును, పాశుపతంబునకు
శివుండును, పాంచరాత్రంబునకు విష్ణుండును—ప్రవర్తకులు. పాంచ
రాత్రంబు వైష్ణవం బనం బరఁగు ననిన విని, యజ్ఞనపతి యమ్ముని
పతితో: 'వేదవ్యాసుండు పరాశరపుత్రుం డని చెప్పితివి. అప్పరమ
మునికి నారాయణనందనత్వం బెట్లు వచ్చె?' అనుటయు, నతం
డతని కిట్లనియె: ౫౧౭

సీ. హిమవన్నగంబుపాదమున మహాభార
తం బొనర్చి పరిశ్రమంబు దోఁప
భావించి, శిష్యులు గావించుపరిచర్యఁ
దద్వినోదనపరత్వమున నొంది

వారికి వేదార్థభారతార్థంబులు
సాత్యవతేయుండు సదయబుద్ధి
నఱుఁగించుచున్నట్టియెడ, నేను లోనుఁగా
గొందఱు తత్పాదవందనంబు

తే. భక్తిఁ జేసి: 'నారాయణప్రభువుఁ డంద్రు
నిన్నుఁ; గృపఁ జెప్పవే మాకు నిర్మలాత్మ
యత్తెఱం' గని యడిగిన, నమ్మహాను
భావుఁ డత్యంతకరుణార్ద్రభావుఁ డగుచు— ౫౧౮

వ. మాతోడ ని ట్లనియె: ౫౧౯

—వేదవ్యాసునకు నారాయణనందనత్వంబు గలిగిన ప్రకారము.—

సీ. ఆదికాలమునఁ బ్రజాభిసర్గమునకు
నారాయణుఁడు నిజనాభిపద్మ
మున బ్రహ్మఁ గల్పింప, భూతసంఘమ్ముల
నెల్ల నాతఁడు సృజియించె; నతని
ముఖమున బహువేదములు ప్రసరింపఁగఁ
జేసి, వానికి మేలుసేత బుద్ధిఁ
దలఁచి, యవ్విష్ణుండు నలఘుబోధుని నపాం
తరతముం డనియెడుతనయుఁ జిత్త

తే. మునన కల్పించి, యతిభక్తి మ్రొక్కి నిలిచి
యున్నయక్కుమారుని: 'శ్రుతు లన్నియును దృ
ఢావధానుండ వై విని నీవు వాని
నంచితవ్యాస మొందింపు' మనియెఁ బ్రీతి. ౫౨౦

ఆ. అనిన నట్ల కాక యని యయ్యపాంతర
తముఁడు వేదభేదనము నొనర్చె;

వారికి వేదార్థభారతార్థంబులు
సాత్యవతేయుండు సదయబుద్ధి
నెఱిఁగించుచున్నట్టియెడ, నేను లోనుఁగా
నొందఱు తత్పాదవందనంబు

తే. భక్తిఁ జేసి: 'నారాయణప్రభువుఁ డంద్రు
నిన్నుఁ; గృపఁ జెప్పవే మాకు నిర్మలాత్మ
యత్తెఱం' గని యడిగిన, నమ్మహాను
భావుఁ డత్యంతకరుణార్ద్రభావుఁ డగుచు— ౫౧౮

వ. మాతోడ నిట్లనియె: ౫౧౯

—వేదవ్యాసునకు నారాయణనందనత్వంబు గలిగినప్రకారము.—

సీ. ఆదికాలమునఁ బ్రజాభిసర్గమునకు
నారాయణుండు నిజనాభిపద్మ
మున బ్రహ్మఁ గల్పింప, భూతసంఘమ్ముల
నెల్ల నాతఁడు సృజియించె; నతని
ముఖమున బహువేదములు ప్రసరింపఁగఁ
జేసి, వానికి మేలుసేఁత బుద్ధిఁ
దలఁచి, యవ్విష్ణుండు నలఘుబోధుని నపాం
తరతముం డనియెడుతనయుఁ జిత్త

తే. మునన కల్పించి, యతిభక్తి మ్రొక్కి నిలిచి
యున్నయక్కుమారుని: 'శ్రుతు లన్నియును దృ
ఢావధానుండ వై విని నీవు వాని
నంచితవ్యాస మొందింపు' మనియెఁ బ్రీతి. ౫౨౦

ఆ. అనిన నట్ల కాక యని యపాంతర
తముఁడు వేదభేదనము నొనర్చి;

దాని కవ్విభుండు దద్దయుఁ బ్రీతుఁడై,
వత్సలత్వగౌరవం బెలర్ప— ౫౨౧

క. 'వేదవ్యాసుఁడ, రమ్మని
యాదరమునఁ బిలిచి, 'నాకు నాత్మజుఁడై సం
పాదించువాఁడ వధికా
హ్లాదము మన్వంతరంబు లన్నిటియందున్.' ౫౨౨

క. అని యానతిచ్చి మఱియును,—
'జననంబులు నీకుఁ గల్గు సంయమిమాన్యా'
యనియుఁ బలికి వెండియు ని
ట్లనియెను విష్ణుండు పేర్చువర్మిలితోడన్: ౫౨౩

క. నాచరితంబులుఁ ద్రైలో
క్యాచరణంబులును ధర్మ మఖిలంబు మదిం
జూచి త్రికాలజ్ఞత్వస
మాచీనత వెలయుదు మునులు మేటి యనంగన్. ౫౨౪

క. ఉత్తరకాలంబుల లో
కోత్తరుఁడు వసిష్ఠపౌత్రుఁ డుదితజ్ఞానో
దాత్తుఁడు పరాశరుం డను
నుత్తమసంయమికిఁ బుట్టు దుజ్జ్వలతేజా. ౫౨౫

క. నీవలనన కలిగి కురు
క్ష్మావలయం బేలునట్టి జనపతు లన్యో
న్యావిష్టరోషులై రణ
సేవనమునఁ గులము తఱచు చెఱతురు వత్సా. ౫౨౬

తే. కాలములకీడుకతమునఁ గలఁగఁబడిన
వేదముల నీవు నాఁడును విమలబుద్ధి

నంచితవ్యాస మొందించి యఖిలదివిజ
మునిగణముల కొనర్తు సమ్మోద మనఘ. ౨౭

తే. ధర్మసందేహములు నీవు నిర్మలంపు
వాక్యములఁ బాపి, జగములవార లెల్ల
'నఖిలసంశయచ్ఛేత్త', 'పుణ్యాత్ముఁడు',
'లోకహితవాణి'—యనఁగ సుశ్లోకుఁ డగుదు. ౨౮

క. రాగిత్వము విడువదు నిను;
రాగవిదూరుఁ డగుసుతుఁడు ప్రభవించును నీ;
కాగమవిధానబుద్ధియు
యోగము సాంఖ్యంబు మదిసముదితంబు లగున్. ౨౯

వ. అని నిర్దేశించి నీవు నిజేచ్ఛం బ్రవర్తింపు మని పలికి యద్దేవుం డంత
ర్హితుం డయ్యె. ఇది మదీయ నారాయణసంభవత్వంబు తెఱంగు.
ఏను యమ-నియమనిరూఢి నిర్మలతపఃకలనంబు చిరకాలం బాచరించి
యప్పురుషోత్తముకారుణ్యంబు నామీఁద నంత కంతకు నెక్కుడగు
నట్లు సేసితిని. అని మద్గురుండును త్రికాలవేదియు నగువేదవ్యా
సుండు సెప్పె. అని, చెప్పి వైశంపాయనుండు జనమేజయునితో
వెండియు ని ట్లనియె: ౩౦

సీ. అట్లు ధర్మజుఁడు నారాయణ-నారద
సంవాదకథ విన్నసమయమునను,
నారదుఁ డచ్యుతుకారుణ్య మమ్మెయిఁ
బడసి క్రమ్మఱి వచ్చి, బదరికాశ్ర
మమున నారాయణు మన్ననతోడిసం
భాషణంబును గాంచి, పరమతపము
దాఁ జేత నెఱిఁగించి, తదనంతరంబ య
య్యమరమునీంద్రుఁ డే మడిగినట్లు

ఆ. యడుగ, ధర్మనందనాదులుఁ గృష్ణుండు
వినఁగ మద్గురుం డతనికిఁ జెప్పె:
సురలు మోక్షధర్మపరులు గా కధ్వరా
యత్తచిత్తులైనయత్తెఱంగు. ౫౩౧

వ. ఇట్లు సెప్పి— ౫౩౨

క. వేదవ్యాసుఁడు సుముఖత
నాద్దైవతమునికిఁ జెప్పె— హయశిరుఁ డగుదా
మోదరునిదివ్యలీల స
మాదరమున ధర్మనందనాదులు వినఁగన్. ౫౩౩

వ. అని చెప్పి వెండియు, ౫౩౪

క. నిజనామనిర్వచనములు
విజయుం డడుగంగ నెల్లవియు నెఱిఁగించెం
ద్రిజగద్భజనీయపదాం
బుజుఁ డగుకృష్ణుండు భరితపుణ్యచరిత్రా. ౫౩౫

వ. ఇట్లగుట ము న్నెఱింగించితి. ౫౩౬

క. వేదాదులైనపథము ల
భేదప్రాప్యంబు లగుట ప్రియ మెసఁగఁగ న
వ్వేదవ్యాసుఁడు సెప్పె స
మాదరమునఁ బార్థుఁ డడుగ నందఱు వినఁగన్. ౫౩౭

క. ఏకాంతికధర్మము సు
శ్లోకుం డగునాతఁ డడుగ, లోకోత్తర, యా
లోకారాధ్యుఁడు సెప్పె ద
యాకరమతి కృష్ణ-ధర్మజాదులు వినఁగన్. ౫౩౮

క. దైవవశంబున నేఁడును
నీ వడుగఁగ నింతవట్టు నిస్సందేహం

ౖబె వఱలఁగ నేఁ జెప్పితిఁ;
బావన మిది యసదృశంబు పౌరవముఖ్యా. ౫౩౯

వ. అని పలికి నారాయణ-నారదసంవాదాదికం బైనయివ్వాఖ్యానం బంతయుం జేర్కొని, ౫౪౦

క. నారాయణీయ మగు నీ
సారాఖ్యానంబు వినినఁ జదివిన సంప
త్త్వారోగ్యాయుస్సద్గతు
లేరికి నైనం, గురుక్షితీశ్వర, కలుగున్. ౫౪౧

వ. అనిన విని యత్యంతాహ్లాదభరితాంతః కరణుం డయినయక్కౌరవేంద్రుతో నమ్మునీంద్రుం డిట్లను: ఇట్లు సకలలోకసంభావనీయసత్కథ లాకర్ణించి సముదీర్ణసంప్రీతుం డగు నప్పాండవాగ్రజుండు-

తే. అమరతటినీసుతున కిట్టు లనియె: 'రాజ
ధర్మముఖ్యంబు లగుసర్వధర్మముల ను
దాత్తకృప నెఱిఁగించి; తత్సూత్తమంపు
ధర్మ మెయ్యది సెప్పుము ధర్మనిత్య.' ౫౪౩

వ. అనుటయు నాదేవవ్రతుం డన్నరదేవోత్తమున కి ట్లనియె: ౫౪౪

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే దొకండు; నె
వ్వరిమది యెందు వ్రాలెఁ దగ వారలు దానిన పూనియాచరిం
తు; రదియ వారి కిష్టఫల దోహనకార్య మొనర్చు; నెల్లెడం
బురుషులఁ జూడ మే తమకుఁ బోలినధర్మములన్ వెలుంగఁగన్.

—♦ ఇంద్రున కు నారదుఁడు సెప్పినభృగునామక విప్రుని చరిత్రము.♦—

వ. అది య ట్లుండె: అప్రతిహతగతినై చరించుచుండి యొక్కనాఁడు నారదుం డాఖండలుపాలికిం జనిన నతం డతనికి సముచితసత్కారంబు లాచరించి, సుఖాసీనుం డైయున్నయమ్మునివరునాననంబునం జూడ్కి నిలిపి, 'నీవు మెలంగునెడ నెద్దియేనియు నాశ్చర్యంబు

గన్నయది గలదే?' యనియడిగిన నమ్మహాత్ముం డమ్మహేంద్రు నకుం జెప్పినకథ సెప్పెద. అది భవత్ప్రశ్నంబున కుత్తరం బై యుండు; దాని వినుము. భాగీరథీదక్షిణతీరంబున మహాపద్మం బనియెడు పురవరంబునం గులశ్రేష్ఠుం డగు భృగుం డను విప్రుండు గలండు. అప్పురుషవరుండు— ౫౪౬

సీ. ధర్మనిత్యుండు సత్యవ్రతపరుం డహిం
సాశాలి యింద్రియజయవిభాసి
నిజకర్మతృప్తుండు నిష్కోధుం; డంచిత
న్యాయసంప్రాప్తధనముల దేవ
పిత్రతిథి జ్ఞాతి మిత్త్రకార్యములు ని
ర్వర్తించు; సువినయవంతు లైన
తనయులం గన్నాండు; త న్నెల్లవారును
వినుతింప మన్నాండు; దనమనమున:

తే. 'నైష్ఠికకృత్యంబు మేలొ! యే నెద్ది సేసి
కృతపరాయణధర్మతాస్థితి వహింతు
నొక్కొ!' యన చింతం బొందుచు నుండు నాత్మ
నిష్ఠయులవాటు కాంక్షించి నృపవరేణ్య. ౫౪౭

వ. ఇట్లుండ నొక్కనాండు— ౫౪౮

తే. తనగృహంబున కతిథి యుదాత్తుం డొక్క
బ్రాహ్మణుండు వచ్చె, వచ్చినం బరమభక్తి
యుక్తి నాతిథ్య మొనరించి యున్నయప్పు
డమ్మహాద్విజుతోడ ని ట్లనియె భృగుండు: ౫౪౯

సీ. 'అనఘ, నీమధురవాక్యంబులం జేసి మి
త్త్రత్వంబు వొంది మద్భావగతము

నీ కెఱింగించెద, నీవు నెయ్యు మెలర్ప
హిత ముపదేశింపు; మేను నియతి
నాత్మావలోకన మాచరించెద నని
తొడఁగుదు;—నది యలవడదు నాకు
లోకసామాన్యగుణాకలనంబున
బద్ధుండ నగుట; నెబ్భంగి నాత్మ
ఆ. నాత్మయంద కని యనామయత్వముఁ బొంది
ఖేదరహిత మగుసుఖమున మునిఁగి
యుండువాఁడ భూసురోత్తమ, చెప్పవే?'
యనిన నతని కిట్టు లనియె నతఁడు: ౫౫౦

క. ఏనును నిట్టుల మోహా
ధీనుఁడ నై యాత్మ గాంచు తెఱఁ గొలయుటకుం
బూని పడుదు; నెయ్యది యో
కానం డెరు వాశుభ్రప్రకలనంబునకున్. ౫౫౧

ఉ. కొందఱు బ్రహ్మచర్యమునఁ, గొందఱు భవ్యగృహస్థధర్మముం
బొందుట, గొంద ఱిద్ధతపమున్ వనభూమిఁ దగం జరించుటం,
గొందఱు నిష్క్రియత్వమునఁ, గొందఱు యజ్ఞవిధానశాలితం,
గొంద ఱనూనదానములఁ గోరి యొనర్తురు నిత్యసౌఖ్యమున్. ౫౫౨

క. జననీ-జనకారాధన
మున గురుభక్తిని సువృత్తమున శాంతిని దాం
తిని సత్యమున నహింసను-
విను, కాంతురు మోక్షపదము వేర్వేఱ జనుల్. ౫౫౩

ఇట్లు బహువిధంబు లగు ధర్మద్వారంబులు గలవు. గలిసినకలుచ నెల్లవారికి నాత్మానందం బలవడ నేర్చునే? ఒకటి యుపదేశించెద నాకర్ణింపుము— ౫౫౪

తే. నైమిశారణ్యమునయందు గోమతి యనఁ
బరఁగు నుత్తమనది; మహాపద్మ మనఁగఁ
గలదు పుణ్య హ్రదము; దానియలఘుతటత
లంబు నెలవుగా నుండు నాగం బొకండు. ౫౫౫

క. ఆతీర్థోత్తమమున మూం
ధాతృఁడు లోనుగ విశిష్టతపముల నిహాలో
కాతిశయముఁ, బరలోక
ద్యోతనముం బడసినారు దొల్లి యనేకుల్. ౫౫౬

వ. అప్పుణ్యక్షేత్రంబున— ౫౫౭

తే. పద్ముఁ డనుపేరియన్నాగపతి యుదాత్తుఁ
డఖిలధర్మజ్ఞుఁ డతులదయాన్వితుండు
సుజనసంభావ్యమానుఁ డస్తోకపుణ్య
నియతనిత్యుఁ డాగంతుకప్రియతముండు. ౫౫౮

ఉ. ఆతనిఁ గానఁ బొమ్ము; ప్రచురాదరణంబున నీదుకోర్కి సం
ప్రీతిగఁ దీర్చు నాగుణగరిష్ఠుఁడు; నాపలు కూఁదు మన్న, మో
దాతిశయంబు నొంది భృగుఁ డాధరణీసురవర్యుతో: 'మహా
త్మా, తెలి వొందె నామనము తావకపావనవాక్యసంపదన్.' ౫౫౯

క. అని పలికి యి ట్లనియె: 'ని
ద్దినశేషము రాత్రియును మదీయనివాసం
బున నిలువు నిలిచి మత్పా
వనుఁడవు గావలయు గౌరవశ్రీభరితా?' ౫౬౦

క. అనిన నతఁ డట్ల చేయ, న
తనిఁ బూజించుటను మధురతరసల్లాపం
బున ధర్మసత్కథావ
ర్తనమున నక్కాల మతఁ డుదాత్తతఁ గడపెన్. ౫౬౧

క. వేగిన నామంత్రితుఁడై
యాగుణనిధి వీడుకొలిపి యతఁడు ప్రయాణో
ద్యోగంబు సమీచీనవి
ధాగరిమప్రౌఢవృత్తి దగ నొనరించెన్. ౫౬౨

—•• భృగుండనువిప్రుండు పద్మండను సర్పరాజుం గన వచ్చుట ••—

వ. ఇవ్విధంబున నుద్యుక్తుండై భృగుండు బంధు-మిత్త్రజనసమ్మతం బగుతెఱంగునం గదలి యెడనెడ బహుతీర్థసేవనంబు సేయుచుం జని, పుణ్యం బగునైమిశారణ్యంబు సొచ్చి గోమతీతీరంబు సేరి, సుప్రసిద్ధం బగుమహాపద్మహ్రదంబుతటంబునం బొలుచు భుజగేంద్రమందిరంబు గాంచి తగం బ్రవేశించె. అట్టియెడ— ౫౬౩

తే. భక్తితోడ నన్నాగేంద్రుపత్ని యెదురు
వచ్చి తోడ్కొనిచని యర్ఘ్య మిచ్చి, మీర
లిందు రాకకుఁ గారణ మేమి సెప్పుఁ;
డెద్ది పనిచినఁ జేసెద సిద్ధచరిత.' ౫౬౪

వ. అనుటయు నమ్మహీదేవుండు: 'దేవీ, భవదీయపతిం గానవచ్చితి. నెచ్చో నున్నవాఁడవ్విభుం గానిపింపు మనిన, నతని కాభుజంగాంగన యి ట్లనియె: ౫౬౫

క. తనకు నెలవరుస వచ్చిన
దినరథవహనమున కాతఁ డేఁగినవాఁ; డే
డెనిమిదిదివసములకు నిట
సనుదెంచుం దథ్య మిది ప్రసాదప్రవణా. ౫౬౬

క. 'అతని తెఱం గిట్టిది. వాం
ఛిత మెయ్యది యిత్తు, ననఘ, చెప్పు' మనుఁడు, నా
సతి కి ట్లను భృగుఁడు: 'భవ
త్పతిఁ గనుటయ కాక వాంఛ దక్కొను గలదే?' ౫౬౭

వ. అయ్యురగవల్లభువచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద. అవ్విభుండు వచ్చినప్పుడ మఱవక నా తెఱం గెఱింగింప వలయు'—నని పలికి పోయి భృగుండు గోమతీతటపుణ్యారణ్యంబున జప్యపరుండును నిరాహారుండును నై యుండె. అట్లుండ నాభుజంగపతి బాంధవులు దదీయపత్నీపుత్ర సహితంబుగా నమ్మహీసురవరు పాలికిం జనుదెంచి మృదుమధురవాక్యంబుల ననునయించి: 'నీ వాహారంబు గొనక నిలువం దొడంగిననాఁటికి నేఁ డాఱవదినం బయ్యె. ఏ మతిథిపూజా పరులము. మాకు ధర్మవిరోధంబు గాకుండ మాచేయునాతిథ్యంబు నాదరింపుము. అస్మత్ప్రార్థనంబున నన్నంబు ఫలంబు మూలంబు మఱియు నెయ్యది యైనను భుజించి మమ్ము రక్షింప వే'—యనిన వారలతో నాసువ్రతశీలుం డి ట్లనియె: ౫౬౮

ఉ. ఇంతన నేల! యేను భుజగేశ్వరురాకయ వార్చినాఁడ; నా
కం తవునంతకుం గుడువ నాఁకలి, నీళ్లును ద్రావఁ దృష్ణ,-యొ
క్కింతయు లేదు—గా కలిగి యే యటవీస్థలి కేఁగుదెంచి యే
కాంతము యున్నవాఁడ? నియమాభిరతుండ నను నేప నేటికిన్?

క. మీకును ధర్మవిరోధము
గాకుండుట కేన పూట; గారవమున నా
లోకింపుఁ డింక దివసయు
గాకలనముఁ గల్గ వ్రతవమాప్తియుఁ గలుగున్. ౫౭౦

క. వినుఁ డష్టమ మగుదివసం
బున ముద మారంగ నిందు భుజగేంద్రుఁడు రా
కునికి గలిగెనేనియుఁ బర
దినమునఁ గుడిచెద భవన్మతిం బ్రియ మెసఁగన్. ౫౭౧

వ. మీర లిత్తెఱంగున కనుజ్ఞ సేయ వలయు నని సంప్రార్థనీయస్వరం
బునం బలికిన వార లందఱు నొడంబడి నిజనివాసంబులకుం జనిరి.
అయ్యష్టమదివసంబున— ౫౭౨

క. వరుసదినంబులు దీఱిన
నరవిందాప్తుండు దనకు ననుమతి సేయం,
గురువంశముఖ్యు, తగ న
య్యురగాధీశుండు విభవ మొప్పఁగ వచ్చెన్. ౫౭౩

ఉ. వచ్చిన సంభ్రమంబుగరువంపుటెలర్పున నుల్లసిల్లి మే
నచ్చుపడంగఁ జేయఁ జెలు వా భుజగేశ్వరుపత్ని యాతనిం
జెచ్చెరఁ దా నెదుర్కొని విశిష్టసమాదర యై యుపాయనం
బిచ్చి తదీయచిత్తమున కింపెసలారఁగఁ బాద్య మిచ్చినన్—

వ. సంప్రీతుం డై సముచితప్రకారంబున నుండె. అట్లున్నయన్నా
గేంద్రుండు సమీపాసీన యైనయద్దేవి నాలోకించి, ౫౭౫

తే. అతివ, సేమమె! తగదేవతాతిథిప్ర
పూజనంబులు నడచునే! పూర్వవృత్తి
యెడలి యేను లేకునికి నే మేని వికల
మయ్యెనో చెప్పు మనవుడు, నామృగాక్షి— ౫౭౬

ఉ. ఆతనితోడ ని ట్లనియె: 'నంతయెఱుంగమి రాదు నీదుశి
క్షాతిశయంబుకల్మి, భుజగాధిప, నాకుఁ; దగన్ సమస్తదే
వాతిథిపూజనంబులు సమగ్రము లై నడచెన్; సుహృజ్జన
ప్రీతియు మున్నుపోలె నవిభేదత యొప్పఁగ నిర్వహించితిన్'. ౫౭౭

వ. అని వెండియు, ౫౭౮

సీ. "గురుభక్తి శిష్యులకును, వేదపరత వి
ప్రులకును, జనరక్ష భూపతులకు,

న్యాయార్జనంబు వైశ్యజనంబులకుఁ, ద్రివ
ర్ణారాధనంబు శూద్రావలికిని,
బతివాక్యకరణంబు భటులకు, సర్వోప
కారక్షమం బైనసారభూత
మనఁగఁ బెం పొందుగృహస్థాశ్రమంబు పై
వారనిప్రియ మెల్లవారలకును,

తే. 'లోక మేల? యే నేల?యి ట్లేకతంబ
యింద్రియంబులఁ గుదియించి యిచ్చ నడఁచి
యుండువాఁడఁ గా' కనుమతి యోగికిని, బ
తివ్రతాత్వంబు భార్యకు సువ్రతములు. ౫౭౯

వ. "కావున ధర్మసూక్ష్మసంవేది వగునీమదిచిత్తంబున ఖేదం బొక్కింత
యేనియుం బొడమకునట్టి విధంబున వర్తింతు నే! ఒకండు విన్నపంబు
సేయం గలదవధరింపుము: పరమపావనమూర్తి యొక్క మహీసు
రోత్తముండిచ్చటికివచ్చియభ్యర్థితుండై 'భవత్పతి దర్శింప వచ్చితి'
ననియె. కార్యం బేమి యని యడిగిన నాకుం జెప్పకుండె. నేను
నీ వట సనుటం జెప్పిన విని, 'యట్లైన నాభుజంగవిభుండు వచ్చు
నంతకు నుల్లవనంబున నుండెద. అతండు వచ్చిన నా తెఱం గెఱిం
గింపు' మని చని యేడెనిమిది నాళ్లేని జప్యపరుండును నిరాహా
రుండును నై యున్నవాఁడు. నీవచటికి కరిగి యతని సంభావింప
వలయు" నని చెప్పిన నాసర్పగ్రామణి కుపిత చిత్తుం డై— ౫౮౦

క. ఏనటె! యొక్కెడ కొక్కరుఁ
గానఁగఁ బోదు నటె! దేవగణము నసురులుఁ
లోనుగ న న్నేచందము
మానుగ నడపుదురు తలఁపుమా చతురమతీ! ౫౮౧

తే. అనిన నీరాక వార్చి మహాశతోడ
నున్నవిప్రుని యభిలాష మొక్కభంగి
దేర్పకుండుట ధర్మమే, ధీరశాంత
చిత్త, నీయట్టియాచారవిత్తమునకు! ౫౮౨

క. ధరణిసురునాస సెఱచినఁ
బొరసినపాపాగ్నిఁ గాల్పఁ బూనెదవే నీ
పురుషార్థంబును సముచిత
పరత్వమును గృపయు ధర్మపాండిత్యంబున్! ౫౮౩

క. విను, మాశావిచ్ఛేదన
మునఁ బాటిలు బ్రహ్మహత్య; భుజగోత్తమ, ధ
ర్మనిరూఢుఁ డైనపురుషున
కును సద్ద్విజనాస దీర్పఁ గోరుట వలదే! ౫౮౪

క. మానమున దృఢజ్ఞానము,
దానంబున నభ్యుదయము, ధర్మనిరత, యా
శానిర్వహణంబున నర
కానీకనివారణసౌఖ్య మగు నండ్రు బుధుల్. ౫౮౫

తే. చాతకము వాన గోరెడుచంద మొంద
నెదురుచూచుచు నున్నవాఁ డిందు నీదు
రాక కక్కట యడవిలో బ్రాహ్మణుండు!
రోష ముడుగుము ధర్మనిరూఢహృదయ. ౫౮౬

వ. అని పత్ని బోధించిన, ౫౮౭

చ. అనయముఁ దేఱి నాగపతి యక్కమలాననమోము సూచి యి
ట్లను:'నోరుఁ గానఁ బొమ్మనినయంతన రోషము వచ్చి యిట్టు లా
ప్పపిపలుకుల్ సగర్వమునఁ బల్కితి; దానికి శంక లేక చె
ప్పినజతనంపుధర్మమునఁ బేర్మియు నాకు నొనర్చి తుగ్మలీ. ౫౮౮

ఆ. 'కార్తవీర్య-దశముఖ ప్రముఖులు—జమ
దగ్నితనయ-రాఘవాదులైన
పురుషవరులచేతఁ బొలియరే సక్రోధ
వృత్తిఁ- గాన నలుక విడుపు మేలు. ౫౮౯

క. 'నీయట్టిభార్య గలుగుటఁ,
దోయజదళనయన, యిట్లు దొలఁగితి దురితా
పాయంబునఁ బొరయక; యేఁ
బోయెద నవ్విప్రుకోర్కి పూర్ణము సేయన్. ౫౯౦

క. అని పలికి సత్వరంబుగఁ
జని భృగునిం గాంచె వినయసంభ్రమములతోఁ,
జనపాలోత్తము, యతఁడు న
తనిఁ గని యుల్లమునఁ బ్రియము దళుకొత్తంగన్. ౫౯౧

—•• పద్మఁ డనుసప్రరాజు భృగుఁ డనువిప్రుం గా వచ్చుట. ••—

వ. అంగంబులు మొదల నెదురుకొనియె. ఇట్లిరువురు సుసంగతులై సుసంగతపత్త్రప్రకరతరుచ్ఛాయా శీతలసికతాతలంబున సుఖాసీను లైరి. అయ్యహీంద్రుం డామహీసురవరుసితో మధురస్వరంబున నిట్లనియె: ౫౯౨

తే. 'అనఘ, నారాక వార్చి నీ వధికనిష్ఠ
నిట్టు లునికికిఁ గారణ మేమి? గోర్కి
యెవ్విధంబైన దాని నే నిపుడ నిర్వ
హించి పుచ్చెద నత్తెఱం గెఱుఁగఁ జెపుము. ౫౯౩

వ. స్వజనంబులచేత నిచ్చట నీ తునికి విని యభిగమ్యుండ వగు నీకడకుం జనుదెంచితి' ననవుడు, నద్ధరామరవరుండు: 'ధర్మారణ్యంబుననుండి నిన్నుం గాన వచ్చితి; మాననీయమహీసురసూనుండ. భాను నారాధింప నీచనుట భవదీయవల్లభవలన నెఱింగి వాడినచేనివాఁడు

వాన కెదురుచూచునట్లు భవదాగమనంబు వార్చి నియతవృత్తి నున్నవాఁడ. మదీయమనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండవు' అనుటయు, ౫౬౪

తే. 'నీవు కల్యాణమూర్తివి నీమనోర
థంబు సఫలంబు సేసి కదా మదీయ
జననసఫలతఁ గలిగింతు' ననుభుజంగ
మాధిపతిమోముఁ జూచి యిట్లనియె నతఁడు: ౫౬౫

క. 'నాకోర్కి పిదపఁ జెప్పెద,
లోకనుతా, యొకటి యడుగ లోలత్వము చి
త్తాకలిత మయ్యెఁ; బ్రార్థన
సేకొని యది నాకు మున్ను చెప్పఁగ వలయున్.' ౫౬౬

వ. అనుటయు నయ్యురగ వల్లభుండు: 'అది యెయ్యది యడుగుము అనిన, బ్రాహ్మణుండు: 'నీవు రవిరథంబు వహింపం జనినయెడఁ గనిన వినినయట్టి యాశ్చర్యంబులు గలవేని వాని నా కెఱిగింపవే' యనిన నతం డతని కిట్లనియె: ౫౬౭

సీ. ఆశ్చర్యముల కెల్ల నాస్పదం బాదిత్యుఁ
డాతనివలనన భూతజాల
మఖిలంబుఁ జరియించు; నది యచ్చెరువుగాదె?
యద్దేవునంశువులందుఁ బ్రీతి
నమరులు వాలఖిల్యాదిమునీంద్రులు
సిద్ధులు శాఖలఁ జెంది యుంట
విహగకులంబులవిధమున వసియింతు;
రంతకంటెను నెక్కు డద్భుతంబు

ఆ. గలదె! యమ్మహాత్మువలనన వాయువు
వెడలి యతనినడిమివిపులరశ్మిఁ

బొంది వృష్టి గురియు; నెందును నట్టిచో
ద్యములు గలవె భూసురాగ్రగణ్య? ౫౯౮

క. రవి సృజియించును వర్షము;
రవియ మగుడఁ గిరణతతుల రసమంతయుఁ దాఁ
దివుచును; విస్మయకారక,
మవనీసురవర్య, దాని కధికము గలదే? ౫౯౯

క. ఇను వేఁడిమి శోషించిన
జనములయం దాత్మనిష్ఠ నశాశ్వతికత్వం
బున వెలుఁగు చూడు; దానికి
ననఘా, మిగులంగ జిత్ర మైనది గలదే? ౬౦౦

తే. సూర్యువలనన బీజంబు ధార్యమాణ
మగుఁ జరాచరధారిణి యైనధరణి
చేత; నంతకు మిగులఁ జర్చింప నక్క
జంబు లెందును గలవె నిష్ఠానిరూఢ! ౬౦౧

క. పరముండు నిరంజనుఁ డ
క్షరుఁ డజరుం డద్వయుండు శాశ్వతుఁ డగున
ప్పురుషుఁడు రవియంద వెలుఁగు;
నరు దంతటికంటెఁ గలదె యగ్రిమవర్ణా! ౬౦౨

వ. అని వెండియు, ౬౦౩

ఉంఛవృత్తిమహిమము.

క. విను, మత్యాశ్చర్య మొకటి:
మనుజోత్తమ, యొక్కనాఁడు మధ్యాహ్నమునం
దనవెలుఁ గినునివెలుఁగుతో
ననగా గగనమున నొక్కఁ డేతెంచె వడిన్. ౬౦౪

క. అంబరపాఠీనమునం బో
లెం బెద్దయు మెఱయుతనదులీలాగతి క
య్యంబరమణి యధికప్రమ
దంబున నభిముఖుండుగా నుదగ్రస్ఫూర్తిన్- ౬౦౫

చ. కదియఁగఁ బాఱు తెంచిన వికాసవిభాసిముఖారవిందుఁడై
యెదురుగఁ జేయి సాఁచె దివసేశుఁ; డతండును లీలఁ గేలు నొ
ప్పిదముగఁ బట్టి రూపము లభిన్నతఁ బొందఁగఁ జొచ్చె బింబముం
సదనముఁ జొచ్చునట్ల విలసద్గతి;— నిం కిట యేమి సెప్పుదున్!

వ. అట్టియెడ— ౬౦౭

చ. 'అరదముమీఁద ముం బొలుచునాతఁడొ! యిప్పటియాతఁడో-దివా
కరుఁ!' డనుసందియంబు భుజగంబులచిత్తములందుఁబుట్టి, యెం
డొరువులతోడ వారు గడు నొయ్యన పల్కఁగ నే వినీతిను
స్థిరమృదుభాషి నై యడిగితిం బ్రభువుం ధరణీసురోత్తమా. ౬౦౮

క. ఇతఁ డెవ్వం డని యమ్మెయి
నతిచకితాత్ముండ నగుచు నడుగుటయు, నహః
పతి నామీఁదఁ గృపాసం
గత మగుతనచూడ్కి వోలయఁగా వత్సలుఁడై. ౬౦౯

సీ. 'సురయక్షగంధర్వ గరుడోరగాదుల
లోన నెవ్వఁడు గాఁ; డలోలుపాత్ముఁ
డుంఛవృత్తిమహీసురోత్తముం డస్థల
నియముండు ఫలమూల నీర మారు
తాహారుఁ డగుముని; యాకాంక్ష సేయఁడు
ప్రాప్తంబు గానిపదార్థములకు;
సర్వభూతహితత్వశాలి; యిమ్మెయి సిద్ధిఁ
బ్రాపించె'నని చెప్పెఁ బ్రకటఫణితి;

తే. ననఘు, యిట్టివిశేషంబు గనుఁగొనంగ
వినను గాంచితి; ననిన నవ్విప్రవరుఁడు
ప్రమద మెదనిండి పొంగారఁ బాఁపఱేని
యాననము సూచి యి ట్లను మానవేంద్ర: ౬౧౦

క. ఇవి యన్నియు నాశ్చర్యము
లవుఁ దెరువును నాకుఁ జూపి తన్వర్థత నొ
ప్పువివిధశబ్దంబుల; భో
ధవరేణ్యా, పోయి వచ్చెదం బ్రియ మొందన్. ౬౧౧

క. నను మఱవక పనుపం దగు
పను లెల్లను బనుపు శిష్యభావశుభము నా,
కనఘా, కలిగెను నీదెస;
ననూనభద్రములు నీకు నయ్యెడు మెపుడున్. ౬౧౨

చ. అన విని, 'నన్నుఁ గాంచితి ప్రయత్నమునన్; వినిపింపు మీవు వ
చ్చినపని నాకు; నీ కొకటి సేసితి సే! యిటు వృక్షమూలవా
సునికి౹యి లేచి పోక తగునా వ్వగునే! భవదీయవాంఛ సె
ప్పిన నది యేను దీర్తు; మఱి పెం పెసఁగం జను భూసురోత్తమా'
వ. అని వెండియు, ౬౧౪

తే. 'అనఘ, నాయందు నీవు, నీయందు నేనుఁ
గలము; నీకు నీసర్వలోకంబుఁ గలదు;
చింత కవకాశమెద్ది? నిశ్చింతభావ
మొందు' మనియె నాదందశూకోత్తముండు. ౬౧౫

వ. అనిన విని భృగుండు పద్మనాభున కి ట్లనియె: ౬౧౬

తే. 'భోగివర, యిది యిట్టిద; భూతములును
నీవు నేనును సర్వగతావిశిష్ట
విధములము; వేదితవ్యంబు విదితమయ్యె
నిట్టిసందర్శనము వ్రత మింక నాకు. ౬౧౭

క. 'ఈవిధమునిశ్చయము నే
భావింపఁగ గంటి నీకృపారతివలనన్.
నీవు కృతార్థుఁడవు; సుజన
సేవిత, యామంత్రణంబు సేసినవాఁడన్. ౬౧౮

వ. అని పనికి యివ్విధంబునఁ గృతనిశ్చయుం డై భృగుండు భుజంగ విభు వీడ్కొని, దీక్షావిశేషకాంక్షుం జేసి, భార్గవకులపవిత్రుం జ్యవనుం గాంచి, నిజవృత్తాంతంబు సెప్పి, తత్కృతసంస్కారంబునం గృతకృత్యుం డయ్యె. ఇప్పుణ్యకథ యబ్భార్గవుండు జనకసదనంబున నారదునకు వివరించె. అద్దేవమునివరుండు దేవతావరునకు వినిపించె. అమ్మహాత్ముండు వసువులకుం జెప్పె. జామదగ్న్యతోడిసంగ్రామంబున నుద్దామచిత్తుండ నై నన్నుం దేర్చుటకై వసువులు సకలభూత సమదర్శిత్వసంపాదకం బైనయీయితిహాసంబు నాకుం జెప్పిరి. నీవు పరమధర్మం బెయ్యది యని యడిగిన నేను నీకుం జెప్పితి. సర్వ సమతాసముపహితం బైనయనాకాంక్షిత్వంబు ధర్మోత్తమంబు నిరతిశయానందంబునకు నిదానంబు. ౬౧౯

క. అని యిట్లు ధర్మసుతునకు
ననిమిషతటినీతనూజుఁ డధికప్రేమం
బునఁ జెప్పుట వైశంపా
యనుఁడును జనమేజయునకు నర్థిం జెప్పెన్. ౬౨౦

వ. చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుతో ని త్తెఱంగునఁ బితామహుండు హితోపదేశంబు సేసిన నమ్మహీశుం డెవ్విధంబు దశావిశేషంబు నొందె, మునీంద్రా, చెప్పవే యనుటయు— ౬౨౧

ఉ. ఆగమపుష్పసౌరభశుభాంగ, నివాసబుధాంతరంగ, వి
ద్యాగృహమేధితాసుభగతామహనీయ, సురార్చనీయ, ని

ర్భోగసభోగసంపదనిరూప్య, సుసంవిదవాప్య, భక్తిల
క్ష్మీగురునిత్యయోగిజనసేవిత, శాంతిసుఖైకభావితా. ౬౨౨

క. అభిమతఫలసంపాదన
విభవమహీయఃప్రసాద, విశ్రుతవేదా,
ఋభువిభువిలోచనాంబుజ
శుభదరవిత్వా, హరిత్వ, సుభగహరత్వా. ౬౨౩

మాలిని. వరబహుమతవేదవ్యాస, విశ్వాత్మభాసా,
నిరుపమతనులీలానిత్య, సత్యాదికృత్యా,
నిరతిశయసమతోన్నిద్ర, కారుణ్యభద్రా,
భరితభువనవర్గా, భాస్వదానందమార్గా. ౬౨౪

గ ద్య ము .

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతంబైన శ్రీమహాభారతంబున
శాంతిపర్వంబునందు సర్వంబును
షష్ఠాశ్వాసము.

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము నం ద లి
శాం తి ప ర్వ ము
సంపూర్ణము.



# పాఠాంతరసూచిక.

## ప్రథమాశ్వాసము.

| పృష్ఠ సంఖ్య | పంక్తి | పాఠాంతరము. |
|---|---|---|
| ౪ | ౪ | ..క్రాఁచితే .. |
| ౧౧ | ౪ | చ్చేతో. తిరోపభరము... |
| ౧౪ | ౧ | తని... |
| | ౩ | గదురుశోకముబరఁగ... |
| ౧౭ | ౪ | మనసు చేద్వడం... |
| ౨౬ | ౨ | విఫలంబుగా శపించె... |
| ౨౯ | ౮-౯ | బెట్టఁ బనుచు పెటిఁగి యచటి... |
| ౩౫ | ౪ | నరుండిటు...డటు... |
| ౩౯ | ౧ | జననముఁజెప్పి...దెల్పి... |
| ౪౯ | ౬ | లండుౕగా కేల మే లండుౕ |
| ౫౦ | ౨ | దరిద్రు...కృతప్రజ్ఞులకుఁ |
| ౫౯ | ౨ | పటుఁడ...నల్పఫలభోగముపై... |
| ౭౧ | ౯ | అనిన నలుకాలిలోనగోవును. నలుకాలి వాసవుఁ డను. |
| ౭౫ | ౩ | వాసనిరతి...వాఁడొకో... |
| [illegible]౫ | ౧ | వెడవెడవస్తువుల్ వీటిఁ బో గాకగాదె శరీరయాత్ర |
| ౮౯ | ౯ | ద్రుంచి...సేకొని... |
| ౧౧ | ౪ | త్యాదర...బుద్ధికిఁ... |
| ౨౭ | ౩-౪ | నిం దొక్కఁ డైన... |
| ౩౨ | ౧ | అమ్మహీపతి...నొల్లక భిక్షావృత్తివెడలఁ... |
| ౩౩ | ౪ | యిట్లు దీనవృత్తి నేఁగఁ... |
| ౩౫ | ౧ | అధిప, మీతల్లిదండ్రుల... |
| ౩౮ | ౧ | శ్రుతి...వినిపించున్... |
| ౩౯ | ౪ | పలుకు...పదము నగుట... |
| ౧౪౧ | ౩ | మేదిని...కర్మదు యూఁది. |
| ౧౪౬ | ౨ | వాక్యంబు. |
| ౧౪౯ | ౩ | ధర్మముగా...విదితం బగు ...ద్వివిధం... |
| ౧౫౨ | ౪ | కమ్మెయి రాజకర్మ... |
| ౧౬౩ | ౩ | తెఱంగున...కిల్బిషం... |
| ౧౬౫ | ౧ | నిశ్చయించి సమంచితదండ |
| ౧౭౨ | ౩ | డనముసఁ గాని ముండన మొదం... |
| ౧౭౪ | ౩ | మతిథి...చిక్కు ... |
| ౧౭౭ | ౨ | కలిత...గలుగ నడచు.... |
| ౧౭౮ | ౩ | మము ..దుర్వి యోమికొని |
| ౧౮౧ | ౪ | గ్రీవుం ..గ్రీడల్ నృపశ్రేణికిన్ |
| ౧౮౫ | ౪ | తంబు హేతు ..దాను జేయు .. దగులఁ జేయు |
| ౧౯౬ | ౩ | నరపతుల...మాగఁడు. ... |
| ౨౦౧ | ౧ | కడిఁది...నొట్టినమంట ... |
| ౨౦౨ | ౧ | అడజడి... |
| | ౩ | పుడమి...వోయిన... |
| ౨౦౩ | ౧ | ప్రాయోపవేశంబునఁ గాయం |
| ౨౦౫ | ౧ | ఇట్లనంగ...నడకనీ... |
| ౨౦౭ | ౧ | మిత్రులచేఁతలఁ... |
| ౨౦౯ | ౪ | చోదితప్రవర్తి జూడవుగాక . |
| ౨౧౬ | ౩ | షిద్ధములు గానఁ దగ నని... |
| ౨౨౦ | ౧ | తనయొడ...మను మనుజు నకు... |
| ౨౨౧ | ౩ | ద్భావము...సుఖిత్వముఁ.. |
| ౨౨౫ | ౨ | గరకేలిఁ...బైనతెం పొప్ప |
| | ౪ | నరయన్...నిత్యాయుర్ధనుల్ |
| ౨౩౩ | ౪ | ర్భినమర్త్య లోకపాలన... |

౨౩౪ ౯ గేనుఁగునకు గుఱ్ఱములు ...
౨౩౫ ౫-౬ బహువిధా...విన్నాణములు
౨౩౭ ౮ కొనియధ్వ... పెక్కు లా
సర్చి...
౨౪౨ ౧ శరభసింహవ్యాఘ్రస_త్వ...
...సింహాద్యుగ్ర...
౨ నేడిక లట్టుల...
౨౫౯ ౧ నతఁడు...లయినంతకం టెను
౨౭౦ ౪ ధుర ముడుగుట...తోఁ జన
నగునే!
౩౦౮ ౩ గను మారి...
౩౧౩ ౨ మాలు నెలల నాలు...
౩౧౮ ౩ స్థితియు నిశాసీనత్వము...
౩౨౨ ౮-౭ నూరన్వయంబును బహి...
౩౪౬ ౩ సూరిజనములు బెరయంగ....
౩౫౧ ౨-౩ సీగిరులన్

౩౬౧ ౩ బొలియఁజేసి తెట్టి ...
౩౬౯ ౫-౬ భూదేవతల కరిష్టంబు ...
౩౮౪ ౬-౮ ...పార్శ్వమున సహాసుఖా
సీనఁ ...
౩౮౬ ౧ కలిగ ...నిట్టిలపుగుణం...
౩౮౮ ౩-౪ పేతత్వముఁ ...నీభూతికి....
౩౮౭ ౧ అని · సుఖంబు లుండు
నట్లుగా
గరణీయంబు ...'వీరలు వీర
లని వారివారి మీఁదన వార
ల మీఁదన-పెట్టి యుండక
యుయుత్సునిం గనుంగొని
నీవును నిర్వహింపు మని పని
చి'- అనికొన్ని ప్రతులు.
౩౭౭ ౪ మావర....మరగించుటలక్.
౩౯౬ ౪ సర్వసంపత్పూర్తి .... చారు
వామాక్షి సంతుల పరిశోభిత....

---

## ద్వితీయాశ్వాసము.

---

౭ ౧౦ లేక....యేకతంబు....
౧౨ ౬ మూఁడు....వాఁడి దతిగ ..
౧౪ ౧ శరతల్పగుఁ డగునతఁడే ....
౩౯ ౨ మాన్యనతత్పరు....
౫౦ ౨-౩ తన్నల....ఐశ్వప్రకార
శరణు....
౧౧౬ ౪ దపునరా....కభిముఖముగ ..
౧౨౪ ౩ దునుబరఁగి దివ్యరూపం...
౧౩౨ ౧ రథగమనరయంబునం....
౧౪౨ ౨ తోడి....శక్తులు....యుక్తులు
౧౬౦ ౪ స్ఫురణం....శోభనచరితా .

౧౬౭ ౧ దాంతియుఁ బ్రియవాదిత్వము
౧౯౨ ౧ అనధీతాధ్యయనం డగు....
౧౯౫ ౨ బలువురు వేవఁ........
బలువురు వేచి....
౧౯౮ ౭ కానివిశేషంబు....
౨౦౫ ౧-౫ బరణియం బైదానియం దా
సక్తిం డయ్యె. అయ్యాత్మా
సక్తిం జేసి రాగ...
౨౨౬ ౨ దా మచ్చికఁ....
౨౩౨ ౪ జానప్రిష్ఠ....నిష్ఠాత్మకా....

౨౩౩ ౪ మెచ్చుక్ నుఱిక్కను
లేక యుండు····
౨౮౨ ౩ మెత్తఁజేసి చెఱచి ···
౨౯౬ ౪ దరి నార్యంగఁ గొనం దనం
బరఁగు రా····
౩౦౭ ౧ రక్షఃపిశాచజృంభక
౩౨౩ ౩ హ్మాత్మతర్పంబుల ···
బల్వేధ గల్పించి ···
౩౩౦ ౫ బ్రాహ్మణ్యంబుబట్టువడి ···
··· వల్లపడి ···
౮ తాత్పర్యం····సేవావృత్తి
నడచిన శూద్రి ··
౩౩౫ ౩-౪ రయ్యా ···ఒక్కోధ కామత్వ
యుక్త····మొప్పెఁగాక .
౩౫౩ ౩ త్రిస్వర...రూపున కగ్గల
మైన ··
౩౬౦ ౨ చాపంబులు····వెగవుం····
౬౬౯ ౬ దలఁచుచు నలయక····
౩౯౪ ౨ నరి యేఁకోఁటం బ్రివృద్ధ
౩౯౭ ౨ విభుఁ ·· వెడగొను····
౪ బుభయ ···బొఁదు····
౪౪౩ ౮ యు·· ·నాతపత్రఫేనయు,
౪౪౫ ౪ దుగముపంచల ···
౪౪౮ ౪ సమానరాహిత్యశస్యసర్వ
సమస్యా.

## తృతీయాశ్వాసము.

౧ ౩-౪ రాధకభరణ నరాధివ్యాధి
హరణ ···
౫ ౪ బడిన····జాల ·· యలసి ···
పొలసి····
౨౧ ౩ దిరముగఁ జేరఁగా····
౨౨ ౩ సీమ····రూ పిడక····
రూపడక····
౪ జేమెయి నైన వంధ్య దగు ···
మాత్మగల్గినక్
౨౮ ౧ కాని ···నెటి నగు····
౩౨ ౧-౨ సారపుసిరి చెడునరుడుం
గోరిన నే వచ్చు····
౩౬ ౩ నన్యరాజులభూమి నర్థించి
౪౦ ౪ బోర్లు వెడలిన····
౪౧ ౪ దక్కక····
౪౨ ౧ అనుట····బహుముఖంబులు····
౪౭ ౩ దిట్టాటపడి ···
౪౯ ౪ రెండు నిండుఁ ···
౬౭ ౨ గినలు గదిరి ··
౬౯ ౧ ఇట్టియకృత్యంబులుగల ··
౮౩ ౨ దలన ···నుండు నొలసి ···
౪ వంగికొని ···
౮౫ ౩ ప్రింగం····మెడమరల్చి····
౮౮ ౪ సగొనుఁ బురాస్థితిన····
౮౯ ౧ అనియె నా పలివె-పలిద····
చెట్ల····
౧౦౩ ౨ గ్గలికయు నొప్పభక్తి····
౩-౪ బిలువడి ·· వేయురాజులు····
····నాజులు····
౧౦౮ ౧ అనిన····దండంబు సర్వసాధ
నంబు····
౧౨౦ ౪ పదగలస్వాగతముతోడ ···

౧౭౨ ౫ వినుఁ డెట్టిసత్వజాతిని
బెట్కటి …
౧౭౩ ౪ బ్రీతిం….యాతినివచనంబున
౧౯౩ ౪ గర మూహించికొని. ..కాల
జ్ఞుఁ డనున్.
౧౯౮ ౨ దొలఁచునెడం ..
౧౯౭ ౪ పట్టుగదల జనితపికల …
౨౧౩ ౨ డునఁ బొరయంగ నిత్తునె …
౩ నినపది … · నియ్యోపెన్ ….
౨౨౪ ౪ ట్లునికి · కుక్తుఁడ …
౨౩౩ ౧ ఒలితఫ్రటురిఁ బడిపేరాఁ…
౨౬౭ ౪ లుక … కలయఁబలుకఁగా….
౨౬౯ ౧ జ్ఞాతుల నెమ్మి ..
౨౮౪ ౪ వల్లభు… తప్పవెట్టి ·
౨౭౪ ౧ పసగపు .. ……. గుక్క
పు ట్టెలున్
౩౦౮ ౯ పెల్లువట్టోడిఁ బడియంత
నుల్లిమిఱుత
౩౧౫ ౪ జేయది· ….. మెఱఁగింపు
తగన్
౩౩౨ ౬ తోటల …… సర్థితోడ ..
౩౮౬ ౨ ఱోక….యుక్తివహమైన ·
.. నిజమైన
౩౮౮ ౧ అనవుడు నెకవెక్కి……..
……..వెకివెక్కి……..

౩౭౩ ౧౨ బడమహీజము లెల్లనీ ..
౩౯౯ ౮ ప్రబయి……సర్థించు …
౪౩౭ ౨ నను… బెండ్లినాఁడును….
౪౪౧ ౬ వలయు తత్ప్రభవ ప్రకాశం
బులు …
౪౪౨ ౧౦ సేయ సయత్నిఁ….
౪౪౫ ౧ ఇది .. ……. లోకంబుల
౪౪౯ ౧౨ వెఁడియు.. తీక్ష్ణవర్మంబు
౪౬౮ ౧ పరునాఁడుచితకృత్యం
బులు దీర్చి సురదీసందను
పాలికిం బోయి కొలిచి ..
౪౮౨ ౧ విను …. లెల్లఁదొఱఁగి
౨ ని నోకతఁ గల్పి.
……నాలిఁ ..
౪౭౬ ౩ యోజనము…దాని కుస్న
తెరువు
౪౯౩ ౧ అని.. నావారసంభా
రంబులు…
౪౯౭ ౪ డెందము… వెస నూచెన్.
౪౯౯ ౧ ఊఁచి బొదువు…మే
నురిని…
౫౧౬ ౮ గుశపు…గురిపాల్బరయన్
……గుచివాల్బర…
౫౨౯ ౩ జయ విజయ….ఘనసంపదు..
౫౩౦ ౨ కరణీయచరిత్ర…

## చతుర్థాశ్వాసము.

౧౧ ౨ విను…యన్యావేకఁబున…
౧౮ ౨ పట్టఁ జదువు గలదె…
పట్టి చదువఁ గలదె…
౧౯ ౧-౨ నిరాను… నిరాశత …
౨౩ ౫ మివిరెడు నిట్టవిీనవు…
…నింట…

౧౭ వాని మృత్యు దేవఁ దసి …
౧౨ గాన… నేమఱఁ….
౨౭ ౩-౪ బసఘూ,…యమం బను …
.. .. 'వయఁ …
౪౮ ౪ చెడుట……దుర్యోధున దేల.

| | | |
|---|---|---|
| ౫౦ | ౨ | గావి౹చెదఁబో విసాళకత నుడుపంగా.. |
| ౫౬ | ౧ | వఱుతిఁ.... |
| ౬౩ | ౩ | భంగిఁ....నిర్బాధవ.... |
| ౬౭ | ౧ | అనిన ...బంధుమమత్వ... |
| ౬౮ | ౩ | ప్రజ్ఞయ కైవల్యదమును... |
| ౬౯ | ౫ | స్వగాల ...ప్రజ్ఞాసంపాదకం.. |
| ౯౩ | ౪ | గోత్ర....సర్వవర్త్మకు౹.... |
| ౯౪ | ౨ | దిగుః ...గత్యతీతం. |
| ౯౮ | ౪ | చితి....ధర్మశీలత |
| ౧౦౫ | ౨-౩ | చినపురు ...చిత్తుఁడుగా కాదిన వైరాగ్యము ... ......................గా కాదిన వైకార్యము... |
| | ౪ | నమపమ.........నమెమ్మయి సెప్పెన్. |
| ౧౧౩ | ౩ | మాల్యతూర్య త్రయారామ.. |
| ౧౧౫ | ౪ | కనఘా ... |
| ౧౧౭ | ౧ | సజ్జను లఁద ఆాచార.... |
| ౧౨౩ | ౨ | లనుభ....లగుట నది.... |
| | ౪ | తుమ్మని ...లేమి మోసము.... |
| ౧౩౫ | ౪ | తనువుఁ జింతయు.... |
| ౧౪౬ | ౪ | దావినఁ....కర్మతత్త్వజ్ఞు.... |
| ౧౫౯ | ౧ | ఇట్లుసాఁచిన నాభూమినురో త్తముండు ననేకవర్ష ం.... |
| ౧౬౦ | ౩ | నాచరింపఁ దగునెయ్యైనను.. |
| ౧౭౨ | ౪ | పమత సౌఖ్యదుఃఖచయముఁ దోచి. |
| ౧౯౧ | ౪ | గణనా....గనఁ దానతేనన్. |
| ౧౯౮ | ౪ | వాదములకుఁ దేరుగడ.... |
| ౨౦౭ | ౪ | యనువు నిలవరించు.... |
| ౨౦౯ | ౧ | పరమ.........బ్రస్తరించి ... |
| ౨౩౬ | ౨ | నడపుచు....బోధాగ్ని వడిం |
| ౨౩౮ | ౨ | ప్రకరముఁ....ప్రాశయ భాసిత ... |
| ౩౦౦ | ౩ | దరులయొడ దీనికేమటి ... |
| ౩౦౩ | ౩ | నముసశక్తి ... ... |
| ౩౨౬ | ౪ | మాపు .. పరమసూత్రిత .. |
| ౩౨౭ | ౩ | జాలు విజ్ఞాని నిర్మల.... |
| ౩౪౪ | ౧ | ఎలసి . |
| ౩౪౫ | ౨ | దయమునఁ ...ద్రిప్పఁ దత్త దనేక.... |
| | ౩ | వ్యయ ..జరాదిస్వ్యథలన్ ..... ... జంభివ్యాధిన్ |
| ౩౭౪ | ౧ | శత్రుజనులఁ జెఱుచు . |
| | ౨ | మిత్రులఁ బ్రదికించు.... |
| | ౩ | త్వాత్రతత సంపథయనఁ విః |
| | ౪ | ధాత్రిజ్ఞం గలఁగుఁ జూవె తటఁ బురుషునకున్. |
| ౩౭౯ | ౧ | వివు విధికృతంబు లారక ... |
| ౩౮౭ | ౩ | మాటు . |
| ౩౮౯ | ౧ | ఏనుఁగులు సుట్టురాఁ ... |
| ౩౯౨ | ౧ | మున్ను .మోమోటలేక ... |
| ౩౯౯ | ౪ | దఃది. త్రుళ్ళుట డిగువిా. |
| ౪౦౭ | ౨ | వియుతుండై ... |
| ౪౧౨ | ౨ | రామి యొకటియె తన శరీ రంబు ... |
| | ౩ | దాపమునఁ గుంతు.... |
| ౪౨౯ | ౪ | దెలిసి మనువు మనికి ... కా నెప్పుడున్ |
| ౪౩౬ | ౪ | బొందు ...శంకింపఁ.... |
| ౪౪౨ | ౪ | సంగవర్తులు.... |

## పంచమాశ్వాసము.

| | | |
|---|---|---|
| ౨౩ | ౪ | పనికి ··· భవ్యవిధము. |
| ౩౨ | ౫ | జ్ఞానంబు ·· |
| ౪౩ | ౪ | సుగతి దుర్గతి హేతువు |
| ౪౮ | ౪ | దమలో నవిపర్యకాల · |
| ౫౨ | ౪ | దగాముసు ·· ప్రధానగుణం బుల్. |
| ౬౧ | ౪ | వెగ వగునది... |
| ౬౭ | ౪ | నంబ...గొంద అంబుజాక్షు |
| ౮౦ | ౧ | ......గ్రిచ్చువడక... |
| | ౩ | వచ్చెఁ గానఁ......బ్రసిద్ధి. |
| ౯౨ | ౨ | హృత్కూబరంబును, శ్రవణ- దర్శనవాహంబును...... ధర్మప్రతోదంబును. |
| ౧౦౭ | ౨ | త్మనియత్నం బొప్ప... |
| ౧౦౮ | ౨ | బుల.....బుద్ధిదెసను |
| ౧౨౦ | ౨ | దనయం...జేయఁ దాను... ......జేయుఁ దాన... |
| | ౪ | గని గతభూమా... |
| ౧౨౭ | ౪ | ధర్మ మాత్మ... |
| ౧౭౪ | ౨ | జనియింపఁగఁ......సత్త్వ గుణము సం. |
| ౧౮౧ | ౪ | భంగిఁ...యుండుపదము... ............పరము... |
| ౧౯౮ | ౪ | వరుఁ డగు శాండిలుఁడు... |
| ౨౦౦ | ౯ | వారికఅపుడఁ... |
| ౨౦౬ | ౪ | ననుమతి ··· |
| ౨౧౮ | ౩ | చవుఁ ···చాడ్పునిరూపించి |
| ౨౧౯ | ౨ | ధర్మస్వరూప నిరూపణంబు |
| ౨౨౪ | ౪ | యాతెఁ డిట్లాడ · |
| ౨౩౬ | ౩ | గణ్య, యపవుపం···· |
| ౨౫౬ | ౪ | ర్పనయంగా · యెడ నను నాతఁడున్. |
| ౨౬౮ | ౧ | ధాత్రిక ··· ధాత్రిగ···· |
| ౨౮౩ | ౧ | చిరకారి యెప్పుడుం···· |
| ౨౮౭ | ౫ | మూర్ధ్ని ఘ్రాణంబు···· |
| ౨౯౪ | ౬ | గాకున్న నాధులు(-ఆధులు= మనోవ్యథలు)···· |
| | ౧౨ | దండములు··· దల యెఱింగి. |
| ౩౧౪ | ౪ | బులు··· యఘంబు వఱుతఁ |
| ౩౫౮ | ౪ | యక్కటా··········· నూఁదమే లగున్. |
| ౩౬౦ | ౧ | నాసుకృతము···· |
| | ౩ | ద్భాసి ···నిష్ట ··· |
| ౩౬౫ | ౯-౧౦ | హృద్గ····విడిచి యనఘ···· |
| ౩౬౮ | ౪ | వనరాశి ····చెప్పవలసెం···· |
| ౩౭౧ | ౪ | వలసె నీనేర్పునెఱిఁ గురు వంశవర్య. |
| ౩౭౮ | ౪ | నీకు ···నిష్ఠత గలుగున్. |
| ౩౮౧ | ౪ | మనఘ, యోర్చునె ··· |
| ౩౯౪ | ౧ | హాసీతుఁ డనియె నిరాలంబ మతి···· ·· నిరారంభ···· |
| ౩౯౫ | ౧ | రాజ····తో డమున. గ్రిందు కొన్న···· |
| ౪౨౭ | ౩ | హారిని హారుం ··· హారుని హారిం···· |
| ౪౩౦ | ౨ | బారసితి····వేఁడుకొని ··· |
| | ౩ | సురపతి నంటి···· |
| ౪౩౩ | ౨ | పుట్టుకూకులై ··· |
| ౪౫౭ | ౩ | ట్లను సంగపాళ ··· |
| ౪౬౧ | ౯ | వారి నప్పు డరయవచ్చునే. |
| ౪౭౦ | ౪ | దూరముగఁ ··· తుప్పలు···· దూలి నిలిచె ····తుప్పలఁదూఱియుండె. |

౪౮౧ ౧ దురితంబునఁ ....సహిత . .
..... .దొడఁగు మహిత ...
౪౮౮ ౧ సుజన గృత్యంబు సుజనుఁ.
౪౯౩ ౧ నృపవరుల వైశ్యధర్మము.
౫౦౩ ౩ నిస్సంశయంబుగా... నెఱిఁగి
౫౦౯ ౪ గావించు . .లన్నింటన్.
.... .........లెన్నిఁటన్.
౫౩౫ ౧ వేఁగు పెల్లైన ..
౫౩౬ ౪ విడుప యుఁటను భవము
పొందు....
౫౬౨ ౪ మెవ్వఁడు: పెట్టుకెంతయు
మెలఁగున్.
౫౬౪ ౪ బ్రాహ్మఁడు కలహంబులోడఁ
బడక. ..
౬౦౦ ౬ దృష్టంబులకుదానిఁ (దాను)
దెలియుఁ నరయు (దెలియ
నవియు)
౧౦ వలదె మేలుఁగ. ..
౬౦౯ ౨ గతిఁగొనవేవురకు నొకఁడు
గలఁగు .
౬౧౩ ౫ దృష్టాంతరంగంబను ..
౬౨౧ ౨ బరమా భంగి నియతిఁ ద.
౬౨౮ ౩ నిట్టి ...నెవ్వరి కలవు .
౬౩౨ ౩ యపరిమిత .. యప్రిమాణా
వ్యతీతి.(యప్రమాణాధ్యరీతి)
౪ యుపనిష. . యోగిభావ్యైక
రమ్య.

## షష్ఠాశ్వాసము.

౧ ౨ క్షా శక్తివినోద....
౪ భ్యాస నిరతినిర్విభేద ...
౨౯ ౧ గ్రంథంబుఁ బఠియింతుగాని
౩౭ ౩ బలపడదు రెండు ...
౯౩ ౪ దారా, 'బుద్ధి యధిదైవతం'
బని మూలము.
౯౮ ౪ మాద మాంద్య....
౧౦౨ ౨ చనవులఁ ...
౧౧౧ ౪ గను . .కా నేమందున్.
౧౧౬ ౧ అది శుద్ధత్వ. ..
౧౨౮ ౩ మంగ.. .మదరఁ బడుట....
౧౪౦ ౧ తోఁచిన . .భక్తికప్రతిపత్తి
౧౩ భూతభవ్యభయంకరం
౧౫౩ ౪ వేతుణము....
౧౫౭ ౪ బునఁ బఢయుఁడు కప్పురంబు ...
౧౬౬ ౪ ర్మనిరూ .. మలుఁగవు
౧౬౮ ౪ బున నగుచిత్తమున నుండెమది
౧౭౯ ౩ ట్లుగఁ గోరఁ దగదు గావున
వగవను మోతుదముగాఁగ
వలదేఁ గోరన్?
౧౯౮ ౩ ద్రోవఁగఁ బాడి బంధు
లోక దుర్గతి ...
దా శేవిధి. .
౨౨౭ ౩-౪ .... . పు
ర్వ్యన కెన గాను . . ..
౨౩౯ ౩ దపము గృహమున నేనిఁ
దత్పరతనాచ
౨౪౩ ౪ డనఁ ..... మారయు
నాగ్రహమేల
౨౬౦ ౨ కారము మమకారరహిత
కర్తవ్యముగా_

౨౭౦ ౨ హిత ··· శేవయామముల్—
౨౭౨ ౨ ర్యంబు వేదాధ్యయనంబు..
౩౦౫ ౩ సుతుఁడును నీవును నైనను
౪ వ్రత మది సెల్లించు ··
౩౧౩ ౪ తుపదము సొప్పడఁ దదాత్మ
సౌఖ్యం బొందున్.
౩౧౪ ౨ భూతాస్వ ··ముల గెడ···
౩౨౧ ౨ ట్లను ··యరోగచింతతం ··
౩౩౨ ౨ సంతకు సాత్యవతేయుండు..
౩౩౪ ౧ పిలిచిన · నిజప్రచారం ··
౪౧౯ ౪ వచ్చి యిచ్ఛ్రహీఁ··· ·
౪౨౭ ౪ చిత్ర · · ప్రసిద్ధాగతులన్
౪౩౨ ౩ పీతలోకంబులచేత ···
౪౩౮ ౨ మున··· ···బుధనుత,
కపియం—
౪౪౧ ౭····దాని ఖండీభూతంబు····
౪౪౪ ౯ నాశనము ··
౪౫౦ ౪ పదము నురుమనోజ్ఞ····
౪౫౧ ౪ యనుపాధిత (యనుప సిత)
౪౬౬ ౨–౩ చేతస్కు· ···· హాని
వ్రాతులఁ ··
౪౬౯ ౧ దైవతముఁ బిత్ర్యమను ద..
౪౮౦ ౧–౨ విను మధువును
నసం జేర్చిన····
౫౧౪ ౩ డేపురు···· ···బడసె నీడ్య
తమోన్నతి నొప్పులోక.
౫౪౫ ౩ తు రెదియ · ··ఫలదోహల
కార్య.
౫౫౫ ౪ లంబు తలమున నాగాహ్వ
యం బొకండు.
౫౭౩ ౧ పరుస దిరిగిన ···
౫౭౪ ౧ వచ్చిన సంభ్రమంబు గరు
వంపు వెలర్ప నుల్లసిల్లమే
(నుల్లసిల్లునై) ···
౫౯౮ ౩ మఖిలంబు జనియించునది...
౮ రంత····నొక్క—యద్భుతంబు

---

# శుద్ధిపత్రిక.

| పుట | పంక్తి | ప్రమాదము | సవరణ |
|---|---|---|---|
| ౬౭ | ౧ | గృచ్ఛముల్ | గృచ్ఛ్రిముల్ |
| ౭౩ | ౧౦ | విహితానుపాన | విహితానుష్ఠాన |
| ౮౩ | ౪ | వివిధమత్రంబుల | ...మంత్రంబుల |
| | ౧౪-౧౫ | పృథాగు | పృథాను |
| ౮౪ | ౧౧ | ప్రీతులఁ జేత | ప్రీతులఁ జేఁత |
| ౮౬ | ౨౬ | కలిసికొని | కలిపికొని |
| ౮౭ | ౧౫ | య్యవయ | యవ్యయ |
| ౯౨ | ౪ | హీతనిగృ | నిగృహీత |
| ౧౦౪ | ౪ | నుత్కృష్టం | నుత్కృష్టం |
| | ౭ | దీర్ఘయాత్రాపరుడయి | ...పరుం డయి |
| | ౧౨ | దలపు లేమి | దలంపు లేమి |
| | ౧౫ | మీ రిట్లాటన | మీ ర ట్లాన |
| ౧౦౨ | ౨౬ | తపోవనంబున | తపోవనంబున |
| ౧౧౨ | ౧౮ | విస్తరింపం | నిస్తరింపం |
| ౧౨౬ | ౨౪ | స్వామ్యమాత్ప | స్వామ్యమాత్య |
| ౧౪౩ | ౬ | నధిపతి | నరపతి |
| ౧౪౯ | ౨౧ | సవళులలో | నవళులలో |
| ౧౭౦ | ౫ | వ్యూహంబుల్ | వ్యూహంబుల్ |
| ౧౭౩ | ౧ | స్థలంబునుం | స్థలంబులుం |
| ౧౭౫ | ౨౦ | ............... | గుత్తముల నేల |
| ౧౭౬ | ౧౭ | పట్టినట్టి | బుట్టినట్టి |
| | ౧౮ | లను | వలను |
| ౧౮౦ | ౧౭ | నిత్నిబడు | నెటిబడు |
| | | మా | మా |
| ౧౯౩ | ౨౨-౨౩ | తుళ్లిలకు... | త్రిలకు,...... |
| ౨౦౧ | ౧౯ | డరిగెఁ | డడిగెఁ |
| ౨౦౭ | ౧౩-౧౪ | నిద్ధురు లగు | నద్ధురో లగు |
| ౨౦౯ | ౧౩ | సాధులకు | సాధులకు |
| ౨౧౮ | ౧౫ | నగరం | నగరం |
| ౨౧౯ | ౫ | నమ్మికకు | నమ్మికకు |

| | | | |
|---|---|---|---|
| | ౧౬ | నన్నున్ ?' | నన్నున్.' |
| ౨౨౧ | ౨౦ | లకుహిత లగు | ...హితు లగు |
| ౨౨౪ | ౫ | అట్టిసమయంబు ష | అట్టి...ంబున |
| ౨౨౫ | ౬ | నిన్ను బొలెగొనిరెంద | ...ఁబొరిగొని... |
| ౨౨౬ | ౨౫ | ప్రతి...నీచనరుని | ...నరుని... |
| ౨౨౭ | ౩ | వేట్లోగ 'వడి | 'వేగ వట్లోడి... |
| ౨౨౯ | ౨౧ | పుల్లల | పుల్లతల |
| ౨౩౨ | ౧౫ | సూనిన | నూనిన |
| ౨౩౬ | ౨ | దురిత...తావమున్గ | ...తాపమునఁ |
| ౨౬౭ | ౨౨ | సత్సమయబున | సత్స...ంబున |
| ౭౬ | ౨౮ | నత్వము | నరత్వము |
| ౯౫ | ౨౫ | గేలిఁ (తద్భవము) | గేలిఁ (రూపాంతరము) |
| ౧౨౩ | ౨౨ | కోశము; ౫(ఖజానా) | కోశము; (ఖజానా). ౫ |
| ౧౨౭ | ౨౬ | అరుణాలంశుఁడు | అరుణాంశుఁడు |
| ౧౯౦ | ౨౬ | నిలుపుకొనుట | నిలుచుట |
| ౨౦౯ | ౨౮ | వైరులకు | పైరులకు |
| ౨౭౭ | ౨౭ | మాద్దును | హద్దును |

గమనింపుడు:—

ఆ ౧-౧౦౨ పద్యమున “వైదికధర్మచారి, జనవత్సల, నీ మది...” అనుచో వేదవిహితమగు ధర్మపథమునఁ జరించునట్టి మదిని (మనస్సున్) అనియు, మధ్యనున్న ‘జనవత్సల’ అనుట సంబుద్ధిగను గ్రహించుటయు నొక పాఠము అని యెఱుంగునది.

[ఇంకను అట నట ప్రమాదము లుండవచ్చును. సవరించుకొని చదివికొనుటయ కాక పరిష్కర్తకు ఏలూరునకుఁ దెలుపఁ బ్రార్థన.]

---